## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) రామకృష్ణ మఠ్ వెబ్ సైట్: http://www.rkmath.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

రామకృష్ణ మఠ్ వారి వెబ్ సైట్

http://www.rkmath.org

Archives

www.rkmath.org/prabhaarchives

Home | Universal Temple | Activities | Languages | Human Excellence | Health | Publications | Downloads

Magazine | Telugu Books, CDs & Posters | Online Shopping

About | Archives | Subscription

What's New | Our Location

Would you try to wash dirt with dirt? Will sin cure sin, weakness cure weakness? Strength, O man, strength, say the Upanishads, stand up and be strong.

- Swami Vivekananda

Donate | Serve with us | Contact Us

**Universal Temple**

- Temple
- Arathi
- Bhajans
- Festivals
- Rama Nama
- Worship

**Activities**

- Weekly discourses
- Relief
- Library
- Retreats
- Anna Danam
- Balanarayana Seva
- Vidya Danam
- Jnana Danam
- Satsangas
- Diksha

Ramakrishna Prabha Magazine Archives

Submit

2012

2011

Click to read

Click to read

Click to read

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# తెలుగు, తమిళ పాఠకులకు
# అరుదైన అవకాశం

## ఈ క్రింది పుస్తకాల ధరలో 25 శాతం తగ్గింపు

పుస్తకాల ఖరీదు పంపి లాభం పొందండి.

తపాలా ఖర్చులు అదనం.

## తెలుగు

## శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి

(10 సంపుటాలు)

ప్రతి సంపుటంలోను పుటలు 500 ల కెక్కువే. ఆంగ్లభాషలోనున్న సంపూర్ణగ్రంథావళి కిది తేటతెనుగున అనువాదం.

| | | | | |
|---|---|---|---|---|
| అసలు ఖరీదు | సాదాఅట్టబైండింగు | ర్ూ. 51-50 | కాలికో | ర్ూ. 65-00 |
| 25 శాతం తగ్గింపు ధర | ,, | ర్ూ. 38-63 | ,, | ర్ూ. 48-75 |

## తమిళం

## 1. స్వామి వివేకానన్దరిన్ జ్ఞానదీపమ్

(10 సంపుటాలు)

ప్రతి సంపుటంలోను పుటలు 500 ల కెక్కువే. ఆంగ్లభాషలోనున్న సంపూర్ణగ్రంథావళి కిది సరళ తమిళములోనికి అనువాదం.

| | | | | |
|---|---|---|---|---|
| అసలు ఖరీదు | సాదాఅట్టబైండింగు | ర్ూ. 50-00 | కాలికో | ర్ూ. 65-00 |
| 25 శాతం తగ్గింపు ధర | | ర్ూ. 37-50 | | ర్ూ. 48-75 |

## 2. స్వామి వివేకానందర్

రచయిత : రా. గణపతి

(పుటలు 895)

స్వామిజి జీవితచరిత్రం ఇందు విపులంగా పొందుపఱుపబడి ఉన్నది.

| | | |
|---|---|---|
| అసలు ఖరీదు | కాలికో | ర్ూ. 9-00 |
| 25 శాతం తగ్గింపు ధర | ,, | ర్ూ. 6-75 |

పుస్తక విక్రేతలకు $33\frac{1}{3}$ శాతము కమీషను ఈయబడును.

---

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 4

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౭ ౧౯౭౧ - జనవరి : సాధారణ - పుష్యము సంచిక ౭

## విషయసూచిక

# మా 'దివ్య వాణి గ్రంథమాల

నేడే కొనండి పదే పదే చదవండి !!

దివ్యావతారమూర్తుల విశ్వోపజీవ్యములైన అమృత మధుర సూక్తులు సర్వ సుగ్రహమైన హృదయ సన్నిహితమైన తేట తెనుగున వీనిలో అందజేయబడ్డాయి. ఇందులో ఒక్కొక్కటి నిరుత్సాహులకు ఉత్సాహప్రదం, అశాంతిసంక్షుభితులకు శాంతిదాయకం, సంశయాందోళితులకు సంశయాపనోదకం, జిజ్ఞాసువులకు పరమార్థజ్ఞాన సమర్పకం, అందఱికీ శిక్షకం, సంస్కారకం నిర్వృత్యాపాదకం. మువ్వన్నెల మేలి జాకెట్టుతో పాకెట్టుసైజులో చక్కని తయారింపు—

| | | | |
|---|---|---|---|
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 0-40 | శ్రీ కృష్ణవాణి | 0-40 |
| శ్రీ శారదాసూక్తి నవనీతము | 0-40 | బుద్ధ ఉవాచ | 0-40 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0-40 | క్రైస్తు సూక్తిమాల | 0-40 |

మహమ్మదు సూక్తిమంజరి 0-40

# దేవీ మాహాత్మ్యము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

మార్కండేయ పురాణాంతర్గతమగు దేవీమాహాత్మ్యము భక్తులెల్లరు అవశ్యము పఠింపదగిన దివ్యగ్రంథము. పాఠకుల సౌకర్యార్థము శ్లోకములు పెద్దఅక్షరములతో ముద్రింపబడియున్నవి. ప్రతి శ్లోకమునకు తేటతెల్లమగు తాత్పర్యము గలదు.

పారాయణము చేయగోరు భక్తుల యుపయోగార్థము గ్రంథాదియందు చండికా ధ్యానము, అర్గలాస్తోత్రము, కీలకస్తోత్రము, దేవీకవచమును, గ్రంథాంతమున అపరాధ క్షమాపణస్తోత్రమును, దేవీసూక్తమును పొందుపఱచియున్నాము.

ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పారాయణముచేయు భక్తులకు శ్రీదేవీకృపాకటాక్ష వీక్షణప్రసారము తప్పక కలుగును.

170+24 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హక్లిన్) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.' (సన్డే స్టాన్డర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి: 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

590+158 పుటలు వెల: రూ. 7-50

# ప్రబోధరత్నాకరము

అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు

శ్రీ వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

232 పుటలు మూడవ కూర్పు వెల: 2-50

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4




'అఖిలవిభు శరణొందుము, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౭ } ౧౯౭౧ – జనవరి : : సాధారణ – పుష్యము { సంచిక ౭


శ్రీః

## వివేకచూడామణి


మూలము : వ్యాఖ్యాత :

శ్రీ శంకర భగవత్పాదులు అన్నమాచార్య


విషమవిషయమార్గై ర్గచ్ఛతో ఽనచ్ఛబుద్ధేః
ప్రతిపదమభిఘాతో మృత్యుర ప్యేష సిద్ధః
హితసుజనగురూక్త్యా గచ్ఛత స్స్వస్యయుక్త్యా
ప్రభవతి ఫలసిద్ధి స్సత్య మి త్యేవ విద్ధి. 81

మలినబుద్ధియై విషమవిషయమార్గములందు జనువానికి అడుగడుగునను కీడు గలుగును, చివరకు చావు మూడును. హితుడును సుజనుడునగు గురుని మాటను స్వకీయ వివేకము ననుసరించి నడచుకొనువానికి ఫలసిద్ధి తప్పక చేకుఱు నని యెఱుగుము. ౮౧

మోక్షస్య కాఙ్క్షా యది వై త వాస్తి త్య జాతిదూరా ద్విషయా న్విషం యథా
పీయూషవ త్తోషదయాక్షమార్జవప్రశాన్తిదాన్తీ ర్భజ నిత్య మాదరాత్. 82

మోక్షాభిలాష ఉన్నదా నీకు ? ఉన్నచో, విషమును త్యజించినట్లుగా ఇంద్రియ విషయములను దవ్వున విడిచిపెట్టుము. అమృతము నాదరించినట్లుగా సుగుణముల నలవఱచు కొనుము. ఆ సుగుణము లేవి యనగా – సంతుష్టి, దయ, క్షమ, ఋజుత్వము, శమము, దమము. ౮౨

అనుక్షణం య త్పరిహృత్య కృత్య మనా ద్యవిద్యాకృతబన్ధమోక్షణమ్
దేహః పరార్థో ఽయ మముష్యపోషణే య స్సజ్జతే స స్వ మనేన హన్తి. 83

దేహ ముండునది దేహికొఱకు. కావున దేహము పరార్థము. దేహమునే దేహి అనుకొనుట అవిద్య. అవిద్య అనాది యైనది. దీనివలన నేర్పడు బంధమును వదలించుకొనుట కర్తవ్యము. ఆ కర్తవ్యమును మాని, అనుక్షణమును దేహపోషణమం దాసక్తి వహించువాడు తన్ను తాను చంపుకొనుచున్నాడు. ౮౩

శరీరపోషణార్థీ సన్ య ఆత్మానం దిదృక్షతే
గ్రాహం దారుధియా ధృత్వా నదీం తర్తుం స గచ్ఛతి. 84

శరీరపోషణమందలి శ్రద్ధద్వారా ఆత్మసాక్షాత్కారము నొందగోరువాడు తెప్ప యని భ్రమించి మొసలిని పట్టుకొని నదిని దాటగోరువానివంటివాడు. ౮౪

మోహ ఏవ మహామృత్యు ర్ముముక్షో ర్వపురాదిషు
మోహో వినిర్జితో యేన స ముక్తిపద మర్హతి. 85

మోక్షాభిలాషికి దేహాదులందలి మమకారమే మహామృత్యువు. ఆ వ్యామోహమును నిర్జించినవాడే మోక్షపదవి కర్హుడు. ౮౫

మోహం జహి మహామృత్యుం దేహదారసుతాదిషు
యం జిత్వా మునయో యాన్తి త ద్విష్ణోః పరమం పదమ్. 86

దేహమునందును భార్యాపుత్త్రాదులందును నీకు గల మమకార మనెడి వ్యామోహమును జంపుకొనుము. అది మహామృత్యువు. దానిని నిర్జించియే మునులు శ్రుతిసిద్ధమును పరమమునైన విష్ణుపదమును ప్రాపింతురు. ౮౬

త్వఙ్మాంస రుధిరస్నాయు మేదో మజ్జాస్థి సఙ్కులమ్
పూర్ణం మూత్రపురీషాభ్యాం స్థూలం నిన్ద్య మిదం వపుః. 87

తోలు, మాంసము, నెత్తురు, నాడులు, మెదడు, క్రొవ్వు, ఎముకలు మలమూత్రములు – అను వీనితో నిండిన యీ స్థూలదేహము 'అబ్బే' అని ఏవగించుకొనదగినది కదా. ౮౭

పఞ్చీకృతేభ్యో భూతేభ్యః స్థూలేభ్యః పూర్వకర్మణా
సముత్పన్న మిదం స్థూలం భోగాయతన మాత్మనః
అవస్థా జాగర స్తస్య స్థూలార్థానుభవో యతః. 88

భూమి, జలము, అగ్ని వాయువు, ఆకాశము అను సూక్ష్మభూతములలో నొక్కొక్క దానిలోని సగభాగముతో తక్కిన నాల్గింట ప్రతిదానిలోని పరకభాగము చేరినచో ప

అప్పు, తేజము, వాయువు, ఆకాశము అనెడి స్థూలభూతము లేర్పడును. ఈ యేర్పాటుకే పంచీకరణ మని పేరు. పంచీకృతములైన స్థూలభూతములనుండి పూర్వకర్మచే ఈ స్థూలశరీరము సముత్పన్న మగుచున్నది. జీవున కీ శరీరముగుండ సుఖదుఃఖానుభవములు కలుగుచుండును. స్థూలశరీరమునకు గలుగు స్థూలపదార్థానుభవమే జాగ్రద్దశ. ౮౮

బాహ్యేన్ద్రియైః స్థూలపదార్థసేవాం స్రక్చన్దనస్త్ర్యాదివిచిత్రరూపామ్
కరోతి జీవః స్వయ మేత దాత్మనా తస్మా త్ప్రశస్తి ర్వపుషో ఽస్య జాగరే. 89

పూలమాల - గంధము - కామినులు మున్నుగా విచిత్రరూపమైన స్థూలపదార్థ నివహామును జీవుడు స్వయము తానుగా బాహ్యేంద్రియములచే సేవించుచున్నాడు. కావున స్థూలశరీరమునకు ప్రశస్తి జాగ్రద్దశయందే. ౮౯

సర్వోఽపి బాహ్యసంసారః పురుషస్య యదాశ్రయః
విద్ధి దేహ మిదం స్థూలం గృహవ ద్గృహమేధినః. 90

గృహమేధికి గృహమెట్టిదో జీవున స్థూలదేహ మట్టిదని యెఱుగుము. జీవుని బాహ్య సంసారమున కంతటికి నాశ్రయము ఈ స్థూలదేహమే. బాహ్యసంసార మన నేమో తర్వాతి శ్లోకమున వివరింపనున్నారు. ౯౦

స్థూలస్య సమ్భవజరామరణాని ధర్మాః
స్థౌల్యాదయో బహువిధా శ్శిశుతాద్యవస్థాః
వర్ణాశ్రమాదినియమా బహుధామయా స్యుః
పూజావమాన బహుమానముఖావిశేషాః. 91

జన్మజరామరణములు, బలుపు మున్నగునవి, శైశవ ప్రముఖావస్థలు వర్ణాశ్రమాది నియమములు, బహువిధవ్యాధులు, పూజ, అవమానము బహుమానము మున్నగు విశేషములు - ఇవన్నియు గలుగునది స్థూలదేహమునకే. ౯౧

బుద్ధీన్ద్రియాణి శ్రవణం త్వ గక్షిఘ్రాణఞ్చ జిహ్వా విషయావబోధనాత్
వాక్పాణిపాదా గుద మ ప్యుపస్థం కర్మేన్ద్రియాణి ప్రవణాని కర్మసు. 92

శబ్ద - స్పర్శ - రూప - గంధ - రసములనెడి విషయములను గ్రహించునవగు చెవి - చర్మము - కన్ను - ముక్కు - నాలుక అను ఈ యైదును జ్ఞానేంద్రియములు. కర్మప్రవణము లగు వాక్కు చేతులు పాదములు గుదము ఉపస్థ అను ఈ యైదును కర్మేంద్రియములు

నిగద్యతే ఽన్తఃకరణం మనో ధీ రహఙ్కృతి శ్చిత్త మితి స్వవృత్తిభిః
మనస్తు సఙ్కల్పవికల్పనాదిభి, ర్బుద్ధిః పదార్థాధ్యవసాయధర్మతః.

అత్రాభిమానా దహ మి త్యహఙ్కృతిః స్వార్థానుసన్ధానగుణేన చిత్తమ్. 94

సంకల్పవికల్పనాదులు చేయునప్పు డంతఃకరణము మన స్సనబడును. పదార్థనిర్ణయము కావించునప్పు డదే బుద్ధి యనబడును: శరీరప్రాణేంద్రియములను 'నే' ననియు వాని ధర్మములను 'నావి' యనియు నభిమానించునప్పు డది అహంకార మనబడును. అనుభూతార్థములను స్మరించునప్పు డది చిత్త మనబడును. అంతఃకరణ మొక్కడే అయినప్పటికి, తనవృత్తులను బట్టి మనోబుద్ధ్యహంకారచిత్తములుగా పేర్కొనబడుచున్న దనుట. ౯3, ౯౪

ప్రాణాపానవ్యానోదానసమానా భవ త్యసౌ ప్రాణః
స్వయ మేవ వృత్తిభేదా ద్వికృతే ర్భేదా త్సువర్ణసలిలాదివత్. 95

ఒక్క బంగారమే ఆకారభేదముచే కటకకేయూరకుండలాదులుగ నగుచున్నట్లు, జల మొక్కటే ఆకారభేదముచే అల - నురుగు - బుడగ మున్నగునవిగ నగుచున్నట్లు— ఒక్కప్రాణవాయువే వృత్తిభేదమునుబట్టి ప్రాణముగను, అపానముగను, వ్యానముగను ఉదానముగను సమానముగను అగుచున్నది. ౯౫

వాగాది పఞ్చ శ్రవణాది పఞ్చ ప్రాణాది పఞ్చాభ్రముఖాని పఞ్చ
బుద్ధ్యా ద్యవిద్యాపిచ కామకర్మణీ పుర్యష్టకం సూక్ష్మశరీర మాహుః. 96

౧. వాక్పాణిపాదపాయూపస్థము లనెడి కర్మేంద్రియము లైదు. ౨. త్వక్చక్షు శ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణము లనెడి జ్ఞానేంద్రియము లైదు 3. ప్రాణాపానవ్యానోదానసమానము లనెడి వాయువు లైదు. ౪. పృథివి అప్పు తేజము వాయువు ఆకాశము అనెడి భూతము లైదు. ౫. బుద్ధి మనశ్చిత్తాహంకారము లనెడి నాల్గు. ౬. అవిద్య. ౭. కామము. ౮. కర్మము— ఈ యెనిమిది వర్గములును ఎనిమిది పురములు, వీనినే సూక్ష్మశరీర మందురు. ౯౬

# పరమహంస దేవుని ప్రబోధవాణి

ఒకభక్తుడు—సమాధిదశలో బ్రహ్మజ్ఞాన ప్రాప్తి నొందినవా డిక మాటాడనే లేడా?

గురుదేవుడు—శ్రీ శంకరాచార్యులవారు లోకుల కుపదేశము చేయుటకై జ్ఞానాహంకారమును నిలుపుకొనిరి. బ్రహ్మమును సాక్షాత్కరించుకొన్న వెంటనే మానవుడు మౌని యగును. అతని తర్కములెల్ల సాక్షాత్కారసిద్ధి కలుగకుండునంతవరకే.

పెనముపై వెన్న నుంచి పొయిమీద పెట్టిన నందులో నున్న నీ రిగురువఱకు కుతకుత ధ్వని వినబడుచుండును. నీరు పూర్తిగా ఇగిరి పోయినపిమ్మట వెన్నలో చప్పు డుండనే యుండదు. ఆ వెన్నెలో పచ్చిపిండిముద్దను వేయుదువేని మరల కుతకుతధ్వని కలుగును. ఆ పిండివంటకము పక్వమైన పిదప మరల నిశ్శబ్దత గలుగును. అట్లే సమాధిదశయందున్న

మానవుడు లోకుల కుపదేశించుటకై ద్వంద్వ రంగమున నవతరించి దేవునిగుఱించి ప్రసంగింప దొరకొనును.

పుష్పముమీద కూర్చుండుటకు ముందు తుమ్మెద ఝుంకరించుచుండును, తేనెను గ్రోల నారంభింపగనే నిశ్శబ్ద మగును. కాని ఒక్కొక్కప్పుడు తేనె మత్తెక్కి మరల ఝుంకరించును.

ఖాళీబుంగను నీట ముంచిన బుడబుడ చప్పుడగును. దానిలో నీరు నిండగనే చప్పుడు ఉడుగును. [అందఱు నవ్వుదురు]. నీటిని, ఆ బుంగనుండి వేఱొక ఖాళీబుంగలోనికి పోయునపుడు, మరల చప్పుడు విన నగును.

* * *

దైవసృష్టిలోని పదార్థములు - మానవులు మృగములు వృక్షములు మొలకలు మున్నగు రీతిగ వివిధములై యున్నవి. మృగములలో కొన్ని మంచివి, కొన్ని చెడ్డవి; వ్యాఘ్రము వంటి కొన్ని మృగములు భయంకరములు. వృక్షములలో కొన్నింటిఫలము లమృతమధురములై యుండును, కొన్నిటిఫలములు విషమయములుగ నుండును. అట్లే మానవులందును సాధువు లున్నారు, అసాధువు లున్నారు, పవిత్రు లున్నారు, అపవిత్రు లున్నారు, దైవపరు లున్నారు, ఐహికపరు లున్నారు.

చేతనులను నాలుగువర్గములవారినిగ విభాగింపవచ్చును—బద్ధులు, ముముక్షువులు, ముక్తులు, నిత్యముక్తులు.

నారదాదిమునులు నిత్యముక్తులు; ఇతర చేతనుల కాధ్యాత్మికసత్యము నుపదేశించుటకును వారికి శ్రేయము నొనగూర్చుటకునే వీరు తమ జీవితము నంకిత మొనర్చుకొన్నవారు.

ఐహికవిషయములందు మునిగి దేవుని బొత్తిగా మఱచినవారు బద్ధులు. వారు పొరపడియైనను దేవుని స్మరింపరు.

లౌకికసంగమునుండి విడుదల నొంద గోరువారు ముముక్షువులు. అందులకై యత్నించినప్పుడు నెగ్గెడువా రొక్కొక్కరే, నెగ్గనివారు పెక్కండ్రు.

సాధువులు మహాత్ములు మున్నగువారు ముక్తాత్ములు. వారు కామినీకాంచనములందును ఇతరైహికములందును తగుల్కొనరు. వారి మనస్సులకు లౌకికబంధములు లేవు. అదియును గాక వారు సదా భగవచ్చరణారవిందధ్యానము చేయు ధన్యులు.

చేపలను బట్టుటకై, తటాకములో వలను వేసితి మనుకొనుము. కొన్నిచేపలు మిక్కిలి జాగరూకత కలవై, అందు తగుల్కొనకయే యుండును. అవి నిత్యముక్తులను బోలినవి.

కాని చేపలలో చాలవఱకు ఆవలలో తప్పక తగుల్కొనును. తగుల్కొన్న చేపలలో కొన్ని విడుదల పొందుటకు ప్రయత్నించును. అవి ముముక్షువులను బోలినవి.

ఆ ప్రయత్నములో కృతార్థత చేపల కన్నిటికిని చేకుఱదు, కొన్నిటికే. అవి తటాకజలము క్రిందుమీదై మిక్కిలి బురదయగునట్లు, వలనుండి వెలికుఱుకును. (అవి ముక్తులను బోలినవి.) అప్పుడు జాలరులు 'అదుగో, పెద్దదొకటి పోవుచున్న' దని కేకలు వేయుదురు.

కాని వలలో నున్న చేపలలో నూటికి తొంబదితొమ్మిదిపాళ్లు తప్పించుకోలేవు సరికదా, తప్పించుకొనుటకు ప్రయత్నమునైనను జేయవు. అంతే కాదు, 'ఇక్కడ మనము క్షేమముగ నున్నా మిక మనకు భయము లే' దనుకొనుచు వలను కఱచుకొని, బురదలోనికి చొచ్చుకొని పోయి హాయిగ నుండును. కాని

వలతోబాటు తమ్మకూడ జాలరి బయటికి లాగివేయునని, పాప, మరి ఎఱుగవు. అవి ఈ లోకములోని బద్ధాత్ములను బోలినవి.

కామలోభములే బద్ధాత్ములను బంధించు సంకెలలు. అవి వారి హస్తపాదముల నాడ నీయక కట్టియుంచును. కామినీకాంచనముల వలననే తమకు సౌఖ్యభద్రతలు కలుగు నని వారి నమ్మకము. కాని తమ సర్వవినాశమునకు దారి తీయునవి కామినీకాంచనములే యని వారు గ్రహింపరు. ఇట్టి బద్ధాత్ముడు మరణ శయ్యపై నున్నప్పుడును, భార్య "నీవు పోవు చున్నావే, నా కేమి సంపాదించి పెట్టియున్నా" వని గద్దించును. అంతే కాదు, తా నొక వైపు మరణశయ్యపై నున్నను, అప్పుడు కూడ, నీ జీవికి లౌకికవిషయములం దెంతతగులాటమో చూడుడు—దీపము పెద్దగ మండుచున్నచో నూనె వ్యయమగు నని కేకలు వేయును.

బద్ధాత్ములు దేవు నెప్పుడును స్మరింప నే స్మరింపరు. వారి విరామకాలమంతయును పనికి మాలిన మాటలలోనో, అవివేకప్రసంగముల లోనో లేక నిరర్థకకార్యకలాపమందో గడచి పోవుచుండును. వారిలో నొకరి నందులకు కారణము నడిగితి మేని 'నే నూరకుండ లేనండి, కాబట్టి వేయుచున్నా నీ కంచెను' అనును. ఇంచు కేని ఉబుసుపోనప్పుడు వారు చీట్లాటనైన నారంభింతురు.

ఒకభక్తుడు—అట్టి లౌకికప్రావణ్యముగల వానికి బాగుపడు దారియే లేదా?

గురుదేవుడు—లేకేమి! అత డప్పుడప్పుడు పుణ్యాత్ముల గోష్ఠిలో మెలగుచుండవలయును. దైవధ్యానము చేయుటకై యేకాంతమున కేగుచుండవలయును. భక్తివిశ్వాసములను ప్రసాదింపు మని యతడు దేవుని వేడుకోవల యును.

[కేదారునితో] విశ్వాసమున కెంత ప్రభా వము కలదో నీవు తప్పక వినియుందువు. రాముడు దేవుడు కదా, రూపు దాల్చిన యనిర్వాచ్యబ్రహ్మమే కదా, కాని సముద్ర మును దాటి సింహళమునకు చేరుట కాయన వంతెనను కట్టుకోవలసి వచ్చెను. కాని రామ భక్తుడైన హనుమంతుడు రామనామమందు విశ్వాసము కలిగియున్నందున ఒక్కగంతుతో సముద్రమును పూర్తిగా దాటి అవతలితీరమున జేరెను. ఆయనకు వంతెన యక్కఱ లేక పోయినది. [అందఱును నవ్వుదురు]

ఒకానొకప్పు డొక మనుష్యుడు సముద్ర మును దాటుట కుంకించుచుండెను. విభీషణు డొక యాకుమీద రామనామమును వ్రాసి, దాని నా మనుష్యుని కట్టుబట్టకొంగున ముడిచి 'ఓయీ, భయపడకు, విశ్వాసము గలిగి యుండు, నీటిమీద నడిచిపో, కాని జాగ్రత్త! నీ నమ్మకమే క్షణములో చెడునో, ఆక్షణము లోనే నీవు మునిగిపోవుదువు" అనెను. ఆ మను ష్యుడు నీటిమీద సులువుగానడచిపోవుచుండెను. తటాలున, తన వస్త్ర మున ముడువబడి యుండున దేమో చూత మను కుతూహల మతనికి తీవ్రముగ గలిగినది. ముడి విప్పి చూచుసరికి, ఆకు కానిపించెను. దానిమీద రామనామము వ్రాయబడియుండెను. 'ఏమి ఇది? రామనామమా? ఇంతేనా' అని యతడు తనలో ననుకొనెను. అతని మనస్సులో నవి శ్వాసము చొచ్చుకొన్నంతనే అతడు మున్నీట మునిగిపోయెను.

మానవుడు గోహత్య బ్రహ్మహత్య స్త్రీహత్య మున్నగు పాపములను జేసియుండి నను, అతనికి దేవునందు విశ్వాస మున్నచో, ఆ విశ్వాసప్రభావ మతనిని తప్పక సంరక్షిం చియే తీఱును.

# శ్రీ వివేకానంద సందేశము

ఆత్మ విశ్వాసమును గోల్పోయి అచలమై, నిద్రాణమైయున్న భారతదేశమును మేల్కొల్పుటయే యిపుడు నా యేకైకవాంఛ. ఈ దేశమును మేల్కొల్పి సనాతనధర్మోన్నతిని గుర్తింపఁజేయఁగలిగితినేని శ్రీ రామకృష్ణుని యాగమనమును మా జననమును వ్యర్థము కాలేదని తలఁతును. ఇదియే నా తాపత్రయము; ముక్తి మొదలగునవన్నియు నా కెంతమాత్రము గణనీయములు కావు...మన పురాతన గ్రంథములు ప్రమాణభూతములని యేకరువు పెట్టుచుండుటవలన ఏమియు లాభము లేదు. పాశ్చాత్య నాగరికతా తరంగము ఉప్పొంగి దేశముమీఁదికి వచ్చి పడుచున్నది. అణుమాత్రమైనను బ్రయోజనమును గమనింపక పర్వతాగ్రములపై ధ్యానస్థితులమై కూర్చుండుటవలనఁ బ్రయోజనము లేదు. గీతలో భగవానుఁడు తెల్పిన చందమున అప్రతిహత శక్తితో, అఖండ ధైర్యసాహసములతో తీవ్రకర్మయోగము నవలంబించుటయే ఇపుడు మన కర్తవ్యము. అపుడే దేశీయులు నిద్ర మేల్కొందురు ... 'వలయునది పురుషకారమని గ్రహింపుఁడు.' పురుషకార విహీనునకుఁ బరమేశ్వరానుగ్రహము లభించుటకల్ల. మహావీరుఁడగు నర్జునుఁడు తన పౌరుషమును గోల్పోవనున్న సమయమున శ్రీకృష్ణుఁ డాతనికి నిస్సంగబుద్ధితో స్వధర్మము ననుష్ఠింపుమని యాదేశించి, నిష్కామ కర్మాచరణమువలనఁ జిత్తశుద్ధియుఁ, గర్మపరిత్యాగఫలమును, భగవదేకార్పితబుద్ధియు సిద్ధించునని యుపదేశించెను. కావున యువకులారా, ధీరులై బలము నార్జింపుఁడు. దుర్జనుఁడైనను బలోపేతుఁడు నాకు మాన్యుఁడు. ఏలన వాఁడును దన బలముచే దౌర్జన్యమును స్వార్థపరతను విడనాడి, తత్త్వసందర్శనము చేయుదినము వచ్చితీరును.

నానాఁటికి విస్పష్టముగా నాకు గోచరించుచున్న విషయమిది: 'సమస్తము ధైర్యసాహసములతోఁ గూడుకొనియున్నది. ఇదియే నా నూతనసందేశము. దుష్కార్యములనైనను సరియే ధీరుఁడవై యొనర్పుము!' దుర్మార్గుఁడవగుట విధియైనచో, అపరిమిత దుర్మార్గుఁడవు కమ్ము!

అభివృద్ధికి లక్షణము అన్యమతాభిప్రాయ గ్రహణము, సమన్వయము. ఇదియే సనాతన ధర్మ సహజలక్షణము ... ఐనను అపుడపుడు ఆత్మసంరక్షణకై హిందువులును శత్రువులను హతమార్పఁ గలిగినవారే. కాని వారెన్నఁడును యుద్ధమే పరమావధిగా భావింపలేదు. ఈ నూతన జాతుల నన్నిటిని భారతదేశములోనికి వచ్చి చిందులు ద్రొక్కనిండు, భయము లేదు. తుట్టతుదకు వీనికన్నిటికిని సనాతన ధర్మము ఆపోశనము పట్టును.

...అలసటచేతనో, అశక్తతచేతనో క్షమ చూపుటకంటెఁ బోరాడుటయే మంచిది. దేవతాసైన్యములను సైతము అవలీలగా జయింపఁగల్గుదువేని క్షమ చూపుము ... ప్రపంచము యుద్ధరంగము. వీరుఁడవై ప్రతికూలురను జయింపుము...అప్రతికారము సన్న్యాసధర్మము. 'ఆత్మసంరక్షణము గృహస్థధర్మము.'

...ప్రస్తుతకాలావశ్యకతను గుర్తింప జ-దేశీయులు పరిపూర్ణప్రబోధము నొందినట్లు కాన్పించును...ఇఁక జీవితమంతయు నర్థరహిత ప్రసంగములు చేయు వట్టి 'కబుర్ల రాయళ్లు' అగు మీరో, వచ్చి యీ దేశీయులను జూచి సిగ్గుచే తలవంచుకొనుఁడు. స్వమత దురభిమానమున మతిహీనులగు మీరు బయటికి వచ్చినంతనే జాతిభ్రష్టత సిద్ధించును మీకు, పా-ప-ము! 'ఈ యాహారము

స్పృశ్యమా ?' యను చర్చలతో శక్తిసామర్థ్యములనన్నిటిని శతాబ్దములనుండి వ్యయించుచు, బహుయుగ పర్యంతముగ సాంఘిక రాక్షస శాసనములచే మానవత్వమునన దడుగంట. కరుడుగట్టిన ఛాందసముచే, మూఢవిశ్వాసములచే, తల దిమ్మెత్త, శతాబ్దములకొలఁది చతికిలపడియున్న మీరో,...మీ స్థితియెట్లున్నది? ఇఁక మీరిపుడు చేయుచున్న దేమి?...'పుస్తకం హస్తభూషణమ్' అనునట్లు చేతులలోఁ బుస్తకములతో సముద్రతీరమున విహరించుచు, ఐరోపీయధీసంజాతమైన యే శాస్త్రములనుండియో నాలుగు ముక్కలు ముక్కున కంటించుకొని వానినేకరువుపెట్టుచు, యావదాత్మను ముప్పది రూకల 'గుమసా పదప్రాప్తి'పై లేదా, యువ భారత దేశమునకు ఆశాపరమావధి యనఁదగు 'లాయరుపదవి'పై లగ్నమొనర్చి ... యిఁకఁ బ్రతివిద్యార్థియు క్షుద్బాధచే నల్లాడు పిల్లల పటాలము ఆహారముకొఱకు 'కాకురు బీకురు' మనుచుఁ దన వెంటఁబడి దేవిరించుచుండ ... మీ రిపుడు చేయుచున్న దేమి ?...మిమ్ములను, మీ పుస్తకములను, మీ గౌనులను, మీ విశ్వవిద్యాలయ.బిరుదములను సమస్తము ముంచివేయజాలినంత నీరు సముద్రమున లేదా ?

లెండు, మీ పౌరుషమును బ్రకటింపుఁడు! సదా పురోవృద్ధి నరికట్టు పురోహితబ్రువులను మతాచార్యులను లేశమును లక్షింపకుఁడు. ఏలందురా, వారి మనస్సులు ఇఁక మాఱవు, వారి హృదయములు వికసింపవు. తరతరముల నుండి వచుచ్చున్న మూఢవిశ్వాసములును రాక్షసశాసనములును వారిని గన్నతల్లులు. మతాచార్యకైతవమును గూఁకటి వ్రేళ్లతోఁ బెల్లగించివేయుఁడు. లెండు, మీమానవత్వమును బ్రకటింపుఁడు! మీ కూపములనుండి వెలువడి బాహాటముగా నలువైపులను దిలకింపుఁడు. ప్రపంచమందలి వివిధజాతు లెట్లు ముందంజవేయుచున్నవో చూడుఁడు. (సోదర) మానవుని మీరు ప్రేమింతురా ? స్వదేశమును మీరు ప్రేమింతురా ? ప్రేమించుచో రండు, ఉన్నతపరిస్థితులకై, యోగ్యతరస్థితిగతులకై, నడుము గట్టుదము. వెనుకకుఁ జూడకుఁడు.

భారతమాత వేలకొలఁది యువకుల త్యాగమును గోరుచున్నది. వలయునది అట్టి యువకుల మనోబలము, పశుబలము కాదు. పాషాణతుల్యమగు మీ నాగరికతను సడలింప భగవత్ప్రేరణముననే యాంగ్లప్రభుత్వ మిచటికి వచ్చినది. మీ తండ్రి తాతల నిరంకుశాధికారముచేఁ బశుతుల్యముగాఁ జేయఁబడిన మీ దరిద్రసోదరకోటి నుద్ధరించుటకై — నూతన పరిస్థితులను గొనివచ్చుటకై — పేదల యెడ సానుభూతిని — క్షుధార్తులగువారి కడుపుమంట చల్లార్పఁ బట్టెడన్నమును — జనసామాన్యమునకు విద్యను — చేకూర్చుటకై ప్రాణముల నర్పించు త్యాగులను చెన్నసగర మిపుడెందఱను సమకూర్పఁగలదు ?

మఱియొకమాట. వలయునది శాంతము, నిరాడంబరము, అచంచలము నైన కృషి — అంతియేకాని వార్తాపత్రికావంచన కాదు, పేరుప్రతిష్ఠలకై ఉబలాటముకాదు, — ఈ సంగతి సదా జ్ఞప్తినుంచుకొనుఁడు.

మానవజీవిత సమస్యలను గూర్చియు, ఆత్మతత్త్వమును గూర్చియు లోకమునకు బోధింపవలయు మహాభారము భారత పుత్రులపై నున్నది. [illegible] [illegible] సంసిద్ధులు కావలయును.

...నాయనలారా, నామాట వినుఁడు, భగవదనుగ్రహమునఁ గీలకమును గనుఁగొంటిని. మతమున-ధర్మమున-ఏదోషమును

లేదు. సమస్త జీవులును కోటిగుణితమైన మీ యాత్మయేయని మీ మతము—మీ సనాతన ధర్మము—బోధించుచున్నది. ఏతదనుష్ఠాన లోపము, సానుభూతిలోపము — ఉన్నలోప మిది...యూదులు ఏసుప్రభుని కాదని నాఁటి నుండియుఁ బ్రతివానిచేతను మొట్టి కాయలను దినుచు, కొంపయును గోడును లేక ప్రపంచ మంతటను బికారివాండ్రై యెట్లు తిరుగుచున్నారో అట్లే మీరును మిమ్ములను బాలించుట పాడియని తోఁచిన జాతికెల్ల దాస్యము చేయుచున్నారు...

పవిత్రహృదయులు, ప్రచండదీక్షాదక్షులు, భగవద్విశ్వాస బలోపేతులు — దరిద్రులపై దీనులపై, అధఃకృతులపై సానుభూతికతన సింహసాహసాన్వితులు—ఒక లక్షమంది స్త్రీ పురుషులు — మోక్షసందేశమును, సంఘోద్ధరణసందేశమును సమత్వసందేశమును బోధించుచు యావద్భారతదేశమునను సంచరింపవలసియున్నది.

'అన్నమో రామచంద్రా!' యని పలవించు నార్తులకు మతబోధ లెందులకు?' అని గురుదేవుఁడు (శ్రీరామకృష్ణుఁడు) వచింపలేదా? భారతజనసామాన్యము కేవల పశుప్రాయమై జీవించుటకుఁ గారణము అజ్ఞానము, అక్షరజ్ఞానశూన్యత...జనసామాన్యము నుద్ధరింపని మనకు జాతీయత యనునది కలలోనివార్త ... కాని ఈ దోషము సనాతనధర్మమున కంటఁగట్టుట తగదు, ఇది మనదోషము.

...తమ సోదరహిందువులు తమ్మాదరింపకుండుటచే చెన్నరాజధానిలో వేలకొలఁది పంచములు ఎట్లు క్రైస్తవులై పోవుచున్నారో కనుఁడు! కేవలము ఆఁకలిబాధచే, దారిద్ర్యముచేఁ గాదు, వారు క్రైస్తవమత మవలంబించుచుండుట. మీరు వారిని మానవమాత్రులుగాఁ జూడకుండుటచేత! ఎంతసేపు, 'మీరు అస్పృశ్యులు, అవాచ్యులు'; 'నన్ను ముట్టుకొనకు, నన్ను ముట్టుకొనకు' మని యెగిరిపడుచున్నారు! గగ్గోలు చేయుచున్నారు! సోదరభావముగాని ధర్మలేశముగాని దేశమున నేమైనను మిగిలియున్నదా? అస్పృశ్యత యొకటియే ఇపుడు నిలిచియున్నది; ఇట్టి తుచ్ఛాచారములను జెనకివేయుడు! 'ఓ దీనులారా, దరిద్రులారా, అధఃపతితసోదరులారా, రండు, మనమందఱ మూరామకృష్ణుని బిడ్డలము' అని యెలుగెత్తి చాటుచు, జనులలో ఐకమత్య మొనఁగూర్చుటకై యస్పృశ్యతావరణము నూడఁబెఱికివేయు సుదిన మెపుడు ప్రాప్తించునోకదా! అస్పృశ్యుల నుద్ధరింపనిదే మన భారతాంబ మేల్కొనదు...

మీస్త్రీల స్థితిని మీరు బాగుచేయలేరా? లేకున్న మీకుఁ దరణోపాయము లేదు. స్త్రీల నుద్ధరింపనియెడల నెప్పటివలెనే యధఃపతితులై యుందురు మీరు.

పరహితార్థము ఒకజీవితము నర్పింపఁజాలరా? వేదాంతశ్రవణము, ధ్యానాదిసాధనలు మున్నగువానిని ముందు జన్మమునకు విడిచిపెట్టుఁడు! లోకసేవకై యీ శరీరము నాహుతి యొనర్పుఁడు! ... తీవ్రతపస్సుచేసి నేను గ్రహించిన మహత్తర సత్యమిది: ప్రతి జీవియందును భగవంతుఁడు కలఁడు. దృశ్యమానమగు నీసమస్తజీవకోటియు వాని స్వరూపమే. భగవంతు నెచట వెదకుట! 'ఎవఁడు జీవారాధకుఁడో వాఁడే దైవారాధకుఁడు!'

...సమస్త జీవస్వరూపుని, అద్వితీయుని, విశేషము నాయార్తనారాయణుని, నాదీననారాయణుని, సమస్తదేశీయులకెల్ల పేదయగు నాభారతనారాయణుని, — నాయిష్టదేవత నర్చించుటకై యెన్నిజన్మములైన నెత్తెదను.

గాక, ఎన్నివేలబాధలనైన ననుభవింతును గాక...

లెండు! 'అస్తి! అస్తి!' యను సద్భావమును బ్రకటింపుఁడు—ఆస్తికభావములను జేపట్టుఁడు 'నాస్తి, నాస్తి' యను వ్యతిరేకభావములను బట్టుకొని యూఁగులాడుచుండుటచేతనే దేశము అధోగతి పాలగుచున్నది... ప్రతిజీవియందును అఖండశక్తి కలదు. 'నేను అల్పుఁడను, తుచ్ఛుఁడను' అను నాస్తికభావముల నాశ్రయించి పందులును పిల్లులును అగుటయా మీరు? ఏమి ఘోరకలి! నాస్తికతను నిరసనమును బోధింప సాహసించువారెవ్వరు? 'అబల' లనియు, 'భీరువు' లనియు ఎవరిని మీరు నిరసించుచుండుట? 'శివోఽహం, శివోఽహమ్.' నాస్తికభావములను నిరసనభావములను జనులు నొక్కి వక్కాణించుట వినిన నాకుఁ దలపైఁ బిడుగుపడినట్లు తోఁచును... ఆత్మనిరసనమును వినయమనవచ్చునా? 'నాయమాత్మా బలహీనేన లభ్యః'—ఈయాత్మ బలహీనులకు లభ్యము కానేరదు... హిమసంఘాతమువలెఁ బ్రపంచము ముపైఁ బడుఁడు. తద్భారమునఁ బ్రపంచము గుభిల్లుమని పగిలిపోవుఁగాక! హర! హర! మహాదేవ! 'ఉద్ధరేదాత్మనాత్మానమ్'—తనచేతనే పురుషప్రయత్నముననే తన్నుద్ధరించుకొనవలయును...

భారతజాతీయాదర్శమును, భగవద్భక్తి సంజనితమునగు త్యాగమునే లక్ష్యముగా నిడుకొని సింహబలసాహసములతో, దూషణాద్యతీతులై, కర్మఫలకాంక్షను విసర్జించి, కార్యరంగమును వరింపుఁడు. హనుమన్మహావీరుఁడే మీకు ఆదర్శపురుషుఁడు. జితేంద్రియచక్రవర్తియు, అద్వితీయధీశాలియునగు నాతఁడు రామనామమందలి యఖండభక్తితో ప్రాణభీతిని విడనాడి, యొక్క దుముకులో సాగరము నెట్లు లంఘించెనో చూడుఁడు! ఆతఁడెట్టి భగవత్సేవకుఁడో! ఆదర్శమూర్తియో! తన యఖండబాహుబలముచే, అద్వితీయ పరాక్రమముచే రావణుని రాక్షససైన్యములను హాహాకార మెత్తింపఁగలిగిన మహావీరుఁడాతఁడు. మఱియొకవైపున రామపదపంకజార్చకులలో నద్వితీయుఁడు నాతఁడే. అట్టి నిశ్చంచలభక్తియే దేశమున కిపుడు ఆవశ్యకము. కాని మీరేమి చేయుచున్నారు? మృదంగకరతాళములతో నేవో పిచ్చిపిచ్చి పదములను బాడుచు, చిందులుద్రొక్కు శారీర మానసికబలహీనులతోఁ గూడుకొనియున్నది మీజాతి నేఁడు! ... దేశమున పౌరుష మడుగంటినదే! ఇంతకంటె అధఃపతనము వేఱుండునా? మీఢక్కలు, డోలులు, కాహళలు, తూర్యములు భేరులు నేఁడేమైనవి? వీనిని మరల దేశములోనికిఁ దీసికొనిరాఁజాలరా? మీ యువకులను బిడ్డలను శౌర్యోత్తేజకములగువాని గంభీరస్వనములను విననిండు! భారతపుత్రులారా, నేఁడు మనము ధైర్యోత్సాహజనకము లగు బ్రహ్మరుద్రతాళములధ్వనించి డమరును ప్రమోఁగింపవలయును. 'హర! హర! మహావీర! మహావీర! వ్యోమ! వ్యోమ!' అను నినాదములచే భూమ్యాకాశములను గంపింపఁ జేయవలయును. ప్రస్తుతము కరుణరసాదులను బురికొల్పు గీతగానములను విరమించి వీరరసాన్వితగీతములను జనులు వినవలయును, పాడవలయును, వేదగంభీరఘోషచే దేశసంజీవనమొనర్పవలయును. మనము చేయు ప్రతి కార్యమునందును సుస్థిరధీరత్వము కననగుచుండవలయును. ఇట్టి ధీరాదర్శము నవలంబించినప్పుడే మాతృదేశక్షేమము మనకుఁ గరతలామలకమగును...

'ఓ భారతజననీ,' నీసతీత్వాదర్శము సీత-సావిత్రి—దమయంతి—యనుమాట మఱవకుము;-సర్వసంగపరిత్యాగియు యతీశ్వరుఁడు నగు శంకరుఁడు—ఉమామహేశ్వరుఁడు—నీకు ఆరాధ్యుడనుమాట మఱవకుము:—నీ యైశ్వర్యమునకు, నీ వివాహమునకు, నీ జీవితమునకు, పరమార్థము తుచ్ఛవిషయసుఖము గాదనుమాట, వ్యక్తిగతభోగము గాదనుమాట మఱవకుము; —యజ్ఞనారాయణునకు ఆహుతి యగు నిమిత్తము జన్మించితి వనుమాట మఱవకుము;—నీ సాంఘికవ్యవస్థ యనంత జగన్మాతృత్వమునకుఁ బ్రతిబింబమనుమాట మఱవకుము; అస్పృశ్యులనఁబడు అవాచ్యులనఁబడు, మాలమాదిగలు నిమ్నజాతులు, దీనులు, దరిద్రులు, అజ్ఞానులు, నిరక్షరాస్యులును నీ తనూభవులనుమాట మఱవకుము. ఓవీరభారతమాతా, ధైర్యము విడనాడకుము! ఓ వీరభారతపుత్రా, ధైర్యము వీడకుము! 'నేను భారతీయుఁడను' అని గర్వింపుము! 'నేను భారతీయుడను, ప్రతి భారతీయుఁడును నా సహోదరుఁడు' అని సగర్వముగాఁ బ్రకటింపుము! 'అజ్ఞభారతీయుఁడు, దీనభారతీయుఁడు, బ్రాహ్మణభారతీయుఁడు, చండాలభారతీయుఁడు నా సహోదరుఁడు' అని ప్రకటింపుము. జీర్ణవస్త్రధారివగు — కటివస్త్రమాత్రధారివగు-నీవును సగర్వముగా నెలుగెత్తి యిట్లు ఘోషింపుము: 'భారతీయుఁడు నా సోదరుఁడు, నా ప్రాణములకుఁ బ్రాణము; భారతీయదేవతలే నా దైవతము; భారతసంఘము నా బాల్యడోలిక, యౌవననందనవనము, వార్ధకవారణాసి.' సోదరా, యిట్లు చాటుము: 'భారతభూమి నా శ్రేయము.' అహర్నిశము ఇట్లు ప్రార్థింపుము: 'ఓ మహేశ్వరా, ఓ లోకేశ్వరీ, నాకుఁ బౌరుషమును బ్రసాదింపుఁడు, నా దౌర్బల్యమును దొలఁగింపుఁడు, 'నన్ను ధీరునొనర్పుఁడు!'

# ప్రాక్పశ్చిమములందు శ్రీ వివేకానందస్వాముల ఆచార్యకము

## ఉపోద్ఘాతము

యోగిగా తత్త్వవేత్తగా దేశభక్తుడుగా వివేకానందస్వామిలో ఒక ప్రత్యేకత యున్నట్లే ఆధ్యాత్మిక గురువుగాను ఆయనలో అద్వితీయత కలదు. ఆయన ఉపదేశించునప్పుడు ఆయనలోని లోకోత్తరశీలము ప్రతిభయు వ్యక్తము లగుచుండెడివి. కాని ఆయన ప్రభావమునకు మూలము వీని యన్నింటికంటె వేఱైనది. ఆయన వాక్కును ఉపదేశములును ఆత్మసాక్షాత్కారసిద్ధి లోతులనుండి వెలువడినవి. కావున లోకసామాన్యమార్గమున వాని విలువను నిర్ణయించుట సాధ్యము కాదు. వివేకానందుని యాధ్యాత్మికశక్తి ఆయనకు పుట్టుకలోనే వచ్చినదని గురుదేవుడు శ్రీ రామకృష్ణుడు చెప్పియుండెను కదా. చేతనులకు ఉపదేశింపను వారి నుద్ధరింపను భువి నవతరించిన నిత్యసిద్ధుడు శ్రీ వివేకానందస్వామి. కావున ఆయన బోధనలనుండి వెలువడు వెలుగు సంశయాంధకారములను పటాపంచలు చేయగలిగి యుండెను. ఎట్టివారికిని విశ్వాసాపాదకమైన వాణి శ్రీస్వామీజీది. విశ్వాసముతోబాటు శ్రోతలలో అంతరపరిణామము గలిగెడిది. ఆచార్యత్వార్హత స్వామీజీకి దివ్యజన్మసిద్ధము. మానవుల చిత్తవృత్తులను చక్కగ

నర్థము చేసికొని వారి సమస్యలకు ఆయన చూపెడి పరిష్కారములు అమోఘములుగ నుండెడివి. "స్వామీజీ వాక్కులు ఆయననోట వెలువడి ముప్పదేండ్లైనవి. అవి తద్గ్రంథావళిలో వికీర్ణములై యున్నవి. కాని నేడు సైతము వాని నంటినప్పుడు విద్యుచ్ఛక్తి చేతంబోలె నా దేహము జలదరించుచున్నది. ప్రత్యక్షముగ స్వామీజీ నోటినుండి కణకణలాడు ఆ మాటలు విన్న శ్రోతలు ఎంత పరవశత నొందెడివారో, ఎంత ఉత్సాహతలూగెడివారో"- అని స్వామీజీ జీవిత చరిత్రకారుడైన రోమైరోలా చెప్పిన మాట అతిశయోక్తి కాదు.

ఆయన యుపదేశముల శక్తికి ముఖ్యకారణము ప్రగాఢాధ్యాత్మిక పరతయే ఐనను ఆయన వైదుష్యమును ప్రతిభయు విశ్వాసానుభూతియు పౌరుషమును ఆశక్తి కెంతయు సహకరించినవి. ఆధ్యాత్మిక పరతకంటె ఇవి పైకెక్కువగ కననగుచుండును. కావున అనేకులు ఆయనలోని ఆధ్యాత్మికపరతను గుర్తింపక వీనిని మాత్రమే గుర్తించిరి.

తన ప్రతిభచేత స్వామీజి అన్యులను వశపఱచుకొనిన రీతికి మదరాసు క్రైస్తవకళాశాల భౌతికశాస్త్ర ప్రవక్త శ్రీసింగారవేలు మొదలియారి కథయే యుదాహరణము. స్వామీజీ అమెరికాకు పోవుటకు ముందు పరివ్రాజకుడుగ మన దేశమున పర్యటించు చుండినప్పుడు ఆయనతో మదరాసులో సింగారవేలు మొదలియారుకు సమాగమ మొనగూడెను. తాను నాస్తికుడ ననియు యుక్తిని హేతువాదమును మాత్రమే ఆదరించువాడ ననియూ గర్వోక్తులాడుచు ఆయన స్వామీజీతో మతవిషయికమైన చర్చలో దిగెను. చర్చ ముగియునప్పటికి అతనికి హృదయ పరివర్తనము కలిగి వివేకానందుని శిష్యులలో అగ్రగణ్యు డయ్యెను. స్వామీజి అతనికి " " అను ముద్దుపేరు పెట్టి వేడుకకు "సీజరు 'వచ్చితిని చూచితిని వశపఱచుకొంటిని' అని పల్కెడివాడట. మన 'కిళి' వచ్చెను చూచెను వశపడెను" అని చెప్పుచుండువారు.

స్వామీజి శిష్యులలో సదానందుని చరిత్రమును పరికింతుమేని వివేకానందుని మానసికాధ్యాత్మిక శక్తులకంటె ఆయున డెందమున నిండి యున్న భూతదయ ఎట్లు ప్రజలను వశపఱచుకొనెడిదో స్పష్టమగును. సదానందునకు పూర్వాశ్రమ నామము శరచ్చంద్రగుప్త. అతడు ఉత్తర భారతమున హాత్రాసు అను చోట స్టేషనుమాస్టరుగ ఉద్యోగము చేయుచుండెను. పరివ్రాజకుడుగ పర్యటించుచుండిన స్వామీజీ ఆ స్టేషనులో దిగి ప్రశాంతముగ నొకచోట కూర్చుండి యుండెను. శరచ్చంద్రుడటువైపు పోవుచుండెను. కారుణ్యామృతమును నలువంకల వెదజల్లుచుండిన స్వామీజీ విశాలనేత్రములు మంత్రశక్తిచేతంబోలె అతని నాకర్షించెను. సంభాషణ కొన్ని నిమిషములే జరిగెను. స్టేషనుమాస్టరు స్వామీజీని తన విడిది కాహ్వానించెను. శరచ్చంద్రుడు పారసీక సాహిత్యమున గొప్ప పండితుడు. తన యాదరము నతడు హాఫీజు కవీంద్రుని వాక్యము నుదాహరించుచు ఇట్లు సూచించెను. "భళీ, ప్రియా, నీవు మాయింటికి వచ్చితివి. నాగుండెకండతో నీ కత్యంత రుచ్యమగు భోజనమును నేను సిద్ధపఱతును." స్వామీజీ అందుకు బదులుగా ప్రసిద్ధ వంగకావ్యము నుండి ఈ వాక్యము నుదాహరించెను. "నెమ్మోము చందురునికి విభూతి అలదుకొని· నా ప్రేయసి నన్ను సమీపింపవలయును." వెంటనే ఆయువభక్తుడు వెనుకకుపోయి తన ఆఫీసువేషమును తీసివేసి మోమున విభూతి యలదుకొని

వచ్చెను. అచిరకాలములోనే అతడు తన ఉద్యోగపదవికి రాజీనామా ఇచ్చి శిష్యుడై స్వామిజీ ననుగమించెను. అనంతర కాలమున సదానందుడు స్వామిజీని గూర్చి ఇట్లనెడి వాడు : ''మిత్రులారా, ప్రేమ ప్రేమ ప్రేమ అను మాటచేతనే తప్ప వేఱెట్లు ఆయనను నేను వర్ణింపగలను ?''

గురువైన స్వామిజీలోని పౌరుషముచే ఆకృష్టురాలై ఆయన సేవకు తన జీవితము నర్పించుకొన్న శిష్యురాలు అమెరికను మహిళ కుమారి జోసఫైను మెక్లియడు. స్వామిజీ ''వేదాంతము నిక్కముగ బలోపనిషత్తు.'' అనియు ''వేల్పులందఱికంటె మానవుడు పై మెట్టు వాడు''
కూర్చున్న శిష్యులతో ''మీ కిచ్చవచ్చిన దానిని గుఱించి ధ్యానింపుడు. నేను సింహ హృదయమును గుఱించి ధ్యానించెదను. అది బలము నిచ్చును'' అనియు – ఇటువంటి వాక్యములు పలికినప్పుడు ఈ యుపదేశము మెక్లియడు డెందమున గాటముగ నాటుకొనెను.

వివేకానందస్వాముల ఆచార్యకములోని విశేషములను తెలుపుటకు పైని చెప్పిన యుదాహరణములవంటి వానిని నూర్లకొలదిగ చెప్ప వచ్చును.

### శిక్షణ మొందినకాలము

నరేంద్రుడు శ్రీరామకృష్ణుని సాన్నిధ్యమున నుండినది ఇంచుమించు ఐదేండ్లకాలము. అది అతడు తర్బీదగుచుండిన కాలము. ఆధ్యాత్మిక గురువుగను అతడు రూపొందుచుండిన దప్పుడే. కాని తనలోని ఈ ప్రభావమును నరేంద్రుడు గుర్తించుకొనలేదు. శ్రీరామకృష్ణు డొకప్పుడు ''నరేను ప్రజలకు బోధించును'' అని యొక కాగితపు ముక్కపై వ్రాసెను. దానిని చదువుకొని స్వామిజీ ''అట్టి పనిని నేను చేయను'' అనెను. అందులకు ''ఆపనిని నీయెముక లే చేయును.' అని రూఢిగ పల్కెను. తన ముఖ్య సందేశహారిని అట్టి గురువుగ అగునట్లు శ్రీరామకృష్ణుడు తర్బీదుచేసెను.

వేలకొలది శ్రాంతక్లాంత ప్రజానీకమునకు చల్లని నీడ నొసగు బ్రహ్మాండమంతటి వట వృక్షమువలె నరేంద్రుని రూపొందించుటకు రామకృష్ణు డతనిని ఎన్నియో విధములుగ తర్బీదుచేసెను. శాస్త్రప్రతిపాదిత తత్త్వార్థముల ప్రగాఢజ్ఞానము మానవస్వభావమును గూర్చిన క్షుణ్ణమైన పరిచయము ఆత్యంతికమైన క్షాంతి అన్యుల నడవడుల దృక్పథముల పట్ల సమాదరము, తనకు సహజములైన సత్యపరత ధ్యానపరత విశుద్ధి యనెడి గుణముల పోషణము – ఇవి నరేంద్రుడు చెందిన తర్బీదులోని ముఖ్యాంశములు. గురుదేవుడు శిష్యుని పురోభివృద్ధిపై సదా కన్నుంచి అప్పుడప్పుడతడు అధిరోహించుచుండిన సమున్నతులను గుర్తించి తన సంతోషమును తెలుపుచుండెడివాడు. అప్పుడప్పుడు నరేంద్రునకును విజ్ఞానసంపన్నులగు పెద్దలకును సంవాద సంభాషణములు పొసగించి గురుదేవు డుభయపక్షముల వాదములను జాగ్రత్తతో పరికించుచుండెను. చర్చ ముగిసినప్పుడు గురుదేవుడు తఱచు నరేంద్రు నభిప్రాయములనే ఆమోదించెడివాడు. ఒక్కొక్కప్పుడు చర్చలు ఎంతసేపటికిని వగతెగక శ్రోతలు విసుగుకొన్నప్పుడు రామకృష్ణుడు ''ఈ చర్చలు ఎంతేని యావశ్యకములే'' అని వారిని మందలించెడివాడు.

అనంతరకాలమున శ్రీ వివేకానందస్వామి ''నాయుపదేశములలో జీవనప్రదమును లాభదాయకమునగు నంశ మేదేని ఉన్న అది నిజమునకు నాది కాదు. గురుదేవునొద్దనుండి

వచ్చినది’’ అని ఎన్నియోపర్యాయములు చెప్పియున్నాడు. స్వామిజీవంటి ఆధ్యాత్మిక మహాపురుషునకు ఈ వినయ మెంతయు నుచితమే. ఐనను గురుదేవుడైన రామకృష్ణుడు వివేకానందునిలో ఐక్య మొందె ననుట వాస్తవము. రామకృష్ణుడు తననిర్యాణమునకు మూడునాలుగుదినముల ముందు నరేంద్రుని తనచెంతకు పిలిచి అతనిపై చూపు నిలిపి గాఢసమాధి నిమగ్నుడయ్యెనట. అప్పుడు నరేంద్రున కొకశక్తిప్రవాహము తనలోని కెక్కుచున్నట్లుగ అనుభూత మయ్యెనట. అతడును సమాధి నిమగ్న డయ్యెనట. పిమ్మట బాహ్యాలోకస్మృతి కలిగి నరేంద్రుడు కన్ను తెఱచి చూచునప్పటికి గురుదేవుడు విలపించుచు కననయ్యెనట. ఆశ్చర్యపడి నరేంద్రుడు ఏల విలపించుచున్నా రని యడుగగా గురుదేవుడు “నరేను, ఈనాడు నా సర్వస్వమును నీకిచ్చి నేను పైసాలేని బిచ్చగాడను, ఫకీరనైతిని. నీలోనికి సంక్రమించినశక్తి మూలముగ నీచే మహాకార్యములు నిర్వర్తితములు కానున్నవి’’ అని బదులుపలెక్కనట.

## ఆచార్యక ప్రారంభము

శ్రీమన్నిఖిలానందస్వాముల ఆంగ్ల శ్రీరామకృష్ణవచనామృతమున “నిర్యాణానంతరము’’ అను శీర్షికగల 52-వ ప్రకరణములో ఆధ్యాత్మికగురువుగ రూపొందుచున్న యువవివేకానందుని చిత్రణము కలదు. అప్పటి కింకను బరానగరమునకు వెలుపలనున్నవారు వివేకానందు నెఱుగరు. రామకృష్ణుని నిర్యాణానంతరము అచట సమావిష్టులైన యువసన్న్యాసివర్గమునకు నరేంద్రుడు నాయకుడు. ధ్యానము ప్రార్థనలు పూజ మున్నగువానితోబాటు ఆ సన్న్యాసులు వివిధమతగ్రంథములను ప్రాశ్చిమత త్త్వశాస్త్రములను ప్ర... శాస్త్రమును పెక్కులౌకికవిషయములను గూర్చిన పరిశోధనలను నరేంద్రుని నాయకత్వమున సాగించుచుండిరి. తఱచు వివిధాధ్యాత్మికవిషయములను గూర్చి రంజకములైన చర్చలు చెల్లెడివి. సందేహములను అభిప్రాయభేదములను నరేంద్రుడు తీర్చుచుండెడివాడు. “ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ’’ (తనమోక్షము జగద్ధితము) అనెడి లక్ష్యద్వయమును అవలంబించిన రామకృష్ణసన్న్యాససంప్రదాయము అంతకుముందే పుట్టువొందినది, వివేకానందుని పర్యవేక్షణములో బలపడుచుండెను. రామకృష్ణుని నిర్యాణానంతరము సోదరశిష్యులకందఱికిని సుహృత్తును మార్గదర్శకుడును తత్త్వబోధకుడును యువవివేకానందుడే. రామకృష్ణుని గృహస్థశిష్యులుకూడ తఱచు మఠమునకు వచ్చుచు వివేకానందుని ప్రవచనములను ఆసానగ వినుచుండిరి. పైని పేర్కొనబడిన ప్రకరణములో గురువుగ రూపొందుచున్న నరేంద్రుని వర్ణనము ఇట్లున్నది :

“నరేంద్రుడు క్రొత్తకావిబట్టల దాల్చియుండెను. ఆబట్టల కావివన్నె అతని ముఖశరీరముల దివ్యకాంతితో మిళితమై యుండెను. అతని ప్రతిరోమకూపమును దివ్యజ్యోతిని వెదజల్లుచుండెను. అతని నెమ్మోమున ఔజ్జ్వల్యమును ప్రేమార్ద్రితయు కలిసియుండెను. సచ్చిదానందసాగరమున ఉద్బుద్ధమై గురుదేవుని సందేశమును వ్యాపింపజేయుటకై “మానవరూపము దాల్చిన బుడగవలె నరేంద్రుడు కననగుచుండెను. సకలప్రేక్షకులకును అత డేకైకలక్ష్యముగ నుండెను.’’ అప్పటికింకను నరేంద్రునివయస్సు ఇరువదినాలుగు సంవత్సరములే.

## పరివ్రాజకాచార్యుడు

యువవివేకానందునకు దేశమున పర్యటింపవలె నను తీవ్రాశ కలిగెను. మఠావరణమును

వీడి ఆయన విశాలభరతఖండమందలి వివిధ క్షేత్రముల ఉద్దేశించి బయలుదేరెను. పరివ్రాజకసన్న్యాసులవలె ఆయనయు పాదచారిగ చనుచు, ఇంటింటికేగి భిక్షాన్నము సేకరించి భుజించుచు దేవాలయముల నన్నిటిని దర్శించెను. శాస్త్రగ్రంథావలోకనమందును ధ్యానమందును ఆయన ఎక్కువకాలము గడపుచుండెను. ఆయన పర్యటనలకు మఱొక ముఖ్యోద్దేశము కూడ కలదు. దేశప్రజలజీవితమును వారి ఆశలను అడ్డంకులను సుఖములను కష్టములను ఆదర్శములను ఆశయములను ప్రత్యక్షముగ నెఱుగవలయు ననులే ఆయుద్దేశము. అన్నివర్గాలవారితోను ఆయనకు సమాగమ మొనగూడెను. ధనవంతులు దరిద్రులు పండితులు పామరులు అగ్రవర్ణములవారు నిమ్నవర్ణములవారు పెద్దలు పిన్నలు హిందువులు ముస్లిములు అందఱియందును ఆయనకు కుతూహలము సమానమే దేశప్రజలలో జాతి మతభాషాభేదములు ఎన్ని ఉండినప్పటికిని అన్నిటికిని అడుగున శతాబ్దములకొలది అవిచ్ఛిన్నముగ నుండు ఐక్యబంధమును గుర్తించి స్వామీజివిస్మితుడయ్యెను. భారతీయసంస్కృతికి గల ముఖ్యలక్షణములను దానిప్రాబల్యమును ఆచారములను ఆయన చక్కగ గుర్తించెను. ప్రజల పేదఱికమును నిరక్షరాస్యతను సాంఘిక దుర్దశను చూచినప్పుడు ఆయనగుండె బ్రద్దలయ్యెను. ఆధ్యాత్మికధ్యానముతోబాటు ప్రజల ఆర్థికస్థితిని బాగుపఱచుట ఎట్లో అను ఆలోచనయు ఆయన మనసున నిండెను. భారత ప్రజల సమస్యలను స్థితిగతులను క్షుణ్ణముగ నెఱుగుటకును వారికి తన సందేశమును రూపొందించుటకును స్వామీజీకి దాదాపు మూడుసంవత్సరములు పట్టెను.

1890 సంవత్సరము జూలైనుండి 1893 మే నెలవఱకు మూడేండ్లకాలము స్వామీజి కేవలము పరివ్రాజకసన్న్యాసిగామాత్రమేగాక తన మనసులో రూపుదాల్చిన నూతనసందేశమునకు ప్రచారకుడుగను దేశమున పర్యటించెను. ప్రాచీనభారతమహత్త్వమునం దాదరము, ఆత్మశక్తియందు ఘనవిశ్వాసము, ఉజ్జ్వల భవిష్యత్తున్న దనెడి ఆశాభావము, ప్రస్తుత దుఃస్థితికి కారకులైన క్రూరులనిరసనము, ఉన్న చెడుగులను సరిచేసి కొనవలె ననెడి విన్నపము — కాదు కాదు ఆనతి - ఇవి వివేకానందుని సందేశమున ముఖ్యాంశములు. విజ్ఞులు నుదారహృదయులు నగు సోదరభారతీయులను స్వామీజి "మీ జీవితములను భారతమాతృసేవకు అంకిత మొనర్చుకొను" డని హెచ్చరించెను. ఉత్తరభారతమునను రాజపుతాన గుజరాతు బొంబాయి బరోడా హైదరాబాదు మైసూరు రాజ్యములందును దక్షిణభారతమందలి ఇతరప్రాంతములందును ఆయన సంచరించెను. ఆధ్యాత్మికపరులను పండితులను ప్రభువులను సంపన్నులను ఎందఱినో ఆయన సందర్శించెను ఆధ్యాత్మికవిషయచర్చతోబాటు స్వామీజి భారతీయసంస్కృతిని వివరించి ప్రకృతము దేశపునరుద్ధరణమునకు కర్తవ్యము లేవో విశదీకరించెను. రాజకీయముగ దేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించువఱకు వేచియుండనక్కఱ లేకుండ అమలుపఱుపగలిగిన ప్రణాళికను స్వామి ప్రతిపాదించెను. ఆయనవాక్కును విన్న ప్రతివాడును ఉత్సాహపరవశు డగుచుండెను. ఆయనవ్యక్తిలో ఒకప్రభావమును వాక్కులో నొక చుఱుకును ఉండినవి. పతితులలో దరిద్రులలో ఆయన ఆశను ధైర్యమును నింపెను. సంపన్నులందును సానుభూతిని

"నిమ్నప్రజోద్ధరణము మన బాధ్యతయే" అనెడి ప్రబోధమును ఆయన కలిగించెను.

మదరాసులో కొందఱు యువకులు ఆయనచేత నెంతయు సమాకృష్టులై ఆయనకు భక్తులు అనుచరులు నైరి. వారిలో ఆయన దేశభక్తిని ప్రజాసేవాసక్తిని ఉద్దీపింపజేసెను. ఈ యువభక్తబృందమే భవిష్యత్తున స్వామీజి సాధింపనెంచిన కార్యములకు ముఖ్యబీజముగ పనివడెను. పాశ్చాత్యదేశమునుండి స్వామీజి వ్రాసిన లేఖలలో పెక్కులు ఈభక్తులకు వ్రాయబడినవే. స్వామీజి షికాగోలో జరుగనున్న విశ్వమతమహాపరిషత్తునకు పోవ నిశ్చయించుకొన్నప్పుడు ఈ యువశిష్యులు ఇంటింటి కేగి యాచించి ఆప్రయాణవ్యయమునకు వలసిన ధనమును సేకరించిరి. భారతప్రజల ప్రతినిధిగ తాను చనుచున్నందున అందుకు ధనమును సంపన్నులయొద్దకంటె సామాన్యుల యొద్ద నుండియే సేకరింపవలె ననుట స్వామీజి కోరిక.

అమెరికాకు పోవుటకుముందు స్వామీజి వేదిక లెక్కి యుపన్యసించియుండలేదు. తన్ను పరివేష్టించియున్న చిన్నచిన్న జట్లతో ఆయన ప్రసంగించుచుండెను. అమెరికాకు బయలుదేఱుటకు ముందు ఒక్కసారి కాబోలు హైదరాబాదులో స్వామి యొక యుపన్యాసమును కావించెను. ఉపన్యాసశీర్షిక: "పశ్చిమదేశములలో నాకార్యప్రణాళిక." దురదృష్టవశమున ఈ యుపన్యాసమునకు లేఖకులు లేనందున అది మనకు దక్కదాయెను. సంభాషణలప్పుడు స్వామీజివాక్కు శ్రోతలను మంత్రముగ్ధుల నొనర్చెడిది.

## పాశ్చాత్యదేశములలో ఆచార్యకము

అమెరికాలో స్వామీజి యాచార్యకము విశ్వమతమహాపరిషత్ప్రారంభమునకు నెలదినములకు ముందే ప్రారంభమైనది. ఆయన తెచ్చుకొన్న ధనము సన్నగిల్లుచున్నకొలది ఆయన బోస్టనునగరపరిసరములందు దినములు గడుపవలసివచ్చెను. అచటి ప్రజల సమూహముల యెదుట భారతదేశమునకు సంబంధించిన విషయముల ప్రసంగింప ప్రసక్తి కలిగెను. "స్వామి వివేకానంద ఇన్ అమెరికా - న్యూ డిస్కవరీస్" అను పేర మేరీలూయీబర్క్ వ్రాసిన గ్రంథములో ఎన్నో క్రొత్తవిషయములు కలవు. కావివన్నె యుడుపులును తలపాగను దాల్చిన స్వామిజీని రాజని కొంద అనుకొనిరి. ఐనను ఆయన యుపన్యాసములను శ్రోతలాసక్తితో వినెడివారు. ఆదినములలో అమెరికనుప్రజలలో సామాన్యులకు భారతదేశ మొక యంధకార బంధురదేశ మనుటకంటె వేఱేమియు తెలియదు. అమెరికను విద్వాంసులలో కొందఱు స్వామీజీకి మిత్రులైరి. ముఖ్యముగ ప్రొఫెస్సరు జాన్ హెన్రీరైటు స్వామీజీకి యావజ్జీవమిత్రుడును భక్తుడు నయ్యెను. అప్పటి వివేకానందుని ప్రసంగములలో తీవ్రభావపూరిత మొకటి కలదు. ప్రబలదేశములు దుర్బలదేశములను నేలబెట్టి కాలరాతురేని ఈ పాపఫలము వారిని కట్టి కుడుపక పోదని స్వామీజి బల్లగ్రుద్ది ఘోషించెను.

1893 సంవత్సరము సెప్టెంబరు 11-వ తేదీ నాడు వివేకానందస్వామి విశ్వమత మహాపరిషత్తులో మొదటిసారి హాజరగుటయు ఆనాడును అనంతర దినములందును ఆయన కావించిన యుపన్యాసములును ప్రాచ్యప్రవక్తగ అమోఘవాగ్మిగ ఆయనకు కలిగిన ఖ్యాతియు అందఱెఱిగినవే. విశ్వమత మహాపరిషత్సమావేశములు ముగిసినపిమ్మట కూడ స్వామీజి షికాగోలోనే రెండు నెల లుండెను. ఆహ్వానింపబడినచోట్ల ఉపన్యసించుచుండెను.

పాశ్చాత్యులనాగరికతలో తన మాతృదేశీయులు అనుసరింపదగిన మంచి యంశములను గూర్చిన పరిజ్ఞానమును గడించుచుండెను. అందుకు షికాగోలో సమృద్ధావకాశ మునుండెను. పిమ్మట ఒకానొక సంస్థ యాధ్వర్యమునను స్వతంత్రముగను స్వామిజీ మధ్య పశ్చిమమున దక్షిణమున ప్రాచ్యమున పెక్కు నగరములందు సంచరించి వేదాంతసత్యముల బోధించుచు ఉపన్యసించెను. 1894 వేసవిలో మెసాచెసెట్సులోని గ్రీనేకరు అను చోట నొక పరిషత్తునకు స్వామిజీ ఆహ్వానింపబడెను. అచ్చట ఆయన పెక్కు సమావేశములలో నుపన్యసించి శ్రద్ధాళువులగు సాధకులకు ధ్యానవిధానములను కఱపెను. ఈ కార్యక్రమమునుగూర్చి ఒక లేఖలో స్వామిజీ ఇట్లు వ్రాసెను. "ఈ మజిలీ ప్రజలు ఆరోగ్యవంతులుగను యౌవనవంతులుగను ఆస్థయు విశుద్ధియు కలవారుగను ఉన్నారు. వారికి నేను 'శివోహం' 'శివోహం' అను మంత్రమును కఱపితిని. అమాయికులును పవిత్రులును ధీరులు నగు వా రందఱును 'శివోహం' 'శివోహం' అను మంత్రమును వల్లించిరి. నేను సంతోషమును ఘనతను చెందితిని."

మతసహనమును గూర్చిన స్వామిజీ యుదారాశయమును, జీవుని యాధ్యాత్మిక పిపాసను ఆయన వివరించిన విధమును, అనుభూతికి వెలియైన కేవల సిద్ధాంతానుసరణమును, భౌతికాదిశాస్త్రముల సూత్రముల ననుసరించి ఆధ్యాత్మిక విషయములకు వెలకట్టుటయు దోషములని ధీరముగ ఆయన నిరూపించిన రీతియు – ఇవి అమెరికను శ్రోతలకు క్రొత్తవై నను రక్తి గొలిపినవి. వారు దాని నర్థము చేసికొని ప్రశంసించిరి. స్వామిజీకి అచట విరోధులునుండిరి, క్రైస్తవమత దురభిమానులు, స్వామిజీకి అచ్చట కలుగుచున్న జనప్రీతిని గని అసూయ చెంది తమ కలవడిన పెక్కు రీతులలో ఆయనను గూర్చిన దుష్ప్రచారములు గావించుచుండిరి. కాని స్వాముల 'సత్య' శతఘ్నిధాటకు వారి బూటకపు కోటలు నిలువలేవైనవి. క్రైస్తవులలో ఉదారహృదయులగు కొందఱు స్వామికి మిత్రులైరి.

అమెరికాలో స్వేచ్ఛావాదులు అజ్ఞేయవాదులు నాస్తికులు మున్నగు వారుకూడ స్వామిజీయందు ఈర్ష్యాళువులై ఆయనను భంగపఱుపగోరి ఒక సమావేశమున కాహ్వానించిరి. కాని అందు తామే స్వామిజీచే భంగమొందిరి.

ఉపన్యసించుచు దేశమంతట పర్యటనములు సాగించిన పిమ్మట శ్రీ వివేకానందస్వామి న్యూయార్కునగరమున ఆఱు నెలలకాలము నిలుకడగ నుండెను. అప్పుడు సమాగమములు సంభాషణములు పాఠబోధనములు చాల చుఱుకుగ సాగినవి. శ్రద్ధాళువులగు సాధకులకు కొందఱికి సాధనలను స్వామిజీ కఱపెను. 1895 సంవత్సర మధ్యమప్పటికి స్వామిజీ రాజయోగ మనెడి గ్రంథమును పూర్తిచేసి ప్రచురించెను. అది మహాజనుల నందఱిని ఆకర్షించినది. అట్లు సమాకృష్టులైన వారిలో ముఖ్యులు అమెరికను తత్త్వవేత్త ప్రొఫెసరు విల్లియము జేమ్సు, రష్యను ప్రముఖుడగు కౌన్టు లియో టాల్స్టాయి.

సహస్రద్వీపారామమున (థౌసండ్ ఐలెండ్ పార్కు) స్వామిజీ రెండు నెలలకాలము శ్రద్ధాళువులై యాంతరంగికులైన శిష్యులు కొందఱితో గడపి వారిని ఆధ్యాత్మికజీవితమున తర్ఫీదు చేసెను. అప్పుడు వారి కాయన కావించిన బోధనలు "దివ్యవాణి" (ఇన్స్పైర్డు టాక్సు) అను పేర మనకు లభ్యములై

యున్నవి. డిట్రాయి నగరమున స్వామీజీ ప్రవచనములను విని ఆయన ...లైన వారిద్దఱు ఈ ఆరామమునకు ఇంచుక యాలస్యముగ వచ్చిరి. అందొకరిట్లనిరి. "జీసస క్రైస్తు భువియందున్నచో ఎట్లు ఆయనయొద్దకు పోయెడివారమో ఉపదేశింప కోరెడివారమో అట్లు మీయొద్దకు వచ్చి ఉపదేశింప మిమ్ము కోరుచున్నాము" అందుకు స్వామీజి "మీకు విముక్తి చేకూర్చ క్రైస్తుదేవుని శక్తి నాకుండరాదా" అనెను.

స్వామీజి అమెరికాలో అడుగుపెట్టి రెండేండ్లు దాటినవి. జిజ్ఞాసువులకు భారతీయాధ్యాత్మికవిజ్ఞానమును కలిపెను. అమెరికనులు సాంఘికముగను యంత్రవిద్యలందును గడించిన యభివృద్ధులను తానును నేర్చుకొనెను. ప్రాచ్యులకును పాశ్చాత్యులకును పరస్పరవిజ్ఞానవినిమయము ఆలాగు సాగుచుండవలెననుట స్వామీజీచితము. వేదాంతబీజమును ఆంగ్ల సామ్రాజ్యరాజధానిలో నాటవలెననెడి కుతూహలము స్వామీజీ కెంతగనో యుండెను. కావున 1895 ఆగస్టునెలలో లండను నగరమునకు చేరుకొనెను. ఇచ్చటను అమెరికాలోవలె ప్రముఖులసమాగమములు సంవాదములు ప్రవచనములు సాగినవి. తన సందేశమును ఆంగ్లేయులు ప్రతిగ్రహించినరీతి స్వామీజీకి సంతృప్తికరముగ నుండెను. 1895 నవంబరు 18-వ తేది ఒకభక్తునికి స్వామీజి ఇట్లు వ్రాసెను: "ఇంగ్లండులో నాపని ఉజ్జ్వలముగ సాగినది, నాకే ఆశ్చర్యము కొలిపినది. ఆంగ్లేయులు పత్రికాడంబరము చేయరు గాని కార్యములను నిశ్శబ్దముగ సాధింతురు. అమెరికాలోకంటె ఇంగ్లండులో నాపని ఘనతరముగ నెఱవేఱినదని నా నమ్మకము. ఇంగ్లండులో స్వామీజి సుమారు మూడునెల లుండెను. కుమారి మార్గరెట్టు ఈ నోబుల్ అను మహిళతో స్వామీజీకి కగిలిన పరిచయము స్మరణార్హము. ఈమెయే అనంతరకాలమున సోదరి నివేదిత యను పేర స్వాములవారి పాశ్చాత్య శిష్యురాండ్రలో అగ్రగణ్యయై భారతదేశ సేవకు తనజీవితము నంకితము చేసికొనినది.

1895 డిసంబరు ప్రారంభములో శ్రీ వివేకానందస్వామి న్యూయార్కు నగరమునకు మరలి అమెరికాలో కార్యక్రమములో మరల నిమగ్నుడయ్యెను. అప్పుడచ్చట ఆయన కావించిన ఉపన్యాసములు అనంతరకాలమున కర్మయోగము భక్తియోగము అను పేర్లతో గ్రంథములుగ ప్రకటితములైనవి. 1896 ఫిబ్రవరిలో స్వామీజీ న్యూయార్కు నగరమున వేదాంతసొసైటీని ప్రారంభించెను. "దుర్గ్రాహ్యమైన అద్వైతవేదాంతమును ఆంగ్లభాషలో సుగ్రహముగునట్లు అందజేయుట ఎంతటి నియో అందుకు పూనుకొన్నవారే గ్రహింపగలరు. ఇదే నా జీవితకార్యము. ఇందు నేనెంతవఱకు నెగ్గగలనో భగవంతునకే ఎఱుక అని స్వామీజి వ్రాసెను.

ఆంగ్లేయమిత్రులు స్వామీజీకి మరల మరల ఆహ్వానము లంపుచున్నందున 1896 ఏప్రిల్ నెలమధ్యలో ఆయన మరల ఇంగ్లండునకేగెను. అమెరికాలో ఆయన యుండిన కాలము మొత్తము రెండున్నరసంవత్సరములు. ఆ స్వల్పకాలములో ఆధ్యాత్మికగురువుగా స్వామీజి అద్భుతములను సాధించెను. వేలకొలది మహిళలును మగవారును భారతదేశ సందేశము నాలకించిరి. అందు బద్ధాదరులైరి. వారిజీవితములో స్వామీజి గొప్పపరిణతిని కలిగించెను. నిజమునకు అమెరికాకును భారతదేశమునకును ఈ సన్న్యాసి సేతువును నిర్మించినవాడాయెను. 1899 ఆగస్టులో స్వామీజి

అమెరికాకు రెండవపర్యాయము పోయినప్పుడు ఆ సేతువు నింకను బలపఱచెను. సాన్‌ఫ్రాన్సిస్కోలో వేదాంతసొసైటీని స్థాపించిన దప్పుడే.

లండను నగరమునకు రెండవ పర్యాయము చనినప్పుడు స్వామీజి కావించిన యుపన్యాసములే అనంతర కాలమున జ్ఞానయోగ మను పేర గ్రంథముగ ప్రకటితమైనది. శ్రోతలలో ప్రశ్నలు వేసి చిక్కుపఱచువా రుండెడివారు. కాని వారిని నిరుత్తరులను చేయగల సమయస్ఫూర్తికి స్వామీజీయొద్ద కొదువ లేదు. ఒక శ్రోత "స్వామీ, మీ యుపన్యాసము మహోజ్జ్వలముగ నుండినది. కాని క్రొత్తవిషయమును దేనినిగాని మీరు చెప్పలేదు" అనెను. అందుకు స్వామి చెప్పిన జవాబు. "నేను మీకు చెప్పినది సత్యమును. సత్యము దేవునివలె సనాతనమైనప్పటికి నిత్యనూతనమైనది. మీ యాలోచనలను రెచ్చగొట్టి సత్యమున కనుగుణముగ జీవితములు గడపునట్లు నేను కావించియుంటినేని నా ప్ర గము సార్థకమే కదా." స్వామీజి పల్కిన ఈ ప్రత్యుత్తమును సదస్యులు కరతాళమహారవముతో ఆమోదించిరి.

ఇంగ్లండుకు రెండవ పర్యాయము పోయినప్పుడు స్వామీజిని సుప్రసిద్ధసంస్కృతపండితుడును భారతీయవిజ్ఞానవేత్తయు జర్మనుదేశీయుడునగు ప్రొఫెస్సరు మాక్సుముల్లరు ఆక్స్ఫర్డులోని తన భవనమున కాహ్వానించెను. ఆయననుగూర్చి స్వామీజి అనంతరకాలమున ఇట్లు వ్రాసెను. "ఆయన నాకు భాషాతత్త్వవేత్తగా గాని పండితుడుగా గాని కనిపింపలేదు. విశ్వముతో తన యైక్యమును సాక్షాత్కరించుకొన్న ఆత్మగా ఆయన నాకు గోచరించినాడు...ఆయనకు మనదేశముపై నున్న ప్రేమలో ఒక నూఱవవంతైనను నా కుండ కూడదా. ఆయన మనస్సు అసాధారణమైనది. అమితమైన చుఱుకు గలది. ఏబదేండ్లకాలము భారతదేశమునుగూర్చిన తలంపులనెడి జగత్తులో ఆయన మెలగెను సంచరించెను. అనంతమును గహనమునగు సంస్కృతసారస్వతమున వెలుగునీడల పరభాగమును గుర్తించెను. వానియందలి గాఢాసక్తిచేతను హృదయపూర్వకప్రేమచేతను అవి ఆయన ఆత్మలోనికిదిగి ఆయనజీవితసామస్త్యమునకు వన్నెగూర్చెను

ఆగస్టులో స్వామీజి స్విట్జర్లండు జర్మని హాలండు దేశములలో పర్యటించెను. జర్మనీలో ప్రొఫెస్సరు పాల్ డాసన్ అనెడి సుప్రసిద్ధ ప్రాచ్యవిజ్ఞానవేత్తతో స్వామీజి కలసికొనెను. స్వామీజియం దతడెంతయు సమాదరపూర్ణుడాయెను.

1896 డిసంబరు నెలమధ్యలో వివేకానంద స్వామి ఇంగ్లండునుండి భారతదేశమునకు బయలుదేఱెను. ఆంగ్లేయమిత్రులును భక్తులును ఆయనకు విభవోత్తరమైన వీడ్కోలు గౌరవమును కావించిరి. ఆధ్యాత్మికగురువుగ ఆంగ్లేయులచిత్తమున స్వామీజి ముద్రితుడైన రీతిని కుమారి మార్గరెట్టునోబుల్ ఈలాగు వర్ణించెను. "మాలో అనేకులకు స్వామీజి సందేశము మిక్కుటముగ దప్పిగొన్నవానికి చల్లనినీరువలె పరమనిర్వృతికరముగనుండెను. యూరపులో గడచిన యర్థశతాబ్దము మతవిషయికమైన నిర్వేదమును సందేహమును పొటకట్టియుండెడివి. క్రైస్తవసిద్ధాంతములలో విశ్వాసము మాకు సాధ్యము కాలేదు. మా మతములో నిజ మనెడి బీజమును కప్పియుండిన సిద్ధాంతాలపొట్టును ఊడదీయుటకు ఇప్పుడు మాచేతనున్న పరికరము వంటిది, అప్పుడు మాకు లేదాయెను. ఇట్టి మా తలంపులకు వేదాంతము నిరూపకముగ లభించినది. "సోఽహం" (దేవుడునేనే) అని స్వామీజి

చెప్పినప్పుడు అది ఇంతకు మును ఎప్పుడును చెప్పబడని దైనను సదా తెలిసిన విషయమే అనిపించెను. ఐనను మునుపటి అనుభూతుల కెల్ల యుక్తిసహాతను సమకూర్చుటకును సేవాతృష్ణ కొక సమర్థనమును అందించుటకును విశ్వమానవైక్యమునుగూర్చిన జ్ఞాపనము ఆవశ్యక మాయెను. పూర్వులనుండి మనకు సంక్రమించిన ఒక్క మహాధనాగారమునకే ఒకరొకమార్గమునను మఱొకరు మఱొకమార్గమునను గా అందఱమును ప్రవేశించితిమి. ఈ విషయము మాకు తెలిసివచ్చినది.

ఆంగ్లేయులతో ప్రత్యక్షముగ కలసిన పిమ్మట స్వామీజికి వారినిగూర్చిన అభిప్రాయములు పూర్తిగా మార్పొందినవి. కల్కత్తాలో నొక ఉపన్యాసములో స్వామీజి ఇట్లనెను. "ఇంగ్లండును మెట్టినవారిలో ఎవరికిగాని ఆంగ్లేయులపై మొదట నా కుండినంత ద్వేషము ఉండి యుండదు......వారిపై నిప్పుడు నా కున్నంత ప్రేమయు ఎవరికి ఉండదు......ఇన్ని జాతులలో ఆంగ్లజాతినే భగవంతు డేల ఎక్కువగ అనుగ్రహించెనో ఇప్పుడు నా కర్థమగుచున్నది. ఆంగ్లేయులు స్థైర్యార్జవసానుభూతిపూర్ణులు. పైని కాఠిన్యపుపొర యొకటియున్నది. దానిని తొలగించినచో ఆంగ్లేయులు మీ కాత్మీయులు. ప్రపంచమున అన్నిజాతులలోను ఈర్ష్యాగంధమైనను లేనివారు ఆంగ్లేయులు. ప్రపంచమున అగ్రస్థానమును వా రధిష్ఠించుట కదే కారణము. వారివిద్యావిధానమంతయు మనోభావములను కప్పిపుచ్చుకొనుటను నేర్పును. ఆంగ్లేయుని డెందమున ప్రవేశమొంద నేర్చితివేని అతడు నీకు యావజ్జీవ మిత్రు డగును."

1896 జూలై 6 వ తేది యొకజాబులో స్వామీజి ఇట్లు వ్రాసెను: "ఆంగ్లేయసామ్రాజ్యమున ఎన్ని లోపములైనను ఉండవచ్చును గాని ఆశయముల ప్రచారమునకు ఇంతకు మున్నెన్నడును లేని మార్గముగా ఆంగ్లసామ్రాజ్యము పనివడినది. నా ఆశయములను ఈ సామ్రాజ్యయంత్ర కేంద్రమున చొప్పించితినేని అవి విశ్వవ్యాపములై తీరును." 1899-1900 సంవత్సరములో పాశ్చాత్యదేశములకు రెండవ పర్యాయము పోయినప్పుడు యూరపులో సుమారు నాలుగు నెల లుండెను. ఎక్కువ కాలము ఫ్రాన్సుదేశములో నుండెను. పారీసు నగరములో జరిగిన మతచరిత్రపరిషత్సమావేశములలో రెండుపర్యాయము లుపన్యసించెను. అనేకప్రముఖులతోడి పరిచయమును గడించెను.

## భారతదేశమున ఆచార్యకము

పాశ్చాత్యదేశములనుండి మరలి స్వామీజి భారతదేశమున దక్షిణపుకొసనుండి ఉత్తరపుకొసవఱకును తూర్పుసముద్రతీరమునుండి పడమటిసముద్రతీరమువఱకును ఉపన్యసించుచు పర్యటించినప్పుడు ప్రజలు ఆయన కేవలము దేశభక్తవీరుడను ధీరసంస్కర్తయు మాత్రమే కా డనియు సనాతనపరంపరకు చెందిన భారతీయ మహర్షిపుంగవు డనియు గుర్తించిరి. నాలుగుసంవత్సరములకు మునుపటికిని ఇప్పటికిని స్వామీజిలో ఎంతో మార్పు కనిపించెను. నాలుగేండ్లకాలము పాశ్చాత్యదేశములలో నిర్విరామముగ సాగించిన అతిమానుషకార్యభారముచే ఆయన దేహము శ్రాంతిదౌర్బల్యముల కగ్గమై యుండెను. కాని అమెరికా యూరపులలో కలిగిన యనుభూతులచేతను పరిశోధనలచేతను ఆయనమనస్సు మఱింత చుఱుకు గల దయ్యెను. హృదయము విశ్వవిశాల మయ్యెను. విశ్వమంతయు స్వకుటుంబముగ భావించు నౌదార్యశోభ ఆయనలో

కన నయ్యెను. నాలుగేండ్లకు మునుపు ఆయన భారతదేశగురువు, ఇప్పుడో, జగదాచార్యుడు.

భారతదేశభవిష్యత్తును గురించిన దృఢ విశ్వాసము స్వామీజి కుండెను. మునుపటి కన్న నెంతయు గొప్పదానినిగ భారతదేశమును [illegible] పల్లవి, ఐనను ఏసమస్యను గాని ప్రపంచము నంతటిని మనసులో నుంచుకొని పరిష్కరింప జూడవలె ననుట ఆయన యుపదేశము. ఒక్క యణువును లాగినను ప్రపంచమంతయు కదలిపోవును. ప్రపంచమునంతటిని కలుపుకొన కున్నచో నిజమైన పురోభివృద్ధి యుండదు. ఏ సమస్యకుగాని దేశీయజాతీయసంకుచిత దృక్పథ ముతో చూచినచో పరిష్కారము కుదర దనుట నానాటికి మరింతస్పష్ట మగుచున్నది. ఏ యాశయమైనను సరే ఏ యభిలాషమైనను సరే మానవతతినంతటిని తనలో నిముడ్చు కొనగల విశాలత బొందవలెను.

పూర్వ మజ్ఞాతపరివ్రాజకసన్న్యాసిగ పర్య టించుచు స్వామిజి తన దేశప్రజల కందించిన సందేశములో ఏచురుకు ఏపరిజ్ఞాన ముండినవో ఇప్పు డాయన యందజేయుచున్న సందేశము లోను ఆ చురుకును ఆ పరిజ్ఞానము నట్లే యున్నవి. కాని ఇప్పుడందులో అసాధారణ మైన పరిపాకమును ఉత్తేజకతయు ప్రామాణి కతయు నున్నవి. జీసస క్రైస్తవలెనే స్వామి జియు వెలియింపవచ్చునే గాని మాయింప రాలేదు. ఆయన పద్ధతులు ప్రేమయు సాను భూతియునే కాని దోషోద్ఘాటనాసహనములు కావు, ఆశాభావ సంఘీభావములే కాని ద్వేష విధ్వంసనములు కావు. ఆధ్యాత్మికపరతయే మన దేశశరీరనాళములలో ప్రవహించు రక్త మని గుర్తించి స్వామిజి దానికి పుష్టి గూర్చి దేశసంజీవన మొనర్పగోరెను. కేవలము బాహ్యాచారములతో తృప్తిపడక శాస్త్రముల అంతరార్థము నెఱుగుడని స్వామిజి దేశీయులను హెచ్చరించెను ఎఱిగినచో దేశీయాదర్శము లకును ప్రవర్తన విధానములకును ఒక క్రొత్త ప్రాముఖ్యము గల్గును, దేశ మనశ్శరీరముల కొక క్రొత్తబలము చేకుఱును, అది అచిర కాలములోనే వినూత్నోద్యములలో వెలు వడును. దక్షిణ భారతదేశమున నొక శివా లయమున వేలకొలదిగ సమావిష్టులైన ప్రజ లను స్వామిజి ఇట్లుబోధించెను :- "దీన-దుర్బల-రుగ్ణప్రజలందు శివుని సాక్షాత్కరించు కొన్నవాడే నిజముగ శివారాధకుడు. విగ్రహ మునమాత్రమే శివు డెవనికంటికి గోచరించునో అతని యుపాసన మింకను ప్రారంభదశలోనే యున్న దన్నమాట. జాతివర్ణ మతాదిభేదము లను సుంతయు పాటింపక దీనమానవునందు శివునే సాక్షాత్కరించుకొని అతని కెవడు తోడ్పడునో సేవచేయునో అతడే కేవల విగ్రహా రాధకునకంటె శివున కధికప్రియుడు."

స్వామిజి కఱపిన మఱొకపాఠము దానము చేయుడని. తపోయజ్ఞాదులు నిరవకాశములైన యీ కలియుగములో అనుష్ఠింపదగిన ధర్మము దానమే. అదే యీ యుగధర్మము.

విశ్వమంతట వ్యాప్తమై యున్న ఆత్మ ఒక్కడే అనెడి వేదాంత పరమార్థమున కెంతయు అనుగుణమే ఈ ప్రజాసేవోపనిషతు అనుట స్వామిజి యభిప్రాయము. వేదాంత మీలాగు బోధించుచున్నది—'సర్వం ఖల్విదం బ్రహ్మ - ఈ విశ్వమంతయు బ్రహ్మమే కదా' (ఛాందోగ్యోపనిషత్తు 3-14-1) 'భూతేషు భూతేషు విచిత్య ధీరాః ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవన్తి' 'ఒక్కొక్క భూతమందును ఆత్మను సాక్షాత్కరించుకొన్న ధీరులు ఈ లోకము వీడి అమృతులగుదురు' (కేనోపని

షత్తు II-5) 'బ్రహ్మై వేద మమృతం పురస్తా ద్బ్రహ్మ పశ్చా ద్బ్రహ్మ దక్షిణత శ్చోత్తరేణ అధ శ్చోర్ధ్వఞ్చ ప్రసృతం బ్రహ్మై వేదం విశ్వ మిదం వరిష్ఠమ్.' 'మన కెదుట నున్న దెల్ల అమృతస్వరూపమగు బ్రహ్మమే; వెనుక వైపున్నదియు బ్రహ్మమే, కుడియెడమవైపులం దున్నదియు ఊర్ధ్వాధోదిశలం దున్నదియు సర్వత్ర వ్యాప్తమై యున్నదియు బ్రహ్మమే' (ముణ్డకోపనిషత్తు 2-2-11) 'త్వం స్త్రీ త్వం పుమా నసి త్వం కుమార ఉత వా కుమారీ త్వం జీర్ణో దణ్డేన వఞ్చసి త్వం జాతో భవసి విశ్వతోముఖః' 'నీవు స్త్రీవి, నీవు పురుషుడవు, నీవు కుమారుడవు, కుమారివియు నీవే, చేతికఱ్ఱ పట్టుకొని తొట్రుపడు వృద్ధుడవు నీవే, అన్ని వైపుల మోముతో పుట్టువొందిన వాడవు నీవు (శ్వేతాశ్వతరోపనిషత్తు IV-3). ఉపనిషత్తులలో ఇటువంటి సూక్తులు నూర్లకొలదిగ నున్నవి. ఏకత్వబోధకములగు నీయుపదేశములు గ్రంథములలోను ఋష్యాశ్రమముల లోను మాత్రమే అణగియుండుట అవమానకరమనియు, దేశోద్ధరణమునకు వానిని వినియోగించుకోవలె ననియు స్వామిజి ఘోషించెను. వాని నమలుపఱచుటనే స్వామిజి అనుష్ఠాన వేదాంత మని పేర్కొనెను. మానవునినుండి మానవుని చీలదీయు నాశయముల నన్నిటిని త్రోసిరా జనవలయును. రుగ్ణులను దీనులను అజ్ఞులను పీడితులను అందఱిని పరమాత్మని ప్రత్యక్షరూపములుగ భావింపవలయును. శాస్త్రగ్రంథములందు మనకు ప్రామాణికబుద్ధి యున్నచో ఇన్నాళ్లవలె కాక మానవుని గౌరవింపవలయును. స్వామిజి సంఘనాయకులకును దేశోద్యమనిర్వాహకులకును నెదుటబెట్టిన ప్రజోద్ధరణప్రణాళిక ఇది: "హాలికుని కుటీరములోనుండి, బెస్తల మాదిగవాండ్ర వీథులూడ్చువారల గుడిసెలనుండి, చిల్లరసామానులమ్ముపారల అంగళ్లనుండి, కమ్మరుల కొలుముల పార్శ్వములనుండి, కర్మాగారములనుండి, సంతలనుండి, బజార్లనుండి, తోటలనుండి, అడవులనుండి, గుట్టలనుండి, కొండలనుండి వినూతన భారతము సమున్నతి నొందును గాక" అన్నారు.

ఉపనిషత్తులనుండి గ్రహించి స్వామిజి కఱపిన మఱి రెండు పాఠములు-'అభీః' = భయరహితత్వము, శ్రద్ధా = ఆత్మవిశ్వాసము. పెంపు వ్యక్తికి కలిగిననే సంఘమునకును గలుగు నని ఆయన నొక్కి చెప్పెను. "మనకు కావలసినది మనలను మానవులనుగా రూపొందించు మతము, మనకు కావలసినది మనలను మానవులనుగా రూపొందించు విద్యావిధానము మనకు కావలసినది మనలను మానవులనుగా రూపొందించు సిద్ధాంతములు. సత్యమా కాదా అనుట కిదే పరీక్ష. శారీరకముగను మానసికముగను ఆధ్యాత్మికముగను ఏదేది నిన్ను దుర్బలు నొనర్చునో దాని నెల్ల విషమును పాఱవేసినట్లు పాఱవేయుము. అందులో జీవము లేదు. అది సత్యముగ నుండుట పొసగదు. బలకరమైనదే సత్యము, విశుద్ధమైనదే సత్యము, సత్యజ్ఞతయే సర్వజ్ఞత."

పెక్కుపన్యాసములలో స్వామిజి భారతదేశమందలి మతములకును సిద్ధాంతములకును గల సామరస్యమును స్పష్టమొనర్చెను. ద్వైతాద్వైతవిశిష్టాద్వైత సిద్ధాంతానుసారులకు శతాబ్దములుగా సాగుచున్న కలహములు అప్రసక్తము లనియు దేశీయసంఘీభావభంజకము లనియు స్వామిజి యభిప్రాయము. ఆధ్యాత్మికాధిరోహణమున ఆ సిద్ధాంతములు వివిధ దశలు. కావున అన్నియు అంగీకార్యములే. శాస్త్రగ్రంథముల యర్థమును సరిగా గ్రహిం

జేయుటకు స్వామీజీ తఱచు మతసామరస్య మునకు మూర్తీభావమైన రామకృష్ణగురుదేవుని దివ్యజీవితమును ఎత్తి చూపుచుండుచు. పాశ్చాత్యదేశములలో నుండగా స్వామీజీ ప్రసంగములలో గురుదేవుని పేరు చాల నరుదుగ కన్పించెడిది. భారతదేశమునకు మరలిన పిమ్మటనవ్యభారత నిర్మాణమును కలుపునప్పుడు స్వామీజి శ్రీరామకృష్ణుని ప్రాముఖ్యమును విశేషముగ నుపన్యసించుచుండెను కల్కత్తాలో నొక సభలో ఇట్లనెను: ''శపథపూర్వముగ చెప్పుచున్నాను. ఈ దేశమునకు సమున్నతి కలుగవలయుననిన అందఱును సోత్సాహులై శ్రీరామకృష్ణుని దివ్యనామము నవలంబింపవలయును.''

తనశిష్యులలో, భారతీయులను పాశ్చాత్యులను వారి వారి జీవితములచే ''ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ'' (తనవిము క్తి విశ్వశ్రేయము) అనెడి లక్ష్యద్వయమును సాధింపగలుగు రీతిలో సుశిక్షితుల నొనర్చెను. ఉభయవర్గశిష్యులకును శిక్షణవిధానము భేదిల్లక తప్పదు. ఉభయవిధానములలోను స్వామీజీ నిష్ణాతయే. పాశ్చాత్యదేశములలో స్వామీజి నెరపిన ఆచార్యకమును గూర్చిన అద్భుతవిషయములు సోదరి నివేదిత వ్రాసిన ''నేను కన్న గురుదేవుడు'' (ది మాస్టర్ ఆస్ ఐ సాహిమ్) అను గ్రంథములో తెలియనగును స్వామీజికి శిష్యులై తమ జీవితములను భారతదేశసేవకు అంకితము చేసికొన్న పాశ్చాత్యులలో ప్రముఖులు సోదరినివేదిత, కుమారి జోసెఫైను మెక్లియడు, శ్రీమతి సారాబుల్, కుమారి హెన్రైటా ముల్లరు, శ్రీమతి గ్రీన్ స్టైడల్ (సిస్టరు క్రిస్టిన్), శ్రీ జేజేగుడ్విను, కేప్టెను సేవియరు, శ్రీమతిసేవియరు. వీరి నామధేయములు అవిస్మరణీయములు.

---

పాశ్చాత్యదేశములందుండగా భారతదేశమునుగూర్చిన జ్ఞప్తి స్వామిజి మనస్సునుండి యెన్నడును తొలగలేదు భారతదేశమున తాను చేయనెంచియున్న పనులనుగూర్చి సోదరశిష్యులకును మిత్రులకును అనుచరులకును జాబులు వ్రాయుచునే యుండెను. అట్లే, భారతదేశమునకు మరలివచ్చిన పిదప ఇంగ్లండమెరికాలలో సాగుచున్న కార్యక్రమాలను గూర్చి విచారణలు చేయుచునే తోడ్పడుచునే యుండెను. ఆయన యాజ్ఞానుసారము సమర్థులైన ముగ్గురు సోదరశిష్యులు శ్రీఅభేదానంద-శారదానంద-తురీయానందస్వాములు వేదాంత ప్రవక్తలుగ పాశ్చాత్యదేశముల కరిగి తమ వైదుష్యముచేతను విశుద్ధశీలముచేతను అచటి మిత్రుల డెందముల దక్కగొనిరి.

అమోఘదీర్ఘదర్శియు జగదాచార్యుడునైన శ్రీ వివేకానందస్వామి ప్రాక్పశ్చిమములకు సంధాతయయ్యెను. భారతదేశమునుగూర్చియు అన్యదేశములను గూర్చియు స్వామిజి చెప్పినవి అప్పటివారి మనస్సుల కందకపోయినను అనంతరకాలమున నిజములైనవి కావున ప్రాక్పశ్చిమము లన్యోన్యము సహకరించుకొనుచు కలిసి మనగలవని ఆయన చెప్పినమాట సత్యదూరమనియు అహంకారగర్భమనియు భావింప నవకాశము లేదు. ప్రాక్పశ్చిమముల కన్యోన్యము సహకరించుకోవలసిన బాధ్యతయు గలదు, అందుకు వలసిన శక్తియుక్తులును గలవు. ఒకరి కన్న నొకరు ఎక్కువయని గర్వించుటో తక్కువయని తలవంపు చెందుటో తగదు. ప్రపంచము పుట్టిననాటినుండి పురోభివృద్ధికి సాధకములు ఇచ్చి పుచ్చుకొనుటలే. ప్రాచ్యులును పాశ్చాత్యులును మెలకువ జెంది ఆధ్యాత్మిక సౌభ్రాత్రమున కుదురుకొని విశ్వమానవ సంక్షేమమును సమకూర్తురుగాక. నవయుగాచార్యుడు శ్రీ వివేకానందస్వామి మనల దీవించుచున్నాడు.

## 72

రామకృష్ణ అద్వైతాశ్రమము,
లుగ్సా, వారణాసి,
20 నవంబరు 1916.

అత్యంతప్రియ—,

నీ జాబిచ్చటికి చేరినది. కొన్నాళ్ళుందమని ఇచ్చటికి వచ్చియున్నాను. త్వరలోనే మఠము నకు మరలెదను. ఉన్న యుపదేశమొక్కటే అని తెలిసికొనుము. ఏదనగా ఇదే: యుగావ తారమూర్తియు, కరుణాసాగరుడును, పతిత జనోద్ధారకుడును భక్తవరదుడును అశరణ్య శరణ్యుడునగు శ్రీరామకృష్ణుని శరణుజొచ్చి తివి. ఇక వెతజెందవలసిన యగత్యము నీకు లేనేలేదు.' నీవు ఆయనను 'దేవా, మానవుల నుద్ధరించుటకు నీవు మానవదేహమునుదాల్చి తివి. నాకు జ్ఞానములేదు. తెలివిలేదు, భక్తి లేదు. శ్రద్ధలేదు. నాపై కనికరింపుమా' అనుచు ప్రార్థింపుము. శిశువువలె విలపించుచు నీలాగు ప్రార్థింపుము. ఇంకను ఇట్లనుము: 'దేవా, నేను నీ ప్రత్యక్షశిష్యులను శరణు జొచ్చినను నిన్ను శరణుజొచ్చినను ఒకటే. కావున నన్ను దయజూడుము'. ఈలాగు ప్రార్థిం పుము. నీకు మనశ్శాంతి కలుగును. నిర్వృతి కలుగును. నీవే ప్రత్యక్షముగ చూతువు. నా హృదయపూర్వకాశీస్సులను స్వీకరింపుము.

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

## 73

రామకృష్ణ అద్వైతాశ్రమము,
లుగ్సా, వారణాసి,
28 నవంబరు 1916.

ప్రియ—,

నీజాబు నాకుచేరి చాల దినములైనవి. గురుదేవుడు తనపనిని తానే చేసికొనెను. మీ కందఱికిని సరియైన పరిజ్ఞానమును కలిగించి ఆయన తన పనులను చేయించుకొనుచున్నాడు. దీనిని గుర్తించి ఆయన పవిత్రచరణములమీద హృదయపూర్వకమును ఆత్మపూర్వకమునగు భక్తి నొలుకబోయుడు. అందుచే మీ జీవిత ములు ధన్యములగును. దృఢవిశ్వాసమునుభగవ చ్చరణభక్తిని వర్ధిల్లజేయుటే కర్మానుష్ఠాన మునకు లక్ష్యము. ఆయన యనుగ్రహముచే మీరందఱును దాని నధిగమింతురు. ఆయన భక్తుల సంరక్షణమును మీరు పొందగలిగితిరి. జీవితము ధన్యమైనది. ఆయనను శరణుజొచ్చి నను తద్భక్తులను శరణుజొచ్చినను ఒక్కటే. దీనిని నీవు దృఢముగ నెఱుగుము. ఈ దినా లలో మఠమున చాలమంది జ్వరముచేతను రొంపచేతను బాధపడుచున్నారు. ఇచ్చట నుండి మేము మిహిజమునకు పోవుదుము. అక్కడ కొన్నాళ్లుండి జంతారాలో నొక యాశ్రమమును ప్రారంభించుటకు ఏర్పాట్లు చేసి తరువాత మఠమునకు మరలి వత్తుము. కార్యక్రమము నాలాగు నేర్పఱచుకొంటిమి.

ఇక దేవుడు సంకల్పించినట్లు! నీకు మా హృదయపూర్వకప్రేమాశీస్సులు.

నీ
శ్రేయోభిలాషి
శివానంద

## 74

రామకృష్ణ అద్వైతాశ్రమము,
లుగ్సా, వారణాసి,
30 నవంబరు 1916.

ప్రియ—,

నీ జాబు చేరినది. సంగతులు తెలిసినవి... బాబుగారిజాబువలన నీవచ్చటికి వచ్చియుండుట తెలిసినది. నీ దేహస్థితి నానాటికి బాగుపడు చున్నందుకు సంతోషించుచున్నాము. భగ

వంతుడు నీకు పూర్ణారోగ్యమును త్వరలో కలిగించునుగాక. బాబురాము మహారాజు నారోగ్యము మునుపటికంటె చాల మేలు. నా యారోగ్యమును బాగుగనే యున్నది మేము త్వరలో మిహిజమునకు పోవనున్నాము.

సదా భగవంతుని స్మరించుచు ధ్యానించుచు మెలకువ కలిగియుండుము. గృహస్థ భక్తుల యిండ్లలో వసించుట సన్న్యాసులకు చాల కష్టము. నీవు వ్రాసిన రీతిగ నడచుకొమ్ము. నీవు మహిళలకు స్తోత్ర పాఠాధికములను బోధింప వలసిన యక్కఱ లేదు. వారితో కలియవలసిన యక్కఱ లేదు. సాధ్యమైనంత వఱకు ధ్యానప్రార్థన పారాయణములందే వ్యాపృతుడవై యుండుము. ప్రొద్దుటి వేళలందును సందె వేళలందును......బాబులతో వాహ్యాళిపొమ్ము. ఆస్థ కలిగిన భక్తులు కనిపించినచో ఆధ్యాత్మికవిషయములనుగూర్చి అప్పుడప్పుడు వారితో సంభాషించుచుండుము. మా హృదయపూర్వక ప్రేమాశీస్సులను స్వీకరింపుము.

నీ
శ్రేయోభిలాషి,
శివానంద.

---

# వివేకానంద విజ్ఞానమూర్తి - విశ్వమానవకోటిలో - వెలుగొందుగాక!

## శ్రీ కేశవతీర్థస్వామి

ఈనాడు మహాత్మాగాంధీజీ జయంతి. ఈ పుణ్యదినమున, మన గ్రంథాలయంలో శ్రీ వివేకానంద చిత్రపటావిష్కరణ జరగడం - అర్థవంతమైన - ఆనందప్రదమైన శుభవిశేషం. గాంధీజీ, వివేకానందుని విమలప్రబోధాలకు మూర్తీభావమే! వివేకానందుని విజ్ఞానబోధలను హృదయంలో ప్రతిష్ఠించుకోవడమే సత్యమైన గాంధీజయంతి యని ఈ సంఘటన సూచిస్తున్నది.

వివేకానంద చిత్రపటావిష్కరణ వినోదోదయానికి కాదు; వివేకోదయానికి మాత్రమే. ఈ ఆవిష్కరణోత్సవాశయ మిదే!

శ్రీ వివేకానందస్వామి పవిత్రభారతాదర్శమూర్తి! నవయుగజగదాచార్యుడు! విశ్వధర్మప్రవక్త! సోదరి నివేదిత నిర్వచించినట్లు యుగయుగాలనుండి నిక్షిప్తమై, కనులు మిఱుమిట్లుగొలుప, ఒక్కసారిగా జనతామధ్యమున సాక్షాత్కరించిన సనాతన భారతవేద ధర్మజ్వాల!

వివేకానందునిలో మనం, సత్యమతస్వరూపమును, సత్యసంస్కృతిని, సత్యదేశభక్తిని, సత్యజీవనసౌందర్యమును సందర్శించగలం. స్వామిలో మనం, కృష్ణునిలోని కర్మకౌశలమును, బుద్ధునిలోని ప్రేమను, శంకరునిలోని జ్ఞానగరిమను సాక్షాత్కరించుకొనగలం.

ఆత్మజ్ఞానశూన్యము, కామకాంచన విభ్రాంతము, పరస్పరపీడనాపరాయణము, అజ్ఞాననిద్రాముద్రితమూ అయిన మానవ జాతిని, "లే! నిద్రలే! గమ్యమును చేరు! మధ్యలో ఆగకు!"—అని సుప్రభాతశంఖారవంతో మేల్కొల్పిన ఈ వేదాంతవిప్లవవీరుని దివ్యసందేశం—విశ్వకల్యాణదాయకం.

మతవిజ్ఞానశూన్యతే మానవకోటి జీవిత మండలి సర్వరంగాలలోని సంకులసంఘర్షణలకు

కారణమని స్వామి నిర్వచించారు;మత మంటే అంధాచారవిచారములు, శుష్క బాహ్యాకార్య కలాపసంరంభములు, బాహ్యాచిహ్నములూ కావనీ, మతమంటే సత్యసాక్షాత్కారమనీ, దైవానుభూతియనీ స్వామి ప్రవచించారు.

"ప్రతిజీవియందు దేవత్వము గర్భితమై యున్నది. బాహ్యాంతర ప్రకృతినంతా నిరోధించి అంతర్గతమైన నీ దేవత్వమును వ్యక్తం చేయ డమే జీవితపరమావధి. దీనికై కర్మభక్తియోగ జ్ఞానమార్గాలలో ఒక్కదానినిగాని, కొన్నిటిని గాని, అన్నిటినిగాని అవలంబించి ముక్తుడవుగా! ఇదే మతసారం! వాదాలు, సిద్ధాంతాలు, గ్రంథాలు, కర్మకలాపాలు, ఆలయాలు, ఆచారాలు ఇవన్నీ కేవలం అప్రధానవిష యాలు" అని స్వామి ఉద్బోధించారు.

స్వామి ప్రసాదించిన సేవాయోగమహా సందేశం మన కిప్పుడు సంతరణోపాయమై యున్నది. సమస్తజీవులలో దేవుని సందర్శించి సంసేవించి, దివ్యశాంతిని పొందు మని స్వామి సందేశసారమై యున్నది.

దరిద్రులలో శ్రీనాథుని మనము సందర్శించి సంసేవిస్తాముగాక!

దుర్బలులలో మనం సర్వశక్తిమంతుని సందర్శించి సంసేవిస్తాముగాక!

దీనులలో మనం దేవదేవుని సందర్శించి సంసేవిస్తాముగాక!

విద్యావిహీనులలో మనం జ్ఞానస్వరూపుని సందర్శించి సంసేవిస్తాముగాక!

కురూపులలో మనం శ్యామసుందరుని సంద ర్శించి సంసేవిస్తాముగాక!

రోగులలో మనం సచ్చిదానందరూపుని సందర్శించి సంసేవిస్తాముగాక!

అనాథులలో మనం జగన్నాథుని సందర్శించి సంసేవిస్తాముగాక!

సమస్తజీవులలో మనం దేవుని సందర్శించి సంసేవించి శాంతి ననుభవిస్తాముగాక!

మనలోనూ, సమస్తవిశ్వంలోనూ ఉన్న సర్వాంతర్యామియైన సర్వేశ్వరుని సందర్శించి సంసేవించి తరిస్తాముగాక!

ఓం తత్సత్

# వార్తలు - విశేషాలు

## రామకృష్ణమఠ మిషనుల సమష్టి నివేదిక

(1968-వ సంవత్సరము ఏప్రిల్ నుండి 1969-వ సంవత్సరము మార్చివరకు. 1970-వ సంవత్సరము సెప్టెంబరు నెలలో బేలూరునుండి జనరలు సెక్రెటరీ గారిచే వెలువరింపబడినది.)

### రామకృష్ణమఠము - రామకృష్ణమిషను

మఠమును దానిశాఖలును మిషనును దాని శాఖలును ప్రత్యేకము లైనవే. కాని మఠ మిషనులకు సన్నిహితసంబంధ మున్నది. ఎట్లనగా—మఠధర్మకర్తలే మిషను నిర్వాహకపరిమత్సభ్యులుగ నున్నారు. మిషను కార్యాకలాపాలను నడపువారిలో ప్రముఖులు మఠసభ్యులే. మఠమునకును మిషనునకును కేంద్రస్థానము బేలూరుమఠమే. మఠకార్య క్రమాలుకూడ మిషనుకు సంబంధించినవే అని సామాన్యంగా ప్రజలు అనుకుంటుంటారు.

ఈవిషయం గుర్తించాలి—ఎక్కడైనా ఏ సంస్థకైనా శ్రీరామకృష్ణునిపేరునో శ్రీవివేకా

నందస్వాముల పేరునో పెట్టుకోవచ్చు. పెట్టినంత మాత్రంచేత అది బేలూరి కేంద్రసంస్థ అధికారావరణంలో చేరింది కాదు.

ఆర్థికాధారాలు మఠానికి వేఱు. మిషనుకు వేఱు. ఆయవ్యయాల లెక్క దీనిది వేఱు. దానిది వేఱు. మిత్రులు భక్తులు సమర్పించే విరాళాలును గ్రంథవిక్రయంవల్ల వచ్చే ధనమున్ను మఠానికి ఆర్థికాధారం. విద్యార్థులు కట్టే జీతాలు ఉదారమహాజను లర్పించు విరాళాలును చందాలు మిషను కార్థికాధారం. ప్రభుత్వంవారున్ను ప్రజాసంస్థలున్ను ఇచ్చే గ్రాంట్లు మఠమిషనులకు ఉమ్మడి. మఠమిషనుల ఆదాయవ్యయపట్టికలను ఏటేట సమర్థులైన ఆడిటర్లు తనిఖీ చేస్తుంటారు.

## కార్యక్రమాల సంక్షేపం

ఈసంవత్సరం క్రిందటిసంవత్సరంవలెనే చిక్కులతో శ్రమలతో కూడినదే. ఆర్థికపుచిక్కులు రాజకీయసంచలనాలు మొదలైనవి ఉండినా ప్రజలకష్టనివారణకార్యక్రమాలలోను గ్రామకార్యక్రమాలలోను ఎక్కువశ్రద్ధ వహింపబడినది. రాంచిఆశ్రమంలో ఆదివాసులకై ఒక యువశిక్షణకేంద్రం స్థాపించబడినది. భారతదేశంలో వివిధప్రాంతాలలో కష్టనివారణకార్యకలాపాలు(తొమ్మిది) నిర్వర్తించబడ్డాయి. గౌహతిలోను రాయిపూరులోను ఉండిన కేంద్రాలు ఈసంవత్సరం మిషను యాజమాన్యంలోకి చేర్చుకోబడ్డాయి.

ఈసంవత్సరంలో లేపబడ్డ క్రొత్తకట్టడాలు:– కంఖాలు సేవాశ్రమంలో వివేకానంద సెంటినరీ మెమోరియలుభవనం, సేలము కేంద్రంలో ఒక గుడి, ప్రార్థనామందిరము, రాంచిసానటోరియములో అతిథుల కొరకు విడిది, వారణాసిసేవాశ్రమంలో శస్త్రచికిత్స కొరకు కట్టడము, మదరాసు వివేకానందకాలేజిలో వృత్తిశాస్త్రశాఖకొరకు భవనం, త్యాగరాయనగరు స్కూలులో సైన్సుకట్టడము, దేవగడవిద్యాపీఠంలో ఒక గ్రంథాలయం, ఒక సన్యాసులవిడిది, భోజనాకూటమును విరివిపఱచడం, పూరీకేంద్రంలో భోజనాలకు వినోదాలకు ఉపయుక్తమగు క్రొత్తకూటము.

మదరాసురామకృష్ణమఠములో ధర్మవైద్యశాలకు ఒకక్రొత్తభవనం చేర్చబడింది. కాలడి ఆశ్రమంలో విద్యార్థులవిడిదికి ఒక వంటగది భోజనాలచావడి నిర్మింపబడ్డాయి. క్రిందటి సంవత్సరంలోవలెనే ఈసంవత్సరమున్ను తూర్పుపాకిస్థానకేంద్రాలలో మాసంబంధాలు చాల పలుచగ నుండినవి. పాకిస్థానసంజాతులగు నలుగురు సాధువులు గృహస్థశిష్యుల మిత్రుల తోడ్పాటుతో తమకార్యప్రణాళికలను ఎట్లో ఒకట్లు కొనసాగిస్తూ వచ్చారు.

బర్మాలో ఒక్క కేంద్రమే శేషించి ఉన్నది. అది రంగూన్ రామకృష్ణసొసైటీ. స్థానిక మిత్రులు బేలూరుమఠాధ్యక్షులచేత నియుక్తులై కార్యనిర్వాహకపరిషత్తుగ ఏర్పడి ఆ కేంద్రమును కొనసాగిస్తూ ఉన్నారు.

## కేంద్రాలు

1969–వ సంవత్సరం మార్చినెల యప్పటికి బేలూరుమఠం కాక శాఖాకేంద్రాలు మొత్తం 114 ఉండినవి. వానిలో 52 మిషను కేంద్రాలు. 41 మఠకేంద్రాలు. 21 మఠమిషనుల ఉమ్మడి కేంద్రాలు. ప్రాంతీయంగా ఇవి ఈ క్రింది విధంగా విభక్తములై యున్నవి. తూర్పు పాకిస్థానంలో 2 మిషను కేంద్రాలు, 3 మఠ కేంద్రాలు, 5 మఠమిషనుల ఉమ్మడి కేంద్రాలు, ఉన్నవి. బర్మా, ఫ్రాన్సు, సిలోను, సింగపూరు, ఫిజీ మారీషసు అను దేశాలలో ఒక్కొక్కదానిలో

కమిషను కేంద్రం ఉన్నది. స్విట్జర్లండు, ఇంగ్లండు, అర్జంటినా అను దేశాలలో ఒక్కొక్కదానిలోను ఒకమఠకేంద్రం ఉంది. అమెరికా సంయుక్తరాష్ట్రాలలో మఠకేంద్రాలు 10 ఉన్నాయి. ఇక శేషించిన 44 మిషను కేంద్రాలు 25 మఠకేంద్రాలు, 16 మఠమిష నులఉమ్మడికేంద్రాలు (మొత్తం 85) భారత దేశంలో ఉన్నాయి. పశ్చిమబంగాళంలో 29, ఉత్తరప్రదేశ్‌లో 11, తమిళనాడులో 11, బీహారులో 7, కేరళములో 5, అస్సాములో 5, మైసూరులో 4, ఒరిస్సాలో 3, ఆంధ్రమహా రాష్ట్రా లొక్కొక్కదానిలో 2 కేంద్రాలు, గుజరాతు, రాజస్థానము, ఢిల్లీ, నెఫా (ఆగ్నే యపుసరిహద్దురాష్ట్రము) చండీగడము అను ప్రాంతా లొక్కొక్కదానిలో ఒక్కొక్క కేంద్రం. ఈశాఖా కేంద్రాలతో సంబంధపడిన ఉపకేంద్రాలు 23 ఉన్నాయి. వానిలోను సన్న్యాసులు సదా ఉంటూనే ఉన్నారు.

## నిర్వర్తితములైన సేవాకార్యాలు

వైద్యసేవ:—భారతదేశంలోను పాకిస్థానం లోను మఠమిషను కేంద్రాలు జాతిమతవిచక్షణ లేకుండ ప్రజలఆరోగ్యాన్ని పెంపొందించే పనులు సాగించారు. ఉదా:-కల్కత్తా వార ణాసి బృందావనము కంఖాలు తిరువనంత పురము, రాంచి అనుచోట్ల నున్న వైద్య శాలలు. 1968-69-వ సంవత్సరంలో పాన్పులు సమకూర్చి రోగులను అక్కడనే ఉంచుకొని వైద్యం చేసే ఆస్పత్రులు మొత్తం 10 ఉండినవి. వానిలో పాన్పులసంఖ్య మొత్తం 1227. రోగుల సంఖ్య 29,638. ఏనాటి కానాడు వచ్చి చికిత్స చేయించుకొని పోయినరోగుల సంఖ్య మొత్తం 32,25,493. సేలము, బొంబాయి, కాన్పూరు, క్రొత్తఢిల్లీ మున్నగుచోట్లలో ఆస్పత్రుల కను బంధంగా పరీక్షాకేంద్రా లున్నాయి. శ్యామ లతలఆశ్రమములోని జంతువైద్యశాఖలో 683 జంతువులకు వైద్యము కావింపబడింది. రాంచిలో క్షయవ్యాధి చికిత్సకు ప్రత్యేకవసతులున్నాయి. కల్కత్తా సేవాప్రతిష్ఠానంలో విశేషభాగం ప్రసూతిశిశుసంక్షేమాలకు అంకితమైనది.

విద్యాసేవ :—మద్రాసు రహార (24 పర్గ ణాల జిల్లా)లో బేలూరు (హౌరాజిల్లా)లో నరేంద్రపూరు (24 పర్గణాల జిల్లా)లో మఠ మిషనుల ఆధ్వర్యమున డిగ్రీకాలేజీలు 4 నడు సున్నాయి. బేలూరు నరేంద్రపూరు కళా శాలలు విద్యార్థులను అక్కడనే ఉంచుకొని విద్య గఱపేవి, 4 కాలేజీలలోను కలిసి విద్యా ర్థుల సంఖ్య మొత్తం 3,445. కొన్ని విద్యా సంస్థల వివరాలు

| సంస్థ పేరు | సంస్థ ఉన్న ఊరు | విద్యార్థుల సంఖ్య |
|---|---|---|
| ప్రీ యూనివర్సిటీ కాలేజి | పెరియనాయకన్పాళెం (కోయంబుత్తూరు) | 381 |
| 2 బి. టి. కాలేజీలు | బేలూరులో పెరియనాయక న్పాళెంలో | 266 |
| 2 బేసిక్కుట్రైనింగు స్కూళ్లు | పెరియనాయకన్పాళెంలో మద్రాసులో | 233 |
| పోస్టుగ్రాడ్యుయేటు బేసిక్కు ట్రైనింగు కాలేజి | రహార | 98 |

## వారలు-విశేషాలు

| సంస్థ పేరు | సంస్థ ఉన్న ఊరు | విద్యార్థుల |
|---|---|---|
| 4 జూనియరు బేసిక్కు ట్రైనింగు కాలేజీలు | రహార, సరీష, సార్గాచి | 342 |
| వ్యాయామ కళాశాల | పెరియనాయకన్పాళెం | 105 |
| జానపదోన్నత పాఠశాల | | 243 |
| వ్యవసాయ పాఠశాల | | 137 |
| కర్షక శిక్షణ కేంద్రం | నరేంద్రపూరు | 92 |
| 4 ఇంజనీరింగు స్కూళ్లు | బేలూరు, బెల్ఘారియా, మద్రాసు, పెరియనాయకన్పాళెం | 1362 |

ఇవిగాక జూనియరు బె లు స్కూళ్లు 14 ఉన్నాయి. అందులో విద్యార్థుల సంఖ్య 853. విద్యార్థినుల సంఖ్య 488. విద్యార్థుల విడుదులు 90 ఉన్నాయి. అందు కొన్నింటిలో అనాథ శిశుశరణాలయాలు ఉన్నాయి. వానిలో ఉన్న బాలురసంఖ్య 8,414. బాలికలసంఖ్య 592. 3 చతుష్పాఠ లున్నాయి. అందు విద్యార్థులు 38. మల్టీ పర్పస్ హైయ్యరు సెకండరీ స్కూళ్లు 14. అందు బాలురు 5,728. బాలికలు 448. హాయ్యరు సెకండరీ స్కూళ్లు 8. అందు బాలురు 3600, బాలికలు 1788. సెకండరీ స్కూళ్లు 16. అందు బాలురు 7430. బాలికలు 4318. సీనియరు బేసిక్కు M. E. స్కూళ్లు 36. అందు బాలురు 4855. బాలికలు 4824. జూనియరు బేసిక్కు U. P. ఎలిమెంటరీ స్కూళ్లు 46. అందు బాలురు 7235. బాలికలు 2136. L. P. మొదలైన గ్రేడు స్కూళ్లు 131. అందు బాలురు 6032. బాలికలు 3555. కల్కత్తా లోని సేవాప్రతిష్ఠానంలోను త్రివేంద్రము మఠ వైద్యశాలలోను తర్ఫీదైన నర్సుల ప్రసూతి సహాయల సంఖ్య 221.

ఇండియా, పాకిస్థానము, సింగపూరు, ఫిజి మారీషస్సు ఈ యన్నిచోట్లలో కలిసి మఠ మిషనులను ఆధ్వర్యంలో సాగుతున్న విద్యా సంస్థలలో 50,757 బాలురు. 18,572 బాలికలు ఉంటున్నారు. కల్కత్తా కల్చరు ఇన్స్టిట్యూటువారు 800 విద్యార్థులతో ఒక డే హాస్టలును, 42 విద్యార్థులతో ఒక సంస్కృతి విద్యాలయాన్ని 1296 విద్యార్థులతో బహు భాషాబోధక విద్యాలయాన్ని నడిపారు. నరేంద్రపూరు ఆశ్రమంవారు ఒక విద్యాలయాన్ని నేత్రవిహీన బాలురకై నడిపారు. అం దున్న విద్యార్థుల సంఖ్య 95. రాయపూరు కేంద్రం ఒక పంచాయతీరాజ్య తర్ఫీదు సంస్థను రాంచి కేంద్రం ఒక సాంఘికశిక్షణ నిలయమును (దివ్యయానం) నడిపినవి.

### వినోదకార్యక్రమాలు

కొన్ని మఠమిషను కేంద్రాలలో స్కూలు గంటలు ముగిశాక వినోద సాంస్కృతికాధ్యాత్మిక కార్యక్రమాలను జరుపుతూ వచ్చారు. ఉదా॥ బెంగుళూరాశ్రమ బాలకసంఘము. మైసూరు ఆశ్రమం, బెల్ఘారియా ఆశ్రమంలోని వివేకానంద యువసమితి.

### మహిళాకార్యక్రమం

భారతీయ మహిళలకు తాము చేయవలసిన విధులను మిషనువారు సదా జ్ఞప్తియం దుంచుకున్నారు. వారు నిర్వర్తిస్తు వచ్చిన మహిళా

సేవా కార్యక్రమానికి ఉదాహరణాలు కల్కత్తా సేవా ప్రతిష్ఠానంలోను ట్రివేండ్రము మఠవైద్య శాలలోను ప్రసూతిశాఖలు, జల్పైగురిలోను ఖేత్రిలోను ప్రసూతి వైద్యశాలలు, వారణాసి బృందావన వైద్యశాలలలో మహిళా శాఖలు, వారణాసిలోని రోగిణుల విడిది, మద్రాసులో శారదా విద్యాలయం జంషెడ్పూరులో గరల్సు హైస్కూళ్లు, సరిష (24 పర్గణాల జిల్లా)లో శారదామందిరం, ట్రివేండ్రములోను కల్కత్తాలోను నర్సుల శిక్షణ కేంద్రాలు ఇవిగాక ఇతర వైద్యశాలలలో విద్యాలయాలలో మగువలకు ప్రత్యేకములైన ఏర్పాట్లున్నాయి. మహిళల ప్రత్యేకముగ [illegible]డపబడు సంస్థలున్నాయి. మద్రాసు మఠమువారు కూడ బాలికలకై ఒక ప్రైమరీ స్కూలును నడుపుచున్నారు.

## నిమ్న గ్రామీణప్రజల సముద్ధరణము

చట్లాపుంజి సరిష రాంహారిపూర్ మానస ద్వీపం జయరాంబాటి కామార్పుకూరు సార్గాచి ఆలోంగు [illegible]రియనాయకన్పాళెం కాలాడి తిరుచ్చూరు అనుచోట్లలో ఉన్న ప్రధానాశ్రమాలే కాక ఉపకేంద్రాలు - కొన్ని తాత్కాలికాలు కొన్ని ఎప్పుడూ ఉండేవి-కూడ నిమ్నగ్రామీణ ప్రజల సముద్ధరణ కార్యాన్ని నిర్వహిస్తున్నవి. అస్సాము కొండప్రజలలో ఆగ్నేయ సరిహద్దు ప్రాంతీయ ప్రజలలో మఠమిషను కేంద్రాలు సాగిస్తున్న విద్యావ్యాప్తి సంస్కృతికార్యక్రమాలు ఉదాహరణార్హాలు. చలనచిత్రాల సాహాయ్యంతో విద్యావ్యాప్తికై పర్యటనలు కూడ సాగింపబడినవి. వెనుకబడిన ప్రాంతాల ప్రజలకై ఈ సంవత్సరం 7 మల్టీపర్పస్ హాయ్యరు సెకండరీ స్కూళ్లు, 2 హైస్కూళ్లు, 39 సీనియర్ బేసిక్కు (M.E &U.P.) స్కూళ్లు, 37 ప్రైమరీస్కూళ్లు, వయోజనులకై 61 రాత్రి పాఠశాలలు, 8 వృత్తిశిక్షణ కేంద్రాలు. ఈ యన్నిటిలో ఉన్న విద్యార్థుల మొత్తం సంఖ్య 11,040. ఆ ప్రాంతాలలోనే ఏనాటి కానాడు వచ్చు రోగులకు ఔషధ వినియయ కేంద్రాలు 13, 30 గ్రామాలలో పర్యటిస్తూ ఔషధము లందించిన సంస్థలు 2 నిర్వహింపబడ్డాయి. ఈ యన్నిటిలో వైద్య సాహాయ్యం పొందిన రోగుల సంఖ్య 1,67,765. 139 కేంద్రాలలో స్థగిత-గ్రామీణ ప్రజలకు పాలు పంచిపెట్టబడినది. పై వివరాలను బట్టి ఈ సంస్థ కార్యక్రమాలు నగరాలలోమాత్రమే జరిగినవి కావని అన్ని రంగాలలో వ్యాపించాయని స్పష్టమవుతూంది. రామకృష్ణ వివేకానంద సందేశం వ్యాపిస్తున్న దనడానికి వార్షికోత్సవాలలో పాల్గొంటుండే ప్రజల అత్యధిక సంఖ్యయే తార్కాణము. సంవత్సరం పొడుగున ప్రజలు గుడులలో ఆశ్రమాలలో వేల కొలదిగ సమావేశం కావడమే గాక ధర్మ వైద్యశాలలో చికిత్సకై వస్తుంటారు. విద్యా సంస్థలలో కూడ పేద విద్యార్థులకు ఉచితంగా అన్న వస్త్రము లిచ్చి విద్యగఱపే ఏర్పాట్లున్నాయి. పెక్కు గ్రామాలలో గ్రంథాలయాలు వయోజన విద్యాకేంద్రాలు నడబడుతూన్నాయి. గ్రంథ ప్రచురణశాఖలు చిన్న పుస్తకాలను సామాన్య ప్రజలకు చాల తగ్గింపు ధరలకు అందజేస్తున్నాయి.

## విపత్సమయములలో సాహాయ్యకార్యక్రమం

సంవత్సరంపొడుగున మిషనువారు సాహాయ్యకార్యక్రమాలను నిర్వహిస్తువచ్చారు. విపత్తుకులోనైన దాదాపు లక్షకుటుంబాలకు గుజరాతులో మహారాష్ట్రంలో ఒరిస్సాలో పశ్చిమబంగాళంలో అస్సాములో సాహాయ్యం అందజేయబడింది. వ్యయింపబడిన ధనం మొత్తం రూ. 27,98,117.64. (1) ఒరిస్సాలో

తుఫానుచే నష్టపడ్డవారికై 1967 లో ప్రారంభింపబడ్డ సాహాయ్యకార్యక్రమం 1968 మేనెల వరకు సాగింది. రూ. 16,165.65 లు వ్యయింపబడ్డాయి. రూ. 22,125 ఖరీదు చేసే 4,425 కిలోగ్రాముల పాలపొడి పంచిపెట్టబడింది. (2) ధెంకనాల్ జిల్లాలో 1968 మే 23 వ తేదినుండి 1968 సెప్టెంబరు 13 వ తేదివరకు 186 గ్రామాలలో అనావృష్టిబాధితములగు 2,703 కుటుంబాలకై రూ. 1,00,453.47 లు వ్యయించి సాహాయ్యం అందజేయబడింది. (3) 1968 జూలై 18 వ తేదీనుండి ఆసంవత్సరం సెప్టెంబరు 2 వ తేదీవరకు హుగ్లీలో వరద బాధితములగు 9,298 కుటుంబాలవారికి రూ. 2,55,400 ఖరీదుచేసే 2000 క్వింటళ్ల బియ్యం పంచిపెట్టబడడమే కాక రొక్కం రూ. 5,773.76 వ్యయింపబడినవి. (4) 1-8-68 నుండి 31-12-68 వరకు సబంగు భగవాన్పూరు నందిగ్రాం మాయ్నా అను నాల్గు స్థానాలలో మిడ్నపూరువరదబాధితములగు 177 గ్రామాలలో 14,191 కుటుంబాలవారికి వారికి రూ. 14,09,179.67 లు వెల చేసే ఆహారసామగ్రి మున్నగునవి పంచిపెట్టడమే కాక రొక్కం రూ. 45,551.95 లు ఖర్చుపెట్టబడింది. (5) 1968 మేనెలనుండి ఆ సంవత్సరం సెప్టెంబరువరకు బంకూరా మిడ్నపూరు జిల్లాలలో రూ. 12,500 వెల చేసే క్రొత్తవస్త్రాలు దుస్తులు దీనులకు అందజేయబడ్డాయి. (6) 1968 మే 13 వ తేదీనుండి 1969 జనవరి 30 వ తేదీవరకు మిడ్నపూరు జిల్లాలో రూ. 11,510.20 లు వ్యయించి 7 స్కూళ్ల భవనాలకు మరమ్మత్తులు చేయబడినవి. (7) 1968 మేనెలనుండి ఆ సంవత్సరం సెప్టెంబరునెలవరకు ఆస్సాములో కామరూప-కచర్ జిల్లాలలో బరామా హైలకండి నగరాలలో వరదబాధితుల సాహాయ్యానికై రూ. 23,348.20 లు వ్యయింపబడ్డాయి. (8) ఉత్తరబెంగాలు జల్పైగురిజిల్లాలో 1968 అక్టోబరు 13 వ తేది వరద బాధితులకై ప్రారంభింపబడ్డ సాహాయ్యకార్యక్రమం మరు సంవత్సరం కూడ సాగింపబడింది. మొత్తం రూ. 1,41,903.25 లు రొక్కం వ్యయింపబడింది. రూ. 2,71 240.60 లు వెల చేసే ఆహారవస్తువులు పాఠ్యగ్రంథాలు వ్యవసాయ పరికరాలు మున్నగునవి పంచిపెట్టబడ్డాయి. (9) 1968 జనవరి 13 వ తేదీనుండి ఆసంవత్సరం జూలై 12 వ తేదీవరకు మహారాష్ట్రంలో సతారాజిల్లాలో కోయ్నావద్ద భూకంపంచే దెబ్బతిన్న 41,482 కుటుంబాలవారికి ఆహార సామగ్రి దుప్పట్లు దుస్తులు మున్నగు పెక్కు అవసరవస్తువులు మందులు పంచిపెట్టబడ్డాయి. (10) గుజరాతు సూరత్తుజిల్లాలో మిషనువారు 1968 ఆగస్టునెలలో 20 లక్షల రూపాయల అంచనాతో వరదబాధితుల సాహాయ్యకార్యక్రమానికి పూనుకున్నారు. 1460 కుటుంబాలకై 1460 సిమెంటు కుటీరాలు నిర్మింపబూనుకున్నారు. 75 కుటీరాలు 1968-69 లో ముగిశాయి. 80 కుటీరాలు ముగియబోతూ ఉండినవి. (11) కల్కత్తాసమీపంలో బెలియఘటా తాప్సియా ప్రాంతాలలో వరదబాధితులకు 2,271 ప్రజలకు 1968 జూలైలో సాహాయ్యం చెయ్యబడింది.

పై సాహాయ్యకార్యక్రమాలన్నిటిలో పంచిపెట్టబడినవి-28,605 క్వింటళ్ల ఆహారధాన్యాలు, 1745 కిలోగ్రాముల బిస్కత్తులు, 205 క్వింటళ్ల పాలపొడి, 30,318 వస్త్రాలు దుస్తులు, 8,833 దుప్పట్లు, 11,514 అల్యూమినియము పరికరాలు, 2000 వ్యవసాయసామగ్రి, 1,419 ఇండ్లపై కప్పు రేకులు, 6,113 స్కూలు పాఠ్యగ్రంథాలు,

11,890 నోటుబుక్కులు, 230 లాంతర్లు, 2,25,090 మల్టీవిటమినుమాత్రలు.

ఆధ్యాత్మిక సాంస్కృతిక కార్యక్రమం

మఠమిషనులు రెండును తమ వివిధకార్యక్రమాలగుండ 'అన్నిమతములును సత్యమే' అనెడి శ్రీరామకృష్ణుని ఉపదేశమును కార్యరూపంలో ప్రదర్శించాయి ఉత్సవాది సందర్భాలలో ప్రతి కేంద్రంవారు వివిధమతాలవారిని సమావేశపఱచేవారు. గ్రంథాలయాలు పత్రికా పఠనాలయాలు సంస్కృతచతుష్పాఠులు నిర్వహింపబడ్డాయి. కనీసం 10 కేంద్రాలవారు వివిధభాషలలో గ్రంథాలను మాసపత్రికలను ప్రచురిస్తునారు. గ్రంథప్రచురణం చుఱుకుగా సాగిన కేంద్రాలు, మాయావతి, బాగ్బజారు (కల్కత్తా), మదరాసు, నాగ్పూరు, మైసూరు, రాజ్కోట, భువనేశ్వరం, తిరుచూరు. ముఖ్యంగా కల్కత్తాలోని కల్చరిన్ స్టిట్యూటు వారు విశ్వమానవులకు సాంస్కృతిక సౌభ్రాత్రం వర్ధిల్ల జేసే కార్యక్రమాలు సాగిస్తున్నారు.

వార్షికోత్సవాలు

మఠకేంద్రాలలో మిషను కేంద్రాలలో శ్రీ శారదా - రామకృష్ణ - వివేకానంద ప్రముఖ యోగుల ప్రవక్తల జయంతి మహోత్సవాలు జరుపబడ్డాయి. ఆ ఉత్సవాలలో ముఖ్యకార్యక్రమాలు ప్రత్యేకపూజ హోమం పవిత్ర గ్రంథాలపారాయణం భజనసంకీర్తనలు దరిద్ర నారాయణ దిగంబరమహాదేవసంతర్పణలు. ప్రముఖుల ఉపన్యాసాలు. ఈవిధంగా శ్రీరామకృష్ణునియొక్క ప్రత్యక్షశిష్యులయొక్క సందేశం వ్యాపిస్తు ఉంది. యువకులలో మఠమిషనుల ఆదర్శాల పరిజ్ఞానం పెరుగుతుఉంది.

సాయపడిన ఉదారమహాజనులకు మా విజ్ఞప్తులను నివేదికలను ఆదరంతో ప్రచురించిన పత్రికాధిపతులకు వైద్యాదిసేవను ఉచితంగా చేసిన వైద్యులకు ఇంజినీర్లకు లాయర్లకు మా కృతజ్ఞతను తెలుపుకుంటున్నాం. వీరితోడ్పాటు ఈలాగే ఎప్పుడు లభిస్తుండగలదని విశ్వసిస్తున్నాం. భగవదనుభవప్రాప్తికి సోదరమానవసేవ అద్భుతావకాశం. యువకులందఱు వివేకానందస్వాముల శంఖారావము ఆలకించి దీన ప్రజోద్ధరణసేవకు తమ జీవితాలను అంకితం చేసుకొనవలసిందని ప్రార్థిస్తున్నాం.

## గ్రం పరిచయం

### యుగసమీక్ష

రచయితయూ ప్రాప్తిస్థానమునూ: 'ఆర్ష విద్యాలంకార' శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు, చంద్రమౌళినగర్, గుంటూరు 2. పుటలు 313, వెల 10 రూపాయలు.

కృత త్రేతా ద్వాపర కలియుగములలో ధర్మమునకు క్రమముగ గలుగు క్షయమును, దాని నరికట్టుటకు ప్రయత్నములు సలిపిన బుద్ధునిమొదలు గాంధివఱకు మహాపురుషుల జీవితసందేశములు, వేలకొలది సంవత్సరాల మన సాంస్కృతికచరిత్రము ఇందు వివరింపబడ్డాయి. రచయితగారి డెందమున నిబిడముగ నున్న ఆర్షవిజ్ఞానము, వేదధర్మములందలి వారి యభిరతి, ఐతిహాసికవిజ్ఞత, దేశీయమహాపురుషులందలి వారి భక్తి, సంస్కృతసారస్వతమున వారి సమాదరము, విశ్వోపజీవ్యమైన సత్యమును విశ్వమానవాళి కందజేయవలెననెడి వారి వరిష్ఠమైన ప్రతిపత్తి ఈ గ్రంథమున సర్వోపగతములై యున్నవి. భాష మధురం సరళం సరసం రంజకం. అందఱూ తప్పక చదవ వలసిన గ్రంథరాజము.

ప్రభాకర్

# శ్రీరామకృష్ణ కథామృతము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

పరిశోధితమగు 1121 మహోపదేశములతో, సంగ్రహ జీవితముతో సలరారుచున్నది.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధ గురువులు, లౌకికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు : వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, జీవుడు : దేవుడు, జ్ఞానము: భక్తి: కర్మము, బ్రహ్మతత్త్వము, సూక్తులు: నీతికథలు మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసిబిడ్డలకయిన నవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

...ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూక్ష్మాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి... —ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్జ్వలమగు పంచమ ముద్రణము : వెల : అట్టబైండు : రూ. 4-50
క్యాలికో : రూ. 5-50

# శ్రీ రామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణదేవుని దివ్యోపదేశవాక్యము లాధారముగాగొని, వానిని విరివిపఱచి, తమ సొంతభావము లెన్నియోచేర్చి, ఆ సమష్టినంతయు శ్రీరామకృష్ణభాషితముగా, మనోహరకథారూపముగను, సంభాషణరూపముగను మార్చి, తమిళభాషలో రచింపబడిన జనాకర్షకగ్రంథము. ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతీ, హిందీభాషలలోని కిప్పటికే అనువదింపబడి అపారవ్యాప్తినొందినది. ఆ గ్రంథమున కిది చక్కని ఆంధ్రీకరణము.

128 పుటలు వెల : రూ. 1-25

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# శ్రీ శారదా ప్రసంగములు

అనువాదకులు :

కీ. శే. వెదురుమూడి వేంకటకృష్ణరావుగారు, బి. ఏ.

శ్రీ రామకృష్ణుని సహధర్మచారిణియు, ఆదర్శసతియు, ఆదర్శ యోగినియు, ఆదర్శ మాతయు నగు శ్రీ శారదాదేవి భక్తులతో నొనర్చిన దివ్యసంభాషణలు! తేట తెనుగున రచింపబడియున్నవి.

346 పుటలు (తృతీయ ముద్రణము) వెల : రూ. 3-00

# అనుష్ఠాన వేదాంతము

అనువాదకులు : కీ॥ శే॥ తత్త్వానందస్వాములవారు

ప్రపంచమున వివిధరంగములందు విహరించువారికి వేదాంతమెటుల అనుష్ఠానయోగ్యమో కండ్లకుగట్టినటుల శ్రీ వివేకానందస్వాములవారి యుపన్యాసములందు స్పష్టీకరించి యున్నారు.

(129+6 పుటలు) తృతీయ ముద్రణము వెల : రూ. 1-25

నూతన ముద్రణము ! ఇప్పుడే వెలువడినది ! !

# "భారత యువ జనులారా!"

అనువాదకులు :

కీ. శే. తత్త్వానందస్వాములవారు

భారతయువజనులను ప్రబోధించి శ్రీ వివేకానందస్వాములవారొసగిన ఉపన్యాసముల సంపుటీకరణము! ఒక్కొక్క ఉపన్యాసము భావగాంభీర్యము గలిగి యలరారుచున్నది.

274 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము ! వెల : రూ. 3-00

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు పామరులకు అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు　　రెండవ కూర్పు　　వెల : రూ. 4-00

నూతన ముద్రణము !　　ఇప్పుడే వెలువడినది !

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయ భాగము-రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)　　ఆఱవ కూర్పు　　వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు—4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్. ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము ( మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౪ ౧౯౭౧ - ఫిబ్రవరి : సాధారణ - మాఘము సంచిక ౭

## విషయసూచిక

ఫోన్ : 71231 పోస్టు బాక్సు : 635

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

**అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు**

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హక్స్లి) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.' (సన్డే స్టాన్డర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి. 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

590+158 పుటలు వెల: రూ. 7-50

# ప్రబోధరత్నాకరము

**అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు**

శ్రీ వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

232 పుటలు మూడవ కూర్పు వెల: 2-50

ఇట్లు వ్రాయుడు: **మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4**




'అఖిలవిభు శరణొందుమ, యీ క్షణంబ యతనిక్పప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.



# శ్రీరామకృష్ణ ప్రభ



సంపుటము ౨౭ } ౧౯౭౧ - : : సాధారణ - మాఘము { సంచిక ౮

శ్రీః

## వివేకచూడామణి

మూలము :
శ్రీ శంకర భగవత్పాదులు

వ్యాఖ్యాత :
అన్నమాచార్య

ఇదం శరీరం శృణు సూక్ష్మసంజ్ఞితం లిఙ్గం త్వపఞ్చీకృతభూతసమ్భవమ్
సవాసనం కర్మఫలానుభావకం స్వాజ్ఞానతో ఽనాది రుపాధి రాత్మనః. 97

వినవోయి, పంచీకృతములు కాని సూక్ష్మభూతముల వలన బుట్టిన శరీరము సూక్ష్మ శరీరము. ఈ లింగశరీరము భూతభవిష్యత్సంస్కారముల కాశ్రయమై కర్మఫలములగు సుఖ దుఃఖముల ననుభవింపజేయుచుండును. ఆత్మకు అనాదియగు ఈ యుపాధి స్వస్వరూపాజ్ఞానముచే కల్గినది. ౯౭

స్వప్నో భవ త్యస్య విభ క్త్యవస్థా స్వమాత్రశేషేణ విభాతి యత్ర
స్వప్నే తు బుద్ధి స్స్వయమేవ జాగ్రత్కాలీననానావిధవాసనాభిః. 98

కర్త్రాదిభావం ప్రతిపద్య రాజతే యత్ర స్వయం భాతి హ్యయం పరాత్మా
ధీమాత్రకోపాధి రశేషసాక్షీ న లిప్యతే తత్కృతకర్మలేశైః
యస్మా దసఙ్గ స్తత ఏవ కర్మభి ర్న లిప్యతే కిఞ్చి దుపాధినా కృతైః. 99

స్వప్నావస్థ జాగ్రత్సుషుప్తిదశలకంటె విభిన్నమైనది. ఆ దశలో సూక్ష్మశరీరము నందు మాత్రమే జీవాత్మకు తానను నభిమాన ముండును; బుద్ధియొక్కటే జాగ్రత్కాలానుభవ సంజాతములగు సంస్కారములచే కర్త్రాదిభావముల నొంది వ్యవహరించుచుండును. స్వయం

ప్రకాశమగు నాత్మ కా దశలో నుపాధి బుద్ధి యొక్కటే. ఆత్మ అసంగుడు కావున ఉపాధు లొనర్చు కర్మము లాత్మ కంటవు. బుద్ధికృతకర్మలేశములు సాక్షియగు నాత్మ కంటవు.౯౮,౯౯

సర్వవ్యాపృతికరణం లిఙ్గ మిదం స్యా చ్చిదాత్మనః పుంసః
వాశ్యాదిక మివ తక్ష్ణ స్తేనై వాత్మా భవ త్యసఙ్గో ఽయమ్. 100

వడ్రంగికి బాడిస మున్నగు వానివలె చిత్స్వరూపుడగు నాత్మకు ఈ లింగశరీరమే సకలవ్యాపారసాధన మగుచున్నది. కావున అసంగత్వమే ఆత్మకు స్వరూప మనుట తెల్లము.౧౦౦

అన్ధత్వ మన్దత్వ పటుత్వధర్మా స్సౌగుణ్యవైగుణ్యవశా ద్ధి చక్షుషః
బాధిర్యమూకత్వముఖా స్త థైవ శ్రోత్రాదిధర్మా న తు వేత్తు రాత్మనః. 101

చూపు చక్కగ నుండుట పటుత్వము, అది రవంత తగ్గుట మందత్వము, బొత్తిగా లేకపోవుట అంధత్వము. ఈ మూడును కంటికి కలుగు దశలు. చెవుడు మూగతనము మున్నగు నవి చెవి వాక్కు మున్నగువానికి గలుగు దశలు. జ్ఞాతయగు నాత్మ కిం దేదియు నంటదు.౧౦౧

ఉచ్ఛ్వాసనిఃశ్వాస విజృమ్భణక్షుత్ప్రస్యన్దనాద్యుత్క్రమణాదికాః క్రియాః
ప్రాణాదికర్మాణి వద న్తి తజ్జ్ఞాః ప్రాణస్య ధర్మా వశనాపిపాసే. 102

ఊపిరి పీల్చుకొనుట, విడుచుట, ఆవులింత, తుమ్ము, అదరుపాటు, ఉసురుపోక మున్నగునవి ప్రాణాది (=ప్రాణము అపానము కృకరము వ్యానము కూర్మము ఉదానము మున్నగు) వాయువుల ధర్మము లనియు, ఆకలిదప్పులు ప్రాణధర్మము లనియు తజ్జ్ఞులు పల్కుదురు. ౧౦౨

అ న్తఃకరణ మేతేషు చక్షురాదిషు వర్ష్మణి
అహ మి త్యభిమానేన తిష్ఠ త్యాభాసతేజసా. 103

చైతన్యప్రతిబింబమనెడి యాభాసతేజముతో గూడిన మనస్సు జ్ఞానేంద్రియము లందును (కర్మేంద్రియములందును) దేహమందును నెలకొని అవే తానుగా నభిమానించుచు వ్యవహరించుచుండును. ౧౦౩

అహఙ్కార స్స విజ్ఞేయః కర్తా భో క్తాభిమా న్యయమ్
స త్త్వాదిగుణయోగేన చావస్థాత్రయ ముచ్యతే. 104

దానినే అహంకార మందురు. నేను కర్తను నేను భోక్త నని యభిమానించున దదే. రజస్సత్త్వ తమోగుణములచే వరుసగా మెలకువ-కల-నిద్ర యను మూడుదశల నొందున దదే. ౧౦౪

విషయాణా మానుకూల్యే సుఖీ, దుఃఖీ విపర్యయే,
సుఖం దుఃఖఞ్చ తద్ధర్మ స్సదానన్దస్య నాత్మనః. 105

విషయము లనుకూలములుగ నున్నప్పుడు సుఖ నని, అవి ప్రతికూలములుగ నున్నప్పుడు దుఃఖ నని భావించున దంతఃకరణమే. కావున సుఖదుఃఖములు మనోధర్మములే కాని ఆత్మధర్మములు కావు. నిత్యానందమే ఆత్మస్వరూపము. ౧౦౫

ఆత్మార్థత్వేన హి ప్రేయా౯ విషయో న స్వతః ప్రియః
స్వత ఏవ హి సర్వేషా మాత్మా ప్రియతమో యతః
తత ఆత్మా సదానన్దో నాస్య దుఃఖం కదాచన. 106

విషయములు తమంతట ప్రియములు కావు, ఆత్మకొఱకైన వైనందుననే అవి ప్రియములు. ఆత్మ అందఱికిని తనంతటనే ప్రియమైనది. కావున ఆత్మకు నిత్యానందమే స్వరూపము, దుఃఖ మెప్పుడును గలుగదు. ౧౦౬

య త్సుషుప్తౌ నిర్విషయ ఆత్మనన్దో ఒనుభూయతే
శ్రుతిః ప్రత్యక్ష మైతిహ్య మనుమాన ఞ్చ జాగ్రతి. 107

గాఢనిద్రలో ఇంద్రియ విషయములు లేకే ఆత్మానంద మనుభవింతు మనుటకున్న ప్రమాణములు:-శ్రుతి, ప్రత్యక్షము, ఐతిహ్యము, అనుమానము. ౧౦౭

అవ్యక్తనామ్నీ పరమేశశక్తి రనా ద్యవిద్యా త్రిగుణాత్మికా పరా
కార్యానుమేయా సుధియైవ మాయా యయా జగ త్సర్వ మిదం ప్రసూయతే. 108

అవిద్యయనియు నవ్యక్తమనియు పేర్కొనబడు మాయ పరమేశునిశక్తి. అది అనాది, త్రిగుణాత్మకము (తననుండి యుప్పతిల్లు మహత్త్వాదులకంటె) ఉత్కృష్టము. ప్రపంచరూప కార్యమునుబట్టి కారణమైన యీ మాయయునికిని విద్వాంసు లూహింతురు. ఈ జగత్తున కంతటికిని కారణము మాయయే. ౧౦౮

సన్నాప్యసన్నాప్యుభయాత్మికా నో భిన్నాప్యభిన్నాప్యుభయాత్మికా నో
సాఙ్గాప్యనఙ్గాప్యుభయాత్మికా నో మహాద్భు తానిర్వచనీయరూపా. 109

ఈ మాయ సత్తు కాదు, అసత్తు కాదు, ఉభయము కాదు; భిన్నము కాదు, అభిన్నము కాదు, ఉభయము కాదు; సావయవము కాదు, నిరవయవము కాదు, ఉభయము కాదు. ఇది ఇట్టి దట్టి దనరానిది మహాద్భుతమైనది. ౧౦౯

శుద్ధాద్వయబ్రహ్మవిబోధనాశ్యా సర్పభ్రమో రజ్జువివేకతో యథా
రజ స్తమస్సత్త్వమితి ప్రసిద్ధా గుణా స్తదీయాః ప్రథితై స్స్వకార్యైః. 110

త్రాడు అని గుర్తించినంతనే, అంతకు ముందుండిన పామనెడి భ్రాంతి తొలగినట్లు, శుద్ధాద్వయబ్రహ్మము మనకంటె భిన్నము కాదనుటను సాక్షాత్కరించుకొన్న వెంటనే మాయ అదృశ్యమగును. రజస్సు సత్త్వము తమస్సు అనునవి మాయాగుణములు. వాని వ్యాపారములనుబట్టి ఆ గుణముల కా పేర్లు సార్థకములు. ౧౧౦

విక్షేపశక్తీ రజసః క్రియాత్మికా యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ
రాగాదయో ఽస్యాః ప్రభవన్తి నిత్యం దుఃఖాదయో యే మనసో వికారాః. 111

రజోగుణపు విక్షేపశక్తి క్రియాత్మకము. జీవప్రవృత్తియు ఈశ్వరప్రవృత్తియు ననాదికాలమునుండి యీ విక్షేపశక్తివలననే సాగుచున్నవి. జీవునకు సదా కలుగు రాగద్వేషాదులకును మనోవికారములగు దుఃఖాదులకును కారణము ఈ విక్షేపశక్తియే. ౧౧౧

కామః క్రోధో లోభద మ్భాభ్యసూయాహఙ్కారేర్ష్యామత్సరాద్యా స్తు ఘోరాః
ధర్మా ఏతే రాజసాః పుమ్ప్రవృత్తి ర్యస్మా దేషా త ద్రజో బన్ధహేతుః. 112

మానవులప్రవృత్తికి మూలములైనవియు మహానర్థకరములునగు కామము క్రోధము లోభము దంభము అసూయ అహంకారము ఈర్ష్య మత్సరము మున్నగున వెల్ల రజోగుణ ధర్మములు. కావున రజోగుణము బంధహేతువు. ౧౧౨

# పరమహంస దేవుని ప్రబోధవాణి

[ఈశ్వర చంద్రవిద్యాసాగరునింట జిజ్ఞాసు బృందమధ్యమున విద్యాసాగరు నుద్దేశించి-]

ప్రాచీనమహర్షులు బ్రహ్మజ్ఞానము గడించిరి. ఐహికపరత జాడగానైన నున్నంతవఱకును బ్రహ్మజ్ఞానము కలుగదు. ఋషులు ఎంత తపస్సు చేసెడివారు! వేకువనే ఆశ్రమములనుండి దూరముగ పోయి, దినమంతయును ఏకాంతమున బ్రహ్మమును గూర్చి ధ్యానించుచు గడపెడివారు. రాత్రులందు పర్ణశాలలకు మరలి వచ్చి, ఫలములను మూలములను ఆరగించెడివారు. త్వక్చక్షుశ్శ్రోత్రాదులకు విషయములైనవానినుండియును, తక్కిన ప్రాపంచికవస్తువులనుండియును, వారు తమ మనస్సులను దూరముగ పెట్టియుండిరి. బ్రహ్మమును వారు తమలోనే ఈలాగుననే సాక్షాత్కరించుకొనిరి.

కలియుగమున మానవునకు తిండియే ప్రాణాధారము. కావున, అతడు దేహాత్మభ్రాంతిని పూర్తిగా దులుపుకోలేడు. ఇట్టి పరిస్థితిలో 'సోఽహం' 'నే నతడ' నని చెప్పుట అతని కుచితము కాదు. అన్నిరకముల లౌకిక వ్యాపారములను చేయుచున్నంతవఱకును 'నేను బ్రహ్మమనే' అని మానవుడు చెప్పగూడదు. ఐహికవిషయసంగమును విడువలేనివారును, అహంకారమును దొలగించుకొనుటకు దారియే లేనివారును 'మేము భగవద్దాసులము, భగవ

ధ్యక్తులము'' అని చెప్పుకొనుట మేలు. భక్తి మార్గమునగూడ భగవంతుని ప్రాపించుట శక్యమే.

'ఇది కాదు' 'ఇది కాదు' అని వివేచించు జ్ఞాని ఐహికవిషయములతోడ తాదాత్మ్యమును వదలుకొనును. అప్పుడే అతనికి బ్రహ్మమును ప్రాపింప సాధ్య మగును. ఒక్కొక్క మెట్టుగా నిచ్చెన నెక్కి ఇంటిపైకప్పుమీదికి చేరుకొనుట వంటి దది. విజ్ఞానికి, బ్రహ్మపరిచయ మింకను గాఢము. అతనికి గలుగు సాక్షాత్కార మింకను హెచ్చు. ఇంటిపైకప్పును, దాని మీదికి చేర్చు మెట్లును ఏకపదార్థముతో రూపొందినవే యని యతడు గుర్తించును. అక్కడివియు నిక్కడివియు నయిన యిటికలు, సున్నము, మట్టి, అభిన్నములే 'ఇది కాదు' 'ఇది కాదు' అని త్రోసివేయుచు హృదయ ప్రబోధముచేత తుదకు ఏ బ్రహ్మమును తెలిసికొనెనో ఆ బ్రహ్మమే జగత్తుగను అందలి ప్రాణులుగను పరిణమించినట్లు వెను వెంటనే యతడు తెలిసికొనును. నిర్గుణమైన తత్త్వమే సగుణముగను ఉండు ననుట విజ్ఞాని దృష్టికి స్పష్టపడును:

ఇంటిపైకప్పుపై మానవుడు చాలసే పుండ జాలడు, మరలి దిగి వచ్చును. సమాధిలో బ్రహ్మమును సాక్షాత్కరించుకొనినవాడు సమాధినుండి దిగినపిమ్మట కూడ బ్రహ్మమే జగత్తుగను అందలి ప్రాణులుగను పరిణమించి నట్లు గుర్తించును.

సంగీతమానమున 'సరిగమపధని' అను స్వరములు గలవు. ఎవడును 'ని' స్వరముపై తన కంఠమును దీర్ఘకాలము నిలుప లేడు.

అహంకారము పూర్తిగా మాసి పోదు. సమాధినుండి మగిడిన యతనికి బ్రహ్మమే యహంకారముగను జగత్తుగను రూపొందె ననుట ప్రత్యక్షమగును. ఆ యెఱుకనే విజ్ఞాన మందురు.

జ్ఞానమార్గము పరమార్థమునకు జేర్చును. జ్ఞానమును భక్తియును గలిసిన మార్గముకూడ అట్లే చేర్చును. భక్తిమార్గమును ఆగంతవ్యమునే చేర్చును. జ్ఞానమార్గ మెంత మంచిదో భక్తిమార్గము నంత మంచిదే. అన్నిమార్గాలును తుదకొక్క పరమార్థమునొద్దకే చేర్చును. అయినను దేవుడు మనలో నహంకారము నుంచి యున్నంతవఱకును, భక్తిమార్గము ననుసరించుట ఎక్కువ సులువు.

బ్రహ్మము సుమేరుపర్వతమువలె అప్రకంప్యముగను నిష్క్రియముగను విజ్ఞాని దృష్టి కగపడును. ఈ జగత్తు త్రిగుణాత్మకము. సత్త్వరజస్తములే ఆమూడు గుణములు. అవి బ్రహ్మమం దున్నవి. కాని బ్రహ్మమునకు సంగము లేదు.

బ్రహ్మము భగవంతుడనియు సాకారు డనియుగూడ విజ్ఞాని గుర్తించును. షడ్గుణైశ్వర్యయుతుడగు భగవంతుడే త్రిగుణాతీతుడు. జీవులు, జగత్తు, మనస్సు, బుద్ధి, భక్తి, త్యాగము, జ్ఞానము—ఈ యన్నిగను తన్నావిష్కరించుకొనునది భగవచ్ఛక్తియే. (నవ్వుచు) 'దొర' ఇల్లును ఆస్తియు లేకున్నప్పుడుగాని వాని నాత డమ్ముకోవలసివచ్చి అమ్ముకొన్నపిదపగాని అతనిని 'దొర' యని ఎవరును పేర్కొనరు. [అందఱును నవ్వుదురు] దేవున కప్రాకృతశక్తు లా ఉన్నవి. అవి లేకున్న, ఆయన కెవరు విధేయులుగ నుందురు? [అందఱును నవ్వుదురు]

ఈ జగ త్తెంతరమ్యముగా నున్నదో చూడుము. ఎన్ని వస్తువు లున్నవి! సూర్యుడు,

చంద్రుడు, నక్షత్రములు, ఎన్నిరకముల జీవులు! పెద్దవి, చిన్నవి, మంచివి, చెడ్డవి, ప్రబలములు, దుర్బలములు, అధికశక్తివంత ములు, అల్పశక్తి వంతములు!

విద్యాసాగరుడు—కొందఱ కెక్కువశక్తిని కొందఱకు తక్కువశక్తిని దేవుడే ఇచ్చి యున్నాడా?

గురుదేవుడు — దేవుడు సర్వాంతర్యామి, విశ్వవ్యాపియైన యాత్మ. కావున చీమలో కూడ నున్నాడు! కాని భగవచ్ఛక్తి ఒక్కొక్క రీతిగా ప్రకటమగుచు భేదిల్లుచుండును. లేకున్నచో, ఒకడు పదుగురను తఱుమగొట్టగలుగుటయు, మఱొక్క డొక్కనినే ఎదిరింప జాలకుండుటయు నెట్లు పొసగును? ప్రజలందఱును నిన్ను గౌరవింతురే, ఎందులకు? నీ కేమి రెండు కొమ్ములు మొలచినవా? [అందఱును నవ్వుదురు] నీకు దయ యెక్కువ, పాండిత్యము హెచ్చు, అందువలన ప్రజలు నిన్ను గౌరవింతురు. నీయొద్దకు వచ్చి మర్యాదలు చెల్లింతురు. కా దందువా?

పట్టిపాండిత్యములో నేమియు లేదు. బ్రహ్మజ్ఞానమునకును బ్రహ్మసాక్షాత్కారమునకును ఉపాయమును కనుగొనుటే చదువునకు లక్ష్యము.

ఒకానొక యోగి యొకపుస్తకమును చాల జాగ్రత్తగ కాపాడుకొనుచుండెను. అందులో నే మున్నదని యడుగగా, ఆయన దానిని తెఱచిచూపెను. అన్నిపుటలయందును 'ఓం రామ' అను పదములే వ్రాయబడి యుండెను. వే రేమియు లేదు.

గీతకు గల ప్రాముఖ్య మేమి? ఆ పదమును పదిసార్లు ఆవృత్తిచేసిన నేమి కందువో, అదే దాని ప్రాముఖ్యము. అప్పుడు వర్ణములు విపర్యస్తములై తాగీ అగును. 'తాగీ' అనగా, దేవునకై తక్కినవాని నెల్ల త్యజించినవా డని యర్థము. 'ఓ మానవుడా, అన్నింటిని విసర్జింపుము. దేవు నొక్కనినే ఆశ్రయింపుము' అనుటే గీత చేసిన యుపదేశము. సన్న్యాసిగాని గృహస్థుగాని మనస్సునుండి సర్వసంగములను దులిపివేసికొనవలసినదే.

చైతన్యదేవుడు దక్షిణభారతదేశమున పర్యటించుచున్నప్పు డొకనాడు గీతాపారాయణము చేయుచున్న యొకనిని జూచెను. వే ఱొకడు ఆ పాఠకునకు కొంతదూరమున గూర్చుండి వినుచు నేడ్చుచు నుండెను. అతనికన్నులు బాష్పముల దేలుచుండెను. 'నీ కిదంతయు నర్థమగుచున్నదా' అని చైతన్యదేవు డతని నడిగెను. "స్వామీ, గ్రంథములో ఒక్కముక్కయినను నా కర్థమగుట లే" దని యతడు చెప్పెను. 'మఱి నీ వేడ్చుచున్న దెందుల' కని చైతన్యు డడిగెను. అందుల కతడు చెప్పిన జవాబు — గ్రంథమును వినుచున్నప్పు డర్జునుని రథము నాకెట్టయెదుట కానిపించును. అర్జునుడును శ్రీకృష్ణభగవానుడు నం దాసీనులై మాటాడుచుండుటయు నా కగపడును. వాని నంతయు జూచుటచేత నే నేడుదును."

# ఆలసింపక పూనుడోయయ్యలార

మానవుడు చంద్రమండలమున కాలూనుటే కాక కొన్నాళ్ల పాటు అచట సంచరించి వెనుదిరిగి వచ్చినాడను వార్త విశ్వమంతటను మ్రోగుచున్నది. మానవుని విజ్ఞానరంగ మతిమాత్రముగ విస్తరిల్లిన దనుటకును అపూర్వశక్తులతని కందుబాటైన వనుటకును ఇంతకంటె ప్రమాణ మేమి కావలెను? ప్రకృతి నింతకంటె హెచ్చుగా తన యధీనమునకు దెచ్చుకొన వీలగునను విశ్వాసము మానవునిలో బలపడుచున్నది.

ఇంతటి పురోగమనము కనిపించుచున్నను ఆంతరముగా మానవుడు పేదఱికమునే అనుభవించుచున్నాడు. అతనికి శాంతిసౌఖ్యములు లేకున్నవి. ఆధునిక మానవ ప్రపంచమున సంఘర్షణలు ఆందోళనలు భయములు పోటెక్కియున్నవి. ఇవి యున్నంతవఱకు, మానవుడు, బాహ్యప్రకృతి నెంతగా వశపఱచుకొన్నప్పటికిని అతనికి సిద్ధి సంతుష్టులు చేకుఱవు. బాహ్యప్రకృతిపై గడించిన విజయమునకు దీటువచ్చు విజయము ఆంతరప్రకృతి పైనిగూడ కలుగకున్నచో మానవుని విజయగాథలు కేవల ముపేక్ష్యములుగ ననిపించును. తాను శ్రమించి గడించుకొన్న ఫలితముల ననుభవింపనీయని యుపద్రవము మానవునకు వెలుపలి ప్రపంచము నుండి కలుగుట లేదు. అతనిలోనుండియే కలుగుచున్నది. తన అదుపులో తా నుండని వానికి విశ్వమంతయు చేజిక్కినను ఏమి లాభము? కావున తన్ను తన అదుపులో నుంచుకొనగలుగుట మానవున కెంతైన నావశ్యకము. అట్లుంచుకొన గల్గిననే, బాహ్యశక్తులను గూర్చిన పరిజ్ఞానమును వర్ధిల్లజేసికొని అతడు లాభపడగలడు

భవిష్యత్తునుగూర్చి మానవుని నిరుత్సాహపఱచుట కాదు మా యుద్దేశము. సంభవింపదగినవగు చిక్కులను ముందుగా తెలిపి వాని నెదుర్కొని యుత్తీర్ణుడగుటకు తగినట్లుగ మానవునకు సంసిద్ధత కలిగింపవలె ననుటే మా తలంపు. తన్ను తా నదుపులో నుంచుకొన్న మానవునిలో నుత్కృష్టములగు శక్తిసామర్థ్యములు పెంపొందును. ఇన్ని విజ్ఞానరంగములలో ఇంతలేసి గెలుపులు గడించిన మానవునకు తన్ను తా నదుపులో నుంచుకొనుట అసాధ్యమా? మనసుపెట్టవలయునే కాని అతని కిది అసాధ్యము కాదు. దుష్కరమైన కావచ్చునే కాని అసాధ్యము కానే కాదు. ఘనకార్యములు దుష్కరములు గాక సుకరములుగ నుండునా? పని ఎంత దుష్కరమో అందుకు పూనుకొన్నవారిలో అంతటి సముత్సాహము కలుగును. నెగ్గుచున్నకొలది, కలుగు చిక్కులు మన పట్టుదలను హెచ్చించును. మన సముత్సాహపు వేడిమికి కొండలంతటి అడ్డంకులు కరగిపోవును. వినూతన శక్తిసామర్థ్యములు మనలో వికాసము నొందును.

దృఢమైన ఆత్మవిశ్వాసముతో మానవుడు సమున్నతుల సాధించుకోవలెను – శ్రీకృష్ణ భగవానుడి ట్లనెను కదా (భగవద్గీత VI–5)

> ఉద్ధరే దాత్మ నాత్మానం
> నాత్మాన మవసాదయేత్
> ఆత్మైవ హ్యాత్మనో బన్ధు
> రాత్మైవ రిపు రాత్మనః.

పురుషుడు తనమనస్సు నుద్ధరించుకోవలె. తాను తన మనస్సును పడిపోనీరాదు. తనకు తనమనస్సే బంధువు, తనమనస్సే శత్రువు కనుగొని పనిగొనదగిన శక్తిసామర్థ్యములు మనలో ప్రతియొక్కరిలోను గలవు. కనుగొనకయు పనిగొనకయు నొక డుండునేని తప్పు

వానిదే. అతడు తనకు తానే శత్రు వగును. తానే కల్పించుకొన్న రాగద్వేషాహంకారమయ కారాగారమున నతడు బంది యగును. ఇక నత డట్లుండవలసినదేనా, బాగుపడు దారి లేదా యనిన–ఉన్నది. అతడు తనలోని ఉదాత్తప్రకృతిని ప్రబోధించుకొని తన్ను కాపాడుకోవలయును.

ఆత్మవిశ్వాసమును అహంకారమునకు పర్యాయపదముగా కొనరాదు. ఆత్మశక్తి నావిష్కరించుకొనుట కడ్డపడునది అహంకారమే. అహంకారముతో ఏపని చేసినను ఆపని ప్రతిబంధకముగ పరిణమించును. అహంకారము నణచుకొన్నకొలది సమున్నతులు సమకూడుచుండును. కావున ఎవడుగాని తన్నుతా నదుపులో నుంచుకొనుట యనగా అహంకారము నణచిపెట్టుటే. అది సుకరము కాకున్నను, మనసుంచినచో సాధ్యమగును. అహంకారము నణచుకొనుటకు శ్రీరామకృష్ణు డేమి చేసెనో గుర్తించుట లాభదాయకము. శ్రీరామకృష్ణుడొక మాదిగ వానింటికి పోయి "నీయింటిని నేను పరిశుభ్రమొనర్తును.అందులకు నీ వనుమతింపవలయు" నని ప్రార్థించె నట. వీధుల నూడ్చి శుభ్రపఱచుట మాదిగవాని పని. అత డేయింటికైనను పెరటిదారిని రావలసినదే కాని, తలవాకిలి గుండ రాగూడదు. పెరటిదారిని వచ్చి యింటిని శుభ్రపఱచి యతడు పోయిన పిదప అతడు కాలిడిన తావులనెల్ల ఆమైల తొలగుటకై గంగోదకము చల్లుదురు. బ్రాహ్మణుడు మడి, మాదిగవాడు మైల. మఱి ఈ బ్రాహ్మణుడు (శ్రీరామకృష్ణుడు) తా నొకమాదిగవానింటి నూడ్చి శుభ్రపఱుపగోరెను. అందుకు మాదిగవా డంగీకరింపడాయెను. ఏలయన బ్రాహ్మణునిచే నట్టి నీచకార్యము చేయించుట కులహానికరమగు మహాపాప మని మాదిగవాని నమ్మకము. కావున అర్ధరాత్రివేళ నందఱు నిద్రించిన పిమ్మట శ్రీరామకృష్ణుడు మాదిగ వానింట జొచ్చెను. ఆయనకు సుదీర్ఘములగు శిరోజము లుండెడివి. వానితో ఆయన ఆ యింటి నూడ్చె నట. "అమ్మా, అంత్యకుల జునికి కింకరునిగ నన్నొనర్పుము. అతనికంటె క్రిందిమెట్టువాడ నను తలంపును నాకు కలిగింపు" మని లోకజననిని ప్రార్థించెను. "నా భక్తులను భజించువారే నన్ను భజించువారిలో పరిష్ఠులు. వీరు నాబిడ్డలు, వీరి కుపచరింపగల్గుట మీకు భాగ్యలభ్యము" అనుట హిందూ శాస్త్రగ్రంథముల యుపదేశము. బైబిలులోను ఈ యుపదేశము కలదు.

ఒరులకు సేవ చేయుట అహంకారమునకు విఱుగుడు. కాని సేవ చేయుచునే కొందఱు పేరుప్రతిష్ఠల నభిలషింతురు. అట్టియభిలాషలు అహంకారవివర్ధకములు. కావున అహంకారము నణచు సంకల్పముతో నిస్స్వార్థబుద్ధితో సేవ చేయవలెను. ఎదుటివానిని దైవముగను అతనికి చేయు సపర్యను భగవదారాధనగను భావించుట ఎంతయు ప్రశస్తము. అట్టిభావన అహంకారమునకు భంజకము. అట్లు సపర్య చేయువానిలో నహంకారము నిల్చియున్నను అది భక్తాహంకారము, దాసాహంకారము. ఆ యహంకార మతనికి పతనము కూర్పదు, సమున్నతిని గలిగించును.

మానవుని స్వభావమే, మానవతయే అహంకారము. అది తొలగినచో నిక మిగులున దేది – అను ప్రశ్న తలచూపుచున్నది. ఈ ప్రశ్నకు జవాబును మనబుద్ధుల సీమావధుల కవ్వలినుండి పడయవలయును. యోగులయు మహర్షులయు ననుభవములు మన

బుద్ధుల యవధుల కవ్వలివి. వారి జీవితములను సునిశితముగ పరికింతుమేని, అహంకార మంత రించినప్పుడే యథార్థమానవత్వము మహోజ్జ్వలముగ వెలుగొందునని తెలిసికొనగలము. మానవుని గూర్చినట్టియు జగత్తును గూర్చినట్టియు పరమార్థమునకు వారు సాక్షులు. ద్వంద్వములకు మఱుగుననున్న ఏకాద్వితీయ పరమార్థమునకు – వారు సాక్షులు. వారు మనల ''ననుభవమున చూడు'' డని హెచ్చరింతురే కాని ''మేము చెప్పునదే సిద్ధాంత'' మనరు. ''రాత్రులందు ఆకసమున లెక్కకు మిక్కిలియైన చుక్కలు కననగును, సూర్యు డుదయింపగనే అవి కానరావు. పగటి వేళ మింట చుక్కలు లేవన గలవా? ఓ మానవుడా, అవిద్యలోబడి భగవంతుని నీవు చూడజాలక పోయినంతమాత్రమున భగవంతుడు లేడని వాదింపకు'' కామక్రోధలోభముల తుడిచివైచికొని భగవంతుని దర్శింప ఆర్జవముతో గోరు నతనికి భగవత్సాక్షాత్కారము గలుగును. ఈసూక్తి సత్యము కాదా అనుటను మనల పరీక్షించి చూడు డని మహర్షులు సవాలు చేయుచున్నారు. ఆస్తిక్యమునకును హేతువాదమునకును ఎట్టి విరోధమును లేదు. సారాసారముల నిర్ణయించుటకు హేతువాదమునే ఆస్తికులు వినియోగించుకొందురు. నిరాశాహతులకు ఆ మహర్షులవాక్కులు ఆశాసందేశము నందించుచున్నవి. ఎవరికిని సెగి లేదు, పాపము లేదు. అందఱును అమృత పుత్త్రులు. అందఱును పరబ్రహ్మమను గంతవ్యము వంకకే పురోగమించు చున్నారు. కొందఱు త్వరగ చేరుకోవచ్చు, కొందఱు మెల్లగ చేరుకోవచ్చు. అంతే భేదము. మనలో నున్న దివ్యత నావిష్కరించుకొను జతనములే మన విజయములు, పరాజయములు, సుఖములు దుఃఖములు, ఆశలు నిరాశలు. ఎంతటి దుర్జను నందైనను సరే–దివ్యత యున్నది, కాలమువచ్చినప్పు డది ప్రజ్వలింపగలదు. నేటి దుండగీండ్రే రేపటి డింగరీండ్రు (=భక్తులు) కాగలరు.

ఛాందోగ్యోపనిషత్తులోపలుపర్యాయములు వచ్చు ఉత్తారకమైన వాక్యము ''తత్ త్వమసి''. ఈవిషయ మతి సూక్ష్మగ్రాహ్యమైనందున దీనిని ఉదాహరణముల జూపుచు ఉపనిషత్తు వివరించును. అందొకదాని నిట జూపుచున్నాము. ఇది తండ్రి కొమాళ్ళైన ఉద్దాలక శ్వేతకేతువుల సంభాషణరూపమున నున్నది.

''న్యగ్రోధఫల మత ఆహ' రే, 'తీదం భగవ' ఇతి, 'భి' న్ధీతి, 'భిన్నం భగవ' ఇతి, 'కి మత్ర పశ్యసీ, త్యణ్వ్య ఇ వేమా ధానా భగవ ఇ త్యాసామ ఙ్గైకాం భి' న్ధీతి, భిన్నా భగవ' ఇతి, కి మత్ర పశ్య సీతి న కిఞ్చన భగవ' ఇతి''

తగ్ం హో వాచ యం వై సో మ్యైత మణిమానం ననిభాలయస ఏతస్య వై సో మ్యైషో ఉణిమ్న ఏవం మహాన్యగ్రోధ స్తిష్ఠతి శ్రద్ధత్స్వ సో మ్యేతి,

స య ఏషో ఉణిమైతదాత్మ్య మిదం సర్వం తత్సత్యగ్ం స ఆత్మా త త్త్వమసి శ్వేతకేతో

''ఆ మఱ్ఱికాయ నిటు తే'' ''దేవా, ఇదిగో, తెచ్చితిని'' ''దానిని పగులగొట్టు'' ''దేవా, ఇదిగో పగులగొట్టితిని'' ''దానిలో నేమి కనిపించుచున్నది'' ''దేవా, చిన్న విత్తనములు'' ''ఏదీ, ఒక విత్తనమును పగులగొట్టుము'' ''దేవా, ఇదిగో పగులగొట్టితిని'' ''దానిలోపల నేమి కనిపించుచున్నది'' ''దేవా, ఏమియు కనిపించుట లేదు.''

అంత నత డతనితో నిట్లనెను:"సౌమ్యుడా, నీచూపున కందక అందున్న సూక్ష్మసారము నుండియే బ్రహ్మాండమంతటి యీ మఱ్ఱిచెట్టు పుట్టువొందినది. నమ్ముమా.

అత్యంతసూక్ష్మమును సారతమము నేదో అదే ఈ జగత్తున కాత్మ. అదే సత్యము. అదే పరమాత్మ. ఓ శ్వేతకేతూ, అదే నీవు.

ఇట్లు తండ్రి ఉపదేశింపగా శ్వేతకేతువు పరమాత్మతోడి తన యైక్యమును సాక్షాత్కరించుకొనెను. ఆ పరమాత్మ అజము అమరము అభయము నిరంజనము అద్వైతము. అదే పరమలక్ష్యము దానిని చేరుకొన్న పిమ్మట ఇక అవ్వలికి చనుట లేదు. అదే పరమసిద్ధి.

పైని చెప్పినదాని కంతటికిని సారము: నీవు బ్రహ్మమవు. దీనిని బుద్ధిచే నెఱుగుట చాలదు నీవు బ్రహ్మమవు అనగా నీలో బ్రహ్మము (= దేవత్వము) గర్భితముగ నున్నది. బాహ్యాంతర ప్రకృతి నంతయు నిరోధించి అంతర్గతమగు నీ దేవత్వమును వ్యక్తము చేయుటయే జీవిత పరమావధి. ఇందులకై కర్మభక్తియోగజ్ఞాన మార్గములలో నొక్కదానిని గాని కొన్నిటిని గాని అన్నిటిని గాని యవలంబించి ముక్తుడవగుము.

భిద్యతే హృదయగ్రన్థి
శ్ఛిద్యన్తే సర్వసంశయాః
క్షీయన్తే చాస్య కర్మాణి
తస్మిన్ దృష్టే పరావరే.

కారణాత్మకమును కార్యాత్మకమును అగు బ్రహ్మమును సాక్షాత్కరించుకొన్న సాధకుని డెందపుముడులు (= అవిద్యావాసనాప్రచయమును బుద్ధ్యాశ్రయములు నగు కామములు) విడిపోవును. సందేహము లన్నియు విచ్ఛిన్నము లగును. ప్రారబ్ధము, సంచితము, ఆగామి అను ముత్తెగల కర్మములలో నతనికి తొలిది తప్ప తక్కినవి రెండును అంతరించును. (ముణ్డకోపనిషత్తు II ii-8)

ఐహికముగ సుఖశాంతి సమృద్ధులకై మన పడుపాట్లవలన గలుగు లాభమునకంటె శ్రమమే హెచ్చు. వీలయిన సుఖములనంటి దుఃఖములును సంభవించుచుండక తప్పదు. ఆత్మసాక్షాత్కారముచే గలుగు ఆనంద మన్ననో అసమ్మిశ్రము అనంతము.

ఐనను మన లౌకికవ్యాపారములను ఆశయములను వీడు డని చెప్పుట లేదు. వానిని ఉదాత్తలక్ష్యమువంకకు మరల్చుకొనుట కర్తవ్యము. బ్రహ్మమే జగత్తుగ రూపొందినది. ఆ బ్రహ్మముతో నైక్యమును సాక్షాత్కరించుకొన్న మానవుని జీవితమున కొక యపూర్వ సార్థకత కలుగును. అతడు సాగించు కర్మాచరణము భగవదారాధన మగును. స్వార్థరహితమగు నతని కర్మపరత ప్రేమౌదార్యములకు, త్యాగసేవలకు, ఉత్తమలక్ష్యమగును. భౌతికరసాయనికాదిశాస్త్రశ్రద్ధాళువులు సత్యమును వెలుపలి ప్రపంచమున నన్వేషించుచున్నారు. వారు తమ చూపులను అంతరముగను పర్వింతురేని భవవిమోచకమైనట్టి పరమాత్మ సాక్షాత్కారము నొందుదురు. ఆ సాక్షాత్కారమే మానవజీవితమున కేకైక లక్ష్యము. దానిని సాధించుకొన పాటుపడవలసిన దెప్పుడో కాదు, ఇప్పుడే! 'అలసింపక పూనుడో యయ్యలార'

# నరేంద్రుని ధీవికాసము - మూర్తిమత్త్వము

శ్రీ చిరంతనానందస్వామి

అహంకారనిర్మూలనమున కనుకూలింపని విద్య కేవల మవిద్య. ఆత్మసందర్శనమునకు దోడ్పడని జ్ఞాన మజ్ఞానము. ఆధునికకళాశాలల లోని విద్యావిధాన మాత్మవిద్య నప్రధానముగ బరిగణించుటచే కళావిహీనమై యున్నది. శాస్త్రములను జదివినంతనే, కళలను నేర్చినంతనే, మనుజుడు విద్వాంసుడు కానేరడు. ఎవ్వ డహంకారరహితుడో, ఎవ్వ డాత్మజ్ఞుడో, వాడే విద్వాంసుడు. అట్టివానికి పాండిత్య మెందులకు? శ్రీరామకృష్ణున కేమిపాండిత్యమున్న దని విద్యావాచస్పతియగు నరేంద్రు డాతని నాశ్రయించెను? ధర్మమనునది - వేదాంతమనునది - గ్రంథములతోడను సిద్ధాంతములతోడను గూడినవిషయము కానేరదు. భగవద్దర్శనమే ధర్మము. ఆత్మజ్ఞానమే వేదాంతము. తద్వ్యతిరిక్తమంతయు నధర్మము, మెట్ట వేదాంతము!

నవీనవిశ్వవిద్యాలయముననే నరేంద్రుడు విద్యనభ్యసించినను సనాతనవిద్యావిధానమును విడువలేదు. సుమమునకు సుగంధమురీతిని సహజమగు నతని పారమార్థికప్రవృత్తికి తల్లిదండ్రులు కల్పిన సుశిక్షణమును, శిక్షణము నినుమడించు సద్విద్యయు, విద్యకు వన్నె దెచ్చు శ్రీరామకృష్ణసాన్నిధ్యమును దోడ్పడ నతని ప్రతిభ శారదపూర్ణిమాచంద్రునివలె ప్రకాశింపసాగెను.

ధీవికాసమున నరేంద్రు డద్వితీయుడు. బాల్యముననే ముగ్ధబోధవ్యాకరణ మాతనికి కంఠస్థము. పదునేడవయేట సంస్కృతశ్లోకములను ధారాళముగా వ్రాయు సాహిత్య మాతని కలవడెను. మాతృభాషలో నాతడు వ్రాసిన గ్రంథములు నవీనవంగవాఙ్మయనిర్మాతలలో నాతనికి ప్రధానస్థానము నొసగుచున్నవి.

కళాశాలలో నరేంద్రుడు తత్త్వశాస్త్రము నభిమానశాస్త్రముగా స్వీకరించి పాశ్చాత్య తత్త్వజ్ఞుల గ్రంథములను తీవ్రముగా చదువ నారంభించెను. స్పెన్సరు, కాంటు, షోపెన్హోయరు, జాన్‌స్టూవర్టుమిల్లు, ఆగస్టుకాంటు, అరిస్టాటిలు మున్నగువారి తత్త్వశాస్త్రములను సమగ్రముగా జదివెను. తన వేదాంతకాంతిని పాశ్చాత్య విజ్ఞానఫలకమున ప్రతిఫలింపజేసి పాశ్చాత్యులను పాశ్చాత్యమానసపుత్త్రులను సులభముగా నరికట్ట సమర్థు డయ్యెను.

నరేంద్రునిమానసము కొంతవఱకు పాశ్చాత్య తత్త్వశాస్త్రపు తళుకుబెళుకులచే నాకర్షింపబడినను ఆత డెన్నడును వ్యామోహితుడు కాలేదు. విశేషము, సనాతనవేదాంతవ్యాఖ్యానముల నాధునికదృష్టితో జదివి ప్రాచ్య పాశ్చాత్యతత్త్వశాస్త్రములకు గల తారతమ్యమును పరిశీలింపసాగెను. కాని సనాతనధర్మ సిద్ధాంతములను నరేంద్రుడు శిరసా వహించుటకు ముఖ్యకారణ మాతని తార్కికప్రతిభాతిశయము కాదనియు శ్రీరామకృష్ణపాదకమల సాన్నిధ్యమే యనియు చెప్పవలసియున్నది.

వేదాంతమునకు పిమ్మట దేశచరిత్రలు నరేంద్రుని ధీశక్తి నాకర్షించినవి. మహాపురుషుల జీవితాశయములచే వివిధదేశములలో - వివిధ పరిస్థితులలో - మానవసంఘము లెట్లెట్లు పరిణామము చెందెనో యాతడు పరికించెను. రోమన్ సామ్రాజ్యచరిత్ర నాతడు ప్రత్యేక శ్రద్ధతో పఠించెను. వివేకానందుడై రోము నగరమున కేగినపుడు ప్రాచీనరోమన్ ప్రజా

స్వామికప్రభుత్వముల వైభవమును తత్పతన హేతువులను కన్నులకు కట్టినట్లు వర్ణించి పాశ్చాత్యుల కాశ్చర్యముగొల్పెను.

ఆత్మవిశ్వాసబలమే నెపోలియనును మహావీరుని గావించె నని నరేంద్రుని విశ్వాసము. ఆత్మవిశ్వాసమే నరేంద్రుని జీవితరహస్యము, వివేకానందుడై ప్రపంచమున కాత డొసగిన సందేశామృతసాగరమునందలి మహోత్తుంగ తరంగము. దౌర్బల్య మనిన నరేంద్రునకు పరమాసహ్యము.

వేదాంతము నరేంద్రునకు కిరీటమైనచో కవిత్వ మాతని కంఠాభరణము. 'వర్డ్సువర్తు' పాశ్చాత్య కవీంద్రుడని నరేంద్రు డాతని గీతముల ననేకముల కంఠస్థముచేసెను. కవిత్వ వేదాంతాదిశాస్త్రములును కళలును పరమార్థము ననేకవిధములుగా ప్రదర్శించుచున్నవని యాతడు భావించెను. జ్ఞానాగ్నిని ప్రజ్వలింపజేయుటే వాని ప్రయోజన మని విశ్వసించెను.

విద్యాభ్యాసమున నరేంద్రు డెంతనిమగ్నుడైనను, ఎంతటి తీవ్రకృషిసల్పినను, ఆతని జీవనసౌరభమగు శాల్యోల్లాసము మాత్ర మెన్నడును వీడ లేదు. కథలు చెప్పుచు హాస్యములు కల్పించుచు కళాశాలలో నాత డానందమున కాటపట్టయి యుండెడివాడు. ఆటలలో, పాటలలో, భజనలలో, ప్రార్థనలలో - నరేంద్రుడే నాయకుడు. యువకులలో నేసంఘము వెలువడినను, ఏ సమాజము బయల్వెడలినను, అందు నరేంద్రుడు లేనిచో, పౌరుల కేదియో వెలితిగా గాన్పించు.

నరేంద్రుని వ్యక్తిత్వ మనన్యసామాన్యము. ఆతనిప్రతిభ సర్వతోముఖము; కొంటెతనమున బాలకుడై, గానమున కోవిదుడై, ప్రజ్ఞావిశేషమున పండితుడై జీవితాదర్శమున వినిర్మల వేదాంతియై సకలగుణాభిరాముడై నరేంద్రుడు విలసిల్లెను.

ఏమైనను బంధవిమోచనమే నరేంద్రుని యభీష్టము. సన్న్యసింపవలయు నను తీవ్ర వాంఛయే యాతని హృదయమున గొట్టుకొను చుండినది. ఈ సమయమున నరేంద్రుని మనఃస్థితినిగూర్చి యాతని సహపాఠకుడగు డాక్టరు ప్రజేంద్రనాథసీ లిట్లు వ్రాసియున్నాడు —

'...సారహీనములగు చదువు లనిన నరేంద్రునకు తలనొప్పి. పుస్తకముల వలన జ్ఞానమును గ్రహింపజూచుట కంటె సజీవమగు తత్త్వానుసంధానముచే స్వానుభవముచే వానిని బడయుటే యాతని యభీష్టముగా నాకు తోచెను ... ఇంద్రియసుఖములును యావనవికారములును నాతనికి రోతగా గన్పట్టెను......'

న్యాయశాస్త్రవిద్యార్థియై 'బి. ఎల్.' పరీక్షకు పోబోవుచు నరేంద్రుడు తనమిత్రునితో "బంధవిమోచనమే నాకు వాంఛనీయము, పరీక్షయు గిరీక్షయు నాకు వలదు" అని పలికించు టాశ్చర్యము కానేరదు.

సంశయధూమ మణగినంతనే దేదీప్యమానమై వెల్గు జ్ఞాన తేజమును గనుగొనుటకై నరేంద్రుడు పరితపింపసాగెను. ప్రపంచము శూన్యమై దుఃఖభూయిష్ఠమై యాతనికి గన్పట్టెను. సంశయసాగరమునబడి యాత డెట్టి మానసికయాతనల ననుభవింపవలసివచ్చెనో యెవరు వర్ణింపగలరు? ఐనను అజ్ఞేయవాదము నాస్తికవాదము మున్నగు ప్రచండతరంగముల నెదిర్చి నిలువగలుగుటకు పరమేశ్వరధ్యాన నౌకాశ్రయమే ప్రబలకారణము. శ్రీరామకృష్ణుని వచనములను స్మరించి ధ్యానస్థితుడై యాతడు మనశ్శాంతిని బడయుచుండెడివాడు.

"హృదయపూర్వకమగు ప్రార్థనను పరమేశ్వరు డాలకించును. నన్ను నీ వెట్లు ప్రత్యక్షముగా జూచుచుంటివో భగవంతు నంతకంటె వేయి రెట్లు విస్పష్టముగా జూడవచ్చును భగవ ద్వచనములను వినవచ్చును, భగవంతుని స్పృశింపవచ్చును." మఱియు "భగవత్స్వరూపములను విశ్వసింపక యయ్యవి మనఃకల్పితములని విసర్జింతువు గాక, కాని జగన్నియామకహేతువగు నాద్యంతరహిత వస్తు వొండు కలదని నమ్మెదవా? ఐనచో నిట్లు ప్రార్థింపుము—ఓ పరాత్పరా, నిన్ను నే నెఱుగను, నన్ననుగ్రహించి నీ యథార్థ తత్త్వమును నాకు వెల్లడింపుము." 'మనఃపూర్వకముగా ప్రార్థించినచో భగవంతుడు నీ ప్రార్థన నాలకించి తీరును' అను శ్రీరామకృష్ణ వాక్యరత్నములు నరేంద్రు నుత్సాహపూరితు నొనర్చినవి. 'జగన్నియామకుడగు పరమేశ్వరు డొకడు కలడని మనధీశక్తి యించుక సూచించునే కాని 'ఇద మిత్థ' మని నిర్ణయింపజాల' దను హామిల్టనుమహాశయుని వచనములను నరేంద్రుడు విశ్వసించెను యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ' అని కదా వేదము లుద్ఘోషించుచున్నవి! పరమేశ్వరు డవాఙ్మానసగోచరుడు. చర్చాతర్కము లంత మొందిననే కాని బ్రహ్మానుభవము ప్రారంభము కానేరదు. నరేంద్రుడు తఱచుగా నీ వచనముల నుదాహరించువాడు.

గానము ధ్యానము గ్రంథపఠనము-ఇవియే నరేంద్రుని మానసము నాక్రమించినవి. ఇంట నందఱును నిద్రించిన వెనుక నాతడు ధ్యానస్థితు డగును. బాహ్యప్రపంచమును మఱచి యనిర్వాచ్యానందముతో నాత డిట్లు గంటలు గడపును. ఇట్టి సమయముననే యాత డొకప్పుడు బుద్ధదేవుని దర్శించెను.

శ్రీరామకృష్ణసాన్నిధ్యప్రభావమున నరేంద్రుని మానసికాధ్యాత్మికశక్తు లఖండాభివృద్ధి గాంచెను. అతనిమూర్తి తేజస్వంతమై సర్వజనవశీకరణసమర్థమై యొప్పెను. సింహగంభీరాకృతితో నాతడు నడచునప్పుడు ప్రత్యవయవమునుండియు విలాసము ఉట్టిపడుచుండును. ఒకప్పు డించుక మందగమనముతోడను మఱియొకప్పు డొకించుక శీఘ్రగమనముతోడను మహోన్నతాశయపూరితుడై సంచరించు పట్టున నాతనిమూర్తి విరాజిల్లుచుండెడిది.

నవయౌవనసంశోభితుడగు నరేంద్రునిశరీర మెక్కుడు పొడుగు నెక్కుడుపొట్టియు గాక సమానోన్నతి గల్గి శోభిల్లుచుండెను. దేహదార్ఢ్య మాతనియందు మూర్తీభవించెను. విశాలమగు నాతని వక్షఃస్థలమును ఉన్నతమగు లలాటమును ఆతని హృదయవైశాల్యభావోన్నత్యములను బ్రకటించుచుండెను. అన్నిటికంటెను మనోహరములై లోకము నాకర్షించిన వాతని నేత్రకమలములు. వానిని గాంచి శ్రీరామకృష్ణ డాతనిని 'కమలాక్ష' యని పిలుచువాడు. అవి యోగినేత్రములు. అంతరవలోకనాయత్తచిత్తము నవి దివ్యకాంతులతో బ్రకటించును. అతడు సంభాషించునప్పుడు శ్రోతలకు ప్రపంచమున నాతడు తక్క వేఱేదియు కన్పట్టదు. ఆతని వచనములు సమ్మోహనాస్త్రము లయ్యును జ్ఞానదానమందు వెల్లివిరియుచుండును.

ఆతని వదనారవిందమో, బాలోల్లాసనిలయము. మఱియు మనఃపూర్వకమై దయారసము నొలికించు నవ్వు ఇట్టి స్వరూపసంపదచే కొందఱి కాతడు దీర్ఘదర్శివలెను మఱికొందఱకు విలాసప్రియునివలెను గాన్పించును. కాని సర్వ

జనులకును నరేంద్రు డున్నతవంశసంజాతు డని యాతని జూచినంతనే స్ఫురించును.

నరేంద్రుడు తీవ్రదృష్టితో జూచినచో నాతనివదనము మిత్రులకుసైతము భయము కలుగజేయును. కోపము వచ్చినచో నాతడు కాలరుద్రుడే. ఐనను తోడిశిష్యు లాతని పసిబాలునిరీతి భావించుచు, అట్టిసమయములందు సైత మమితానురాగము జూపుచుండెడివారు. చర్చించునపు డావేశపూరితుడైనచో నాతని ముఖమును కన్నులును ప్రచండములై ప్రజ్వలించును. ఆలోచనానిమగ్నుడైనచో నాతని నెవ్వరును సమీపింపజాలరు. ఐనను సంగరహితత్వ మాతనియందు ప్రత్యక్షమై గోచరించును. నిజముగా నాతని ప్రతిభాతిశయ మపూర్వము. సమయోచితములగు భావములను ప్రదర్శించు మూర్తి యాతని సొత్తై యొప్పినది. అతని నిస్తుల నిరాడంబరత్వమును నాతని ప్రేమపూరితప్రవర్తనమును అన్నిటికంటెను మించిన యాతని సంగరహితదృక్కులును నట్టిమూర్తిమత్త్వమును దివ్యాభరణమునందలి రత్నములు.

శ్రీరామకృష్ణునిమూలమున నరేంద్రుని ప్రతిభాతిశయమును హృదయవికాసమును అద్భుతమగు రీతిని సమన్వయ మొందెను. స్వభావముచే నరేంద్రుడు వేదాంతి. శ్రీరామకృష్ణు డాతని భక్తునిగా నొనర్చెను. మనోహరమగు నాతని కల్యాణమయస్వరూపసంపద భక్తునియొద్దనే కాని కాన్పింప దని శ్రీరామకృష్ణు డిట్లు వచించును. "జ్ఞానులకు తఱచు స్వరూపవైభవ ముండదు. భక్తునిస్వరూపమో నేత్రపర్వము చేయుచుండును." ఏమైనను నరేంద్రునివచనములే యాతని యథార్థస్వభావమును మనకు వెల్లడించును. వివేకానందుడై యొకశిష్యున కాత డిట్లు తెల్పియున్నాడు: "గురుదేవుడు బాహ్యమునకు భక్తాగ్రేసరుడు, అంతర్యమున జ్ఞానమూర్తి. నేనో, బాహ్యమున కెంతయు జ్ఞానిని; కాని నా హృదయము భక్తిమయము."

# ఖేత్రి పండిత శంకరలాలుకు స్వామిజి లేఖ

బొంబాయి
సెప్టెంబరు 20, 1892.

ప్రియపండితమహాశయా,

తమజాబు నాకు సక్రమముగా చేరినది. ప్రశంసల కర్హత నాకు లేకుండగా, నన్నట్లేల పొగడవలెనో నాకు తెలియదు. జీసుసుప్రభువు చెప్పియున్నట్లుగా 'ఉన్న మంచివా డొక్కడే, దేవుడు, వే ఱెవరును లేరు'. ఇతరు లందఱును దేవునిచేతి యుపకరణమాత్రులే. పరాత్పరుడగు సర్వేశ్వరునకు జయము. అర్హులైనవారికి జయము. కాని నాబోటి యనర్హునకు కాదు. ఇచ్చట 'దాసునకు బత్తెమున కర్హత లేదు.' అందును ఫకీరున కట్టి ప్రశంసార్హతయు లేదు. తనవిధిని నిర్వర్తించినంతమాత్రమునకు మీరు మీకింకరుని కొనియాడుదురా?

...పండిత సుందర్లాల్జీయు మా గురువుగారును* దయతో నన్నిట్లు జ్ఞప్తియం దుంచు

* స్వామీజీకి మహాభాష్యము పాఠము చెప్పినవారు.

కొని యున్నందులకు ఇంతంతనరానంతగా కృతజ్ఞుడను.

ప్రస్తుతము మీకు మఱొక విషయమును చెప్పెదను. హిందువులకు మూలసూత్రమును బట్టి తేలు విషయములను గురించుకొనుచు పోవు (డిడక్టివ్) చిత్త మున్నదే కాని, విషయములనుబట్టి మూలసూత్రమును తేల్చుకొను (ఇన్డక్టివ్) చిత్త మెప్పుడును లేదు. ఒక సామాన్యసూత్రమును మున్ముందు నిరాక్షేపముగ తలదాల్చి కేశనిర్భేదనకల్పములగు వాదములు సాగించుట మన శాస్త్రగ్రంథములందన్నిట కానవగును. కాని తలదాల్పబడిన ఆ సూత్రమే ఎంతయు శిశూచితముగ నుండవచ్చు. మూలసూత్రముల యాథార్థ్యమును ఆక్షేపించినవాడుగాని పరిశీలించినవాడుగాని యెన్నడును లేడు. స్వతంత్రముగ ఆలోచించుట మనలో లేనే లేదు. కావున విశేషములను పరికించి మూలసూత్రముల నెఱుగు యత్నముచే రూపొందు విజ్ఞానశాస్త్రములు మనలో మృగ్యము లైనవి. ఇట్టి పరిస్థితికి కారణమేమి? రెండు కారణము లున్నవి. కార్యోత్సాహమునకంటె ప్రశాంతియందును భావనయందును అధిక ప్రీతిని గలిగించు తీవ్రోష్ణ వాతావరణ మొక కారణము. పురోహితు లైన బ్రాహ్మణులు దూరదేశములకు ప్రయాణింప నెన్నడును పూనుకొనక పోవుట రెండవ కారణము. పర్యటించినవా రున్నారు, దూరదేశములకు పోయినవా రున్నారు. కాని ప్రాయికముగ వారందఱును స్వలాభైకపరత చేతను మతాచార్యకైతవము చేతను వైజ్ఞానికముగ నభివృద్ధి జెందు అవకాశము పూర్తిగా కోల్పోయినట్టి వర్తకులు. కావున వారు చూచి చేసిన తెలివిడులవలన మానవుల విజ్ఞానమునకు వృద్ధి గలుగక క్షయమే చేకూరినది. వారు చూచి చేసిన తెలివిడు లన్నియు తప్పులు, అతిశయోక్తులు, బొత్తిగా గుర్తు చిక్కనంత వికృత ప్రతిపాదనలు.

కాబట్టి మనము పర్యటింప వలయును, అన్యదేశములకు పోవలయును, తెలిసినదా? మనముకూడ ఒక దేశీయులముగ మరల గణన కెక్కవలె ననిన అన్యదేశములలో సంఘయంత్ర మెట్లు పనిచేయుచున్నదో పరిశీలింపవలెను. ఇతర దేశాలవారి మనస్సులలో ప్రవర్తిల్లుచున్న విషయాలతో మనకు నిర్నిరోధమును బాహాటమునైన సాంగత్య ముండవలయును. అన్నిటికన్న ముఖ్యమైన దేమనగా మనము దురధికారము చూపుట మానుకోవలెను. ఎంతటి పరిహాసాస్పదమైన దశకు మనము వచ్చితిమి! ఒక మాలడు, మాలడుగానే ఎవనియొద్దకేని వచ్చునేని ప్లేగువ్యాధిని తఱిమిన ట్లతనిని తఱిమివేయుదురు. కాని అతడే ముందుగా నొకపాదిరియొద్దకు పోవు ననుకొనుడు. ఏవో కొన్ని ప్రార్థనమంత్రాలు గొణగి ఆ పాదిరి ఒకగిన్నెడు నీరు అతనినెత్తిని చల్లు ననుకొనుడు. తర్వాత అత డొక కోటును—ఎంతో శిథిలమైన కోటునైనను సరే. తగిలించుకొని మిక్కిలి సనాతనాచారపరుడగు హిందువుండు గదిలోనికి వచ్చు ననుకొనుడు. అప్పు డతని కొక యాసన మీయక, హృదయపూర్వకముగ అతనితో కరచాలనము చేయక ఉండగల ధైర్యవంతుడు సనాతనాచారపరులగు హిందువులలో నా కగపడలేదు. వైపరీత్యమున ఇంతకు మించినది లేదు. దక్షిణ భారతదేశమున ఈ పాదిరీ లేమి చేయుచున్నారో వచ్చి చూడుడు. నిమ్నవరాల ప్రజలను వారు లక్షలకొలదిగ తమ మతములోనికి కలుపుకొనుచున్నారు. పురోహితుల యధికారము భారతదేశమందంతటిలోను తిరు

వాన్కూరులో ఎక్కువ. అచటి భూమియందు ప్రత్యంగుళమును బ్రాహ్మణుల యాస్తి. అచటి మహిళలు-రాజకుటుంబమునకు చెందిన మహిళలుసైతము బ్రాహ్మణుల కుంపుడుగ త్తెలుగ నుండుట తమకు మహోన్నత గౌరవ మని భావింతురు. అటువంటి తిరువాన్కూరి ప్రజలలో ఇంచుమించు నొకపాతిక భాగమువారు క్రైస్తవులుగ మాఱిరి. నేను వారిని నిందింప జాలను. దేవిడ్డులోను జెస్సెలోను వారి కేమి వంతున్నది? ఓ దేవా, మానవుడు మానవునికి సోదరుడుగ నుండు కాల మెప్పుడు వచ్చును? ఎప్పుడు?

భవదీయు,

వివేకానంద.

# 'వివేకానంద' 'నరేంద్రనాథసేను'ల సంవాదము

(శరచ్చంద్ర చక్రవర్తి దినచర్యాజ్ఞాపికలోనుండి)

[స్థలము: కలకత్తా, బాగ్‌బాజాఱులో కీ. శే. బాబుప్రియనాథముఖోపాధ్యాయుని గృహము. సంవత్సరము: 1897]

స్వామిజీ*పాశ్చాత్య దేశములనుండి మొదటి తడవ మన దేశమునకు తిరిగివచ్చి, కలకత్తాలో అడుగుపెట్టి, మూడునాలుగునాళ్లైనది. చిరకాలానంతరము ఆయన పవిత్రసాన్నిధ్య భాగ్యము మరల చేకూరుటచే శ్రీరామకృష్ణ భక్తగణము పొందుచున్న ఆనందమునకు మేర లేదు. అందు ధనాఢ్యులుగా నుండువారు స్వామిజీని తమ యిండ్లకు ఉత్సాహపూర్వకముగా ఆహ్వానించి ఆదరించుట మహాభాగ్యముగా పరిగణించుచున్నారు. శ్రీరామకృష్ణ భక్తులలో నొకడగు కీ. శే. శ్రీయుత ప్రియనాథముఖోపాధ్యాయుని గృహమునకు నేటి యపరాహ్ణము స్వామిజీ ఆహ్వానింపబడెను. ఆ గృహము బాగ్‌బాజాఱులో రాజవల్లభపారాయొద్ద. స్వామిజీ వచ్చు వర్తమానము విని భక్తులనేకులు నేడు ఆ యింట సమావేశమైరి.

ఈ వర్తమాన మెట్లో తన చెవిని బడినందుచే, ఈ శిష్యుడును పై ముఖర్జీగారి యింటికి సుమారు రెండున్నఱగంటకు వచ్చి చేరెను. ఇంతదనుక అతనికి స్వామిజీతోడి పరిచయములేదు; ఇదియే ప్రథమదర్శనము.

ఈ శిష్యుని రాక చూచి, శ్రీతురీయానంద స్వామి ఇతనిని స్వామిజీయొద్దకు పిలుచుకొని పోయి ఆయనకు ఎఱుకపఱచెను. ఇతడు రచించిన శ్రీరామకృష్ణస్తోత్ర మొకటి యిప్పటికే స్వామిజీ బేలూరుమఠములో చదివి, యితనినిగూర్చి వినియుండెను. శ్రీరామకృష్ణశిష్యప్రముఖులలో నొకడగు నాగమహాశయు**నితడు దర్శించుచుండెననికూడ ఆయన వినియుండెను.

ఈ శిష్యుడు ఆయనముందు సాష్టాంగ ప్రణామమాచరించి కూర్చుండినపిదప స్వామిజీ

* శ్రీరామకృష్ణసంప్రదాయ పరిభాషలో "స్వామిజీ" అనునది శ్రీ వివేకానందస్వామికి రూఢినామము.

** దుర్గాచరణనాగ్ అను సిద్ధపురుషుడు. ఈ మహనీయుడు గృహస్థాశ్రమజీవనము చేయుచుండియు, శ్రీ గురుదేవుని మహత్త్వమును తన జీవితమున పెక్కురీతుల నత్యద్భుతముగా ప్రతిబింబింపజేయుచుండెను.

ఇతనితో సంస్కృతమున సంభాషింప నారంభించి, నాగమహాశయునిగూర్చియు, ఆయన ఆరోగ్యమునుగూర్చియు ప్రశ్నించెను. ఆయన యొక్క అమానుషవైరాగ్యమును, అపార భగవత్ప్రేమభక్తిని, వినమ్రతను, ప్రశంసించుచు స్వామిజీ ఇట్లనెను :

వయం తత్త్వాన్వేషాన్మధుకర
హతాఃత్వం ఖలు " *

(సత్యముకొఱకైన వెదకులాటవలన మేము చెడితిమి. భృంగమా—విజయముసాధించి—నీవు నిజముగా కృతార్థమవైతివి!)

ఈ మాటలను నాగమహాశయునకు తెలుపుమని ఆయన అటుపిదప ఈ శిష్యుని ఆదేశించెను. మఱికొంతసేపటికి ఆ గుంపులో ఇతనితో మాటలాడుట కష్టముగాతోచి, పడమటనున్న ఒక చిన్నగదిలోనికి ఇతనిని, శ్రీ తురీయానంద స్వామిని రమ్మని అచట ఇతని నుద్దేశించి ఈ వివేకచూడామణి శ్లోకమును చదువ నారంభించెను :

మా భైష్ట విద్వంస్తవ నాస్త్యపాయః
సంసారసిన్ధోస్తరణేఽస్త్యుపాయః ।
యేనైవ యాతా యతయోఽస్య పారం
తమేవ మార్గం తవ నిర్దిశామి

(ఓ విద్వాంసుడా, భీతిలకుము. నీకెట్టి అపాయమును లేదు. సంసారసాగరమును దాటు ఉపాయము కలదు. ఇంద్రియములను జయించిన సాధుసత్తములు దీనిని ఏ మార్గమున దాటిరో ఆ మార్గమును నీకు చూపెదను). శంకరాచార్య విరచిత వివేకచూడామణిని పఠింపుమనికూడ ఆయన చెప్పెను.

ఈ మాటలు విని డు తనలో తాను యోచింప నారంభించెను. తన్ను విధ్యుక్తముగా ఉపదేశ మందుమనియా స్వామిజీ సూచన? అత డప్పుడు నిష్ఠురపూర్వాచార పరాయణుడును, వేదాంతియు. గురువు నాశ్రయించు విషయమున అతని మదియందంతదనుక సుస్థిరభావమేదియు ఏర్పడలేదు. కుల నియమములను నిర్దేశించు వర్ణాశ్రమధర్మములందతనికి పూర్ణాభిమానము.

వివిధవిషయములనుగూర్చి ప్రసంగము నడుచుచుండగా నొకడువచ్చి మిఱ్ఱర్ (Mirror) పత్రికా సంపాదకుడగు నరేంద్రనాథసేను స్వామిజీతో సంభాషించుటకై వచ్చినాడని తెలిపెను. ఆ చిన్నగదిలోనికే రమ్మనుమని స్వామిజీ చెప్పుటచే నరేంద్రబాబు అచటికి వచ్చి కూర్చుండి, ఇంగ్లండు అమెరికా దేశములనుగూర్చి పెక్కు విషయములు ప్రస్తావించి మాటాడ నారంభించెను. అందుకు స్వామిజీ యిట్లు బదులుచెప్పెను : "అమెరికా దేశస్థుల వంటి సహృదయులు, ఉదారచిత్తులు, అతిథిసత్కారపరాయణులు, నూత్నభావములను అంగీకరించుటందు హృదయపూర్వకమగు ఆతురముగలవారు, ప్రపంచమున మఱేదేశమందును లేరు". మఱియు ఆయన ఇట్లనెను : "అమెరికా దేశములో నా ద్వారా జరిగిన పని నా శక్తివలనకాదు జరిగినది. ఆ దేశస్థుల హృదయములు మిక్కిలి యోగ్యమైనవగుటచేతనే వారు వేదాంతభావములను కైకొని అంగీకరించినది". ఇంగ్లండుదేశమునుగూర్చి ఆయన యిట్లనెను : "ఇంగ్లీషువారియంతటి పూర్వసంప్రదాయైకనిష్ఠగల జాతి లోకములో మఱెచ్చటను లేదు. క్రొత్తభావ మేదియు వారొక

* శకుంతల ముఖముమీదికి కవియుచుండు చు ఆమెను బాధించుచుండిన తుమ్మెద నుద్దేశించి దుష్యంతుడు పలుకు మాటలు—శ్రీ కాళిదాస శాకుంతలము.

మాత్రమున అంగీకరించువారు కారు. కాని పూర్ణ పరిశ్రమఫలముగా వారి నొకభావమును గ్రహింపజేసితిమేని, ఇక వారు దాని నెన్నటికిని విసర్జింపరు. అంతటి దృఢప్రతిజ్ఞత మఱేజాతి యందును కానరాదు. శక్తియందును, నాగరకతయందును, వారు లోకమున అగ్రతమస్థానమును అధిష్ఠించియుండుటకు ఇదియే కారణము.''

సమర్థులగు మతబోధకులు లభించినయెడల వేదాంత ప్రచారకార్యము సుస్థిరముగా స్థాపించు అవకాశము అమెరికాలోకన్న ఇంగ్లండులో ఎక్కువగా కలదని పల్కి ఆయన యిట నెను: కార్యమునకు నేను పునాదులు మాత్రము నిర్మించితిని. పిమ్మటిబోధకులు నా మార్గమునే అనుసరించినచో కాలక్రమమున ఎంతయో పని జరుగవచ్చును.

'మన మతప్రచారకార్యమును ఇట్లు భవిష్యత్కాలమునగూడ సాగించు నవకాశమేమికలదు?'' అని నరేంద్రబాబు ప్రశ్నించెను.

అందుకు స్వామిజీ యిట్లు బదులుచెప్పెను: ''మన దేశమునందు గలది ఈ వేదాంతమత మొక్కటియే. పాశ్చాత్యనాగరికతతో పోల్చి చూచినచో, మనయొద్ద మఱేదియు లేదనియే చెప్పవచ్చును. కాని సర్వమతముల వారికిని, సర్వవిధసాధన లవలంబించువారికిని, పారమార్థికత నార్జించుకొనుటకు సమానాధికారము నొసగు ఈ వేదాంతమతమును, ఈ సార్వలౌకికమతమును—ప్రచార మొనర్చితిమేని, నాగరికత నందిన ఆ పాశ్చాత్య ఖండవాసులు హిందూదేశ మెట్టి యద్భుతమగు ఆధ్యాత్మికౌన్నత్యమును మున్ను సాధించిన సంగతియు, ఆ ఆధ్యాత్మికత్వ మింకను సజీవమై నిలిచియే యున్న సంగతియు గ్రహింతురు. ఈ వేదాంత విద్యాభ్యాస, విచార, ఫలముగా పాశ్చాత్యులందు మనయెడ క్రమాధిక గౌరవసానుభూతు లుద్భవించును. ఇప్పటికే ఇవి కొంత యభివృద్ధి చూపినవి. ఇట్లు వారి యథార్థగౌరవసానుభూతులు మనకు లభించెనేని మనము వారి యొద్దనుండి మన ఐహికజీవనమునకు ఉపయుక్తములగు వారి విజ్ఞానశాస్త్రములను (Sciences) నేర్చుకొందుము. ఈ జీవితసంగ్రామమున గల పోటీపోరాటములలో నెగ్గి నిలుచుటకు వలయు శక్తిసామర్థ్యము లప్పుడు మనకు లభించును. మనయొద్ద ఈ వేదాంతవిద్యను నేర్చుకొనుటచే, తమ ఆధ్యాత్మిక శ్రేయోరూపమగు ఉపకారమును సాధించుకొను అవకాశము వారికికూడ లభించును.''

''ఈ యిచ్చిపుచ్చుకొనుట మూలమున మనకు రాజకీయరూపమగు పురోగమనమేమైన సిద్ధించు నను ము మీకు కలదా?'' అని నరేంద్రబాబు ప్రశ్నింపగా స్వామిజీ యీ ప్రత్యుత్తర మిచ్చెను: ''వారు (పాశ్చాత్యదేశీయులు) వీరాగ్రేసరుడగు విరోచనుని * సంతతివారు. మహాశక్తిసంపన్నులై వారు పంచభూతములను కీలుబొమ్మలవలె ఆడించుచున్నారు. మనకు వారితో పోరాటము తటస్థించెనేని, ఆ భౌతికశక్తుల సాహాయ్యముతో మనము వారి నోడించి స్వాతంత్ర్యసిద్ధి నొందగల మని మీరు భావించుచున్నచో, అది

* విరోచనుడు అసురసార్వభౌములలో ప్రథముడని ప్రాచీన హిందూదేశమున ప్రతీతి. అతనికి అలోకసామాన్య శక్తు లుండెడివట. 'అసిరియా' జాతివారి పురాణ వాఙ్మయపరిశోధకులు ఆ జాతియొక్క ప్రాచీన ఐతిహాసికగ్రంథములలో కానవచ్చు వంశవృత్తములనుబట్టి అట్టి సార్వభౌము డొకడుండెనని ఇటీవలనే నిర్ణయించిరి. అందు అతని పేరు 'బెరోసస్' అని యున్నదట.

కేవలము పొరపాటు. ఆశక్తులను ప్రయోగించు నైపుణిలో వారికిని మనకును గల అంతరము హిమాలయపర్వతమునకును చిన్న గులకరాతి ముక్కకును గల అంతరమువంటిది. ఇక నా భావము నెఱుగుదురా? మన వేదాంతమత నిగూఢరహస్యములను పాశ్చాత్యప్రపంచమునకు ఎఱిగించితిమేని ఆ మహాబలిష్ఠజాతుల గౌరవసానుభూతులు మనకు లభించును. పారమార్థికక్షేత్రమున వారికి బోధకులమై ఆ గురుపదవిని మనము శాశ్వతముగా వహించి యుందుము. వారును ఐహికవిషయములందు మనకు గురువులై యుందురు. పారమార్థికక్షేత్రమును వారి యధీనముచేసి, మనవారు వారి పాదముల నాశ్రయించి ఆస్తికధర్మమును వారికడ ఏనాడు నేర్చుకొన నారంభింతురో, ఆనాడే ఈ పతితజాతియొక్క జాతీయత శాశ్వతముగా అంతరించిపోవును. 'ఇది యిండు, అది యిండు' అని రేయుంబవళ్లు వారిమ్రోల చేరి మొఱలు పెట్టుకొనుచుండుటచే మన కేమియు లభింపదు. నేను బోధించు పరస్పరలాభకరమగు ఇచ్చిపుచ్చుకొనుమార్గమున మనకును వారికిని గౌరవసానుభూతినిబంధ మేర్పడును. అప్పు డిక నిట్టి అఱపులకును మొఱలకును అవసరము ఉండదు, వారంతట వారే సర్వమును చేయుదురు. ఆస్తికధర్మక్షేత్రమున తీవ్రకృషి సల్పుటచేతను, వేదాంతవిద్యాప్రచారమును విశాలతర మొనరించుటచేతను, మనదేశమునకును పాశ్చాత్యదేశములకునుకూడ అపారమగు ఉపకారము కలుగునని నా విశ్వాసము. దీనితో పోల్చిచూచినచో, రాజకీయప్రచారమార్గము అప్రధానమై, ఉపసాధనస్థానమున నెలకొని యుండవలయునని నా భావము. ఈ విశ్వాసమును కార్యరూపమున బెట్టి చూచు ఉద్యమమున నేను నా ప్రాణము లర్పింతును. హిందూదేశపు శ్రేయోభివృద్ధిని సాధించు మార్గము మఱొకటి కలదని మీరు విశ్వసించుచో, అవశ్యము మీరు ఆ మార్గమునే అవలంబింపుడు.''

స్వామిజీభావములతో తాను పూర్ణముగా ఏకీభవించుచున్నాడని పలికి నరేంద్రబాబు వెళ్లిపోయెను. స్వామిజీమాటలను వినుచున్న శిష్యు డాయనయొక్క తేజోమయమగు ముఖవైఖరిసి ఆశ్చర్యమగ్నబుద్ధితో పరికించుచుండెను.

## ప్రబుద్ధ భారత పత్రికావిలేఖరితో-స్వామిజీ

ప్రబుద్ధభారత పత్రికావిలేఖరి ఒకరు ఇట్లు వ్రాయుచున్నారు: ''మా పత్రికా సంపాదకులు నన్ను శ్రీ వివేకానందస్వామిని గలసికొని స్త్రీల ప్రస్తుత పరిస్థితిని గూర్చియు వారి భవిష్యత్తును గూర్చియు ఆయన యభిప్రాయములను దెలిసికొని రమ్మని కోరియుండినారు. ఒక భానువారమునాఁడు ఉదయమున సుందర హిమవత్పార్శ్వమున నేను సంపాదకుల కోరికను నెఱవేర్పఁ గలిగినాను.

నేను వచ్చిన పనిని తెలుపఁగనే స్వామి ''రమ్ము వేడుకగ అటుపోయి వత్తము'' అనెను. అంతట విశ్వమునకెల్ల అత్యంత రమణీయములయిన ప్రాంతములకు మేము బయలుదేఱితిమి.

వెలుతురు ఉన్న దారులలోను, నీడయున్న మార్గములలోను మేము ఏగితిమి. ప్రశాంతముగ ఉన గ్రామములలోనికిని, క్రీడించుచున్న పిల్లలనడిమికిని, ఉజ్జ్వలముగ వెలుఁగొందు పైరు ఉన్న పొలములకు అడ్డముగను, నడచితిమి. ఒకవైపు పొడవైన చెట్లు ఆకాశమును దాఁకుచుండెను. వేఱొకవైపు రైతుబాలికలు చేతులలో కొడవండ్లు ఉంచుకొని, వంగి, కొనయందు ఈఁకలుగల జొన్నకాఁడలను నరికి వర్షాకాలమున ఉపయోగపఱచుకొనుటకై కొనిపోవుచుండిరి. ఆ వీధిలో పోయి పోయి మేమొక తోఁటలోనికి—ఆపిల్ తోఁటలోనికిఁ—జేరితిమి. అచట చెట్లక్రింద ఎఱ్ఱపండ్ల రాసులు ఉండినవి. వానిని దినుసు ప్రకారము వేఱుపఱుప వలసియుండెను. అందుండి మేము వెలికి వచ్చితిమి. ఎదుట మంచురాసులు ఆకాశమందలి శరన్మేఘముల కన్న ఉన్నతములై గంభీరసుందరములుగ ఉండినవి.

కడకు, నా సయాత్రికులైన స్వామిగారు ప్రసంగమును ఆరంభించిరి—''ఆర్యులమహిళాదర్శములును సెమైట్టుల మహిళాదర్శములును పరస్పరము మిక్కిలి విరుద్ధములైనవి. స్త్రీసన్నిధి భక్తికి అపాయకరమనియు, [వండుటకై పశులను జంపుటవంటి] ఆచారకర్మలను వేనినిగాని ఆమె చేయరాదనియు సెమైట్ల సంప్రదాయము. ప్రక్కన భార్యలేనిదే గృహస్థుఁడు ఏకర్మనుగాని చేయరాదని యార్యుల సంప్రదాయము.'

స్వామి వాక్యము ఏ భేదమును పాటింపక ప్రజాసామస్త్యమునకు అన్వయించుచున్నది. వారు అట్లు అందురని నేను ఎదురుచూడలేదు. నేను ఆశ్చర్యపడి ''స్వామీ, హిందుసిద్ధాంతము ఆర్యమతము కాదా'' అని యడిగితిని.

స్వామి నెమ్మదిగ ఇట్లనెను—నవ్య హిందు సిద్ధాంతము ప్రాయికముగ పౌరాణికము, అనఁగా బౌద్ధ యుగానంతరము ఏర్పడినది. ఔపాసనము వేదోక్త కర్మ. దానిని నప్పుడు భార్య తప్పక ప్రక్కనే యుండవలయును. కాని ఆమె సాలగ్రామమును తాఁకఁగూడదు. ఏలయన సాలగ్రామారాధనము వాడుకలోనికి వచ్చినది పురాణ యుగాంత్యమున అని దయానంద సరస్వతిగారు తెలిపియున్నారు.

విలేఖరి:-అగుచో మనలో స్త్రీపురుషుల మధ్య ఏర్పడిన హెచ్చు తగ్గులకన్నిటికిని బౌద్ధమతప్రభావమే కారణమనియా మీ తలంపు?

స్వామి:-హెచ్చుతగ్గులు ఉన్నచోట దానికి కారణమదే. కాని తటాలున పాశ్చాత్య విమర్శన పద్ధతికి మనము అంత చోరవ ఈయఁగూడదు; ఆ విమర్శన పద్ధతికి చోరవ ఇచ్చితిమేని, మనకు భేదములే పొడకట్టును. మన స్త్రీలు తక్కువ యనెడి యభిప్రాయమునకు కేవలము నిరభ్యంతరముగ మనము సమ్మతింప వలసి వచ్చును. పెక్కు శతాబ్దులుగ పరిస్థితులు మన స్త్రీలను రక్షించుకో వలసిన యగత్యమును మనకుఁ దెచ్చిపెట్టినవి. మన యాచారములకుఁ గారణమిదే కాని స్త్రీల తక్కువఁదనము కాదు.

విలేఖరి:-స్వామీ, మఱి, మనలో స్త్రీల పరిస్థితి మీకు పూర్తిగ సంతృప్తికరముగ ఉన్నదా?

స్వామి:-ఎంతమాత్రమును లేదు. కాని వారికి విద్య గఱపునంతవఱకే మనము చోరవ కలుగఁ జేసికొన వచ్చును. తమ మార్గమున తామే తమ సమస్యలను పరిష్కరించుకొను స్థితికి మనము స్త్రీలను తేవలయును. ఆ పనిని, వారికై ఇతరులు చేయనురాదు, చేయనులేరు.

తమ సమస్యలను పరిష్కరించుకొను సామర్థ్యములో భారతమహిళలు ఏ దేశ స్త్రీలకును దీసిపోరు.

విలేఖరి:—బౌద్ధమతమువలని చెడు ప్రభావము అంటిరే. దానికి కారణ మేమి.

స్వామి:–బౌద్ధమత క్షీణదశలో ఆ చెడు ప్రభావము వచ్చినది. ఏ యుద్యమమయినను కొన్ని విశిష్టలక్షణముల మహిమచే గెలుపొందును. అవే గర్వకారణము లైనచో, ఆ యుద్యమమందలి యసారాంశములలోను అవే ప్రధానములగును. బుద్ధదేవుఁడు మహాపురుషులలో ఉత్తముఁడు–ఆశ్చర్యకరమయిన నిర్మాణశక్తి గలవాఁడు. దానిచేత లోకము తన్ననుసరించునట్లు ఆయన చేసికొనెను. కాని అతని మతము, సన్న్యాస మతము. సన్న్యాసవేషమునే ఆదరించునట్లు చేయు లోపము ఆ మతములో ఉన్నది. మతములలో సన్న్యాసులు సంఘముగఁ గలిసి జీవించుపద్ధతిని తొలుత ఏర్పఱచినది బుద్ధుఁడే. ఆ సంఘమున స్త్రీలకు పురుషులకంటె తక్కువ స్థానము ఈయక ఆయనకు తప్పలేదు. మతాధ్యక్షుల యనుమతి లేక మతాధ్యక్షురాండ్రు ఎంత గొప్పవారైనను ఏ ముఖ్యమైన పనినిగాని చేయ రాకుండెను. ఈ యేర్పాటు తాత్కాలికముగ నేమో బౌద్ధమునకు సంఘీభావమును చేకూర్చినది కాని దాని ఫలితములు శోచనీయములు.

విలేఖరి:–సన్న్యాసము వేదసమ్మత మేకదా?

స్వామి:–సన్న్యాసము వేదసమ్మత మే కాని, దాని నవలంబించిన స్త్రీ పురుషులకు హెచ్చు తగ్గు లుండుట వేదసమ్మతము కాదు. జనక మహారాజసభలో యాజ్ఞవల్క్యులవారిని ప్రశ్న లడిగిన వృత్తాంతము జ్ఞప్తియున్నదా? ఆయనను ప్రశ్నించిన వారిలో ప్రధానురాలు వాచక్నవి, వాదిని, బాలిక. ఆకాలమున ఆమెను బ్రహ్మవాదిని అన్నారు. ఆమె "నిపుణుఁడగు విలుకాని చేతనున్న రెండు తళతళని బాణములవలె ఉన్నవి నా ప్రశ్నలు" అన్నది. ఆమె స్త్రీత్వమును గూర్చిన చర్చ యైనను రాలేదు. మన ప్రాచీనారణ్యక విద్యాపరిషత్తులలో బాలికాబాలకులకుండిన సమానత్వమునకంటె సమగ్రమయినది వేఱొకటి కలదా? మన సంస్కృతనాటకములను జదువుము. శకుంతల కథ జదువుము. తర్వాత టెన్నిసను వ్రాసిన ప్రిన్సెసులో మనము నేర్చుకోఁ దగిన విషయ మేమైన ఉన్నదా చూడుము.

విలేఖరి:–స్వామీ, మన ప్రాచీనవైభవములను దెలుపుటలో మీ పద్ధతి ఆశ్చర్యకరముగ ఉన్నది.

స్వామి:–నేను ప్రపంచమున రెండు పార్శ్వములను చూచినవాఁడనైనందున నేమో! సీతను కన్న జాతి మనది. కన్నది కలలోనైన నగుఁగాక, మన జాతికి స్త్రీయెడ నున్నట్టి యాదరము భూమిపై అప్రతిమానము. పాశ్చాత్య స్త్రీలకు చట్టములనుబట్టి యనివార్యము లయిన బరువులు ఎన్నో ఉన్నవి. అట్టివానిని మన మగువలు, ఎఱుఁగనే ఎఱుఁగరు. లోపములును వినాయింపులును మనలో నిక్కముగ ఉన్నవి. అట్టివి వారికిని ఉన్నవి. ప్రేమ, మార్దవము, ఋజుత్వము అనువానిని జూపవలయుననియే ప్రపంచమున అందఱి సామాన్యప్రయత్నము. దేశాచారములు ఇంచుమించు ఆభావములను వెలువఱుచు సాధనములు మాత్రమే అనుటను మన మెల్లప్పుడును జ్ఞప్తియం దుంచుకోవలయును. ఇఁకను కుటుంబములలో సుగుణములను

పెంపొందించు విషయమున భారతీయుల పద్ధతులు తక్కిన వారి పద్ధతులకన్నమిన్నలని చెప్పుటకు నాకు ఎట్టి జంకును లేదు.

విలేఖరి:—మఱి మన మహిళలకు సమస్యలేవైన ఉన్నవా, లేవా?

స్వామి:—ఎన్నో సమస్య లున్నవి. తీవ్ర సమస్యలున్నవి. కాని విద్య యనెడి యద్భుతపదముచే పరిష్కరింపరాని సమస్యలే లేవు. నిజమయిన విద్యాస్వరూపమును మాత్రము మనవారు భావింపలేకున్నారు.

విలేఖరి:—నిజమయిన విద్యాస్వరూపమును మీరు నిర్వచింపుఁడు.

స్వామి:—[నవ్వుచు]—నేను దేనినిగాని నిర్వచింపను. అయినను వర్ణింతును. పదజాలమును ప్రోగుపోయునది కాదు నిజమయిన విద్య. ప్రజ్ఞను వర్ధిల్లఁజేయునదే నిజమయిన విద్య. మేలైనదానిని నిశ్చయించుటకును సరిగా నిశ్చయించుటకును వ్యక్తులకు నేర్పునదేదో అదే నిజమయిన విద్య. కాఁబట్టి భారతదేశోద్ధరణమునకు మనము వెఱపులేని గొప్పమహిళలను పరమ పవిత్రురాండ్రను స్వార్థరహితలను, భగవచ్చరణ స్పర్శజనిత బలసంపన్నలను, సంఘమిత్త, లీలా, అహల్యాబాయి, మీరాబాయి అను వారి యాచారములను కొనసాగింపఁగలవారిని తేవలయును.

విలేఖరి:—అగుచో, స్వామీ, విద్యావిధానమున మతవిషయికాంశములు ఉండవలెనని తమ యభిప్రాయమా?

స్వామి:—[గంభీరముగ] ఆస్తిక్యమే చదువునందలి యంతస్సార మని నా తలంపు. నేఁ జెప్పనెంచినది మతమును గూర్చిన నా యభిప్రాయములను గాదు, మఱియొక్కరి యభిప్రాయములను గాదు; ఇతరవిషయములలో వలె ఇందును గురువు శిష్యురాలి యంతస్తును గుర్తించి అటనుండి ఆమెకు ఇంచుకేని యప్రీతి గలిగింపక ఆమెకు నచ్చిన రీతిలోనే ఆమెను అభివృద్ధి నొందింపవలయునని నా యభిప్రాయము.

విలేఖరి:—ఇంతవఱకును తల్లికిని పత్నికిని అత్యున్నతస్థానము లుండెడివి. మీరు బ్రహ్మచారిణులకు అగ్రస్థానమిత్తు ననుచున్నారు. మాతృభావమును గృహిణీధర్మమును త్యజించిన వారికి ప్రాధాన్య మొసంగుట మహిళలకు అపకారము కాదా?

స్వామి:—మతదృష్టిలో బ్రహ్మచర్యమునకు అగ్రస్థానము గలుగుట స్త్రీల విషయమున మాత్రమే కాదు. మగవారి విషయమునను అట్లే అనుటను మఱవకుము. అదియునుగాక నీ ప్రశ్నను జూడఁగా నీవు కలవరపడుచున్నావని స్పష్టముగఁ దెలియుచున్నది. ఆత్మకు హిందూసిద్ధాంతము సూచించు కర్తవ్యము ఒక్కటే. అది నశ్వరములమఱుగున నున్న యనశ్వరమును సాక్షాత్కరించుకొనుట. ఇందులకు ఏకైకమార్గమును సూచింప ఎవఁడును సాహసింపఁడు. వివాహమాడుటో ఆడకుండుటో మంచియో చెడుగో జ్ఞానమో అజ్ఞానమో ఏదైనను సరే, మనలను గంతవ్యమును జేర్చునేని అది న్యాయ్యమే యగును. హిందూ సిద్ధాంతమునకును బౌద్ధధర్మమునకును ఎక్కువ తారతమ్యము ఉండునది ఈ విషయములోనే. బాహ్యమంతయు నశ్వరమని గ్రహింపుమనుటే బౌద్ధములోని ప్రధానబోధనము. స్థూలముగఁ జెప్పవలయునేని, బాహ్యమంతయు నశ్వరమని గ్రహించుటకు మార్గములు అనేకములు లేవు. ఒక్కటే. ఆగ్రహించి తన తప

శ్శక్తిచే కాకిని కొంగను భస్మముచేసి గర్వించిన కౌశికుఁడను యువయోగి కథ మహాభారతములో ఉన్నది. దానిని స్మరింపుము. తర్వాత ఆతఁడు నగరములోని కేగి పతిశుశ్రూషైకపరాయణయగు పరమపతివ్రత నొకతెను ధర్మవ్యాధుని దర్శించెను. వారిరువురును కేవలము విశ్వాసముతో తమ విధులను నిర్వర్తించుటచేతనే ప్రబోధ మొందినవారు.

విలేఖరి:–మఱి మన దేశమహిళలకు మీరు ఒసంగు సందేశమేమి స్వామిగారూ.

స్వామి:–మన దేశములో మగవారికి ఏ సందేశ మొసంగెదనో మహిళలకును అదే సందేశ మొసంగెదను–భారతదేశమును విశ్వసింపుఁడు, భారతీయసిద్ధాంతములను విశ్వసింపుఁడు, లజ్జింపకుఁడు, ధైర్యము గల్గియుండుఁడు, ఆసపాటుగలిగియుండుఁడు, భారతీయులు ఇతరదేశములనుండి గ్రహింపఁదగిన యంశములకన్న ఆ యితరదేశీయులకు తాము ఒసంగఁగలయంశములు మిక్కిలి ఎక్కువగ ఉన్నవి. అట్లు ప్రపంచమున వేఱు ఏ దేశమునకును లేదు.

# శ్రీమద్వివేకానందస్మృతి

### (హెచ్. జె. వాన్ హాగెన్ - 1911 సం. ప్రబుద్ధభారతిలోని వ్యాససారము)

### సంక్షేపకులు : పూజ్యశ్రీ తపస్యానందస్వామివారు

ఈనాడు శ్రీమద్వివేకానందస్వామివారి జన్మదినోత్సవ నిర్వహణ నిమిత్తముగా సమావిష్టులైన విజ్ఞులకు, శ్రీ స్వాములవారియందు నాకు గల భక్తిప్రపత్తుల నీ క్రింద నుదాహరించుటయే గాక, అవి నాయం దెట్లుప్పతిల్లినవో మనవి చేయుచున్నాను. భగవద్గీతను పఠించుటయందు నాకమితశ్రద్ధ. భగవద్గీతను ప్రపంచమున కనుగ్రహించిన "భారతదేశమునుండి" వచ్చియున్న మహనీయుని సందర్శించుటకే, నేను శ్రీ స్వామివారు నిర్వహించుచున్న క్లాసునకు ఆయననిమిత్త మెదురుచూచుచుండగా, లోపలినుండి అతిగంభీరమగువ్యక్తి ప్రపంచాపేక్ష యేమాత్రము లేక, యావత్ప్రపంచాధిపతివలె కాన్పించుచు బయటికి వచ్చెను. ఆయనను నేను చక్కగా చూచితిని, ప్రేమాతిశయము లుట్టిపడుచున్నను, ఆయన మానవమాత్రుఁడు కాడేమో అనిపించెను.

పిమ్మట శ్రీవారియుపదేశములను వినవలయునను కుతూహల ముదయించెను. అఖండవిజ్ఞానప్రేరితములగువారి యుపదేశములను వినినకొలది వారిలోనుండి బయల్వెడలు దివ్యశక్తి తరంగములు ప్రసారమగుకొలది, నాయందలి సంకుచితభావములు పటాపంచలై ఆయన యుపదేశములు విందుభోజనమువలె నన్నానందింపజేయసాగినవి. ఆరోగ్యకరమగు ఆహారము ఆకలిని, నిర్మలోదకము దప్పిని నివారించునట్లు వారియుపదేశములు నన్ను సంతోషపెట్టుచుండెను. మానవహృదయమందు జనించు సందేహములను సంపూర్ణముగ నివారింపగలది, నిరంతరానందమున నుయ్యాల లూగించునది ప్రపంచమున వేదాంతమత మొక్కటియే యను విశ్వాసము జనించెను. అట్టి వేదాంతము సువిదితముచేయుటలో శ్రీ స్వామివారు సిద్ధసంకల్పులను విషయమును గ్రహించి,

శ్రీవారియుపదేశములే నా జీవితతరణోపాయములని విశ్వసించితిని.

శ్రీవారికిని నాకును పరిచయమేర్పడెను. వారితో కలసిమెలసియుండు అదృష్టము నాకు కలిగెను. క్లాసులలోనేకాక, శ్రీవా రెచ్చట నున్నను "మానవుని దైవాంశమును" వ్యక్తము గావించు, ఏకైక సర్వసమన్వయభావ నిమగ్నులై యుండుట గుర్తింపవలసిన ముఖ్య విషయము. 'తమ యుపన్యాసములకు కొలది మందియే హాజరగుట విచారకర విషయ'మని నేనొకపర్యాయము శ్రీ స్వామివారితో నంటిని. "ఎక్కువమంది నాకర్షించుటయే నా యుద్దేశ్యము కాదు. నా సందేశవ్యాప్తికి త్రికరణశుద్ధి గలవారే యవసరము. అట్టివా రొక్కరు లభించినను, నా కృషి ఫలించినట్లు సంతసింతు" నని శ్రీవారు బదులు చెప్పిరి. శ్రీవారు కోరునట్టి లక్షణములను బడయుటకై ప్రయత్నించుచున్నాను.

ఆయన సమక్షములో ప్రతివారు ఆత్మానందముతో, తామే ఆయన ప్రేమాతిశయములను ప్రత్యేకముగ బడసినట్లు హృదయపూర్వకముగ సంచరించెడివారు. చిన్న సంశయములను నివారించుటలోకూడ శ్రీవారు కృషి సల్పుట, విద్యార్థు లందఱియందును ఉత్సాహ విశ్వాసములను కలిగించుచుండెను. అందఱిని గుర్తించి, వారి సంశయములను నివారించుటయే శ్రీవారి విజయమునకు కారణము. శ్రీవారు నిర్వహించిన ఉద్యమ మీనాడు చక్కగా వికసించి, యావత్ప్రపంచమునకు సర్వమానవ సౌభ్రాత్ర సౌరభమును వెదజల్లుచున్నది. ప్రొఫెసర్లు, మతప్రచారకులు వ్యావహారికులు, వ్యవసాయదారులు మొదలగు వా రందఱు శ్రీవారి దివ్యసందేశసౌరభము ననుభవించుచున్నారు.

నేను గ్రహించిన విషయముల నీ క్రింద పొందుపఱచుచున్నాను. "మా కెంతో అవసరమగు, ఆర్యమహాఋషుల ప్రశాంత జీవిత విధానమును మాకు బోధించినారు." ఒకానొక అమెరికన్ శాస్త్రజ్ఞుడు తెల్పినట్లు "మా బాహ్యజీవితము, వ్యావహారిక విధానములు నాడీ సంచలన హేతువులు." అవి మాయందు వయస్సునకు మించిన నాడీసంచలనమును, మానసిక దౌర్బల్యమును కలిగించి, మమ్ములను మృత్యువువాత బడవేయుచున్నవి. అట్టి మహాపదలోనుండి బయల్పడు విధానమును శ్రీస్వామివారు మాకు బోధించినారు. ఆయన మాకు ఉద్రేకపూరిత విధానమునుండి బయల్పడు మార్గమును సుస్పష్టమొనరించి, అతి గంభీర ప్రశాంతితో కూడిన సాత్త్విక విధానమును బోధించినారు. "ఆత్మవిజయమే సంపూర్ణ విజయము. పుస్తకములలోను, దేవళముల లోను ఏమియు లేదు, అంతయు మీ చేతుల లోనే యున్నది. దైవత్వమును గుర్తింపుడు. అన్నియు ఆనందమయమగు" ననెడి శ్రీవారి ప్రబోధములు యావన్మానవజాతికి ఉపకరించు అమృతవర్షములని నేను గుర్తించినాను.

(శ్రీరామదర్శన పత్రికనుండి)

# లక్ష్య ప్రేరణ

## కీ. శే. కులపతులు ముట్నూరు కృష్ణారావు పంతులుగారు

సోదరా, నీ లక్ష్యం నీకు చాలాదూరంలో ఉన్నదని నిరుత్సాహపడకు. నీకూ, నీ లక్ష్యానికి చాల ఎడమున్నట్లు బయటకు కనబడుతున్నదే కాని, అది నిజం కాదు. లక్ష్యమనేది నీకు విజాతీయమైన బాహ్యవస్తువైతే, దానిని నీవెన్నడూ ఏమి చేసినా పొందలేవు. నీవు పొందదగినది, పొందగల్గినది, ఎప్పటికైనా పొందక తీరనిదీ—నీలోనిదే, నీ స్వస్వరూపమే, నీ ఆత్మవస్తువే అని బాగా హృదయస్థం చేసుకో.

బీజానికి వృక్షానికి ఎట్టి సంబంధమో నీకు, నీ లక్ష్యానికి అట్టి సంబంధమున్నది. వృక్షము బీజానికి భిన్నము కాదు. ఏది బీజంలో గర్భితంగా అప్రకటితంగా ఉన్నదో అదే వృక్షంగా అభివ్యక్తమైనదే కాని మఱియొకటి కాదు.

అట్లాగే నీ లక్ష్యము కూడాను. సత్యం శివం–సుందరం. నీ ప్రాప్యమంటే ఏమిటి? అదే నీలో ప్రస్తుతం బీజరూపంలో అనభివ్యక్తంగా ఉన్నదన్నమాట. నీ ఎఱుకలోకి దానిని వ్యక్తపఱచుకొనే ప్రయత్నమే నీ సాధన సామగ్రి అంతాను.

బీజం స్థాణువువలె నిద్రపోతున్నదనుకోక. అది మేలుకొనే ఉన్నది. అది వ్యక్తంకావడానికి, పరిణతి పొందడానికి నిన్ను నిరంతరం తొందరపెట్టుతూనే ఉన్నది. ఎట్లా?

నీవు వెలుగు కోరుతున్నావన్నా, శక్తి నభిలషిస్తున్నావన్నా, సుఖంకోసం పరితపిస్తున్నావన్నా నీ లక్ష్యంయొక్క ప్రబోధంచేతనే సత్యం బయటపడడానికి నీవు వెలుగు నభిలషించేటట్టు పురికొల్పుతున్నది. శివమే నిన్ను శక్తి నర్థించేటట్టు చేస్తున్నది. సుందరమే నిన్ను సుఖపిపాసినిగ కలవరపెట్టుతున్నది.

లక్ష్యము నీకు రెండువిధాల సహాయం చేస్తున్నదన్నమాట. దూరంగ ఉన్నట్లుండి నిన్ను ఊర్ధ్వముఖంగా త్రిప్పి, తనవైపుకు ఆకర్షిస్తున్నది. అదే నీలోపల అంతర్గతంగా ఉండి వెనుకనుండి తోస్తున్నది. నీవెప్పుడూ ఊటీ ప్రయాణం చేయలేదా? ఊటీ రైలుకు రెండు ఇంజిను లుంటాయి. ఒకటి ముందుండి కొండపైకి ఈడ్చుకుపోతుంది. ఇంకొక ఇంజిను వెనుకనుండి పైకి తోస్తూ ఉంటుంది. అట్లాగే నీ లక్ష్యమూను. ఆదర్శంగా నిన్ను దూరంనుండి ఆకర్షిస్తున్నది. బీజంగా లోపలనుండి ఉద్దీపనచేస్తున్నది. ఏది లక్ష్యంలో ఉన్నదో అదే బిజం లోనూ ఉన్నది.

నీవు చేయవలసినదేమీ లేదు–బయటి ఆహ్వానాన్ని ఆలకిస్తూ ఉత్సాహం చెందుతూఉండు, లోపలి ప్రేరణను గమనిస్తూ దాని నడ్డగించకుండా దారి విడుస్తూ ఉండు.

నీ లక్ష్యాన్ని నీవు నిజంగా పొందే ఉన్నావు – నీవు ఇప్పుడు క్రొత్తగా పొందేదికాదది. తెలుసుకోకపోవడంవల్ల అది నీకు లక్ష్యము. తెలుసుకొంటే అది నిత్యసిద్ధము – అందుకనే ఋషులు ''విజిజ్ఞాసస్వ'' అని వేదశిఖరంమీదనుండి శృంగధ్వని చేస్తున్నారు.

# మా యా వా ద ము

## శ్రీ నిర్వాణానందస్వామి

(నవంబరు సంచిక తరువాయి)

రెండవ వివరణమును గుఱించి వర్ణించుచున్నాను. దానినిబట్టి చూచినచో ప్రపంచము అబద్ధము కాదు. నిజమే యగును. కాని ఒక యోగ్యత కన్పించును. అది సత్యమే కాని చాలునంతటి సత్యము కాదు. రెండు విధముల పరికించినచో అది సత్యము కాదు. ప్రథమమున దానికి ఓర్పు అనునది లేదు. శాశ్వతపదార్థముతో నది చేయబడలేదు. దాని స్వరూప మెల్లపుడును మార్పు జెందుచుండును. రెండవవిధముగా పరికించినచో దానికాళ్లపైని అది నిలువగలుగుటకు చాలునంతటిసత్యత్వము దానికి లేదు. ఈ విషయములో నది పూర్తిగా పరాధీనమై యున్నది. దాని సొంత మని చెప్పుకోతగిన ఒక్కపిసరైన సత్యతకూడ దానికి లేదు. తనకు తానుగా సత్యము కాదని చెప్పుకొనుటయే అదియై యున్నది. అది ముఖ్యావసరమైన అర్హత. మరియు అనంతమైన దానిపైన ఆధారపడి యున్నది. ఒకహద్దులో కట్టిపెట్టబడిన అన్యమైన మూలకారణముగా గాక ఎక్కువ సన్నిహితముగా దానికి చెందియున్నట్టి అనిర్వచనీయమైన ఒకానొకటియై యున్నది. ఈ వివరణము చొప్పున సృష్టి బ్రహ్మయొక్క ఆత్మానుభూతియై యున్నది. ప్రపంచములోని నామరూపములన్నియు ఈ ఆత్మానుభూతి యొక్క పద్ధతులును వివరణములునై యున్నవి. ఈ వివరణము, సత్యమైనదానిపైన ఆధారపడి యుండకపోయినట్లయిన, మనఃకల్పితముగా నుండిపోవును, తన సొంతహక్కుతో ప్రపంచము నిజముకాదని చెప్పుటయే అదియై యున్నది. ప్రపంచమున కొక ఉన్నతస్థితి (స్థానము) కలదు. అది అసత్యమైనది కాదు, నీడయు కాదు, భ్రాంతియు కాదు – కాని సత్యమైనదానితో పోటీచేయలేదు. మాయావాదమును బలపఱచు ప్రముఖులు దానికొక సహజమైన స్థానము కల దని ఒప్పుకొనుచును కూడ, దానిపైన తమవాదమును పూర్వసిద్ధాంతము చేయుదురు. అట్టిస్థానమును గట్టిగా కట్టుకొని తిరుగులేని పూనికను పూనినట్లుగా కనిపింతురు. బ్రహ్మయే కారణముగా వర్ణింపబడిన గ్రంథములనుంచి ప్రపంచము నిజ మని కావలసినంత చక్కగా ఒప్పుకొందురు. ప్రపంచము బ్రహ్మయొక్క కార్యముగాను, బ్రహ్మమే ఉపాదానకారణముగాను, నిమిత్తకారణముగాను వర్ణింతురు. అనంతమైనదానినుండి ఉద్భవించుటచే, జగత్తు సత్యమైనది. స్వప్నావస్థలోని స్వప్నదృశ్యములు, జాగ్రదవస్థలోని ప్రత్యక్షదృశ్యములకంటె, తక్కువ శ్రేణిలో సత్యమైనట్లే, ప్రపంచము మార్పుచెందుచుండుటను బట్టి బ్రహ్మతో పోల్చిచూచిన, జగత్తు తక్కువ శ్రేణిలో నిజమై యున్నది.

తాబేలు తన యవయవములను ముందునకు రువ్వినపుడు, అవి అబద్ధమైపోయి, లోనికి ముడుచుకొన్నపుడు సత్యమైయుండునా? భగవద్గీతలోకూడ ప్రకృతిపురుషులు అనాదిసిద్ధులని వర్ణింపబడియున్నదే గాని, అబద్ధమని వర్ణింపబడలేదు.



## 75

బేలూరుమఠము,
బేలూరుపోస్టు, హౌరా,
ప్రియ—, 3 ఆగస్టు 1917.

నీజాబు చేరినది. చాల సంతోషము. మీలో ఎవరివద్దనుండియు చాల కాలముగా నాకు జాబు రాలేదు. మహారాజుగారును హరిమహారాజుగారును ఇంకను పూరీలోనే ఉన్నారు. అక్కడ వారికి ఆరోగ్యము బాగులేదనియు త్వరలోనే వారు భువనేశ్వరమునకు పోనున్నారనియు మాకు వార్త వచ్చినది. భువనేశ్వరములో ఒక ఆశ్రమమును స్థాపింపవలెననెడి యాశ మహారాజుగారికి చిరకాలముగ నున్నది ...ఇప్పుడు మహారాజుగారి ఆశ నెఱవేఱనున్నది. చాల చౌకధరకు 15 బిఘాలభూమి కొనబడియున్నది.

బాబురాం మహారాజు ప్రస్తుతము బాగ్బజారులో మాతృశ్రీ నిలయము (ఉద్బోధన్)లో నున్నాడు. ఇంకను చాల దుర్బలుడుగనున్నాడు. మెల్లగ రవంత రవంతగా సత్తువ చేకూర్చుకొనుచున్నాడు. ఇప్పటికిని ఆయన పాన్పు మీదినుండి లేవలేకున్నాడు. మంచముపై కూర్చుండియే స్నానాదులు చేయుచున్నాడు. ఐనను భగవదనుగ్రహమున కాలక్రమమున ఆయనకు పరిపూర్ణారోగ్యము కలుగునని మన మాశింపవచ్చును. ఈసారి అతనివ్యాధి చాల తీవ్రముగ నుండెను. నయమగుననెడి ఆసపాటే లేకుండెను. ఒకటిన్నర నెలలకు పిమ్మట అతడు అన్నము తిన్నాడు. భగవంతుడు దయామయుడు. తన కరుణచే లోకక్షేమమునకై స్వకీయ భక్తుని కాపాడినాడు. లోకమున భక్తులుండకున్నచో భగవంతుని దివ్యలీలకు వేఱెవరు తోడ్పడుదురు ?

నీవు వ్రాసినది ఎంతయు సత్యమే. ఈసారి భగవంతుని దివ్యలీల అతి గంభీరమైనది. దాని ప్రభావము విశ్వమంతకు వ్యాపించుచున్నది. అందుకు సందేహములేదు. ఈసారి ప్రపంచమున కంతటికిని మంగళము, సమకూడును. ప్రపంచమంతట అజ్ఞానము రూపుమాసిపోవును. జ్ఞానవివేకముల ప్రభావము ఎల్లెడల వ్యాపింపగలదు. ఇప్పటి భారతదేశము మునుపటి భారతదేశము కాదు. సమస్తభూమండలమును తన వెంటనిడుకొని భారతదేశము సమున్నతి నొందుచున్నది. సమస్తవిశ్వమునకును భారతదేశమునకును ప్రబోధము కలుగుచున్నది. తన దివ్యలీలానాటకమును ఆడుటకు భగవంతుడు ఈ భారతదేశమున అవతరించినాడు. భారతదేశమునకు సంక్షేమము కల్గితీరును. స్వామీజీని పాశ్చాత్యదేశాలకు పంపి గురుదేవుడు పాశ్చాత్యుల క్షేమమునకును దారి ఏర్పఱచినాడు. కంటి యెదుట మనకు స్పష్టమగుచున్న విషయమిది. ప్రస్తుతము సాగుచున్న యుద్ధము అచిరకాలములో ఆగిపోగలదు. తదనంతరము పాశ్చాత్య ప్రపంచమంతయు క్రొత్తరూపు దాల్చును. చాల కాలమువఱకు శాంతి నెలకొని యుండును. స్వామీజీ చెప్పినది ప్రత్యక్షర సత్యము. నిశ్చల ప్రశాంత హృదయముతో నీవు కేవలము సాక్షిగ నుండుము. దుఃఖపడి, తొందరపడి, లాభములేదు. ప్రశాంతతయు క్షాంతియు ప్రస్తుతము భారతదేశమున కావశ్యకములు. ఆ విషయమును గురుదేవుని భక్తులు స్పష్టముగ తెలిసికొనుచున్నారు. యుగావతారమూర్తి స్వకీయ భక్తులతో వచ్చి యున్నాడని వా రెఱుగుదురు. ఈ సమస్తమునకును వెనుక ప్రేరకుడుగ గురుదేవుడున్నాడనియు భారతదేశమునకుగాని, సమస్త విశ్వమునకుగాని దుఃఖము కలుగదనియు పరమ

నిశ్శ్రేయసము సమకూడుననియు వారికి తెలియును...

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

**76**

మఠము,
బేలూరు పోస్టు,
ప్రియ—, సెప్టెంబరు 1917.

నీజాబు చేరినది. నీవు భగవద్భక్తుడవు. గురుదేవుని శరణుజొచ్చినవాడవు. సదా ఆయన కనికరముపైనే ఆధారపడియుండుము. నీ శక్త్యనుసారము ఆయననే స్మరింపుము ధ్యానింపుము. ఆయన నీకు సమగ్ర భక్తి జ్ఞానములను ప్రసాదించును. త్రైలింగస్వామియు ఇతర మహాత్ములును భిన్నమార్గానుసారులైన ఆత్మాన్వేషకులు. నీ జీవితక్రమమును వారి దానితో పోల్చి చూచుకొన పూనుదువేని అగాధమున పడిపోవుదువు. వారిలో కొందఱు హఠయోగులు. కొందఱు అష్టాంగయోగులు. కొందఱు జ్ఞానయోగులు. వారి జీవితమును ఆధ్యాత్మిక మార్గమును నీ జీవితముకంటె నీ యాధ్యాత్మిక మార్గముకంటె పూర్తిగా భిన్నమైనవి. గురుదేవుననుగ్రహముచే నీవు తద్భక్తుడవు. సర్వమును ఆయన ఇచ్ఛకు వదలుకొనుటే నీకు ముఖ్యాధ్యాత్మిక సాధన. సదా ఆయనను జ్ఞప్తియుంచుకొనుట అవకాశమున్నప్పుడు ధ్యానించుట ఆయన నామమును జపించుట ప్రార్థించుట ఆయన మహిమలను కీర్తించుట—ఇవన్నియు నీకు విహితకృత్యములు. కాలక్రమమున ఆయన నిన్ను పరమభక్తునిగను సాక్షాత్కారసిద్ధునిగను ఒనర్చును.

జీవితమున విముక్తినొందుట యనగా, శరీరపతనానంతరము బ్రహ్మమందు నిమగ్నతనొందుట యనగా అర్థమిది: ఇంటిద్వారమునొద్ద ఒకపాదము లోపలికిని రెండవపాదము వెలుపలకును చాపి నిలబడిన యతనికి ఇంటికి లోపలివైపును వెలుపలివైపును కూడ కనబడుచుండును. అట్టివానిస్థితిని పోలినది విముక్తి. ఇక వెలుపలికిరాకుండ లోనికిపోయి అచ్చటనే ఆగిపోవుట వంటిది శరీర పతనానంతరము బ్రహ్మమందు నిమగ్నతనొందుట. అప్పుడు వెలుపలివానిని గూర్చిన ఎఱుక ఉండనే యుండదు. అర్థమైనదా?...

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

---

# వార్తలు - విశేషాలు

## మాతృశ్రీ జయంతి మహోత్సవము

ఈ సంవత్సరం మాతృశ్రీ శారదాదేవి జయంతి తిథిపూజ 20-12-1970 వ తేది భానువారమునాడు వచ్చినది. మైలాపూరు శ్రీరామకృష్ణమఠంలో ఆ ఉత్సవం భక్తితోను యథావిధిగను జరుపబడినది. నాదస్వరంతో మంగళహారతితో దినకార్యక్రమం ఆరంభమైంది. భజనయు వేద-గీతా-చండీ పారాయణములును ప్రత్యేకపూజయు హోమమును ప్రసాద వినిమయమును అపరాహ్ణమువఱకు చెల్లినాయి. శ్రీరామకృష్ణమిషను విద్యాసంస్థలకు చెందిన ఎన్సీసివారు ఉత్సవనిర్వహణంలో ఎంతో తోడ్పడ్డారు.

సాయం ఆరాత్రికం ముగిసిన వెంటనే మఠమండపంలో సమావేశమైన భక్తగోష్ఠిలో — శ్రీ విరూపాక్షానందస్వాములు మాతృశ్రీ జీవిత

చరిత్రంనుండి ముఖ్యఘట్టాలను చదివి వినిపించారు. తర్వాత నరేంద్రపూరునుండి విచ్చేసియున్న శ్రీలోకేశ్వరానందస్వాములు శ్రీ శారదాదేవి శీలోన్నతిని ప్రస్తుతిస్తూ ఈలాగుపన్యసించారు. "శ్రీ శారదాదేవి పల్లెలో పుట్టింది, బడిచదువు చదువుకోలేదు, ఆ కాలంలో ఆమెను గురించి ఎవ్వరికీ ఏమీ తెలియదు. కాని ఈనాడు ప్రపంచ మంతటా ఆమె ఆరాధింపబడుతున్నది. పరమహంస గురుదేవున కామెపట్ల నుండిన భక్త్యాదరములుత్కటములు. తనజీవితకార్యాన్ని నెగ్గించడంలో ఆమె సహకారం అమోఘంగా పనిచేడుతుందని ఆయన విశ్వసించాడు. తనశక్తిస్వరూపిణియే ఆమె అని గురుదేవుడు భావించాడు. శ్రీ వివేకానందస్వామికి ఆమెమాట వేదమంత్రమే, అనుల్లంఘ్యశాసనమే. తన ఆశయానికి ఉద్దేశానికి ఆమెమాట ప్రతికూలంగా ఉండినా, స్వామిజి ఆమెమాటను తలదాల్చేవాడు. ఆమె సలహా ననుసరించియే ఆయన తనజీవితంలో అతిముఖ్యనిర్ణయాలను కావించుకొన్నాడు. శ్రీరామకృష్ణశిష్యులలో ఇతరులు కూడ ఆమె నెంతో భక్తితో భజించారు. పరమహంసగురుదేవునకు సహధర్మిణి అనే అతిశయమే కాక తనకు నైజమైన మహిమయు ఆమె కెంతో ఉన్నింది. ఆమె వైరాగ్యం గురుదేవుని వైరాగ్యానికి తీసిపోదు. జీవితంలో ఆమెకు ఎన్నో కష్టాలు శోధనలు కలిగాయి. కాని ఆమె అన్నిటిలో నెగ్గగలిగింది, తన ఆధ్యాత్మికస్థాయిని నిలుపుకోగలిగింది. జీవితకదనరంగంలో గృహస్థు లెదుర్కోవలసిన చిక్కులకన్నిటికిని పరిష్కారాలు ఆమెజీవితంలో ఉన్నాయి. ఆశ్రితులపై నామె వర్షించు కారుణ్యమునందే కాక అతిథులుగ నింటికి వచ్చినవారి నుపచరించుటలోను ఆమె లోకమాత యనెడి పరమార్థము ప్రకటమగుచుండెడిది. మానవత్వదేవత్వముల కామె కూడలిస్థలము. ఆమెప్రేమానుగ్రహములు భౌగోళిక సాంఘికావధుల నతిక్రమించినది. శిష్టులకు దుష్టులకు అందఱికి ఆమె మాతయే, కావున దుష్టులకైనను ఆమె శుభమునే గలిగించును."

డిసెంబరు 27 వ తేది భానువారం వివేకానందహాలులో మాతృశ్రీజయంతి బహిరంగోత్సవము జరుపబడింది. మధ్యాహ్నానంతరం $3\frac{1}{2}$ గంటలనుండి $5\frac{1}{2}$ గంటలవఱకు సంగీతకవి శ్రీ ఎన్నెస్ చిదంబరంగారు కణ్ణప్పనాయనారు చరిత్రాన్ని హరికథాకాలక్షేపంగా వినిపించారు. కణ్ణప్ప అర్జునుని పునరవతార మట. ఒకవారం దినాలలో పరమశివసాక్షాత్కారానుగ్రహం పడసిన ఉత్కటకోటికమైన భక్తితోడిది అతని శివోపాసనావిధానం.

5-30 గంటలకు హైకోర్టు న్యాయమూర్తి మాన్యశ్రీ ఎన్. కృష్ణస్వామిరెడ్డిగారి ఆధ్యక్ష్యంలో పౌరసభ సమావేశమైంది. ప్రార్థనగేయం మంత్రపుష్పం అయ్యాక మైలాపూరు శ్రీరామకృష్ణమఠాధ్యక్షులు శ్రీమత్కైలాసానందస్వాములు సదస్యులకు స్వాగతాశీస్సులనుగ్రహిస్తూ ఈలాగు వాక్రుచ్చారు — "లోకజనని దాల్చిన మానవరూపమే మాతృశ్రీ. ఆమె సర్వశక్తి, అనుగ్రహమయి. పవిత్రతయు మాతృత్వమున్నూ ఆమెలో రూపుదాల్చాయి. ఆమెజీవితచరిత్రాన్ని ఇప్పుడిప్పుడే చదువ ఆరంభించేవారు, సాధారణంగా ఒక్కచోట కలిసిఉండని గుణాలు ఆమెలో కలిసిఉన్నందుకు ఆశ్చర్యం చెందుతారు. 1853 నుండి 1920 వఱకు ఆమె జీవితకాలం. ఆ కాలంలో ఆమె కంత ప్రఖ్యాతి కలుగలేదు. కాని ఈనాడు అన్నిచోట్లలో ఆమె ఆరాధింపబడుతున్నది. ఆమె జయంతి మహోత్సవాలు

జరుపబడుతున్నాయి. అనేక భాషలలో ఆమెను గూర్చి గ్రంథాలు రచితము లైనాయి. ఆమెకు గుడులు నిర్మితము లైనాయి. మగువలు మగ వారు ఎంద తెందలో తమజీవితాలను విశ్వ సంతారిణియైన ఆమెసేవ కంకితం చేసుకుంటు న్నారు. అవతారపురుషుని పెండ్లాడి శారదమ్మ గృహిణి యయ్యు కన్నెఱికం అమోఘంగా నిలుపుకుంది. అసంఖ్యాకులకు ఆమె అమ్మ. మాతలందఱి మాతృత్వంకంటె ఉత్కృష్టగంభీర మైన మాతృత్వం ఆమెది. సాధకులకు ఆమె మార్గదర్శకురాలు, దరిజేరినవారి కామె సము త్సాహప్రదాత్రి. అందఱి అన్ని సమస్యలకూ ఆమె పరిష్కర్త్రి. అనితరసాధ్యములగు మహా కార్యములు సాధించి లోకము నుఱ్ఱూతలూపిన శ్రీ వివేకానందస్వామికి ఈమె ఆదేశాలు పరమ ప్రమాణాలు. ఆమెనుగూర్చిన జ్ఞానం లవలేశం గడించినా, అది మనఆత్మలకు సమృద్ధిసంపూర్ణ తలను కలిగిస్తుంది, అన్నిచిక్కులనుండి బయట బడేందుకు ప్రదీప్తమైన మార్గమును చూపి స్తుంది, అందుకువలసిన బలమును ప్రసా దిసుంది.''

సభాధ్యక్షులైన మాన్యశ్రీ [illegible] స్వామి రెడ్డిగారు తమిళంలో కావించిన ప్రసంగమునకు సంక్షేపం-మాతృశ్రీగారి అతివిలక్షణజీవితాన్ని చదివినవారు అద్భుతాశ్చర్యాలకు లోనౌ తారు. ఆమె మహాసమాధిచెంది యాభైఏండ్ల కంటె ఎక్కువ కాలేదు. శ్రీశారదా శ్రీరామ కృష్ణుల ఆధ్యాత్మికదాంపత్యంవంటి దాంపత్యం విశ్వమానవచరిత్రలో మఱొక్కటి లేదు. కన్నెఱికమునకు సడలుపాటు జీవితకాలంలో ఎప్పుడు లేకున్నా, శ్రీరామకృష్ణుడు ముందుగా చెప్పినట్లు వేలకొలది మానవాళి అమ్మ అంటూ ఆమెను ఆశ్రయిస్తున్నారు. ఆమెకు బిడ్డలందు గల అనురాగమున్నూ ప్రాపంచికములందుగల వైరాగ్యమున్నూ ఒండొంటికి దీటు కాగలవి. దివ్యజీవితంలో గురుదేవున కనురూపయైన సహధర్మిణి ఆమె. సహధర్మిణి శారద అయి నందుననే అంతటి మహోన్నతసిద్ధు లాయనకు సాధ్యపడిన వనడం సత్యదూరం కాదు. పరి పూర్ణతను గడించడానికి కావల్సింది ఆత్మపరి పాకమే కాని మేధాశక్త్యాదులు కావనడానికి ఆమె జీవితచరిత్రం చక్కని ఉదాహరణం. తామరాకుమీది నీటిచుక్కవలె నిస్సంగంగా గడపిన జీవితం ఆమెది.

తర్వాత వివేకానందకళాశాల ఆంగ్లభాషా శాఖాధ్యక్షులు ప్రొఫెసరు శ్రీ జి. ఎన్. శేషాద్రి, బి. ఏ. (ఆనర్సు), ఎల్. టి. గారు శ్రీశారదాదేవిజీవితంలో కొన్ని సంభవాల ప్రగాఢప్రాముఖ్యమును వివరిస్తూ ఈలాగు ప్రసంగించారు:—శ్రీరామకృష్ణుడు శ్రీశారదను వివాహంచేసుకున్నప్పుడు ఆమెకు వయస్సు ఆఱేండ్లు. ఐతే దీన్ని అతిబాల్యవివాహానికి ఉదా హరణంగా గ్రహించకూడదు. ఆధ్యాత్మిక రంగంలో సహధర్మిణిగను ఆదర్శభూతురాలిని గను ఆమెను రూపొందించుటకై ఎన్నుకొను టగా గ్రహించాలి. శ్రీశారదా శ్రీరామకృష్ణుల పెండ్లి ఆత్మల కలయికయే. శ్రీరామకృష్ణునికి పిచ్చిపట్టిందని, పెండ్లి చేస్తే పిచ్చికుదురుతుం దేమో చూతా మని అతనిపెద్ద లనుకున్నా, వారి నిర్బంధానికి జరిగిన పెండ్లి కాదు వీరిది. తనకు భార్య కానున్న బాలిక ఫలానా అని శ్రీరామకృష్ణుడే పెద్దలకు తెలియజెప్పి పెండ్లికి ఏర్పాటు చేయనిచ్చాడు. శ్రీ శారదమ్మ పక్కా పల్లెపడుచు. బడిచదువు ఆమెకు బొత్తిగా లేదు. కాని పదునాలుగవయేట ఆమె కొన్నినెలల కాలం భర్తతో కామార్పుకురులో ఉండడం సంభవించింది. అవశ్యకమైన శిక్షణము నప్పు డామె కాయన సమకూర్చాడు. నాలుగేండ్ల

కనంతరం శ్రీరామకృష్ణునికి పిచ్చి పట్టిందనే వార్త జయరామ్బాటిగ్రామంలో వ్యాపించింది. వెంటనే శారదమ్మ దక్షిణేశ్వరం వెళ్ళింది. గురుదేవు డీమెను అత్యంతాదరంతో చేర దీశాడు. అతీంద్రియస్థాయిలో గడిచింది వారి సాహచర్యం. షోడశీపూజరాత్రి గురుదేవుడు లోకమాతృస్థానమున శారదమ్మను కూర్చొబెట్టి ఆరాధించాడు. పరమహంస మహాసమాధి చెందినతర్వాత ఆధ్యాత్మికప్రబోధనకార్యక్రమాన్ని శారదమ్మ దాదాపు ముప్పైనాలు గేండ్లు నిర్వహించింది. భక్తులసపర్య, వర్ణాది వ్యవస్థల అతిక్రమించడం, ప్రేమప్రవాహరూపం దాల్చిన సనాతనాచారపరత ఎవరిలో గాని దోషముల చూడకుండడం, ఆధ్యాత్మిక పరిపాకం, సరళత, అమాయికత, నిత్యవిధుల నిర్వర్తనలో శ్రద్ధ, మిన్నందుకొను స్వప్రభావాన్ని సామాన్యమహిళారూపము మఱుగున గుప్తపఱచుకోవడం—ఇవి నిష్ఠామహిష్ఠమైన ఆమెజీవితంలోని శీలంలోని అపూర్వవిశేషాలు.''

కలైమగళ్ పత్రికాసంపాదకులు వాగీశకళానిధి శ్రీ కి. వ. జగన్నాథంగారు తమిళంలో ఉపన్యసించారు. ఆ యుపన్యాససంగ్రహం— ఆఱేండ్లవయస్సులోనే శారదమ్మ పరమహంసదేవుని ధర్మపత్ని కావడానికి ప్రాముఖ్యం లేకపోలేదు. మూడేండ్లపిల్లగా ఉన్నప్పు డొకసారి 'నీభర్త ఎవ' రని ఎవరో అడుగగా శారదమ్మ చుట్టనవ్రేలుతో 'ఈయన' అని చూపిందిట. ఆలాగు చూపబడింది శ్రీరామకృష్ణుడే. మూడేండ్ల వయసులోనుండగా శ్రీజ్ఞానసంబంధయోగి 'నా హృదయతస్కరు డిత' డని పరమశివుని చూపెనట కదా. అది ఇచ్చట జ్ఞప్తికి వస్తుంది, అతిలౌకికమైన వీరి దాంపత్యంలో విశేషం సతికి పతి దైవం, పతికి సతి దైవం. దోపిడిగాని కటికగుండె శారదమ్మను దర్శించిన వెంటనే పితృమృదుహృదయుంగా మాఱడం, శారదమ్మకు గల స్పర్శవేధిశక్తివంటి శక్తికి నిదర్శనం. ఆమెచూపు అమ్మచూపు. ఆ చూపునకు ఎవరిలోగాని దోషం కనిపించనే కనిపించదు.''

మాతృశ్రీ జయంతిసందర్భంగా వివిధ విద్యాలయాలలో జరుపబడిన పోటీలలో నెగ్గినవారికి బహుమతులివ్వబడ్డాయి. ప్రొఫెస్సరు పి. శంకరనారాయణగారి వందనోపచారంతో నాటిసభా కార్యక్రమం ముగిసింది.

తర్వాత మఠభజనబృందంవారు శ్రీమత్ప్రియానందస్వాముల ఆధ్వర్యంలో రాత్రి 9 గంటలవఱకు కాళికీర్తన జరిపారు.

## క్రిస్త్మసు ఉత్సవము

1970 వ సంవత్సరం డిసెంబరు 25 వ తేది శుక్రవారం సాయంకాలం మైలాపూరు శ్రీరామకృష్ణమఠమండపంలో క్రిస్త్మసుత్సవం జరుపబడింది. క్రైస్తుపటం పెద్దది స్వలంకృతమై వేదికమీద అమర్చబడింది. పూజానివేదనలు యథావిధి నిర్వర్తితములైనాయి. శ్రీ విరూపాక్షానందస్వామి బైబిలునుండి 'పర్వతాగ్ర ప్రవచనము' (సెర్మన్ ఆన్ ది మౌంటు) ను చదివి సర్వమతప్రవక్తలను భగవదవతారములుగా గుర్తించే హిందువుల విశాలదృక్పథమును ప్రస్తుతించారు. మినర్వా ట్యుటోరియలు కాలేజి ప్రిన్సిపాలుగారగు శ్రీ వి. ఎన్. పరశురాం, ఎమ్. ఏ. గారు జీసుక్రైస్తుజీవితోపదేశాలనుగూర్చి ఆంగ్లంలో ఉపన్యసించారు. ఆ ఉపన్యాససారం ఈ పత్రికలోనే మఱొక సంచికలో ప్రచురింపబడుతుంది.

# గ్రంథపరిచయం

## మహర్షి వివేకానందుడు

రచయితయు ప్రాప్తిస్థానమును : విద్యావిశారద సాహిత్యరత్న భాషాప్రవీణ శ్రీ కె. టి. ఎల్. నరసింహాచార్యులు, వ్యవస్థాపకులు ప్రకాశకులు శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు, కృష్ణాజిల్లా, పుటలు 128, వెల రెండురూపాయలు.

సుమారు ముప్పది సంవత్సరములకు పూర్వము భాషాప్రవీణపరీక్షకు పాఠ్యముగ తాము చదివిన శ్రీమచ్చిరంతనానందస్వాముల 'వివేకానందజీవితచరిత్ర' రచయితగారి హృదయమున తిరముగ నెలకొని వారికి శ్రీరామకృష్ణసారస్వతమున దృఢప్రతిపత్తి కలిగించింది. తాము బేలూరుదక్షిణేశ్వరాదిక్షేత్రములను దర్శించి వంగభాషనుసైతము నేర్చుకొన్నామని పీఠికలో తెల్పుకొన్నారు. శ్రీ చిరంతనానందస్వాముల యనుమతితో ఆశీస్సుతో వారి గ్రంథమునుండి సేకరించుకొన్న విషయములతో వీరు రచించిన యీ 'మహర్షి వివేకానందుడు' నేటి యువజనులకు అవశ్యపఠనీయం, వారికి మహోపకారకం అనడం అత్యుక్తి కాదు. చిత్తూరు సంస్కృతభాషాప్రచారిణీసభవారగు శ్రీ తి. కం. తిరువేంగళాచార్యులవారు ఈరచయితగారి సాహసకార్యములను 'అనితరసులభము' లని కొనియాడ నెంచి 'అనితరదుర్లభము' లని వ్రాయడం వినోదకరం.

ప్రభాకర్

## వేదసుధాకరము

రచయితయు ప్రాప్తిస్థానమును ఆర్షవిద్యాలంకార కల్లూరు చంద్రమౌళి, చంద్రమౌళి నగరు, గుంటూరు 2, పుటలు 240. వెల రూ. 10 లు.

ఈ గ్రంథము ఆసక్తితో నామూలాగ్రము చదివినవారి కమందానందము కలుగును. సంస్కృతభాషాప్రాశస్త్యము యావద్భారతదేశభాషగా సమాదరము నొందు నర్హత సంస్కృతమున కొక్కదానికే యుండుట ప్రాచ్యపాశ్చాత్యోదీచ్య దాక్షిణాత్యనిర్విశేషముగ నెల్లర నాసక్తి గొలుపుచున్న వేదముల నిత్యాపౌరుషేయతలు, ఆసారస్వతానుభూతికి నేవర్ణమువారును బాహ్యులు కారనెడి సమంజసాశయము – ఇవి యన్నియు నెంతయు నుపపన్నముగా నిందు విశదీకరింపబడియున్నవి. మానవతాప్రతిరూపములైన దేశాభిమానమును భాషాభిమానమును భారతీయతానురూపమై విశ్వమానవసౌభ్రాత్రమునకు పైమెట్టైన సర్వజీవైక్యమును గనజేయు నార్షదృష్టియు ఈగ్రంథరాజమున సర్వగతములుగ నున్నవి. ఆయావ్యామోహాలకు వశులైనవారి కమోఘముగ కనువిప్పు గూర్చు ఈ గ్రంథప్రతిపాద్యములందలి హార్దతకును ప్రతిపాదనమందలి రచయితగారి సిద్ధహస్తతకును ధన్యవాదములు.

నే. భ

# శ్రీరామకృష్ణ భాష్యము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

పరిశోధితమగు 1121 మహోపదేశములతో, సంగ్రహ జీవితముతో నలరారుచున్నది.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధ గురువులు, లౌకికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు : వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, జీవుడు : దేవుడు, జ్ఞానము: భక్తి: కర్మము, బ్రహ్మతత్త్వము, సూక్తులు: నీతికథలు మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసిబిడ్డలకయిన నవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

...ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికి కాక, రెంటికి సంబంధించిన సూక్ష్మాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి... .ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్వలమగు పంచమ ముద్రణము : వెల : అట్టబైండు : రూ. 4-50
క్యాలికో : రూ. 5-50

# శ్రీరామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణదేవుని దివ్యోపదేశవాక్యము లాధారముగాగొని, వానిని విరివిపఱచి, తమ సొంతభావము లెన్నియోచేర్చి, ఆ సమష్టినంతయు శ్రీరామకృష్ణభాషితముగా, మనోహరకథారూపముగను, సంభాషణరూపముగను మార్చి, తమిళభాషలో రచింపబడిన జనాకర్షకగ్రంథము. ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతీ, హిందీభాషలలోని కిప్పటికే అనువదింపబడి అపారవ్యాప్తినొందినది. ఆ గ్రంథమున కిది చక్కని ఆంధ్రీకరణము.

128 పుటలు వెల : రూ. 1-25

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# భక్తియోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో, శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవా రిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

121+4 పుటలు ఆఱవ కూర్పు వెల : రూ. 1-50

# కర్మయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ వివేకానందస్వాములవారు కర్మయోగతత్త్వము నరటిపండొలిచినరీతిని విశదీకరించియున్నారు. కర్మమెటుల మోక్షసాధనమో స్పష్టీకరించియున్నారు. కర్మయోగ రహస్యము నెఱుగగోరు జిజ్ఞాసువుల కిది కల్పతరువు.

146+8 పుటలు ఏడవ కూర్పు వెల : రూ. 1-50

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు–21) న ముద్రింపబడి,

శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# తెలుగు, తమిళ పాఠకులకు
# అరుదైన అవకాశం

## ఈ క్రింది పుస్తకాల ధరలో 25 శాతం తగ్గింపు

పుస్తకాల ఖరీదు పంపి లాభం పొందండి.
తపాలా ఖర్చులు అదనం.

## తెలుగు

### శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి

(10 సంపుటాలు)

ప్రతి సంపుటంలోను పుటలు 500 ల కెక్కువే. ఆంగ్లభాషలోనున్న సంపూర్ణగ్రంథావళి
కిది తేటతెనుగున అనువాదం.

| | | | | |
|---|---|---|---|---|
| అసలు ఖరీదు | సాదాఅట్టబైండింగు | ర్పూ. 51-50 | కాలికో | ర్పూ. 65-00 |
| 25 శాతం తగ్గింపు ధర | ,, | ర్పూ. 38-63 | ,, | ర్పూ. 48-75 |

## తమిళం

### 1. స్వామి వివేకానన్దరిన్ జ్ఞానదీపమ్

(10 సంపుటాలు)

ప్రతి సంపుటంలోను పుటలు 500 ల కెక్కువే. ఆంగ్లభాషలోనున్న సంపూర్ణగ్రంథావళి
కిది సరళ తమిళములోనికి అనువాదం.

| | | | | |
|---|---|---|---|---|
| అసలు ఖరీదు | సాదాఅట్టబైండింగు | ర్పూ. 50-00 | కాలికో | ర్పూ. 65-00 |
| 25 శాతం తగ్గింపు ధర | ,, | ర్పూ. 37-50 | ,, | ర్పూ. 48-75 |

### 2. స్వామి వివేకానందర్

రచయిత : రా. గణపతి

(పుటలు 895)

స్వామిజి జీవితచరిత్రం ఇందు విపులంగా పొందుపఱుపబడి ఉన్నది.

| | | |
|---|---|---|
| అసలు ఖరీదు | కాలికో | ర్పూ. 9-00 |
| 25 శాతం తగ్గింపు ధర | ,, | ర్పూ. 6-75 |

పుస్తక విక్రేతలకు $33\frac{1}{3}$ శాతము కమీషను ఈయబడును.

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 4.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౭ ౧౯౭౧ - మార్చి : సాధారణ - ఫాల్గుణము సంచిక ౯

## విషయసూచిక

# మా 'దివ్యవాణి' గ్రంథమాల

కొనండి ! పదే పదే చదవండి !!

దివ్యావతారమూర్తుల విశ్వోపజీవ్యములైన అమృత మధుర సూక్తులు సర్వ సుగ్రహమైన హృదయ సన్నిహితమైన తేట తెనుగున వీనిలో అందజేయబడ్డాయి. ఇందులో ఒక్కొక్కటి నిరుత్సాహులకు ఉత్సాహప్రదం, అశాంతిసంక్షుభితులకు శాంతిదాయకం, సంశయాందోళితులకు సంశయాపనోదకం, జిజ్ఞాసువులకు పరమార్థజ్ఞాన సమర్పకం, అందరికీ శిక్షకం, సంస్కారకం నిర్వృత్యాపాదకం. మువ్వన్నెల మేలి జాకెట్టుతో పాకెట్టుసైజులో చక్కని తయారింపు—

| | | | |
|---|---|---|---|
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 0-40 | శ్రీ కృష్ణవాణి | 0-40 |
| శ్రీ శారదాసూక్తి నవనీతము | 0-40 | బుద్ధ ఉవాచ | 0-40 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0-40 | క్రీసు సూక్తిమాల | 0-40 |

మహమ్మదు సూక్తిమంజరి 0-40

# దేవీ మాహాత్మ్యము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

మార్కండేయ పురాణాంతర్గతమగు దేవీమాహాత్మ్యము భక్తులెల్లరు అవశ్యము పఠింపదగిన దివ్యగ్రంథము. పాఠకుల సౌకర్యార్థము శ్లోకములు పెద్దఅక్షరములతో ముద్రింపబడియున్నవి. ప్రతి శ్లోకమునకు తేటతెల్లమగు తాత్పర్యము గలదు

పారాయణము చేయగోరు భక్తుల యుపయోగార్థము గ్రంథాదియందు చండికా ధ్యానము, అర్గలాస్తోత్రము, కీలకస్తోత్రము, దేవీకవచమును, గ్రంథాంతమున అపరాధ క్షమాపణస్తోత్రమును, దేవీసూక్తమును పొందుపఱచియున్నాము.

ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పారాయణముచేయు భక్తులకు శ్రీదేవీకృపాకటాక్ష వీక్షణప్రసారము తప్పక కలుగును.

170+24 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము వెల : రూ. 2-50

---

ఠము, మైలాపూరు, మద్రాసు-4

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హాక్స్లీ) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.' (సన్డే స్టాన్డర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి: 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

590+158 పుటలు వెల: రూ. 7-50

# ప్రబోధరత్నాకరము

అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు

శ్రీ వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

232 పుటలు మూడవ కూర్పు వెల: 2-50

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4



'అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౭ } ౧౯౭౧ – మార్చి : : సాధారణ – ఫాల్గుణము { సంచిక ౯


శ్రీః

## వివేకచూడామణి

మూలము :
శ్రీ శంకర భగవత్పాదులు

వ్యాఖ్యాత :
అన్నమాచార్య

ఏ షావృత్తి ర్నామ తమోగుణస్య శక్తి, ర్యయా వస్త్వభిభాసతే ఽన్యథా,
సైషా నిదానం పురుషస్య సంసృతే, ర్విక్షేపశక్తేః ప్రసరస్య హేతుః. 113

ఆవృతి (=కప్పిపెట్టుట) అనునది తమోగుణశక్తి. ఒకవస్తువును మఱొకవస్తువునుగా గనజేయునదియు, జీవుని సంసారమునకును విక్షేపశక్తిప్రసారమునకును ఆదికారణమైనదియు ఈ యావరణశక్తియే. ౧౧౩

ప్రజ్ఞావానపి పణ్డితోఽపి చతురో ఽప్యత్యన్తసూక్ష్మార్థదృగ్
వ్యాలీఢ స్తమసా న వేత్తి బహుధా సమ్బోధితోఽపి స్ఫుటమ్
భ్రాన్త్యారోపిత మేవ సాధు కలయ త్యాలమ్బతే తద్గుణా
హా న్తాసౌ ప్రబలా దురన్తతమసశ్శక్తి ర్మహ త్యావృతిః. 114

మానవున కెంతప్రజ్ఞ యున్న నేమి, ఎంతపాండిత్య మున్న నేమి, ఎంతచాతుర్య మున్న నేమి, ఎంత సూక్ష్మదృష్టి యున్న నేమి—తమోగుణవశుడైనచో, ఎవ రెంత తెలియ జెప్పినను అతడు తెలిసికోడు. భ్రాంతిచే తా నారోపించుకొన్నదే నిజ మనుకొనును—దాని గుణములే తనవి అని తలచును. ఇసీ, దురంతమగు తమోగుణమునకు జెందిన యీ యావరణ శక్తి ప్రబలమైనది, మహత్తైనది. ౧౧౪

అభావనా వా విపరీతభావనా సమ్భావనా విప్రతిపత్తి రస్యాః
సంసర్గయుక్తం న విముఞ్చతి ధ్రువం విక్షేపశక్తిః క్షపయ త్యజస్రమ్. 115

తామసమైన యీయావరణశక్తితోడి సంసర్గ మున్నంతవఱకు అభావనయు విపరీతభావనయు సంశయభావనయు మానవునుండి తొలగవు. అతడు ఇంద్రియాతీతమైన దేదియు లేదు పొమ్మనును, దేహమే ఆత్మ అని తలచును, నమ్మడు, సందేహించును. విక్షేపశక్తియు అతనిని సదా అలయించుచుండును. ౧౧౫

అజ్ఞాన మాలస్య జడత్వ నిద్రా ప్రమాద మూఢత్వముఖా స్తమోగుణాః
ఏతైః ప్రయుక్తో న హి వేత్తి కిఞ్చి న్నిద్రాళువత్ స్తమ్భవ దేవ తిష్ఠతి. 116

ఎఱుక లేమి, సోమరితనము, మొద్దుతనము, నిద్రపోతుదనము, ఏమరుపాటు, పొరపాట్లు మున్నగునవి తమోగుణములు. ఈ గుణములు గలవా డేమియు నెఱుగడు, అతడు నిద్రాళువుగను కంబమును బ్రోడును పోలినవాడుగను ఉండును. ౧౧౬

సత్త్వం విశుద్ధం జలవ త్తథాపి తాభ్యాం మిళిత్వా సరణాయ కల్పతే
యత్రాత్మబిమ్బః ప్రతిబిమ్బిత స్సన్ ప్రకాశయ త్యర్క ఇవాఖిలం జడమ్. 117

అచ్చము సత్త్వము తేటనీటివంటిది. ఆత్మబింబ మందు ప్రతిబింబితమై సూర్యునివలె జడప్రపంచము నంతటిని ప్రకాశపఱచును. కాని రజస్తమోగుణముల కల్తి కలిగినప్పుడు, ఆ సత్త్వగుణము సంసారహేతు వగుచున్నది. ౧౧౭

మిశ్రస్య సత్త్వస్య భవన్తి ధర్మా స్త్వమానితాద్యా నియమాయమాద్యాః
శ్రద్ధాచ భక్తిశ్చ ముముక్షుతా చ దైవీ చ సమ్పత్తి రసన్నివృత్తిః. 118

ఈక్రింద పేర్కొనబడుచున్నవి మిశ్రసత్త్వగుణములు—"అమానిత్వము, అదంభము, అహింస, క్షాంతి, ఆర్జవము, ఆచార్యోపాసనము, శౌచము, స్థైర్యము, ఆత్మవినిగ్రహము, ఇంద్రియార్థములందు వైరాగ్యము, నిరహంకారత, జన్మమృత్యుజరావ్యాధి దుఃఖములలోని దోషమును గుర్తించుట, అసక్తి, పుత్రదారగృహాదులందు మమకారము లేమి, ఇష్టము సంభవించినను అనిష్టము సంభవించినను సమచిత్తత గల్గియుండుట, కృష్ణునం దేకాగ్రభక్తి, ఏకాంతవాసప్రీతి, జనసమ్మర్దమునందు అప్రీతి, ఆత్మజ్ఞానమే నిత్య మనియు మోక్షప్రాప్తియే పురుషార్థ మనియు నుండుట" అని భగవద్గీత (XIII-8-12) లో చెప్పబడిన ధర్మములు, శౌచసంతోషాది నియమములు, సత్యాహింసాది యమములు, శ్రద్ధాభక్తిముముక్షుతలు, దైవీసంపద యని భగవద్గీత (XVI) లో పరిగణితములైన అభయసత్త్వసంశుద్ధిజ్ఞానప్రముఖ గుణములు, అసత్తుపట్ల వైముఖ్యము. ౧౧౮

విశుద్ధసత్త్వస్య గుణాః ప్రసాద స్స్వాత్మానుభూతిః పరమా ప్రశాన్తిః
తృప్తిః ప్రహర్షః పరమాత్మనిష్ఠా యయా సదానన్దరసం స మృచ్ఛతి. 119

ప్రసాదము, స్వాత్మానుభూతి, పరమమైన ప్రశాంతి, తృప్తి, ప్రహర్షము సదా ఆనందరసానుభూతిని గలిగించు పరమాత్మనిష్ఠ — అనెడి యివి రజస్తమోగుణముల కల్తీ లేని సత్త్వగుణమునకు ధర్మములు. ౧౧౯

అవ్యక్త మేత త్త్రిగుణై ర్నిరుక్తం త త్కారణం నామ శరీర మాత్మనః
సుషుప్తి రేతస్య విభక్త్యవస్థా ప్రలీనసర్వేన్ద్రియబుద్ధివృత్తిః. 120

త్రిగుణాత్మకమని లోగడనిరూపితమైన యీ యవ్యక్తమే ఆత్మకు కారణశరీరము. సర్వేంద్రియములవృత్తులును బుద్ధివృత్తియు ప్రలీనములగు సుషుప్తియే కారణశరీరమునకు ప్రత్యేకావస్థ. ౧౨౦

సర్వప్రకారప్రమితిప్రశాన్తి ర్బీజాత్మనావస్థితి రేవ బుద్ధేః
సుషుప్తి ర త్రాస్య కిల ప్రతీతిః కిఞ్చి న్న వే ద్మీతి జగత్ప్రసిద్ధేః. 121

అన్నివిధములైన జ్ఞానములును ప్రశమించిన సుషుప్త్యవస్థలో బుద్ధియొక్కటి మాత్రమే స్వబీజరూపమున నుండును. బుద్ధికి బీజ మజ్ఞానము. ''గాఢనిద్రలో నేమియు నెఱుగకుంటి'' నని చెప్పుకొనువాడుక లోకమున ప్రసిద్ధముగ నున్నది కదా. అందుచేతనే సుషుప్తిలో నజ్ఞాన ముండు ననుట స్పష్టమగుచున్నది. ౧౨౧

దేహేన్ద్రియప్రాణమనోఽహమాదయ స్సర్వే వికారా విషయా స్సుఖాదయః
వ్యోమాదిభూతా న్యఖిలఞ్చ విశ్వ మవ్యక్తపర్యన్త మిదం హ్యనాత్మా. 122

దేహము, ఇంద్రియములు, ప్రాణాదివాయువులు, మనస్సు, అహంకారము మున్నగునవియు, మనోవికారము లన్నియు, శబ్దాదివిషయములును, సుఖాదులును, ఆకాశాదిభూతములును, ఇంతెందుకు, అవ్యక్తపర్యంత మున్న యీ విశ్వ మంతయు అనాత్మయే. ౧౨౨

మాయా మాయాకార్యం సర్వం మహదాదిదేహపర్యన్తమ్
అస దిద మనాత్మతత్త్వం విద్ధి త్వం మరుమరీచికాకల్పమ్. 123

మహత్తత్త్వము మొదలు దేహపర్యంతము సర్వమును మాయాకార్యమే. మాయాకార్యమును మాయయు అనాత్మతత్త్వమనియు అవి ఎండమావులవంటి వనియు నెఱుగుము.

అథ తే సంప్రవక్ష్యామి స్వరూపం పరమాత్మనః
య ద్విజ్ఞాయ నరో బన్ధా న్ముక్తః కైవల్య మశ్నుతే. 124

ఇక నీకు పరమాత్మస్వరూపమును దెల్పెదను. పరమాత్మస్వరూపమును దెలిసికొన్న నరుడు బంధవిముక్తుడై కైవల్యము వడయును. ౧౨౪

అస్తి కశ్చి త్స్వయం నిత్య మహంప్రత్యయలమ్బనః
అవస్థాత్రయసాక్షీ స న్పఞ్చకోశవిలక్షణః. 125

ఇట్టి దట్టి దనరానిదియు, నిత్యమైనదియు, 'నే' ననెడి యభిమానమున కాశ్రయమును, మెలకువ - కల - నిద్ర యనెడి మూడుదశలకును సాక్షీభూతమును, అన్నమయము ప్రాణమయము మనోమయము విజ్ఞానమయము ఆనందమయము అను పంచకోశములకంటె వేఱైనదియు అగు (ఆత్మ) వస్తువు కలదు. ౧౨౫

యో విజానాతి సకలం జాగ్రత్స్వప్నసుషుప్తిషు
బుద్ధితద్వృత్తిసద్భావ మభావ మహ మిత్యయమ్. 126

'నే' ననుట కాశ్రయమైన అదే మెలకువ - కల - నిద్ర యనెడి మూడుదశలందును బుద్ధితద్వృత్తులయునికిని లేమిని సకలము నెఱుగుచుండును. ౧౨౬

యః పశ్యతి స్వయం సర్వం యం న పశ్యతి కశ్చన
య శ్చేతయతి బుద్ధ్యాది న త ద్యం చేతయ త్యయమ్. 127

ఆత్మ సమస్తమును జూచుచుండును, ఆత్మ నెవరును జూచుట లేదు. ఆత్మ బుద్ధి మున్నగువానిని సచేతనములుగ జేయుచున్నది. ఆత్మ స్వయముగ చేతనమే కావున దానిని వేఱేదియు చేతన మొనర్చుట ప్రసక్తింపదు. ౧౨౭

యేన విశ్వ మిదం వ్యాప్తం యం న వ్యాప్నోతి కిఞ్చన
అభారూపమిదం సర్వం యం భా న్త మనుభాత్యయమ్. 128

ఆత్మ విశ్వమంతట వ్యాపించియున్నది. విశ్వమాత్మను వ్యాపింపజాలదు. జడమగు సర్వప్రపంచమును ఆత్మ ప్రకాశింపజేయును. ౧౨౮

# పరమహంస దేవుని ప్రబోధవాణి

ప్రశ్న : మహాశయా, దేవుని నీవు చూచి యున్నావా ?

శ్రీరామకృష్ణుడు : అవును, నిన్ను జూచు చున్నట్లే దేవుని చూచుచున్నాను, నిన్ను జూచుచున్నంతకన్న సన్నిహితతరముగ జూచు చున్నాను. నిన్ను జూచి నీతో మాటాడు చున్నట్లే దేవుని ప్రత్యక్షముగ చూడవచ్చును. చూచి మాటాడవచ్చును. కాని ఆయనను చూత మనెడి అక్కఱ పూనువా డేడీ? ఆలు బిడ్డలకై సిరిసంపదలకై జనులు కన్నీరు కడవ లుగ నేడ్తురు. దేవునకై విలపించువా రేరీ? దేవుని గోరి మనఃపూర్వకముగ విలపించు నాతనికి దేవుడు తప్పక ప్రత్యక్షమగును.

ప్రశ్న: మహాశయా, భగవంతుడు సాకా రుడా, నిరాకారుడా ?

శ్రీరామకృష్ణుడు: దేవు డిట్లుండునే కాని మఱొక ట్లుండడని ఖండితముగ ఎవరును చెప్ప జాలరు. ఆయన నిరాకారుడు, సాకారుడు. భక్తునికై భగవంతుడు రూపములు దాల్చును. జగమును స్వప్నమని భావించు జ్ఞానికి భగవం తుడు నిరాకారుడు. భక్తుని యనుభవములో తాను వేఱు, జగము వేఱు, కావున దేవు డత నికి రూపశోభితుడుగ గనపడును. కాని జ్ఞాని, వేదాంతి, సదా ''ఇదికాదు ఇదికాదు''-అని త్రోసివేసికొనుచు పోవును. ఇట్లు వివేచించు కొనుచు చనుటచే అహంకారమును జగత్తును స్వప్నమువలె మిథ్యలనెడి తత్త్వము అతని అంతరదృష్టికి స్పష్టమగును. అంతట జ్ఞాని బ్రహ్మము తానే అనుటను సాక్షాత్కరించు కొనును. బ్రహ్మము నతడు నిర్వచింపజాలడు.

నేను చెప్ప నెంచినది నీ కర్థమగుచున్నదా? సచ్చిదానంద పరబ్రహ్మ మొక యపార మహా సముద్ర మనుకొనుము. భక్తుని ప్రేమశీతలతచే అందలి నీరచట నచట మంచుగా గడ్డకట్టును. అనగా తన భక్తులకై భగవంతుడు వివిధ రూపములు దాల్చి సాకారుడుగ దర్శన మనుగ్రహించుచుండును. కాని జ్ఞానప్రభాకరు డుదయించుటతోనే మంచుగడ్డలు కరగిపోవును. అప్పుడు దేవు డొకవ్యక్తి అను తలంపుండదు. దేవుని రూపములు కానరావు. దేవు డిట్లుండు నని వర్ణింప శక్యముకాదు. దేవు నెవరు వర్ణింతురు? వర్ణించువాడు అంతర్ధాన మొం దును. 'నే' ననెడి యనుభూతి అతని కిక నుండదు.

తన్ను విభజించి చూచుకొనునేని ఎవనికి గాని 'తా' ననెడి యొకటి కనిపింపనే కని పింపదు. ఇందుల కుదాహరణ ముల్లిగడ్డ. మొదట దానిపైనున్న ఎఱ్ఱపొరను ఒలిచి వేయుదువు. అంత ఒకదాని కడుగున నొక టిగా గట్టితెల్లపొరలు కనిపించును. ఒక్కొ క్కటిగా వానిని ఒలువుము. లోపల నేదియు కానరాదు.

ఆదశలో మానవున కిక నహంకార మున్నట్లే కానరాదు. అన్వేషించుట కెవరు శేషించియున్నారు? ఆ శుద్ధచైతన్యదశలో అతని బ్రహ్మానుభూతి నెవరు వర్ణింపగలరు? ఒకప్పుడు కడలిలోతును గొలువ నొక యుప్పు బొమ్మ తరలెను. నీట జొరగానే అది కరగి పోయెను. నీటిలోతు నిక నెవరు తెల్పుదురు ?

జ్ఞానపరిపూర్తి కొక లక్షణ మున్నది. జ్ఞాన పరిపూర్తి నొందగనే మానవుని మాన మావ హించును. ఉప్పుబొమ్మవంటిదైన యహంకా రము సచ్చిదానందసాగరమున కరగిపోయి ఐక్య మొందును. ఇంచుక జాడగానైన వేఱుపా టుండదు.

అథ తే సంప్రవక్ష్యామి స్వరూపం పరమాత్మనః
య ద్విజ్ఞాయ నరో బన్ధా న్ముక్తః కైవల్య మశ్నుతే. 124

ఇక నీకు పరమాత్మస్వరూపమును దెల్పెదను. పరమాత్మస్వరూపమును దెలిసికొన్న నరుడు బంధవిముక్తుడై కైవల్యము వడయును. ౧౨౪

అస్తి కశ్చి త్స్వయం నిత్య మహంప్రత్యయలమ్బనః
అవస్థాత్రయసాక్షీ స న్పఞ్చకోశవిలక్షణః. 125

ఇట్టి దట్టి దనరానిదియు, నిత్యమైనదియు, 'నే' ననెడి యభిమానమున కాశ్రయము, మెలకువ - కల - నిద్ర యనెడి మూడుదశలకును సాక్షిభూతమును, అన్నమయము ప్రాణమయము మనోమయము విజ్ఞానమయము ఆనందమయము అను పంచకోశములకంటె వేఱైనదియు అగు (ఆత్మ) వస్తువు కలదు. ౧౨౫

యో విజానాతి సకలం జాగ్రత్స్వప్నసుషుప్తిషు
బుద్ధితద్వృత్తిసద్భావ మభావ మహ మిత్యయమ్. 126

'నే' ననుట కాశ్రయమైన అదే మెలకువ - కల - నిద్ర యనెడి మూడుదశలందును బుద్ధితద్వృత్తులయునికిని లేమిని సకలము నెఱుగుచుండును. ౧౨౬

యః పశ్యతి స్వయం సర్వం యం న పశ్యతి కశ్చన
య శ్చేతయతి బుద్ధ్యాది న త ద్యం చేతయ త్యయమ్. 127

ఆత్మ సమస్తమును జూచుచుండును, ఆత్మ నెవరును జూచుట లేదు. ఆత్మ బుద్ధి మున్నగువానిని సచేతనములుగ జేయుచున్నది. ఆత్మ స్వయముగ చేతనమే కావున దానిని వేఱేదియు చేతన మొనర్చుట ప్రసక్తింపదు. ౧౨౭

యేన విశ్వ మిదం వ్యాప్తం యం న వ్యాప్నోతి కిఞ్చన
అభారూపమిదం సర్వం యం భాన్త మనుభాత్యయమ్. 128

ఆత్మ విశ్వమంతట వ్యాపించియున్నది. విశ్వమాత్మను వ్యాపింపజాలదు. జడమగు సర్వప్రపంచమును ఆత్మ ప్రకాశింపజేయును. ౧౨౮

# పరమహంస దేవుని ప్రబోధవాణి

ప్రశ్న : మహాశయా, దేవుని నీవు చూచియున్నావా?

శ్రీరామకృష్ణుండు : అవును, నిన్ను జూచుచున్నట్లే దేవుని చూచుచున్నాను, నిన్ను జూచుచున్నంతకన్న సన్నిహితతరముగ జూచుచున్నాను. నిన్ను జూచి నీతో మాటాడుచున్నట్లే దేవుని ప్రత్యక్షముగ చూడవచ్చును. చూచి మాటాడవచ్చును. కాని ఆయనను చూతమనెడి అక్కఱ పూనువా ? ఆలుబిడ్డలకై సిరిసంపదలకై జనులు కన్నీరు కడవలుగ నేడ్తురు. దేవునకై విలపించువారేరీ? దేవుని గోరి మనఃపూర్వకముగ విలపించునాతనికి దేవుడు తప్పక ప్రత్యక్షమగును.

ప్రశ్న: మహాశయా, భగవంతుడు సాకారుడా, నిరాకారుడా?

...ండు: దేవుడిట్లుండునే కాని మఱొకట్లుండడని ఖండితముగ ఎవరును చెప్పజాలరు. ఆయన నిరాకారుడు, సాకారుడు. భక్తునికై భగవంతుడు రూపములు దాల్చును. జగమును స్వప్నమని భావించు జ్ఞానికి భగవంతుడు నిరాకారుడు. భక్తుని యనుభవములో తాను వేఱు, జగము వేఱు, కావున దేవుడతనికి రూపశోభితుడుగ గననగును. కాని జ్ఞాని, వేదాంతి, సదా ''ఇదికాదు ఇదికాదు''-అని త్రోసివేసికొనుచు పోవును. ఇట్లు వివేచించుకొనుచు చనుటచే అహంకారమును జగత్తును స్వప్నమువలె మిథ్యలనెడి తత్త్వము అతని ఆంతరదృష్టికి స్పష్టమగును. అంతట జ్ఞాని బ్రహ్మము తానే అనుటను సాక్షాత్కరించుకొనును. బ్రహ్మము నతడు నిర్వచింపజాలడు.

నేను చెప్పనెంచినది నీకర్థమగుచున్నదా? సచ్చిదానంద పరబ్రహ్మ మొక యపార మహాసముద్ర మనుకొనుము. భక్తుని ప్రేమశీతలతచే అందలి నీరచట నచట మంచుగా గడ్డకట్టును. అనగా తన భక్తులకై భగవంతుడు వివిధ రూపములు దాల్చి సాకారుడుగ దర్శన మనుగ్రహించుచుండును. కాని జ్ఞానప్రభాకరుడుదయించుటతోనే మంచుగడ్డలు కరగిపోవును. అప్పుడు దేవుడొకవ్యక్తి అను తలంపుండదు. దేవుని రూపములు కానరావు. దేవుడిట్లుండునని వర్ణింప శక్యముకాదు. దేవునెవరు వర్ణింతురు? వర్ణించువాడు అంతర్ధాన మొందును. 'నే' ననెడి యనుభూతి అతనికిక నుండదు.

తన్ను విభజించి చూచుకొనునేని ఎవనికిగాని 'తా' ననెడి యొకటి కనిపింపనే కనిపింపదు. ఇందుల కుదాహరణ ముల్లిగడ్డ. మొదట దానిపైనున్న ఎఱ్ఱపొరను ఒలిచివేయుదువు. అంత ఒకదాని కడుగున నొకటిగా గట్టితెల్లపొరలు కనిపించును. ఒక్కొక్కటిగా వానిని ఒలువుము. లోపల నేదియు కానరాదు.

ఆదశలో మానవున కిక నహంకారమున్నట్లే కానరాదు. అన్వేషించుట కెవరు శేషించియున్నారు? ఆ శుద్ధచైతన్యదశలో అతని బ్రహ్మానుభూతి నెవరు వర్ణింపగలరు? ఒకప్పుడు కడలిలోతును గొలువ నొక యుప్పుబొమ్మ తరలెను. నీట జొరగానే అది కరగిపోయెను. నీటిలోతు నిక నెవరు తెల్పుదురు?

జ్ఞానపరిపూర్తి కొక లక్షణమున్నది. జ్ఞానపరిపూర్తి నొందగనే మానవుని మౌన మావహించును. ఉప్పుబొమ్మవంటిదైన యహంకారము సచ్చిదానందసాగరమున కరగిపోయి ఐక్య మొందును. ఇంచుక జాడగానైన వేఱుపాటుండదు.

ఆత్మపరిశీలనము ముగియక సాగుచున్నంతవఱకు మానవుడు మిక్కిలి పటాటోపముతో వాదించుచుండును. అది ముగిసినంతనే మౌని యగును. ఖాళీబిందెను చెఱువునీట ముంచితి వనుకొనుము. నీరు బిందెనిండి, ఆ నీరును వెలుపలి నీరు నొక్కటి కాగానే చప్పుడు ఆగిపోవును. బిందెలో నీరు పూర్తిగా నిండకున్నంతవఱకు గుడగుడ చప్పుడు విననగుచుండును.

ప్రాచీన కాలమున ప్రజలు పల్కెడివారు "నావ కడలి నీలనీరమున నొక్కసారి జొచ్చునేని ఇక నది మరలి రా" దని.

అహంకారము సమసినంతనే చిక్కులు చిరాకులు అన్నియు అంతరించును. నీవు యుక్తివాదాలు వేయి చేయుదువు గాక-'నే' ననెడి భావ మప్పటికిని అంతరింపదు. మీవంటివారికి నావంటివారికి "నేను భగవద్భక్తుడ" నను భావ ముండుటే మంచిది.

భక్తునికొఱకే సగుణబ్రహ్మము. అనగా భగవంతుడు గుణవిశిష్టుడనియు సాకారుడై మానవులకు ప్రత్యక్ష మగుననియు భక్తుడు విశ్వసించు నన్నమాట. మన ప్రార్థనల నాలించువా డాయనయే. నీ ప్రార్థనలకు లక్ష్య మాయనయే ... నీవు దేవుడు సాకారుడని అంగీకరించినను సరే నిరాకారుడని అంగీకరించినను సరే, విశ్వసృష్టిస్థితిసంహారకర్తయు అనంతశక్తియు అర్థితార్థప్రదాతయు ఆయనే అను పరిజ్ఞాన మున్న చాలును.

భక్తిమార్గానుసారులకు భగవంతుని ప్రాపించుట సులభము.

## రామకృష్ణతారావళి

### శ్రీ తుళ్లూరి నరసింహారావుగారు

ఓ మహనీయమూర్తి, కరుణోదధి, మీ కమనీయజీవితా
రామములో సుమించినవి రంజిలు భక్తిసుబోధపుష్పముల్
క్షేమకరుండవై, సుజనసేవ్య, తపోధనమండనుండవై
ప్రేమను జాటినావు పృథివిన్ భవబంధవిమోక్షదీక్షమై.

అమితతపోవిభూతి, మహితాత్మ, భవన్మధురోపదేశవా
గమృతము గ్రోలితిన్, హృది నిరంతరమున్ భగవంతుపాదప
ద్మములను చింతసేయఁగలధన్యుడ గాను, భవత్కృపాకటా
క్షము ప్రసరింప వేడెద, విశాలదయాహృదయా, మహోదయా.

కలికాలంబున భక్తిమార్గము వినా గానంగ రా దన్యమా
ర్గలవంబేని యటంచు భక్తులకు వక్కాణించినా, వార్య, ఉ
జ్జ్వలమౌ నీదు తపోవిభూతికి, మహాత్మా, దేశదేశంబు లం
జలి గావించు, నహో మహాపురుష, నీ చారిత్రము ల్జైత్రముల్.

అంతా మిథ్యయె యెంచి చూడగ నరుం డత్యంతమోహార్తుడై
కాంతాపుత్త్రధనాదిసంపదల నాకాంక్షించి యున్మత్తుడై
యెంతో దుఃఖపడున్ భయంపడును గానీ, తాను నిన్నాత్మలో
చింతాకంతయు చింత సేయ డకటా శ్రీరామకృష్ణప్రభూ!

కామం బే బలమైన శత్రు వరయంగా మోక్షమార్గాటవిన్,
కామారిప్రియ, నీవు ధ్యానమహిమన్ దావాగ్నిభంగిన్, తపో
ధామా, దాని నశింప జేసితి జగత్కల్యాణసంధాయివై,
మేము న్నిన్ను భజించి చేరెదము, స్వామీ, మోక్షధామమ్మునన్.

అనుమానం బెడ లేని మానవుడు దివ్యంబైన మీ జీవిత
మ్మున రత్నమ్ముల నెన్ని యేనియును ప్రోవుం జేయగా వచ్చు, మి
మ్మనిశంబున్ భజియించియే కద వివేకానందమాన్యుండు వం
తెనలం గట్టెను దేశదేశముల సందేశమ్ము లందించుచున్.

ఈ రమణీయనిర్మితమహీవలయం బను సత్రశాలలో
జేరి తరింప జాలని యశేషజనాళికి నాదరంబుతో
దారిని జూపి వారలను దైవముఖం బొనరించి జాతి ను
ద్ధార మొనర్చిమించిన యుదారఖనీ, గొను వందనమ్ములన్

దంభము దర్పముం గలిసి తాండవమాడ దొడంగె నేడు, వి
శ్వంభర, దుర్నిమిత్తములు, స్వామి, సహస్రముఖాల దోచు, వి
స్రంభము దాంభికప్రకృతి స్వైరవిహారము సేయ సాగె సం
రంభముతోడ,- నే డవసర మ్మగు మీ జననమ్ము, సద్గురూ.

భగవద్గీత యెటుల్ ప్రశస్తమయి విశ్వవ్యాప్తమై పొల్చె నా
పగిదిన్ మీ కమనీయజీవితకథాభాగమ్ము ఖండాంతర
స్థగితంబై జగతీస్థలిన్ ప్రగతి నుత్పాదించి శోభిల్లెడున్;
జగముల్ మెచ్చెడు మీ మహాత్వమునకున్ శ్రద్ధాంజలుల్, సద్గురూ.

అవతారంబులలో మహాపురుషవిఖ్యాతిం బ్రకాశించు నీ
యవతారాఢ్యత నెన్నగా నల వివేకానందయోగీంద్రుడే
కవిరాణ్మాన్యమహామనీషి తగు గా, కస్మాదృశుల్ కింపచుల్
కవితావైఖరి నిన్ను నెన్ను టిది వాక్చాపల్యమే, సద్గురూ.

# విశ్వమానవతతికి పరమాదర్శము శ్రీరామకృష్ణుడు

"లోకమునకు శ్రీరామకృష్ణు నెఱుకపఱచినవాడు శ్రీ వివేకానందస్వామియే. స్వామిజి లేకున్నచో, ఎవరును గురుదేవుని ప్రతిభ నాకళించుకోగల్గియుండరు"—శ్రీ బ్రహ్మానందస్వామి.

శ్రీరామకృష్ణుని వైభవము ఆకాశవిశాలము, సముద్రగంభీరము. ఇట్టి దట్టి దని గుర్తింపరాని 'అచిన' మనెడి వృక్ష మొకటి కల దట. దానిని తన కుపమానముగ శ్రీరామకృష్ణు డొకసారి పేర్కొనియున్నాడు. గురుదేవుని జీవితచరిత్రమును వ్రాయు మని కొందఱు స్వామిజిని కోరినప్పుడు అందుకు ఆయన "శివునిరూపము చిత్రింపబూనగా కోతిరూపము కుదిరె నన్నట్లగు" నని బదులు చెప్పె నట. అయినను గురుదేవుని దివ్యజీవితమును భవ్యసందేశమును గ్రహింపగోరినవారికి స్వామిజి వాక్కుకంటె ప్రామాణికమైనది వే ఱొకటి లేదు. గోడలోని రంధ్రము గోడ కావల నుండు ప్రకృతిరామణీయకమును జూపగలిగి నట్లు అవతారమూర్తి పరమాత్మతత్త్వమును గనబఱచు నని శ్రీరామకృష్ణుడు వాక్రుచ్చియుండెను. శ్రీరామకృష్ణుని మహిమ నాలాగు కనబఱుప గలవాడు వివేకానందస్వామి యని మా విశ్వాసము. 'ధర్మసంస్థాపకు'డగు ప్రతియవతారమూర్తితోగూడను ఆ ధర్మమునకు ప్రచారకుడగు వ్యక్తియు నుద్భవిల్లుచుండుట లోకచరిత్రమున గాంచుచున్నాము. ప్రకృతయుగావతారమూర్తి శ్రీరామకృష్ణుడు. శ్రీరామకృష్ణసందేశప్రచారకుడు శ్రీ వివేకానందస్వామి.

వివేకానందస్వామిగా అగుటకు మునుపటి నరేంద్రనాథుడు పాశ్చాత్యాదర్శాలతోను ఆశయాలతోను నిండినవాడు. సనాతనభారతీయాధ్యాత్మికాదర్శముల కాశ్రయుడయినవాడు శ్రీరామకృష్ణుడు. ఈ గురుశిష్యుల సమాగమము తొలుదొల్త సంఘర్షణరూపము దాల్చియు శిష్యునకును విశ్వమునకును అనంతశ్రేయఃప్రదాయకముగ పర్యవసించెను. సునిశితముగ పరీక్షింపనిదే, గురువు చెప్పినదానిని అంగీకరింపని శిష్యుడు నరేంద్రుడు. శిష్యుడు కావించు పరీక్షలకు సుంతయు చిరాకు నొందకుండుటే కాదు, అత్యంతము ప్రీతు డగుట ఈ గురుదేవుని ప్రత్యేకత. వీరి సంఘర్షణవలన భౌతికశక్తియు మేధాశక్తియు ఆత్మశక్తికి లోబడినవే అను పరమార్థము నిరూపిత మయ్యెను. పరతత్త్వమును సాక్షాత్కరించుకొనిన శ్రీరామకృష్ణుని తెలివిడులు త్రికరణశుద్ధమైన నరేంద్రునిజిజ్ఞాసను అమోఘముగ పూరించినవి. ఒకరొకరి ప్రభావమునకు వారు ప్రఖ్యాపకులయిరి. శివుడే విశ్వోజ్జీవనమునకై నరేంద్రుడుగ నవతరించె ననియు సర్వమతసమన్వయసందేశము నతడు దిగంతవిశ్రాంతముగా నుద్ఘోషింపగల డనియు శ్రీరామకృష్ణుడు తెల్పెను. శ్రీరామకృష్ణుని గూర్చిన స్వాభిప్రాయమును స్వామిజి సుప్రసిద్ధమైన యీ శ్లోకమున పొందుపఱచెను

స్థాపకాయ చ ధర్మస్య
సర్వధర్మస్వరూపిణే
అవతారవరిష్ఠాయ
రామకృష్ణాయ తే నమః.

"ధర్మసంస్థాపకుడవును సర్వధర్మస్వరూపివియు అవతారవరిష్ఠుడవునగు ఓ రామకృష్ణా, నీకు నమస్సు"

గురుదేవునకు నరేంద్రునిపై గల ప్రేమ ప్రగాఢమైనదే. అయినను ఒకప్పుడు గురుదేవుడు నరేంద్రునిపట్ల పూర్తిగా ఉపేక్ష

వహించెను. అతనివైపు కన్నెత్తి చూచుట యైనను లేదు, పలుకరించుట లేదు, అయినను నరేంద్రుడేమో ఎప్పటియట్లు గురుదేవునొద్దకు వచ్చుచు పోవుచునే యుండెను. 'నేను నిన్నింతగా నిరాదరించుచున్నను, నీవు వచ్చుచునే యున్నావే, కారణమే' మని యొకనాడు శ్రీరామకృష్ణు డడిగెను. అందుకు నరేంద్రుడు చెప్పిన జవాబు: ''నీవు నాతో మాటాడుదు వనియు నీ మాటలు విందమనియు నేను వచ్చుచున్నాననుకొనుచుంటివా? కానే కాదు. నాకు నీపై ప్రేమ. నిన్ను దర్శింపవలె ననుట నా హృదయాభిలాష. అందుకై నేను వచ్చుచుందును.'' గురుదేవునిపట్ల నరేంద్రుని డెందమున నిట్టి ప్రేమోద్గారమును గలిగించిన దేది? నరేంద్రునిపట్ల గురుదేవుని డెందమున గల ప్రబలప్రేమయే. నరేంద్రుడు వచ్చుట కించుక జాగైనను, ఆ విరహము గురుదేవుని కెంత దుర్భరముగనో యుండెడిది. తనపై గురుదేవున కుండిన ప్రేమనుగూర్చి నరేంద్రుడే ఒకసారి యిట్లనెను—''నన్ను కలసికొన్నది మొదలు సదా నాయందు ఏకరూపమైన విశ్వాసము గలిగియుండినవాడు శ్రీరామకృష్ణు డొక్కడే. అంతటి సడలని విశ్వాసము నాయందు నా సోదరులకును తల్లికిని సైతము లేదు. వెనుకాడని యా విశ్వాసమును ప్రేమయునే నన్నాతనికి నిత్యకింకరునిగా నొనర్చినవి. ప్రేమించుట ఎట్లో, తెలిసినవా డాయన యొక్కడే. లౌకికులప్రేమ బూటకము స్వప్రయోజనపరము'' సహజశక్తి సంపన్నుడును మోహనస్వరూపియు నగు నరేంద్రు నెల్లరును ప్రేమింతురు. కాని శ్రీరామకృష్ణుని ప్రేమకు ప్రేరకము నరేంద్రునిలోని దివ్యత్వమే. ఆయన నరేంద్రునిలో నారాయణుని సాక్షాత్కరించుకొనెను. తక్కిన శిష్యులమీది గురుదేవుని ప్రేమయు నిట్టిదే. జీవులపట్ల తీరనితృష్ణ గలవా డాయన. నిస్స్వార్థము నుత్కటము నగు నట్టి ప్రేమ బ్రహ్మజ్ఞానహేతుకముగా నుండక తప్పదు. అద్వైతగోస్వామికొఱకే మహాప్రభు వవతరించినట్లు, నరేంద్రునికొఱకే తా నవతరించితి నని శ్రీరామకృష్ణు డొకసారి చెప్పియుండెను.

యువదశలో నరేంద్రునకు భగవత్సాక్షాత్కారతృష్ణ ఉత్కటకోటికముగా గలిగెను. వట్టి సిద్ధాంతాలు ఆయన దప్పి తీర్పజాలవు. భగవంతుని సాక్షాత్కరించుకొన్నవాడును, తనలోను ఆదివ్యజ్యోతిని వెలిగింపగలవాడు నగు నొక మహాపురుషుడు నరేంద్రునకు కావలసియుండెను. అట్టి మహాపురుషుడగు శ్రీరామకృష్ణు నాశ్రయించెను. ''నిన్ను జూచుచున్నట్లే అంతకన్న ప్రగాఢముగ దేవుని నేను జూచుచున్నాను... దేవుని జూడవలయు నని మనఃపూర్వకముగ నాక్రందించు నతనికి ఆ దర్శనము గల్గి తీరు'' ననుటే శ్రీరామకృష్ణుడు నరేంద్రునకు దెలిపిన మొదటి విషయము. నరేంద్రుడు పరిశీలించియే కాని దేనిని గాని అంగీకరింపడు కదా. కావున నతడు తన గురుదేవుని పవిత్రతను సునిశితముగ బరిశీలించి ''ఆయన పావను డన్న చాలదు; పావతనయే ఆయన అన వలె'' నని నిర్ణయించుకొనెను.

రత్నాలవర్తకుని పరిశీలనాశక్తిని మించిన పరిశీలనాశక్తితో, తల్లిప్రేమను మించిన ప్రేమతో, శిల్పిపరిశ్రమను మించిన పరిశ్రమతో శ్రీరామకృష్ణుడు తనశిష్యుల నెన్నుకొనెను, కాపాడుకొనెను, రూపులు దిద్ది తీర్చెను. శ్రీ వివేకానందస్వామి ఒకలేఖలో నిట్లు వ్రాసియున్నాడు—''ఆయన మాకు అన్నవస్త్రము లిచ్చి, జ్ఞానవివేకములు గలిగించి, మమ్ము మానవులనుగ నొనర్చి, మాకన్ను దెఱచి

నాడు. రాత్రింబవళ్లు మా కాయన ప్రత్యక్ష దైవము.'' గురుదేవుని విశుద్ధియు విరక్తియు భగవత్పరతయును గడా శిష్యుల కంతటి సముత్సాహమును గలిగించి వారిని భగవచ్చరణారవింద సమర్పణార్హకుసుమరాజములనుగ తయారుచేసినది.

శ్రీరామకృష్ణుని కథామృతమును చదివిన వారందఱు ఆయనను జ్ఞానిగా గ్రహించి నంత కంటె నెక్కువగా భక్తవరేణ్యునిగా గ్రహింతురు. కాని ఇందుంగూర్చి స్వామిజి ఇట్లు వాక్రుచ్చియున్నాడు. ''శ్రీ రామకృష్ణుడు వెలుపలికి భక్తుడుగ గన నగును. లోలోన నతడు కేవలము జ్ఞాని. నేను వెలుపలికి జ్ఞానిగ గన నగుచుందును గాని నాలో నిండియున్నది భక్తి.'' గురుదేవునిమీద ఆయన రచించిన గేయములోని యీ క్రింది పంక్తులు ఆ విషయమును విశదీకరింపగలవు—

నరదేవ దేవ జయజయ నరదేవ
అద్వయతత్త్వ సమాహితచిత్తమ్
ప్రోజ్వలభక్తి పటావృతవృత్తమ్
కర్మకళేబర మద్భుతచేష్టమ్
యామి గురుం శరణం భవవైద్యమ్
నరదేవ దేవ జయజయ నరదేవ.

''నరదేవదేవా, నీకు జయము జయము. అద్వయతత్త్వమున సమాహితమైన చిత్తము గలవాడవును, భక్తి యనెడి వలువచే కప్పబడిన చరితము గలవాడవును, జగద్ధితకర్మ వీరుడవును అద్భుత చేష్టితుడవును సంసార వ్యాధిని మాన్పు వైద్యుడవును మా గురునాథుడవు నగు నిన్ను శరణుజొచ్చుచున్నాను. నరదేవదేవా, నీకు జయము, నీకు జయము.''

శ్రీరామకృష్ణుడు శిష్యులకు కఱపు పద్ధతి అతి విలక్షణమైనది. ఆయనయెదుట శిష్యులకు పరిపూర్ణ స్వేచ్ఛ యుండెడిది. వారి జిజ్ఞాసను హేతువాదరతిని ఆయన ఆటంకపఱచెడివాడు కానే కాడు. ఏ శిష్యుని ఎట్లు పైకి తేవలెనో అట్లు తెచ్చెడివా డాయన. ''ఆ యా మానవులతో వారివారి భాషలలో మనము సంభాషింపవలె నని చెప్పగల ధీరత పరమహంస శ్రీరామకృష్ణున కొక్కనికిమాత్రమే యుండెడి'' దని స్వామిజి ఒకచోట ప్రస్తుతించియున్నాడు. గురుదేవు డొక్కొక్కప్పుడు శిష్యులతో లఘు సంభాషణ సాగించెడివాడు. మఱుక్షణమున ఉద్రిక్తభావపూర్ణ ధాటీమండితోపన్యాసమున శ్రోతలచే పరిసరములను కాలగతినిగూడ విస్మరింపజేసెడివాడు. ఆయన పాడు గేయము కానీ, లోకజననితో ఆయన కావించు సంభాషణము కానీ, శ్రోతలకు శిష్యులకు ఉపదేశకమే. సూత్రప్రాయములైన గురుదేవుని వాక్యముల గంభీరార్థములను శిష్యులలో ఎవరికి చేతనైనట్లు వారు గ్రహింతురు. సాధారణముగ నరేంద్రుని వివరణమే గురుదేవు నామోదము పడయుచుండును. 1884 లో ఒకనాడు శ్రీరామకృష్ణుడు నరేంద్రాదిశిష్యులతో మాటాడుచుండగా వైష్ణవమతప్రసక్తి వచ్చెను. గౌరాంగ దేవుని సందేశమును సంక్షేపించుచు గురుదేవు డిట్లనెను :- ''ఈ మతము బోధించు విషయములలో ముఖ్యములు మూడు – భగవన్నామాభిరుచి, సర్వభూతదయ, వైష్ణవసేవ''. ఈ మాటలు ముగియులోపుగనే ఆయన సమాధి నిమగ్ను డయ్యెను. తర్వాత బాహ్యలోక స్మృతి ఇంకను పూర్తిగా కలుగకుండగా ఆయన తనలో తా నిట్లనుకొనెను: ''సర్వభూతదయ! సర్వభూతదయ! ఓరీ మూఢా, భువిపై ప్రాకు నొక క్షుద్రక్రిమివి నీవు, నీవు ఇతరులపట్ల దయ జూపుటయా? దయ చూపుటకు నీ వెవరు? నీవు దయచూపుట అనునది

కేవలము అసంబద్ధప్రలాపము. నీవు మానవుల పట్ల దయచూపవలసినవాడవు కావోయి, మానవుని భగవత్స్వరూపునిగ భావించి సేవ చేయవలసినవాడవు'' ఈ మాటలు అక్కడ నున్నవా రందఱును విన్నవే. కాని వీనియర్థ మెఱుగగలిగినది నరేంద్రు డొక్కడే. గురుదేవుని ఆ యద్భుతవాక్కులలో క్రొత్తవెలుగు నతడు కనుగొన్నాడు. భక్తికిని జ్ఞానమునకును అందు చక్కని సామరస్యము కుదిరియున్నది. దైవ మనుకూలించినచో ఈ సందేశమును తాను లోకమంతట వెదజల్లుదు ననుకొన్నాడు నరేంద్రుడు. నిజముగ అనంతరము వెదచల్లనే చల్లినాడు కదా.

శ్రీరామకృష్ణుడు ఆధ్యాత్మిక నిశ్రేణి నధిరోహించిన మానవమాత్రుడు కాడు. చేతనోజ్జీవనార్థము భువి కవతరించిన విశ్వాత్ముడే. ''రాముడుగను కృష్ణుడుగను ఎవ రవతరించిరో ఆయనే నే'' నని శ్రీరామకృష్ణు డప్పుడప్పుడు చెప్పుచుండెడివాడు ఆయన కంఠవ్రణబాధ ననుభవించుచు మరణశయ్యపై నున్న దినాలలో నొకసారి ''ఇట్టి దశలో సైత మాయన తా నవతారమూర్తి నని చెప్పుకోగల్గునేని, నేను విశ్వసింతు'' నని నరేంద్రుడు తన మనసులో ననుకొనెను. వెలికి చెప్పిన మాట కాదది. అంతరతము నెఱుగగల్గిన శ్రీరామకృష్ణుడు వెంటనే ''ఎవడు రాముడుగ నుండెనో కృష్ణుడుగ నుండెనో, అతడే ఇప్పు డీ దేహమున రామకృష్ణుడుగ నున్నాడు - ఐనను నీ వేదాంతదృక్పథమున కాదు'' అని ఘోషించెను. ఎన్నో పర్యాయములు నిరూపితమైన నిజమును తాను మరల సందేహించినందులకు నరేంద్రుడు లజ్జించెను. మరల నెన్నడును అట్టి సందేహము నరేంద్రునకు కలుగ లేదు. అంతే కాదు. శ్రీరామకృష్ణునిలో నున్నంత యవతారమూర్తిత్వపూర్తి వేఱు ఏయవతారములోను లేదని ఆయన దృఢముగా నిర్ణయించుకొనెను. తనప్రసంగాలలో లేఖలలో సంభాషణలలో పెక్కెడల ఈ యభిప్రాయమును పొందుపఱచి యున్నాడు - ఇదిగో నొక్క యుదాహరణము :

''ఈ యుజ్జ్వలభవిష్యత్తునకు ప్రమాణముగా దయాసముద్రుడగు సర్వేశ్వరుడు అవతరించెను.

ఈయుగమున ప్రబోధమందును సర్వాదర్శసమన్వయమందును పారమార్థిక విజ్ఞానపోషణమందును, ఈ యవతారము మునుపటి యవతారముల నెల్ల నతిక్రమించినది.''

భారతదేశమున ఆధ్యాత్మిక పునర్భవము గల్గినప్పుడెల్ల ఆయుగానుగుణముగా వేదముల యర్థము మరల వివరింపబడుచుండెడిది. శ్రీరామకృష్ణుడు నిరక్షరాస్యుడైన ప్రవక్త. ఆయన శిష్యులు కొందఱు వ్యాఖ్యానములు కావించిరి. కాని, ఆయన ఎప్పుడుగాని ఆధ్యాత్మికతత్త్వనిరూపణార్థము చర్చలకు దిగినవాడు కాడు. అయినను ''నాసాధనలెల్ల శాస్త్రగ్రంథములలోని విధుల కనుగుణములుగ సాగినవే. వేదములలో చెప్పబడియున్నవాని నతిక్రమించిన విశేషములు సైతము నాచే సాక్షాత్కృతములైనవి'' అని ఆయన చెప్పుచుండెను. వేదవేదాంతములలో ప్రతిపాదితములైన సత్యములు ఆయనలో మూర్తీభవించినవి. శ్రీ వివేకానందస్వామి ఈ విషయము నిట్లు స్పష్టపఱచెను. ''దేవు ననుగ్రహముచే నాకొక మహాపురుషుని చరణసమాశ్రయణము లభించినది. ఆయన ఉపదేశములకంటె ఆయన జీవితమే ఉపనిషదర్థములకు అమోఘవ్యాఖ్యానము. ఉపనిషత్తులయర్థము ఆయనలో రూపు దాల్చెను'' ''శ్రీరామకృష్ణుని జీవిత మొక ప్రదీపము. దాని వెలుగున హిందుతత్త్వ సర్వ

స్వమును మన మాకళించుకొనగల్గుదుము. శాస్త్రగ్రంథములలో పరిగణితములయిన లక్షణముల కాయన యుత్తమలక్ష్యము. ఋషులయు అవతారమూర్తులయు నుపదేశములను ఆయన తన నిత్యజీవితపు అమలులో జూపెను. వేదములను శాస్త్రములను సమన్వయింపగలది ఆయన కలిపిన యవస్థాసిద్ధాంతమే'' ''అన్ని దేశాలవారి వేదగ్రంథములకును ఆయనచరిత్రము సజీవవ్యాఖ్యానము.''

సర్వమతసామరస్య మనెడి యాశయము హిందూసిద్ధాంతములో అనాదిగ నున్నను ఫలమును స్వకీయసాధనచే సాక్షాత్కరించుకొని నిరూపించినవాడు శ్రీరామకృష్ణుడు. 'ఎన్ని మతములో అన్ని మార్గము' లనెడి సూక్తిలో ఆ యర్థము నిమిడ్చినాడు. ఏదో యొక క్షుద్రదేవతోపాసనమును నరేంద్రుడు ఖండించుచుండగా గురుదేవుడు ''ప్రతియింటికిని పెరటిదారియు నుండు నోయీ'' అని హెచ్చరించెను. గురుదేవుని యీ సర్వమత సమన్వయసౌందర్యమును నరేంద్రుడు పెక్కెడల కొనియాడినాడు : ''పక్కాద్వైతియు, అద్వైతియు, భక్తుడును, జ్ఞానియు నైన మహనీయుని సన్నిధిలో నుండు భాగ్యము నాకు గల్గినది... శ్రీరామకృష్ణావతారములో జ్ఞానయోగ మున్నది, భక్తియోగ మున్నది, కర్మయోగ మున్నది.''

శ్రీరామకృష్ణుని భౌతికదేహ మంతరించినను ఆయన ఎన్నడును సేగిలేని సర్వశక్తి. శిష్యులగుండను 'మఠ' సేవాసంఘములగుండను ఆశక్తి లోకోజ్జీవన కార్యసాధక మగుచున్నది 'శ్రీ'స్వామిజిచిత్తము సంశయాందోళితమైనపుడెల్ల గురుదేవుడు దర్శన మనుగ్రహించి దారి చూపిన ఘట్టములు పెక్కులు ఆయన చరిత్రమున గలవు. 'నాయ మాత్మా బలహీనేన లభ్యః' అనెడి బలోపనిషత్తును స్వామిజి శ్రీరామకృష్ణజీవితసారముగ గ్రహించి ప్రఖ్యాపించెను.

శ్రీరామకృష్ణుడు భైరవిబ్రాహ్మణిని గురుస్థానమున నుంచి యనుసరించియు, తన్ను రాధికనుగా భావించి సాధన చేసి శ్రీకృష్ణసంశ్లేషము నధిగమించియు, పత్నిని లోకమాతృపీఠము నధిష్ఠింపజేసి ఆరాధించియు, మహిళలసమున్నతస్థానమును లోకమునకు కలిపినాడు.

శ్రీస్వామిజియభిప్రాయమున శ్రీరామకృష్ణుడు సర్వమానవతతికిని పరమాదర్శము. శ్రీస్వామిజికి ఆయన యాదర్శ మనుట చెప్పవలెనా? ''ఆయన శ్రీచరణములను నా తల దాల్చుచున్నాను. నాకు ఆదర్శభూతుడగు నాయకు డాయన. ఆయన చరితమును నే ననుకరింతు'' నని స్వామిజి చెన్నపట్టణమున కావించిన యొకయుపన్యాసమున నుద్ఘాటించినాడు.

# శ్రీరామకృష్ణునిసందేశం

## సేనాని

భారతదేశ మాతృగర్భ శుక్తిముక్తాఫలమయిన శ్రీరామకృష్ణుని జీవితకాలం యాభైయేండ్లపరిమితిని దాటకపోవడం మానవలోక దౌర్భాగ్యం. ఆయన అవతరించింది 1836 లో, మహాసమాధి నొందినది 1886 లో. అయినా, భారతీయులమైన మనకే కాక యావన్మానవ తతికి ఆయన ప్రసాదించిన ఉపదేశాలున్నాయి బ్రహ్మైక్యమే లక్ష్యంగా గల మన యీ ప్రపంచంలో శాంతిసౌఖ్యాలు నెలకొనవలె నంటే శ్రీరామకృష్ణుని వరిష్ఠోపదేశాలను మనం సరియైన రీతిలో అవగాహనచేసికొని ఆచరణలో పెట్టడం మనకు కర్తవ్యం.

శ్రీరామకృష్ణునిసందేశం చాలా సరళమైనదే. "అన్ని మతాలున్నూ సత్యములే. మతకలహాలకు ప్రసక్తియే లేదు" అన్నాడాయన. ఈ ఉపదేశంలో దురవగాహమైన అంశం ఏమీ లేదు. ఆయన చెప్పే విషయాలు స్వానుభవసందృష్టములే కాని పుస్తకాలు చదివి సేకరించుకొన్నవి కావు. సూత్రాలను సిద్ధాంతాలను ఆయన ప్రస్తావించడు. ఆత్మతృష్ణకలవాని యెదుట సూత్రాలను సిద్ధాంతాలను ఏకరువుపెట్టడం, ఆకలితో నకనకలాడుతుండేవాడి విస్తటిలో రాళ్లు వడ్డించడంవంటిదనిన్ని, అవి చీలికలకు కొట్లాటలకు దారి తీస్తాయనిన్నీ ఆయన అభిప్రాయం. ఈ కలహాల వల్లనే మతాలంటే వెగటు కలుగసాగింది. మతవిషయికంగా అంతర్దేశీయసౌభ్రాత్రం వెలయాలి. అందుకు సారతమములయిన అంశాలలో మతాల కున్న ఐకకంఠ్యమును గుర్తించాలి. శ్రీరామకృష్ణుడు హిందూ-క్రైస్తవ-మహమ్మదీయాది బహుసాధనలద్వారా బ్రహ్మసాక్షాత్కార మనే ఏకైకలక్ష్యమును అందుకొన్నాడు. ఆయన దేవునిసందేశహారి, దేవుని సందేశమును సరళఫణితిని జీవులకు అందజేసేవాడు. ఆయన వివరణవాణిలోని యీ సారళ్యమే అన్నివర్గాలవారిని అన్నివయస్సులవారిని మగువలను మగవారిని ఆకర్షించింది. విశ్వమానవులపై ఆయన కుండిన ప్రేమ జాతివర్ణమతవిభేదాలను పాటించేదికాదు. ఆశ్రయించిన వారి కందరికి నిష్పాక్షికంగా ఆయన తన ఉపదేశామృతమును ఆశీస్సులను ప్రసాదించేవాడు. "ఏ మతంవారు ఆ మతవిధానంలోనే భగవంతుని ఉపాసించడం యుక్తం. క్రైస్తవులు క్రైస్తుమార్గాన్ని అనుసరించడం శ్రేష్ఠం. మహమ్మదీయులు మహమ్మదు ప్రవక్త చూపిన మార్గమును అనుసరించడం సమంజసం. హిందువులు తమమహర్షులచే సంపన్నితమైన పథమున ప్రవర్తించడం విధాయకం. ఎవనికి స్వకీయమతంలో యథార్థమైన ఆస్థ ఉంటుందో అతనికి వినయమూ అన్యమతానుసారులపట్ల ఆదరమూ తప్పక ఉంటుంది. ఎందుచేతనంటే అన్ని మతాలు మనలను ఒక్కగంతవ్యంవద్దకే చేరుస్తాయి" — ఇది శ్రీరామకృష్ణుని వక్కాణం. సర్వమతసమాదరము మన ప్రభుత్వప్రణాళికలో ముఖ్యాంశంగా ఈనాడు చెబుతున్నారు. అది మన మాటలలో ఉన్నంతగా మనసులలో లేదు. శ్రీరామకృష్ణుని చరిత్రంలోని మహోజ్జ్వలతమాంశం ఈ సర్వమతసమాదరమే. 1866 వ సం॥రం తుదిభాగంలో ఒకమౌల్వీని గురువుగా ఉంచుకొని శ్రీరామకృష్ణుడు ఇస్లాము విధానమున సాధన నారంభించాడు. ఆ మహమ్మదీయ గురువు చూపిన మార్గంలో ఆ సాధనకు ఆయన తన్ను పూర్తిగా అర్పించుకొన్నాడు. మహమ్మదీయులు ధరించెడి ఉడుపులనే ధరించి ఆయన

అల్లానామమును జపించాడు. ప్రార్థనలు మహమ్మదీయసిద్ధాంతవిహితప్రార్థనలుగా రూపొందాయి. హిందూ దేవతలను కాళీమాతనుసైతం ఆయన మఱచిపోయ్యాడు. దేవాలయాలకు పోవడం మానుకొన్నాడు. గుడిప్రాకారానికి వెలుపల తన బస ఏర్పఱచుకొన్నాడు. మూడు దినాలకు తర్వాత ఒకమహోజ్జ్వలమూర్తి ఆయనకు ప్రత్యక్షం అయ్యాడు. అగపడింది మహమ్మదే కావాలి. ఆ మూర్తి మెల్లగా శ్రీరామకృష్ణుని సమీపించి ఆయనలో లీనమై పోయ్యాడు. ఆ దశనుండి ఆయన సమాధిదశనొంది బ్రహ్మముతో ఐక్యం అనుభవించాడు. మహమ్మదీయమతం అనే నదికూడా ఆయన్ను బ్రహ్మసాగరానికే చేర్చింది.

ఎనిమిదేండ్ల కనంతరం, 1874వ సంవత్సరం నవంబరునెలలో ఒకప్పుడు క్రైస్తవసిద్ధాంత ప్రతిపాదిత తత్త్వమునుగూడ గ్రహించాలి అనే కోరిక శ్రీరామకృష్ణునకు అణచుకోరానిదై కలిగింది. తన భక్తుడునూ కలకత్తా పౌర మహాశయుడున్నూ అగు శంభుచరణ మల్లిక్ చే బైబిలుఘట్టములను చదివించుకొని శ్రీరామకృష్ణుడు వినసాగాడు. జీసస జీవితచరిత్రమున్నూ ఉపదేశాలున్నూ శ్రీరామకృష్ణుని మరులుగొల్పాయి. ఒకనాడాయన దక్షిణేశ్వరమందలి యదుమల్లిక్ మహాశయుని ఆరామభవనంలో ఒక చావడిలో కూర్చుండి మేరిమాతయూ దివ్యశిశువున్నూ ఉన్న చిత్తరువును తదేకధ్యానంతో తిలకిస్తుండినాడు. చూస్తుండంగానే, దివ్యభావావేశం ఆయన్ను పైకొనింది. ప్రతిమలు సచేతనాలుగా అగపడ్డాయి. వానినుండి తేజఃకిరణాలు వెలువడి శ్రీరామకృష్ణుని హృదయంలో ప్రవేశించాయి. మహమ్మదు దర్శనానుభవ ప్రభావంకంటె ఈ దర్శనానుభవ ప్రభావం అధికతరమై ఉణ్ణింది. దిగులుపడి ఆయన 'తల్లీ, నన్ను ఏం చేస్తున్నావు?' అని కేకలేశాడు. జాతిమతాల హద్దులను భేదించుకొని ఒక వినూత్నానంద రాజ్యంలో చొచ్చాడు. ఆయన హృదయాన్ని క్రీస్తు వశపఱచుకొన్నాడు. మూడు దినాలు ఆయన కాళిగుడిలో అడుగుపెట్టనే లేదు. నాల్గవనాటి మధ్యాహ్నం పంచవటిలో పోతుండంగా ఒకానొకవ్యక్తి ఆయనకు ఎదురుగా వస్తూ కనడడ్డాడు. ఆ వ్యక్తి నేత్రాలు విశాలసుందరాలుగాను, నెమ్మోము సుప్రసన్నంగాను, మేను ధావళ్య విరాజితంగాను ఉండినాయి. వారొకరొకరికి ఎదురుగా నిలబడ్డారు. అప్పుడు శ్రీరామకృష్ణుని హృదయాంతరాళంనుండి ఒక వాణి ఈలాగు వినబడింది – "క్రీస్తుదేవుని దర్శింపవోయి, సకల చేతనుల విముక్తికై తన గుండెనెత్తురును గార్చిన అతడితడే. ప్రాణులమీది ప్రేమచే యాతనా సాగరమును ఓర్చిన కృపాళువు ఇతడే, బ్రహ్మసాయుజ్యసిద్ధినందిన యతిసార్వభౌము డితడే. ఇతడే ప్రేమమూర్తి, జీసస." క్రీస్తుదేవుని ఆ మూర్తి లోకమాతృనందనుడైన శ్రీరామకృష్ణుని కౌగిలించుకొని ఆయనలోనే కలిసి పోయ్యాడు. శ్రీరామకృష్ణుడు సమాధి నిమగ్నుడై బ్రహ్మసంశ్లేషం అనుభవించి "బ్రహ్మజ్ఞాన ప్రాప్తికి క్రైస్తవ సిద్ధాంతం కూడా ఒక మార్గమే" అనే సత్యాన్ని స్వానుభవంలో తెలిసికొన్నాడు

శ్రీరామకృష్ణుడు బుద్ధదేవుని దివ్యత్వాన్ని అంగీకరించాడు. బుద్ధుని బోధనలకున్నూ ఉపనిషత్తులబోధనలకున్నూ గల పోలికలను ప్రదర్శించాడు. జైనమతస్థాపకులైన తీర్థంకరులపట్ల కూడా ఆయన ఎంతో గౌరవం చూపాడు. శిక్కుమతగురువులు పదుగురు. వారియందున్నూ ఆయన కత్యంతాదరం ఉణ్ణింది. హైందవేతర

సాధనామార్గాన్ని అనుసరింపవలసిన అక్కఱ ఆయనకు లేదు. భగవంతునందు ఆయనకుండిన ఉత్కటకోటికమైన ప్రేమచే అన్ని పొలిమేర లున్నా తొలగిపోయినాయి, పోగా ఆయన విశ్వమందలి వివిధమతాదర్శములను ఆశయములను గురించి ఉపపన్నంగా ప్రసంగింపగల నిపుణు డయ్యాడు.

శ్రీరామకృష్ణుని పేరెత్తంగానే మనస్మృతి రంగంలోకి ఆయన శిష్యాగ్రణియైన శ్రీవివేకానందస్వామియు వస్తాడు. శ్రీవివేకానందస్వామి అపరబుద్ధదేవుడే. శ్రీరామకృష్ణుని సర్వమత సమన్వయసందేశాన్ని శ్రీ వివేకానందస్వామి విశ్వమంతటా వ్యాపింపజేశాడు. విశ్వమత మహాపరిషద్వేదికపై ఆయన ఈలాగు ఉద్ఘాటించాడు——"పూజ్యత, పవిత్రత, త్యాగం—ఇవి ప్రపంచంలో ఏమతసంస్థకూ ప్రత్యేకమైన కాణాచి కాదు. ప్రతిమతమూ లోకోత్తర చరిత్రులగు పురుషులనూ స్త్రీలనూ ఉద్భవింప చేసింది. ఇట్లు విస్పష్టమై ఉండంగా, ఎవ్వరైనా తమమతం ఒక్కటే సుస్థిరంగా నిలవాలనీ, ఇతరమతాలన్నీ నశించాలనీ భావిస్తే, అట్టి మందబుద్ధుల అవివేకానికి సాహ్యాదయాంతర్గత పరితాపాన్ని తెలుపుతూ వారెంత ప్రతిఘటించినా, 'కావలసింది కలహం కాదు సహకారం' 'అన్యమతవిధ్వంసనం కాదు, వాని ఆశయాలను గ్రహించడం' 'శత్రుత్వం కాదు, శాంతియుతసమన్వయం' అని మతపతాకలపై వ్రాయబడు దినం శీఘ్రకాలంలోనే వచ్చి తీరుతుం దని తెలుపుతాను."

శ్రీరామకృష్ణసేవాసంఘాలు ప్రస్తుతం మన దేశమంతటా వ్యాపించి ఉండడమేకాక ంచంలో పెక్కుప్రాంతాలలో ఉన్నాయి. 'ఆత్మనో మోక్షాయ జగద్ధితాయ చ' అన్నట్లు భవబంధవిమోచకమైన జ్ఞానసాధనను జగద్ధితసాధకములైన సేవాకార్యక్రమాలను నిర్వహిస్తున్నాయి. యథాశక్తి వానికి తోడ్పడమూ కృతజ్ఞులమై యుండడమూ మనకర్తవ్యాలు. ఈ శ్రీరామకృష్ణునిజయంతి, ఆయన ఉపదేశాలను ఆస్థతో ఆచరణలో పెట్టడానికి మనం నిశ్చయించుకోవలసిన శుభదినం.

# శ్రీశ్రీ శారదానందస్వామిగారి మాతృభక్తి

## శ్రీమత్ప్రవ్రాజిక శ్యామాప్రాణ

శ్రీ శ్రీ శారదామణిదేవిగారికి ప్రీతిపాత్రుడగు మఱొకశిష్యుడు శ్రీ శారదానందస్వామి. శారదానందునిగూర్చి మాతృదేవి తఱచు ఇట్లు పల్కును: "శరత్తు (శారదానందస్వామి) నా వాసుకి, (ఆదిశేషుడు) వేయిపడగ లెత్తి పని చేయును! నీళ్లుపడుచోటనే గొడుగు పట్టును" [అనగా ఎచ్చట అవసరమో తత్క్షణమే అచ్చటికి పోయి ఆ అక్కఱను తీర్చును]

దక్షిణేశ్వరమున ఠాకూరు శ్రీరామకృష్ణుడు నివసించుచున్న సమయము. ఒకదినము శ్రీరామకృష్ణుడు ఇటునటు తిరుగుచు, తటాలున ఒక యువకునియొడిలో కూర్చుండి కొన్ని నిమిషములు భావావేశపరుడై యుండి లేచిపోయెను. అచ్చట నుండిన భక్తులు ఆ విషయముగూర్చి ప్రశ్నింప "ఈ బాలుడు ఎంతబరువు మోయగలడో చూచితిని" అనెను. యథార్థముగ శ్రీరామ

కృష్ణుని శిష్యబృందములో గురుతరకార్యభారముల వహింప యోగ్యుడు మరొకడు కానరాడు. రామకృష్ణమిషను ఏర్పడినసందర్భమున రామకృష్ణమఠ మిషనుల కార్యదర్శిగా వివేకానందస్వామి శారదానందుని నియోగించెను. ఎడతెగక 30 సంవత్సరాలపాటు ఈ కార్యభారమును జీవితాంతమువఱకు ఓర్పుతో కడు శాంత స్వభావముతో ప్రసన్నచిత్తముతో వహించి ఈ వ్రతోద్యాపనము కావించెను.

శారదానందస్వామి శ్రీరామకృష్ణసంఘమునకు పరిపాలకుడును, ధారకుడును, రక్షకుడునైయొప్పెను. శ్రీమంతులకు, దరిద్రులకు, దుఃఖితులకు. అసహాయులకు అతడు పరమాప్తుడు. భక్తమహిళలునైతము ఎట్టి సంకోచము లేక తమ సుఖదుఃఖములనెల్ల శ్రీ శారదానంద స్వామికడ వెళ్ళబుచ్చుకొని ఉపశాంతి నొందెడివారు.

శ్రీ యోగానంద-అద్భుతానంద- అద్వైతానందుల-పిదప, సుమారు 21 సంవత్సరాలపాటు శ్రీ శారదానందస్వామి, శ్రీ శ్రీ మాతృదేవి సేవ కావించెను. శ్రీమాతృదేవియు తనకు అవసరముపడినప్పుడెల్ల వెంటనే ప్రియశిష్యుడగు శారదానందుని పిలిపించి సమస్యలనెల్ల వానికి తెలిపి వానిపై భారము వదలిన పిదపనే నిశ్చింతురాలగును. మాతృభక్తుడగు శారదానందస్వామి, శ్రీశారదా రామకృష్ణుల స్మరించుచు, సర్వసమస్యలను దృఢచిత్తముతో నిర్విఘ్నముగ నెఱవేర్చును.

జయరామ్బాటి, కామార్పుకూరులనుండి మాతృదేవి కలకత్తాకు రాదలచినచో, వెంటనే శరత్తు మహారాజుకు కబురంపును. శరత్తు మహారాజు తానే స్వయముగా వెడలును లేకున్న విశ్వాసపాత్రుడును, సుపరిచితుడు నగు భక్తుని పంపును. ప్రయాణకాలమున మాతృదేవికి ఎట్టి ఇబ్బంది కలుగకుండ చూచుకొను భారము తనపైనే వేసికొని, అన్ని విధములగు సౌకర్యముల నేర్పాటు చేయును. ఉద్బోధన్ గృహమున శ్రీ శారదాదేవి వసించు సమయమున శారదానందుడు తన్ను మాతృదేవి ద్వారపాలకునిగ అర్పించుకొనెను. సమయాసమయ జ్ఞానము లేక వచ్చు భక్తుల వలన మాతృదేవికి ఎట్టి కష్టము కలుగకుండ కంటికి రెప్పవలె కాచును. ఒకనాటి ఘటన - భక్తుడొకడు, మధ్యాహ్న సమయమున, హారిసన్ రోడ్డునుండి, ఉద్బోధన్‌కు (చాల దూరమునుండి) నడచివచ్చి సరాసరి మాతృదేవికడకు వెళుచుండెను. అది గుర్తించి శరత్తు మహారాజు భక్తునకు అడ్డు నిలిచి "చూడుడు, అమ్మ ఇప్పుడే బైటనుండి తిరిగివచ్చినారు, చాల అలసిపోయియున్నారు. కాన మీరు మేడపైకి వెళ్లి ఆమెను దర్శింప వీలుపడదు" అనెను. కాని భక్తుడు శరత్తు మహారాజు మాటను నిర్లక్ష్యముచేసి "అమ్మ మీ సొంతసొమ్మా, ఏమి?" అనుచు పైకి వెళ్లెను. శరత్తు మహారాజు నిల్చిన చోటనే చలింపక నిల్చియుండెను. కాని భక్తుడు లోలోన తాను చేసిన అన్యాయమునకు దుఃఖించెను. భక్తుడు మాతృదేవిని దర్శించి తృప్తినొంది, అటుపై తాను చేసిన తప్పు తెల్పి చాల పశ్చాత్తాపపడెను. మాతృదేవి అంతయు విని "శరత్తు నిజమే చెప్పెను నాయనా, కాని నీవు ఇందులకు ఇంతగ పశ్చాత్తాపపడ నక్కఱలేదు" అనెను. కాని మెట్లు దిగుచు, ఆ భక్తుడు అతి దీనమనస్కుడై తన నేరమును మన్నింప శ్రీ శారదానందస్వామికడ క్షమాపణ వేడ నిశ్చయించుకొని దిగివచ్చుచుండెను. శరత్తుమహారాజు నిండుకుండవలె ఏమియు తొణకక అదేచోటున ద్వారపాలకు

డుగ, అలాగే నిల్చియుండెను. భక్తుడు, ఆయనకు ప్రణమిల్లి తాను కావించిన అపరాధ మును క్షమింప ప్రార్థించెను. సహిష్ణుతా మూర్తియగు శరత్తుమహారాజు, భక్తుని చేర దీసి, కౌగలించుకొని మందహాసవదనుడై "ఇందులో అపరాధ మేమి కలదు? అట్టి వ్యాకులత లేనిచో తల్లిదర్శనము లభించి యుండునా ఏమి?" శాంత సమాహిత చిత్తము కలవాడును, ప్రసన్నమూర్తియు అగు శరత్తుమహారాజును గాంచి, భక్తుడు విస్మయము నొంది "ఇట్టి సర్వగుణసంపన్నుడగు విశిష్ట శిష్యుడు కావుననే మాతృదేవిసేవ చేయగల్గు సౌభాగ్యము సందగ్లెను" అని లోలోన ప్రశంసించుచు సంతుష్ట చిత్తముతో తిరిగిపోయెను.

శ్రీ మాతృదేవికి సర్వవిధముల సౌకర్యముల నొనర్చుటయే తన ప్రధానకర్తవ్యముగ శరత్తు మహారాజు భావించును. ఒకపరి శరత్తుమహా రాజు కాశికి వెళ్లియుండెను. అట్టితఱి మాతృ దేవి కలకత్తాకు తిరిగివచ్చు ప్రసంగము వచ్చెను. శారదాదేవి వెంటనే "శరత్తు కలకత్తాలో లేడు. కాన నేను అక్కడికి పోవు మాటయే ఎత్తకుడు. అక్కడికి పోయి నేను ఎవరిదగ్గఱ ఉందును? సర్వవిధముల నా భారమును సంపూర్ణముగ వహింప శక్తి శరత్తుకు తప్ప ఇంకెవ్వరికిని లేదు. కాన మీ రా ప్రయత్నమును వదలుడు" అని స్పష్టముగ తెల్పెను. వేయేల మంత్రదీక్షా విషయము లలో కూడ మాతృదేవి, శరత్తు మహారాజు గారి సలహా వినును. అటు శరత్తు మహారాజు కూడ మాతృదేవి మనోభీష్టము ప్రకారము సలహా చెప్పును. ఇట్లు గురుశిష్యుల పొందిక ఎంతయు ప్రశంసనీయమైనది.

శ్రీ వివేకానందస్వామి ఆహ్వానమును మన్నించి, శారదానందస్వామి క్రీ. శ. 1896, ఏప్రెలుమాసములో కలకత్తానుండి లండనుకు పయనమాయెను. ఆ సమయమున శ్రీరామ కృష్ణుని శిష్యబృందము తీవ్ర త్యాగతపస్సుల వరించి తమ గురుపరేణ్యుని జీవనాదర్శము ననుసరించి, ఆలంబజారు మఠమున కాలము గడపుచుండెను. వివేకానందస్వామి సనాతన హిందూమతధర్మ ప్రచారార్థము పాశ్చాత్య ఖండముల కేగియుండెను. మిత్రుడును, బాల్య స్నేహితుడును, సోదరశిష్యుడును అగు శారదానందుని తన ఉద్యమ సహాయార్థము పిలువనంపెను. చాలదినముల పిమ్మట తన ప్రియసోదరశిష్యుని కలసికొని వివేకానంద స్వామి అపరిమితానందము నందెను. శారదా నందస్వామి లండనులో శ్రీ ఇ. టి. స్టర్డీ గారింట అతిథిగ నుండెను. అటుపై సుమారు రెండు నెలలపిదప లండనునుండి అమెరికాకు వేదాంత ప్రచారార్థము వెడలెను. పాశ్చాత్యఖండము లకు పయనించుటకుముందు శరత్తుమహారాజు మాతృదేవిగారి ఆశీస్సులనంది ఆమె పాద ధూళిని శిరముపై చల్లుకొని పోయెను. శరత్తు మహారాజును మాతృదేవియే కాక, ఆమె కన్న తల్లియగు శ్రీ శ్యామసుందరీదేవికూడ చాల ప్రేమించెడిది. శ్రీ శారదాదేవి, శరత్తు మహారాజునకు పాశ్చాత్యఖండములకు వెడలు టకు అనుమతించె నని విని శ్యామసుందరీదేవి తన కుమార్తెతో "అమ్మా, నీ బిడ్డను ఏడు సముద్రములు పదుమూడునదులు దాటి వెళ్ళు టకు ఎలాగనుమతించితివి? తల్లీ, నీగుండె ఎంత నిబ్బరమైనదిఅమ్మా" అనెను. ఒకపరి మాతృ దేవి సందర్భవశమున భక్తులతో ఇట్లనెను. "మా అమ్మ అసలు లక్ష్మీదేవివంటిది. నా బిడ్డ యగు శరత్తుపై ఆమెకు ఎంతో మక్కువ.

శరత్తు నా అనుమతి లేనిదే ఏ పనిఅయినను చేయువాడు కాడు. ఆహా! అతని నిష్ఠను ఏమని పొగడుదును! విదేశములలో తనకు సాహాయ్యము చేయుటకుగాను రమ్మని నరేంద్రుడు (వివేకానందస్వామి) శరత్తుకు కబురంపెను. అందుచే అమెరికాకు పోవుటకు ముందుగ శరత్తు నా అనుమతి వేడుచు, నాకడకు వచ్చెను. నేను అతనిని ఆశీర్వదించి 'భయ మేమియు లేదు నాయనా, శ్రీ ఠాకూరు సర్వదా మిమ్ముల రక్షించుచున్నారు' అని పల్కితిని.

మాతృదేవి కలకత్తాకు వచ్చినపుడెల్ల ఉండుటకుగాను ఒకస్థిరమగు వాసస్థానము లేకుండెను. శరత్తుమహారాజునకు ఇది ఒక కొఱతగ నుండెను. దైవప్రేరణచే శ్రీకేదారచంద్రదాసు అను పేరుగల భక్తు డొకడు కొంతభూమిని మాతృదేవిపేర దానముచేసెను. శ్రీశారదానందస్వామి ఆస్థలముపైనే మాతృదేవికి నివాసయోగ్యముగ అన్నివసతుల నేర్పఱచుచు ఒకభవనము నిర్మింపసమకట్టెను. ఇల్లు కట్టుటకు చాలినంత రొక్కము చేత లేక పోవుటచే చాలమంది ఆప్రస్తావనను ఆమోదింప లేదు. కాని మాతృసేవాపరాయణుడగు శరత్తుమహారాజు మాతృదేవి నిల్చుటకు నీడ లేనందున ధైర్యము వహించి, సంపూర్ణ బాధ్యతను తనపై వేసికొని అప్పు తెచ్చి భవనమును నిర్మించెను. ఈ భవనముననే శారదాదేవి జీవితాంతమువఱకు నివసించెను. అదియే నేడు పవిత్రమాతృదేవి స్మారకభవనమును, ఉద్బోధన్ ప్రచురణ కార్యాలయమునై యొప్పుచున్నది. శ్రీమాతృదేవికి నివాస మగుట కేగాక, శ్రీశ్రీరామకృష్ణుని చిత్రపటము స్థాపించి, నిత్యపూజ నైవేద్యము హారతి మున్నగు భగవదుపచారములెల్ల సక్రమముగ కొనసాగుటకును ఏర్పాట్లుచేసెను. ఇంతటి శ్రమ వహించి సర్వాంగసుందరముగ నిర్మితమైనభవనమును గుడిని చూచి మాతృదేవి ఆనందముతో నుప్పొంగెను. ఈ నవనిర్మితభవనమందు మాతృదేవిని నివసింపచేసి శరత్తుమహారాజు కృతార్థుడ నైతి నని యుప్పొంగెను.

అట్టి భవననిర్మాణమునకై చేసిన అప్పును చెల్లించుటకుగాను శ్రీరామకృష్ణుని జీవితచరిత్రను వ్రాయ సమకట్టెను. ఆనాటికిని శ్రీరామకృష్ణుని సమగ్రజీవితమును యథాతథముగ లిపిబద్ధము చేసియుండ లేదు. శ్రీరామకృష్ణుని జీవితచరిత్రను సంగ్రహించుటకుగాను శరత్తుమహారాజు చాలశ్రమ పడవలసి వచ్చెను. పెక్కుపాట్లకులోనై చిట్టచివరకు ధర్మస్థాపకుడును, సర్వధర్మస్వరూపుడును, అవతారవరిష్ఠుడును అగు శ్రీరామకృష్ణుని జీవితమును ప్రచురించి, ఆ పుస్తకములమ్మిన డబ్బుతో అప్పు తీర్చెను.

శరత్తుమహారాజు సర్వతోముఖప్రతిభకలవాడైనను శక్తికిమించిన పనుల నెల చేయవలసివచ్చెడిది. ఇటు ఉద్బోధన్ మాసపత్రిక సంపాదకుడుగను, ఉద్బోధన్ కార్యాలయపరిచాలకుడును, రామకృష్ణమఠమిషనులకార్యదర్శిగను–ఇట్టి గురుతరభారములనెల్ల వహించుచున్నను ఎన్నడును చీకాకుపడలేదు. దానితోపాటు శ్రీమాతృదేవి సేవాశుశ్రూషాది కార్యములెల్ల స్వేచ్ఛగ తనపై వేసికొని ఎట్టి లోపము లేకుండ చూచుకొనుచుండెను. విసుగు అనుమాట శరత్తుమహారాజు జీవితములో కానరాదు. ఆయనది సుమధురకంఠము. కోకిలకంఠముతో భక్తికీర్తనల పాడుచున్నతఱి వినువారల మనంబులలో ఆనందము ఉప్పొంగెడిది. పగలంతయు విధివిరామము లేక వ్రాయు

రకములగు పనులతో గడపును. సంధ్యాహారతి ముగిసిన పిదప తఱచు మాతృదేవి "శరత్తును వచ్చి రెండుకీర్తనల పాడి పొమ్మను" అని పిలువనంపును. నిష్ఠావంతుడును, శ్రద్ధావంతుడును మాతృదేవిసేవకై ఆత్మసమర్పణము చేసికొన్నట్టి మహాత్ముడునగు శరత్తుమహారాజు తల్లికి పాటలు వినిపించును. ఆ తల్లియు తన్నయురాలై ప్రియశిష్యుని వేనోళ్ల ప్రశంసించుచు ఆశీర్వదించును.

నిర్యాణమునకు ముందు శ్రీమాతృదేవి చాల జబ్బులో పడెను. ఆమె ఆరోగ్యము క్రమముగ క్షీణించుచుండెను. వృద్ధాప్యమునకు తోడుగ పలురోగములు ఆవరించెను. చిన్నబిడ్డవంటి స్వభావమై పోయెను. ఒక్కొక్క దినము పట్టుపట్టి ఆహారము తినకుండెను. చాల దుర్బలమై పోయెను. మాటిమాటికి కొంచెము కొంచెముగ ఆహారము తినిపింపవలెను. మాతృదేవి "తినను" అని హఠము చేసినచో "శరత్తు మహారాజును కబురంపెదము" అనిన వెంటనే ఆహారము భుజించును. ఒకదినము ససేమిరా అని ఆహారము ముట్టుకొనలేదు. అందుచే శరత్తుమహారాజుగారిని పిలుచుకొని రావలసి వచ్చెను. శరత్తుమహారాజు ఆమె మంచము కడ నిల్చుకొనుటతోడనే పసిబిడ్డవలె "చూడు నాయనా, వీరు నన్నెంతగ విసిగించుచున్నారు? రాత్రింబవళ్లు తిను తిను అనుటే వీరి గొడవ, చీటికి మాటికి ఆ పుల్ల (థర్మామీటరు) తెచ్చి చంకలో బెట్టుదురు. నీవైనను వీరికి చెప్పిపో, నాయనా, నన్ను ఈలాగ వేధింపవలదని" స్వామి మృదుమధుర స్వరముతో మెల్లగ "లేదమ్మా, ఇకమీదట వీరు మిమ్ముల విసిగింపరు" అని బుజ్జగించెను. కొంతవడికి మహారాజు "అమ్మా, కొంచెము ఆహారము భుజింతురా" అని అడిగెను. మాతృదేవి వెంటనే సమ్మతించెను. సేవకురాలు పాలు తెచ్చి త్రాగింపబోగా, శరత్తుమహారాజుతో "నీవు త్రాగింపుము ఆమె చేతిగుండ నేను త్రాగను" అనెను. చిన్న చెంబులో పాలుపోసి మెల్లమెల్లగ కొంచెముగ త్రాగినపిదప మహారాజు మాతృదేవితో "అమ్మా నిమ్మళించుకొని, కొంచెము సేపు తర్వాత కొంచెముగా త్రాగించెదను" అనెను.

మాతృదేవి "ఆహా! చూడు నాయనా, నీవు ఎంత ఓర్పుతో, మెల్లగ త్రాగించుచున్నావో, వారు ఈలాగు చేయరు" అనెను. పాలు పూర్తిగ త్రాగినపిదప "ఇక నీవు వెళ్లి పండుకో నాయనా, నీ విశ్రాంతివేళ, నీకింత శ్రమ కలిగించుట యైనది?" అని పల్కెను.

మాతృదేవి నిర్యాణమునకు కొన్ని దినముల ముందు శరత్తుమహారాజును పిలిపించి భక్తుల చూపుచు "వీరినందఱిని చూచుకో నాయనా" అని పల్కి నిశ్చింతురాలాయెను. శ్రీ మాతృదేవి లీలానాటక పరిసమాప్తి ఆసన్నమయినదని తెలిసికొని భక్తమహిళలు విలపించుచుండిరి. వారిని పిలిచి మాతృదేవి "శరత్తు ఉన్నాడుగా మీ కేమియు భయము లేదు" అనెను.

మాతృదేవి క్రీ. శ. 1920 జూలై నెల 21 వ తేదీన రాత్రి $1\frac{1}{2}$ గంటలకు పరమపదమునందగ, సర్వవిధములగు అంతిమక్రియల కెల్ల శరత్తుమహారాజు ఏర్పాట్లు చేసెను. అటుపై ఆ చితిచేసినచోటనే బేలూరు మఠములో ఆమె స్మారకముగ, ఆలయము నిర్మించెను. కొన్ని సంవత్సరముల పిదప మాతృదేవి జన్మస్థానమగు జయరామ్బాటిలో ఆలయము ప్రతిష్ఠించి, రామకృష్ణాశ్రమము స్థాపించి, మాతృభక్తిని చిరస్థాయిగ నిలిపి పోయెను.

## 77

మఠము
బేలూరుపోస్టు,
28 నవంబరు 1917.

ప్రియ——,

ప్రేమతో నీవు వ్రాసిన జాబును చూచుకొని మహానందము నొందితిని ... మాకును నీకును మధ్యనున్న ఈ అవ్యాజప్రేమను గురుదేవుడు మఱింత గాఢతరముగ నొనర్చును గాక. ఇదే ఆయన శ్రీచరణములొద్ద నా యాంతరంగిక ప్రార్థనము. లోకమునకు పరమ శ్రేయస్సును సమకూర్చుటకై ఆయన మానవ రూపమును దాల్చెను. పరమశ్రేయస్సు తాల్చు రూపము ప్రేమయే. విశ్వమంతటను ఈప్రేమ నెలకొల్పబడును. దాని జాడలు ఇప్పుడు కనఁబడుచున్నవి. ఈ సంఘర్షణలును వాదములును ఆ విశ్వప్రేమను నెలకొల్పుటకే గాని వేఱొకందుకు కాదు. ఇంతవఱకెన్నడును సంభవింపనిది ఇప్పుడు సంభవింపనున్నది. ఈ యాధునికయుగము అద్భుతయుగము...

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

ప్రియ——,

నీజాబు చేరినది. సంగతులు తెలిసినవి. జీవితలక్ష్యసిద్ధిని బడయుటకు నీవు అనుసరింప నిశ్చయించుకొనిన రెండు మార్గములలో మొదటిది నాకు సమ్మతము. రెండవమార్గమునుగూర్చి నేను చెప్పునదిది: గురువనెడు భావము నాకెన్నడును కలుగదు. నాహృద్గతనిధిసర్వస్వము గురుదేవుడు శ్రీరామకృష్ణుడే. నేను సదా ఆయనకు భృత్యుడను. శిశువను. శిష్యుడను. కావున నేనెవరికిని ఎప్పుడును గురువను కాజాలను. ఎవరేని నన్ను గురువుగా భావింతురేని వాస్తవమునకు వారు గురుదేవుని గుఱించి భావించుచున్నట్లే. ఏల యన నా సకలసంపదలును ఆయనయే, ఆయన ఒక్కడే ఈ యుగమునకు జగద్గురువు. కాని మఱొకవిషయమునుకూడ చెప్పుచున్నాను. ఎవడేని గురుదేవుని మనోదేహాత్మపూర్వకముగ ప్రేమింపగోరునేని అతడు మాకు స్వకీయుడు. అతనికి గురుదేవునందలి శ్రద్ధయు భక్తియు ప్రేమయు పెంపొందవలయు నని నేను హృదయపూర్వకముగ ప్రార్థింతును. ఈ యుగమున మా గురుదేవుడు గాక వేఱొక గురుదేవుడు లేడు. ఇది నా దృఢవిశ్వాసము. ఆయన కేవలము గురువుమాత్రమే కాడు. తండ్రియు తల్లియు బంధువును మిత్రమును జీవితమున సమస్తమును ఆయనయే. మానవులకు సంసారసాగరమును తరింపజేయు ఏకైక ప్లవము గురుదేవుని "రామకృష్ణ" యనెడి పవిత్రనామము. జీవ ముట్టిపడు ఆయన మధురరూపమే ధ్యానమునకు లక్ష్యము. ఆయనతోడి సాహచర్యమే సత్సంగము. ఇదే నా బోధనము, మంత్రోపదేశము. వేదపురాణేతిహాసాది గ్రంథపారాయణమును సజ్జనసంగతియు చాల మంచివే. సరియైన కర్తవ్యములే. కాని వానిని మన భక్తివిశ్వాసములకు ప్రవర్ధకమగు రీతిలో చేయవలె ననుట నా కోరిక. వీని నెల్ల గ్రహించిన పిమ్మట ఇంకను నన్ను నీవు గురువుగా భావింప గోరుదువేని, భావింతువు గాక.

ఇక నేమి వ్రాయుదును? నీకు నా హృదయ పూర్వకాశీస్సులు.

నీకు చక్కని విద్వత్తు ఉన్నచో గురుదేవుని పనులను నీవు చక్కగ నిర్వహింపగలుగుదువు నీవు మా రంగములోనికి గురుదేవుని రాజ్యము లోనికి ప్రవేశింతు వేని పలురకములైన పనులను చేయవలసి యుండును. వాని నన్నిటిని ఆధ్యాత్మికసాధనలలో చేరిన వానినిగ మే మాదరింతుము. ఏలయన అదంతయు గురుదేవునిపని. మాలో ఎవరిపనియు కాదు. గురుదేవుని కుటుంబము చాల పెద్దది. ఆ కుటుంబమునకు సేవ చేయుటకే ఆయన మమ్ము ఈ భువియందుంచియున్నాడు. నీవును ఆ గురుదేవుని పరిచారకులలో నొకడవుగ పరిగణనీయుడవు అనుటను నిశ్చితముగ నీవు గుర్తింతువు గాక.

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

## 79

శ్రీరామకృష్ణమఠము,
బేలూరు హౌరా,
27 జూను 1919.

ప్రియ,—

నీజాబు చేరినది, సంగతులు తెలిసినవి. దేవునను గ్రహమున కావలసినంత వానలు కురియును. భయ మక్కఱ లేదు. దేవుని సాయము లేక, దేశపరివ్యాప్తమైన ఈఘోర క్షామమును ఎవరు అరికట్టగలరు. ఎవ్వరును అరికట్టలేరు. సమస్తమునకును ఆధారము భగవదనుగ్రహము. ప్రేమపూర్ణుడును కృపాసాగరుడునగు భగవంతుడు తప్పక తోడ్పడును.

భగవంతుని శ్రీచరణములందలి నీభక్తి శ్రద్ధలు దృఢపడవలయుననియు నీ మనోదేహాత్మలు భగవదర్పితములు కావలయు ననియు నేను నా మనః పూర్వకముగ ప్రార్థించుచున్నాను. మమకారము నీకు బొత్తిగా లేకుండును గాక. భగవన్నామమందును భగవత్ప్రేమయందును తిరుగులేని రీతిగ నిమగ్నుడవు కమ్ము. దేహ మున్నంతకాలము మానవుల రూపమున నున్న సర్వేశ్వరునికి పరిచర్య చేయుచుండుటకు నీ కారోగ్యమఃండును గాక. ఇంతకంటె నేమి చెప్పుదును? నీకును అందఱికిని నా హృదయపూర్వక ప్రేమాశీస్సులు.

కోకామహారాజు వచ్చి యున్నాడు, కులాసాగా ఉన్నాడు. మఠమఃనందలి తక్కినవిషయములు భగవత్సంకల్పముచొప్పున ఒకరీతిగ బాగుగనే సాగిపోవుచున్నవి.

నీ శ్రేయోభిలాషి,
శివానంద,

## 80

శ్రీరామకృష్ణమఠము,
బేలూరు, హౌరా,
30 జూన్ 1919.

శ్రీమన్,

నీజాబు చేరినది. భగవంతునికి నీవు పూజాసేవాదికమును చేయుచున్న కొలదియు అశుద్ధమై యుండిన మనస్సు విశుద్ధ మగును. ప్రేమప్రేరితమైన ఆరాధనకు ప్రత్యేకమైన పద్ధతి ఏమియు లేదు. భగవంతుని శ్రీచరణము లొద్ద పుష్పములను గంధములను ఇతరపూజాద్రవ్యములను భక్తితో సమర్పించి ఇట్లు ప్రార్థింపుము. "దేవా, నే నజ్ఞుడను. నాకు భక్తి లేదు. జ్ఞానము లేదు. శ్రద్ధ లేదు. ప్రేమ లేదు. చదువు లేదు. తెలివి లేదు. నే నర్పించిన గంధపుష్పాదులను దయతో స్వీకరింపుము. నన్ను విశుద్ధు నొనర్పుము. భక్తిని శ్రద్ధను ప్రేమను పవిత్రతను ప్రసాదింపుము. నా జీవితమును ధన్య మొనర్పుము. స్వామీ, దయతో ఈ పీఠము నలంకరించి యున్నావు.

లోకక్షేమమునకై దయతో స్థిరముగ వెలసి యుండుము: మేము ధన్యుల మగుదుము గాక, ఈ దేశము ధన్యమగును గాక.'' భక్తివినయములతో ఈ ఈలాగు ప్రార్థించుచు నివేదనలను సమర్పింపుము. ప్రసాదమును ఆరగింపజేయునప్పుడును ఇట్లే ప్రార్థింపుము.

సరళ భక్తివిశ్వాసములచేతనే భగవంతుని ప్రాపింప నగును. అట్టి తన కింకరుల పొరపాటులను స్వామి లెక్కింపడు. వారితప్పిదములనన్నింటిని మన్నించి క్రమముగ వారిని పవిత్రుల నొనర్చును.

ప్రేమప్రేరితమైన పూజలో పరికరాడంబరము అంతగా నుండదు. కొన్ని స్తోత్రముల ననుసంధించుట మంచిది. కొన్ని కీర్తనలను పాడుము. పూజానంతరము భగవన్నామమును యథాశక్తి జపింపుము. ఈ క్రమమును సాగింతువేని జీవితము పవిత్ర మగును. భగవదారాధనమును సాగించుకొలదియు ఆయన అనుగ్రహముచే కామినీకాంచనములందలి నీ సంగము విడిపోవును.

ఇంతకన్న నేమి వ్రాయుదును? నాహృదయపూర్వకాశీస్సులను స్వీకరింపుము.

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

## 81

శ్రీరామకృష్ణమఠము,
బేలూరు, హౌరా,
8 జూలై 1919.

ప్రియ—,

నీ జాబు చేరినది. సంగతులు తెలిసినవి...

హిమాలయములందలి ఏకాంత ప్రకృతి రామణీయకము భక్తునకు మనశ్శాంతిని కలిగించి భగవద్ధ్యానమునకు తోడ్పడును. ప్రకృతి సౌందర్యము పెక్కండ్రను బాహ్యోన్ముఖులనుగ చేయును. కాని ఆక్షేపణీయమైన విషయముల వంకకు కాదు. ధ్యానము ప్రగాఢమగునేని బాహ్యప్రపంచపు మెఱుగులు మనసునంతగా ఆకర్షింపవు. వ్యుత్థానదశలో అనగా ధ్యానమును ముగించి వెలుపలి ప్రపంచమునకు వచ్చి హిమాచల ప్రాంతమున నున్నట్టి ప్రకృతి రామణీయకము వంకకు చూపు మరల్చినప్పుడు ధ్యానమున కెంతయు ననుకూలమైనదియు కల్తీలేనిదియు నగు ఆనంద మనుభూతమగును. సాధువులును భక్తులును ప్రకృతి రమణీయస్థలముల నిచ్చగించుటకు కారణమదే.

కంఖాలు ఆధ్యాత్మికసాధనలకు చాల ననుకూలమైన ప్రదేశము. వానకాలములో ప్రకృతి దర్శనీయముగ నుండును. ఆధ్యాత్మికసాధనలలో నిమగ్నుడవు కమ్ము. ఇంతకన్న నేమి చెప్పుదును? సమస్తమును మఱచిపొమ్ము. మనలనుకూడ మఱచిపొమ్ము. భగవంతుని స్మృతి తప్ప మనసులో వేఱు దేనినిగాని ఉండనీయకుము. ఇట్టిస్థితి సిద్ధించిననే భగవంతుడు నిన్ననుగ్రహించె నని తెలిసికొమ్ము...

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

## 82

శ్రీరామకృష్ణమఠము,
బేలూరు, హౌరా,
17 జూలై 1919.

ప్రియ—,

నీ జాబు చేరి కొన్నాళ్లైనవి. పెక్కుదినములకు పిమ్మట నీవు మదరాసు మఠమునకు వచ్చియున్నావనియు అక్కడ క్షేమముగ నున్నావనియు అచటి భక్తులగోష్ఠిసుఖమును

అనుభవించుచున్నా వనియు విని సంతోషించి తిని. అప్పుడప్పుడు ఇట్టి మార్పులు కలుగుట చాల మంచిది. నీ యందలి నా ప్రేమానురాగములు అపరిమితములు. నీ శ్రేయము నభిలషించుచుందును. నీ డెందమును శ్రద్ధతో భక్తితో జ్ఞానముతో ప్రేమతో నింపుమని హృదయపూర్వకముగ భగవంతుని ప్రార్థించు చున్నాను.

భక్తులకు ఎక్కువ పాండిత్య మక్కఱలేదు. నిజమైన సారాసార వివేకమును వైరాగ్యము నున్నచో సర్వము సిద్ధించును. గురుదేవుడు చెప్పుచుండెడివాడు. "ఆత్మహత్య చేసికొనుటకు సూదిమొన చాలును. ఇతరులను చంప వలయు ననిన కత్తులు డాలులు మొదలైనవి కావలయును." అలాగే స్వకీయ మోక్షమును బడయుటకు ఎవనికిని విశేష పాండిత్యము అక్కఱలేదు. భగవన్నామము చాలును. ఇందులకు పెక్కు ఉదాహరణములు శాస్త్ర గ్రంథములలో కలవు. కాని లోకులకు ఉపదేశింపవలసిన వారికి ఎంతో చదువును పాండిత్యమును కావలసియుండును. లోకులకు ఉపదేశములు చేయవలెనన్న కోరిక నీకు లేదు. కాబట్టి భగవంతునిలో నిమగ్నుడవై యుండుటకు నీకిప్పుడున్న పాండిత్యము కావలసినంతకన్న హెచ్చే. ఇంతకన్న ఎక్కువ పాండిత్య మావశ్యకమైనను సర్వశక్తియైన లోకమాత సకాలమునకు నీకు దానిని ప్రసాదింపక పోదు. ఆమె యనుగ్రహ మొక్కటే భక్తులకు మూలాధారము. ఆమె యనుగ్రహ మున్నచో ఏ కొదువయు నుండదు. సకలశాస్త్ర గ్రంథములును ఆమె డెందమున సదా ప్రబుద్ధములై యుండును. ఎవని డెందమున లోకమాత ప్రబుద్ధయై యున్నదో అతని కేమి కొదువ "విద్యాః సమస్తాస్తవ దేవి భేదాః" "అమ్మా, సకల విద్యలును నీ రూపాంతరములే." సర్వజ్ఞానమును ఆమెయే. శాస్త్ర సర్వస్వమును ఆమెయే. మనస్సు ఆమె శ్రీచరణములపై నెలకొనునేని భక్తున కే కొదువయు నుండదు. మనస్సును పూర్తిగా ఆమె శ్రీచరణముల కర్పించు సత్త్వము నీకు కలుగుగాత" మని ఆశీర్వదించుచున్నాను.

దేవు ననుగ్రహముచే ఇచ్చట నందఱును ఒకవిధముగ బాగుగనే ఉన్నారు. మహారాజుగారు కల్కత్తాలో నున్నారు. ఆయన కారోగ్యము బాగుగాలేదు. ఏటేట వచ్చుచున్నట్లే మతములో చలిజ్వరములు ప్రారంభమైనవి. నీకు నా హృదయపూర్వకాశీస్సులు. పరేశునకు అవనికి సురేశునకు ప్రియునకు ప్రభునకు తక్కిన యందఱికిని నా యాశీస్సుల నందింపుము.

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

సీ. పుండరీకములతోఁ బురణించు కన్నులఁ గారుణ్య మను తేనె గడలుకొనఁగ,
మందారశాఖతో మలయఁజాలెడు కేలఁ బాంచజన్యం బను పండు మెఱయ,
నుదయాద్రితటముతో నుద్దించు నురమునఁ గౌస్తుభం బను దివాకరుఁడు దోఁప,
నాకలోకంబుతో నవ్వు పాదంబున నాకాశనది యను నమృత మొప్ప,
నమృతధారాధరము మాటలాడినట్లు, భాగ్యదేవత రూపుచేపట్టినట్లు,
లలితగతి నున్న సద్గుణాలంకరిష్ణు విష్ణుఁ బొడఁగంటి, భవముల వీడుకొంటి.

—మహాకవి నాచన సోమనాథుఁడు.

# క్షరాక్షరములు

## శ్రీ॥ శే॥ కులపతులు ముట్నూరు కృష్ణరావుపంతులుగారు

సోదరా, వేదాంతులు తత్త్వబోధకోసం పారిభాషిక పదాలను కల్పిస్తే, అవే మన చిత్త విభ్రమణానికి కారణభూతములై వాద ప్రతి వాదాల్లోకి దింపుతున్నాయి. పరమతత్త్వాన్ని ప్రకృతిపురుషులనుగ నిరూపించడంవల్ల వానికి భేదం కల్పించుకొని, మూలంలో రెండు ఉన్నట్లు ఎందఱు భ్రమించడం లేదు ?

"ఏక మిదమగ్ర ఆసీత్, నాన్యత్ కించి దస్తి" మూలతత్త్వం ఒకటే, ఇంకొకటి లేదు. అని వేదం ఘోషిస్తూంటే, వీటికి రెండెట్లా వచ్చాయండీ ? ఉన్నది ఒక్కటే అయినప్పుడు ప్రకృతి అన్నా పురుషుడన్నా అదే కావద్దా ?

అయితే ఎందుకు రెండు పదాలు పుట్టా యంటావా ? మూలపదార్థాన్ని రెండు దిక్కుల నుండి చూడవచ్చు—ఒకటి, సృష్టిద్వారా చూస్తే ప్రకృతి, సృష్టికి అతీతంగా చూస్తే పురుషుడు. ఏ దిక్కునుండి చూచినా మూలం ఒక్కటే.

పురుషుడు కాని దేమున్నది ? అన్నమయ పురుషుడు, ప్రాణమయ పురుషుడు, మనోమయ పురుషుడు, విజ్ఞానమయ పురుషుడు, ఆనంద మయ పురుషుడు అంటూ సర్వాన్ని పురుష మయంగా భావించలేదు ఉపనిషత్తులు ?

గీతాకారుడు మాత్ర మేమన్నాడు ?— దేహప్రాణ మనములను క్షరపురుషుడుగను, సచ్చిదానందాన్ని అక్షరపురుషుడుగను భావిం చాడే. ప్రకృతి పురుషుల కభేదం అని తెలప డానికి సచ్చిదానందాన్ని పరాప్రకృతి అన్నా డీ గీతాకారుడే. సృష్టిలోనిది అపరాప్రకృతి అయితే, పురుషునిది పరాప్రకృతి అయింది.

నీరు కరగి ప్రవహించవచ్చు. లేక గడ్డ కట్టుకొని నిలిచిపోవచ్చు. ఏ అవస్థలోనున్నా అది నీరే! అట్లాగే మూలతత్త్వం విక్షేపమైతే క్షరమైంది. సంక్షేపమైతే అక్షరమైంది. ఒకటి dynamic రెండవది Static అన్నారు పాశ్చాత్య వైజ్ఞానికులు. దీనినే మనపూర్వులు చిచ్ఛక్తి అని, చిద్ఘనమని నిరూపించారు.

ఇక ఎందుకండీ ఈ కుతర్కాలు—ప్రకృతి పురుషులు రెండా, ఒకటా, అని ? ఈ సంఖ్యా వాచకంతో మూలతత్త్వాన్ని నిర్వచించడం యుక్తంకాదు. అద్వయమంటే గణితంలోని మొదటి సంఖ్య అని తలంచకు. అన్ని సంఖ్యల నిమిడ్చుకొన్న సాంఖ్యమది. దానిని మినహాయిస్తే, ఇక మిగిలేదేమీ లేదు.

మూలతత్త్వం క్షరమే అన్నావా, అది కదలికకు లోబడ్డదన్నమాట. అక్షరమన్నావా, అది కదలలేని స్థాణువన్నమాట. రెండూ బద్ధావస్థలే – కాబట్టే నేను క్షరపురుషుడనూ కాను, అక్షరపురుషుడనూ కాను, రెంటిని అంతర్భుక్తం చేసుకొన్న పురుషోత్తముడిని అన్నాడు శ్రీకృష్ణభగవానుడు.



# రూపాంతరము

## శ్రీ అయ్యగారి రామచంద్రరావుగారు

రసము బుద్ధిగోచరమగు బాహ్యవిషయము గాదు. అది యనుభవైకవేద్యమగు ఆంతరంగిక వస్తువు. రసానుభవమును రూపద్వారమున బ్రకాశింపజేయు విద్యను శిల్పమనిగాని కళయనిగాని యందురు. కల్పనయందు ప్రకాశించు సౌందర్యమును సత్యమున బ్రతిష్ఠించుటయే కళల ప్రయోజనము. రూప, వర్ణ, గంధ, స్వరములచే మనస్సులో భావములు ప్రతిబింబించునప్పుడు మానవుని ప్రాణనికుంజమున రసస్ఫూర్తియగును. రూపవిలాసములచే, వర్ణక్రీడలచే, శబ్దచ్ఛందస్సుచే హృదయవంశీగానము బయల్వెడలునప్పుడు విశ్వమంతయు సుందరరూపముతో విరాజిల్లును. హృదయజడత్వము వీడిపోవును. ప్రకృతివైచిత్ర్యములు మాధుర్యమయము లగును. ఆత్మ ఇంద్రుని పగిది సహస్రనేత్రములతో దిలకించును. విశ్వము తనమేలిముసుగును తొలగించుకొని వినిర్మలమందహాసరుచులను నలుగడల బ్రసరింపజేయును. అప్పుడు గ్రహనక్షత్రములు, ఋతుక్రమము, తరుగుల్మలతాదులు, నదీనదములు నూతనవిలాససంపదలతో దనరారును. అభ్రభేదియగు హిమవన్నగమును, ఉత్తుంగతరంగితమగు విశాలసాగరమును రూపపు అనంతమైన అరూపమును వెల్లడిచేయును. మనఃకల్పితములగు రూపారూప, శబ్దాశబ్ద, రసారస, గంధాగంధముల భేదములు మాయమైపోవును. ఆయుద్దీపనావస్థను వర్ణించుటెట్లు?

హృదయమణికోటరమున బ్రచ్ఛన్నముగ నుండు ఆత్మజ్యోతి బహిర్గతమై ప్రకాశింపనారంభించినయెడల ఆ వెలుగును మఱుగొనర్చుట అసంభవము. ఆత్మ తనవికాసముననే తాను బ్రకాశించును. అందు కనియే కవులు, శిల్పులు, కళానిపుణులు తమ జీవనాంతరాళమున బ్రజ్వలించుచుండు దివ్యజ్యోతిని చేతబుచ్చుకొని ప్రతిహృదయద్వారమునందున నిలబడి, అంటాఱిపోవుటకు సిద్ధముగ నున్న దీపములను జాజ్వల్యమానములుగ బ్రకాశింపజేయుటకు బ్రయత్నింతురు. భారతవర్షమున జిరకాలమునుండియు కవిశేఖరులు, కళావిదులు, శిల్పులు బయల్వెడలి తమ తమ రసానుభవములను బ్రకటించు రచనలమూలమున దేశమును బ్రజ్వలింపజేసిరి. భారతవర్షమింకను ఆత్మవికాస మొందునుగాక! ప్రతిగృహము నందును ఆత్మజ్యోతి ప్రజ్వరిల్లునుగాక! ఆ హృదయవంశీగానమును విచిత్రరీతుల, అనేక గతుల నాలపించెదము గాక! ఆత్మోద్దీపకములగు గానములను, కావ్యములను, శిల్పములను, కళలను బోషించుకొనెదముగాక! అప్పుడు మన యాకర్షణవలననే ఈగ్రహతారలన్నియు తిరుగుచున్న వనియు, మన కాంతియే సూర్యకాంతులకు తేజ మొసగుచున్న దనియు దర్శించెదము. ప్రాణరహోవీథుల విహరించి జీవనపు టేకాంతగోష్ఠిమర్మమును దెలిసికొనుచు ముందున కడుగిడెదము. ఆత్మచింతామణిని గైకొని దాని స్వప్రకాశత్వమున జగత్ప్రకాశమును వీక్షించెదము. పాఠకమహాశయులారా, కవులును, శిల్పులును బొందిన ఆ రసావేశావస్థ యెట్టిదో తెలిసికొనుటకు మీరు కుతూహలు లగుట లేదా? ఆ మధురరసామృతతరంగిణీప్రవాహసరణిని తెలిసికొను టెట్లు?

సామాన్యజ్ఞానమువలనను, మీమాంసాశాస్త్రముల తర్క వితర్కముల వలనను, ప్రాణాంతరవస్తువగు రసము లభ్యము గాదు. మనము ఇంద్రియతరంగఫేనములో జిక్కుకొని, ప్రాణములోని ఆ అంతస్తత్త్వవస్తువును తెలిసికొనలేకున్నాము. మన చర్మచక్షువులు

చూచుచున్నది రూపమును. ఇది బాహ్య విషయము. కాని మనయందు స్నేహము, భక్తి, ప్రేమ మేల్కొనినప్పుడు మన కన్నులు చూచుచున్నది – ఆ రూపమును కాదు. దాని రూపాంతరమును. ''బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియమ్'' అని గీత నుడువుచున్నది. ''ప్రేమ చక్షువునకుగాని నందనందనుడు గోచరింపడు'' అని భక్తశిఖామణియగు మీరాబాయి గానముచేసినది. ఆ ప్రేమాంజనము మనయొద్ద లేనియెడల ఎన్ని వాదప్రతివాదకుల జరిపినను, ఎన్ని తర్కవితర్కములను గావించినను రూపాంతరవిషయ మగ్రాహ్యము. బాహ్యమును వీడుడు. మీ ప్రాణపుటంతరమున ప్రవేశింపుడు. అచ్చట సింహాసనాసీనయైన దేవతలో చూడుడు! ఆ రాజ్య మెంతజాజ్వల్యమానముగ ప్రకాశించుచున్నది! ఆ సింహాసనము సత్యము. దానిపై నధిష్ఠించినది ప్రేమ. ఎప్పుడు ప్రేమ సత్యప్రతిష్ఠితమగునో అప్పుడే విశ్వము రూపాంతరము నొందును. ఇది కవిత కుత్కృష్ట ధర్మము. ఇదియే శిల్పమునకు చరమప్రయోజనము. ఇదియే కళల పరమసాఫల్యము. మనము పుష్పమును జూచినంతనే యొక రూపము గోచరమగును. కానీ, యది పుష్పపు యథార్థరూపమును గాదు, సంపూర్ణరూపమును గాదు. ఆ పుష్ప మీయొక్కదినమున వికసించినదా? అనేకజన్మములచరిత్ర మా పుష్పమున గర్భితముగ లేదా? ఎంతకాలము నుండి యా పుష్పము తన్ను దాను వికసింప జేసికొనుచువచ్చుచున్నదో! ఆ మహాయత్నమున నెన్నిమారులు జారిపడిపోయెనో? తిరుగ ఎన్నిమారులు లేకెత్తెనో? ఆ విషయము లెక్కింప నేరితరము? ఆ ప్రసూనములోని ప్రతివర్ణమునందును, ప్రతిరేఖయందును, ప్రతిరేకయందును అనంతకాలము ముద్రితమై ప్రకాశించుటలేదా? ఆ పుష్పచరిత్రము అనంతకాలసుఖదుఃఖములు ఆ కుసుమసౌరభమున నంకితములై యలరారుచుండుట లేదా? ఆ పుష్పచరిత్రము అనంతకాలవిరహవేదనను గానము సేయుట లేదా? పుష్ప మన కేవలము చక్షుర్గోచరమగు శుద్ధపుష్ప మని తలంపకుడు. అది విశ్వేశ్వరుని ప్రాణకళిక; అయ్యది అనంతుని లీలారూపము. దానియందు విశ్వరూపము ఉత్తేజితమగుచున్నది. ప్రపంచమంతయు ప్రాణమయము. సమస్తరూపములు చిద్రూపములు. అచేతనము లని మతము హేయముగ జూచు జడరూపములును, మన కంటె తక్కువ యని నిరసించు నీ తరులతాదులును, నీ సమస్తజీవకోటియు అనంతప్రాణ సాగరమున లేచి పడు తరంగములు. పుష్ప మనంతము. నీవు అనంతుడవు. సమస్తము ననంతమే. మనకన్నులలో జడత్వముండుటచే ప్రపంచమునకును, పుష్పమునకును జడత్వ మారోపించుచున్నాము. కాని మనయల్పత్వముచే పుష్పధర్మముగాని, పుష్పస్వభావము గాని మారిపోవునా?

మనకన్నులకు గోచరించు పుష్పసామాన్య రూపము తొలగించి, పుష్పమునందు మునింగి తన్మయత్వముతో జూచితిమేని ఆ పుష్పము ధ్యానధారణలకు లక్ష్యమగును. అప్పుడు పుష్పమువలన కలిగిన రసానుభవము సాధనకు ఆలంబన మగుటయే గాక మూర్తివంతమగును. అందు ప్రాణసాక్షాత్కారమగును. పుష్పము చిద్రూపమున ననంతమై, అనంతమగు ప్రాణవాహినియందు దివ్యసౌరభముతో వికసించును. అప్పుడు మనప్రాణమునకును, ఆ పుష్పమునకును జరుగు ఆదానప్రదానములనే రసలీలనే రూపాంతర మందురు.

(సశేషము)

# వార్తలు - విశేషాలు

## శ్రీ వివేకానందస్వామి జయంత్యుత్సవాలు

శ్రీరామకృష్ణమఠము, మద్రాసు - 4

శ్రీ వివేకానందస్వాముల 109 వ జయంతి తిథిపూజ మద్రాసు మైలాపూరు శ్రీరామకృష్ణ మఠంలో 19-1-1971 తేది మంగళవారంనాడు భక్త్యుత్సాహాలతో జరుపబడింది. నాద స్వరంతో శ్రీరామకృష్ణసుప్రభాతస్తోత్రానుసంధానంతో మంగళహారతితో నాటి కార్యక్రమం ఆరంభమైంది. వివిధవర్గాలవారు పూర్వాహ్ణమంతా భజనసంకీర్తనలు సాగించారు. భగవద్గీత – దేవీమాహాత్మ్యము – ఉపనిషత్తులు మున్నగువాని పారాయణమూ సాగింది.

ప్రొద్దున 8-45 గంటలప్పుడు వివేకానంద భవనమునొద్ద సముద్రాభిముఖంగా పరివ్రాజక వేషమున అమర్పబడియున్న శ్రీ వివేకానంద స్వాముల శిలాప్రతిమకెదుట ఒకవేయిమంది కంటె ఎక్కువగానే మహాజనులు సమావేశ మయ్యారు. లేడివిల్లింగ్డను ట్రెయినింగుకాలేజి ప్రిన్సిపాలుగారును ఉపాధ్యాయినులున్నూ శిష్యురాండ్రున్నూ మఠభక్తులున్నూ మిత్రులున్నూ అక్కడ అన్ని యేర్పాట్లు చాల చక్కగా చేశారు. ఆ శిలామూర్తిని మాలాలంకృతంచేసి ఆరాధన కావించారు. ట్రెయినింగుకాలేజి ప్రిన్సిపాలుగారు సదస్యులకు స్వాగతాభివందనాలు సమర్పిస్తూ మహిళాభ్యుదయానికై శ్రీ వివేకానందస్వామి పాటుపడ్డ విధానాలను ప్రస్తుతించారు. మద్రాసు శ్రీరామకృష్ణ మఠాధ్యక్షులు శ్రీమత్కైలాసానందస్వాములు తమప్రసంగంలో ఈలాగు వ్రాకుచ్చారు. "ఈ జయంతిమహోత్సవానికి ఎంతైనా ప్రాముఖ్యం ఉంది. స్వామిజీసందేశం భారతదేశానికిన్నీ ప్రస్తుతకాలానికిన్నీ పరిమితమైంది కాదు. అన్ని దేశాలవారికిన్నీ అన్ని కాలాలవారికిన్నీ శ్రేయస్కరమైన దది. ప్రజలు ఆ సందేశాన్ని సమగ్రంగా ఆకళించుకొని సోత్సాహంగా అమలులో పెట్టని దే భవిష్యత్తు ప్రకాశవంతంగా ఉంటుందని చెప్పలేము. స్వాములసందేశాన్ని ప్రజలు అర్థంచేసుకొని ఆచరణలో పెట్ట ప్రయత్నిస్తున్న కొన్ని జాడలు ఆశాజనకాలుగా కనిపిస్తున్నాయి". రాణీమేరీ కళాశాలప్రిన్సిపాలుగారు సదస్యులకు కృతజ్ఞతాభివందనాలు సమర్పించడంతో అచటి కార్యకలాపాలు అప్పటికి ముగిశాయి.

మఠంవద్ద ప్రత్యేకపూజయూ హోమమున్నూ ప్రసాదవినిమయమున్నూ ముగిసే టప్పటికి మధ్యాహ్నానంతరం ఒంటిగంట అయింది. వివేకానందకాలేజి ఎన్సీసి యువకులు ఇందు విశేషంగా తోడ్పడ్డారు.

సాయం ఆరాత్రికం కాగానే మఠమండపంలో భక్తులత్యధికసంఖ్యలో సమావేశ మయ్యారు. శ్రీ వివేకానందస్వాముల జీవిత చరిత్రంనుంచి కొన్ని ముఖ్యఘట్టాలు చదువబడ్డాయి. శ్రీ విరూపాక్షానందస్వాములున్నూ శ్రీమత్పరమాత్మానందస్వాములున్నూ శ్రీవివేకానందస్వామి నిర్వహించిన విశ్వసంజీవనకార్యకలాపాలను వివరిస్తూ ప్రస్తుతిస్తూ ఉపన్యసించారు.

బహిరంగోత్సవం 24-1-1971 వ తేది భానువారంనాడు శ్రీ వివేకానందహాలులో జరిపేందుకు ఏర్పాటుచేయబడింది. మధ్యాహ్నానంతరం 3-30 గంటలనుండి 5-30 గంటలవఱకూ బ్రహ్మశ్రీ టి. ఎస్. బాలకృష్ణశాస్త్రి గారు కిరాతార్జునీయమును హరికథాకాలక్షేపంగా వినిపించారు. ఆయన కథనంలోని శ్రావ్యతయూ రంజకతయూ మద్రాసులో

సుప్రసిద్ధాలు. కాబట్టి శ్రోతలు హాలులో క్రిక్కిరిశారు.

5-30 గంటలకు హైకోర్టు న్యాయమూర్తి మాన్యశ్రీ పి. రామకృష్ణగారి ఆధ్యక్ష్యంలో పౌరసభ సమావేశమైంది. ప్రార్థనగేయమూ మంత్రపుష్పమూ అయ్యాక సదస్యులకు స్వాగత మంగళాశీస్సు లనుగ్రహిస్తూ శ్రీమత్కైలాసానందస్వాములు ఈలాగు సెల విచ్చారు. ''నానాటికి అత్యధికసంఖ్యాకులు శ్రీ వివేకానందస్వామిని గూర్చి తెలిసికోవడానికిన్ని ఆయన లోకాని కందించిన 'బల'సందేశాన్ని 'మోక్ష'సందేశాన్ని వినడానికిన్ని వస్తూ ఉండడం ముదావహం. ఎనభై యేండ్లకు పూర్వం అజ్ఞాతయతిగా దండహస్తుడై భారత దేశమంతటా పర్యటించిన పరివ్రాజకుని పేరు కీర్తిస్తూ ఈనాడు స్వదేశీయులు విదేశీయులు విఱగబడి వస్తున్నారు. స్వామిజిపేర్మికి భారతజాతి గర్విస్తున్నది. ఆయనపేర్మిని తొలిసారి గుర్తింప గల్గినందుకు మద్రాసునగరం గర్విస్తున్నది. ప్రపంచదేశాలలో భారతదేశానికి సముచిత స్థానాన్ని స్వామిజి సమకూర్చారు. ఆయన పడిన పాట్లు అమోఘువిజయవంతములుగా పర్యవసించాయి. అందులోని మర్మాన్ని గూర్చి ఆలోచించడం లాభదాయకం. అలనాడు కన్యాకుమార్యగ్రంమీద స్వామిజి ధ్యానాసనంలో కూర్చున్నాడు. ఘనతరమైన తనభవిష్యత్కార్యక్రమాన్ని మనస్సుకు అక్కడ తెచ్చుకొన్నాడు. ఆ అగ్రంమీద నేడు స్మారకభవనాన్ని మండపాలను నిర్మించి భారతదేశం ఆయన్ను ఆదరించడం చాలా సముచితం. ఆయన శ్రీరామకృష్ణుని సర్వసేనాపతి, ప్రాచ్య పాశ్చాత్యాలకు సేతువు కట్టి వేదాంతజ్యోతిని పాశ్చాత్యసాంస్కృతికవర్గాలకు అందజేసిన అద్భుతమహాపురుషుడు. శ్రీరామకృష్ణుడు ప్రారంభించి అతని శిష్యాగ్రణి విశ్వవ్యాప్త మొనర్చిన నవ్యవేదాంతోద్యమము ఈనాడు అనుపేక్ష్యశక్తిసమంచితంగా ఉంది. అన్నింటి చాలుమూలాలను పరిశోధించి స్వతంత్రనిర్ణయాలు చేసికోవా లనెడి నవ్యయుగయువకుల దృక్పథం ప్రారంభమైనది శ్రీవివేకానందస్వామితోనే. స్వామిజి స్వకీయజీవితంలోని మొదటి భాగం అవిశ్వాసంతోను ఆక్షేపణలతోను ప్రతిఘటనతోను సవాళ్లుచేయడంతోను కూడి ఉంది. కాని పరమహంసదేవునిద్వారా ప్రబోధం పొందేంతవఱకు స్వామిజి ఎంత ఎదురుతిరుగుతూ వచ్చాడో, ప్రబోధం పొందినాక అంత భవ్యుడు విధేయుడు అయ్యాడు. గురుదేవుని ప్రజ్ఞాధ్వజంగా ఆయన వెలుగొందాడు. అల్పకాలజీవితంలో ఆయన ఎంతో సాధించాడు. శరీరపతనానంతరంకూడా తన ఆత్మ లోకోద్ధరణ కార్యాన్ని సాగిస్తూనే ఉంటుం దని ఆయనే చెప్పాడు. శ్రీ వివేకానందస్వామినిగూర్చి క్షుణ్ణంగా తెలుసుకోవడం ప్రతిభారతీయునికిన్నీ కర్తవ్యం. సన్న్యాసానికి స్వామిజి క్రొత్తరూపు కలిగించి దానిచరిత్రలో నూతనాధ్యాయాన్ని ప్రారంభించాడు. సన్న్యాసికి కేవలం ధ్యానసాధనలే కాక, నిస్స్వార్థమైన ప్రజాసేవాదీక్షయూ అతిముఖ్యం. యుగావతారుడున్నూ అవతారవరిష్ఠుడున్నూ అయిన శ్రీరామకృష్ణుని గంభీరోదాత్తములైన ఆశయాలనూ సూత్రాలను కార్యరూపం ధరింపజేసింది స్వామిజి. ఆశయాలలో భారతీయులు పాశ్చాత్యులకు దాసులై యుండు కాలం దాటిపోయింది. ఆధ్యాత్మికవికాసానికి పాశ్చాత్యు లిప్పుడు ప్రాచ్యులను ఆశ్రయిస్తున్నారు. బుద్ధదేవుని సందేశానికివలె శ్రీ వివేకానందస్వామిసందేశానికిన్నీ విశ్వమానవసంక్షేమమే లక్ష్యం. అది ఆయన గ్రంథావళిలో నిక్షిప్తమై ఉంది. దానిని మనం తల దాలుము గాక.''

తర్వాత పచ్చయప్పకళాశాల ప్రొఫెస్సరు ఎ. ఎమ్. పరమశివానందం (ఎమ్. ఎ, ఎమ్. లిట్)గారు కావించిన తమిళోపన్యాసాని కిది సంక్షేపం:—"శ్రీ వివేకానందస్వామి భువిపై అవతరించి నూటొనిమిదేండ్లు గడిచాయి. ఇది రెండో శతాబ్దం. శ్రీరామకృష్ణవివేకానందుల సమాగమమూ, స్వామిజి పరమహంసదేవునికి తన్ను అర్పించుకోవడమూ చరిత్రలో జగన్మంగళసాధకసందర్భాలు. మనమాతృదేశమత చరిత్రలో శ్రీవివేకానందస్వాముల జీవితచరిత్ర పెక్కుముఖ్యఘట్టాలనుమనతలంపులకు తెస్తుంది. మతప్రవక్తలకు యోగులకు మనదేశంలో ఎప్పుడూ దుర్భిక్షం లేదు. దేశంలో పైపైని ఎన్నిమార్పులు గలిగినా ఆధ్యాత్మికసంస్కృతికి ఎన్నడూ సేగి లేదు. అమెరికావిశ్వమతమహాసభావేదికపై నిల్చి ఉపన్యసించినప్పుడు ఆయన నోట వెలువడిన వాణి భారతదేశపు ఆర్ష వాణియే. స్వామిజి రచించిన యతిగీతము జీవన్ముక్తునిగీతమే. స్వామిజి దృక్పథంలో జీవితం వేఱూ ఆస్తికత వేఱూ కాదు. 'నా యుద్ధ విధానం' అనే శీర్షిక క్రింద స్వామిజి మద్రాసులో కావించిన ఉపన్యాసంలో "శాపవాక్కులను ఎన్నడూ నాల్కకు రానీయకండి" అని స్వదేశీయులను హెచ్చరించాడు. హిందువుల అభిప్రాయంలో ఆత్మవిద్యయే విద్య, అందు గురుకృపకు గల ప్రాముఖ్యం అపారం. సమష్టి సౌఖ్యమునకై అందఱూ ఏకీభవించండి అనేదే స్వామిజీ శంఖారావం."

రెండో ఉపన్యాసకులు వివేకానందకాలేజి ప్రొఫెస్సరు శ్రీ కె. వాసుదేవనుగారు. ఆంగ్ల భాషలో వారు కావించిన ఉపన్యాసాన్ని ఈ క్రింద సంగ్రహిస్తున్నాము. శ్రీ స్వామిజి ప్రతిభ సర్వతోముఖం. కాబట్టి ఆయన గొప్ప గుణాల నన్నిటిని ఒక్క ఉపన్యాసంలో ఇముడ్చలేం. ఆయన జీవితకాలం అల్పమైనా, సాధించింది అనల్పం. ఆయనరూపం గంభీరం, మనోహరం. ఆయన ఆత్మ చక్కని పరిపాకం గలది. ఆయనను యతివీరు డన్నారు. బాగుంది. నరుడంటే ఆయనే. దుర్దమబలుడు, శ్రమసహుడు, చుఱుకైన జ్ఞప్తియు ధ్యానదక్షతయు గలవాడు ఆయన. వందలకొలది పుటలు గల గ్రంథసంపుటాల పెక్కింటి సారము నాయన అత్యల్పకాలంలో ఆకళించుకోగలడు. ఆయన జీవితమే ఒక తపస్సు. ఆయన నడత ఉదాత్తం. ఆయనచూపు ఆకర్షకం. ధనం లోకసేవకు సాధనం అని ధనవంతులకు నచ్చ చెప్పగలవాడాయన. నిమ్న ప్రజలపట్ల ఆయన కుండిన అభిమానం అగాధం. ఆయన లోకజ్ఞానం అతివిశాలం. గురుభక్తి సాటిలేనిది, దేశభక్తి తీవ్రమైనది. ఆదేశభక్తి దేశపు గొప్పతనం చక్కగా తెలిసినందువల్ల ఉప్పతిల్లిందే కాని కేవలం శుష్కభావం కాదు. ఎదురుతిరిగేవాడూ ప్రశ్నలువేసేవాడూ అయినా, అతని ఆర్జవం గురుదేవునకు అత్యంత ప్రీతికరమైనది. హిందువులకూ హైందవేతరులకుగూడా ఆయన హిందూసిద్ధాంత స్వరూపాన్ని తెలియజెప్పాడు. నాలుగు యోగాలపై సమానంగా ఊనిక ఉంచడంవల్ల హిందూసిద్ధాంతం భిన్నప్రవణతలు కలవారి కందఱికి నచ్చింది. ఆయన కుండిన 'మనుష్యస్వభావజ్ఞానం' ఆధ్యాత్మిక తాపరమైంది. వ్యక్తి ప్రాముఖ్యమును నిరాదరింపని ప్రజాసామ్యవాది ఆయన. తమదేశాన్ని తాము పాలించుకోగలవాళ్లుగా సామాన్యజనులు అభివృద్ధి నొందుతారని ఆయన ఆనాడే చెప్పాడు."

అధ్యక్షోపన్యాసంలో శ్రీ పి. రామకృష్ణగారు ఈలాగన్నారు – భారతదేశ ప్రజల జీవితసారం ఆధ్యాత్మికపరతయే. ఆ ప్రత్యేకతను

గుర్తింపజేసినవాడు స్వామిజి. అందఱిలో ఉన్న ఆత్మ ఒక్కటే అన్న పరమార్థంమీద ఆధారపడిచి స్వామిజి సర్వప్రజల సమానత్వాన్ని ఉద్ఘాటించారు. క్లిష్టపరిస్థితిలో భారతీయ సంస్కృతిని కాపాడినవారు శ్రీ రామకృష్ణ వివేకానందులు. ప్రజల సమస్యల కన్నిటికిన్ని పరిష్కారాన్ని వేదాంతంలోనుండియే చూపారు.''

శ్రీ అణ్ణా ఎన్. సుబ్రహ్మణ్యంగారి వందనోపచారంతో సభాకార్యక్రమం ముగిసింది.

8 నుండి 9 గంటలవఱకు మఠభజన బృందంవారు శ్రీమత్ప్రియానంద స్వాముల ఆధ్వర్యంలో కాళికీర్తన చేశారు.

## శ్రీ రామకృష్ణమఠం, వీరభద్రపురం, రాజమండ్రి.

25–2–71 నుండి 28–2–71 వఱకు ఇక్కడ మాతృశ్రీ శారదాదేవికిన్ని శ్రీ వివేకానంద స్వామికిన్ని పరమహంస శ్రీ రామకృష్ణునికిన్ని జయంతి మహోత్సవాలు వైభవంతో జరిగాయి.

25–2–71 గురువారము సాయంకాలం 6 గంటలకు శ్రీమతి శాంతా శ్రీరాముల అధ్యక్షతలో సభాకార్యం ఆరంభమైంది. శ్రీ దుర్గా చైతన్య బ్రహ్మచారిగారు మంత్రపుష్పం అనుసంధించారు. ప్రార్థనగేయం అయ్యాక శ్రీ నాగేశానందస్వాములు సదస్యులకు స్వాగతం పల్కి సభాముఖ్యోద్దేశమును వివరించారు. రాజమండ్రి సాధుస్త్రీల మఠాధ్యక్షులు శ్రీ మాతా నిరంజనానందగిరి గారున్నూ సభాధ్యక్షురాలు శ్రీమతి శాంతా శ్రీరాములు గారున్నూ శ్రీ శారదామణి దేవిగారి జీవితమును గుణవిశేషాలను ప్రస్తుతిస్తూ ఉపన్యసించారు.

7–30 గంటలనుండి 11 గంటలవఱకు చిరంజీవిని యాళ్లబండి శారదాకుమారిగారు 'భక్త మీరా' చరిత్రాన్ని అత్యంత శ్రావ్యంగా హరికథా కాలక్షేపం చేశారు.

26–2–71 శుక్రవారము సాయంకాలం 6 గంటలకు సమావేశమైన పౌరసభకు అధ్యక్షత వహించినవారు మాజి మంత్రి శ్రీ ఎ. బి. నాగేశ్వరరావుగారు. రాజమండ్రి స్త్రీలకాలేజి ప్రిన్సిపాలు శ్రీమతి రుక్మిణిగారున్నూ కుమారి కే. ఆర్. జయశ్రీయు, నవభారత గురుకుల వ్యవస్థాపకులున్నూ కార్యదర్శియు అగు శ్రీ టి. బుల్లయ్యగారున్నూ–వేదికపై ఆసీనులయ్యారు. ఉపన్యాసకులు శ్రీ వివేకానందస్వామి సాధించిన ఘనకార్యాలను ప్రస్తుతించారు.

అనంతరం శ్రీ ఎన్. భానుమతిగారు గానకచ్చేరి చేశారు. శ్రీ టి. పొన్నారావుగారు ఫిడేలును, శ్రీ కె. జనార్దనశాస్త్రిగారు మృదంగమును వాయించారు.

27–2–71 శనివారము. ఈనాడు పరమహంస శ్రీ రామకృష్ణుని జయంతి తిథిపూజ. ప్రొద్దున 5 గంటలకు మంగళహారతితో కార్యక్రమం ఆరంభమైంది. తర్వాత యజుర్వేద సామవేద పారాయణాలు, శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర పఠనమూ ప్రత్యేకపూజ, హోమం ప్రసాద వినిమయం జరిగాయి. అకాలవర్షం కొంత ఇబ్బంది కలిగించింది. సాయంకాలం 7 గంటలనుండి మూడు గంటలసేపు గాయక సమ్రాట్టు. శ్రీ ఎమ్మెస్. బాలసుబ్రహ్మణ్యశర్మగారు గానకచ్చేరి చేశారు. శ్రీ టి. పొన్నారావుగారు ఫిడేలును శ్రీ వి. కమలాకరరావుగారు మృదంగమును శ్రీ అన్నవరపు గోపాలంగారు ఘటమునూ వాయించారు. కచ్చేరి శ్రోతృజనరంజకంగా చెల్లింది.

28–2–71 ఆదివారము శ్రీ రామకృష్ణుని జయంతి పౌరసభ సమావేశమైంది. జిల్లాజడ్జి శ్రీ సి. శ్రీరాములుగారు సభకు అధ్యక్షత

వహించారు. శ్రీ దుర్గాచైతన్య బ్రహ్మచారి గారు మంత్రపుష్పం చదివారు. భక్తిగేయాలు పాడబడినవి. శ్రీమతి జయలక్ష్మి గోపీనాథం గారు శ్రీ రామకృష్ణుని జీవిత విశేషాలనుగూర్చి ఆంగ్ల భాషలో ఉపన్యసించారు. గవర్నమెంటు ఆర్ట్సు కాలేజి తెలుగు శాఖాధ్యక్షులు శ్రీ సి. గోపాలకృష్ణమూర్తిగారు ఉపన్యసిస్తూ "ఆత్మజ్ఞానం చదువుచే కలుగదు, అనుభవం చేత కలుగుతుంది, ఆధ్యాత్మిక సత్యాలు మాటల కందవు, తామరతీగకు వేరు ఎటువంటిదో జీవితమునకు ఆధ్యాత్మిక చింతన అటువంటిది" అన్నారు. సభాధ్యక్షులయిన శ్రీ సి. శ్రీరాములుగారు శ్రీ రామకృష్ణుడు నవ్యయుగ జ్ఞానప్రభాకరుడని కీర్తించారు. మఠాధ్యక్షులైన శ్రీ నాగేశానందస్వాములు సదస్యులకు వక్తలకు అధ్యక్షులకు సహాయులకు వందన సమర్పణం చేసారు. తర్వాత దాదాపు రాత్రి 12 గంటలవఱకు శ్రీ కోటా సచ్చిదానంద భాగవతులు శ్రీ కృష్ణరాయబారకథను సంగీతోపన్యాసంగా వినిపించారు. శ్రీ టి. ప్రకాశ రావుగారు ఫిడేలును, శ్రీ పి. రామారావుగారు మృదంగమును, శ్రీ పి. సూర్యనారాయణగారు మోర్సింగును వాయించారు. శ్రీ శ్రుతిసారానందస్వాముల ఆధ్వర్యంలో వాలంటీర్లు సభా కార్యనిర్వహణలో తోడ్పడ్డారు.

## జిల్లాపరిషత్ సంస్థ, నల్గొండ

ఆధ్యాత్మిక, భౌతికసిద్ధాంతాలను సమన్వయముచేసికొంటూ, నిర్భయత్వ, నిస్స్వార్థ గుణములతో మాతృదేశపురోభివృద్ధికీ, పీడిత జనావళిశ్రేయస్సుకు నిరంతరకృషి సల్పుమని శ్రీ వివేకానందుని బోధనల సారాంశమంటూ ఆంధ్రప్రదేశ శాసనమండలి మాజీసభ్యులు శ్రీ సి. హెచ్. శంకరరావుగారు నేడిచ్చట జిల్లా కేంద్రగ్రంథాలయంలో అత్యంతవైభవముగా జరిగిన శ్రీవివేకానందజయంత్యుత్సవ సభకు అధ్యక్షతవహిస్తూ తెలిపారు.

ఈ సందర్భములో వారం రోజులపాటు గ్రంథాలయహాలులో శ్రీరామకృష్ణపరమహంస - శ్రీవివేకానందసాహిత్యప్రదర్శనము ఏర్పాటు గావించారు. గ్రంథాలయములో ఉదయం ఏర్పాటుచేసిన వక్తృత్వపుపోటీల సమావేశమునకు జిల్లా స్త్రీసంక్షేమశాఖాధికారిణి కుమారి టి. లీలగారు అధ్యక్షత వహించారు. స్థానికవిద్యాసంస్థలనుండి అన్నిమతములకు చెందినవారు తగుసంఖ్యలోవచ్చి పాల్గొనుట ప్రశంసనీయము. శ్రీయుతులు తేరాల సత్యనారాయణశర్మగారు, కె. నాగేశ్వరరావు గారలు న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు.

శ్రీయుతులు అలెగ్జాండరు, అబ్దుల్ హమీద్ ఖాన్, జి. కృష్ణమూర్తిగార్లకు వరుసగా ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులు లభించాయి. కుమారి అనసూయ, శ్రీ బాలయ్యగార్లకు కన్సొలేషన్ బహుమతులు లభించాయి.

శ్రీ పులిజాల వేంకటరంగారావు, జిల్లా కోశాధికారి శ్రీ పి. వి. సుబ్బారావుగారలు వివేకానందుని జీవితవిశేషాలను, ప్రబోధనలను గుఱించి విపులంగా ఉపన్యసించారు.

శ్రీ మిట్టపల్లి విశ్వనాథంగారు శ్రీవివేకానందుని చిత్రపటమును, శ్రీ పులిజాల వేంకటరంగారావుగారు శ్రీరామకృష్ణపరమహంస, శారదాదేవి చిత్రపటములను గ్రంథాలయమునకు బహూకరించెదమని ప్రకటించారు.

బహుమతులప్రదానము జరిగిన తరువాత జిల్లాగ్రంథాలయసంస్థ కార్యదర్శి శ్రీ కొల్లిమర్ల నాగేశ్వరరావుగారు వందనసమర్పణ గావించారు.

# గ్రంథ పరిచయం

## సాహిత్యసుధాకర

రచయితయూ, ప్రాప్తిస్థానమును పండిత కె.ఎస్. పరమేశ్వర శాస్త్రి, సాహిత్యశిరోమణి, ఇరింజలకూడ, కేరళ; పుటలు : 80; వెల . రూపాయి.

రచయిత సంస్కృతభాషోపాధ్యాయుడు, కాబట్టి ఎం|జెన్సు ప్రిలిమినరి, ఇంటర్మీడియేటు పరీక్షలకై సంస్కృతం చదువు విద్యార్థులకు కావలసిన ఛందోలంకారవిషయాలను ఉపాధ్యాయనిరపేక్షంగా వారికి అవగతమయ్యేటట్లు సరళసంస్కృతభాషలో (నాగరలిపిలో) ఇందు వ్రాసిఉన్నారు. కావ్యలక్షణం, కావ్యసామగ్రి, కావ్యవిభాగాలు, శబ్దార్థనిరూపణం, రసనిరూపణం, గుణనిరూపణం, గుణాలంకారాలభేదములు, శబ్దాలంకారనిరూపణం, అర్థాలంకారనిరూపణం, దోషనిరూపణం, వృత్తనిరూపణం —ఇవి ఇందులోని ప్రకరణాలు విద్యార్థులకే కాక ఉపాధ్యాయులకుసైతం ఈ పుస్తకం అత్యంతోపయోగకరం అంటే అతిశయోక్తి కాదు.

## త్రిపురారహస్యము అను అద్వైతమతసుధాసారము

రచయిత : వైద్యవిద్వత్పండిత సత్కవి నారునాగనార్య, నాగవరము – కడపమండలము; ప్రకాశకులు : అఖిలాంధ్రసాధుపరిషదధ్యక్షులు శ్రీ నిత్యానందగిరిస్వామిగారు, శ్రీకైలాసాశ్రమము, ఉపనిషద్విహార్ పోస్టు, వయా పానగల్లు, శ్రీకాళహస్తి తాలూకా, చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్ ; పుటలు : 134; వెల : రెండు రూపాయలు.

ఇందుకు మూలము కాశీపండితులగు గోపీనాథకవిరాజప్రముఖులు గీర్వాణభాషలో రచించినది. ఇది పెక్కుభాషలలోని కనువదింపబడిన ప్రశస్తగ్రంథము. సలక్షణభాషలో పద్యకావ్యంగా దీన్ని తెలుగులో రూపొందింపగోరినారు శ్రీ నిత్యానందగిరిస్వామివారు. వారి ఆదేశానుసారం సిద్ధహస్తులైన శ్రీ నారునాగనార్యులు ఆ పద్యకావ్యరచనకు పూనుకొని అందు అర్ధసహస్రమునకంటె రవంత హెచ్చు పద్యసంఖ్యగల యీ భాగమును ప్రస్తుతం అందించినారు. సచ్చిదానందకందమైన యీ కృతికి

మా అభినందనములు. -ప్రభాకర్.

## SRI RAMAKRISHNA PRABHA

Statement about ownership and other particulars about *Sri Ramakrishna Prabha* (according to Form IV, Rule 8, circulated by the Registrar of Newspapers for India.)

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | Sri Ramakrishna Math, Mylapore, Madras-4. |
| 2. | Periodicity of its Publication | Monthly. |
| 3. | Printer's Name | M. Balasundaram. |
| | Nationality | Indian. |
| | Address | Freedom Press, 138, T. H. Road, Madras-21. |
| 4. | Publisher's Name | Swami Hirananda. |
| | Nationality | Indian. |
| | Address | Sri Ramakrishna Math, Mylapore, Madras-4. |
| 5. | Editors' Names | Swami Hirananda and Prof. N. Bhaktavatsalam, M.A., B.O.L. |
| | Nationality | Indian. |
| | Address | Sri Ramakrishna Math, Mylapore, Madras-4. |
| 6. | Names and address of individuals who own the newspaper and partners or shareholders holding more than 1% of the total capital. | Sri Ramakrishna Math, Mylapore, Madras-4. |

I, Swami Hirananda, hereby declare that the particulars given above are true to the best

# భక్తియోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో, శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవారిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

121+4 పుటలు  ఆఱవ కూర్పు  వెల : రూ. 1-50

# కర్మయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ వివేకానందస్వాములవారు కర్మయోగతత్త్వము నరటిపండొలిచినరీతిని విశదీకరించియున్నారు. కర్మమెటుల మోక్షసాధనమో స్పష్టీకరించియున్నారు. కర్మయోగ రహస్యము నెఱుఁగగోరు జిజ్ఞాసువుల కిది కల్పతరువు.

146+8 పుటలు  ఏడవ కూర్పు  వెల : రూ. 1-50

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4.

# జ్ఞానయోగము

అనువాదకులు :
కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు రెండవ కూర్పు వెల : రూ. 4-00

నూతన ముద్రణము ! ఇప్పుడే వెలువడినది !

# రాజయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వామి

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయ భాగము-రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) ఆఱవ కూర్పు వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు—4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# తెలుగు, తమిళ పాఠకులకు అరుదైన అవకాశం

## ఈ క్రింది పుస్తకాల ధరలో 25 శాతం తగ్గింపు

పుస్తకాల ఖరీదు పంపి లాభం పొందండి.
తపాలా ఖర్చులు అదనం.

## తెలుగు

### శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి

(10 సంపుటాలు)

ప్రతి సంపుటంలోను పుటలు 500 ల కెక్కువే. ఆంగ్లభాషలోనున్న సంపూర్ణ గ్రంథావళి కిది తేటతెనుగున అనువాదం.

| | | | | |
|---|---|---|---|---|
| అసలు ఖరీదు | సాదాఅట్టబైండింగు | ర్ూ. 51-50 | కాలికో | ర్ూ. 65-00 |
| 25 శాతం తగ్గింపు ధర | ,, | ర్ూ. 38-63 | ,, | ర్ూ. 48-75 |

## తమిళం

### 1. స్వామి వివేకానన్దరిన్ జ్ఞానదీపమ్

(10 సంపుటాలు)

ప్రతి సంపుటంలోను పుటలు 500 ల కెక్కువే. ఆంగ్లభాషలోనున్న సంపూర్ణ గ్రంథావళి కిది సరళ తమిళములోనికి అనువాదం.

| | | | | |
|---|---|---|---|---|
| అసలు ఖరీదు | సాదాఅట్టబైండింగు | ర్ూ. 50-00 | కాలికో | ర్ూ. 65-00 |
| 25 శాతం తగ్గింపు ధర | ,, | ర్ూ. 37-50 | ,, | ర్ూ. 48-75 |

### 2. స్వామి వివేకానందర్

రచయిత : రా. గణపతి

(పుటలు 895)

స్వామిజి జీవితచరిత్రం ఇందు విపులంగా పొందుపఱుపబడి ఉన్నది.

| | | |
|---|---|---|
| అసలు ఖరీదు | కాలికో | ర్ూ. 9-00 |
| 25 శాతం తగ్గింపు ధర | ,, | ర్ూ. 6-75 |

పుస్తక విక్రేతలకు 33⅓ శాతము కమీషను ఈయబడును.

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 4.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౭ ౧౯౭౧ - ఏప్రిల్ : విరోధికృత్తు - చైత్రము సంచిక ౧౦

## విషయసూచిక

ఫోను : 71231 పోస్టు బాక్సు : 635

మా మాసపత్రికలు

# వేదాంతకేసరి

తత్త్వశాస్త్ర - మత - సంస్కృతివిషయికంగా 1914-వ సంవత్సరంనుండి నడపబడుతుండే
ఆంగ్ల మాసపత్రిక

సాలు చందా : ఇండియాలోను, సింహళంలోను 6 రూపాయలు;
ఇతర విదేశాలలో 3 డాలర్లు, లేదా 14 షిల్లింగులు.

# శ్రీ రామకృష్ణ విజయం

మత - సాంస్కృతికవిషయికంగా 1921-వ సంవత్సరమునుండి ప్రచురింపబడుతున్న తమిళ మాసపత్రిక

సాలు చందా : ఇండియాలో ర్ూ 5 లు, సింహళము ర్ూ 7 లు.

# శ్రీ రామకృష్ణ ప్రభ

1944-వ సంవత్సరంనుండి ప్రచురింపబడుతూ విశ్వోపజీవ్యమైన ఆధ్యాత్మిక విజ్ఞానామృతమును వెదజల్లే
తెలుగు మాసపత్రిక

సాలు చందా : ఇండియాలో ర్ూ 5 లు, సింహళము ర్ూ 7 లు.

1. చందాదారులు ఉత్తరప్రత్యుత్తరాలలో తమ 'చందాదారు సంఖ్య' నుదాహరిస్తూ విలాసాలను స్పష్టంగా వ్రాయాలి.
2. పత్రిక అందకపోతే మాసాంతానికి మాకు తెలుపాలి.
3. చందాదారులకు మేము ప్రచురించిన గ్రంథాలలో కొన్ని తగ్గింపు ధరలకు అందజేస్తాం. వివరాలకు క్రింది విలాసానికి వ్రాయండి.
4. ప్రముఖ సంస్కృతి కేంద్రాలలో ప్రచారంలో ఉన్న యీ ఆధ్యాత్మిక విజ్ఞాన పత్రికలు అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకాలు. రేట్లకు వ్రాయండి.
5. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపవలసినదని గ్రంథకర్తలకు ప్రకాశకులకు మా ప్రార్థన.
6. ప్రజారంజకములైన మత - తత్త్వశాస్త్ర - సంస్కృతివిషయిక స్వతంత్ర వ్యాసాలను రచయితలు అందజేస్తే సంపాదకులు కన్నుల కద్దుకొని ప్రచురిస్తారు.
7. పత్రిక స్పెసిమెన్కాపీ కోరేవారు 75 పైసల పోస్టేజి పంపాలి.

---

ఇంకా వివరాలు కావలసినవారు :

## మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠం, మైలాపూరు, మద్రాసు-4

అనే విలాసానికి వ్రాయండి.

# మా 'దివ్యవాణి' గ్రంథమాల

నేడే కొనండి! పదే పదే చదవండి!!

దివ్యావతారమూర్తుల విశ్వోపజీవ్యములైన అమృత మధుర సూక్తులు సర్వసుగ్రాహ్యమైన హృదయ సన్నిహితమైన తేటతెనుగున వీనిలో అందజేయబడ్డాయి. ఇందులో ఒక్కొక్కటి నిరుత్సాహులకు ఉత్సాహప్రదం, అశాంతిసంక్షుభితులకు శాంతిదాయకం, సంశయాందోళితులకు సంశయాపనోదకం, జిజ్ఞాసువులకు పరమార్థజ్ఞాన సమర్పకం, అందటికీ శిక్షకం, సంస్కారకం నిర్వృత్యాపాదకం. మువ్వన్నెల మేలి జాకెట్టుతో పాకెట్టుసైజులో చక్కని తయారింపు—

| | | | |
|---|---|---|---|
| రామకృష్ణ ఉవాచ | 0-40 | కృష్ణవాణి | 0-45 |
| శారదాసూక్తి నవనీతము | 0-40 | బుద్ధ ఉవాచ | 0-40 |
| వివేకానంద శంఖారావము | 0-40 | క్రీసు సూక్తిమాల | 0-40 |

మహమ్మదు సూక్తిమంజరి 0-40

# దేవీ మాహాత్మ్యము

అనువాదకులు:

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

మార్కండేయ పురాణాంతర్గతమగు దేవీమాహాత్మ్యము భక్తులెల్లరు అవశ్యము పఠింపదగిన దివ్యగ్రంథము. పాఠకుల సౌకర్యార్థము శ్లోకములు పెద్దఅక్షరములతో ముద్రింపబడియున్నవి. ప్రతి శ్లోకమునకు తేటతెల్లమగు తాత్పర్యము గలదు.

పారాయణము చేయగోరు భక్తుల యుపయోగార్థము గ్రంథాదియందు చండికా ధ్యానము, అర్గలాస్తోత్రము, కీలకస్తోత్రము, దేవీకవచమును, గ్రంథాంతమున అపరాధ క్షమాపణస్తోత్రమును, దేవీసూక్తమును పొందుపఱచియున్నాము.

ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పారాయణముచేయు భక్తులకు శ్రీదేవీకృపాకటాక్ష వీక్షణప్రసారము తప్పక కలుగును.

170+24 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము వెల: రూ. 2-50



'అఖిలవిభు శరణొొందుము, యా క్షణంబ యతనిక్రృప నీవు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.



# మ కృష్ణ ప్రభ

సంపుటము ౨౭} ౧౯౭౧ - ఏప్రిల్ - చైత్రము { సంచిక ౧౦

శ్రీః

## వివేకచూడామణి

మూలము : శ్రీ శంకర భగవత్పాదులు

వ్యాఖ్యాత : అన్నమాచార్య

యస్య సన్నిధిమాత్రేణ దేహేన్ద్రియమనోధియః,
విషయేషు స్వకీయేషు వర్తన్తే ప్రేరితా ఇవ. 129

ఆత్మసాన్నిధ్యముచేతనే దేహమును ఇంద్రియములును మనస్సును బుద్ధియు ప్రేరింపబడినవియుంబోలె తమతమ కార్యరంగములలో ప్రవర్తించుచుండును. ౧౨౯

అహఙ్కారాదిదేహాన్తా విషయా శ్చ సుఖాదయః,
వేద్యన్తే ఘటవ ద్యేన నిత్యబోధస్వరూపిణా. 130

అహంకారము మొదలు దేహపర్యంతము గల కోశపంచకమును, విషయములను సుఖాదులను నిత్యజ్ఞానస్వరూపియగు ఆత్మ, కుండను జూచినంత ప్రత్యక్షముగా, నెఱుగుచుండును. ౧౩౦

ఏషో ఽన్తరాత్మా పురుషః పురాణో నిరన్తరాఖణ్డసుఖానుభూతిః,
సదైకరూపః ప్రతిబోధమాత్రో యే నేషితా వా గసవ శ్చరన్తి. 131

ఇదే అంతరాత్మ, దీనిని పురుషు డందురు, దీని సుఖానుభూతి నిరంతరముగను అఖండముగను ఉండును. చిత్స్వరూపమగు నిది ఎల్లప్పుడు నేకరూపముగ నుండును. దీనిప్రేరణము

చేతనే వాక్కు మున్నగు నింద్రియములును, ప్రాణాదివాయువులును (దేహమును), తమ తమ పనులలో ప్రవర్తిలుచుండును. ౧౩౧

అత్రైవ సత్త్వాత్మని ధీగుహాయాం అవ్యాకృతాకాశ ఉరుప్రకాశః.
ఆకాశ ఉచ్చై రవివ త్ప్రకాశతే స్వతేజసా విశ్వ మిదం ప్రకాశయన్. 132

ఈ దేహమునందే సాత్త్వి... బుద్ధిగుహలో అజ్ఞానావరణ మనెడి అవ్యాకృతాకాశములో అఖండజ్యోతియగు ఆత్మ - మింట సూర్యునివలె - ప్రకాశించుచున్నది. దాని తేజముచేత ఈ విశ్వము వెలుగొందుచున్నది. ౧౩౨

జ్ఞాతా మనోఽహఙ్కృతివిక్రియాణాం దేహేన్ద్రియప్రాణకృతక్రియాణామ్,
అయోఽగ్నివ త్తా ననువర్తమానో న చేష్టతే నో వికరోతి కిఞ్చన. 133

మనోహంకారవికారములను, దేహేంద్రియప్రాణములు నిర్వహించు క్రియలను ఆత్మ ఎఱుగుచుండును. వాని ననువర్తించుచున్నను, ఆత్మ తా నేమియు చేయదు, ఏ వికారమునకును లోను కాదు. క్రాగినయినుములోని నిప్పునకు ఆ యినుమునకు గల రూపగుణాదు లంటవు కదా. ౧౩౩

న జాయతే నో మ్రియతే న వర్ధతే న క్షీయతే నో వికరోతి నిత్యః
విలీయమానే ఽపి వపు ష్యముష్మి న్న లీయతే కుమ్భ ఇ వామ్బరం స్వయమ్. 134

ఆత్మకు పుట్టుక లేదు, చావు లేదు, పెరుగుదల లేదు, తఱుగుదల లేదు, మార్పు లేదు; ఆత్మ నిత్యము. కుండ విగిసిపోయినను అందలి యాకాశమునకు సేగి లేనట్లు, దేహము నశించినను అందలి యాత్మకు సేగి లేదు. ౧౩౪

ప్రకృతివికృతిభిన్న శ్శుద్ధబోధస్వభావ స్సదస దిద మశేషం భాసయ న్నిర్విశేషః,
విలసతి పరమాత్మా జాగ్రదాది ష్వవస్థా స్వహమహ మితి సాక్షా త్సాక్షి
రూపేణ బుద్ధేః. 135

పరమాత్మ, ప్రకృతికంటెను దానివికృతులకంటెను వేఱైనది, శుద్ధజ్ఞానస్వరూపము, సదసద్రూపమగు సమస్తమును ప్రకాశింపజేయునది, నిర్విశేషమైనది, మెలకువ కల నిద్ర అను మూడవస్థలందును బుద్ధికి సాక్షిరూపమున 'నేను' 'నే' ననుచు వెలసియుండునది. ౧౩౫

నియమిత మన సాముం త్వం స్వ మాత్మాన మాత్మ
న్యయ మహ మితి సాక్షా ద్విద్ధి బుద్ధి ప్రసాదాత్
జనిమరణతరఙ్గాపారసంసారసిన్ధుం
ప్రతర, భవ కృతార్థో బ్రహ్మరూపేణ సంస్థః. 136

నియమితమనస్సుతోను ప్రసన్నబుద్ధితోను నీలోని యాత్మను సాక్షాత్కరించుకొనుము. 'ఇదే నే' నని యెఱుగుము. చావుపుట్టుక లనెడి కెరటాలతోడి యపారసంసారసాగరమును దాటుము. బ్రహ్మమవై కృతార్థుడ వగుము. ౧౩౬

అ త్రానాత్మ న్యహ మితి మతి ర్బన్ధ ఏషో ఽస్య పుంసః
ప్రాప్తో ఽజ్ఞానా జ్జననమరణక్లేశసమ్పాతహేతుః
యే నై వాయం వపు రిద మస త్సత్య మి త్యాత్మబుద్ధ్యా
పుష్య త్యుక్ష త్యవతి విషయై స్తన్తుభిః కోశకృద్వత్ ॥ 137

దేహము ఆత్మ కాదు. అజ్ఞానముచే దేహము నాత్మ యనుకొను భ్రమ కలుగుచున్నది. ఇది జీవునకు బంధము. దీనిచే జననమరణదుఃఖములును అసత్తైన దేహమును సత్యమనియు ఆత్మయనియు భ్రమించుటయు జరుగుచున్నది. తనతంతువులతో అల్లుకొన్న గూడే పట్టుపురుగునకు బంధమైనట్లుగా, ఇంద్రియవిషయములచే తాను పోషించుచు కడుగుచు కాపాడుచు నున్న దేహమే జీవునకు బంధ మగుచున్నది. ౧౩౭

అతస్మిం స్తద్బుద్ధిః ప్రభవతి విమూఢస్య తమసా
వివేకాభావా ద్వై స్ఫురతి భుజగే రజ్జుధిషణా
తతో ఽనర్థవ్రాతో నిపతతి సమాదాతు రధిక
స్తతో యో ఽసద్గ్రాహ స్స హి భవతి బన్ధ శ్శృణు సఖే. 138

అజ్ఞానవిమూఢుడు అవస్తువును వస్తువని తలంచును. వివేకము లేనప్పుడు పామును జూచిన త్రాడను తలంపు గలుగుచున్నది. త్రాడనుకొని పామును పట్టుకొన్న వాని కనర్థవ్రాతము పాటిల్లును గదా. అట్లే, ఓ సఖా, వినుమా, అసద్వస్తువును సద్వస్తువుగ గ్రహించు నాతనికి బంధము దాపురించును. ౧౩౮

అఖణ్డనిత్యాద్వయబోధశక్త్యా స్ఫురన్త మాత్మాన మనన్తవైభవమ్,
సమావృణో త్యావృతిశక్తి రేషా తమోమయీ, రాహు రి వార్కబిమ్బమ్. 139

అనంతశక్తివంతమగు ఆత్మ అఖండము, అద్వితీయము, నిత్యము నగు జ్ఞానశక్తితో భాసించునది. అట్టియాత్మను తమోమయమగు నావరణశక్తి - సూర్యబింబమును రాహువు కప్పివైచినట్లు - కప్పివైచుచున్నది. ౧౩౯

తిరోభూతే స్వాత్మ న్యమలతరతేజోవతి పుమా
ననాత్మానం మోహా దహ మితి శరీరం కలయతి
తతః కామక్రోధప్రభృతిభి రముం బన్ధకగుణైః
పరం విక్షేపాఖ్యా రజస ఉరుశక్తి ర్వ్యథయతి. 140

అమలతర తేజోవంతమగు నాత్మ మఱుగుపడినంతనే, ఆత్మ కానటువంటి దేహమే ఆత్మ యని జీవుడు మోహముచే తలచుచున్నాడు. తర్వాత విక్షేప మనెడి రాజసికమహాశక్తి కామక్రోధాదిబంధనగుణములచే జీవుని బాధపెట్టుచున్నది. ౧౪౦

మహామోహగ్రాహగ్రసనగళితాత్మావగమనో
ధియో నానావస్థా స్స్వయ మభినయం స్తద్గుణతయా
అపారే సంసారే విషయవిషపూరే జలనిధౌ
నిమ జ్యోన్మ జ్యాయం భ్రమతి కుమతిః కుత్సితగతిః. 141

జీవుడు బుద్ధి యనెడి యుపాధికి వశుడై, మహామోహ మనెడి మొసలినోట బడి, స్వస్వరూపజ్ఞానమును కోల్పోయి కుమతియు కుత్సితగతియునై, బుద్ధివికారములగు సుఖదుఃఖములను తనవిగా భావించుచున్నాడు. సంసార మనెడి యపారవిషయవిషజలనిధిలో మునుగుచు తేలుచు త్రిప్పట చెందుచుండును. ౧౪౧

భానుప్రభాసఞ్జనితాభ్రపఙ్క్తి ర్భానుం తిరోధాయ యథా విజృమ్భతే,
ఆత్మోదితాహఙ్కృతి రాత్మత త్త్వం తథా తిరోధాయ విజృమ్భతే స్వయమ్. 142

సూర్యునికిరణములవలన పుట్టువొందిన మేఘపంక్తి సూర్యునే మఱుగుపఱచి విజృంభించినట్లుగా, ఆత్మోదితమగు నహంకారము ఆత్మతత్త్వమునే మఱుగుపఱచి విజృంభించుచున్నది. ౧౪౨

కబళితదిననాథే దుర్దినే సాన్ద్రమేఘై
ర్వ్యథయతి హిమఝంఝావాయు రుగ్రో య థైతాన్
అవిరతతమసాత్మ న్యావృతే మూఢబుద్ధిః
క్షపయతి బహుదుఃఖై స్తీవ్రవిక్షేపశక్తిః. 143

ముసురుదినమున దట్టములగు మేఘములు సూర్యుని కప్పివేయగా, పెనుచలిగాలిచే బాటసారులు బాధపడునట్లు, గాఢాజ్ఞానపుటావరణశక్తి ఆత్మస్వరూపమును మఱుగుపఱుపగా, జీవుడు బహుదుఃఖముల పాలై నశించుచున్నాడు. ౧౪౩

ఏతాభ్యా మేవ శక్తిభ్యాం బన్ధః పుంస స్సమాగతః,
యాభ్యాం విమోహితో దేహం మత్వాత్మానం భ్రమ త్యయమ్. 144

బంధమును గూర్చునవి యీ రెండుశక్తులే. వీనిచే మోహితుడై జీవుడు దేహము నాత్మ యని భ్రమించి త్రిప్పటచెందుచున్నాడు. ౧౪౪

(సశేషము)

# పరమహంస ప్రబోధవాణి

ఒక బ్రహ్మసమాజభక్తుడు : ఆర్యా, భగవంతుని స్వరూపమునుగూర్చి యిన్ని విభిన్నాభిప్రాయము లుండుటకు కారణ మేమి? కొంద ఱీశ్వరుడు సాకారు డందురు, కొందఱు నిరాకారు డందురు. ఈశ్వరుడు సాకారు డని పల్కువారు, వివిధరూపములను బేర్కొనుచున్నారు. ఈ వివాద మంతయు నెందులకు?

శ్రీ రామకృష్ణుడు : తనకు కనిపించిన రీతిలో భక్తుడు భగవంతునిగూర్చి తలపోయును. నిజమునకు దేవుని విషయమున కలవరపాటే లేదు. భక్తు డెట్లో ఒకట్లు దేవుని సాక్షాత్కరించుకొనెనేని దేవుడే అతనికి ఈ విషయముల నన్నిటిని వివరించును. ఆవంకకు నీ వింకను అడుగు పెట్టనేలేదే. దేవునిగూర్చిన సర్వము నీ వెట్లెఱుగగలవు?

ఒక కథ విను : ఒకప్పు డొక డొకయడవిలో ప్రవేశించి ఒక చెట్టుపైనున్న చిన్న జంతువు నొకదానిని చూచివచ్చి మఱొకనితో "ఒక చెట్టుపై అందమైన యెఱుపువన్నె గల యొక జంతువును జూచితి" ననెను. "అడవికి పోయియుండినప్పుడు ఆ జంతువును నేనును జూచియున్నాను. దాని నెఱ్ఱది యనుచున్నావేమి? దానివన్నె ఆకుపచ్చ" అనెను రెండవవాడు. మూడవవాడు వీరిద్దఱి మాటలు కా దని "ఆ జంతువు వన్నె పసుపుపచ్చ" అనెను. అచ్చటికి ఇతరులును వచ్చిరి. ఆ జంతువువన్నె బూడిదవన్నె అని యొకడును, నీలము నెఱుపు కలిసినవన్నె అని యొకడును, నీలివన్నె అని యొకడును పల్కిరి. అంతట వారు కలహించుకొన నారంభించిరి. జగడమును పరిష్కరించుకొనుటకై అందఱును ఆ చెట్టునొద్దకే పోయిరి. దానిక్రింద నొకడు ఆసీనుడై యుండెను. వీ రడుగగా అతడు చెప్పిన జవాబు: "నేను వసించున దీ చెట్టుక్రిందనే. ఆ జంతువును నేను చక్కగా నెఱుగుదును. మీ రందఱు చెప్పినదియు నిజమే. దాని వన్నె యొకపుడు ఎఱ్ఱగను, ఒకప్పుడు పసుపుపచ్చగను, మఱొకప్పుడు నీలముగను ఊదాగాను, నలుపు ఎఱుపు గలిసిన వన్నెగాను ఉండును. అది ఊసరవెల్లి. ఒక్కొక్కప్పుడు దానికి ఏ వన్నెయు నుండదు. రంగు ఒకక్షణములో నుండును, మఱుక్షణములో నుండదు."

ఆలాగే, సదా దేవుని స్మరించుచుండు నాతనికే దేవుని యథార్థస్వరూపము తెలియును. అన్వేషించినవారికి దేవుడు వివిధ రూపములలోను వైఖరులలోను తన్ను జూపుకొనుచుండు ననియు నత డెఱుంగును. దేవుడు సగుణుడు, నిర్గుణుడుకూడ. ఊసరవెల్లి వివిధ వర్ణములలో నగపడగల దనియు ఒక్కొక్కప్పుడు దానికి ఏరంగు నుండ దనియు ఆ చెట్టుక్రిందనే వసించు నాత డెఱుగును. వ్యర్థవాదములతో మనోవ్యథ జెందువా రితరులు.

నిర్గుణ పరబ్రహ్మము తనకు తండ్రి యనియు గుణవిశిష్టమగు దైవము తనకు తల్లి యనియు కబీరు చెప్పుచుండెడివాడు.

ఏ భక్తున కే రూప మత్యంతప్రియమో ఆ భక్తున కారూపమున భగవంతుడు తన్ను కనిపించుచుండును. మహావీర భక్తుడగు హనుమంతునకై దేవుడు రామరూపము దాల్చెనని పురాణమున వ్రాయబడియున్నది.

వేదాంతతత్త్వమార్గమున వివేచింప బూనుకొన్నచో దేవుని రూపములును వైఖరులును అదృశ్యము లగును. అట్లు వివేచించుచు బోయిన తేలునట్టి నిగ్గు ఏమనగా - బ్రహ్మ మొక్కటే సత్యము, నామరూపాత్మకమగు

జగత్తు మిథ్య. తా నొక భక్తుడ నను స్మృతి మానవున కున్నంతవఱకు నతనికి దేవుని రూపములు కననగుచుండును, దేవు డొకవ్యక్తి అని యతడు భావింపనగుచుండును. వివేకదృష్టితో చూతుమేని భక్తాహంకారమే జీవుని దేవు నుండి రవంతదూరమున నుంచుచున్నది.

విగ్రహములును కాళి ప్రతిమలును మూడున్నఱ మూరల యెత్తుగ నుండుటకు కారణ మేమో ఎఱుగుదువా? దూరమే కారణము. సూర్యబింబము చిన్నదిగా కనబడుటకును దూరమే కారణము. సమీపమునకు బోవుదుమేని ఆబింబము మన ఆకళింతలో నిముడనంతటి పెద్ద దనుట కనఁగును. 'కృష్ణ' 'కాళి' మూర్తులు శ్యామవర్ణము గలవిగా నుండు టెందులకు? దూరమే కారణము, తటాకోదకమునకువలె. దూరమునుండి చూచిన తటాకోదకము పచ్చగనో నల్లగనో నీలముగనో కనిపించును. సమీపించి నీటిని చేతి కందుకొని చూచిన దాని కెట్టిరంగును లే దనుట తెలియును. ఆకాశము నీలముగా నగపడుటకును కారణము దూరమే. సమీపింపుము. దాని కెట్టి వన్నెయు లేదనుట తెలియనగును.

కావున చెప్పుచున్నాను-వేదాంత తర్కపు వెలుగున బ్రహ్మమునకు గుణములు లేవు. పరమాత్మస్వరూప యాథార్థ్యము వర్ణింప శక్యముకాదు. కాని, నీవ్యక్తిత్వము నిజముగ నుండువఱకు జగత్తును సత్యమే, దేవు డొక వ్యక్తి అనుటయు సత్యమే, దేవునకు వివిధ రూపము లుండుటయు సత్యమే.''

* * *

ఒక మార్వాడిభక్తుడు: మహాశయా, సగుణబ్రహ్మోపాసన మనగా నేమి? నిర్గుణ నిరాకార బ్రహ్మోపాసన మనగా నేమి?

శ్రీరామకృష్ణుడు: మీతండ్రిగారి ఫోటో చూచినప్పుడు వారు నీతలంపునకు వచ్చునట్లు విగ్రహము నుపాసించునప్పుడు పరతత్త్వ స్వరూపము తళుక్కుమని గోచరించును.

సాకారబ్రహ్మ మన నెట్టిదో ఎఱుగుదువా? విశాల జలాశయమున లేచు బుడగలవలె బ్రహ్మాండమగు చేతనాకాశమునుండి దివ్య రూపము లుత్థితములై కననగుచుండును. భగవ దవతార మా రూపములలో నొక్కటే. దివ్యావతారమూర్తి చెయ్దముల ద్వారా ఆదిశక్తి క్రీడించును.

వట్టి పాండిత్యమున నేమున్నది? తహతహపడు హృదయముతో దేవునకై ఆక్రందించు నతడు దేవుని బడయగలడు. అందుకు పెక్కు విషయముల పరిజ్ఞానము ఆవశ్యకము కాదు.

ఆచార్యుడుగ నుండు నాతనికి వివిధ విషయాల పరిజ్ఞాన మావశ్యకము. ఒరులను జంపుటకు కత్తులు డాళ్ళు కావలయును. ఆత్మహత్య చేసికొనుటకు సూది చాలును, చిఱుకత్తి చాలును.

'నేను' ఎవరో తెలిసికొన ప్రయత్నము సాగించినచో తుదకు దేవుని గననగును. 'నేను' ఎవరు? - మాంసమా, ఎముకలా, రక్తమా, క్రొవ్వా, మనస్సా, బుద్ధియా అని వివేచించుచు బోయినచో ఇం దేదియు నీవు కా వనుట తుదకు స్పష్టమగును. 'నేతి నేతి' 'ఇది కాదు ఇది కాదు' అను మార్గ మిదే. ఆత్మను తెలిసికొనుటయు స్పృశించుటయు శక్యము కాదు. ఆత్మ నిర్గుణము.

అయినను భక్తిమార్గమున దేవుడు సగుణుడే. భక్తుని దృక్పథమున శ్రీకృష్ణుడు బ్రహ్మము, అతని నిలయము బ్రహ్మము, అతనికి సంబంధించిన ప్రతిదియు బ్రహ్మము.

# శ్రీ రామ పంచరత్నములు

## శ్రీ చేకూరి సిద్ధకవి

శ్రీరమణీయసూర్యకులసింధుసుధాంశుసమానమూర్తికిన్
సారసపత్రనేత్రునకు సన్మణికుండలభాసమానశృం
గారకపోలయుగ్మునకుఁ గారుణికాగ్రణి కాశ్రితార్తిసం
హారికి లక్ష్మణాన్వితున కారఘురామున కేను మ్రొక్కెదన్. ౧

ఘనవిద్యుత్ప్రవిభాసితాంగునకు విఖ్యాతోగ్రవీరావతా
రునకున్ శ్రీరఘురామచంద్రునకు నిర్ధూతారికిన్ సిద్ధదే
వనికాయస్తుతసద్గుణాకరునకున్ భక్తామరానోకహం
బునకున్ శ్రీపతికిన్ సలక్ష్మణునకున్ మోదంబునన్ మ్రొక్కెదన్. ౨

వరదివ్యాస్త్రశరాసనోజ్జ్వలునకున్ వారాశిదుర్వారదు
స్తరగర్వాపహదీప్తకాండునకు దైత్యధ్వంసికిన్ వాలిసో
దరసన్మిత్రునకున్ సలక్ష్మణునకున్ దాసార్తినిస్తారికిన్
హారికిన్ శ్రీరఘురామచంద్రునకు నేనశ్రాంతమున్ మ్రొక్కెదన్. ౩

అరవిందాసనశైలనిర్దళనముఖ్యాదిత్యపూజ్యాంఘ్రిపం
కరుహద్వంద్వునకున్ సలక్ష్మణునకున్ క్ష్మాభర్తకున్ గాంచనాం
బరసందీప్తకటిప్రదేశునకు రామస్వామికిన్ సేవకో
త్కరమాతాపితృసన్నిభాత్మునకు సద్భక్తిన్ వెసన్ మ్రొక్కెదన్. ౪

సకలజగజ్జనార్చితలసత్పదపద్మునకున్ బయోరుహా
ప్తకులసముద్రచంద్రునకుఁ బంకజనేత్రునకున్ ధరాధినా
యకునకు లక్ష్మణాన్వితున కాస్యతిరస్కృతపద్మవైరికిన్
బ్రకటయశోవిశాలునకు రామున కేను నమస్కరించెదన్. ౫

అనుదినమున్ ద్రికాలములయం దతిభక్తిని బంచరత్నముల్
జనులు పఠించినన్ దురితజాలవిమోచనులై యిహంబునం
దనయము సౌఖ్యసంపదల నంది, ముదంబును జెంది యంతమం
దనుపమమోక్షమున్ గరతలామలకంబుగఁ గాంతు రెంతయున్. ౬

# రామగుణార్ణవము

## వేం. గోపీనాథ

శ్రీమన్నారాయణుడు రఘురాముడుగ అవతరించినప్పుడు తనలోని యనంతకల్యాణ గుణగణములను ప్రకాశపఱచి విశేషమునకు సార్వకాలికాదర్శ పురుషుడుగా నెగడినాడు. కవిరాజైన వాల్మీకియు కపిరాజైన హనుమంతుడును 'సీతారామ గుణగ్రామ పుణ్యారణ్య విహారు' లనియు, ఏలయన వారు 'విశుద్ధ విజ్ఞాను' లనియు భక్తమహాకవి తులసీదాసు ప్రస్తుతించెను గదా. శ్రీరామచంద్రు నవతారముచే మహితమును ధన్యమునైన యీ చైత్రమాసమున వాల్మీకి మునీంద్రుని రామ గుణానుభూతి ప్రకారము నించుకంత స్మరింతము గాక. అది శ్రీమద్రామాయణమున అయోధ్యా కాండములో తొలి సర్గలలో కానవగును—

భరతుడు మేనమామ యింటికేగి అచట నుండెను. భరతపరతంత్రుడగు శత్రుఘ్నుడును అతనితోగూడ నచ్చటనే యుండెను. అచ్చట వారికి అన్ని సౌఖ్యములును ఉపలాలనములును ఉన్నను, వారు తఱచు వృద్ధభూపాలుడగు దశరథుని స్మరించుచు "అయ్యో తండ్రి వృద్ధుడయ్యెనే, రాజ్యభారమును వహింపజాలడే, ఆయనకు శుశ్రూషసేయ దగిన కాలము దాటి పోవుచున్నదే" అని చింతించుచుండెడివారు. దశరథుడును "ఎంత సంపద యుండిన నేమి? బిడ్డ లిద్దఱును దగ్గఱ లేకుండుట పెద్ద కొఱతగానే యున్న"దని వీరిని తలంచుకొనుచుండెను

దేహమునుండి వెలువడిన నాలుగు బాహువులవలె కుమారులు నలుగురును తండ్రికి ప్రియులే. ప్రాణులలో నెల్ల బ్రహ్మ ఎట్లో అట్లే కొడుకులలో మహాగుణశాలియు [illegible]ంతుడు నగు రాముడు తండ్రికి నిరతిశయ ప్రీతికరు డయ్యెను. రావణుని వధింపగోరి దేవతలు ప్రార్థింపగా సనాతనుడగు విష్ణువే గదా రాముడుగ నవతరించి యున్నాడు. కావున తండ్రి కత్యంతప్రీతి యతనియందు గల్గుట వింతకాదు. తల్లియగు కౌసల్యయు – వజ్రపాణియైన యింద్రునిచే నదితి ప్రకాశించి నట్లు – మహాతేజస్వియగు కుమారునిచే తాను ప్రకాశించెను.

ఆ రాముడు మంచి చక్కదనము గలవాడు చక్కదనమే కాదు, ఔదార్యాది గుణములును గలిగి యుండును. అతడు వీర్యవంతుడు. అన్యుల గుణములకు దోషత్వ మారోపించు అసూయ అతనికి లేదు. దేవలోకమం దదితియొక్కతె అతనికి సాటియైన యింద్రుని గన్నది కాని, భూలోకమందో కౌసల్య తప్ప తక్కిన యెవ్వతెయు అట్టి కొడుకును గన్నదికాదు. మఱియు నతడు కోపములేని తిన్నని స్వభావము గలవాడు. కావుననే ఎవరును అతనితో పరుషముగా బలుకరు. ఒకవేళ ఎవరైన పరుషముగా బలికినను వారి కతడు బిరుసుగా మాఱు పల్కడు, మృదువుగానే మాటాడును. వేడుకకొఱకో, ప్రతిఫలము కోరియో, మనస్సు లేకయో, అతి స్వల్పముగానో, మఱి ఎట్లో ఎవరేని ఒక యుపకారము నొక్కమాఱు చేసినను, ఆయొక్క యుపకారమునకే అతడు సదా సంతోషించుచుండును, మఱి యపకారములను నూర్లకొలదిగ తనకు చేసినను, అతడు ఆత్మవంతుడు గాన, వానిని తలపనైన తలపడు. ఆయుధవిద్య నేర్చుకొనుచుండిన కాలము మొదలు అతడు, సజ్జను లెవరు వచ్చినను, ఊరు కులము పాటింపక, అందఱిని సమముగా చేరదీసెడివాడు. సదాచార సంపన్నులతో ఆచార విశేషములను పరామర్శించును, పరి

పక్వ జ్ఞాన సమంచితులతో వేదాంతరహస్యమును గూర్చి సల్లాపించును, పెద్దలతో-పరంపరాగతములైన సంప్రదాయ విశేషములను గూర్చి ప్రసంగించును. సజ్జనసంగతి లేక యతడు క్షణకాలమైన నుండడు. అతని కెల్లప్పుడును లోకరక్షణ చింతే.

అతని మాటలు మధురములుగ నుండును. ఎంతటి క్రిందిమెట్టువానితోనైనను సరే తానే ముందుగ మాటాడును. పరులకు హితముకాని మాట అతని నోట వెలువడదు. ఆశ్రితుల విరోధుల నిరసింప గల యమోఘవీర్యము గలవాడైనను గర్వి కాడు. ఎంత ఘనకార్యము సాధించియు, తాను కావించినది అకించిత్కారమని యతడు భావించును. అసత్కావ్యములను జదువడు, అసత్యము పలుకడు. సదాచారసంపన్నులును పరిపక్వజ్ఞానసమంచితులును పెద్దలు నగు వారి నతడు ఎదుర్కొనిపోయి పూజించును, పండితులను పామరులను ఏకరీతి రంజిల్లజేయును. కావున వారందఱు అతనియం దనురక్తులై యుందురు. బ్రాహ్మణభక్తియు, దీనుల పట్ల దయయు, సకలప్రాణులకును సకలప్రాణుల వారినుండియు అభయమిచ్చు నిత్యవ్రతమును, శుచితయు, ఇక్ష్వాకువంశక్రమానుగతమగు శరణాగతరక్షణదీక్షయు నతనికి గలవు. దుష్టులను నిగ్రహించి ప్రజలను పరిపాలించు క్షత్రి ధర్మము నతడు బహుమానించుచుండెను. స్వవర్ణమునకును స్వాశ్రమమునకును విహితములైన ధర్మముల ననుష్ఠించుటచే కీర్తియు, కీర్తిచేత స్వర్గప్రాప్తియు గల్గునని తెలిసి యతడు స్వధర్మమును నిష్ఠతో అనుష్ఠించెడివాడు. నిష్ఫలములును నిషిద్ధములునగు కార్యములం దతనికి ఆసక్తి లేశమేని లేనే లేదు. ధర్మ విరుద్ధములగు కథలును గ్రామ్యాలాపములు నతనికి నచ్చవు. లౌకిక వైదిక విషయములను సప్రమాణముగ వివరించుటయందు నతడు బృహస్పతి కెనయైనవాడు. అతని ఆరోగ్యమును యౌవనమును రూపరామణీయకమును వాగ్మితయు దేశకాలపరిజ్ఞానమును అసాధారణములు. పురుషుల నొక్కమాఱు చూచినంతనే వారి హృదయములెంతయు నతడు తెలిసికొనును. లోకమునందు సాధువనిన రాము డొక్కడే అని అందఱ నిర్ణయము.

ఇంతవఱకు చెప్పబడినవే కాక యింకను అనేకశ్రేష్ఠగుణములతో గూడియున్న యా రాజకుమారుడు తనకల్యాణగుణములనుబట్టి ప్రజలకు బహిఃప్రాణమువలె మిక్కిలి ప్రియుడై యుండెను. అతడు చక్కగా వేదముల నధిగమించి వ్రతముల నాచరించి సమావర్తనము జరపుకొన్నవాడు. సాంగములగు వేదముల యర్థమును జక్కగా నెఱిగినవాడు. విలువిద్యయం దతడు దశరథునికంటె నధికుడు. తల్లివంశమును తండ్రివంశమును రెండును వరిష్ఠములు కావున నతనిలో దోషగంధమైన నుండుట నిరవకాశము. ఎట్టి కలతలయందు నతనిమనస్సు కలక జెందదు. త్రికరణముల నత డొక్కరీతి నడచును. బ్రాహ్మణులచే జక్కగా శిక్షితుడైన యతనికి ధర్మార్థకామమోక్షములనుగూర్చిన పరిజ్ఞానము కరతలామలకము. అతడు లోకసాంకేతికాచార సమాచరణదక్షుడు, స్మృతిమంతుడు, ప్రతిభావంతుడు, వినీతుడు, ఇంగితాకారగోపనసమర్థుడు, ఫలించువఱకు మంత్రమును ప్రకటము కానీనివాడు, ప్రశస్తమంత్రయుక్తుడు, అమోఘక్రోధహర్షుడు, దానమునుగాని ఆర్జనమును గాని కాల మెఱిగి చేయువాడు; అతనిభక్తి దృఢము, అతనిప్రజ్ఞ స్థిరము, చెడ్డవారిని చేరదీయడు, కటువుగ మాటాడడు, సోమరికాడు, పొరపడడు, తప్పు ఎదుటివానిలో నున్నను

తనలో నున్నను గుర్తించును. సత్సంగ్రహ ప్రగ్రహణములందును ప్రగ్రహానుగ్రహము లందును రాజనీతులందును అతడు విచక్షణుడు. పూవునుండి తేనెను తుమ్మెదగ్రహించినట్లు అతడును ప్రజల కెట్టిపీడయు గలుగనీయక వారియొద్దనుండి ధనమును రాబట్టుకొనును. ఆ ధనమును శాస్త్రదృష్టమార్గమున వ్యయింప నెఱిగినవా డతడు. న్యాయవైశేషిక వేదాంతాదిశాస్త్రసమూహములందును సంస్కృత ప్రాకృతభాషలలోని కావ్యనాటకాలంకారాదులందును నిపుణత అతని కుండెను ధర్మార్థములను సంగ్రహించి సుఖతంత్రుడై అతడు కర్తవ్యకార్యములందు దుత్సాహవంతుడై యుండెను. ఏనుగులను గుఱ్ఱములను వశపఱచుకొని వాని నధిరోహించుటయందును వైహారిక శిల్పజ్ఞానమునందును ఆ వీరుడు చతురుడు.

సాటిలేని బుద్ధిబలమున శ్రీరాముడు బృహస్పతికి సమానుడు, శౌర్యమున దేవేంద్రునంతటి వాడు, బలమున వాయుదేవునకు సరి, సహనమందు భూమివంటివాడు, చక్కదనమున మన్మథున కుద్ది, ధైర్యమున హేమాచల నిభుడు – ఇట్లు సర్వప్రజాకాంతములును జనకునకు ప్రీతిసంజననములునైన ప్రసిద్ధగుణములచే ఆ రాముడు కిరణములచే వెలుగొందు సూర్యదేవునిబోలి యభిరాము డయ్యెను. అట్టి గుణసంభావితుని, ప్రచండవిక్రమక్రముని అఖిల దిక్పాలకసముని రాముని భూదేవి తనకు విభుడని తలచెను. రాజ్యాభిషేకార్హత వెలుగొందె ననుట.

---

# హిందూసిద్ధాంతము - భారతదేశభవిష్యత్తు

భారతదేశమునకు 1947 వ సంవత్సరములో రాజకీయస్వాతంత్ర్యము గల్గినది. ఆత్మానుభూతి ప్రవణములైన ప్రాచ్యదేశాలకు కేంద్రస్థానీయము కదా భారతదేశము. ఈ యిరువది నాల్గేండ్లుగను భారతదేశమునకు పశ్చిమ యూరపు ఉత్తరమెరికాదేశాలతోను అచట పెంపొందుచున్న సంస్కృతితోను మఱింత ప్రగాఢసంబంధ మేర్పడినది. వేలకొలది భారతీయయువకులు ఉన్నతవిద్యకై పాశ్చాత్యవిశ్వకళాపరిషత్తుల కేగుచు విజ్ఞానశాస్త్రశిల్పాది విద్యలు అచ్చటి సాంఘికార్థికజీవితముపై చూపుచున్న ప్రభావమును గుర్తించుచునే యున్నారు. ఐహికవిషయములలో భారతదేశము వెనుకబడియున్నందుకు వారు నిరుత్సాహులై, ఆ వెనుబాటును తొలగించి, ప్రజల జీవితసౌఖ్యముల హెచ్చించి, ప్రపంచసమాదరమును బడయవలె నని తహతహపడుచున్నారు. ఇహలోకసుఖసాధనైకప్రవణమగు పాశ్చాత్యసంస్కృతికిని ఆముష్మికాధ్యాత్మిక సాధనైకప్రవణమగు భారతీయసంస్కృతికిని గల అంతర మపార మని దుస్తర మని వారి విశ్వాసము. భారతీయులు తమకత్యంత ప్రియములైన పారమార్థికలక్ష్యములను కొన్నింటిని వదలుకొన్ననే గాని ఈ దేశమునకిప్పటి ప్రపంచమున చక్కని సమన్వయము గల్గ దని – పాశ్చాత్యీకృతులైన వీరి వాదము. కాని అట్లు ఆధునికాశయములను పైని గ్రుక్కితిమేని భారతీయుల వీర్య మెందుకొని పోదా – అని ఈ దేశమునను విదేశములందును కొందఱడుగుచున్నారు. ఆ ప్రశ్ననే మఱొకరీతిని

రూపొందింపవచ్చు: భారతీయుల యాచార సంప్రదాయములకు రూపేర్పఱచి వానిని వేల కొలదిసంవత్సరములుగా స్థిరముగ నిల్పిన హిందుతత్త్వమునకు ఆధునికప్రపంచమున స్థానము లేదా? తన ఆధ్యాత్మికసంప్రదాయమును వదలుకొన్నచో భారతదేశమునకు బ్రతుకు కలదా?

నవ్యభారతము రూపుదాల్చినది 1757 కును 1857 కును నడిమిశతాబ్దిలో. ఆంగ్లేయుల ప్రభుత్వమప్పుడు దేశమున స్థిరపడి బలపడినది. ఆంగ్లవిద్యావిధానము నెలకొన్నది. ఆంగ్ల విద్యావిధానముద్వారా భారతీయులకు పాశ్చాత్యనాగరకత తెలియవచ్చినది. తమ సంఘ మెంత శోచనీయదశలో నున్నదియు వారు గుర్తించిరి. సాంఘికార్థిక పారమార్థిక విషయములలో భారతదేశ మెంతో అధోగతి నందియుండిన దని వారు గ్రహించిరి. సంఘ సంస్కారాభినివేశ ముత్కట మగుటచే కొందఱు క్రైస్తవమతమును ఆంగ్లజీవితవిధానము నవలంబించిరి. కొందఱు భారతీయులచే తమ దేశీయాధ్యాత్మికవిజ్ఞానసంపదను గుర్తింప జేయుటకును ఈ యాంగ్లవిద్యావిధానమే తోడ్పడినది. రాజారామమోహనరాయి - తిలక్కు - గాంధి - సుభాసచంద్రబోసు - మున్నగువారి దేశభక్తి నుద్దీపింప జేసి భారతీయ విజ్ఞానధ్వజములనుగా వారిని వెలుగొందజేసినది యీ యాంగ్లవిద్యావిధానమే. భవిష్యద్భారత దేశవైభవభవననిర్మాణ మొనర్పవలె ననిన ఆధ్యాత్మికవిజ్ఞానసంపద అను పునాది అవశ్యముండవలయు ననుట వీరికి తెల్లమయ్యెను.

పాశ్చాత్యసంపర్కముచే భారతదేశమున నావిర్భవించిన మతసంఘసంస్కారోద్యమములు రెండు. మొదటిది బ్రాహ్మసమాజము. ఫ్రాంసు దేశములోని విప్లవమును పాశ్చాత్యుల 'యీశ్వరవాద' తత్త్వమును ఆదర్శములుగ గొని బ్రాహ్మసమాజీయులు హిందువుల క్రతుకలాపాలలో పెక్కింటిని ఖండించిరి, గుడులలో సాగు విగ్రహారాధనమును నిషేధించిరి, వర్ణవ్యవస్థను త్రోసిరాజనిరి. స్త్రీవిద్యను వర్ణాంతర వివాహములను వర్ధిల్లజేయవలయు ననిరి. కొందఱు బుద్ధిమంతులు పలుమతములనుండి గ్రాహ్యాంశములుగ తమకు తోచినవానిని సేకరించి రూపొందించిన యీ యుద్యమము సామాన్యప్రజల జీవితమున కందుబాటు కాలేదు.

రెండవ ఉద్యమము ఆర్యసమాజమువారిది. దీనికి ప్రారంభకుడు దయానందసరస్వతిస్వామి. ఆంగ్లవిద్యావిధానముద్వారా దేశములో జొచ్చుకొనుచున్న పాశ్చాత్యవిజ్ఞానమునకు హిందూసనాతనమతానుయాయుల ప్రతిఘటనమే ఈ యుద్యమముగా రూపుదాల్చినది. దయానందుడు సంస్కృతభాషాపండితుడు కాని ఆయనకు ఆంగ్లవిజ్ఞానమునుగూర్చిన, భౌతిక శాస్త్రరంగమున పాశ్చాత్యులు సాధించిన సమున్నతినిగూర్చిన పరిజ్ఞానము బొత్తిగా లేదు. భారతదేశమందున్న చెడుగులను బాగుపఱచుట కాయన యుపదేశించిన మార్గము "మరల వేదములను, ముఖ్యముగా కర్మకాండను ఆశ్రయింపు" డనుట. జ్ఞానకాండలో, ఉపనిషత్తులలో, ఆయన కాసక్తి అంతగా లేదు. తక్కిన సంస్కర్త లందఱివలెనే దయానందుడును హిందూసంఘములో నున్న అన్యాయ్యములను పెక్కింటిని గుర్తించి, వానిని చక్కజేయుటకై 'విద్యావ్యాప్తి' 'వితంతూద్వాహము' 'వర్ణవ్యవస్థరద్దు' మున్నగువానిని బోధించెను. వేదములలోని జ్ఞానకాండమును మాత్రమే బ్రాహ్మసమాజీయులవలంబింపగా కర్మకాండమునుమాత్రమే ఆర్య

సమాజీయు లవలంబించిరి. కాని మానవు నాధ్యాత్మికజీవితాభివృద్ధికి కర్మజ్ఞానములు రెండు నావశ్యము లనుటను ఆ యుభయసమాజములవారు విస్మరించిరి. కర్మకాండకును జ్ఞానకాండకును సమన్వయ మేర్పఱచిన మహానీయుడు శ్రీరామకృష్ణుడు. హిందుసిద్ధాంతమందలి వివిధకర్మల అనుష్ఠానముతో ఆరంభమైన యాయనజీవితము ఉపనిషత్ప్రతిపాదితమైన బ్రహ్మాద్వైతసాక్షాత్కారమున పర్యవసించినది. వేదాల సనాతనధర్మపు టన్నివిధములను ఆయన తన జీవితమున ప్రదర్శించి 'రామ' 'కృష్ణ' 'బుద్ధ' 'చైతన్య' ప్రముఖావతారపురుషుల కోవకు చేరినాడు. భారతదేశ మెప్పు డెప్పుడు క్రొత్తవికాస మొందినను అందుకు మొదటిమెట్టు పారమార్థికపరత్వ పునర్భవమే. కావున శ్రీరామకృష్ణుడే నవ్య భారతమున ప్రథమ దేశీయనాయకు డని చెప్పవచ్చు. భారతదేశస్వాతంత్ర్యోద్యమము దక్షిణేశ్వరమున నారంభమైనదనియు చెప్పవచ్చు. ఆధ్యాత్మికసామ్రాజ్యమే భారతీయుల స్వారాజ్యము. దానిని సాధించువిధానమును శ్రీరామకృష్ణుడు చూపెను. అతని శిష్యవరేణ్యుడు శ్రీ వివేకానందస్వామి భారతీయుల ఆధ్యాత్మికసందేశమును అమెరికాప్రముఖపాశ్చాత్య దేశములకు కొనిచనెను. భారతీయులకు స్వామిజీ ''మీ పేదఱికమును నిరక్షరాస్యతయు సంఘదుఃస్థితియు తొలగవలె ననిన మీరు పాశ్చాత్యులయొద్దనుండి భౌతికశాస్త్రసాంకేతికవిద్యలను నేర్వవలయు'' నని బోధించినాడు. ఆయన ఇటు అటు విశ్వ లాపి. ప్రాచ్యుల పారమార్థిక విజ్ఞానమును పాశ్చాత్యుల భౌతికవిజ్ఞానమును జతపఱచి అఖండజగత్తును రూపొందింపవలె నని కలలు కన్నవా డాయన.

మేరీతి నుండును? ఏ దేశపు భవిష్యత్తును గూర్చి చెప్పవలయు నన్నను, ఆ దేశపు గతకాల చరిత్రను పరిశీలించి చెప్పవలయును. ప్రాచీనకాలమున భారతదేశమున కుండిన సమున్నతుల విషయమున – ఇప్పటి చదువులు చదువుకొన్న భారతీయులకు పెక్కండ్రకు నమ్మకము కుదరకున్నది. మూడువేలేండ్ల కాలము భారతదేశమును అత్యుచ్చస్థాయిలో నుంచియుండినది ఆ దేశసంస్కృతి. ఏడువందల సంవత్సరములుగా మాత్రము భారతదేశము అధఃపతితమై యున్నది. నవ్యవిద్వాంసులు మూడువేలేండ్ల సమున్నతిని విస్మరించి ఏడువందలయేండ్ల దుఃస్థితినిమాత్రము గుర్తించి ఈ పతనమునకు కారణము వీరిసంస్కృతియే అని అవిచారితముగ నిర్ణయించుచుందురు. భారతదేశము వివిధవిదేశపాలకుల యేలుబడిలో నుండిన కాలము దాదాపు వేయేండ్లు. ఆ పాలకులు దేశీయసంస్కృతిని రూపుమాపుటకును, విదేశీయసంస్కృతిని భారతీయుల నెత్తిని రుద్దుటకును బలాత్కారవిధానముల ననుసరించిరి. వానిని ప్రతిఘటించి భారతదేశము పోరాడవలసివచ్చెను. ఈ కాలమున భారతీయులలో పురోగమన ప్రవణత తగ్గి ప్రాతవడిన సంప్రదాయముల పట్టుకొని యూగులాడు నభిరతి మొగ్గినది. భారతము స్వతంత్రదేశముగ నున్నప్పటి చరిత్రను జదివినచో నిజముగ ఆ దేశమున కున్న గొప్పతన మవగత మగును. ఆ కాలమున భరతఖండమునకు విశ్వవ్యాప్తి చేకుఱెను. శిల్ప – సంగీత – సాహిత్య – తత్త్వశాస్త్రరంగములలో భారతదేశ మపూర్వాభ్యున్నతి నధిగమించినది.

శంకరాచార్యులకాలమునకు తరువాత హిందుతత్త్వశాస్త్రజ్ఞులు కొందఱు భౌతిక

ప్రపంచమును ఐహికజీవితమును నిరసింప నారంభించిరి. హిందువులకు పరమప్రమాణము లైన వేదములు జీవితము వాస్తవమే అను దృక్పథమునే మనకు కలుపుచున్నవి. అవి 'జగత్తు లేదు పో' మ్మనుట లేదు – ''యచ్చ కిఞ్చి జ్జగ త్యస్మిన్ దృశ్యతే శ్రూయతే ఒపి వా అన్త ర్బహి శ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః' 'జగత్తులో మనకు కనబడుచు వినబడుచు నున్న ప్రతిదానికిని లోపలను వెలుపలనుగూడ వ్యాపించి నారాయణుడున్నాడు'',

కలఁ డంబోధిఁ, గలండు గాలిఁ, గలఁ డా
కాశంబునం, గుంభినిం
గలఁ, డగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్
ఖద్యోతచంద్రాత్మలం
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ
గవ్యక్తులం దంతటం
గలఁ, డీశుండు గలండు, తండ్రి, వెదకం
గా నేల యీయా యెడన్?
ఇందుఁ గలఁ డందు లేఁ డని
సందేహము వలదు, చక్రి సర్వోపగతుం,
డెందెందు వెదకి చూచిన
నందందే కలఁడు, దానవాగ్రణి, వింటే.

అని సర్వమును విష్ణుమయమని యే ప్రమాణ గ్రంథములు తెలుపుచున్నవి. జీవితమునకును విశ్వమునకును గల ఆధ్యాత్మిక సార్థకతను వివరించుచు వేదకాలఋషులు భారతీయాధ్యాత్మిక సంస్కృతికి ప్రారంభకులైరి. కేవలము భౌతిక జడశక్తులు పరమాణువుల కలిపియుంచుటచే రూపొందిన దీ జగత్తనుట కాదు వారి యభిప్రాయము. ఉన్నదంతయు బ్రహ్మమే. సముద్రమున కెరటము లెట్టివో, మండు నిప్పునకు 'రవ'లు ఎట్టివో – సృష్టిలోని వస్తు సముదాయ మట్టిది. వానికి ఉత్పత్తిస్థాన మాత్మ, ఉనికిపట్టు ఆత్మ, లయించుస్థానమును ఆత్మయే. అవినాశ్యమును నిత్యమును అమరమునగు ఆత్మ యనుటే మానవుని యథార్థస్వరూపము. మాయావశుడై మానవుడు తన్ను 'ఈ పేరి వాడను' 'ఈరూపమువాడను' 'జననమరణ సుఖదుఃఖ పుణ్యాపాపాది ద్వంద్వములకు లోబడినవాడ' నని భావించుచుండును. మానవుని మాయావశ్యతను దొలగించి దివ్యత్వము నావిష్కరించుటే ఆస్తిక ధర్మలక్ష్యము. విశ్వవ్యాప్తమైయున్న పరమాత్మ అద్వైతము, శివము ఆనందపూర్ణము అమరము నిర్భయము. ఆ పరమాత్మ జగత్తును తననుండి వెలువఱచుచున్నది, దానికి తా నాధారమై యున్నది, తుదకు దానిని తానే ఉద్ధరించుచున్నది. హిందువుల యభిప్రాయమున ఆస్తిక్య మనగా సాక్షాత్కారమే కాని, ఏవో కొన్ని సిద్ధాంతాలను అనుసరించుట మాత్రమే కాదు. మానవునిలోని జఘన్యప్రకృతి నణచి ఉదాత్తప్రకృతి నుద్దీపింప జేయు విధానమును హిందు సిద్ధాంతము కలుపుచున్నది. మానవుడు ఈశరీర ముండగనే బ్రహ్మజ్ఞానముచే ముక్తుడు కావచ్చుననుట ఉపనిషత్తుల ప్రతిపాదనము. ఆత్మైక్యమును సర్వమత సామరస్యమునే హిందూయోగు లుపదేశించిరి.

పైని పేర్కొనబడిన నిత్యసత్యము హిందు నాగరకతను జీవితవిధానమును రూపొందించి, వాని కాధారములై యున్నవి. ఇవే భరతఖండవాసుల కందఱికి నత్యంతప్రియములై, వారికి పారమార్థికైక్యము సమకూర్చి – విదేశీయ దండయాత్రల వలని కల్లోలము లెంత పోటెక్కినను, భారతదేశమును విచ్ఛిన్నము కానీయక నిల్పినది. ఈ సత్యములకును పాశ్చాత్యుల శక్తిమహిమలను పెంపొందించిన నవ్యవిజ్ఞాన శాస్త్రమునకును సాంకేతికవిద్యకును

పొందుపొసగదని పాశ్చాత్యవిద్య నధికరించిన భారతీయయువకులు పొరపడుచున్నారు. నవ్య విజ్ఞాన సాంకేతికవిద్యలు పాశ్చాత్యులకు మహోన్నతులను సాధించి యిచ్చిన వనుట నిజమే. ఈ శాస్త్రవిజ్ఞానము గ్రుడ్డి నమ్మకాలకు గొడ్డలిపెట్టై పనివడినది. అది తర్కము నకు శోధనకు ప్రయోగమునకు నిలువగల వానినే అంగికరింపు డనును. సాంకేతిక విద్యకు పాశ్చాత్య సంఘముపై నున్న ప్రభావము మిక్కుటము. ప్రాచ్యదేశాలలో ఏటేట లక్షల కొలది ప్రజలను పొట్ట నిడుకొనుచున్న మన్నె జ్వరము, విషూచిక, మసూచి, విషజ్వరము, మారి, అతిసారము మున్నగు వ్యాధులు పాశ్చాత్యదేశాలలో వైద్యపు టదుపుకులోబడి పోయినవి. ఆ దేశాలలో విద్య చక్కగ వ్యాపించినది. మానవుల జీవితప్రమాణము హెచ్చినది. జీవితసౌకర్యములు వసతులు సమృద్ధిగ నున్నవి. పాశ్చాత్యదేశాలలో మతశ్రద్ధ గల సామాన్యుడు క్రైస్తవ 'యూదియ' సిద్ధాంతాలతోను క్రతుకలాపాలతోను సంతృప్తి చెందుచుండును. చదువుకొన్నవారికి నచ్చునవి నైతికాదర్శములును, జనహిత సంపాదనమును.

జీవిత సౌఖ్యముల సమృద్ధిలో అత్యంత సమున్నతి నందిన పాశ్చాత్యుల దేశాలలో ప్రజలు అసంతుష్టికిని ఆశాభంగములకు లోనైయున్నారు. శారీరక వాంఛలను తీర్చుకొనుటకు దారులు వెరవులు సులభములు కావచ్చు కాని మనసులోని కలత నణచుకొను టెట్లు? మనశ్శాంతిని బడయు టెట్లు? నవ్యవిద్యా విధానముచే బుద్ధిగ్రాహ్యములగు విషయముల తెలిసికోవచ్చునేకాని, కలిగినచో నిక తొలగని వివేకమును సంపాదింపజాలము. దేహారోగ్యమును ఇంద్రియదార్ఢ్యమును చురుకైన ప్రతిభయు నున్నచో ఆధ్యాత్మికాభివృద్ధి నంద వలె నను నభిలాష అణిగిపోవు ననుట ఐహిక వాదుల భ్రాంతి. కాని శరీర సౌఖ్యానుభూతుల కును దేశసేవ సంఘసేవవలన గలుగు నిర్వృతికిని పైమెట్టుదైన యొక సంతుష్టిని మానవుడు కోరుచున్నాడు. మానవుడు చెట్టువంటివాడు కాడు. దేవుడు మానవుని తన పోలికలో సృజించెను. మానవునిలో నున్న 'అనంత' తత్త్వము తాత్కాలిక క్షణికానుభవాలతో సంతృప్తి నందజాలదు. నిత్యము ననంతమునైన దానిని క్షణికములగు నైహికమార్గముల నావిష్కరింపగోరుటే నేటి విశ్వమును బాధించుచున్న వ్యాధి. ఈ వ్యాధికి మందు ఇది - అసంకుచితోదాత్తములగు పునాదులపై ఆస్తిక్య పునర్భవము నెలవేలవలెను. ఓ మానవుడా నీచరణములు భువిపై నున్నను, నీ మూర్ధము ఆధ్యాత్మికోన్నతస్థాయి నధిరోహింపవచ్చు'' ననుట ఆస్తికధర్మము కావించు బోధ.

ఈనాడు ప్రపంచమున పాశ్చాత్య ప్రజాస్వామ్య వాదమునకును మార్క్సు వాదమునకును పోరాటము సాగుచున్నది. ఈ పోరాటమున మానవతతి ఆహుతి యైపోవునేమో అను భయము గలుగుచున్నది. ఈ పోరాటమును 'ప్రాచ్య' 'పాశ్చాత్య' సంప్రదాయ సంఘర్షణ యని సామాన్యముగా తలంచుచున్నారు. కాని అది అపోహ. మార్క్సువాదము 'ప్రాచ్య' సంప్రదాయము నుండి పుట్టువొందినది కాదు 'ప్రజాస్వామ్య వాదము' 'మార్క్సు వాదము' అను నివి ఆర్థికదృష్టితో చూచినప్పు డేర్పడు విభేదములు. ప్రాచ్యదేశములందు హిందు - బౌద్ధ - మహ్మదీయమతములలో ప్రతిదానికిని పారమార్థికదృష్టి కలదే కాని కేవలార్థిక దృష్టియు యాంత్రికదృష్టియు వానియందు దొక్క-

దానికైనను లేదు. పాశ్చాత్యుల భౌతికశాస్త్ర విజ్ఞానైహిక సంస్కృతినుండి పుట్టు వొందినదే మార్క్సువాదము. కావున పాశ్చాత్యులు తమ సంప్రదాయమునుండియే తప్పబుట్టి తలకు చెప్పులుకోరుచు ఎదురు తిరుగుచున్న వర్గముతో నేడు పోరాడుచున్నారు. ఈ పోరాటమున ఆయుధబలముగాని రాజనీతిగాని పాశ్చాత్యులకు విజయమును సాధించిపెట్ట జాలవు. ఏలయన ఆర్థిక రాజకీయరంగాలలో మార్క్సువాదము కొన్ని దేశాలవారిని వశీకరించుకొనగలట్లు వేఱు ఏ వాదమును వశీకరించుకొన జాలదు. మార్క్సువాదములో ప్రగతివ్యంజకములైన ఆశయములు గలవు. ఆశయములను ఆశయములతో ప్రతిఘటింపవలయునే కాని ఇతరములతో ప్రతిఘటించుట నెగ్గదు. ఆధ్యాత్మిక దృష్టిని పారమార్థికదృష్టిని ప్రజలలో పెంపొందించినచో అది మార్క్సువాదమును మార్పొందించును లేదా దానిని పూర్తిగా కరగించి వేయును. ఇందు భారతదేశము పాశ్చాత్యదేశాలకు చేయూత నొసగగలదు.

హిందూ జీవితవిధానము ఆధునిక ప్రవణతలకు విరుద్ధమైనది కాదు. జీవుడు దేవుడే అనుటను సాక్షాత్కరించు కొన్నప్పుడే ప్రజాస్వామ్యము స్వాతంత్ర్యము సంఘధర్మపరత అనెడి యాధునిక లక్ష్యములను - సమగ్రముగ సాధించుట వీలగును. జీవుడు దేవుడే అను నధ్యవసాయము కుదిరినప్పుడు ప్రతి మానవునకును తోడి మానవులందు పూజ్యభావము స్థిరపడి విశ మగును. మానవతతి ఒక్కటే కాబట్టి నైతికమానము ధర్మము సర్వత్ర ఒక్కటిగానే యుండవలయును - ప్రాచ్యుల కొక్కటి పాశ్చాత్యుల కొక్కటిగాను, క్రైస్తవుల కొక్కటి క్రైస్తవేతరుల కొక్కటిగాను, తెల్లవారి కొక్కటి ఇతరుల కొక్కటిగాను ధర్మముండరాదు. ఆత్మ ఒక్కటే అనెడి వేదాంతలక్ష్యము ప్రపంచమున ఎంతగా వ్యాపించునో ఈర్ష్యాద్వేషము లంతగా రూపడంగి విశ్వశాంతి సంక్షేమములు సుప్రాపము లగును.

ఆధునిక విద్యావిధానము టని కఱపు నందురు కాని "మామతమువారికే మోక్షము, అన్యమతములవారికి లే" దనెడి క్రైస్తవయూదియ-మహమ్మదీయ మతాలవారి దృష్టి నేమందుము? 'ఏకం సత్ విప్రా బహుధా వదన్తి' అన్న వైదికద్రష్టలు మొదలుకొని "ఎన్ని మతములో అన్ని మార్గములు ఏకైక గంతవ్యమునకే" అని బోధించిన శ్రీరామకృష్ణుని వఱకును గల హిందూమహర్షులు మాత్రమే మతవిషయమున సమరససమన్వయపాఠము నుపదేశించినారు. 'అన్యమతములను తూలనాడకుము, అన్యమతాలవారిని ద్వేషింపకుము, నీవు నీమతమునే ఆస్థతో అనుసరింపుము' అనెడి హిందూ సిద్ధాంతమే ఎంతయు సమంజసమైనది. విశ్వమానవులు దీనిని గుర్తించు కాలము భారతదేశమునకును సర్వభూమండలమునకును మహోజ్జ్వలమైన భవిష్యత్తు.

# రూపాంతరము

## శ్రీ అయ్యగారి రామచంద్రరావుగారు

(గతసంచిక తరువాయి)

సీ. నిఖిలపావనమైన నీకీర్తిఁ బాడుచు
నీ తుమ్మెదలు వెంట నేగుదెంచె
నడవిలో గూఢుండవైన యీశుడ వని
మునరి కొల్వఁగ వచ్చె మునిగణంబు
నీలాంబరముతోడి నీవు జీమూతమ
వని నీలకంఠము లాడఁదొడగెఁ
బ్రియముతోఁ గోపికల్ వీక్షించుచుండాన
నిను జూచు నదె హరిణీచయంబు

ఆ. నీవు నింద వనుచు నిర్మలసూక్తులు
పలుకుచున్న విచట బరభృతములు
నేడు విపినచరులు నీవు విచ్చేసిన
ధన్యులైరి గాదె తలచిచూడ.

ఆ విగ్రహము ప్రేమమాధుర్యమును స్వయముగ నాస్వాదించుచుండ, మన మానందమందిరమున బ్రక్కగా నిలిచి ఆనందవిహ్వాలులమై నిర్నిమేషనయనములతో జూచుచుందుము. అందుకనియే ముప్వాక్రీడ బిక్కరిలీల యని భాగవతోత్తములు చెప్పుదురు. ప్రేమవ్రతోద్యాపనమైన గాని ఈ సందర్శనము లభ్యముకాజాలదు. ఆ యుద్యాపన మెప్పుడగునో చెప్పుట కష్టము. ఒకజన్మముననో, లేక అనేకజన్మములనో ఆ ప్రేమవ్రత ముద్యాపనము గావలయును. అప్పుడు ప్రాణమధ్యమున బాహ్యాంతరముల చిదానందపరిపూర్ణుడు, ఘనరసామృతస్వరూపుడు, భగవంతుడు వెలువడి తన మృదుకరపల్లవముల జాచి, భక్తుల నాలింగనము చేసికొనును. ప్రేమవ్రతోద్యాపనముగులోపల గడవవలసిన అవస్థలనేకములు గలవు. ఆ ప్రత్యవస్థయు రూపాంతరమే. ప్రతి రూపాంతరము సత్యమే. అయినను ఉద్యాపనానంతరము గల్గునది చరమరూపాంతరము. ఇట్టి రూపాంతరములతోడనే ప్రేమరాజ్యము విరాజిల్లుచున్నది.

ప్రథమమున ప్రేమస్వరూపము కనులకు బొడగట్టునప్పటినుండియు చరమావస్థవఱకును, సకలరూపములకును యథార్థస్వరూపమగు భగవంతుడు ప్రాణమధ్యమున తాండవమాడుచుండెను. ఈ తాండవము ననుభవించుటయే ప్రేమ. ఇట్టి ప్రేమానుసంధానమునకు ఆలంబనమగునదియే సత్యము. ప్రాణవల్లభుడు తన ప్రేమరాజ్యమునకు దీసికొని పోవుటకీ మురళిని పలుగతుల వాయించుచున్నాడు. ఇంద్రియప్రేరణమునే భగవంతుని ఆహ్వాన మని పలుమారు భ్రమపడుచుందుము. కాని, ప్రేమ ఇంద్రియజగత్తునందు ప్రారంభమై, అతీంద్రియ జగతునందు పరిపక్వ మొందును. ఇంద్రియము లెప్పుడును అతీంద్రియుని నిర్దేశించుచుండును. శబ్దము అశబ్దమును, స్పర్శ అస్పర్శను, రూపము అరూపమును, రస మరసమును, గంధ మగంధమును జూపుచుండును. ఇది ఇంద్రియధర్మము. ఆ యఖండసత్యరాజ్యమునందు దేనిని విసర్జించుటకు వీలు లేదు. ఏ యింద్రియమును విసర్జించినను సత్యమునకు వికలత్వము చేకూరును. సమగ్రసత్యము హృదయమున నుద్దీపనమైనప్పుడు, మన సామాన్యేంద్రియములు రూపాంతరము నొందును. ప్రేమమాత్రము మార్పునందదు. ప్రేమ గాఢమైనకొలదిని, మన చిత్తమునందలి జడత్వము తొలగును. దివ్యదృష్టితో చూచిన యేవస్తువును జడముకాదు సర్వమును చిన్మయము.

ఇట్టి యుజ్జ్వలావస్థ నొందనివాడు కవిత్వము చెప్పజాలడు. శిల్పమును రచింపజాలడు. కవితా

ప్రయోజనమును శిల్పప్రయోజనమును జీవిత విలాస ప్రతిపాదనమనియు, ధర్మమునకును వానికిని ఎట్టి సంబంధమును లేదనియు చెప్పువారు కొందఱు గలరు. ధర్మమన నింగ్లీషులో జెప్పబడు "రిలిజియను" అని వారి యభిప్రాయము. మనవారు జీవనమును ఖండఖండములుగ విభజించి, అందొక్క ఖండమునకే ధర్మము నంటగట్టిరు. ధర్మజీవన మొక యావరణమందు బద్ధమై యుండును. కళలకు రససాధనయే ఆధారము "వాక్యం రసాత్మకం కావ్యమ్" సకలరసములకు ఆధారమును, ఆకరమును అగు నిఖిలరసామృతమూర్తిని వీడి, రససాధన సార్థకత నొందుటకు వీలులేదు రససాధన లేనినాడు రససృష్టి ఆత్మవంచనమగును. ఇంద్రియములందు బంధింపబడియుండుట విలాసధర్మము కాదు. విలాసము తన విషయమును బురస్కరించుకొని తన్మయత్వ మొందును. తన యావేగబలముచే ఇంద్రియగ్రామము నతిక్రమించి అతీంద్రియరాజ్యము జేరును. అప్పుడు రూపమునం దరూపమును, శబ్దమునం దశబ్దమును విలసిల్లును. కేవల మింద్రియరాజ్యమం దాబద్ధులగువారు విలాస వివర్తనము ననుసంధానము సేయజాలరు. వారు కాల్పనిక జగత్తు నొకదానిని సృష్టించుకొని అందు కళలను బ్రతిష్ఠింపజూతురు. వారాశ్రయించునది అనుభవవిషయము గాదు. వారికళలు సత్యప్రతిష్ఠితములు కావు. ఇంద్రియములు చూచునది వస్తువుల బాహ్యవిషయము. వస్తుస్వరూపమును జూడవలె ననిన అతీంద్రియరాజ్యమును మేల్కొల్పక తప్పదు.

అతీంద్రియమన్న ఇంద్రియములను నిరసించుటకాదు. ఇంద్రియముల నాశ్రయించియే అతీంద్రియుని చేరవలయును. పాశ్చాత్య తర్కమును, మన దేశమందు మధ్యయుగమున ప్రబలిన మాయావాదమును, ఇంద్రియములకును, అతీంద్రియములకును విరోధము గల్పించి, ధర్మజీవనమును కృత్రిమముగను, రసహీనముగను జేసివైచినవి. "దేవుడు ఇంద్రియ గోచరుడు కాడు. ప్రపంచము జడము. మానవ ప్రవృత్తి అపవిత్రము" అని కొన్ని నీతివాక్యములను మనమునం దుంచుకొని, మానవుడు తనచుట్టు నొకగిరి గీసికొని, ఒక అసత్యపీఠమును బ్రతిష్ఠించినంత మాత్రమున నది దేవుడగునా? మానవ ప్రవృత్తి సత్యము కాదా? ఇంద్రియ ప్రవృత్తియందు భగవత్సాక్షాత్కారము లేదా? ఇంద్రియలోకమును వీడి మానసిక కల్పనతో నొక పవిత్రలోకమును సృష్టింపబూనుకొనుట అంతరిక్షమున సౌధమును నిర్మించుటవంటిది. మానసికోపాసన యను పేరుతో మానవులు మిథ్యారాజ్యమును జేరుచున్నారు. చిత్తము జడమైనప్పుడు ప్రపంచమంతయు జడముగనే కన్పట్టును. ఇంద్రియములపవిత్రములైనపుడు, ఇంద్రియముల కంధత్వమును, బధిరత్వమును సంఘటిల్లును. రూపమునందరూపమును జూడజాలక రూపమును విడనాడి కాల్పనికజగత్తులో సత్యమును బ్రతిష్ఠింపజూచుట ఆత్మవంచనము. ఈశ్వరుడు సర్వగతుడని ఒకచిలుక పలుకును బలుకుదురే కాని వారికి దేవుడు ప్రపంచబాహ్యుడు. వారు ప్రాణకుంజమున మురళీగానమును వినజాలక ఈశ్వరుడు సాకారుడా, లేక నిరాకారుడా యని కొన్ని యల్పయుక్తులను ముఖస్థము చేసికొని ఆత్మవంచనము గావించుకొనుచున్నారు. అట్టివారికి కవితాగాన శిల్పాదికళల రససృష్టి బోధగమ్యమగుట యెట్లు?

భక్తిరసామృతమును గ్రోలిన పరమ భాగవతోత్తములు ఎట్లు ప్రాణవల్లభుని కనులార

గాంచి ధన్యులైరో మీ శుద్ధాంతఃకరణమున
నొక్కమారు యోచించి, రూపాంతర మన్న
నెట్టి రసావేశావస్థయో యూహించుకొనుడు.

సనకసనందనాదిముని
సత్తము లంచితయోగదృష్టిచే
బనివడి యాత్మలం దెవరికి
పట్ట నగోచరమైన మూర్తి యి
ట్లనవరతంబు మాంసనయ
నాంచలగోచరు డయ్యె నట్టి! యే
మన నగు వీరిపుణ్యమున!
కాదట నెట్టితపంబు సేసిరో

నిరయస్వర్గము లాత్మం గైకొనక తా
నిర్వాణమూర్తైన యా
హరి జూడన్, హరితోడం బల్క, హరి మే
నంటన్, హరిం బాడగా,
హరితో నేగ, సహాసనాస్తరణశ
య్యావాసులై యుండగన్,
హరిబంధుత్వ సఖిత్వముల్ గలుగు భా
గ్యం బెట్లు సిద్ధించెనో.

# పురాణపఠనావశ్యకత

## శ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు

చేతనసృష్టిలోనెల్ల నరులు సర్వాధికు లగుటకుం గారణము జ్ఞానైకసాధనమగు మానవదేహమును దాల్చియుండుటయే. జ్ఞానమైహికము, నాముష్మికము నని రెండువిధములు. ఐహిక మన నిహమున మనుజుండు తన జీవితకాలమును గౌరవానందములతోం గడపుటకుం దగిన తెలివి. ఆముష్మిక మన జీవుండు పరమున శాశ్వతానందమును బడయుటకుం దగు తెలివి.

ఇందు మొదటి తెలివి నభివృద్ధిచేయుటకుం జతుష్షష్టికళలు, వ్యాకరణాదిశాస్త్రములు, లోనగునవి ప్రధానములు. రెండవ తెలివి నభివృద్ధిచేయుట కుపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీతలు లోనగునవి ముఖ్యములు. పూర్వజ్ఞానమునకంటె నుత్తరజ్ఞాన ముత్కృష్టమైనది. కాని యుత్తరజ్ఞానసౌధారోహణమునకుం బూర్వజ్ఞానము సోపానపరంపరవంటిది.

ఈ లౌకికాలౌకికజ్ఞానములు రెండును నొకదానితో నొకటి సమ్మిళితమై యంగాంగీభావమును బొందినపుడే మానవునకుం బరిపూర్ణలాభమును గలిగించుచున్నయవి. అందువలననే మనపూర్వులీరెంటిని గలిపియే బోధింపందొడంగిరి. కావుననే సనాతనధర్మములన్నియు నిహపరముల రెంటిని సంపాదింపందగినవిగ నున్నవి కాని వేఱుపడియుండలేదు.

కాని మానవు లీజ్ఞానద్వయమును సంపాదించుటలోం జాల శ్రమపడవలసియున్నది. జ్ఞానసాధకములగు నసంఖ్యేయగ్రంథముల జదువుటకుం బరిమితకాలజీవులగుమర్త్యులు శక్తులు కాంజాలరు. చదువుటలోనొకకొందఱు కృతార్థులైనను, వానియందలి గంభీరభావము, నాత్మానుభవమునకుం దెచ్చికొని యుత్తీర్ణుం డగువాండు వేయింటికొకండుండునో యుండండో తెలియదు.

కావుననే దయామయు లగుమహర్షులు కేవల శాస్త్రములచే విషయమును బోధించి

స్త్రీపురుషాది సకలమానవసంఘము నుభయజ్ఞానానుభవసంపన్న మగుదానినిగాఁ జేయుట యత్యంతదుష్కర మని తెలిసికొని, యొక గ్రంథము చదువుటచేతనే జ్ఞానద్వయమును ననుభవములోనికిఁ దెచ్చి, యాచరణోపయుక్త మగునట్లు చేయుటకు శాస్త్రీయవిషయములఁ జక్కని కథలతోఁ జేర్చి బోధించిన సుబోధ మగుననితలఁచియసంఖ్యేయామూల్యోపాఖ్యానములచే నొప్పుచున్న పురాణములు శ్రోతృజనచిత్తరంజకములగునటుల విరచించియున్నారు.

ఈ పురాణనాయకపావనజీవచరితలు చదువరుల కత్యంతానందసంధాయకములగుటయే కాక, కామాదిదుర్గుణదూషితములైన మానవహృదయములఁజక్కఁబఱచి, శీలసంపన్నములగునటుల చేయుచున్నవి. కావుననే మహర్షులకుఁ బిమ్మటఁ గాళిదాసాదికవివరులెల్లరును సామాన్యముగాఁ బురాణపురుషులనే నాయకులనుగాఁ దీసికొని, రసభరితములగు నుత్తమకావ్యముల విరచించి యున్నారు. పరమపావనచరితులగు పుణ్యపురుషుల జీవితములఁజదువుటచేఁ గలుగు లాభమునకు మేర లేదు. ''జాతీయ వీరచరితములఁ దెల్పు గ్రంథసముదాయము, సమస్త కాలములందును, సమస్తదేశములందును, నిక్కమైన విద్యకును, సౌశీల్యమునకును, మూలాధారము'' అని కుమారస్వామి పండితుఁడు, జాతీయవిద్యావ్యాసమున వ్రాసియున్నాఁడు.

పురాణవర్ణితములగు గజేంద్రాదితిర్యగ్జంతువులయు, ధ్రువప్రహ్లాదాది బాలభాగవతోత్తములయు, నభిమన్యుప్రభృతియావనవీరులయుఁ, గర్ణార్జునాదిప్రౌఢవీరులయు, శిబిదధీచ్యాదిదానవీరులయు, హరిశ్చంద్రాదిసత్యవీరులయు, శ్రీరామాది పితృవాక్యపరిపాలకులయు, నలప్రభృత్యేకపత్నీవ్రతశోభితులయు, విదురాదినీతిధౌరేయులు, భీష్మాదిస్వార్థత్యాగగరిష్ఠులు, శ్రీశుకాదిపరమవైరాగ్యసంపన్నులు, జనకాదిజ్ఞానిసార్వభౌములు, వసిష్ఠాదిబ్రహ్మర్షులు మున్నగువారివియు, లోకపావనచరితలగు సావిత్రి, సీత, దమయంతి, చంద్రమతి, ద్రౌపది లోనగు సాధ్వీలలామలయొక్కయుఁ బవిత్రనామములు విన్నమాత్రముననే శరీరములు పులకరించుచుండ, నిఁక వీరిపావనదివ్యజీవచారిత్రములఁ జదువునపు డేయార్యుని చిత్తము ద్రవింపకుండును? ఏ భారతీయుని నేత్రములనుండి యానందాశ్రువు లొలుకకుండును? ఏ హైందవుని దేహము పరవశము కాకుండును?

ఈ పావనచరితములఁ జదువునపుడు, కేవల స్వలాభములకొఱకుఁ బేరాసతోఁ బరుగిడువారుకూడ నిశ్చేష్టితులై స్థాణువులవలె నిలుచుటయేకాక, తాము చేయుచున్న కుత్సితకృత్యముల స్మరించి, లజ్జితులై దేహత్యాగమునకైనను, లేదా తమ నడతను జక్కచేసికొనుటకైనను ద్వరపడుచుందురు.

ఈ తీవ్రపావనపురాణవైరాగ్యమే యాచరణకాలమువఱకును మానవహృదయముల నిలిచియున్నచో నీలోకమున నింద్యములగు నీర్ష్యాసూయాదిదుర్గుణము లెచట నిలువఁగలవు? దుఃఖమునకుఁ దావెయ్యది? పురాణపఠనోదితజ్ఞానచంద్రచంద్రికలు హృదాకాశమునఁ బ్రకాశించుచున్నపుడు, నరుఁడు కామాదిదుర్గుణాంధకారవిముక్తుఁడై కేవల ప్రేమామృతమానసుఁడై సమబుద్ధితో సోదరజాతి నాదరింపఁ గోరుచుండును.

కావున మానవమనస్సీమను సదా యీ జ్ఞానకళలు ప్రసరించుటకుఁ దఱచు పురాణపుణ్యకథలు చదువుచుండవలయును. కొందఱు

పురాణములయందు విరుద్ధకార్యములతో నిండి యున్న పిచ్చికథలు కలవనియుఁ, గావున నట్టి యసంభవవిషయములఁ జదువుటవలన జనులకు మూఢవిశ్వాసములు హెచ్చుచున్నవనియు, నొకవిరోధమును జూపుచున్నారు. కాని యిది యొకవిరోధాభాసము. ఇది పురాణసంప్రదాయ మెఱుఁగనివారి కిదయించుచుండును.

పురాణవర్ణితములగు విషయములు యథావృత్తములనియు, నర్థవాదములనియు రెండు విధములు. యథావృత్తములన, నిజముగా జరిగినవిషయములు. పురాణముల వర్ణింపఁబడిన యథావృత్తములగు విమానవిహారాదులును, శాపానుగ్రహములును, గాలత్రయపరిజ్ఞానములును, మొదలగు నద్భుతవిషయములు నేఁటికి బహుపురాతనము లగుటచే నప్పటి తపోమహిమలును, అప్పటి యాధ్యాత్మికజ్ఞాన సంపదలును, అప్పటియింద్రియనిగ్రహములును, అప్పటి భౌతికశాస్త్రజ్ఞానములును, లోనగు శక్తిసామర్థ్యములు లేని యిక్కాలపు నవనాగరకుల కవి విరుద్ధములుగాఁ దోఁపవచ్చును గాని యంతమాత్రమున నవి యసంభవములు కాఁజాలవు. శాస్త్రజ్ఞుల కట్టివి విపరీతములుగఁ దోఁపవు.

దినమునకు మూఁడుసారులు భోజనమును బదిసారులు ఫలాహారము నుండినఁగాని నిలువ లేని దుర్బలమానవునకు, నేకాదశియుపవాస మన్న నసంభవకార్యమని తోఁపవచ్చును. అంతమాత్రమున నేకాదశీవ్రతగరిష్ఠుల కది యసంభవకార్యమగునా? నాగరకాగ్రేసరులును భౌతికశాస్త్రనిపుణులునగు పాశ్చాత్యపండితులు మనపూర్వులు పురాణముల నర్ణించిన యద్భుతవిషయముల నిప్పుడు శాస్త్రప్రమాణములచే స్థిరపఱచుచున్నవారు. వీని నన్నిటి నిటఁ జర్చించిన వ్యాసము విపులమగు నని విడిచితిని.

అర్థవాద మన నొకప్రధానవిషయమును బోధింపఁదలఁచి, దాని నొక కల్పితకథతోఁ జేర్చి బోధించుట. ఎట్లన నెంతటి సహజశత్రువులైనను వైరమును వీడి యేకీభావమును బొంది, పట్టుదలతోఁ బనిచేసినపక్షమున మృత్యువునుగూడ సాధింపనగు నుపాయముల సంపాదింపవచ్చుననియు, నట్టిపూనికకల కార్యశూరులకు భగవంతుఁడుకూడఁ దోడ్పడుననియుఁ, గాని కామాంధత ఫలసిద్ధికి భంగకారియనియు నీలోనగునీతిని బోధింపఁదలఁచి, యీ విషయమే క్షీరసాగరమథనమని యొక కథగా వర్ణింపఁబడినది.

ఇటఁ గథ యథార్థమా అయథార్థమా అనువిషయము ముఖ్యముకాదు. మతేమన సంఘీభావము సకలకార్యసాధకమనెడి యిందలి నీతియే ముఖ్యము. ఇట్టి యర్థవాదము లనేకములు పురాణములయందుఁ గలవు. ఈరీతిగా నర్థవాదములద్వారా విషయముల బోధించుట వేదములనాఁటినుండియు వ్యవహారములో నున్నది. కావునఁ బురాణములుబోధించు విరుద్ధవిషయము లెవ్వియును లేవు. కొందఱాధునికులు పురాణములు బహుపురాతనములగుటచే నాధునికనాగరకులు గ్రహింపఁదగిన జ్ఞానము కలవిగా నుండ లేదని పలుకుచున్నారు. కానియిది యొకతప్పుటూహ. ప్రాఁతదైనంతమాత్రము ననే గ్రాహ్యము కాకపోదు. అట్లు కాదందురా బహుపురాతనములగు రత్నకాంచనాదులెల్లఁ ద్యాజ్యములు కావలసివచ్చును. గ్రాహ్యాతాగ్రాహ్యతలు, గుణాగుణముల నాధారముచేసి కొని యున్నవి కాని నూతనతానూతనతల నాధారముచేసికొని యుండ లేదు.

ఇట్లనుటచే మనోహరార్థసంపాదకము లగు నూతన గ్రంథములు గ్రాహ్యములు కావని నా తలంపుకాదు. మఱేమనఁ బాఁతవన్న మాత్రమున బురాణముల నవమానించి క్రొత్త వన్నమాత్రమున నూతనగ్రంథములే ముక్తి హేతువు లని తలఁపరాదు. నూతనముగాఁ దన పాణిగ్రహణ మొనర్చిన మోహనాంగిఁ జూచిన మాత్రమున సర్వమునకును నామెయే గతియని తలఁచి, సదా తన శ్రేయస్సును గోరు మాతృదేవతను వృద్ధాంగన యని పూజింపకుండుట నీతికి దూరము కదా ?

ప్రియపల్కు మనోహర ప్రియోక్తుల నాదరింప వలయును, శ్రేయస్కరము లగు మాతృదేవత హితబోధలను మన్నింపవలయును.

అదిగాక భూతమునకును వర్తమానమునకును సంబంధము విడిపోరాదు. అట్టి కలయిక పురాణపఠనమునంగాని నిలుపదు. జపాను దేశ ప్రస్తుతపు ఘనత యంతయు దాని పురాతన చారిత్రమునందు, గౌరవముంచుటచేతనే కలిగినదని చరిత్రాభిజ్ఞులు తెలుపుచున్నారు అంతగాఁ బ్రాచీనముగాని జపానుదేశ చరిత్రయే యిట్లుండ బహు పురాతనమగు మన దేశ చారిత్రమునుగూర్చి తెలుపవలసిన దేమున్నది! హిందూదేశమునందలి ప్రస్తుత విద్యాభ్యాస పద్ధతికంటె జపానుదేశమందలి స్వదేశచరిత్ర బోధతోఁ గూడిన మార్గము చాల బాగుగా నున్నదని, ఫ్రెడరిక్ హారిసన్ దొరవారు తెల్పియున్నారు.

శాకాహారమునకు నలవాటుపడిన జీర్ణాశయమునకు శాకాహార మిచ్చినపుడే యది దానిని సుఖముగ జీర్ణముచేసి, దేహపోషకములగు సప్త ధాతువులను బుట్టించును గాని, అనభ్యస్తమగు మాంసాహారము నిచ్చిన దానిని సుకరముగ జీర్ణము చేయఁజాలక పోవుటయేకాక వ్యాధిని దుర్బలతను గూడఁ బుట్టించునటులఁ జిరకాలము నుండి భారతభాగవతాది పావనపురాణ విషయముల విని యానందించి బాగుపడుటకు నలవాటు పడియున్న భారతీయుల కంతగా నితర పురాణ విషయములు సుగ్రాహ్యములు కాఁజాలవు కావుననే—

“గృహోపకరణము లొక యింటినుండి మఱియొక యింటికి మార్చినట్లుగా, జాతీయ పరమావధు లొకజాతినుండి వేఱొకజాతికి మార్పఁదగినవి కా”వని కుమారస్వామి పండితుఁడు తెలిపియున్నాఁడు.

ఇట్లు ప్రాజ్ఞులగు వా రనేకులు తలఁచియున్నారు. కావున ముందు మన దేశీయులకు స్వపురాణ విషయముల బోధించి, పిమ్మట దేశాంతర పురాణ చరితములఁ దెల్పినఁ దెల్పుదుముగాక. కొందఱకు గోక్షీరము లయ్యును జక్కెర చేర్చినఁగాని రుచింపనట్లు కేవల పురాణశైలి రుచింపకున్నచో, నట్టివారికి సుబోధ మగునటుల లక్షణానుసారముగ గ్రంథముల వ్రాయుట యవసరమనియే నా తలంపు.

ప్రస్తుతము మన యాంధ్ర కవిసోదరులు కొందఱు వ్రాయుచున్న నవలలు పాఠకుల కంతగా నుపయుక్తము లగుచున్నటుల నాకుఁ దోఁపదు. మన పూర్వులు గ్రంథముల రచించుటలో నధికారి, సంబంధ, విషయప్రయోజనముల ముఖ్యముగ నేర్పఱచి గ్రంథసమాప్తిం జేయువారు. ప్రస్తుతమో ప్రయోజన శూన్యమగు విషయమును (కేవలకథను) ప్రధానము చేసికొని గ్రంథసమాప్తిని జేయుచున్నవారు. ప్రయోజనము నంతగాఁ బాటించుటలేదు.

కావుననే యీ నవీననవలలో కాలము గడుపుటకుఁ దగు కథలున్నవి కాని, కథ ముగిసినకడపటఁ బాఠకులు గ్రహింపఁ దగిన ప్రయోజనమును లేవు. ప్రాజ్ఞులగు పాఠకులు కేవల కథామాత్ర పాఠములచే నమూల్యమగు కాలమును వృధాచేయక, నీతిదాయకములగు గ్రంథరాజములఁ జదివి తమ జీవితముల సార్థకము చేసికొనవలయును.

ఆర్యుల పురాతనౌన్నత్యమును మనము తెలియఁ గోరుదుమేని తప్పక యీ పురాణ రాజములఁ జదివి తీరవలెను. వీనియందు వర్ణింపఁబడిన పట్టణముల నుద్యానవనముల, కోటల, సౌధవీథుల, వాహనాదుల, నితర సంపదల వైభవములఁ, జదువునపుడు భారతీయ పురాతనౌన్నత్యము స్మృతికివచ్చి వెంటనే పాఠకుని నేత్రములు మూఁతవడి, చేతనస్మృతి దక్కి చేతనున్న పుస్తకము క్రిందికి జాఱు నంతటి దేహపారవశ్యము సంభవమగును.

పురాణనాయకుల యసమాన ఘనభావములు తెలియుటకు నిట నొకటి రెండు విషయములఁ దెల్పెదను. సంస్కృత వాఙ్మయమున నాదికావ్యమని పేరువడసిన శ్రీమద్రామాయణమునకుఁ గథానాయకులైన సీతారాముల పావన గంభీర భాషణముల నాలింపుఁడు. మీరపుడు విస్మయానందభరిత మానసులై పురాణ సంపదలఁ దెలిసికొనఁగలరు.

శ్రీరామచంద్రుఁడు రావణ సంహారము కొఱకుఁ గపిసేనలతోనేగి సముద్రముకడ దిగియుండ, రావణానుజుఁ డగు విభీషణుఁడు మంత్రులతోవచ్చి యాకసమునుండి శ్రీరాముని శరణువేఁడెను. వీరాగ్రేసరుఁడగు శ్రీరాముఁడును మాఱుమాటాడక వెంటనే వానికభయమిచ్చెను. అపు డచట రాజనీతికోవిదులగు వానరవీరు లెల్లరును, నీతిశాస్త్ర ప్రమాణముల చేతను యుక్తివాదములచేతను విభీషణుఁడు క్రూరరాక్షసుఁ డనియు, దేవరకుఁ బ్రబల శత్రువగు రావణున కనుజుఁడనియుఁ గావున వీనిఁ జేరఁదీయరాదనియు బహువిధముల బోధించిరి. వారికి రాముఁడు తెలిపిన దేమన:—

శ్లో. సకృదేవ ప్రపన్నాయ
తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో
దదామ్యేతద్వ్రతం మమ
మిత్రభావేన సంప్రాప్తం
న త్యజేయం కథఞ్చన
దోషో యద్యపి తస్య స్యా
త్సతామేతదగర్హితమ్.

అనఁగా "నొక్కసారి నాకుఁ బ్రపన్నుఁడై నీవాఁడ ననిన వెంటనే వాని సర్వభూతముల నుండియుఁ గాపాడెదను. ఇట్లు చేయుట నాకు వ్రతము, పైకి మిత్రభావమును వెలడించుచు నాయొద్దకుఁ జేరినవాని నెట్టి యిక్కటులు వచ్చినను సరకుసేయక కాపాడువాఁడనే కాని విడుచువాఁడను గాను. ఒకచో వాఁడు లోఁగపటియైన నా దోషము వానిదే. దాన సత్పురుషుల కెంతమాత్రము లోపములేదు"

ఇట్టి స్వసుఖ నిరభిలాషులును, బరసుఖ ఘటనాపటిష్ఠులు నగు పురాణ పుణ్యపురుషుల చరితములఁ జదివిన గలిగెడి గుణసంపద మఱే మార్గమునఁ గలుగఁగలదు?

ఇఁక నీవీర నాయకుని యిల్లాలగు సీత ఎంతటి పావన గంభీర భావముగలదో వినుఁడు. రావణ సంహారానంతరము రాముని యాజ్ఞానుసారము హనుమంతుఁడు సీతకడకేగి శ్రీ ముని విజయవార్తను దెలిపి, యచటఁ గావలి

యున్న రాక్షసాంగనలఁ గడతేర్చుటకు సెల వొసంగుమని కోరెను. అప్పు డా సాధ్వి యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

రాజసంశ్రయవశ్యానాం
కుర్వతీనాం పరాజ్ఞయా
విధేయానాంచ దాసీనాం
కః కుప్యే ద్వానరోత్తమ?
ప్రాప్తవ్యం తు దశాయోగా
న్మ యైత దితి నిశ్చితం
దాసీనాం రావణస్యాహం
మర్షయా మీహ దుర్బలా.

అనఁగా వానరోత్తముఁడా, ఒకరాజు నాశ్రయించి యతని యాజ్ఞానుసారము కార్యములఁ జేయుచుఁ దమ యేలికకడ వినయముగ సంచరించుచుఁ బరాధీనలైయున్న దాసీ జనులపైఁ గోపమేల? నన్నిటు బాధించినది నా దుర్దశయే కాని వీరుకారు, వీరు తమ ఱేని యాజ్ఞానుసారము నన్ను బెట్టినబాధల సహించుచుతునే గాని వీరిని బాధించుటకు నిష్టపడునంతటి కఠినాత్మురాలను గాను'' అని.

ఆర్యులారా, యింతకంటె నుదారాశయములు కలవా? ఈమెకంటెను బావనచరితలు కలరా? ఈ క్రూర రాక్షసాంగనలు క్షణమైనను దన సౌభాగ్యదైవతమగు ప్రాణేశ్వరుని స్మరించుటకైన నవకాశమీయక, తుచ్ఛబోధలచేతను, క్రూరకృత్యములచేతను, అహర్నిశ మొక్కరీతిని బాధించిరే? అట్టి కఠినాత్ముల సీతయేకాక మఱెవరైనను ముక్కుల క్రిందఁ గోయింపక విడుతురా?

ఇట్టి యద్భుత చరితముకల సాధ్వీమతల్లు లెందఱో మన పురాణముల యందుఁ గలరు. మానవులఁ జైతన్య కళాపూర్ణులనుగాఁ జేయుట కీ వీరమాతల చరితములకంటె వేఱేమి కావలయును? లోకముల నన్నిటి నానందపరవశములుగను, శీలవంతములుగను, జేయుట వాల్మీకి రామాయణ మొక్కటి చాలదా? సంస్కృత వాఙ్మయమున నున్న యిట్టి ఘనవిషయముల సర్వజనగ్రాహ్య మగునటులు మృదుశైలిని పుస్తకముల వ్రాయుటకంటెను, వ్రాయించుటకంటెను, మనమాంధ్రభాషకుఁ జేయు శాశ్వతోపకార మెయ్యది?

ఆర్షకుల ప్రసూతులగు భారతీయులు స్వగ్రంథముల నోర్పుతోఁ జదువక, యలసులై చెప్పుడుమాటలను విని, యమూల్యార్థ సంపన్నములగు పురాణములయెడ నీరసభావమును జూపుట కడు శోచనీయము. ఘనహృదయులారా, మన మీ యార్యావర్తము నందలి సోదరీసోదరుల నెల్ల క్షేమంకరమగు నొక్కగమ్యస్థానమునకే నడుపఁదలఁచినచోఁ బురాణ పుణ్యకథల బోధించినఁగాని, మన మనోరథ మీడేఱ నేరదు.

మఱియు నీపురాణములు, దేశచారిత్రముల దర్పణములకరణిఁ బ్రతిఫలింపఁ జేయుచున్నయవి. మానవు లెంతవఱకు స్వదేశ చరిత్రను దెలియకుందురో యంతవఱకుఁ దమ యుద్యమముల ధైర్యోత్సాహములతో నుపయుక్త మార్గముల నడుపఁజాలరు. మఱియు నట్టివారు స్వదేశీయు లనిపించుకొనుటకుఁ గూడ నర్హులు కారు. కావున స్వదేశచరిత్రాభిమాను లెల్లరును బురాణముల నామూలాగ్రము పఠింపవలయును.

కొందఱు మనమిపు డిరువదియవ శతాబ్దమున నున్నవార మనియు నందుమూలముగ మనపూర్వు లిట్టి నాగరకతలేక మృగప్రాయులుగా నున్నపుడు వ్రాసిన పురాణములఁ జదువుట తెలివితక్కువ యనియు వ్రాఁతలయందును

ప్రసంగములయందును గూడ నిర్లజ్జముగాఁ దెలుపుచున్నవారు.

కాని యిది యొకపిచ్చితలంపు. ఏలయనఁ బూర్వమెవరిపూర్వులు జ్ఞానశూన్యులై మృగములవలె మెలఁగుచుండెడివారో, అట్టి సంతతివా రొకశతాబ్దమునకంటె వేఱొక శతాబ్దమునందుఁ గ్రమాభివృద్ధి నందుచున్నపుడు అట్లు తలఁచుట యుక్తమే కాని భారతీయుల స్థితి యట్టిది కాదు. ప్రస్తుతఖండాంతర వాసుల పూర్వులు గృహవస్త్రాదినిర్మాణముల నెఱుఁగనపుడే యెవరిపూర్వులు గృహాదినిర్మాణములఁ బ్రావీణ్యమును గాంచియుండిరో, ఇతర దేశీయుల పూర్వులు, అక్షరములఁ గూడ నెఱుంగని యపుడు, ఎవరిపూర్వులు రసభరితము లగు గంభీర కావ్యరచనలయందు వన్నె కెక్కిరో, పెక్కేల, దేశాంతరము లెల్ల నవిద్యాముద్రితములై యుండ, నెవరి దేశమున సకలకలాపూర్ణుఁ డగు ప్రబోధపూర్ణచంద్రుఁడు ప్రకాశించుచుండెనో, అట్టి యార్షకులప్రసూతు లగు భారతీయులు పైయట్లుతలఁచుట యెట్లుపొసఁగును? వీ రిపుడు ఖండాంతరవాసులగు శాస్త్రవేత్తలు, ఆర్షపురాణములఁ జదివి యందలి యమూల్యవిషయముల శ్లాఘించుచుండుటను గని, విన్నంబోయి మిన్ను చూచుచున్నవారు.

కొందఱు నవమేధావులు తాముకోరు లౌకికానందము లేవియో కొన్ని పురాణముల యందు లేవని పావనచరితములగుపురాణములఁ ద్యజించుచున్నవారు. వీరియవస్థఁ జూడ నీ క్రిందిశ్లోకము స్మరణకు వచ్చుచున్నది.

శ్లో. కేఽమీ లోహితలోచనాస్యచరణా
హంసాః కుతో మానసాత్
కిం తత్రాస్తి సువర్ణపంకజవనా
న్యంభ స్సుధాసన్నిభం
తత్తీరం కిము రత్నఖండరచితం
కల్పద్రుమావేష్టితం
శంబూకాః కిము సన్తి నేతి చ బకై
రాకర్ణ్య హీహీకృతమ్.

మఱికొందఱు మేమీపురాణములు సంఘోపయోగము లగునేమోయని పరిశీలించితిమికాని యట్టి యుపయోగ మేదియుఁ గానరాదు సరియేకదా, యివి యింద్రియానందములు తుచ్ఛము లనియు, సంసారము దుఃఖభాజన మనియు, నిస్సంగతయే ముక్తి హేతు వనియు, నిట్లు పిచ్చివైరాగ్యములబోధించి మానవుల సంఘమునుండి తొలఁగింపఁ జూచుచున్నవి. కాని సాంఘికాభివృద్ధికి ననువగుత్రోవ లిందుఁ గానరావని పలుకుచున్నవారు. కాని నేర్పుతో బరిశీలించిన నివియే తమమనోరథము లీడేఱుటకు వలయుమార్గములు గలిగియున్నవని తెలియఁ జాలకున్నవారు. ఇదిచూడ నీశ్లోకము జ్ఞ. కివచ్చుచున్నది.

శ్లో. హరినఖరవిముక్తా రక్తసిక్తాహి ముక్తాః
పరిణతబదరాణీ త్యాదరే ణోపగృహ్యా
సపది సరసి ధౌతాః ప్రత్యభిజ్ఞాయముక్తాః
పరికిరతి కిరాతీ హ న్త కాన్తార ఏవ.

నిష్కామరయ వైరాగ్యసంపన్నులై స్వార్థములఁ ద్యజించినవారే సంఘమునకు మేలు చేయఁగలరు కాని, ఈషణత్రయబద్ధు లగు సంసారు లంతగా సాంఘికసంపదలకు సహకారులు కాఁజాలరు; పురాణాంతర్గతము లగు భగవద్గీతాది వేదాంతబోధలు మానవులు స్వధర్మముల నెఱవేర్పవలయు ననియు, స్వధర్మములఁ ద్యజించువాఁడు సంఘబాహ్యుఁ డగుననియు, బోధించుచున్నవి. కాని, సంఘాభివృద్ధిని నిరసించి దుర్బలము చేయుమని బోధించుట లేదు.

అధికారితారతమ్యమునుబట్టి వైరాగ్యమును బోధించుచున్నను విరాగులుకూడ లోకసంగ్రహార్థము జాతీయధర్మముల నెఱవేర్పవలయు ననియే ఘోషించుచున్నవి. పరమవైరాగ్య సంపన్నులగుజనకాది సార్వభౌములచరితము లీవిషయమునే రుజువుచేయుచున్నవి.

మనయార్యసిద్ధాంతములు లౌకికసుఖములే ముఖ్యములు కావనియు, నాముష్మికభంగకరములు కాకుండులాగున నియమానుసారమనుభవింపవలయు ననియు, బోధించుచున్నమాట యథార్థమే. కాని యీబోధను గాదను ప్రాజ్ఞు లుండ రనియే నాతలంపు. పురాణపఠనమువలన మనుజుల కెట్టిలాభము కలదో మనపూర్వులే తెలిపియున్నవారు.

శ్లో. "పఠనా చ్ఛ్రవణా ద్యేషాం
నృణాం పాపక్షయో భవేత్
ధర్మాధర్మపరిజ్ఞానం
సదాచారప్రవర్తనం,
కృపరమా తద్వత్
భక్తిర్భగవతి ప్రభో" అని.

ఇటుల మనవారేకాక పాశ్చాత్యవిద్వాంసు లనేకులు పురాణములఁ బ్రశంసించి యున్నవారు. ఇఁక వీనింజదివి కృతార్థులైన వారెవరైనఁ గలరా యనిన వేనవేలు కలరు. పూర్వము వర్ణధర్మములు సంకీర్ణములు కాక యెంత వేఱుపడి యున్నను, అప్పటి భారతీయులు పురాణచరితములఁ దమకు బ్రమాణములుగా నిడికొని మసలుటచేతనే తలలు వేఱయ్యును దలఁపులుమాత్రము వేఱుపడక సోదరభావముతో నన్యోన్యసహాకారులై భారతీయసంఘము నత్యౌన్నత్యమునకుఁ దేఁగలిగి యుండిరి. ఇందుల కనేకప్రమాణములు కలవు. గ్రంథవిస్తరభీతిచే విడిచితిని.

పురాణకథలఁ జిరకాలమునుండి మనము విను చుండుటచేఁ జర్వితచర్వణము కాదా యందు రేని యట్లనుట తగదు. మనోహరపదార్థము లెన్నిసార్లెంతకాలమునుండి యనుభవించుచున్నను విసుగు పుట్టను, సరియేకదా యందలి సారస్యము తెలిసినకొలఁది వానినే యాస్వాదింపఁ గోరిక లుద్భవించుచుండును. కావుననే రసజ్ఞు లిట్లు తెలిపియున్నవారు.

శ్లో. ఆదిత్యస్యోదయస్తాత
సౌవర్ణం భారతీ కథా
ఇష్టా భార్యా సుమిత్రం చా
పూర్వాణ్యేవదినేదినే.

ఇట "భారతీకథా" అనునది సర్వపురాణోపలక్షణము కావున నాంధ్రకవిపుంగవు లెల్లరును బురాణేక్షుకాండముల నుండి సువిమర్శయంత్రములచే రసమునుదీసి, సువర్ణకాంస్యపాత్రల నింపి యాంధ్రజాతికిసుఖాస్వాద్యమగునటు చేయుదురుగాక.

ఇట్లు చేయక సన్మార్గబోధకములగు పురాణముల నిరసింతు రేని, ప్రస్తుతము కావలసిన సోదరభావమును సౌశీల్యమును గేవల ముపన్యాసపీఠములయందే స్థావరమై యుండునుగాని పరస్పరవైషమ్యదూషితములగు మానవహృదయములనాటుకొని కార్యాచరణమునకుఁ దోడ్పడఁజాలదు.

ప్రస్తుత మాంధ్రవాఙ్మయము నొక్కపెట్టునఁ దలక్రిందుఁ చేయఁగోరువారును, అట్లు చేయరాదు సనాతననియమములనే నిలుపవలయు నను వారునుగూడ భాష యెటు లుండవలయునా యని విమర్శించుచున్నవారే కాని విషయ మెటులుండవలయునా యని విమర్శించుచున్నట్లు గానరాదు.

ముందు నిర్ధారణచేయదగినది విషయము కాని భాష కాదు. విషయము ఘనమైన దగుచో నేభాషలో వ్రాసిననేమి ? మధురాహారమును బర్ణములలోఁ బెట్టిననేమి, వెండిగిన్నెలలోఁ బెట్టిననేమి, దాని ఘనత యెప్పుడు నొక్క రీతినే యుండునుగాని, వ్యత్యస్తము కాఁజాలదు. కటుపదార్థము కాంచనపాత్రలలోఁ బెట్టినను దానికి మాధుర్యము కలుగఁజాలదు.

మఱియు సద్రత్నములు సువర్ణఘటితములైనపుడే యమూల్యాలంకారములై సంపన్నులచే నాదరింపఁబడునట్లు ఘనవిషయములు సలక్షణసువాక్యఘటితములైనపుడే యార్యులచే నభినుతింపఁబడును. నత్తగుల్లలును, గులకరాళ్లును సీసముతోఁ బొదిగిననేమి ? సీనారేకుతోఁ గట్టిననేమి ? అట్లే నీరసవిషయముల గ్రామ్యభాషలో వ్రాసినను వ్రాయవచ్చునుగాని యిపుడు నేనీభాషాశైలింగూర్చి ముచ్చటింపఁ దలఁచికొనలేదు.

ఓ యాంధ్రమహాశయులారా, మీరు నిజముగా నిష్కళంకమగు పితృభక్తిని, దైవభక్తిని, గురుభక్తిని, దేశభక్తిని, రాజభక్తిని గోరువారగుచో నట్టి భక్తిపంచకము పురాణపఠనమునఁగాని వేఱుమార్గమున మనకు లభింపఁజాలదని నిశ్చయముగ గ్రహింపుఁడు. మానవహృదయముల నట్టి పావనభక్తినదీ ప్రవాహములఁ బ్రవహింపఁజేయు ఘనోపాఖ్యానములు వేనవేలు పురాణములయందు విరాజిల్లుచున్నవని తెలిసికొనుఁడు.

ఆర్యులారా, మరల మీకుఁ జేయు నీ వినయపూర్వక విజ్ఞప్తిని సావధానులరై విన వేఁడుచున్నవాఁడను.

శ్రేయస్కాములగు నో యాంధ్రమహాజనులారా, కేవల స్వలాభపూరణపరాగపటలముచే నాచ్ఛాదితమగుచున్నట్టియు జాతిద్వేషదావానలముచే దగ్ధమగుచున్నట్టియు, నిరంతర క్షామప్రచండగ్రీష్మముచే నీరసమగుచున్నట్టియు నీపుణ్యభూమిని ఈ భారతమాతను జీవకళాసనాథ మగునటుల చేయఁగోరుదురేని శ్రీరామాద్యుత్తమనాయకులనెడి గంభీరగర్జనములతోడను, పాతివ్రత్యకళావిరాజితలగు సీతాద్యుత్తమనాయికలనెడి తటిల్లతికలతోడను, తేజరిల్లుచున్న పురాణకథాజీవనభరితములగు నవీనాంధ్రకావ్య నీరదములు తిరుగ నీయార్యావర్త నభోవీథిని గ్రమ్మి, సుబోధామృతవర్ష ధారలఁ గురియునటుల భగవంతునిఁ బ్రార్థింపుఁడు. దీనిని మించిన దేశోపయోగకార్యము వేఱొండు లేదనియు, దీని మించిన పావనకృత్యము వేఱొకటి లేదనియుఁ దెలిసికొనుఁడు.

కావున మన యాంధ్రభాషయందు వ్రాయఁబడు నవలలును నాటకములునున్నగునవి ప్రాయికముగా మన పురాణములనుండి తీయఁబడిన యుత్తమనాయకజీవితచరిత్రలు కలవిగా నుండవలయును.

ఓ కరుణాకరా, పరమేశ్వరా, మా యాంధ్రహృదయపుండరీకములు వికసించి శ్రీమంతములగునటుల నీ తూర్పుదేశమునఁ బురాణజ్ఞానసూర్యోదయ మగునటులఁ బ్రసాదింపుము.

ఓమ్ తత్సత్.

# వార్తలు - విశేషాలు

## శ్రీరామకృష్ణజయంతి మహోత్సవములు, శ్రీరామకృష్ణమఠము, మద్రాసు - 4.

1971 వ సంవత్సరం ఫిబ్రవరి 27 వ తేది శనివారంనాడు శ్రీరామకృష్ణ పరమహంస దేవుని 137 వ జయంతి తిథిపూజ మద్రాసు మైలాపూరు శ్రీరామకృష్ణమఠంలో యథార్థా భక్తి శ్రద్ధలతో నిర్వర్తితమైనది. భక్తులు, మగువలు మగవారు, స్కూలుపిల్లలు కాలేజి విద్యార్థులు అత్యధిక సంఖ్యలో హాజరయ్యారు. వర్ణతోరణ విరాజితమైన మండపంలో శ్రీరామ కృష్ణుని పెద్దపటం ఉజ్జ్వలంగా అలంకృతమై అమర్చబడింది. గురుదేవుని ప్రత్యక్ష శిష్యుల చిత్రపటాలు కూడా మాలాలంకృతాలయ్యాయి.

మధురనాదస్వరగానంతో దిన కార్య క్రమం ప్రారంభమైంది. గుడిలో శ్రీరామ కృష్ణ సుప్రభాత స్తోత్రం అనుసంధించారు. మంగళహారతి కావించారు. ప్రార్థనగేయాలు పాడారు. పూర్వాహ్ణమంతా భజనబృందాలు సంకీర్తనను అత్యంత మధురంగా సాగించారు. నామావళి పాడుతూ భక్తగోష్ఠి గుడికి మూడు సార్లు ప్రదక్షిణించారు. వేదోపనిషత్తుల-భగవద్గీతల – మార్కండేయ పురాణాంతర్గత దేవీ మాహాత్మ్యాధ్యాయాల పారాయణం ప్రవర్తిల్లినది. గుడిలో విశేషపూజ, మండపంలో హోమమూ ముగిసేటప్పటికి మధ్యాహ్నమైంది. ప్రసాద వినిమయంతో పగటి కార్య క్రమం ముగిసింది. వివేకానంద కాలేజి ఎన్సిసి విద్యార్థులు ఉత్సవనిర్వాహంలో తోడ్పడ్డారు.

సాయం పూజానంతరం మఠ మండపంలో భక్తులు సమావిష్టులయ్యారు. అఱువై నాలుగేండ్ల క్రితం బేలూరు మఠంలో జరిగిన శ్రీరామకృష్ణ జయంతినాడు గురుదేవుని ప్రత్యక్ష శిష్యులలో అన్యతములైన శ్రీశారదానందస్వామిగారు చదివిన వ్యాసాన్ని శ్రీవిరూపాక్షానందస్వామి స్వకీయ వ్యాఖ్యాసమేతంగా చదివి వినిపించారు. ఆ వ్యాసంలో శ్రీశారదానందస్వామి స్వార్థపరత్వ దూషితభక్తిని ఖండించారు, ఆరాధ్యమానుడగు దేవుని కల్యాణగుణాలను ఆరాధకుని లోనికి సంక్ర మింపజేసే ఋజుభక్తి ప్రభావాన్ని ప్రస్తు తించారు. అవతారపురుషుల జీవిత విశిష్టతను ప్రతిపాదించారు. బాల్యంలోనే అతిమానుషత్వమును సూచించిన శ్రీరామకృష్ణు నసాధారణ చేష్టితములను పేర్కొన్నారు. గురుదేవుని మాట లెంత తేటలో ఐనను వాని అర్థపు లోతెంతో సూచించారు. పైకి విభిన్నములుగ గనవగు మతాల కంతర్గతముగ నున్న సామరస్యము శ్రీరామకృష్ణుని సాక్షాత్కారాను భూతులచే నిరూపితమైన విధమును వివరించారు. (ii) శ్రీమత్పరమాత్మానందస్వామి పరమహంసదేవుని జీవితములో కొన్ని మేలుములను ఈలాగు ప్రస్తుతించారు: – "శ్రీరామ కృష్ణుడు ప్రారంభాన్ని విగ్రహపూజతో చేసినా, పర్యవసానం లక్ష్యసాక్షాత్కారంతోనే. ఎఱుక పేర్మిచేత ఆయన తన గురువులకు సైతం తానే గురువయ్యాడు. అన్ని సాధనలూ సిద్ధులూ సాక్షాత్కారాలూ ఈ యుగావతార పురుషుని జీవితంలో ఇమిడి పోయాయి. ఆయన ఉన్నస్థాయిలో ప్రతిదీ, దివ్యమే. శ్రీరామకృష్ణునిలో నుండినది జీవుడు కాదు, దేవుడే. ఆ పరమహంస పవిత్రుడూ పావనుడూ అంటే చాలదు. పవిత్రతయే పావనతయే ఆయన అనాలి. ఆయనలో ప్రతిదీ, మొదట మధురమానవగుణంగా కన బడి తుదకు దివ్యవైభవంగా పరిణమించేది." (iii) మఠాధ్యక్షులు శ్రీమత్కైలాసానందస్వామి తమ పరిసమాపన ప్రసంగంలో ఈలాగు

వారిచ్చారు. "భక్తులందఱూ అవతారమూర్తి యగు శ్రీరామకృష్ణు నపారకృపను పనివడుచు కొని ఆధ్యాత్మికోన్నతుల అధిగమింప పాటు పడాలి. శ్రీరామకృష్ణుని 'మనవా' డని ప్రతి ఒక్కరమూ అభిమానింతము గాక."

1971 వ సంవత్సరం మార్చి 7 వ తేది భానువారం శ్రీరామకృష్ణ జయంతి బహిరంగోత్సవం విశాలమైన వివేకానంద సెంటినరి హాలులో ఏర్పాటు చేయబడింది. వేదికపై స్వలంకృతమైన శ్రీరామకృష్ణుని పెద్దచిత్రపటం ప్రతిష్ఠింపబడింది. (i) మధ్యాహ్నానంతర 3-30 గంటలనుండి 5-30 గంటలవఱకూ హరికథాకేసరి బ్రహ్మశ్రీ వి. ఎస్. వేంకటరమణరావు గారు గోవింద పట్టాభిషేకాన్ని గూర్చి సంగీతోపన్యాసం కావించి బాలగోపాలుని భువనమోహన లీలలను కీర్తించారు. పౌరమహాసభ 5-30 గంటలకు ప్రారంభమైంది. ప్రొఫెస్సరు పి. శంకరనారాయణగారు సభాధ్యక్ష్యం వహించారు. (ii) ప్రార్థన గేయమూ మంత్రపుష్పానుసంధానమూ అయ్యాక మఠాధ్యక్షులు శ్రీమత్కైలాసనందస్వాములు సదస్యులకు స్వాగతాశీస్సు లనుగ్రహిస్తూ నాటి మహోత్సవ ప్రాముఖ్యాన్ని కొనియాడుతూ ఈలా గన్నారు.- శ్రీరామకృష్ణు డెవరు, స్వదేశీయులకూ విదేశీయులకూ ఆయన ప్రాముఖ్య మేమి - మున్నగు విషయాలను గూర్చి ఈనాడు ప్రతి ఒక్కరికీ కొంతైనా తెలిసి ఉంది. ఆయన ఏదే నొక్క దేశానికి ప్రత్యేకంగా చెందినవాడు కాడు, విశ్వమానవతతికి ఆయన ఉమ్మడిసొమ్ము, ఆయన అవతారమూ జీవితమూ నిజంగా లోకోత్తరములు. పశ్చిమ బంగాళంలో నవ్యనాగరకతకు సుంతయు అందుబాటులో లేక కేవలసనాతనాచార దుర్గమైన ఒక అజ్ఞాతగ్రామానికి చెందిన అజ్ఞాతపురుషు డాయన ఆయన జీవిత చరిత్రాన్ని నేడు ప్రపంచ మంతటా అందఱూ భక్తిప్రపత్తులతో తలదాలుస్తూ ఉన్నారు. ఏమాశ్చర్యము! ఆయన జీవితకాలంలో విశేషభాగం దక్షిణేశ్వరంలో బ్రహ్మానందోన్మాదంలో భావసమాధి నిమగ్నతలో గడిచింది. ప్రపంచ మతచరిత్రలో శ్రీరామకృష్ణునట్టి మహాపురుషులు అరుదు. పారమార్థిక నిష్ఠకు కోటయను పేరొందిన భారతదేశంలో శ్రీరామకృష్ణు డవతరించేందుకు ముందు ఆ నిష్ఠ అడుగంటి ఉన్నది. అందుకు కారణం నవ్యభౌతికాది శాస్త్రవిజ్ఞాన ధాటియే. మానవునికి పరిపూర్ణతను సంపాదించి పెట్టడానికి ఆ విజ్ఞానమూ సాంకేతిక విద్యయూ చాలవని ప్రజలు గుర్తించేందుకు కొంతకాలం పట్టింది. ఇప్పుడు కను విప్పు గలిగింది. ఏ సందేశాన్ని శ్రీరామకృష్ణు డొక్కడే ఈయ సమర్థుడో, ఇచ్చాడో, ఆ సందేశానికై ప్రాచ్య పాశ్చాత్య ఖండాల ప్రజలు అందఱును ఉవ్విళ్ళూఱుతున్నారు. భారతీయ సంస్కృతిని తెలిసికొనేందుకు అందఱూ ఉబలాటపడుతున్నారు. ముంచుక వస్తున్న ఐహికపరతను శ్రీరామకృష్ణుడు ఆపి, 'మానవునికి శ్రేయస్సాధనమైంది, నియమబద్ధతయే కాని విశృంఖలత్వం కా' దనే సనాతనసత్యాన్ని ప్రదర్శించాడు. ఒక నూఱేండ్ల కాలంలో శ్రీరామకృష్ణోద్యమం ప్రపంచంలో ఊహాతీత వేగంతో వ్యాపించింది. శ్రీరామకృష్ణుడు వినయమునకు మూర్తీభావం, దక్షిణేశ్వరంలో దాదాపు ముప్ఫయేండ్లుండి 1886 లో కల్కత్తాలో మహాసమాధి చెందాడు. లోకానికి ఆయన ఈ సంఘాన్ని స్వామిజిని ఇచ్చి పోయారు. ఈనాడు శ్రీరామకృష్ణునిగూర్చి తెలియనివారు లేనే లేరు. ఆయన పేరట ఎల్లెడల ప్రజాసేవా

సంస్థలు ఉద్భవిల్లుతూ ప్రజల అక్కఱలను తీరుస్తున్నాయి. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' అనే లక్ష్యానికి తమ్ము అంకితం చేసుకున్న సన్న్యాసులు ప్రజాసేవకై పాటుపడుతున్నారు. సాధారణంగా 'సంఘసేవ' అని యితరులు పేర్కొనే సేవవంటిది కాదు వీరి సంఘసేవ. ఇది ఆధ్యాత్మికసాధనే, ప్రజల జీవితాల నున్నత స్థాయుల నధిరోహింప జేసేందుకు సాగించు ప్రశంసార్హమగు యత్నము. భారతీయ సంస్కృతీ పునర్భవ మనెడి యీ సముత్తుంగ తరంగమునకు శిఖరాలంకారము, చూడామణి, శ్రీరామకృష్ణుడు. నానానేకాన్వేషకులకు ఆయన విశ్రాంతి విడిదిని సమకూరుస్తున్నాడు. సముద్రమునుగూర్చి బుడగ ఏమి చెప్పగలదు? అట్లే శ్రీరామకృష్ణునిగూర్చి చాలినంతగా చెప్పగలవా రెవరు?''

(iii) ఈ జయంతి సందర్భంగా నగరంలోని హైస్కూళ్ళలో జరిపిన వక్తృత్వపు పోటీలలోనూ వల్లింత పోటీలలోనూ గెల్పొందిన వారికి బహుమతులు పంచిపెట్టబడ్డాయి.

(iv) దినమణి పత్రికాసహాయ సంపాదకులు శ్రీమాన్ వి. జి. వేంకటాచారిగారు తమిళంలో కావించిన ఉపన్యాససంక్షేపం:-''వంగదేశానికి ఎన్నో గొప్పలున్నాయి. అందులో ఒకటి సర్వమత సమన్వయ సందేశోద్ఘాటకుడైన శ్రీరామకృష్ణు నవతారస్థలం కావడం. అన్యమతాలను హిందు వెప్పుడు కానీ దూషింపడు. తనకు నచ్చిన దారిలో పోవుటకు హక్కు ప్రతి ఒక్కరికి ఉందని హిందువు గుర్తిస్తాడు. 'యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజా మ్యహమ్' ఎవరు ఏదారిలో నన్ను ఆశ్రయిస్తారో వారిని ఆ దారిలోనే నేను చేరదీసుకుంటానని సర్వేశ్వరు డొసగిన వాగ్దానం భగవద్గీతలో శాశ్వతంగా భద్రపఱుపబడి ఉంది. హిందువుల సంధ్యావందనంలో—

ఆకాశా త్పతితం తోయం
యథా గచ్ఛతి సాగరమ్
సర్వదేవనమస్కారః
కేశవం ప్రతి గచ్ఛతి.

''మింటినుండి పడ్డ నీరు సముద్రానికే పోయి చేరినట్లు, ఏ దేవుణ్ణిగూర్చి చేయబడ్డ నమస్కారమైనా దేవదేవుడైన కేశవునకే చెందుతుంది'' అనెడి మంత్రం అనుదినమూ అనుసంధించబడుతున్నది. విశేష మే మంటే— ఈ సత్యాలన్నీ శ్రీరామకృష్ణునికి అనుభూతి దృష్టములే కాని కేవల పుస్తకపాఠాలు కావు. బడిచదువు ఆయన చదువలేదు. పొట్టకూటి చదువును ఏవగించుకొని ఆత్మవిచారమే తన కభిమత మని బాల్యంలోనే ఆయన స్పష్టపఱచాడు. సత్సంగతియు సాధుసేవయు ఆయన కత్యంత ప్రీతికరాలు. సాధనలలో సిద్ధిపొందిన వారగు పెక్కుంద్రు తమంతట శ్రీరామకృష్ణునొద్దకు వచ్చి పరమార్థాన్వేషణలలో ఆయనకు సాయపడ్డారు. దక్షిణేశ్వరగుడిలో ఆయన పూజారి యయ్యాడు. ఆయనసాధనల సిద్ధిక్షేత్రంగా దానిని విశ్వమానవులు గౌరవిస్తున్నారు. సాధనద్వారా ఆయన దేవుణ్ణి ప్రత్యక్షంగా చూచాడు, దేవునిలో తాను కరగిపోయ్యాడు, దైవోన్మత్తు డయ్యాడు. దివ్యానుగ్రహనిధియగు ఆయనవంకకు అసంఖ్యాకులైన మగువలు మగవారు ఆకృష్టు లయ్యారు. ఆయన శ్రీ శారదాదేవిని వివాహమాడాడు. ఐతే వారిది ఇంద్రియాతీతమైన సాహచర్యం. పతి ఏ ధర్మాన్ని అనుసరిస్తాడో సతికిన్నీ అదే ధర్మం. పతితో శ్రీ శారదమ్మ నెరపిన సహధర్మచర్యం అలనాడు శ్రీ రామచంద్రునితో

సీతమ్మ నేరపిన సహధర్మచర్యాన్ని స్మరింప జేస్తుంది. అడవికి తరలిన శ్రీరామచంద్రునితో సీతమ్మ పల్కిన పల్కులు—

జనకుఁడు జననియు సకియలుఁ
దనయుండును దనకుఁ గారు, తథ్యము, ధరలో
వినుము సతి కిందు నందును
ఘనుఁడగు పతియొక్కఁడె పరమగతి తలపోయన్.
అనఘా, నీ విపుడే వన
మునకుం జని తేని, నీదు ముంగలఁ గుతుకం
బునఁ గుశకంటకముల నొగి
వనిమృదువుగఁ జేసికొనుచు వచ్చెదఁ బ్రీతిన్.
అతులత్రిలోకసుఖసం
తతియైన న దేల? వినుము, ధరణీశ, పతి
వ్రతలగు సతులకు నిత్యముఁ
బతిసేవ చతుర్విధేష్ట ఫలదము కాదే!

నిత్యబ్రహ్మచర్యులైన శ్రీశారదారామకృష్ణుల దాంపత్యజీవితం అలౌకిమూ అతిలౌకికమున్నూ. శ్రీరామకృష్ణుడు తాంత్రికసాధనలను భక్తి మార్గాన్ని అద్వైతాన్ని మహమ్మదీయక్రైస్తవ పథాలను అనుష్ఠించి అన్నింటి లక్ష్యైక్యాన్ని స్వానుభవంలో గుర్తించాడు, స్వోపదేశంలో పదిలపఱిచాడు. 'ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజం' ''నేను దశరథుని కుమారుడ నని, రాముడ నని, మనుష్యుడ నని అనుకుంటున్నా'' నని చెప్పిన శ్రీరాముని వైఖరే శ్రీరామకృష్ణునిదిన్నీ. బుద్ధునందు శిక్కగురువులందు ఆయన కెంతో గౌరవం. తనగురువైన తోతాపురికి నలభై యేండ్లు పట్టిన నిర్వికల్ప సమాధి సమారోహణాన్ని శ్రీరామకృష్ణు డొక్కదినంలో సాధించాడు. ద్వైతవిశిష్టాద్వైతాద్వైతమార్గాలకు ఆయన దృష్టిలో ఎట్టి విరోధము లేదు. యాత్రపోతున్నప్పుడు దారిలో ఒకపల్లె ప్రజల కటికపేదఱికాన్ని అక్కడి క్షామపరిస్థితులను జూచి శ్రీరామకృష్ణుడు ''ఈ ప్రజలకు అన్నవస్త్రము లిమ్ము, ఇచ్చిననే నేను యాత్ర సాగింతు'' నని మథురానాథవిశ్వాసుని నిక్కచ్చి చేసి యిప్పించెను. దీనినే ఈయన శిష్యవరేణ్యుడు 'దరిద్రనారాయణసేవ' అను తనసంస్థ ముఖ్యకార్యక్రమాలలో అగ్రగణ్యముగా నొనర్చాడు.''

(v) వివేకానందకాలేజి ప్రిన్సిపాలగు శ్రీ జి. వేంకటరామనుగారు ఆంగ్లంలో ఈలాగు ఉపన్యసించారు: ''భగవత్సాక్షాత్కారమే ఆస్తికధర్మసారము. అన్ని మతాలలోను మూలాంశ మొక్కటే. విశ్వమతాచార్యుల సూక్తులు ఏకార్థకములే. అన్ని మతాలలక్ష్యము ఒక్కటే అని శ్రీరామకృష్ణుడు వక్కాణించాడు. క్లిష్టసమస్యకు తన పరిష్కారాన్ని సూత్రప్రాయంగా ఒక్కవాక్యంలో ఆయన యిమిడ్చాడు. అందఱు అవతారమూర్తులవలెనే శ్రీరామకృష్ణుడు విశ్వమహాపురుషుడు. ధర్మ సంస్థాపనమే అవతార ప్రయోజనం. ప్రపంచంలో పుట్టింది మొదలుకొని శారీరక – మానసిక – నైతికరంగాలలో వలెనే ఆధ్యాత్మికరంగంలోను మానవుడు క్రమాభివృద్ధి సాధిస్తున్నాడు. అతిమానుష వ్యక్తులు ఆవిర్భవించారు, భవిష్యత్కాలంలో ఇంకా ఇంకా ఆవిర్భవించగలరు. ఈలాంటి జయంతిమహోత్సవాలచేత అందు పాల్గొనే వారి పవిత్రత హెచ్చుతుంది. వానిప్రభావం అమోఘం. ఆ మహాపురుషుల నెంత ప్రసుతించినా విసుగుపుట్టదు, ఉదాత్తత కలుగుతుంది. రామాయణాన్ని వినే కొద్దీ ఇంకా వినాలనే తృష్ణ కదా శ్రోతలలో హెచ్చుతుంది. శ్రీరామకృష్ణ దివ్యమంగళవిగ్రహ దర్శనం చాలు ప్రేక్షకులను ఉన్మత్తులుగ చేయ

డానికి. ఆయన దైవోన్మాదాన్ని గూర్చి చదివిన వారు రోమాంచకంచుకితులు కాక తప్పదు. నల్లని మబ్బుచాలుక్రింద తెల్లని కొంగల బారును చూచినప్పుడు శ్రీరామకృష్ణునకు గలిగిన భావతన్మయత, పల్లెనాటకంలో శివ పాత్రధరించినప్పుడు ఆయనకు గలిగిన శివావేశం, ఉపనయనమప్పుడు ఆయన నిమ్నవర్ణ మహిళయగు ధని యొద్ద తొలిభిక్ష స్వీకరించడం ఇవి అనుసంధాతలకుకూడా తన్మయత నాపదిల్ల చేసే సంభవాలు. ఆస్తిక్య మనేది వర్ణ వర్గాదిభేదాతీత మని ఆయన నిరూపించాడు. తన సాక్షాత్కారానుభవాలను ఆయన వక్కణంలోనే విని శ్రీ వివేకానందాదులు గగుర్పాటు చెందారు. తుదిదినాలలో కంఠవ్రణం చేత గురుదేవునకు ఆహారము మ్రింగుడుపడకున్నది. రవంతైనా ఆహారము లోనికి పోవునట్లుగ లోకజననిని ప్రార్థింపు మని భక్తులు గురుదేవుని నిక్కచ్చిచేశారు. వారికై గురుదేవుడు ఆలాగు ప్రార్థింపగా లోకజనని ఆయనకు వారినందఱిని జూపి "ఇన్ని నోళ్లగుండ నీవు తినుచుండ లేదా" అనిందట. బడిచదువు లేక బ్రహ్మజ్ఞాననిధియైన గురుదేవు నుపదేశాలు సరళమధురాలు.

(vi) సమాపనోపన్యాసంలో సభాధ్యక్షులయిన ప్రొఫెసరు శంకరనారాయణునుగారిలా గన్నారు–ఆధ్యాత్మికతాచరిత్రలో భారతదేశస్థానం సమున్నతమైంది. అందు కెన్నో కారణా లున్నాయి. ఒక్కకారణం ఇది: దేవుణ్ణి ప్రత్యక్షంగా చూడాలి అనే దీక్ష ఈ దేశంలోనే చూడవచ్చు. దేవుణ్ణి చూపు మని హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి గద్దించాడు. దేవుడు ప్రత్యక్షంగా కనబడి హిరణ్యకశిపుని తనలో లయింపజేసికొన్నాడు. శ్రీ వివేకానంద స్వామి శ్రీరామకృష్ణుని "దేవుని చూచితివా" అని అడిగాడు శ్రీరామకృష్ణుడు స్వామిజీకి సాక్షాత్కారానుభూతిని కలుగజేయడం స్వామిజీ గురుదేవుని శ్రీచరణములకు అమ్ముడుపోవడం జరిగింది. జయంతిసమావేశాలలో మనం ఆ మహనీయుల గొప్పలను ప్రస్తుతించి 'సర్టిఫికేట్లు' ఇవ్వడంతో ఆగకూడదు. వారి ఉపదేశాలను మన ఆచరణలోకి తేవాలి."

(vii) ప్రొఫెసరు జి. ఎస్. శేషాద్రిగారి వందనసమర్పణంతో సభాకార్యం ముగిసింది.

ఆ దినం ఏకాదశి కాబట్టి ఆచారప్రకారం మఠ భజన బృందంవారు శ్రీమత్ప్రియానంద స్వాముల ఆధ్వర్యంలో గంటసేపు శ్రీరామనామసంకీర్తనం చేశారు.

## "శ్రీరామకృష్ణ సేవానిలయం"

### పెనుగుదురుపాడు

**తెనాలితాలూకా, గుంటూరుజిల్లా.**

శ్రీరామకృష్ణ జయంతి మహోత్సవము 27-2-1971 వ తేదీన నిలయమందు జరుపడమైనది. ఈ దినముననే యీ సేవానిలయానికి ప్రథమ వార్షిక మహోత్సవమై యున్నది. ఈ దినము ఉదయము అభిషేకము, రామకృష్ణ పూజ జరుపడమైనది. సాయంకాలము భజన జరుపబడినది. శ్రీరామకృష్ణుని 136 వ జయంతి సంబంధంగా బహిరంగ కార్యక్రమము 6-3-71 వ తేదీన జయప్రదముగ జరిపితిమి. ఉదయము 8 గంటలనుండి 11 గంటలవఱకు శ్రీరామకృష్ణుని పూజించి ప్రసాద వినియోగానంతరము, ఇరవైమంది బీదల కన్నదానము చేయబడినది. సాయంకాలము 5 గంటలనుండి 10 గంటలవఱకు బహిరంగసభ జరుపబడినది. 5 గంటలనుండి 6 గంటలవఱకు విజయవాడ, రామకృష్ణసమితి (జోగేశ్వరరావు & పార్టీ) భజనచేయడమైనది. సభకు శ్రీచింతమనేని

శివరామయ్యా చౌదరిగారు, అడ్వకేటు, తెనాలి అధ్యక్షత వహించి గంభీరముగ ఉపన్యసించారు. ఈ నిలయం ప్రథమ వార్షికనివేదిక చదివి వినిపించడమైనది. 21-2-71 వ తేదీన ఈ నిలయం తరుపున శ్రీ P. కామేశ్వరరావు గారు తెనాలితాలూకా పాఠశాల లన్నిటిలో పై తరగతులలో క్రింది తరగతులలో బాల బాలికలకు వ్యాసరచనపోటీలు జరిపి అందు పాల్గొన్న విద్యార్థులకు బహుమతులను అధ్యక్షుల వారిచేతను, తెనాలి తాలూకా జూనియర్ కాలేజి ప్రిన్సుపాలుగారయిన శ్రీ N. S. R. K. శర్మగారిచేతను ఇప్పించడమైనది. శ్రీ B. S. R. ఆంజనేయులుగారు ట్రెజరర్, రామకృష్ణ సేవాసమితి, బాపట్ల వారు వివేకానంద స్వామినిగుఱించి ఉపన్యసించారు. శ్రీ జోగేశ్వరరావుగారు జాయింట్ సెక్రటరి, విజయవాడ శ్రీరామకృష్ణునిగుఱించి విపులముగ ముచ్చటించిరి. తదుపరి వివేకానంద సెంటినరీ హైస్కూలు ప్రధానోపాధ్యాయులైన శ్రీ N. V. సుబ్బారావుగారు జగన్మాత యయిన శ్రీశారదాదేవిని గుఱించి సదస్యులను ఉత్తేజపఱచునట్లు చాల విపులముగ ఉపన్యసించారు. చివరగా తెనాలి ఆనరరీ బెంచి మేజిస్ట్రేటుగారయిన శ్రీ త్రిపురమల్లు నరసింహారావుగారు మృదుమధురముగ ఉపన్యసించిరి. 10 గంటలకు జయజయ శబ్దములతో సభ ముగిసెను. అనంతరము ప్రసాద వినియోగము జరిగెను.

# గ్రంథపరిచయం

## సంస్కృత పాఠమాల (6)

ప్రాప్తిస్థానం:- గీతాప్రచారక పరిషత్ సంస్కృత పాఠశాల, మహబూబాబాదు, వరంగల్లు జిల్లా, పుటలు 58. వెల రూపాయి.

పండిత శ్రీపాద దామోదర సాత్వలేకరు గారు హిందిభాషలో రచించిన సంస్కృత పాఠమాలకు ఇది ఆంధ్రానువాదం. అనువాదకులు శ్రీ గడ్డమణుగు మోహనరావు శ్రీ తొగిటి వేంకటరామ శంభుగారలు. పరిష్కర్తలు శ్రీపల్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులుగారు. మొత్తము ఇరవై నాలుగు భాగాలలో ఇది ఆఱవది. ఇందు అనువాదమార్గంలో సులభసంస్కృత వాక్యాలను అర్థంచేసికోవడమున్నూ వ్రాయడమున్నూ కలపబడి ఉన్నది. సమాస ప్రకరణం ఈ భాగంలోనే ప్రారంభింపబడి తర్వాతి భాగాలలో పూర్తిచేయబడవలసి ఉన్నది. సులభంగా సంస్కృతభాషను అలవఱచు ప్రయోజనమును ఈ పాఠమాల అమోఘంగా సాధించగలదు.

ప్రభాకర్.

# భక్తియోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో, శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవా రిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

121+4 పుటలు ఆఱవ కూర్పు వెల : రూ. 1-50

# కర్మయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ వివేకానందస్వాములవారు కర్మయోగతత్త్వము నరటిపండొలిచినరీతిని విశదీకరించియున్నారు. కర్మమెటుల మోక్షసాధనమో స్పష్టీకరించియున్నారు. కర్మయోగ రహస్యము నెఱుగగోరు జిజ్ఞాసువుల కిది కల్పతరువు.

146+8 పుటలు ఏడవ కూర్పు వెల : రూ. 1-50

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4.

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారి యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు | రెండవ కూర్పు | వెల : రూ. 4-00

నూతన ముద్రణము ! | ఇప్పుడే వెలువడినది !

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయ భాగము—రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) | ఆఱవ కూర్పు | వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు—4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు—21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారి యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు　　　రెండవ కూర్పు　　　వెల : రూ. 4-00

నూతన ముద్రణము!　　　ఇప్పుడే వెలువడినది!

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయ భాగము-రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)　　　ఆఱవ కూర్పు　　　వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు–4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,

శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# జ్ఞాన యోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు— అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారి యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు　　రెండవ కూర్పు　　వెల : రూ. 4-00

నూతన ముద్రణము !　　ఇప్పుడే వెలువడినది !

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయ భాగము-రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)　　ఆఱవ కూర్పు　　వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు—4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# జ్ఞానయోగము

అనువాదకులు :
కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు—అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల గావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు | రెండవ కూర్పు | వెల : రూ. 4-00

నూతన ముద్రణము! | ఇప్పుడే వెలువడినది!

# రాజయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయ భాగము–రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) | ఆఱవ కూర్పు | వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు–4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు–21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు | రెండవ కూర్పు | వెల : రూ. 4-00

నూతన ముద్రణము।   ఇప్పుడే వెలువడినది।

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయ భాగము–రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) | ఆఱవ కూర్పు | వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు–4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు–21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు　　రెండవ కూర్పు　　వెల : రూ. 4-00

నూతన ముద్రణము!　　ఇప్పుడే వెలువడినది!

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయ భాగము—రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)　　ఆఱవ కూర్పు　　వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు—4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు_21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారి యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు | రెండవ కూర్పు | వెల : రూ. 4-00

నూతన ముద్రణము। | ఇప్పుడే వెలువడినది।

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయ భాగము—రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) | ఆఱవ కూర్పు | వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు—4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు—21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు　　రెండవ కూర్పు　　వెల : రూ. 4-00

నూతన ముద్రణము !　　ఇప్పుడే వెలువడినది !

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయ భాగము—రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)　　ఆఱవ కూర్పు　　వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు—4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు_21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు రెండవ కూర్పు వెల : రూ. 4-00

నూతన ముద్రణము ! ఇప్పుడే వెలువడినది !

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయ భాగము–రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) ఆఱవ కూర్పు వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు–4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు–21) న ముద్రింపబడి,

శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౭ ౧౯౭౧ - మే : విరోధికృత్తు - వైశాఖము సంచిక ౧౧

## విషయసూచిక

ఫోన్ : 71231 పోస్టు బాక్సు : 635

మా మాసపత్రికలు

# వేదాంతకేసరి

తత్త్వశాస్త్ర - మత - సంస్కృతివిషయికంగా 1914-వ సంవత్సరంనుండి నడపబడుతుండే
ఆంగ్ల మాసపత్రిక

సాలు చందా : ఇండియాలోను, సింహళంలోను 6 రూపాయలు;
ఇతర విదేశాలలో 3 డాలర్లు, లేదా 14 షిల్లింగులు.

# శ్రీ రామకృష్ణ విజయం

మత - సాంస్కృతికవిషయికంగా 1921-వ సంవత్సరమునుండి ప్రచురింపబడుతున్న తమిళ మాసపత్రిక

సాలు చందా : ఇండియాలో ర్సూ 5 లు, సింహళము ర్సూ 7 లు.

# శ్రీ రామకృష్ణ ప్రభ

1944-వ సంవత్సరంనుండి ప్రచురింపబడుతూ విశ్వోపజీవ్యమైన ఆధ్యాత్మిక విజ్ఞానామృతమును వెదజల్లే
తెలుగు మాసపత్రిక

సాలు చందా : ఇండియాలో ర్సూ 5 లు, సింహళము ర్సూ 7 లు.

1. చందాదారులు ఉత్తరప్రత్యుత్తరాలలో తమ 'చందాదారు సంఖ్య' నుదాహరిస్తూ విలాసాలను స్పష్టంగా వ్రాయాలి.
2. పత్రిక అందకపోతే మాసాంతానికి మాకు తెలుపాలి.
3. చందాదారులకు మేము ప్రచురించిన గ్రంథాలలో కొన్ని తగ్గింపు ధరలకు అందజేస్తాం. వివరాలకు క్రింది విలాసానికి వ్రాయండి.
4. ప్రముఖ సంస్కృతి కేంద్రాలలో ప్రచారంలో ఉన్న యీ ఆధ్యాత్మిక విజ్ఞాన పత్రికలు అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకాలు. రేట్లకు వ్రాయండి.
5. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపవలసినదని గ్రంథకర్తలకు ప్రకాశకులకు మా ప్రార్థన.
6. ప్రజారంజకములైన మత - తత్త్వశాస్త్ర - సంస్కృతివిషయిక స్వతంత్ర వ్యాసాలను రచయితలు అందజేస్తే సంపాదకులు కన్నుల కద్దుకొని ప్రచురిస్తారు.
7. పత్రిక స్పెసిమెన్కాపి కోరేవారు 75 పైసల పోస్టేజి పంపాలి.

---

ఇంకా వివరాలు కావలసినవారు :

## మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠం, మైలాపూరు, మద్రాసు-4

అనే విలాసానికి వ్రాయండి.




'అఖిలవిభు శరణొందుము, యీ క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౭ } ౧౯౭౧ - మే - వైశాఖము { సంచిక ౧౧


శ్రీః

## వి వే క చూ డా మ

మూలము : శ్రీ శంకర భగవత్పాదులు

వ్యాఖ్యాత : అన్నమాచార్య

బీజం సంసృతిభూమిజస్య తు తమో, దేహాత్మధీ రఙ్కురో,
రాగః పల్లవ, మమ్బు కర్మ తు, వపు స్స్కన్ధో, ఽసవ శ్శాఖికాః,
అగ్రాణీన్ద్రియసంహతిశ్చ, విషయాః పుష్పాణి, దుఃఖం ఫలం
నానాకర్మసముద్భవం బహువిధం, భోక్తాత్ర జీవః ఖగః. 145

అజ్ఞానము విత్తనము, అందుండిపుట్టిన చెట్టు సంసారము, దీనికి—దేహాదులందు గల్గు ఆత్మబుద్ధియే మొలక, నిషిద్ధములపై గలుగు వలపే చిగురు, సుకృతదుష్కృతరాశియే నీరు, శరీరమే బోదె, ప్రాణములే కొమ్మలు, జ్ఞానేంద్రియకర్మేంద్రియములే కొమ్మలకొసలు, ఇంద్రియవిషయములే పుష్పములు, నానాకర్మలవలన గలుగు బహువిధదుఃఖమే ఫలము, ఆ ఫలమును దిను పులుగే జీవుడు. ౧౪౫

అజ్ఞానమూలో ఽయ మనాత్మబన్ధో నైసర్గికో ఽనాది రనన్త ఈరితః
జన్మాప్యయవ్యాధిజరాదిదుఃఖప్రవాహతాపం జనయ త్యముష్య. 146

ఈ దేహాదిబంధమునకు మూలము అజ్ఞానము. ఈ బంధమును నైసర్గిక మనియు అనాది యనియు అనంత మనియు అందురు. జీవునకు జననమరణవ్యాధివార్ధక్యాదిదుఃఖపరంపరను గలిగించున దీ బంధమే. ౧౪౬

నాస్త్రై ర్న శస్త్రై రనిలేన వహ్నినా భేత్తుం న శక్యో న చ కర్మకోటిభిః
వివేకవిజ్ఞానమహాసినా వినా ధాతుఃప్రసాదేన సితేన మఞ్జునా. 147

ఈ బంధమును త్రెంచుటకు అస్త్రములును శస్త్రములును గాలియు నిప్పును సమర్థములు కావు. కోట్లకొలది కర్మల ననుష్ఠించినను ఈ బంధము తెగదు. దీనిని త్రెంప గల మహాఖడ్గము, ఆత్మాపరోక్షసాక్షాత్కారమే. అది ఈశ్వరానుగ్రహముచే పదునెక్కిన ఖడ్గము.

శ్రుతిప్రమాణైకమతేః స్వధర్మనిష్ఠాతయై వాత్మవిశుద్ధి రస్య,
విశుద్ధబుద్ధేః పరమాత్మవేదనం, తే నైవ సంసారసమూలనాశః. 148

వేదము పరమప్రమాణ మనెడి దృఢాధ్యవసాయముగలవానికి స్వధర్మనిష్ఠచేతనే అంతరంగశుద్ధి చేకుఱును. విశుద్ధబుద్ధికి ఆత్మసాక్షాత్కారము కల్గును. ఆత్మసాక్షాత్కారముచే సంసారము సమూలముగ నశించును. ౧౪౭

కోశై రన్నమయాద్యైః పఞ్చభి రాత్మా న సంవృతో భాతి
నిజశక్తిసముత్పన్నైః శైవలపటలై రి వామ్బు వాపీస్థమ్. 149

డిగ్గియలోని నీరు, ఆ నీటినుండియే యుప్పతిల్లిన నాచుతీగలమఱుగున కానరాకుండును. అట్లే పరమాత్మయు తనమాయాశక్తిచేతనే గల్గిన అన్నమయాదికోశము లైదింటిమఱుగున కానరాకుండును. ౧౪౮

తచ్ఛైవాలాపనయే సమ్యక్సలిలం ప్రతీయతే శుద్ధమ్
తృష్ణాసన్తాపహరం సద్యస్సౌఖ్యప్రదం పరం పుంసామ్. 150

ఆ నాచును చక్కగా తొలగించినచో, శుద్ధమును ప్రాణులకు దప్పి బెట్టను దీర్చునదియు వెంటనే పరమసౌఖ్యమును గూర్చునదియు నగు నీరు కానిపించును. ౧౫౦

పఞ్చానా మపికోశానా మపవాదే విభా త్యయం శుద్ధః
నిత్యానన్దైకరసః ప్రత్యగ్రూపః పర స్స్వయంజ్యోతిః. 151

కోశములలో ఒక్కొక్కదానిని 'ఇది ఆత్మ కాదు, ఇది ఆత్మ కాదు' అనుచు నైదింటిని త్రోసివేసినపిమ్మట స్వయంప్రకాశమును విశుద్ధమును నిత్యానందైకరసమును ప్రత్యగ్రూపమునగు పరమాత్మ ప్రత్యక్ష మగును. ౧౫౧

ఆత్మానాత్మవివేకః కర్తవ్యో బన్ధముక్తయే విదుషా
తే నై వానన్దీభవతి స్వం విజ్ఞాయ సచ్చిదానన్దమ్. 152

బంధవిముక్తికై ప్రాజ్ఞునకు ఆత్మానాత్మవివేకము కర్తవ్యము. ఆత్మానాత్మవివేకముచేతనే సచ్చిదానందమగు స్వస్వరూపమును దెలిసికొని యాత డానంద మొందుచున్నాడు.

ముఞ్జా దిషీకా మివ దృశ్యవర్గా త్ప్రత్యఞ్చ మాత్మాన మసఙ్గ మక్రియమ్
విచిత్య తత్ర ప్రవిలాప్య సర్వం తదాత్మనా తిష్ఠతి య స్స ముక్తః. 153

ముంజగడ్డిపోచ పైపొరలపుఱుగునుండి పుల్లను జాగరూకతతో వేఱుపఱచినట్లు, అసంగమును నిష్క్రియము నగు ప్రత్యగాత్మను దృశ్యవర్గమునుండి సాధనలచే వేఱుపఱచి, (పామనెడి తెలివిలో త్రా డనెడి భ్రాంతి లయించినట్లుగా మిథ్యయైన) సమస్తమును సాక్షాత్కృతాత్మలో లయింపజేసి, ఆత్మతో ఐక్యానుభూతి గన్నవాడు ముక్తుడు. ౧౫౩

దేహో ఽయ మన్నభవనో ఽన్నమయ స్తు కోశ
శ్చాన్నేన జీవతి వినశ్యతి తద్విహీనః
త్వక్చర్మమాంసరుధిరాస్థిపురీషరాశి
ర్నాయం స్వయం భవితు మర్హతి నిత్యశుద్ధః. 154

త్వక్కు, చర్మము, మాంసము, నెత్తురు, ఎముకలు, మలము—అనువానిరాశియగు ఈ దేహము అన్నమువలన పుట్టుచున్నది, అన్నముచేతనే ఎదుగుచున్నది, అన్నముచేతనే జీవించుచున్నది, అన్నము లేనిచో నశించుచున్నది. పరతంత్రము అనిత్యము అశుద్ధము నగు దేహమునకు స్వతంత్రము నిత్యము శుద్ధమునగు ఆత్మ యనిపించుకొను నర్హత లేదు. ౧౫౪

పూర్వం జనే రధిమృతే రపి నాయ మస్తి
జాతక్షణఃక్షణగుణో ఽనియతస్వభావః
నైకో జడ శ్చ ఘటవ త్పరిదృశ్యమాన
స్స్వాత్మా కథం భవతి భావవికారవేత్తా. 155

జడమును దృశ్యము నగు ఈ దేహము పుట్టుకకు ముందు లేదు, చావునకు పిదప లేదు, క్షణక్షణమునకు వృద్ధిక్షయములకు మార్పులకు లోనగుచుండును. దీనికి స్వభావనియతి లేదు. ఇట్టి యిది సత్తును చిత్తును నిర్వికారమును సదా ఏకరూపమునగు ఆత్మ ఎట్లు కాగలదు!

పాణిపాదాదిమా న్దేహో నాత్మా వ్యఙ్గే ఽపి జీవనాత్
తత్తచ్ఛక్తే రనాశా చ్చ న నియమ్యో నియామకః. 156

అవయవములు కొన్ని లోపించినను, వానిశక్తి లోపింపదు, బ్రతుకు సాగుచునే యుండును. సావయవత దేహమునకే కాని ఆత్మకు లేదు. ఆత్మ నిరవయవము. దేహము నియమ్యము, ఆత్మ నియామకము. కావున దేహ మెట్లు ఆత్మ కాగలదు? ౧౫౬

దేహ తద్ధర్మ తత్కర్మ తదవస్థాది సాక్షిణః
సత ఏవ స్వతస్సిద్ధం తద్వైలక్షణ్య మాత్మనః. 157

దేహమునకును దేహధర్మములకును దేహకర్మములకును దేహావస్థలకును సాక్షిగ నుండునది, సదా ఉండునది, ఆత్మ. కావున దేహమునకంటె ఆత్మ విలక్షణమైన దనుట తనంతట సిద్ధించుచున్నది. ౧౫౭

శల్యరాశి ర్మాంసలిప్తో మలపూర్ణో ఒతికశ్మలః
కథం భవే దయం వేత్తా స్వయ మేత ద్విలక్షణః. 158

మలపూర్ణమును అతికశ్మలమునగు ఈ దేహము ఎముకల ప్రోగు. ఆ ప్రోగునకు పూతగా మాంస మున్నది. ఇట్టి దేహమునకంటె విలక్షణమైనది జ్ఞాతయగు ఆత్మ. దేహ మాత్మ ఎటగును? ౧౫౮

త్వఙ్మాంసమేదో ఒస్థిపురీషరాశా వహంమతిం మూఢజనః కరోతి
విలక్షణం వేత్తి విచారశీలో నిజస్వరూపం పరమార్థభూతమ్. 159

చర్మము మాంసము మెదడు ఎముకలు మలము అనువానిరాశియగు దేహము తానని మూఢుడు తలంచును. వివేకి యన్ననో స్వస్వరూపము దేహమునకంటె విలక్షణమైన దనియు పరమార్థమైన దనియు నెఱుగును. ౧౫౯

దేహో ఒహ మి త్యేవ జడస్య బుద్ధి ర్దేహే చ జీవే విదుష స్త్వహంధీః
వివేకవిజ్ఞానవతో మహాత్మనో బ్రహ్మాహమిత్యేవ మతి స్సదాత్మని. 160

జడుడు దేహమే తా ననుకొనును. గ్రంథపండితుడు "ఈ దేహమును నేనే, ఇందలి జీవుడును నేనే" అనుకొనును. వివేకవిజ్ఞానవంతుడగు మహాత్ము డన్ననో "ఉన్నది బ్రహ్మ మొక్కడే, బ్రహ్మమనే నేను" అనుటను సాక్షాత్కరించుకొనును. ౧౬౦

# పరమహంస ప్రబోధవాణి

శ్రీరామకృష్ణుడు :–భగవంతుడును అతని విభూతియు : – ఈ జగత్తు భగవంతుని లీలా విభూతి. జనులు ఈశ్వరునివిభూతిని గని తక్కిన యన్నింటిని విస్మరింతురు. ఈజగ మెవని విభూతియో ఆదేవుని వా రాశ్రయింపరే! సదా వారు కోరునది కామినీకాంచనానుభవమే. కాని ఆయనుభవములో ఎంతో దుఃఖమును మనోవ్యథయు నున్నవి. మన విశాలాక్షినదిలో సుడిగుండ మున్నది కదా. దానివంటిది యీ లోకము. పడవ ఆ సుడిలో చిక్కుకొనెనేని, దానిని గట్టెక్కించు ఆసపాటిక నుండదు. ఈ లోకమునకు ముండ్లపొదయు ఉపమానమే. ఒకముండ్లగుబురునుండి నీవు తప్పించుకొనగలందులకు ముందే మఱొక ముండ్ల గుబురులో చిక్కుకొనుచుందువు, చొచ్చుటకేగాని వెలువడుటకు దారి లేని గొందిలో బడితివేని విముక్తి చాల దుష్కరమే. ఐహికపరతలో పడిన మానవుడు షులమలమాడిపోయిన ట్లగును.

ఒకభక్తుడు :—మహాశయా, ఇక నేది దారి ?

శ్రీరామకృష్ణుడు :—దైవప్రార్థనయు సజ్జన సాంగత్యము నే దారి. వైద్యుని సాయము లేక నీవు వ్యాధిని తొలగించుకోజాలవు – అయినను సాధుగోష్ఠిలో నొక్క దిన మున్నంతమాత్ర మున చాలదు. సాధుగోష్ఠిని నీవు సదా సమాశ్రయించుచుండవలెను. ఏల యన భవ వ్యాధి దీర్ఘవ్యాధిగ పరిణమించినది. అదియును గాక వైద్యులతో గూడియుండకున్న నీవు నాడిని చక్కగా గ్రహింప జాలవు. వారితో గూడియే ప్రవర్తిలుచుండు వేని శ్లేష్మనాడిని పిత్తనాడిని వేర్వేఱుగా గుర్తింప గల్గియుందువు.

ఒకభక్తుడు : – సాధు సాంగత్యము వలన గలుగు మేలి మేమి ?

శ్రీరామకృష్ణుడు:—సాధుసాంగత్యమువలన భగవత్తృష్ణ గలుగును, భగవత్ప్రేమ గలుగును. తహతహపాటు లేనిదే ఆధ్యాత్మికజీవితమున ఏ సిద్ధియు గలుగదు. సాధుగోష్ఠిలో సతతము మెలగుచున్నయెడల, దేవునకై ఒక యుబలాట మేర్పడును. కుటుంబమున నొకడు వ్యాధిగ్రస్తుడై మంచముపట్టియున్నప్పటి ఆ కుటుంబికుని మనఃపరిస్థితిని బోలినది యీ తహతహపాటు. రోగి కా రోగ మెట్లు నయమగునా అను చింతచే ఆ కుటుంబికుని మనస్సు సదా కొందలపడుచుండును కదా. నౌకరిని పోగొట్టుకొన్న యొకడు మరల దానిని పడయుటకై ఒక కార్యాలయమునుండి మఱొక కార్యాలయమునకు త్రిప్పట చెందుచు తహతహపడును కదా. ఈనాడు 'ఖాళీ' లేదని చెప్పిన కార్యాలయమునకే ఱేపు మరల పోయి "ఈదిన మేమేని ఖాళి యున్నదా" అని యడుగును కదా. దేవునకై కూడ ఇట్లే తహతహపడవలయును.

మఱొక దారియు కలదు – ఆస్థతో భగవంతుని ప్రార్థించుట దేవుడు మన కెంతయు సొంతము. ఆయనను మన మిట్లు కోరవలయును – "దేవా, నీ స్వరూప మేమి? నాకు అగపడుమా. నీవు నిన్ను నాకు తప్పక చూపుకోవలయును. చూపుకొనవే—నీవు నన్ను సృజించినది వే ఱెందులకు ?" శిక్కు భక్తు లొకసారి నాతో "దేవుడు దయాపూర్ణుడు" అనిరి. నే నంటిని : "దేవుని దయావంతు డని మన మేల పేర్కొనవలెను ? మనలను సృజించిన దాయనయే. ఆయనకు మనయందు దయ యున్నచో—అం దాశ్చర్యపడుట కేమున్నది? తల్లిదండ్రులు బిడ్డలను పోషింతురు. శిశుపోషణమును దయాకార్యమందురా? అది వారికి విధాయకము." కావున మనకు వలసినవాని నిమ్మని దేవుని నిక్కచ్చి చేయవలెను. మనకు తండ్రియు తల్లియు ఆయనయే. కాదందువా? "ఆస్తిలో నాభాగ మిచ్చివేయుడు, ఇచ్చువఱకు నేను నిరాహారవ్రతమును పాటింతు" నని కుమారుడు నిర్బంధించునేని, శాసనవిహితకాలమునకంటె మూడేండ్లు ముందే తల్లిదండ్రు లాస్తిలోని యతని భాగము నిచ్చివేయుదురు. మఱొక శిశువు అమ్మతో "అమ్మా, నాకు రెండు పైసలిమ్మ, మోకరిల్లి నిన్ను యాచించుచున్నా" ననునేని, అతని అక్కఱను గుర్తించి, జాగు నోర్వనిదై అమ్మ వెంటనే రెండుపైసల నా శిశువున కిచ్చును.

సత్సాంగత్యమువలన మఱొక లాభము కూడ కలదు. ఏదనగా, తథ్యమిథ్యావివేకము. దేవు డొక్కడే సత్యము నిత్యము; జగత్తు అసత్యము అనిత్యము. తనమనస్సు అసత్యము వంకకు వ్యభిచరించుచున్నట్లు తెలియవచ్చినంతనే మానవుడు వివేకమును పనివఱచుకోవలెను. ఏనుగు పొరుగింటివాని తోటలోని

అరటిచెట్టుమీదికి తొండము చాపగానే మావంతుడు దానిని బరికోలతో పొడుచును.

పొరుగు వాడొక డడిగిన ప్రశ్న:—మానవునిలో పాపప్రవణత లుండ నేల?

శ్రీరామకృష్ణుడు :– దేవుని సృష్టిలో అన్ని విధాలును ఉన్నవి. మంచివారిని సృజించినట్లే దేవుడు చెడ్డవారినికూడ సృజించినాడు. మనలో సత్ప్రవణతలను గలిగించువాడు దేవుడే, దుష్ప్రవణతలను గలిగించువాడును దేవుడే.

పొరుగువాడు మరొక డడిగిన ప్రశ్న :– అట్లగు నేని మన పాపాలకు బాధ్యులము మనము కాము కదా.

శ్రీరామకృష్ణుడు :– పాపము పాపమును బుట్టించును. అది దేవు నేర్పాటు. పచ్చిమిరపకాయను నమిలితి మేని నీనాలుక మండకుండునా? ఎలప్రాయమున నుండగా మథురానాథవిశ్వాసు జీవితము చాల ఉద్వేగముతో గడచినది. మరణించుటకు పూర్వ మత డన్ని వ్యాధులతో బాధపడుట కదే కారణము.

వయసున నుండగా మానవున కిది తెలియదు. కాళిగుడివంటగది ప్రొయ్యిలో లావు కట్టెలు మండు చుండగా నేను చూచియున్నాను. మొదట పచ్చికట్టెలు బాగుగానే మండును. వానిలో చెమ్మ ఉన్నట్లే కాన రాదు, కాని బాగుగా కాలినతర్వాత చెమ్మయంతయు ఒక కొసవంకకు చేరును. ఆ కొసనుండి ఉజొచ్చిన నీటిచే ప్రొయ్యిలోని నిప్పు ఆఱిపోవును.

కావున మానవుడు కామక్రోధలోభముల పట్ల జాగరూకుడై యుండవలయును. ఉదాహరణముగా హనుమంతుని చరిత్రమునే పరికింతము. క్రోధావేశముతో నతడు లంకను తగులబెట్టినాడు. తర్వాత చాలసేపటికి అశోకవనమున సీత యున్నది కదా అను జ్ఞప్తి అతనికి కలిగినది. ఆమె కాలిపోయె నేమో అని అతడు గడగడలాడిపోయెను.

# గోవిందు భజనసల్పు

## కీ. శే. పామర్తి వేంకట రమణరావుగారు

కాల మాసన్నమైనచోఁ గావఁబోదు వ్యాకరణసూత్రములను నీవల్లెవేయు
దీక్ష, మూఢవిద్యార్థి, కన్ దెఱచి వేగ భక్తి గోవిందు దీక్షతో భజన సల్పు.

వలదు ధనదాహము, సిరులు కలుగుచుండు మనకు మనపూర్వకర్మసన్మానములను,
దాన తనివొంది మెలఁగు విద్యలను నేర్చి, తనరి, సద్బుద్ధి వెలయు విద్యార్థివర్య.

వెలదిబంగారువంటిగుబ్బలను నెంచి మోహమునఁ గ్రుళ్లి క్రుళ్లి వ్యామోహపడక
వాని నిరతమ్ము జింతింపు వట్టిమేని మాంసకండరమ్ములక్రొవ్వుమాత్ర మనుచు.

తామరాకున జల మనిత్యంబు; అట్లె శాశ్వతము గాదు జీవితశ్వాసగూడ
రోగపీడితదేహమ్ము రోయ లేక దుఃఖమును గాంత్రు లోకసంతుష్టి లేక.

డబ్బు గడియించినన్నాళ్లు డాసి ప్రేమ భజన గావింత్రు పరివార బాంధవాళి
ధనము నార్జింపలేని వృద్ధైనవాని నెవరు చూతురు, విద్యార్థి, యింట బయట? 5

కాయమున ప్రాణ మున్నంతకాల మరయు సతియు పిల్లలు నీక్షేమసంపదాళి
దేహమునుండి హంసయు తేలి పోవ శవము గని వారె భయ మందు సహజముగను. 6

సర్వమును విష్ణుమయముగా జగతి నెఱుఁగు మతఁడు నీయందు నాయందు నన్నియెడల
మూర్తిగా నెంచి భావింప ముక్తి వఱలు, విష్ణుమయ మాట విద్యార్థి వింటివోయి. 7

మూఢవిద్యార్థి, భవమున మానుఁగ రోయి, పడకు సంసారనరకకూపమ్మునందు
విడిచి కామమ్ము క్రోధమ్ము వెలయు లోభమోహములను దైవతమ్మును పొందు జ్ఞాని. 8

నిత్యభావన సేయుమీ ''నెగడు ధనమె మూల మన్ని యనర్థాల కాలవాల''
మనుచు, సుఖము లేదెందున తనయుఁగనియు భయముగాంచును లోకమే భయద మాను. 9

బాల్యమున నాటపాటల, వయసులోన తరుణులంగూర్చి, వార్ధక్యతరుణమందు
వట్టిసంసారచింతల వాడుచుండు కాని పురుషుండు బ్రహ్మమున్ గణనగొనఁడు. 10

భార్య యెవ్వతె నీకు? నీపట్టి యెవఁడు? వారితో నీకు సంసారబంధ మెట్టి?
డెవరు నీవు? ఎక్కడి వార లీరు? నిజ మెఱుంగు, విద్యార్థి, నీయంతరంగమందు. 11

సజ్జనులచెల్మి వైరాగ్యసాధన మగు, దాన నిర్మోహతను గాంచి, తత్త్వ మెఱిఁగి
జ్ఞానపరతత్త్వమునను మోక్షమ్ము గాంచ నేర్తు మూఢవిద్యార్థి గణింపు పలుకు. 12

ఎండ జలములు చెఱువుపే రుండనట్లు యౌవనం బంతరింప నీయందు బరగు
నట్టి కామవికారాలు పుట్ట గలవె? అర్థశూన్యుఁ డౌటను లెంక లలరఁ గలరె
సత్య మరసిన భవబంధజాల మేది? 13

క్షణికమువయస్సు, సేవకుల్ క్షణికు లోయి, క్షణిక మగు ద్రవ్యసంపద గర్వ మేల
మాయకలుషిత మీ లోకమహిమ లెల్ల, భక్తి పరమాత్మ్మ భజియించి ముక్తిఁగొనుము. 14

ఆయు వుదయాస్తమయములం దాహుతి గొన కాలదంష్ట్రిలు దెఱచె వ్యాఘ్రమ్మువోలెఁ
గాని సడలదు నీలోనఁ గానిపించు నాశ యిసుమంత; తిరమయి యాశ్రయించె. 15

# శ్రీ శంకర భగవత్పాదుల శేముషీ సందేశాలు

ఒకసగము ప్రపంచమునకు పారమార్థిక సిద్ధాంత మేదియు లేదు, రెండవసగము ప్రపంచమున అన్యోన్యఖండనపరములును కలహపర్యవసన్నములు నగు మతములు లెక్కకు మిక్కిలిగ ఉన్నవి. వీని యలజడిని జూచి కొందఱు మేధావులు 'ఇట్టిసిద్ధాంతాలలో దేనిలోమాత్రము ఆసక్తియుండి ఏమిలాభము' అని ప్రశ్నించుచున్నారు. సంఘదురాచారాలను నిమ్నప్రజలపీడనమును మతాచారాలపేరట చెల్లించుకొనుక్రూరత ప్రపంచములో ఉన్న దనుటకంటె శోచనీయాంశము వేఱేది యుండును? ఈ లోపములు ఈ దోషములు శ్రీ శంకరుడు బోధించిన అద్వైతమతమున లేవు. నిరతిశయతత్త్వజ్ఞు డని, తార్కికు డని, సహనశీలుడని, ఉద్వేగములకు లోనుగాక జ్ఞాతవ్యాంశములను ప్రతిపాదించువాడని సత్యము నభిమానించునట్లును, యుక్తిని సమాదరించునట్లును, జీవితలక్ష్యమును సాక్షాత్కరించుకొనునట్లును కఱపువాడని-శ్రీ శంకరుని అభిజ్ఞులు కొనియాడియున్నారు. సూత్రభాష్యమును ఆంగ్లభాషలోనికనువదించిన డాక్టరు తీబోమహాశయుడు ఉపోద్ఘాతములో శ్రీశంకరభాష్యము అన్యభాష్యములకంటె ఎక్కువ సమరసపరమనియు బ్రహ్మసూత్రముల కెక్కువ అనుగుణమనియు ప్రస్తుతించియున్నాడు. డాసన్-మాక్సుముల్లరు డానియల్ఇన్గల్సు మున్నగు పాశ్చాత్యవిద్వాంసులు శ్రీశంకరుని భాష్యవిధానమును అందలి గద్యశ్రావ్యతను కొనియాడియున్నారు. (i) పూర్వపక్షమును తెల్పుట (ii) అదెందులకు పొసగదో వివరించుట (iii) సిద్ధాంతమును ప్రతిపాదించుట అను క్రమమును పాటించిన శ్రీశంకరుడు పూర్వపక్షమును తెల్పుచున్నంత సేపు'ఆమతమువారైనను అంత చక్కగ జెప్పజాలరు'రని పఠితలకుతోచును.

సంసారదావాగ్ని పరివృతమగు నజ్ఞానగహనమునుండి జీవులను సముద్ధరించుటకై పరమశివుడే శంకరాచార్యుడుగ నవతరించె ననుట సంప్రదాయము. ఆకాలము పెక్కురీతుల మన కాలమునే పోలియుండెను. మీమాంసకులు మానవుని జీవితమున ప్రతిక్షణమును క్రతుకలాపములతో నింపివైచుచుండిరి. దేహమును నానాబాధల కగ్గమొనర్చినచో పరమార్థము నెఱుగనగునని ఒకకొంద ఱటు పెడదారిని పట్టుచుండిరి. అట్టి వాతావరణమున శ్రీ శంకరాచార్యు డవతరించి ఉపనిషత్తులను భగవద్గీతలను బ్రహ్మసూత్రములను సమన్వయవిధానమున వ్యాఖ్యానించి ఆత్మైక్యమును ప్రతిపాదించెను.

కేరళదేశమున కాలడిగ్రామమున క్రీ. శ. 788 వ సంవత్సరమున ఆర్యాంబాశివగురువు లనెడి నంబూదిరిబ్రాహ్మణదంపతులకు కుమారుడుగ శివు ననుగ్రహమున శ్రీశంకరు డవతరించెను. అచిరకాలమున నతనితండ్రి మరణించెను. శంకరుడు అతిబాల్యముననే ఉపనీతుడై వేదవేదాంగనిష్ణాతు డయ్యెను. వైరాగ్యమాయనలో మూర్తీభవించెను. నదిలో స్నానమాడునప్పుడు మొసలినోట చిక్కుకొనె ననుట వ్యాజముగా ఆపత్సన్న్యాసమునకు తల్లిగారి యనుమతి వడసి శంకరుడు నర్మదాతీరమునకు జని అచట గోవిందభగవత్పాదునకు శిష్యు డయ్యెను. ఆసేతుహిమాచలము పాదచారియై సంచరించి శ్రీశంకరుడు నిజపాదసంపర్కపరిపూతతారూపమున యావద్భారతదేశసమైక్యమును నిరూపించెను. వేదాంతసూత్రములకు శ్రీ శంకరుడు రచించిన భాష్యమును శ్రీ వేదవ్యాసుడు స్వయముగ ఆమోదించె నందురు.

శంకరసారస్వతమును శ్రీరంగక్షేత్ర మండలి వాణీవిలాసముద్రణాలయమువారు ఇరువదిసంపుటములలో ప్రకటించి యున్నారు. వానిని నాల్గుశీర్షికల క్రింద విభాగింపవచ్చు: (అ) భాష్యములు (1) బ్రహ్మసూత్రములమీద (2) ద్వాదశోపనిషత్తులమీద (3) భగవద్గీతలమీద (4) శ్రీవిష్ణుసహస్రనామములమీద సనత్సుజాతీయముపై మొ॥ (ఆ) అద్వైత సిద్ధాంతప్రతిపాదకములగుస్వతంత్రగ్రంథములు (ఇ) ఒక్కశ్లోకములో, పదిశ్లోకాలలో, నూఱు శ్లోకాలలో–ఈరీతి అద్వైతమును ప్రపంచించు గ్రంథములు (ఈ) శక్తి-విష్ణు-సుబ్రహ్మణ్య ప్రముఖులపైని అతిమధురములగు స్తోత్రములు. శ్రీ శంకరుని శైలి విశ్వజనహృదయాకర్షకమైనది.

వేదములో పూర్వభాగము కర్మకాండమనియు ఉత్తరభాగము జ్ఞానకాండమనియు ప్రసిద్ధములు కదా. కర్మము జ్ఞానము అను రెంటిలో కర్మము చిత్తశుద్ధిసాధకము. జ్ఞానసిద్ధియే మోక్షము. కాబట్టి ముముక్షువునకు కర్మకాండమునకంటె జ్ఞానకాండమే ఎక్కువ విలువగలది. ముక్తిశిఖరసమారోహణమునకు అర్హతను కలిగించుటచేతనే కర్మమును భక్తియు సార్థకము లనుట శ్రీశంకరుని చిత్తము 'ఉపక్రమము, ఉపసంహారము, అభ్యాసము అపూర్వత అర్థవాదము ఉపపత్తి'– అనెడి ఆఱులింగముల ననుసరించియే శ్రీశంకరుడు ఉపనిషన్మహావాక్యాలకు తాత్పర్యనిర్ణయము చేయును. పరమార్థమునకు పరమప్రమాణము స్వానుభూతియే కాబట్టి అందుల కవిరుద్ధముగ నున్నంతవఱకును తర్కమును ఆదరార్హమే.

శ్రీ శంకరుని సిద్ధాంతము:- బ్రహ్మ మొక్కటే, అద్వితీయము, నిర్వికారము, కూటస్థనిత్యము. సచ్చిదానందములు, బ్రహ్మస్వరూపలక్షణములు, విశేషములుకావు. బ్రహ్మ మనంతము కావున ఏకమును అద్వితీయమును కాక తప్పదు. జ్ఞేయము కాదు, కావున నిర్వచనీయమును కాదు. ఆగమము అనుభూతి అనుమానము అను మూటిని శ్రీశంకరుడు ప్రమాణీకరించుకొన్నాడు. బ్రహ్మమునకు తటస్థలక్షణములను దెల్పుటకే శ్రుతులు ప్రయత్నించుచున్నవి. బ్రహ్మము సత్తు అనుటకు అనృతము కాదనియు, చిత్తు అనుటకు జడము కాదనియు, ఆనంద మనుటకు అస్పృష్టచింతాపద మనియు నర్థములుగా గ్రహింపవలయును. సృష్టికి మూలము బ్రహ్మమైనను – బ్రహ్మము సృష్టిగా (వికారము =) మాఱ్పొందలేదు, బ్రహ్మము జగత్తుగా కననగుచున్నది అంతే. ఇందుకు కారణము మాయ, దీనిని వివర్త మందురు. జగత్తు బ్రహ్మము పరమార్థస్వరూపము. ఉభయమునకును సంబంధము సాక్షికమే, కాని పరస్పరము కాదు. కావున జగత్తునకుసంబంధించిన ఎట్టిదోషమును బ్రహ్మము నంటదు: ఈ మాయ ఈ అవిద్య ఈ ద్వైతభ్రాంతి ఎన్నడుద్భవించెనో చెప్పజాలము. కావున ఇది అనాది, కాని దీనిని తొలగించుకొనుట సాధ్యమైనందుచేత ఇది నిత్యము కాదు. బ్రహ్మ మొక్కటే నిత్యము. మాయవలన నుప్పతిల్లు దానిని సత్తు అనలేము, అసత్తు అనలేము. అనిర్వచనీయము అనవలెను. మాయ ఉన్నంతవఱకు సంఘర్షణయు, స్పర్థయు 'నీది' 'నాది' అను భావములును వర్ధిల్లుచుండక తప్పవు. ఆత్మైక్యమును సాక్షాత్కరించుకొన్నప్పుడు అవిద్యయు ద్వైతభ్రాంతియు తొలగును, అద్వయభావమును సర్వాత్మభావమును అవగతము లగును. అప్పుడు మానవులలో సఖ్యమును సాహచర్యమును కలుగును. 'అందఱిలో

ఉన్న ఆత్మ ఒక్కటే అని' గుర్తింపుడీ అనుటే శ్రీశంకరుల శంఖారావము. ఆత్మైక్యమును గుర్తించుట యనగా ఉన్నదాని నెఱుగుటే, లేని దానిని సాధించుట కాదు. అది 'ఉత్పాద్యము' కాదు. 'ఆప్యము' కాదు. 'సంస్కార్యము' కాదు. కావుననే దాని 'కాత్మజ్ఞాన' మని పేరు. 'కర్మము'ను 'భక్తి'యు అందుకు సహకారములు.

వేదాంతసత్యమును గురూపదేశమును మనము వినవలెను – అది 'శ్రవణము', విన్న దానిని పర్యాలోచింపవలెను. అది 'మననము'. మహావాక్యార్థములు మన కనుభూతము లగువఱకు ధ్యానమును సాగించుచుండవలెను– అది నిదిధ్యాసనము. జీవుని దేవునిలో లయింపజేసికొను విధానము భక్తి. శివానందలహరిలో శ్రీశంకరుడు 'తిన్న'ని భక్తి నీలాగు వర్ణించెను గదా.

మార్గావర్తితపాదుకా పశుపతే
రఙ్గస్య కూర్చాయతే
గణ్డూషాම్బునిషేచనం పురరిపో
ర్దివ్యాభిషేకాయతే
కిఞ్చిద్భక్షితమాంసశేషకబళం
నవ్యోపహారాయతే
భక్తిః కిం న కరోత్యహో
వనచరో భక్తావతంసాయతే.

భక్తికి అసాధ్యము లేదు. అది ఒక కిరాతుని సైతము, భక్తశిరోమణిగా చేయగలదు. వీధులలో తిరుగునప్పుడు అతడు పాదములకు తొడుగుకొన్న పాదరక్షను శివుని కనుబొమలనడిమి స్థానము నధిష్ఠింపజేయగలదు. అతడు పుక్కిలించి ఉమిసిన నీట తడియుటయే దేవదేవునకు దివ్యాభిషేకముగ నొనర్పగలదు. అతడు తినగా మిగిలిన మాంసకబళమునే అపూర్వమైన ఉపహారముగా పరమశివుని స్వీకరింపజేయగలదు. అట్టిది భక్తిప్రభావము. అఱువది మువ్వురు నాయనారులలో (=శివభక్తులలో) ఒకరగు కణ్ణప్పనాయనారు (తిణ్ణని) చరిత్రము సుప్రసిద్ధము. ఆయన కాళహస్తీశ్వరుని అనన్య భక్తిప్రేరితమార్గమున పూజించినవాడే కాని ఆగమశాస్త్రానుసారము పూజించినవాడు కాదు. అతడు ప్రొద్దున వేటాడి, మంచి పందిమాంసమును నిప్పులో కాల్చి పక్వపఱచి దానిలో తేనెను కలిపి తియ్యగా చేసి, ముందు రవంత తాను నోట వేసికొని రుచిచూచి, మిగిలిన దానిని పరమేశ్వరునకు నివేదించుటకై తెచ్చును. కొండ కడుగున ప్రవహించు సువర్ణముఖీనది నుండి పవిత్రమైన నీరు తన పుక్కిట పట్టునంత నింపుకొని పరమేశ్వరు నభిషేకించుటకై తెచ్చును. ఇట్లు కణ్ణప్ప ఒకచేత విల్లు, నోట నదీజలము, వేఱొకచేత మాంసకబళమును కైకొని అత్యంతభక్తితో పరుగున వచ్చును. నోట నున్న నీటి నుమిసి కాళహస్తీశ్వరున కభిషేకము చేయును, పిమ్మట మాంసకబళ మర్పించును, ఇట్లు అవైదికరీతిలో సాగిన దతని యుపాసన. ఆ గుడిపూజారి శివకేసరిముని. ఆయన దీనిని గని నొచ్చుకొని ఆలయమంతయు శుభ్రపఱచి తర్వాత తాను యథావిధిగా శివు నారాధించెను. కాని మఱునాడును గుడిలో కణ్ణప్ప తన యుపాసనము నట్లే జరిపెను. శివకేసరిముని సంప్రోక్షణాదికము నట్లే జరిపెను. పరమశివుడు కణ్ణప్పని భక్తిమహిమను శివకేసరికి చూప నిచ్చగొని, కణ్ణప్ప ఆరాధింపవచ్చినప్పుడు తన గుడిపూజారిని చాటుననుండి చూచుచుండు మనెను. నోట నదీజలము ఒకచేత విల్లు వేఱొకచేత మాంసకబళము దాల్చి కణ్ణప్ప వచ్చెను. వచ్చి చూచునప్పటికి కాళహస్తీశ్వరుని కుడికంటినుండి రక్తము కాఱు

చుండెను. కణ్ణప్ప స్తభించిపోయెను. అతడు తెచ్చిన పూజావస్తువులు జాఱి నేలపై బడినవి. ఏమిచేసినను ఎన్నిమందులు వేసినను దేవుని కంటినుండి కాఱు నెత్తు రాగలేదు. అప్పుడు కణ్ణప్ప బాణముతో తన కుడికంటిని పెకలించుకొని దానిని దేవునికర్పించెను. వెంటనే దేవుని కుడికంటినుండి కాఱుచున్న రక్తప్రవాహ మాగినది. కాని ఎడమకంటినుండి అల్లు రక్తము కాఱజొచ్చెను. తన యెడమకంటిని కూడ పెకలించుకొని స్వామి కర్పింప కణ్ణప్ప నిశ్చయించెను. కాని తనకు రెండు కన్నులును లేనప్పుడు దేవుని యెడమకన్నుండుచోటును గు రించుటెట్లు? ్వున స్వామి కనుబొమలు కదియుచోట ముందుగా పాదరక్షతోడి తన పాద ముంచి తర్వాత ఎడమకన్నును ఀటికి కొన బాణ మందుకొనెను. అప్పుడు పరమశివుడు ప్రత్యక్షమై ఆ భక్తవతంసుని కీర్తించి ఆదరించి, సాయుజ్యమోక్ష మొసంగెను.

భక్తిమహిమ నింతగొప్పగ కీర్తించిన శ్రీ శంకరుడు, భక్తిసారస్వతసాగరరత్నము లన దగిన మధురాతిమధురస్తోత్రములకు ప్రణేత యగు శ్రీ శంకరుడు, 'భక్తిరేవ గరీయసీ' అని వాక్రుచ్చిన శ్రీ శంకరుడు భక్తికి ప్రతికూలు డనుటకంటె ప్రల్లదము వే ఉండదు.

శ్రీశంకరసిద్ధాంతమును గ్రంథవ్యాఖ్యాతలు వివరింపగలంతకంటె తెల్లముగ, స్వానుభవముచే నాకళించుకొన్న పరమహంస శ్రీరామకృష్ణుడు ఇట్లు సంక్షేపించెను—"పరతత్త్వమును, సృష్టిస్థితిసంహారాది వ్యాపారశూన్యముగ భావించినప్పుడు ఆ నిర్గుణతత్త్వమును బ్రహ్మమనియో పురుషు డనియో పేర్కొందును. పరతత్త్వమును, సృష్టిస్థితిసంహారాది వ్యాపారకర్తగ భావించినప్పుడు ఆసగుణ బ్రహ్మమును శక్తిఅనియో మాయ అనియో ప్రకృతి అనియో పేర్కొందును. మన భావనయు పేరును మాఱినంతమాత్రముచేత తత్త్వము లే వేఱుపడినవని యర్థము కాదు. పాలును దాని తెలివన్నెయు, రత్నమును దాని కాంతియు, సర్పమును దాని వక్రగతియు అభిన్నములైనట్లుగ నిర్గుణబ్రహ్మమును సగుణ బ్రహ్మమును అభిన్నములే. లోకమాతయు బ్రహ్మము నొక్కరే!"

# బుద్ధదేవునుపదేశములు

## యనమండ్రం వేంకటరామయ్యగారు

సిద్ధార్థుడు బుద్ధుడె బహుపరిశ్రమలబ్ధమైన పరమధర్మమును లోకమునకు బోధింపవలయు నని సంకల్పించి మొట్టమొదట "నే నీధర్మ మెవరికి బోధింతును? ఎవ్వరు దీనిని సులభముగ గ్రహింపగ గల"రని తనలో వితర్కించెను. అలరకాముడు మిక్కిలి తెలివిగలవాడు; విద్యావంతుడు; గావున నతడు తన సిద్ధాంతమును గ్రహింపగల సమర్థుడని భావించి యతడాపరమార్థము వానికి బోధింపదలచెను. అలరుడను నతనికే యలరకాముడను పేరు గలదు. సిద్ధార్థుడు సన్న్యాసము స్వీకరించినవెంటనే విద్యాభ్యాసముజేయుట కలరు నాశ్రయించెను. అలరుడెక్కడ నున్నాడని యతడడుగ మృతి నొందెనని చెప్పిరి. అనంతర మతనికి మహాపండితుడైన యుద్రకరామ పుత్రుని పేరు స్ఫురణకు వచ్చెను. ఉద్రకరామ

పుత్రుఁ డనఁగా నుద్రకుఁడే. అలరునియొద్ద విద్య చాలించిన పిదప సిద్ధార్థుఁడు జ్ఞానసంపాదనము నిమిత్త మితనియొద్దకుఁ జేరెను. ఈతఁడును దన సిద్ధాంతము నశ్రమంబున గ్రహింపఁ గలఁడని యతఁడు తలంచెను. కాని యుద్రకుఁడు గూడ కాలధర్మము నొందెనని తెలిసెను. అనంతర మతనికి మున్ను తాను కఠోరతపంబు సేయుచుండఁ దనకు విధేయులై శుశ్రూష చేసి తాను తపము చాలించిన పిదప దన్ను విడిచి పోయిన యైదుగురుశిష్యులు జ్ఞప్తికివచ్చిరి. వా రత్తరి వారణాశీ నగరమునఁ దపంబు సేయుచుండి రని విని వారిం గలిసికొనుటకు బుద్ధుఁ డక్కడకుఁ బయన మయ్యెను. ఉపకుం డను దిగంబరయోగియొకఁడు వారణాశికిఁ బయనమై పోవుచున్న సిద్ధార్థుని గనుంగొని యిట్లనియెను. "మిత్రుఁడా, నీ శరీరచ్ఛాయ స్వచ్ఛమై మెఱయుచున్నది. నీ ముఖము జ్ఞానద్యోతకమై యున్నది. ఎవని సిద్ధాంతమును నమ్మి నీ వీ ప్రపంచమును బరిత్యజించితివి. నీ గురు వెవ్వరు? ఎవని ధర్మము నీ వవలంబించితివి?" అనవుడు బుద్ధుఁ డి ట్లుత్తరము చెప్పెను. "అయ్యా, నే నెల్లశత్రువుల జయించితిని. నేను బుద్ధుఁడను. నేను సర్వవిధముల నిష్కళంకుఁడను. నేను సర్వముఁ బరిత్యజించితిని. కోరికను నాశనము చేసి నేను ముక్తి వడసితిని. స్వయముగా నే జ్ఞాన సంపాదనము చేసికొన్న నేను నా కొకఁడు గురువు కలఁ డని యెట్లు చెప్పఁగలను. నాకు గురువు లేఁడు. నాకు సముఁడు లేఁడు. ఈ మనుష్యప్రపంచమునందును దేవతాప్రపంచమునందును మ త్తుల్యుఁడు లేఁడు. ప్రపంచమునందు నేనే పరిశుద్ధుఁడను. నేనే పరమ గురువను. నేనే లోకాతీతుఁడైన సంబుద్ధుఁడను. నేను శాంతిని నిర్వాణమును బడసితిని. ధర్మరాజ్యసంస్థాపనము చేయుటకుఁ బుణ్యనగరమైనవారణాశికిఁ బోవు చున్నాఁ డను. మాయాంధకార బంధురమైన యీప్రపంచమున నమృతత్వ మను మహాభేరిని నేను మ్రోయించెదను." అని బుద్ధుఁడు మహోత్కృష్టము లైనవాక్యములు పలుక "నట్లయిన నద్వితీయుఁడు పరమపావనుఁడు నగు జినుఁడవా" యని యుపకుఁ డడిగెను. అతనికి మహాత్ముఁడైన బుద్ధుఁ డిట్లు బదులు చెప్పెను. "కోరికల నడంచినజినులందఱు నావంటివారె. నేను సమస్తపాపముల జయించితి. కాఁబట్టి జినుఁడను నేనే." "అట్లై కావచ్చు" నని పలికి యుపకుఁడు తలయూఁచి మఱియొక మార్గమునఁ బోయెను. అనంతరము బుద్ధుఁ డొక చోటనుండి మఱియొకచోటికిఁ బ్రయాణములు చేసి తనకు గమ్యస్థానంబును వేదశాస్త్రనిలయంబును సర్వజనసేవ్యంబును బరమపవిత్రంబును సిద్ధజననివాసంబును గంగాప్రవాహాభిశోభితంబును నగు కాశీకానగరంబుఁ బ్రవేశించెను. ప్రవేశించి మృగదావంబు సొచ్చి యచ్చోటఁ దపోనిరూఢు లైన పూర్వశిష్యపంచకమును జూచెను. వా రతనిని ముందుగా దొడవ్వోలం గని తమలోఁ దా రిట్లనుకొనిరి. "అదిగో గౌతమశ్రమణుఁడు వచ్చుచున్నాఁడు. ఈతఁడు తపంబు చాలించి హాయిగ సుఖము ననుభవించుచున్నాఁడు. మన మాసనములనుండి లేవ వద్దు. అతనికి నమస్కరింప వద్దు. అతనిచేతి నుండి శాటీకమండలము లందుకొని గౌరవిం వద్దు. కాని మన మిక్కడ వానినిమిత్త మొక యాసనము వైచి యుంతము. ఇష్టమైనయెడ నతఁడు దానిమీఁద గూర్చుండు గాక!" అట్లు వారు కృతప్రతిజ్ఞులై బుద్ధునియెడ ననాదరణముఁ జూపఁ దలంచిరి; కాని తమ ప్రతిజ్ఞా ప్రకారము చేయుట వారికి శక్యమైనది కాదు. బుద్ధుఁడు తమ్ము సమీపించినతోడనే తదీయ

తేజఃప్రభావనిర్జితులైయ య్యేవురుఁ బ్రతినల నెఱవేర్చుకొనలేక యప్రయత్నముగ దిగ్గున లేచి యామహాత్మున కెదురుగాఁ జని తోడ్కొని వచ్చిరి. అం దొకఁ డాయనచేతనుండి శాటీ కమండలముల నందుకొనియెను. ఒకఁ డాసనము వైచెను. ఒకఁడు పాదపీఠ మించెను. ఒకఁడు పాదప్రక్షాళనమున కుదక మం దిచ్చెను. ఒకఁడు కాళ్ళు తుడుచుకొనుట కంగవస్త్రము సమర్పించెను. బుద్ధుఁడు కూర్చుండి పాదప్రక్షాళనము చేసినపిదప "మిత్రమా, గౌతమా, నీ వెందుండి వచ్చుచున్నా"వని వా రడిగిరి. అడుగుటయు బుద్ధుఁ డిట్లనియె. "ఓయోగులార, తథాగతుని వెనుకటి: బిలువఁగూడదు. మిత్రుఁ డనఁగూడదు. తథాగతుఁ డనఁగా నెవ్వఁ డనుకొన్నారు పరమపావనుఁ డైన సంబుద్ధుఁడు. నేను చెప్పునది వినుండు. నే నమృతత్వము బడసితిని. ఆ సిద్ధాంతము నేను మీకుఁ గఱపెదను. నేను చూపెడుమార్గమున మీరు నడతు రేని సత్యమును మీరే తెలిసికొని ముఖాముఖిఁ జూచి సిద్ధిఁబొందఁ గలరు." అనవుడు నాయోగు లేవురు తథాగతుని వాక్యములందు నమ్మిక లేక యిట్లనిరి. "మిత్రుఁడా గౌతముఁడా నాఁడు నీవు తాల్చిన యామహానియమమువలనను సలిపిన దుర్భర తపంబులవలనను నాచరించిన కఠోరవ్రతంబుల వలనను మనుష్యాతీతములైన శక్తులను నీవు బడయఁజాలవైతివి. సంపూర్ణజ్ఞానాంతరదృష్టుల వలన గలుగు నుత్కృష్టదశను బ్రాపింపవైతివి. అట్టి తపోనియమములు సలిపిన నీకు సిద్ధిగలుగ నపుడు నేఁడు తపంబు సాలించి భోగముల ననుభవించుచు హాయిగఁ దిరుగుచున్నపుడు మనుష్యాతీతశక్తులు నీ కెట్లు కలుగును? జ్ఞానలభ్యమగునుత్కృష్టదశ నీ కెట్లుసంప్రాప్తించును?" ఆ ప్రశ్నమునకు బుద్ధుఁ డిట్లుత్తరము చెప్పెను. "తథాగతుఁడు భోగముల ననుభవించుట లేదు. అతఁడు ధర్మసాధనముల విడిచిపెట్ట లేదు. అతఁడు పుష్కలజీవనమువంక జన లేదు. ఓ జోగులారా నే నిదివఱ కెన్నఁడైన మీతో నిట్లు మాటాడితినా." "లేదు. లేదు. నీ వెన్నఁ డిట్లు మాటాడలే" దని వారు బదులు చెప్పిరి. అనవుడు నతఁ డీక్రిందివిధమున వారి కుపదేశము చేసెను." అట్లైన నో యోగులారా, నా చెప్పునది వినుండు. ప్రపంచముఁ బరిత్యజించినమనుష్యుఁ డనుసరింపఁ దగనియతిమాత్రపుపద్ధతులు రెం డున్నవి. ఇంద్రియముల నాకర్షించునట్టియు ముఖ్యముగ భోగానుభవమునకు దారి చూపునట్టియుఁ గార్యముల నాచరించుట మొట్టమొదటిది. ఇది ప్రప్రథమమునఁ బరిత్యజింపఁ దగినది. ఇట్టివానిచే మానవుఁడు సంతుష్టిఁ గనుట మిగుల నింద్యము, ననర్హము, నిష్ప్రయోజనము. ప్రాపంచికవిషయములయందుఁ దగుల్కొన్నవానికిమాత్రమే యది తగును. తపోనిష్ఠ పేరుపెట్టి యాత్మబాధ గలిగించు కార్యముల నాచరించుట రెండవది. ఇదియు దూరముగఁ బరిత్యజింపఁదగినదే. ఇయ్యదియు ననర్హమే నింద్యమే నిష్ప్రయోజనమే. ఈ రెంటికి మధ్యమార్గము మఱియొకటి యున్నది. అది తథాగతుఁడనైన నేను కనిపట్టినాను. అది జ్ఞానప్రదమై కన్నులు తెఱపించును. మనస్సునకు శాంతి నొసంగును. అత్యున్నతజ్ఞానమునకు దారిచూపును. సంపూర్ణబుద్ధత్వమునకు నిర్వాణమునకుఁ దోడుపడును. ఆమధ్యమార్గ మేది యని మీ రడుగవచ్చును. ఆమార్గ మష్టవిధము. సదభిప్రాయము, సదాలోచనము, సత్సంభాషణము, సద్వర్తనము, సజ్జీవనము, సత్ప్రయత్నము, సన్మనస్కత, సన్మననము. జన్మము దుఃఖకరము. క్షీణత్వము దుఃఖకరము. రోగము దుఃఖకరము. మరణము దుఃఖకరము. అనిష్ట

పుత్రుఁ డనఁగా నుద్రకుఁడే. అలరునియొద్ద విద్య చాలించిన పిదప సిద్ధార్థుఁడు జ్ఞానసంపాదనము నిమిత్త మితనియండఁ జేరెను. ఈతఁడును దన సిద్ధాంతము సశ్రమంబున గ్రహింపఁ గలఁడని యతఁడు తలంచెను. కాని యుద్రకుఁడు గూడ కాలధర్మము నొందెనని తెలిసెను. అనంతర మతనికి మున్ను తాను కఠోరతపంబు సేయుచుండఁ దనకు విధేయులై శుశ్రూష చేసి తాను తపము చాలించిన పిదప దన్ను విడిచి పోయిన యైదుగురుశిష్యులు జ్ఞప్తికివచ్చిరి. వారత్తరి వారణాశీ నగరమునఁ దపంబు సేయుచుండి రని విని వారిం గలిసికొనుటకు బుద్ధుఁ డక్కడకుఁ బయన మయ్యెను. ఉపకుం డను దిగంబర యోగియొకఁడు వారణాశికిఁ బయనమై పోవుచున్న సిద్ధార్థుని గనుంగొని యిట్లనియెను. "మిత్రుఁడా, నీ శరీరచ్ఛాయ స్వచ్ఛమై మెఱయుచున్నది. నీ ముఖము జ్ఞానద్యోతకమై యున్నది. ఎవని సిద్ధాంతమును నమ్మి నీ వీ ప్రపంచమును బరిత్యజించితివి. నీ గురు వెవ్వరు? ఎవని ధర్మము నీ వవలంబించితివి?" అనవుడు బుద్ధుఁ డిట్లుత్తరము చెప్పెను. "అయ్యా, నే నెల్లశత్రువుల జయించితిని. నేను బుద్ధుఁడను. నేను సర్వవిధముల నిష్కళంకుఁడను. నేను సర్వముఁ బరిత్యజించితిని. కోరికను నాశనము చేసి నేను ముక్తి వడసితిని. స్వయముగా నే జ్ఞానసంపాదనము చేసికొన్న నేను నా కొకఁడు గురువు కలఁ డని యెట్లు చెప్పఁగలను. నాకు గురువు లేఁడు. నాకు సముఁడు లేఁడు. ఈ మనుష్యప్రపంచమునందును దేవతాప్రపంచమునందును మత్తుల్యుఁడు లేఁడు. ఈ ప్రపంచమునందు నేనే పరిశుద్ధుఁడను. నేనే పరమగురువను. నేనే లోకాతీతుఁడైన సంబుద్ధుఁడను. నేను శాంతిని నిర్వాణమును బడసితిని. ధర్మరాజ్యసంస్థాపనము చేయుటకుఁ బుణ్యానగరమైనవారణాశికిఁ బోవుచున్నాఁడను. మాయాంధకార బంధురమైన యీ ప్రపంచమున నమృతత్వ మను మహాభేరిని నేను మ్రోయించెదను." అని బుద్ధుఁడు మహోత్కృష్టములైనవాక్యములు పలుక "నట్లయిన నద్వితీయుఁడు పరమపావనుఁడు నగు జినుఁడవా" యని యుపకుఁ డడిగెను. అతనికి మహాత్ముఁడైన బుద్ధుఁ డిట్లు బదులు చెప్పెను. "కోరికల నడంచినజిను లందఱు నావంటివారె. నేను సమస్తపాపముల జయించితి. కాఁబట్టి జినుఁడను నేనే." "అట్లై కావచ్చు" నని పలికి యుపకుఁడు తలయూఁచి మఱియొక మార్గమునఁ బోయెను. అనంతరము బుద్ధుఁ డొకచోటనుండి మఱియొకచోటికిఁ బ్రయాణములు చేసి తనకు గమ్యస్థానంబును వేదశాస్త్రనిలయంబును సర్వజనసేవ్యంబును బరమపవిత్రంబును సిద్ధజననివాసంబును గంగాప్రవాహాభిశోభితంబును నగు కాశికానగరంబుఁ బ్రవేశించెను. ప్రవేశించి మృగదావంబు సొచ్చి యచ్చోటఁ దపోనిరూఢులైన పూర్వశిష్యపంచకమును జూచెను. వా రతనిని ముందుగా దాదవ్వులం గని తమలోఁ దా రిట్లనుకొనిరి. "అదిగో గౌతమశ్రమణుఁడు వచ్చుచున్నాఁడు. ఈతఁడు తపంబు చాలించి హాయిగ సుఖము ననుభవించుచున్నాఁడు. మన మాసనములనుండి లేవ వద్దు. అతనికి నమస్కరింప వద్దు. అతనిచేతి నుండి శాటీకమండలము లందుకొని గౌరవింప వద్దు. కాని మన మిక్కడ వానినిమిత్త మొక యాసనము వైచి యుంతము. ఇష్టమైనయెడ నతఁడు దానిమీఁద గూర్చుండుగాక!" అట్లు వారు కృతప్రతిజ్ఞులై బుద్ధునియెడ ననాదరణముఁ జూపఁ దలంచిరి; కాని తమ ప్రతిజ్ఞాప్రకారము చేయుట వారికి శక్యమైనది కాదు. బుద్ధుఁడు తమ్ము సమీపించినతోడనే తదీయ

తేజఃప్రభావనిర్జితులై యయ్యేవురుఁ బ్రతినల నెఱవేర్చుకొనలేక యప్రయత్నముగ దిగ్గున లేచి యామహాత్మున కెదురుగాఁ జని తోడ్కొని వచ్చిరి. అం దొకఁ డాయనచేతనుండి శాటీ కమండలముల నందుకొనియెను. ఒకఁ డాసనము వైచెను. ఒకఁడు పాదపీఠ మునుంచెను. ఒకఁడు పాదప్రక్షాళనమున కుదక మం దిచ్చెను. ఒకఁడు కాళ్ళు తుడుచుకొనుట కంగవస్త్రము సమర్పించెను. బుద్ధుఁడు కూర్చుండి పాదప్రక్షాళనము చేసినపిదప "మిత్రమా, గౌతమా, నీ వెందుండి వచ్చుచున్నా"వని వా రడిగిరి. అడుగుటయు బుద్ధుఁ డిట్లనియె. ఓ యోగులార, తథాగతుని వెనుకటిపేరఁ బిలువఁగూడదు. మిత్రుఁ డనఁగూడదు. తథాగతుఁ డనఁగా నెవ్వఁ డనుకొన్నారు. పరమపావనుఁ డైన సంబుద్ధుఁడు. నేను చెప్పునది వినుండు. నే నమృతత్వము బడసితిని. ఆ సిద్ధాంతము నేను మీకుఁ గఱపెదను. నేను చూపెడుమార్గమున మీరు నడతు రేని సత్యమును మీరే తెలిసికొని ముఖాముఖిఁ జూచి సిద్ధిఁబొందఁ గలరు." అనవుడు నాయోగు లేవురు తథాగతుని వాక్యములందు నమ్మిక లేక యిట్లనిరి. "మిత్రుఁడా గౌతముఁడా నాఁడు నీవు తాల్చిన యామహానియమమువలనను సలిపిన దుర్భర తపంబులవలనను నాచరించిన కఠోరవ్రతంబుల వలనను మనుష్యాతీతములైన శక్తులను నీవు బడయఁజాలవైతివి. సంపూర్ణజ్ఞానాంతరదృష్టుల వలన గలుగు నుత్కృష్టదశను ప్రాపింపవైతివి. అట్టి తపోనియమములు సలిపిన నీకు సిద్ధిగలుగ నపుడు నేఁడు తపంబు చాలించి భోగముల ననుభవించుచు హాయిగఁ దిరుగుచున్నపుడు మనుష్యాతీతశక్తులు నీ కెట్లు కలుగును? జ్ఞానలభ్యమగునుత్కృష్టదశ నీ కెట్లుసంప్రాప్తించును?' ఆ ప్రశ్నమునకు బుద్ధుఁ డిట్లుత్తరము చెప్పెను.

"తథాగతుఁడు భోగముల ననుభవించుట లేదు. ఆతఁడు ధర్మసాధనముల విడిచిపెట్ట లేదు. అతఁడు పుష్కలజీవనమువంక జనలేదు. ఓ యోగులారా నే నిదివఱ కెన్నఁడైన మీతో నిట్లు మాటాడితినా." "లేదు. లేదు. నీ వెన్నఁడిట్లు మాటాడలే" దని వారు బదులు చెప్పిరి. అనవుడు నతఁ డీక్రిందివిధమున వారి కుపదేశము చేసెను." అట్లైన నో యోగులారా, నా చెప్పునది వినుండు. ప్రపంచముఁ బరిత్యజించినమనుష్యుఁ డనుసరింపఁ దగనియతిమాత్రపుపద్ధతులు రెం డున్నవి. ఇంద్రియముల నాకర్షించునట్టియు ముఖ్యముగ భోగానుభవమునకు దారి చూపునట్టియుఁ గార్యముల నాచరించుట మొట్టమొదటిది. ఇది ప్రప్రథమముననఁ బరిత్యజింపఁ దగినది. ఇట్టివానిచే మానవుఁడు సంతుష్టిఁ గనుట మిగుల నింద్యము, ననర్థము, నిష్ప్రయోజనము. ప్రాపంచికవిషయములయందుఁ దగుల్కొన్నవానికిమాత్రమే యది తగును. తపోనిష్ఠపేరుపెట్టి యాత్మబాధ గలిగించు కార్యముల నాచరించుట రెండవది. ఇదియు దూరముగఁ బరిత్యజింపఁదగినదే. ఇయ్యదియు ననర్థమే నింద్యమే నిష్ప్రయోజనమే. ఈ రెంటికి మధ్యమార్గము మఱియొకటి యున్నది. అది తథాగతుఁడనైన నేను కనిపట్టినాను. అది జ్ఞానప్రదమై కన్నులు తెఱపించును. మనస్సునకు శాంతి నొసంగును. అత్యున్నతజ్ఞానమునకు దారిచూపును. సంపూర్ణబుద్ధత్వమునకు నిర్వాణమునకుఁ దోడుపడును. ఆమధ్యమార్గ మేది యని మీరడుగవచ్చును. ఆమార్గ మష్టవిధము. సదభిప్రాయము, సదాలోచనము, సత్సంభాషణము, సద్వర్తనము, సజ్జీవనము, సత్ప్రయత్నము, సన్మనస్కత, సన్మననము. జన్మము దుఃఖకరము. క్షీణత్వము దుఃఖకరము. రోగము దుఃఖకరము. మరణము దుఃఖకరము. అనిష్ట

పదార్థసంగమము దుఃఖకరము. ఇష్టపదార్థ వియోగము దుఃఖకరము. రాగజనితములైన భావము లన్నియు దుఃఖకరములు. దుఃఖానుభవమునుగూర్చి చెప్పఁదగినయథార్థ మిదే. దుఃఖసముత్పత్తినిగూర్చి చెప్పుచున్నాను వినుండు. కోరిక నశింపక స్థిరమై యుండుటయే దుఃఖమునకు ముఖ్యకారణము. ఆకోరిక పునర్జన్మహేతువు. అది భోగములపై నాసగొలుపును. ఒకమారు రాపనిచేసి ఒకమారు రీపని చేసి యాకోరిక సంతుష్టిఁ గనుచుండును. ఒకమారు మఱియొకజన్మమెత్తవలయు ననుతలంపు గలిగించుచుండును. ఒకానొకప్పుడీజన్మమునందే యెట్టిన సిద్ధిఁబొంది మనోరథసిద్ధిఁ బడయవలయు ననుసంకల్పము గలిగించుచుండును. దుఃఖము నాశనము చేయుటను గూర్చి చెప్పదగిన పరమార్థ మిదిగో వినుండు. తృష్ణను ముందుగా నాశనము చేయవలయును. అనఁగా మనుష్యుఁడు ముందు కోరికను నాశనము చేయవలయును. అది నాశనమైనయెడల నింద్రియసుఖమే నశించును. ఈ తృష్ణను దూరముగాఁ ద్రోలవలయును. దానిని బరిత్యజింపవలయును. ఒక్కనిముసమైన దానిని మనస్సులో నిలువనియ్యఁగూడదు. ఈ దుఃఖనాశనమునకుఁ దగినసాధనములంగూర్చి చెప్పఁదగిన పరమార్థ మేదన నెనిమిదివిధములైన సన్మార్గముల నడచుటయే. దుఃఖమునుగూర్చియు దుఃఖకారణముంగూర్చియు దుఃఖకారణ నాశనముంగూర్చియు దుఃఖకారణ నాశనసాధనములంగూర్చియు నెట్టిసిద్ధాంతములును మనకుఁ బ్రాచీను లిచ్చియుండలేదు. కాని యట్టివానిని గనిపట్టుటకు నాలో నంతర్నేత్రము బయలుదేఱినది. తదీయస్వభావజ్ఞానము పొడమినది. తత్కారణపరిజ్ఞానము సముద్భవిల్లినది. ప్రశాంతమార్గమును గనిపట్టుటకుఁ దగిన యాత్మజ్ఞానము సముత్పన్నమైనది. అంధకారమును బటాపంచలుచేయఁగల జ్ఞానజ్యోతి వెలిఁగినది. ఆ నాల్గువిధములంగూర్చియు నా జ్ఞానము నా యంతర్దృష్టియు విశదములుగ నెంతకాలము లేవో యంతకాలమును నేను శ్రమణులకును బ్రాహ్మణులకును మనుష్యులకును దేవతలకును దురాపమైన యీ జ్ఞానమార్గమునఁ బ్రవేశించితినో లేదో నిశ్చయముగ నెఱుఁగఁజాలనైతిని. ఆ నాల్గువిషయములంగూర్చియు నా జ్ఞానము నా యంతర్దృష్టియు విశదము లెప్పుడైనవో యప్పుడే నేను శ్రమణులకు బ్రాహ్మణులకు మనుష్యులకు దేవతలకు దురాపమైన యీ జ్ఞానమార్గమునఁ బ్రవేశించితి నని నిశ్చయముగ నెఱిఁగితిని. ఇప్పుడీ జ్ఞానము నీ యంతర్దృష్టియు నాలో నుద్భవించినవి. నేను బడసినముక్తి నిశ్చలమైనది. ఇదియే నా కడపటిజన్మము. ఇఁకమీఁద నాకుఁ బునర్జన్మము లుండవు.'' ఈబోధ మాయైదుగురి మనస్సులమీఁద నమృతవర్షము వలె పడెను. అదివఱకు వారెన్నో పుణ్యనదులలో స్నానము చేసిరి. సాంగముగ వేదము నధిగమించిరి. కర్మానుష్ఠాన తత్పరులైరి. ఉగ్రతపముల నాచరించిరి. శరీరము శుష్కింపఁజేసిరి. ఎన్ని చేసినను నిష్కంటకమైనమార్గము వారికిఁ బొడకట్టలేదు. కుంభవృష్టివంటి యీ బోధామృతము కురిసినతోడనే చిరకాలము నుండి వారిమనస్సుల నంటియున్నమాలిన్యము కడిగి వైవఁబడెను. వారి మనోనేత్రములకుఁ జక్కనిదారి పొడగట్టెను. ఆయేవురలో వయోవృద్ధుఁడైన కౌండిన్యుఁడు మొట్టమొదట నీ నూతనధర్మ మనుసరించి బుద్ధుని శిష్యుఁడయ్యెను. తక్కిన నలువురు కలిసియు వేఱువేఱుగను బిమ్మట నతనితోఁ గొన్నిసారులు వాదములు నెఱపి సందియంబులఁ దొలంచుకొని

శిష్యులైరి. అట్లు మహోపద్రవమయమున నతనిం బరిత్యజించి ధర్మభ్రష్టుఁడని యతని నధిక్షేపించి యతనియెడ ననాదరణముఁ జూపవలెనని సంకల్పించినవారే యతని బోధామృతాస్వాదనమునఁజేసి పూర్వమనుసరించిన మూఢమార్గమువిడిచి మంచిదారిఁబడి బుద్ధదేవుని ప్రధమ శిష్యులైరి

ఈ యేవురితరువాత బుద్ధధర్మమును స్వీకరించినవాఁడు వారణాశీపురవాసియు మహాధనవంతుఁడు వడ్డివ్యాపారమువల్ల జీవించువాఁడు నగునొకవర్తకునికుమారుఁడు. అతని పేరు యాసుఁడు. అతనికి మూఁడుమహాభవనములు కలవు. అందొకటి శీతకాలమునకొఱకు. మఱొకటి వర్షకాలమునిమిత్తము. వేఱొకటి గ్రీష్మకాలమునకొఱకు – ఏమందిర మేకాలమునిమిత్తముద్దేశింపఁబడినదో యామందిరమున నాకాలమున నతఁడు వసించు చుండును. ఆ మందిరంబులయందు నిరుపమాన సౌందర్యము గల విలాసవతులు తమపాటలచేత నాటలచేత రూపములచేత నతనిని మెప్పించి సుఖింపఁ జేయుచుందురు. ఒకనాఁడు యాసుఁ డామందిరంబులలో నొక దానియందుఁ బవ్వళించి నిదురించెను. జవరాండ్రగు నతని ప్రియురాండ్రును మైమఱచి నిదురవోయిరి. తొల్లి గౌతమబుద్ధునకుఁ దటస్థించినయవస్థయె నాటిరేయి సంపన్నుఁడైన యీ వణిక్కుమారునకు సంభవించెను. దైవవశమున యాసున కంగనలకంటె ముందు మెలఁకువ వచ్చెను. వచ్చుటయు వారివికృతాకారము లతనికంటఁ బడెను. ఒకతె వాయించుచున్న మద్దెల మెడక్రిందఁ బెట్టుకొని పండుకొనియెను. ఒకతె మ్రోయించుచున్న గానయంత్రము బాహుమూలమున బడెను. ఒకతె కొప్పు విడిపోయెను. ఒకదాని నోటినుండి లాలాజలము గాఱెను. వాండ్రంద తేమేమో నిద్రాపారవశ్యమున గొణుగుకొనసాగిరి. అత్తఱి నాయవస్థఁ జూచినవారికిఁ బలుపీనుఁగుల నడుమ నున్నట్లు తోఁచక పోదు. యాసుఁ డది చూచిన తోడనే హేయమైన యతనిజీవనము కన్నుల గట్టినట్లగపడెను. అగపడుటయు నతఁడు భయశోకాన్వితుఁడై హా యెంత దుఃఖ మెంత యపాయ మని పలికెను. అటు పలికి యతఁడు తత్క్షణమే ప్రియాంగనలను మందిరంబులను విడిచి వైరాగ్యప్రేరితుఁడై బుద్ధదేవనిలయమైనమృగదావకాననమున కరిగెను. మహానుభావుఁడైనశాక్యసింహుఁడుగౌతముఁడు నిర్వాణమార్గముం గనిపట్టి పతితులను పావనులఁ జేయుచున్నాఁడని యంతకు మున్నె యతఁడు విని యుండుటఁజేసి యచ్చోటికిఁ బోయెను. ప్రాపంచిక బాధలనుండి మానవుని రక్షింపఁగల సమర్థుఁ డతఁడొక్కఁడే యని యతనికిఁ దోఁచెను. యాసుఁ డతఁ డున్నతావునకుఁ జని యతనిం గాంచి 'హా యెంతదుఃఖ మెంత యపాయ' మని మరల పలికెను. "ఇక్కడ దుఃఖములేదు. ఇక్కడ నపాయము లేదు. మిత్రుఁడా, యిటు వచ్చి కూర్చుండుము. నేను నీకు సత్యధర్మముపదేశించెదను. రా–రా." యని బుద్ధుఁడు సాదరముగ నతనికిఁ బ్రత్యుత్తర మిచ్చెను. అప్పలుకులు శ్రవణగోచరము లగుటయు యాసుఁడు మేరమీఱినయానందము నొంది యతనిసమీపమున కరిగి కడువినయంబున నమస్కరించి కూర్చుండెను. అంతట బుద్ధుఁ డతనికి బరమార్థ ముపదేశించెను. బిచ్చము పెట్టుటవలనఁ గలుగు ఫలమును ముందుగాఁ జెప్పి పిమ్మట నతఁడు మానవధర్మములు, నీతి, స్వర్గము, దురాచారములు గర్వము, పాపము, తృష్ణ మొదలగు వానిని గూర్చి యుపన్యసించి యవ్వాలఁ గోర్కెల జయించుటవలన గలుగు లాభముల నుగ్గడిం

చెను. యాసుని మనస్సు ధర్మోపదేశమునకుఁ దగినస్థితిలో నున్న దని తెలిసికొన్నపిదప భగవానుఁ డైనబుద్ధుఁడు తనసిద్ధాంతము నుపదేశించెను. అనఁగా దుఃఖము దుఃఖకారణము దుఃఖకారణనాశనము నిర్వాణమార్గసాధనము మొదలగుమార్గముల నుపదేశించెను. ఉపదేశానంతరమున సిద్ధమనస్కుఁడైనయాసుఁడు భిక్షు వయ్యెను. బుద్ధుఁడు బోధించిన నిర్వాణధర్మము సంపూర్ణముగ ననుసరించినవారు భిక్షువు లనంబడుదురు. వారు ప్రపంచసంబంధము విడిచిపెట్టవలెను. దారపుత్రులను బంధువులను గృహమును బాసి పోవలెను. ఆయాశ్రమంబునకు సత్ప్రివర్తనము దారిద్ర్యానుభవము ననునవి ముఖ్యలక్షణములు. అతఁడు బిచ్చ మెత్తుకొని జీవింపవలెను. ఊరుబైటనె కాని జనపదంబుల నుండఁ గూడదు. ఇట్లు నడుచుకొన్న వాఁడు కాలక్రమంబున భిక్షు వగును. యాసుఁ డాశ్రమమును స్వీకరించిన యచిరకాలముననె యాతని తండ్రియుఁ దల్లియు భార్యయు బుద్ధధర్మము నంగీకరించి గృహస్థశిష్యులైరి. యాసుని ముఖ్యమిత్రులలో నలుగురు విమలుఁడు సుబాహుఁడు పున్నజీయు గగుర్పతి యనువారు తమ మిత్రుని మార్గము ననుసరించి బుద్ధధర్మము స్వీకరించి భిక్షువులైరి. బుద్ధుఁడు ధర్మబోధ మారంభించిన మూఁడు మాసములలో నేఁబదిమంది శిరోముండనముఁ జేసికొని కాషాయవస్త్రముల ధరించి భిక్షువులైరి. మఱి కొన్నినాళ్ళలో నఱువది యర్హాతులైరి. భిక్షువులకె యర్హాతు లని పేరు.

## శివానంద స్మృతులు - 42

### శ్రీమత్ప్రివ్రాజిక శ్యామాప్రాణ

క్రీ. శ. 30-4-1929 (మంగళవారము
బేలూరుమఠము

అది సాయంకాలము. "ముంగేరి" నుండి వకీలు శ్రీ గంగాచరణముఖోపాధ్యాయుడు, బంధువులతోడ వచ్చి మహాపురుషులకు ప్రణమిల్లి —

"మీ ఆరోగ్యము చాల చెడినది. క్రిందటి సంవత్సరము చూచినపుడు ఇప్పటికి చాల చిక్కిపోయినారు" అనెను.

మహాపురుషులు—అవును. శరీరము బలహీనమై పోయినది. క్రమముగా క్షీణించుచున్నది. ఈ శరీరము షడ్వికారములకు లోనగును. ఇక కడపటి వికారము పట్టినది. ఇది దేహధర్మము. శరీరములన్నియు ఏదో ఒక దినము నశింపనే నశించును.

గంగాచరణబాబు—ప్రతిజాబులో ఈలాగే సమాచారము : నానాటికి మీ శరీరము నీరసమగుచున్నదని, ఆరోగ్యము శిథిలమగుచున్నదని. అందుచేతనే మిమ్ముల నొకమాఱు దర్శించుకొని పోదమని వచ్చితిని. మంచిదే అయినది.

మహాపురుషులు—చూడుము! ఈ బాహ్యదర్శన శ్రవణములచే ఏమి ప్రయోజనము? అంతరంగదర్శనమే దర్శనము. ఆ భగవానుడే అందఱిలోపల నివసించుచున్నాడు. ఆయన నుండియే ఈ విశ్వము ఉత్పత్తియగుచున్నది.

"తస్మా జ్జాయతే ప్రాణో
మనః సర్వేన్ద్రియాణి చ ।
ఖం వాయు ర్జ్యోతి రాపః
పృథివీ విశ్వస్య ధారిణీ ॥

"వానిలోనుండియే ప్రాణము, మనస్సు, సర్వేంద్రియములు, ఆకాశము, వాయువు, తేజస్సు, జలము సర్వవస్తువులకు ఆధారభూతమగు పృథ్వి ఉత్పన్నములైనవి." పృథ్వి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము అను పంచభూతములనుండియే వచ్చినవి. అన్నింటికిని అతడే నియామకుడు.

"భయాత్ తపతి సూర్యః" (కఠో 2-3-3) మున్నగునవి. దేవుని భయముచే సూర్యుడు తపించును—చివరకు సమస్తము వానిలోనే లయించును — "తజ్జలాన్" (ఛాందోగ్య 3-14-2)

"ఈ జగత్తునకు వానినుండియే ఉత్పత్తి, వానిలోనే స్థితి, వానియందే లయము." జన్మమృత్యువులు ఒకదానివెంట ఒకటి వచ్చును-దీని నెవరును ఆపజాలరు. భగవంతు డొక్కడే అజరామరశుద్ధబుద్ధముక్తస్వరూపుడు. అంతరాళమున వానియుపలబ్ధి నొందుటయే జీవితోద్దేశ్యము. భగవల్లాభమునొందిన పిదప శరీరము ఉన్నను, పోయినను ఒకటే. భగవానుడు మనహృదయములలోనే కలడు, అతడే సర్వభూతముల పరమాత్మ, విశ్వబ్రహ్మాండమునకు అంతరాత్మ. దీనినే ఉపలబ్ధిచేసికోవలెను.

గంగాచరణబాబు—మహారాజ్, నామనస్సులో ఒకప్రశ్న కలిగినది. మృత్యువుపిమ్మట అందఱును ప్రేతశరీరమును ధరింపవలసినదేనా?

మహాపురుషులు—ఆలాగు ఏమియు లేదు. యథార్థభక్తులు, భక్తిలాభమునొందినట్టివారు ప్రేతశరీరము దాల్పరు, వారు భగవానునితో ఐక్యము నొందుదురు, ముక్తులగుదురు.

గంగాచరణబాబు-ఆలాగైనచో శ్రాద్ధాది కర్మల ప్రయోజన మేమి? అందఱును శ్రాద్ధములు, తద్దినములు పెట్టుదురే?

మహాపురుషులు-అవన్నియు పాటింపవలసినదే. సాధారణనియమముల నెల్ల అందఱును ఆచరింపవలసినదే సుమా. కాని వ్యక్తివిశేషమున అట్టివానిని పాటింపక పోయిన ఎట్టి ప్రమాదమును లేదు. మచ్చునకు చెప్పెదను మీ భార్యవిషయము. ఆమె ఎట్టి పరమభక్తురాలు! ఆమె దేహత్యాగానంతరము కైలాసధామము చేరుకొన్నది. నేను స్పష్టముగ దివ్యదృష్టిని చూడగల్గితిని. మీరు ఆమెకై ఏమియు చింతింప నక్కఱలేదు. ఆమెకు సద్గతి లభించినది.

గంగాచరణబాబు భక్తిపరవశుడై అశ్రుజలముల వదలుచు శ్రీమహాపురుషుల పాదములపై పడి ప్రార్థింపజొచ్చెను. "స్వామీ, మీరు నాకు ఒకభిక్ష పెట్టుడు. పెట్టక తప్పదు. శ్రీ జగదంబ పాదపద్మములయందు నాకు భక్తివిశ్వాసములు కల్గునట్లును, మరణానంతరము ఆమె శ్రీచరణములకడ స్థానము లభించునట్లును చేయుడు." అని పల్కి పసిబాలునివలె ఎలుగెత్తి ఏడ్వ నారంభించెను.

మహాపురుషులు గంగాచరణబాబు తల నిమురుచు ఆశీర్వదించుచు, 'నాయనా' (ఈ మారు, మీరు, అని సంబోధింపలేదు) నీలో భక్తివిశ్వాసములు కలవు. అవి దినదిన ప్రవృద్ధమానము లగు గాక. మాటిమాటికి ఆశీర్వదించుచున్నాను. నీకు దృఢవిశ్వాసము కల్గుగాక. నీపై జగన్మాతకృప మెండుగ కలదు".

గంగాచరణబాబు. మీరు పలుకు చున్నారు, కాన తప్పక కల్గును. తల్లి మీ మాటల నాలకించును. నేను మిమ్ములనే నమ్మి యున్నాను మీరే నాబలము.

మహాపురుషులు. అమ్మ మన మాటలు వినును. సరళహృదయముతో, వ్యాకులచిత్తముతో చేయు ప్రార్థనలనెల్ల ఆమె ఆలకించి తీరును. దయ, దయయే సుమా. వాని దయలేనిదే ఏమియు జరుగదు. జయప్రభూ! జయకరుణామయుడా! నీకు జయ మగు గాక.

గంగాచరణబాబు స్వామివారి ఆశీస్సుల నొంది ఊరడిల్లెను. సంపూర్ణ విశ్వాసము కల్గెను. ఒకటిరెండు మాట లాడి స్వామివారి కడ సెలవు పుచ్చుకొనెను. అటుపై గంగాచరణబాబుగారి కుమార్తె స్వామివారికి ప్రణమిల్లి ఆశీర్వదింప గోరెను. మహాపురుషులు కరుణార్ద్రహృదయముతో "అమ్మా, శాంతితో జీవింపుము. తల్లీ, నీభర్తకు, బిడ్డలకు, బంధువులకు, స్నేహితు లెల్లరకును శాంతి కల్గు గాక. ఈ ప్రపంచములో సుఖము లేదు. సుఖదుఃఖముల సరిపోల్చిన, సుఖము చాలతక్కువ. కాని భగవద్భక్తుడై మెలగినవాడు ఈప్రపంచములో శాంతి పొందకల్గుచున్నాడు. అట్టివాడు కష్టముల లోను, సుఖములలోను నిశ్చలముగ నుండును. ఎందుచేతననగా అట్టివాడు సర్వము భగవానుని ప్రసాదముగ స్వీకరించును. భగవానుడే సుఖదుఃఖములనెల్ల ప్రసాదించును కాన, అవన్నియు వాని ఆశీస్సు లని ఎంచి చలింపక సహించి యుండును. అట్టివాడు సుఖములుకల్గిన విఱ్ఱవీగడు, దుఃఖములు కల్గిన క్రుంగిపోడు. ఈలోకములో సుఖము ఏలాగు స్థాయిగాక, క్షణమాత్రమో దుఃఖముకూడ అలాగే క్షణస్థాయి. అవి యెల్ల వచ్చుచు పోవుచునుండును. శాశ్వతముగ ఉండున దేదియు లేదు. ఒక్కటే నిత్యవస్తువు. అదియే శాంతిస్థానము. అతడే భగవానుడు. వానినే అంటిపట్టుకొని యుండుము తల్లీ, జీవితములో శాంతి నొందెదవు."

అటుపై ఒక చిన్న బాలిక మహాపురుషులకు నమస్కరించెను. శ్రీవారు ఆబాలిక శిరస్సుపై హస్తముంచి ఆశీర్వదించి – "వీరందఱు జగన్మాతృసమానలు.

"స్త్రియః సమస్తాః సకలా జగత్సు"

జగత్తులోని స్త్రీలెల్లరు జగన్మాతృ వివిధ శక్తులే. అటుపై ఒక భక్తురాలు వచ్చి స్వామివారికి ప్రణమిలి వారి ఆరోగ్యవిషయమె ప్రశ్నింప మహాపురుషులు "ఆరోగ్య మేమియు బాగుగ లేదు. ముసలిశరీరము ఇం కేమి బాగు అగును ?"

భక్తురాలు ఆహారము కూడ తగ్గినది కదూ ?

మహాపురుషులు—అవును. ఏదో కొంచె పాటి ఆహారము తినుచున్నాను. జీర్ణశక్తి చెడినది. నోటిరుచియే లేదు. తిండిపై ఇచ్ఛయే పోయినది. ఈశరీరము ఉండునంతవఱకు దాని కొఱకే ఏదో ఆహారము భుజించుట, భగవంతుని స్మరించుటకే కదా ఈ జీవితము. భగవధ్ధ్యానము, భగవత్స్మరణ తప్ప వే ఱొండు రుచించుట లేదు. భగవానుని హృదయాంతరాళమున దర్శించిననే ఆనందము కల్గుచున్నది. ఈజగత్తు రెండు దినాలపాటిది. తల్లి, తండ్రి, సోదరులు, ఆత్మీయులు, బంధువులు, స్నేహితులు అందఱు అనిత్యులే. రెండురోజులపాటి వారు. అంతరాత్మ ఒక్కటియే సర్వదా తోడు నీడయై యుండును – అదియే నిత్యమైనది.

భక్తురాలు—స్వామీ, మాబోటి వారల గతి ఏమి? మేము మాయాబద్ధులగు జీవులము.

ఈసంసారము నట్టె పట్టుకొని "నాది, నాది" అను అహంబుద్ధితోనే చచ్చిపోవుచున్నాము. కాని ఈ మాయాబంధనమును తెంచుకొలేక పోవుచున్నాము. పలుదుఃఖములపాలైనను, ఈ సంసారమును వదలలేకున్నాము.

మహాపురుషులు-భగవానుడే గతి. వానినే శరణుజొరుము. అతడే సర్వస్వము. "త్వమేవ మాతా చ పితా చ" మాత, పిత, సోదరుడు స్నేహితుడు, బంధువును అంతయు అతడే సుమా. వ్యాకులచిత్తముతో వానిని ప్రార్థింపుము. కచ్చితముగ అతడు కృప జూపును. ఈ దుఃఖభూయిష్ఠమగు ప్రపంచములో భగవంతు డొక్కడే సుఖనిలయము. "ఒంటె ముళ్ళకంపను తిన్నట్లు" అని శ్రీరామకృష్ణులు పలుకువారు. నోటినుండి రక్తము కాఱుచున్నను ఒంటె ముళ్ళకంపను తినుట మానదు. సంసారజీవులసుఖము ఈలాంటిదే సుమా! తల్లీ, వాని కృప లేనిదే ఏమియు కలుగదు." కొంతవడి ఊరకుండి మరల మహాపురుషులు ఈలా గనిరి. "ఈ సంసారము అనిత్యమని తెలిసికొనుటయు సహజమైన విషయమా ఏమి? వానికృపలేనిదే ఇట్టి జ్ఞానము కలుగదు. ఎక్కువగ పరితపింపుము, ప్రార్థింపుము. అప్పుడే వానికృప కల్గును. అతడు అంతరంగముననే విరాజిల్లుచున్నాడు. దయ చూపి ఈ మాయావరణమును తొలగించినచో వానిని చూడగల్గుదుము. కృప! కృప!! వానికృప వినా వేఱొండు ఉపాయము లేదు."

# శివానంద లేఖావళి

## 83

శ్రీరామకృష్ణమఠము,
బేలూరు, హౌరా.
30 ఆగస్టు 1919

శ్రీమన్ ——,

నీజాబు చేరినది. సంగతులు తెలిసినవి. గురుదేవుడు ప్రారంభించిన మానవసేవాకార్యమును మీ రందఱును సాగించుచున్నారు. మీ శక్తికొలది ఈ మహాకార్యమును, మీ రెంత కష్టమునకు శ్రమకు ఓర్చి, నెగ్గించుచున్నారో, అదంతయు ఆయన యెఱుగును. మీయందఱ పట్ల గురుదేవుడు సదా కృపాపూర్ణుడే. మా కందఱికిని మా ప్రాణములపై నున్నంతప్రేమ మీయందున్నది. మేము మిమ్ము సదా దీవించుచుందుము. మీ రందఱును గురుదేవునివంకకు త్వరగొని పురోగమింపుడు. గురుదేవుడే మీ పట్ల కృపాపూర్ణుడై యుండగా, మీపనిని గని ప్రభుత్వోద్యోగులు ప్రీతు లగుచున్నా రనుటలో ఆశ్చర్య మే మున్నది? ఆ వార్త విని మేముసు ఎంతో సంతోషించితిమి. అచ్చటి కార్యక్రమమును ముగించిన పిమ్మట,... ... గారితో ఆలోచించి, నీవు పోనెంచిన చోటికి పొమ్ము. భగవంతుడు నిన్ననుగ్రహించును గాక. ఏకాంతమైన చోట ఒంటరిగ నుండబోవుచున్నావు. మిక్కిలి జాగరూకుడవై మెలగుము. వయసో, ఎలప్రాయము; మనసు నెలయించునవో, పెక్కు లున్నవి. ఏమైన, సర్వేశ్వరుడు నిను ధన్యు నొనర్చు గాక, అనుటే హృదయపూర్వకమైన నా ప్రార్థనము.

నా ఆరోగ్యము బాగులేదు. వారము పది దినాలుగా పడిసెముతో జ్వరముతో బాధపడుచున్నాను. ఈదినము నాదేహపరిస్థితి రవంత

మెఱుగుగా నున్నది. మఠమున తోష్ణస్థితి బాగు లేదు. ఈసారి జగదంబామూర్తిపూజను మఠమున జరుపవలెననుకొనుచున్నారు. ఆమె సంకల్పించిన ట్లగును గాక. మీ కందఱికి నా హృదయపూర్వక ప్రేమాశీస్సులు

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

## 84

శ్రీరామకృష్ణమఠము,
బేలూరు, హౌరా.
5 సెప్టెంబరు 1919

మఱ-

నీజాబు చేరి కొన్నాళ్లైనవి. కాని నా కారోగ్యము బాగు లేనందున జవాబు వ్రాయలే నైతిని. ఇప్పటికిని నాకు సమగ్రారోగ్యము కుదుర లేదు.

ప్రస్తుతము జీవితము నీవు గడపుచున్న విధము పరిశుద్ధమైన విధము. ఇట్లే సాగింతువేని జీవితసాఫల్యమును పడయుదువు. ఇదే రీతిలో పద, ముందుకు పద.

“ఎవని కిదే తుది జన్మమో అతఁడీ ‘గేహము’నకు వచ్చు” నని శ్రీరామకృష్ణుఁడు పల్కిన పల్కులను ఎంత ప్రయత్నించియు అర్థముచేసి కొనజాలకున్నా నని వ్రాసితివి. అర్థము తెలిసికొన గోరితివి. నే నేరీతిగ నర్థముచేసికొంటినో —వ్రాయుచున్నాను.

ప్రస్తుతజన్మము తుదిదా మొదటిదా, రెండవదా, మూడవదా అను తలంపు భక్తులకు కలుగనే కలుగదు. భగవంతునిపట్ల తమ భక్తిని ప్రేమను వర్ధిల్లఁజేసికొను టెట్లో అనియు తమకు స్థిరవిశుద్ధతను సమకూర్చుకొను టెట్లో అనియునే భక్తు లాలోచింతురు. భగవత్సంకల్పమునకు పరతంత్రులుగ నుండుటకు వారు ప్రయత్నింతురు. జననమరణములను గూర్చిన చింత వారి కుండదు. సమస్తమును భగవదిచ్ఛాధీన మనుటే భక్తుని విశ్వాసము. ‘ఎవని కిదే తుది జన్మమో అతఁడీ గేహమునకు వచ్చు’ నని శ్రీరామకృష్ణుఁడు పల్కిన పల్కులకు నేను గ్రహించిన యర్థ మిది:—శ్రీరామకృష్ణుఁడు భగవంతు నవతార మనెడి త్రికరణశుద్ధమైన విశ్వాసము గలవాఁడు ఆయనను దరియును. అతని కిదే తుది జన్మము.

మంత్రోపదేశమును పొందిన పిమ్మటనో సన్న్యాసదీక్షను స్వీకరించిన తర్వాతనో భక్తుని యందసభ్యవర్తనము గన నగునేని, అది చాల తప్పు అనుటకు సందేహము లేదు, అయినను శ్రీరామకృష్ణుఁడు దేవు నవతార మనెడి నమ్మకమాభక్తునకు నిక్కముగ నున్నచో, ఈజన్మములోనే ఎప్పుడో ఒకప్పు డతఁడు తన దుష్ప్రవర్తనకు తప్పక పశ్చాత్తాపపడి తీరు నని నా నమ్మకము. దురదృష్టవశమున అతని కనుతాపము కలుగదేని, పైని పేర్కొన్న నమ్మకమతనికి లేదనియు అతని కీ జన్మమే తుది జన్మము కాదనియు గ్రహింపవలయును. దాతలలో అందఱికంటె అత్యధికకరుణామయులు మంత్రప్రదాతలే. మంత్రప్రదానము వారి అనుగ్రహము ఔదార్యము. మంత్రోపదేశము నొందినవాఁడు ఆ యనుగ్రహౌదార్యములకు తా నర్హుఁడ నని నిరూపించుకొన జాలకపోయినచో అది అతని దురదృష్ట మనియే చెప్పవలెను. ఈ జన్మమున కాకున్నను మఱొకజన్మమున నైనను అతని సాధన ఫలించి తీరును. ఏల యన నీవు పేర్కొన్న గురువులు ఉపదేశసమయమున ప్రసాదించిన మంత్రము అమోఘమైనది. అది ఎన్నటికిని రిత్త వోదు. ఈ జన్మములోనో మఱొకజన్మములోనో అది

ఫలించి తీరును. ఆ గురువులకు లౌకికవాంఛ లేవియు లేవు. ఎట్టి ప్రతిఫలాపేక్షయు లేక శుభములను వర్షించుటే వారి పని. నే జెప్ప నెంచినది చెప్పినాను. ఇక నీ వెట్లు అర్థము చేసికొన్న నట్లు.

ఆధ్యాత్మికసాధనాభిరతి సడలకుండువారిని జూతువేని, వారు సాధువతంసు లని తెలిసికొనుము. "సఖా, బ్రతికినంత కాలము నేను నేర్చుకొనుచునే యుందు" నని గురుదేవుడు చెప్పుచుండెడివాడు. అది మహోదాత్తమైన యుపదేశము. లక్ష్యము సిద్ధించిన పిమ్మటకూడ సాధనతృష్ణ తగ్గదు. కాని దృక్పథములో మా ర్పుండును. నాహృదయపూర్వకప్రేమాశీస్సులను చేకొనుము. నేను వ్రాసిన దానిని చదువుము, చింతనసేయుము.

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

అనుబంధము : బాగ్బాజారులో నున్న మహారాజుగారి యారోగ్యము చాల మెఱుగుగా నున్నది.

## 85

శ్రీరామకృష్ణమఠము
బేలూరు, హౌరా
9 ఏప్రిలు 1920

శ్రీమన్ —,

నీజాబు చేరినది. సంగతులు తెలిసినవి, భగవదనుగ్రహముచే నీవు చాల హాయిగా ప్రశాంతముగా నున్నా వను వార్త తెలిసినంతనే నే నెంతయు సంతోషించితిని. నీకు నిండు భక్తిశ్రద్ధాప్రేమపవిత్రతలు గలుగు గాత మనుటే హృదయపూర్వకమైన నాప్రార్థనము. తొందరపడకు, మెల్లగా ముందునకు సాగుము. ఓర్పు లేకున్నచో ఈ మార్గమున నీకు శీఘ్రపురోగతి గలుగదు. సమస్తమును భగవదనుగ్రహాధీనము. కృపచే సర్వేశ్వరుడు ప్రేమమార్గమున నిన్ను తనయొద్దకు చేరదీసికొనునేని, నీమనస్సు ఆయన చరణారవిందములందు నిమగ్నమై యుండగలదు. క్షణకాల మాయన నీమనస్సును తనపాదములం దాసక్తిగొలిపినను, అది మహానుగ్రహ మని గ్రహింపుము. తొందర పడుట లాభకరము కాదు. మెట్టుమెట్టుగా మెల్లగానే ముందున కేగ వలయును. మనస్సును మితిమీఱి బలాత్కరింతువేని, కొన్నాళ్ళకు నీ కెంతయు అశాంతి గల్గును. ఇప్పుడు నీవు పడయుచున్న శాంత్యానందములు వినష్టము లగును, ఘోరాశాంతి మహార్ణవమున మునిగిపోవుదువు. ప్రస్తుతమునకు దేవు నిట్లు ప్రార్థింపుము: "దేవా, కరుణించి నా మనస్సును నీపావనాంఘ్రులవంక కాకర్షించి అట నెలకొన నిత్తు వేని, అప్పుడే ఆనస పాటుండును. ఆలాగు కాకున్న నాకు వేఱు దిక్కు లేదు" నీకు అనుకూలమైన ఆసనముననే కూర్చుండుము. అందుంగూర్చి విచారింప నక్కఱ లేదు. ముఖ్యముగ కావలసినది భగవంతు నను గ్రహము.

ఒకపాట ఉన్నది:

చూపు నీ వొసంగకయున్నఁ జూడ నెట్లగు నిను? దరి కీవు రావేని మనసు నీ దెసకు పరుగిడఁగా నేరీతిఁ జాలు? చెపుమ.

కావున చెప్పుచున్నాను. నడవడిచే నీ పేరును సార్థకపఱచుకొమ్ము, నీవు ధీరేశుడవు, అధీరుడవై అశాంతి నొంద నేల? ఏది నీకు శాంత్యానందముల నొసగుచున్నదో దానినే కొనసాగించుచుండుము. దేవుడు తనపావన మూర్తిని హృదయమున నెలకొల్పుకొననిచ్చి

ధ్యానింప శక్తి నిచ్చుచున్నంతసేపు ధ్యానించుచుండుము. ఆ శక్తిని హెచ్చింపు మని ప్రార్థింపుము. ప్రార్థింతువేని ఆయనకృపచే సమస్తమును పడయగలవు. 'బాలానాం రోదనం బలమ్' 'శిశువుల బలము ఏడుపే' 'అమ్మా, తే' 'అమ్మా, తే' అని విలపించుటకే కాని శిశువునకు వేఱెందుకును శక్తి యుండదు. భక్తునివిషయము నట్టిదే. భక్తిలో ప్రేమలో సడలుపాటు కలిగెనేని, శిశువువలె విలపించుచు దేవుని ప్రార్థింపవలసినదే, వేఱు దారి లేదు. ఈ విషయమును గురుదేవుడు మాకు మాటి మాటికిని జెప్పుచుండువాడు. ఎవరైనను 'గురుదేవా, నాకు ధ్యానప్రార్థనలు చక్కగా సాగుట లే' దని మొఱపెట్టుకొన్నప్పుడు వెంటనే ఆయన చెప్పు జవాబు: "ప్రార్థింపుము, ప్రార్థింపుము. లోకజనని సమస్తము నొసగగలదు." కావున నేనును జెప్పుచున్నాను; భగవత్కృప కావలసినచో ప్రార్థింపుము.

ఇంతకంటె ఏమి వ్రాయుదును? నాహృదయపూర్వక ప్రేమాశీస్సులను చేకొనుము. సర్వేశ్వరుడు నీకు యోగక్షేమముల సమకూర్చుగాత.

భవదీయ శ్రేయోభిలాషి

శివానంద

# విశ్వగుణాదర్శము

## శ్రీరంగనాథానందస్వామి

[శ్రీరంగనాథానందస్వామి ఒకటిన్నరసంవత్సరములకాలము ప్రపంచపర్యటనము సాగించినారు. అమెరికాలలోను యూరోపులోను ఆస్ట్రేలియాలోను ఆగ్నేయాసియాలోను దూరప్రాచ్యములోను—మొత్తము ఇరువదియైదుదేశములను వారు దర్శించినారు. ఆ దేశాలలో ఉపన్యాసములు కావించినారు. విద్యార్థులతో, ఆచార్యులతో, భక్తులతో, పదవులలో ఉన్న మగువలతో, మగవారితో సమావేశములు నెరపినారు. భారతదేశమునకు మరలి ఆయన అద్వైతాశ్రమముననుండగా సోదరసన్న్యాసులు రక్తిగొల్పు వివిధవిషయములను ఆయన నడిగి చెప్పించుకొనినారు. ఆ సంభాషణము నిట సంక్షేపించుచున్నాము.]

ప్రశ్న—పాశ్చాత్యదేశములలోని మానవుల ప్రవణతలలో మీకు మిక్కిలి మెప్పు గూర్చిన వేవి? వేనిని గని మీరు మిక్కిలి నొచ్చుకొంటిరి?

జవాబు—నా పర్యటనల ఒకటిన్నిరసంవత్సర కాలములో పూర్తిగా ఒక్కసంవత్సరమును పాశ్చాత్యదేశాలలో ముఖ్యముగా సంయుక్త రాష్ట్రాలలో గడపితిని. అచ్చట అనేక విషయములు ఏయాగంతుకునికైనను, మెప్పు గూర్చును. అట్లే నాకును అవి మెప్పును గూర్చినవి. అచటి ప్రజల కున్న గొప్పసత్త్వ, ఒడలు దాచుకొనక కష్టపడి వారు చేయు పనులు, వారు సేకరించి పెట్టియున్న అద్భుత సంపద, భౌతికాదిశాస్త్రములందును సాంకేతిక విద్యలయందును వారి నిష్ణాతత్వము—ఇవి యే యాగంతుకుని డెందమునకైనను నిక్కముగ హత్తుకొను విషయములు.

మీ ప్రశ్నలో మీరే సూచించినట్లు ఆగంతుకులను విషాదకరములైన విషయములును అచట నున్నవి. ఎక్కువగా మీ కచట కనిపించునది ఐహికపరత. నేటి అమెరికా నాగరకతాతత్త్వము నారసినచో ఇంద్రియవశ్యుడగు మానవుడే దాని తుది లక్ష్యముగ గననగును. ఆ తత్త్వము ప్రకారము ఇంద్రియప్రీణనమే పరమాదర్శ మగుచున్నది. మానవుడనగా దేహమే, దేహపోషణమే సర్వస్వము అన్నమాట. దీని ఫలితము మొదట బాగుగనే యుండెను. మానవుడు శక్తివంతుడు కార్యశూరుడు నయ్యెను. భౌతికస్థాయిలో అతడు తన్ను ప్రకటించుకోగలిగినాడు. కాని మలిదశలో ఈ తత్త్వములోని దోసగులు కనబడజొచ్చినవి.

ఆ దోసగులలో నొకటి ఉజ్జృంభితమయిన యింద్రియపరత. దీనిని గుర్తింపని ప్రేక్షకుడుండడు. ఇట్టిదే దుండగము లొనరించు నభిరతి. అమెరికాలో నేడు ప్రముఖముగ గననగునవి యీ రెండు-ఇంద్రియపరత దుండగముల కొడిగట్టు ప్రవణత. సంయుక్తరాష్ట్రాల లోని ఈ యింద్రియవ్యభిచరణాభిరతిని మాటలలో దెల్పుట కష్టమయినను, అది అత్యంత ప్రకటముగ నున్నది. ఇది యెంతయు విషాదకరమైన పరిస్థితి. మహిళపైని ఆధ్యాత్మికదృష్టి లేనే లేదు. కేవలము ఆమె దేహము అంగడిలో అమ్మకపు సరకుగా నున్నది. పరిశ్రమరంగములోను ప్రకటనలలోను పత్రికలలోను రేడియోలోను ఇది నేడు అవధులు మీఱినది. న్యూయార్కులో ఒక నాటకము ప్రదర్శింపబడిన దట. అందు ఎట్టి జంకుగొంకులును లేక బండబూతులు రంగముపై చూపబడినవట. విశ్వకళాపరిషత్తులలో సైతము ఇట్టివి జరుగుచున్నవి.

ఎట్టి ఆగంతుకునైనను నొచ్చుకొనజేయు నంశములలో ఇవి కొన్ని. ముఖ్యముగ ఆధ్యాత్మికదృష్టియు ప్రాచీనసంస్కృతియుగల భారతీయునికివి మిక్కిలి దుస్సహములు కాని ఇవి నాకు పత్రికలు పుస్తకములు మున్నగువాని ద్వారా తెలియవచ్చినవి. నేను కలసికొన్నవారు గొప్పవారు. విద్యార్థులలో ఉపాధ్యాయులలో పౌరులలో వరిష్ఠులతో సమాగమము నాకొనగూడినది.

ప్రశ్న—మీరు దర్శించిన దేశాలలో మానవుల పునరుద్ధరణమే ప్రపంచమున సమస్య అని గుర్తించిన మేధావులతో మీకు కలయిక గలిగెనా? ఈ సమస్యనుగూర్చి వారి యభిప్రాయమేమో?

జవాబు—అట్టి మేధావులతో కలయిక నాకు గలిగినది. అమెరికాకు వచ్చిన యిప్పుడు మాత్రమే కాదు, ఇంతకుమునుపు యూరోపియ దేశాలకు నేను పోయియుండినప్పుడచ్చటను, దక్షిణమెరికాలోని పలు దేశాలలోను, ఆగ్నేయ దేశాలలోను, దూరప్రాచ్యాసియా దేశాలలోను అటువంటి వారితో నేను కలసికొనియున్నాను. నవ్యనాగరకత పేర మానవతతికి గలిగిన అధఃపతనమును గని నిజముగ విస్మితులైన వారున్నారు. కాని పాశ్చాత్యదేశాలవారికి మానవస్వభావప్రగాఢపరిజ్ఞానము లేదనుటను నేను గుర్తించినాను. ఇంద్రియపరిధుల దాటించి, మానవుని స్వభావమును ప్రత్యక్షమొనర్చు తత్త్వశాస్త్ర మచ్చట లేదు. అట్టి సాక్షాత్కారమునకై వారుబలాటపడుచున్నారు, కాని స్పష్టముగ గ్రహింపజాలకున్నారు. ముఖ్యముగా సంయుక్తరాష్ట్రాలలో నేను గన్న దిది—రచయితలు సంఘదోషాలను చాల చక్కగా వర్ణించుచుందురు. నేటి మానవుల చిక్కులును కష్టాలును మన డెందములలో

హత్తుకొనునట్లు వారు ప్రపంచించుచుందురు. కాని చెడుగులకు ప్రతిక్రియలను జూప వారు దొరకొందురేని, ఆ చెడుగులకంటె వీరు సూచించు ప్రతిక్రియ లెక్కువ యనర్థకరము లుగ నుండును. మనోవ్యాధుల చికిత్సారంగ మున మాత్రమే కాక, ఇతరరంగములలో పెక్కింట కూడ పరిస్థితి అట్లే యున్నది. భారత దేశము ప్రపంచమున కమోఘముగ సహాక రింపగల రంగ మిది. వీనిని చేయుము, వానిని మానుము అని విధించుటయు నిషేధించుటయు కాదు భారతీయపద్ధతి, మానవుని మహిమను అంతస్తునుగూర్చిన కనువిప్పును గలిగించుటే భారతీయవిధానము. వేదాంతమునకు గల గొప్ప తన మదే. ఈవిధముగ దానిని ప్రజలయెదుట నుంతు మేని, అన్ని దేశాలమేధావులును వెను వెంటనే సాదరముగ గ్రహింతురు.

ప్రశ్న—అమెరికాలో శ్రీ వివేకానంద స్వాముల యాధ్యాత్మికోపదేశాలు భవిష్యత్తు నెఱిగి తదనుగుణముగ కావింపబడిన వనుటను అనగా వారి సమస్య లిప్పటిరూపు దాల్చుటకు ముందే వానికి పరిష్కారములుగ స్వామిజి వేదాంతమును యోగమును బోధించినా డను టను అచటి నాయకులు గుర్తించినారా ?

జవాబు—అత్యల్పసంఖ్యాకులగు మేధా వులు మెల్లగా గుర్తించుచున్నారు దానిని. అమెరికనుల సంఘముపై సంస్కృతిపై వివేకా నందస్వాములముద్ర సార్వత్రికముగా అంతగా కనిపించుటలేదు. ముఖ్య కేంద్రాలలో అందుకై వెదకవలయును. చికాగోలో విశ్వమతమహా పరిషద్వేదిపై శ్రీస్వామిజి యగపడిన తర్వాతి పదేండ్లకాలమువఱకు అందుల ప్రభావ మెక్కువ గానే యుండెను. క్రైస్తవ మతవ్యవస్థలో విప్ల వాశయాలు, ముందున కుఱికించు ఆశయాలు, ఈనాడు చెలరేగుచున్నవి కదా. ఇవి అలనాటి స్వామిజి ఆశయాలతో తు. చ. తప్పక సంవ దించుచున్నవి. చికాగోలో జరిగిన విశ్వమత మహాపరిషత్తునకు స్మారకముగా నిటీవల 76 వ వార్షికోత్సవము జరిగినది. అప్పుడు కాథొలిక్కు నాయకుడైన ఫాదరు రాబర్టు కాంప్బెల్లు తన ప్రసంగములో కాథొలిక్కు వ్యవస్థలో నేడు చెల రేగుచున్న తిరుగుబాట్లను శ్రీ వివేకానంద స్వామి ఆ నాడే సూచించినా డని తెల్పి యున్నాడు: వివేకానందునిగూర్చి చదివి యున్న మేధావు లందఱును ఈ విషయమును గుర్తించుచున్నారు. కాని స్వామిజిని గూర్చి చదివియుండని వారి సంఖ్య అనంతము.

వేదాంతసిద్ధాంతమును బహిరంగమున గొనియాడుటల నట్లుండనిండు. ఏ యావశ్య కతను స్వామిజి గుర్తించెనో ఆ యావశ్యకతే అట కననగుచున్నది. పాశ్చాత్యనాగరకత కొక యాధ్యాత్మికపుపునాది ఏర్పడవలెననియు, మతములు అసంకుచితములుగ నుండవలెననియు, వానికి పరస్పరాశయవినిమయము నిరాక్షేప ముగా సాగుచుండవలె ననియు స్వామిజి వక్కా ణించియుండెను. శ్రీవివేకానందాదుల ద్వారా వేదాంత మీా డెబ్బదేండ్లుగా ఏమి కఱపు చుండెనో ఆపాఠము నేతమపాఠముగా బోధించు చుండువారు ఈనాడుకూడ నున్నారు. కావున దీనిని వారు నిదానముగా గుర్తించుచున్నారు, చాల నిదానముగ ! అమెరికనులు, తమ తాత్కా లికసమస్యలలో, తాము సాధించుకొన్న గొప్ప లలో, సాంకేతికవిద్యలో తాము గడించిన మహా విజయాలలో నిమగ్నులై యున్నారు. అమెరికనులు తమ సమస్యలను భారతీయుల ఆశయాలయు విలువలయు వెలుగులో నుంచి ఇంకను పరికించుకొన లేదు. కాని గొప్ప పరి పాకము కలుగనున్నది. నే నీ లాగు చెప్పు చున్నందుకు కారణ మిది—దాదాపు తొంబది

పర్యాయములు రేడియో ప్రముఖులు వార్తా పత్రికల ప్రముఖులు నాతో ఏకాంత సమాగమ సంభాషణలు జరిపియున్నారు. అందఱు నన్ను ఈలాగు ప్రశ్నించినారు: "అమెరికా కానడా దేశాలప్రజలు భారతీయుల యాశయాలవంక కింతగ మ్రొగ్గుచున్నారే, ఇందుకు మీరు చెప్పు సమాధాన మేమి?"–సర్వసాధారణముగ అడుగబడుచుండిన ప్రశ్న యిది.

పాశ్చాత్య దేశాల ప్రజలు ఉత్తేజకరమైన ప్రాచ్యదేశాల దివ్యజ్ఞానమువంకకు మ్రొగ్గుచున్నారనుటను ఈవార్తాప్రచారక ప్రముఖులు నిక్కముగ గుర్తించుచున్నారు. పాశ్చాత్య దేశాలలో భారతీయాశయాలను వేదాంతాశయాలను వ్యాపింపజేయుటకై శ్రీవివేకానంద స్వామి ప్రారంభించిన యుద్యమమునకు నేడు బలము చేకూరుచున్నదని అది యింకనింకను ప్రబలతరమగుచున్న దని యిందువలన తెలియ నగుచున్నది. ఐనను భారత దేశమునుండి వెలుపలికి వ్యాపించునవి ఎల్లప్పుడును శ్రేష్ఠములైన విషయములుగనే ఉండుట లేదు. ఒక్కొక్కప్పుడు చౌకవిషయములుగూడ వెలుపల కేగుచుండును ప్రస్తుతకాల సమస్యలను గూర్చి భారతీయులయాశయ మేమో పారమార్థిక దృక్పథ మేమో తెలిసికొనవలయు ననుకుతూహలము అమెరికాప్రజలలో విశేషముగా కన నగుచున్నది. విచారశీలులకును పరమార్థాన్వేషకులకును భారతీయవరిష్ఠాశయాలే అందుబాటగుచుండును. ఇతరులకు అసారములును అల్పసారములు నగు విషయములు చేకూరుచుండును. (సశేషము)

# ఊర్ధ్వగతి

## కీ. శే. కులపతులు ముట్నూరు కృష్ణరావుగారు

సోదరా, ఎందుకీ తటపటాయింపు? నేల మీద ఎన్ని పరుగులైనా తీయగలవు, ఎన్ని గంతులైనా వేయగలవు. కాని భావప్రపంచంలోకి వచ్చేసరికి, గాలిపీల్చ లేనట్లు ఉక్కిరిబిక్కిరై భయగ్రస్తుడవగుతావు.

నీవు మనుష్యుడవు, మనోమయపురుషుడవు. భాషాప్రపంచంలో స్వేచ్ఛగ ఆనందంగ విహరించడానికి కాదా, నీకు ఊహాలనే రెక్కలిచ్చింది? నీవును విహంగమవై భావశిఖరాలను దాటి ఎగరవేమి?

భావజగత్తు అయథార్థము, కాల్పనికము అని తలంపకు. భౌతికశక్తికంటె మనోమయ శక్తి వేయిరెట్లు బలవత్తరమైనది. వైశాల్యంలో ఎన్నిరెట్లు విస్తీర్ణమో చెప్పనలవి కాదు. దేశకాలముల అంచులనుగూడ దాటిపో గలదు.

ప్రాణశక్తి భౌతిక జగత్తునుండి ఉద్భూతమైనను అచేతనము నంతను శాసించి ఆధిపత్యమును ప్రతిష్ఠించుకొనుచున్నది. ప్రాణశక్తిని నీవు ప్రత్యక్షముగ చూచుటలేదా? అది అచేతనమును సహితము చేతనముగ మార్చివేయగల్గుచున్నది.

అట్లే మానసికశక్తి ప్రాణముకంటెగూడ అధికమై ప్రబలమై, విస్తీర్ణమై తన ఆధిరాజ్యాన్ని స్థాపించుకొంటున్నది

నీలో బుద్ధి ప్రస్తుతము సంకుచితమై, దుర్బలమై, చంచలమై నిన్ను భయవిహ్వలునిగ చేయుటచేత, భావప్రపంచంలోకి అడుగిడడానికి జంకుతున్నావు.

నీకున్న బుద్ధిని శాస్త్ర, నేలమీద సాముకే ఉపయోగించగల్గుచున్నావు. కాని, భూమిపై ఉన్న ఊర్ధ్వలోకాలకు పోవడానికి ప్రయోగించుకోలేక నీ జీవితాన్ని కూపస్థమండూకంలాగు క్షుద్రపఱచుకొంటున్నావు.ఎంత విచారకరము!

సోదరా, బుద్ధివ్యవసాయానికి గడంగుము. దానిని రాపిడిచేసినకొద్దీ అది విజ్ఞానమై, జ్ఞానశక్తి, క్రియాశక్తి, ఇచ్ఛాశక్తి త్రివేణివలె తరంగితమౌతూ నిన్ను మహాలోకమునకు జేర్చగలదు.

నీ జ్ఞానశక్తి సత్యలోకద్వారాలను తెఱచి, ఆత్మజ్యోతినుండి వెలువడు రోచిస్సులను గోచరింపజేయును. క్రియాశక్తి నిన్ను కర్మవీరునిగ నొనర్చి, తపోలోకమునకు గొంపోవును. ఇచ్ఛాశక్తి నిన్ను ప్రేమమయునిగ నుల్లసింపజేసి జనలోకమున ఆనందరసనిమగ్నునిగ గావించును.

లెమ్ము: ఊర్ధ్వలోకాలన్నీ ద్వారాలను తెఱచుకొని నీరాక కెదురుచూచుచున్నవి. మార్గమధ్యమున నిలిచిపోకుము. నీ దేహము, నీ ప్రాణము, మనస్సు నిన్ను వదలిపోవునేమో యని బాధపడుచున్నావు—భయము వలదు. అవికూడ నీకు సోదరయాత్రికులై, నీతోబాటు అమృతమును గ్రోలి, అమరత్వమును పొంద గోరుచున్నవి.

# విశేషదర్శనబీజము

### సుబంధు

ఎదుగుచున్న శిశువును పరికింపుడు. పెద్దవారు పెడదారులు ద్రొక్కించి చెఱుపకున్నచో పరిసరములను అర్థముచేసికోవలెనను సహజాభిలాష శిశువులో కననగుచుండును. దృశ్యములు శబ్దములు చలనములు శిశువు నాకర్షించును. శిశువు తన అందుబాటులోని వస్తువులను అందుకొనుచు లాగుచు నోటబెట్టుకొనుచు పాఱవేయుచు ఎన్నిపర్యాయములో మనకు చిరాకును విసుగును గలిగించుచుండును. ఈ శిశుచేష్టల కర్థమేమి? శోధింపు మనియు స్వానుభవముచే తెలిసికొను మనియు కేవలము సహజావబోధమే శిశువును ప్రేరించుచున్నదనుట.శిశువుమాతృభాషనలవఱచుకొనుటయు ఈరీతిలోనే. జీతముపుచ్చుకొను ఉపాధ్యాయుని కొఱకో ఆచారప్రయుక్తమైన తర్ఫీదుకొఱకో ఏ శిశువును వేచియుండదు. శబ్దములకును పదార్థములకును గల సంబంధము శిశువు తనంతతట గుర్తించును. అక్కఱ గలిగినప్పుడు తనకు వలసిన వస్తువులకు సరిపడు శబ్దములను జతపఱుపదొడంగును. రెండేండ్లవయస్సు నిండులోపుగనే ఈ యద్భుతము ఘటిల్లును. ఆశయములును పదజాలమును వర్ధిల్లుకొలదియు ఇంకనింకను నేర్చుకొనుట కనువైన ప్రశ్నావళిని శిశువు రూపేర్పఱచుకొనును.

ఏండ్లు గడచుకొలదియు ప్రశ్నించి తెలిసికొంద మనెడి యీ కుతూహలము అణగిపోవును, లేదా పలుచబాఱును, దుర్నియుక్త

మగును. అందుల కొక కారణ మిది: ప్రాయము వచ్చుటతోనే ఆశయాలరంగమును కార్య రంగమును ఎంతగనో విస్తరిల్లును. అప్పటి ముఖ్యాశయము లివి: కుటుంబము నేర్పఱచు కోవలెను, దాని అభివృద్ధి కన్నివసతులను సమకూర్చుకోవలెను, సాంఘిక బాధ్యతలను నెఱవేర్చుకోవలెను, తండ్రితాతలనుండి సంక్ర మించిన సంస్కృతికిని దేశభక్తికిని అనుగుణ మైన రీతిలో ప్రవర్తింపవలెను. వీనికి పాటు పడుచున్నతనికి వ్యవధి చాల పరిమితముగ నుండును, దేహారోగ్యమును అట్లట్లుండును. కార్యరంగములను ప్రణాళికలను తగ్గించుకో వలసివచ్చును, కుతూహలమునకును ఒకమితి తప్పదు. కావున కుదుటబడిన నడిప్రాయము వారి ప్రశ్నోత్తరాలును కొన్ని పరిచితమార్గా లలోమాత్రమే సాగుచుండును

మార్గములు జన్మాంతరానుగతము లని పించు జాడలు కొన్ని శిశుదశయందుసైతము గుర్తింపవచ్చు. కొన్నివర్ణములను జూచి నప్పుడు ఒకరీతిపాట విన్నప్పుడు కొందఱు శిశువులు ప్రీతు లగుచుందురు, ఆ వర్ణములు ఆ పాట మఱికొందఱు శిశువులకు ప్రీతికరము లుగ నుండుట లేదు. కథల నర్థముచేసికోగల వయస్సువచ్చినప్పుడు ఒక్కొక్కరకపు కథలు కొందఱుకొందఱు బాలురకు రుచించుచుండును. వీరకథలు కొందఱికి రుచించును. సేవాధురం ధరుల ఉపకారపరుల కథలు కొందఱి కిష్ట పడును.ఉపదేశకథలు కొందఱికి, శిల్పసమంచిత కథలు కొందఱికి నచ్చుచుండును. ప్రతిశిశువు లోను అంతర్గతముగ నొక నమూనాయున్నది. అది వెలుపలిజగత్తున చుట్టునుండు వానినుండి తనకు సరిపడు దాని నెన్నుకొని దానిని ప్రణా ళికలుగను కార్యకలాపములుగను రూపొం దించుచుండును. ఈ ఎన్నికొనుటలును ప్రత్యేక శ్రద్ధచూపుటలును జన్మాంతరానుగతము లను టకు సందేహ ముండదు. వయసు హెచ్చు కొలది ఈ 'యెన్నికొనుట'లోను 'ప్రత్యేక శ్రద్ధచూపుట'లోను నానాటికి ఊనిక ఎక్కు వగుచుండును. వారి వారి ప్రత్యేకపు టక్కు ఱల కనుగుణముగ వారివారికి కుతూహలము కలుగుచుండును. అరుదుగా ఎవరో కొందఱు మాత్రమే చిరము తమకు పనుపడిన మారా వధుల నతిక్రమించి తమ కుతూహలమును పాటించుచుందురు. అట్టివారి వ్యక్తిమహిమ గంభీరమును విపులమునై యొప్పును ఆ కుతూహలము వారికి ఆజన్మసిద్ధమనియు, అందఱికి నది యలవడ దనియు నేల తలంపరా దందురేమో! మనలో ప్రతియొక్కరును ''మన సోమరితనమును సమర్థించుకొనుట కొకసాకు చెప్పుచున్నామా, మన అవధుల అతిక్రమించుటకు యథాశక్తి ప్రయత్నించు చున్నామా'' అని తనఅంతరాత్మ నడిగిచూచు కోవచ్చు. ప్రతిపాదనల మన మెట్లు సమర్థింతు మనుట ముఖ్యము కాదు. స్వేచ్ఛగ మనము కావించు పర్యాలోచనమును, మనఃపూర్వక ముగ మన మొనరించు పునఃపరిష్కారమునే ముఖ్యములు. వాడుకపడ్డదారులనుండి చీలి పోవు స్వేచ్ఛ ఆలోచనావిధానమున గర్భితమై యున్నది. తగినట్లును ఎడతెగనట్లును ఆ స్వేచ్ఛనుపనివఱచుకొందుమేని ఆత్మజ్ఞానప్రాప్తికి దారితీయును. ఆ స్వేచ్ఛ లేదేని మానవు డేవో కొన్ని పనులకై మాత్రము ఏర్పడ్డ యంత్రము వంటివా డగును. అప్పుడు పాపములు చేయు వాడు పాపములనే ఇంకనింకను చేయుచుండును. అవివేకి తన వివేకరహితకార్యములనే మరల మరల సాగించుచుండును. ''ఈయాపనులు చేయుము, ఈయాపనులను మాను'' మని మానవులకు హితోపదేశము సేయుట వ్యర్థ

మగును. విముక్తిని ప్రాపించుట అప్పుడు సాధ్యము కానేకాదు. కావున భారతీయ తత్త్వశాస్త్రము ఆ వాదమును నిరసించు చున్నది.

*　　*　　*

దైనందినప్రత్యక్షసంభవములను కొన్నిటిని పరికించితిమేని పైనచెప్పిన యాశయములు మనకు తెలిసివచ్చును. పచ్చిక బొత్తిగ లేకుండిన యొక నేలలో, మంచివాన కురిసి వెలిసిన కొన్నాళ్లకు గడ్డిక మొలక లంకురించుచుండును. దాని విత్తనములు ఆ నేలలో మఱుగువడి యుండియుండవలెనని వెంటనే మన మూహింతుము. అట్లే మోక్షమార్గశ్రవణమాత్రముచే ఎవనిలో రోమహర్షమును అశ్రుపాతమును కననగునో అతనిలో విశేషదర్శనబీజ ముండి యుండవలె నని గ్రహించుట నిర్బాధము. ఈ లక్షణములు కననైన చోట, ఆ బీజ మచిరకాలములో ఆత్మభావభావనారూపమహావృక్షముగ పెంపొందును. ఆభావన-"నే నెవడనుగా నుంటిని? ఎట్లుంటిని? ఇది (ఈ శారీరాదికము) ఏమి? ఇదెట్లు కల్గినది? మన మేమి కానున్నాము? ఎట్లు కానున్నాము?" అనెడి రూపము దాల్చును. ఆలాగు ప్రశ్నించుకొనుట ఆరంభమైనంతనే అది ఆత్మసాక్షాత్కారమార్గముననే విముక్తిపథముననే కొనిచనగలదు.

అట్టి విశేషదర్శనబీజము లేనివాని ప్రవర్తనలో తదనుగుణమైన లోప ముండును. ఆధ్యాత్మికజీవితము నట్టివానియెదుట ప్రస్తావించితిమేని అతడు కాదనును, వాదించును, చేతనైన ప్రతిఘటించు జిత్తుల నన్నిటిని ప్రయోగించును. అతని వాదమును ఖండించి ఆధ్యాత్మికదృక్పథము నించుమించు అంగీకరింపక తప్పనిస్థితి కతని గొనివచ్చితివేని, అతని కేమో అది రుచింపదు, అత డీప్రసంగమునకు స్వస్తి చెప్పును, లేదా వేరెచ్చటికో తాను పోవలసి యున్న దని చెప్పి నిన్ను వీడి పోవును, మరల రాడు. అట్టి ప్రతికూలచిత్తవృత్తిని తనబోధనలు మార్పొందింపజాల వని వివేకియగు గురువు గుర్తించును. అట్టివారు మాటవలె ననిన వారికి ప్రకృతిప్రతిఘాతములు తగులవలెను, అప్పుడే వారిలో 'నా కేమి కొదువ' అనెడి 'ధీమా' అణగిపోవును, గట్టి పునాదులపై వినయము నెలకొనును.

విశేషదర్శనబీజమున్న చోట మెట్టుమెట్టుగా సాధన సాగును, అన్వేషణదశ అతిక్రాంతమై దానిపైదశ సిద్ధించును. ఆత్మసాక్షాత్కారము కల్గును. ఆత్మసాక్షాత్కార మనునది అనిర్వాచనీయమును ద్వంద్వాతీతము నగు ననుభూతి. దాని నధిగమించినవాడును అట్టి యతనిని గురుడై ఆశ్రయించువాడును ధన్యులు.

# భీష్ముడు ధర్మజునకు కావించిన ధర్మోపదేశం

ప్రభాకర్

ధర్మం అనగా ఏమి? ధర్మమును నిర్వచించడం సులభంకాదు. శ్రీమద్రామాయణంలో వాల్మీకి మునీంద్రుడు వ్రాసిపెట్టిన శ్రీరామచంద్రుని యీ వాక్యం చిత్తగించండి—

సూక్ష్మః పరమదుర్జ్ఞేయః
సతాం ధర్మః ప్లవఙ్గమ.

సత్పురుషులు అనుష్ఠించుధర్మం సూక్ష్మమైనది. దానిని అర్థం చేసుకోవడం చాలా కష్టం.

స్థూలదృష్టికి అధర్మంగా కనిపించినది సూక్ష్మ దృష్టికి ధర్మంగా అవగతమయ్యే సందర్భా లున్నాయి. స్థూలదృష్టికి ధర్మంగా అగపడింది సూక్ష్మదృష్టికి అధర్మంగా స్పష్టపడే సందర్భా లున్నాయి.

అయినా ధర్మమునకు ఇప్పటికి మనకు లభించియున్న వివరణాలలో భారతీయ మహ ర్షులు ఒసగిన వివరణమే ప్రకృష్టమైనదిగా ఉంటున్నది. స్వలాభంకోరి ఏమి తలపెట్టినా, ఏమిచెప్పినా ఏమిచేసినా—అదంతా అధర్మమే. స్వలాభాపేక్షను త్యజించి విశ్వమానవ శ్రేయ స్సుకై ఏమి తలపెట్టినా, ఏమి చెప్పినా, ఏమి చేసినా — అదే ధర్మం. ఆత్మనో మోక్షాయ జగద్ధితాయచ — తనకుతాను కోరుకోవలసింది మోక్షమును, లోకులకై తాను కోరవలసింది వారి హితమును — ఈ రెండు లక్ష్యాలకూ సాధకమేదో అదేధర్మం అనడం ప్రాచీన భార తీయ మహర్షుల నిర్వాహం. ఐనను ధర్మోప దేశమే సకల సారస్వతమునకూ సారమైన అంశం అనడంకూడా భారతీయ మహర్షుల లక్ష్యం, వారి అభిప్రాయం, వారి విశ్వాస మున్నూ.

ధర్మమును ఉపదేశించే పద్ధతినిబట్టియే సార స్వతంలో శాఖావిభేదాలను వారు నిరూపిం చారు. ఏపనిని ఎందుకుచేయాలో ఎందుకు చేయ కూడదో కారణం పైకిచెప్పక, తమహృదయం లోనేమో ప్రజాక్షేమమునే ఉద్దేశించి — యీ యీ పనులను చేయండి, యీ యీ పనులను మానండి — అని కఱపడం ప్రభువులు శాసించు పద్ధతి. ఆలాగు ధర్మోప చేసే సారస్వత శాఖ వేదములే.

శ్రీరామచంద్రుడు హరిశ్చంద్రుడు నలుడు యుధిష్ఠిరుడు మున్నగు మహాపురుషుల నడ వడులవంటి నడవడులను అలవఱచుకోండి, వారి శత్రువులయిన రావణ దుర్యోధనాదుల నడ వడులవంటి నడవడులను పరిహరించండి అని పూర్వచరిత్రోదాహరణ పూర్వకంగా మిత్రుని వలె ధర్మోపదేశంచేసే సారస్వతశాఖ ఇతిహాస పురాణాల సముదాయం. తన సౌందర్యంచేత ప్రియుని వశపఱచుకొని తాను ఉపదేశించే హితమందతనికి ఆసక్తి గొలిపే ప్రియురాలివలె శబ్దార్థాల రామణీయకంచేతనూ చమత్కార సమృద్ధిచేతను శృంగారాది రసభరితతచేతను సహృదయులకు తన్మయత సమకూర్చి తాను ఉపదేశించే ధర్మమందు వారికాసక్తి గొలుపు సారస్వతశాఖ కావ్యశాఖ. ధర్మోపదేశమే వేదముల హృదయం. ధర్మోపదేశమే ఇతిహాస పురాణాలహృదయం కాబట్టి ఇతిహాసపురా ణాలు వేదాలకు అనువాదాలే అను ప్రాజ్ఞోక్తి ప్రఖ్యాతిగాంచింది.

మన భారతీయ సారస్వతంలో ఉండేగొప్ప యితిహాసాలు రెండు — శ్రీమద్రామాయణం మొదటిది, మహాభారతం రెండోది. వానిలో మహాభారతం మనకిప్పుడు ప్రకృతం. మహా భారత ప్రశస్తిని ఎందఱో చెప్పారు, ఎన్నివిధాల లోనో చెప్పారు, ఎంతచెప్పినా, అత్యుక్తికాదు. ఆప్రశస్తిని తెలిపే నన్నయ్యభట్టారకుని ప్రసిద్ధ మైన యీ పద్యాన్ని అనుసంధించి సంతృప్తి చెందుతాం:

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మ విదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికులితిహాస మనియు
పరమ పౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని మహిఁగొని యాడుచుండ
వివిధ వేదతత్త్వవేది. వేదవ్యాసు,

డాదిముని, పరాశరాత్మజుండు,
విష్ణుసన్నిభుండు – విశ్వజనీనమై
పరఁగుచుండఁజేసె భారతంబు.

ధర్మతత్త్వజ్ఞులు మహాభారతాన్ని ధర్మశాస్త్రంగా తలదాలుసారుకదా. కలకండలో ప్రతిఅణువూ కలకండే ఐనట్లుగా ధర్మశాస్త్రమైన మహాభారతంలో ప్రతిఘట్టమూ ఒక ధర్మశాస్త్రం, ధర్మసూక్ష్మదర్పణమే. ధర్మరాజుకు భీష్ముడు ధర్మం ఉపదేశించే ఘట్టంకూడా అలాంటి ధర్మసూక్ష్మదర్పణమే. అది పద్ధెనిమిది పర్వాల మహాభారతంలో—మన తెలుగు భారతాన్ని మనస్సులో పెట్టుకొని చెబుతున్నాను. పండ్రెండవ పర్వమైన శాంతిపర్వంలో ద్వితీయాశ్వాసంలో ప్రారంభమై ఆనుశాసనిక పర్వం తుది ఆశ్వాసంలో పరిసమాప్తి నొందుతూ మొత్తం రవంత తక్కువగా ఐదువేల గద్య పద్యాలలో పొందుపడిఉన్నది.

ఇచట వక్తృవైలక్షణ్యమూ శ్రోతృవైలక్షణ్యమూ విషయవైలక్షణ్యమూ – మూడు వైలక్షణ్యాలూ గమనార్హాలు.

వక్త భీష్ముడు. ఆయన మాహాత్మ్యమును ఎంతఓ ఎన్నిసందర్భాలలోనో స్తుతించి యున్నారు. ఆ గొప్పతనాన్ని స్పష్టపఱుస్తూ భీష్మునితోనే శ్రీకృష్ణుడిలాగన్నాడు.—

దమమును, సత్యముం, దపము,
దానము, వేదములందుఁ జాప వే
దమునను గల్గు నైపుణియు,
ధర్మవిశేషజ్ఞతయున్, విరోధిభూ
రమణవిమర్దన క్రమవి
రాజితశౌర్యము – నీకుఁబోలెనై
జములగువాఁడు వేఱొకఁడు
శంతనునందన పుట్టఁడేన్నఁడున్

దమము, సత్యము, తపము, దానము, వేదములందును ధనుర్వేదమందును నైపుణ్యము, ధర్మశాస్త్ర పరిజ్ఞానము, శత్రురాజుల నిర్జించి ప్రకాశించిన శౌర్యము – అనెడి ఇవి నీ సహజగుణములు. నీవంటివాడు మఱొకడు భువియందు పుట్టబోడు – శ్రీకృష్ణునివాక్కు. నింతగ పొగడ్తగనుటను మించిన వైలక్షణ్యం ఉంటుందా?

(సశేషం)

# వార్తలు విశేషాలు

## వేదాంతసొసైటి, సెయింటులూయి, సంయుక్త రాష్ట్రాలు 1969-70 సంవత్సర నివేదిక

భానువారాలలో ఉదయమునను మంగళవారాలలో సాయంవేళలలోను శ్రీసత్ప్రకాశానందస్వాములు గుడిలో పూజాకార్యం నిర్వహించేవారు. భానువారాలలో ఆయన ఆధ్యాత్మిక తాత్త్విక వివిధ విషయాలనుగూర్చి ఉపన్యసించేవారు, మంగళవారాలలో ధ్యానగోష్ఠులునడపి భగవద్గీతప్రవచనం చేస్తూవచ్చారు. విశేషదినాలలో ఉపన్యాసాలతోబాటు భజనకీర్తనలు జరిగేవి. సమావేశాలకు అందఱూ రావచ్చు. సొసైటిసభ్యులున్నూ మిత్రులున్నే కాక–లిండెన్వుడ్ కాలేజి, మార్కుట్వెయిన్ హైస్కూలు, టెమ్పుల్ ఎమ్యాన్యుఅల్, డీఆండ్రీసుహైస్కూలు మున్నగు వివిధమత విద్యాకేంద్రాలనుండి చాలమంది వచ్చేవారు. విద్యార్థులతోగూడ వారి ఉపాధ్యాయులున్నూ వచ్చేవారు. పూజానంతరం వారు స్వామిని

ఏకాంతంగా కలిసికొని సందేహా లడిగి తెలిసికునేవారు. నగరాలకు వెలుపలి ప్రాంతాలవారు కూడా ఈసమావేశాలకు వస్తూ ఉండినారు.

స్వామిగారి ప్రసంగాలు టేప్‌రికార్డింగు చేయబడ్డాయి. వేసవి విరామ సమావేశాలన్నిటిలో ఆరికార్డు పెట్టి వినేవారు. వేదాంతవిషయాలు కరపత్రాలలో ముద్రించి కూటంలో ఉంచుకొని వచ్చినవారి కందఱికీ ఉచితంగా పంచిపెట్టుతూవచ్చారు.

సొసైటిగుడిలో ప్రతిదినం 11 గంటలనుండి 12 గంటలవఱకు ధ్యానగోష్ఠి జరిగేది.

వేసవి విరామదినాలలో తప్ప వేఱప్పుడు ప్రతినెల మొదటి గురువారం స్వామి శ్రీరామకృష్ణకథామృతం ప్రవచనం చేసేవారు. శ్రీరామకృష్ణుని ప్రత్యక్షశిష్యులనుగూర్చి తాము స్వయంగా ఎఱిగిఉన్న సంభవాలను స్వామి తమఉపన్యాసాలలో తెలిపేవారు. శ్రోతలడిగిన ప్రశ్నలకు స్వామి సమాధానాలు చెప్పేవారు.

## జయంతి మహోత్సవాలు

శ్రీకృష్ణ-బుద్ధ - శంకర - శ్రీరామకృష్ణ-మాతృశ్రీ శారదా - వివేకానంద - బ్రహ్మానంద-ప్రేమానంద-శివానందస్వాముల జయంతి మహోత్సవాలు గుడిలో ప్రత్యేకపూజోపాసనలతో నిర్వర్తింపబడ్డాయి. శుభశుక్రవారం (గుడ్‌ఫ్రైడే)-దుర్గాపూజ-కాళీపూజ - క్రిస్త్మసీవ్-అనే విశేషదినాలుకూడ పాటింపబడ్డాయి. పరమహంస శ్రీరామకృష్ణుని జన్మదినమునాడు మాత్రము భక్తులకు హిందుపద్ధతిలో విందు చేయబడినది. ఇతరవిశేషదినాలలో మధురభక్ష్యాల - ఫలాల ప్రసాదవినిమయం జరిగేది.

డీఆంద్రీసుహైస్కూలువారి ఆహ్వానంపై స్వామి అక్కడికి విజయంచేసి హిందూసిద్ధాంత ప్రత్యేకతనుగూర్చి ఉపన్యసించారు. కిర్కువుడ్డు మెథడిస్టుచర్చివారు ప్రత్యేకసమావేశం జరిపి టేపురికార్డుచేయబడ్డ స్వాముల ప్రసంగం విన్నారు. విన్నతర్వాత వారి నడిమికి వచ్చి స్వామి వా రడిగిన ప్రశ్నలకు సమాధానాలు చెప్పారు.

జూలై 26-వ తేదినాడు మిచిగన్‌లోని గాంజీసుపాకులో షికాగో డిట్రాయి క్లీవ్లండు వాషింగ్టను మున్నగు ప్రాంతాలనుండి వేదాంతాభిమానులందఱూ సమావేశ మయ్యారు. అక్కడ శ్రీభాష్యానంద - రంగనాథానంద - శ్రద్ధానందస్వాములు మొదలయినవారి సమక్షంలో శ్రీసత్ప్రకాశానందస్వాములు వివేకానందమఠానికి విడిదికి శంకుస్థాపనం చేశారు.

నవంబరు నెలలో స్వామి కన్సాసునగరానికి విచ్చేశారు, రెండుదినాలు ఉండినారు. మొదటిదినం సాయంకాలం అచటి వేదాంతసొసైటివారి ఆధ్వర్యంలో యూనిటేరియను చర్చివారి కోనోవరుకూటంలో 'సుదృఢములైన హిందు జీవితపు పునాదులు' అను విషయంగూర్చి ఉపన్యసించి, శ్రోతలు వ్రాతమూలకంగా అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పారు. మఱుదినం బెరుఫెల్టుదంపతులు స్వామికిని వేదాంతవిద్యార్థులకును మిత్రులకునూ విందు జరిపారు. భోజనానంతరం స్వామి సదస్సులో ఉపన్యసించి జిజ్ఞాసువు లడిగిన ప్రశ్నలకు సమాధానాలు చెప్పారు. పారమార్థికోపదేశానికని, ఇతరములైన సొంత సమస్యల పరిష్కారానికని, ఆశ్రయించే వారితో స్వాముల యేకాంత సమావేశాలు కన్సాసునగరమున పది జరిగాయి. సెయింటులూయీలో జరిగిన అలాంటి సమావేశాల మొత్తంసంఖ్య 180. అమెరికాసంయుక్తరాష్ట్రాలలో పలుప్రాంతాలనుండిన్నీ భారతదేశంనుండిన్నీ ప్రముఖు లనేకులువచ్చి ఈసంవత్సరం ఈసొసైటిని దర్శించారు.

గ్రంథాలయం సభ్యులకూ మిత్రులకూ అనుమోదకులకూ చక్కగా వినియుక్తమైనది.

# గ్రంథపరిచయం

## మాతృశ్రీ జీవిత మహోదధి తరంగాలు

### మొదటిభాగం

రచయిత: 'రహి'. ప్రాప్తిస్థానం: మాతృ పబ్లికేషన్సు, బాపట్ల, ఆంధ్రప్రదేశ్. పుటలు 236, వెల నాలుగున్నర రూపాయలు.

'జిల్లెళ్ళమూడి అనసూయాదేవి' అనే కారణజన్మురాలి మహాద్భుత జీవిత విశేషాలిందు ప్రతిపాదింపబడిఉన్నాయి. అయిదు నిండు సంవత్సరాలు అహర్నిశం అమ్మసన్నిధిలో ఉండిన రచయితగారు ఉపోద్ఘాతంలో 'ఇది జీవితం కాదు మహోదధి' అనిపించింది. అందులో తరంగం వెంట తరంగం అన్నీ మహోన్నతాలే, అన్నీ మధురమధురాలే – మఱి ఈ మహోదధిలోనిది జలం కాదు, అమృతం' అన్న వాక్యాలు సార్థకాలు. 'భిన్నత్వం లేని మనస్తత్త్వమే దైవతత్త్వం' తనపిల్లలవఱకే పరిమితంగా ఉంటే పామరత్వం. అందఱియందు ఉంటే భగవంతుడు' 'మనబిడ్డయందు ఏమి చూస్తున్నామో అందఱియందు దానిని చూడడమే బ్రహ్మస్థితిని ందడం' 'పరిమితమైన మమకారం మానవత్వం, సర్వత్ర ఉండే మమకారం మాధవత్వం' ఈ మొదలైన యిందలి సుభాషితాలు అజ్ఞాత నిగ్రహమూ అనుగ్రహమయమూ అయిన జగన్మాతృత్వానికి ప్రఖ్యాపకాలు. పారమార్థిక ప్రవణులందఱికీ నిర్వృతిప్రదమైన గ్రంథం ఇది.

---

## తూర్పుబంగాళంనుండి వస్తున్న లక్షలాది కాందిశీకులకు సాహాయ్య కార్యక్రమం

## విజ్ఞప్తి

తూర్పుబంగాళంనుండి నిలువ నీడలేక లక్షలాదిగా కాందిశీకులు భారతదేశంలోకి వస్తున్నారనడం మహాజనులకందఱికీ తెలిసినవిషయమే.

వారికి ఆదుకొని తోడ్పడేందుకై రామకృష్ణ మిషనువారు సిల్హెట్టు సరిహద్దువద్ద డాకీలోనూ తూర్పు దినాజ్పూరు సరహద్దువద్ద రాధికాపూరులోను సాహాయ్య కార్యక్రమం ఆరంభించిఉన్నారు. జల్పైగురి మున్నగు పలుతావులలోకూడ సాహాయ్య కార్యక్రమం ప్రారంభమవుతున్నది.

బాధలకగ్గమైన ఆ సోదరమానవులకు రామకృష్ణమిషను తగిన సేవచేయగలందులకు ఉదార మహాజనులందఱు వస్తురూపంగాగాని, ధనరూపంగాగాని విరాళాలిచ్చి సహకరించవలెనని ప్రార్థిస్తున్నాము.

జెనరలు సెక్రిటరి, రామకృష్ణమిషను
బేలూరుమఠం పోస్టు, హౌరాజిల్లా, పశ్చిమబెంగాలు.

అను విలాసానికిగాని, కల్కత్తాలో

(1) అద్వైతాశ్రమం, 5 డేహి ఎంటాలిరోడ్డు, కల్కత్తా-14.

(2) రామకృష్ణమఠం, ఉద్బోధన్ లేన్, కల్కత్తా-3.

(3) రామకృష్ణమిషన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కల్చర్ గోల్పార్క్, కల్కత్తా-29.

అను విలాసాలలో దేనికైన ఒకదానికిగాని విరాళాలను అందజేయవచ్చు.

ఏప్రిలు 13, 1971

గంభీరానందస్వామి
జెనరల్ సెక్రిటరి.

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము ''సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు— అందఱికిని సమానాధికారముగల సొమ్ము'' కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారి యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు　　రెండవ కూర్పు　　వెల : రూ. 4-00

నూతన ముద్రణము!　　ఇప్పుడే వెలువడినది!

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయ భాగము-రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)　　ఆఱవ కూర్పు　　వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు—4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# జ్ఞానయోగము

అనువాదకులు :
కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు — రెండవ కూర్పు — వెల : రూ. 4-00

నూతన ముద్రణము! — ఇప్పుడే వెలువడినది!

# రాజయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయ భాగము-రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) — ఆఱవ కూర్పు — వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు—4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# మా 'దివ్యవాణి' గ్రంథమాల

నేడే కొనండి ! పదే పదే చదవండి !!

దివ్యావతారమూర్తుల విశ్వోపజీవ్యములైన అమృత మధుర సూక్తులు సర్వసుగ్రాహము హృదయ సన్నిహితమునైన తేటతెలుగున వీనిలో [illegible]జేయబడ్డాయి. ఇందులో ఒక్కొక్కటి నిరుత్సాహులకు ఉత్సాహప్రదం, అశాంతిసంక్షుభితులకు శాంతిదాయకం, సంశయాందోళితులకు సంశయాపనోదకం, జిజ్ఞాసువులకు పరమార్థజ్ఞాన సముత్పకం, అందరికీ శిక్షకం, సంస్కారకం నిర్వృత్యుత్పాదకం. ముమ్వన్నెల మేలి జాకెట్టులో పాకెట్టుసైజులో చక్కని తయారింపు—

| | | | |
|---|---|---|---|
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 0-40 | | 0-45 |
| శ్రీ శారదాసూక్తి నవనీతము | 0-40 | బుద్ధ ఉవాచ | 0-40 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0-40 | క్రైస్తు సూక్తిమాల | 0-40 |

మహమ్మదు సూక్తిమంజరి 0-40

# దేవీ మాహాత్మ్యము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

మార్కండేయ పురాణాంతర్గతమగు దేవీమాహాత్మ్యము భక్తులెల్లరు అవశ్యము పఠింపదగిన దివ్యగ్రంథము. పాఠకుల సౌకర్యార్థము శ్లోకములు పెద్దఅక్షరములతో ముద్రింపబడియున్నవి. ప్రతి శ్లోకమునకు తేటతెల్లమగు తాత్పర్యము గలదు.

పారాయణము చేయగోరు భక్తుల యుపయోగార్థము గ్రంథాదియందు చండికా ధ్యానము, అర్గలాస్తోత్రము, కీలకస్తోత్రము, దేవీకవచమును, గ్రంథాంతమున అపరాధ క్షమాపణస్తోత్రమును, దేవీసూక్తమును పొందుపఱచియున్నాము.

ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పారాయణముచేయు భక్తులకు శ్రీదేవీకృపాకటాక్ష వీక్షణప్రసారము తప్పక కలుగును.

170+24 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము వెల : రూ. 2-50

---

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హక్స్లి) అను పొగడ్తగన్న శ్రీపన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.' (సన్డే స్టాన్డర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి: 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

590+158 పుటలు వెల: రూ. 7-50

# ప్రబోధరత్నాకరము

అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు

శ్రీ వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

232 పుటలు మూడవ కూర్పు వెల: 2-50

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4



'అఖిలవిశ్వ శరణ్యోందుము, యేం ఉంటంబ యాతనిత్యవ సీరు ననుభూతి కంధు వత్స'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౭ } ౧౯౭౧ - జూన్ - జ్యేష్ఠము { సంచిక ౧౨


శ్రీః

## వివేకచూడామణి

మూలము : శ్రీ శంకర భగవత్పాదులు

వ్యాఖ్యాత : అన్నమాచార్య

అత్రాత్మబుద్ధిం త్యజ మూఢబుద్ధే త్వఙ్మాంసమేదోఽస్థిపురీషరాశౌ
సర్వాత్మని బ్రహ్మణి నిర్వికల్పే కురుష్వ శాన్తిం పరమాం భజస్వ. 161

ఓ మూఢబుద్ధీ, చర్మము మెదడు ఎముకలు మలము మున్నగువాని ప్రోగే యీ శరీరము. ఈ శరీరమే ఆత్మ అనెడి భ్రాంతిని (తలంపును) దులిపివేసికో. సర్వాత్మయు నిర్వికల్పమునగు బ్రహ్మమే నీయాత్మ అను ఎఱుకను కలిగించుకో. పరమమైన శాంతిని బడయుమా.

దేహేన్ద్రియాదా వసతి భ్రమోదితాం విద్వా నహంతాం న జహాతి యావత్
తావ న్న త స్యాస్తి విముక్తివార్తా ప్యస్త్వేష వేదాన్తనయాన్తదర్శీ. 162

ఏ విద్వాంసుడు కానీ, వేదాంతశాస్త్రప్రజ్ఞతలో ఎంత పారంగతుడు కానీ, అసత్తులయిన దేహేంద్రియాదులందు 'నే' ననెడి తలంపు విడువకున్నంతవఱకు అతనికి ముక్తి యను మాటే ఉండదు. ౧౬౨

ఛాయాశరీరే ప్రతిబిమ్బగాత్రే యత్స్వప్నదేహే హృదికల్పితాఙ్గే
యథాత్మబుద్ధి స్తవ నాస్తి కాచి జ్జీవచ్ఛరీరే చ తథైవ మాస్తు. 163

నీయొడలినీడను జూచినప్పుడు కాని, నీయొడలి ప్రతిబింబమును జూచినప్పుడు గాని, కలలో నీకగపడిన నీదేహము నుద్దేశించినప్పుడు కాని, మనసులో నీవు కల్పించుకొన్న నీడే

హాము నుద్దేశించినప్పుడు కాని, ''అది నేనే'' అను తలంపు నీకు కలుగుట లేదు. అట్లే సజీవ మగు దేహామునుగూర్చికూడ ''ఇది నేను'' అను తలంపు నీకు కలుగకుండును గాక. ౧౬౩

దేహాత్మధీ రేవ నృణా మసద్ధియాం జన్మాదిదుఃఖప్రభవస్య బీజమ్
యత స్తత స్త్వం జహి తాం ప్రయత్నా త్త్యక్తే తు చిత్తే న పునర్భవాశా. 164

అసద్బుద్ధులకు దేహములందు గల్గు 'మే' మనెడి భ్రాంతియే జన్మాది దుఃఖముల మొలకెత్తించు విత్తనము. కావున నీవు ప్రయత్నపూర్వకముగా ఆ భ్రాంతిని నిర్మూలించుకో. మనసు (లోని యీ భ్రాంతి) విడువబడెనేని మరల జన్మము కలుగు నను ఆసపా టుండదు.

కర్మేన్ద్రియైః పఞ్చభి రఞ్చితో ఽయం ప్రాణో భవే త్ప్రాణమయ స్తు కోశః
యే నాత్మవా నన్నమయో ఽనుపూర్ణః ప్రవర్తతే ఽసౌ సకలక్రియాసు. 165

ఆకాశాదిభూతముల వ్యష్టిరజోంశమువలన బుట్టినవి పంచకర్మేంద్రియములు. ఆ పంచభూతముల సమష్టిరజోంశమువలన బుట్టినది ప్రాణము. కర్మేంద్రియము లైదింటితో గూడిన ప్రాణమే ప్రాణమయకోశము. ఈ ప్రాణమయకోశముద్వారానే, ఆత్మ, అన్నమయ కోశమున ప్రతిఫలించుచుండును. అన్నమయకోశమునకు సర్వక్రియానిర్వహణసామర్థ్య మిందు చేతనే గలుగుచున్నది. ౧౬౫

నైవాత్మాపి ప్రాణమయో వాయువికారో గన్తాఽగన్తా వాయువ దన్తర్బహి రేషః
యస్మా త్కిఞ్చి త్క్వాపి న వే త్తీష్ట మనిష్టం స్వం వాన్యం వా కిఞ్చన నిత్యం పరతన్త్రః.

ప్రాణవాయురూపమగు ప్రాణమయకోశముకూడ ఆత్మ కాజాలదు. ఏల యన ఇది గాలివలె దేహములోనికి జొచ్చుచును వెలికి వచ్చుచును ఉండును. తనకు గాని ఇతరులకు గాని 'ఇష్ట మిది' 'అనిష్ట మిది' అను నెఱుక సదా పరతంత్రమగు ప్రాణమయకోశమున కెప్పుడును ఎచ్చటను ఇంచుకేని లేదు. ౧౬౬

జ్ఞానేన్ద్రియాణి చ మన శ్చ మనోమయ స్స్యాత్ కోశో మ మాహ మితి వస్తువికల్పహేతుః
సంజ్ఞాదిభేదకలనాకలితోబలీయాం స్తత్పూర్వకోశ మభిపూర్య విజృమ్భతే యః. 167

జ్ఞానేంద్రియములైదును మనస్సును కలిసి మనోమయకోశ మగుచున్నది. మునుపటి దైన ప్రాణమయకోశమున నిండినదై వస్తువులలో 'నేను' 'నాది' అను భేదమును, నామ రూపాదిభేదములను గలిగించునది ప్రబలమైన యీ మనోమయకోశమే. ౧౬౭

పఞ్చేన్ద్రియైః పఞ్చభి రేవ హోతృభిః ప్రచీయమానో విషయాజ్యధారయా
జాజ్వల్యమానో బహువాసనేన్ధనై ర్మనోమయాగ్ని ర్దహతి ప్రపఞ్చమ్. 168

ఐదింద్రియములును ఐదుగురుహోతలు. విషయతతియే నిత్యప్రవర్ధమానమగు ఆజ్య ధార. బహువిధవాసనలే కట్టెలు. వీనితో జాజ్వల్యమానమగు మనోమయయజ్ఞవహ్ని (కుండము)నుండి ఈ దృశ్యజగత్తు ప్రాదుర్భవించుచున్నది ౧౬౮

న హ్య స్త్యవిద్యా మనసో ఽతిరిక్తా మనో హ్యవిద్యా భవబన్ధహేతుః
తస్మిన్ వినష్టే సకలం వినష్టం విజృమ్భితే ఽస్మిన్ సకలం విజృమ్భతే. 169

మనస్సుకంటె వేఱు అవిద్య లేదు. మనస్సే భవబంధహేతువగు అవిద్య. కావున అది అంతరించిన సమస్తమును అంతరించినట్లే. అది చెలరేగిన సమస్తమును చెలరేగినట్లే.

స్వప్నే ఽర్థశూన్యే సృజతి స్వశక్త్యా భోక్త్రాది విశ్వం మన ఏవ సర్వమ్
త థైవ జాగ్ర త్యపి నో విశేష స్తత్సర్వ మేత న్మనసో విజృమ్భణమ్. 170

పదార్థశూన్యమగు స్వప్నములో భోక్తృభోగ్యభోగోపకరణరూపమగు ప్రపంచము నంతటిని మనస్సే సృజించుచున్నది కదా. జాగ్రద్దశలోను సర్వప్రపంచమును మనఃకల్పితమే. భేద మేమియు లేదు. కావున దృశ్యప్రపంచము సమస్తమును మనఃకల్పితమే. ౧౭౦

సుషుప్తికాలే మనసి ప్రలీనే నై వాస్తి కిఞ్చి త్సకలప్రసిద్ధేః
అతో మనః కల్పిత ఏవ పుంస స్సంసార ఏతస్య న వస్తుతో ఽస్తి. 171

గాఢనిద్రలో మనస్సు ప్రలీన మైనప్పుడు, (నిద్రించుచున్నవానికి) ఈ ప్రపంచ మేమియునే యుండదు. అనుభవమున అంద తెలిసిగిన విషయమే ఇది. కావున జీవునకు సంసారము మనఃకల్పితమే కాని, వాస్తవము కాదు. ౧౭౧

వాయు నానీయతే మేఘః పున స్తే నైవ నీయతే
మనసా కల్ప్యతే బన్ధో మోక్ష స్తే నైవ కల్ప్యతే. 172

మేఘమును కూడదోలునదియు గాలియే, వీడదోలునదియు గాలియే. బంధమును కలిగించునదియు మనస్సే, తొలగించునదియు మనస్సే. ౧౭౨

దేహాదిసర్వవిషయే పరికల్ప్య రాగం బధ్నాతి తేన పురుషం పశువ ద్గుణేన
వైరస్య మత్ర విషవ త్సువిధాయ పశ్చా దేనం విమోచయతి త న్మన ఏవ బన్ధాత్. 173

దేహాది సర్వవిషయములందును రాగమును పుట్టించి దానిచే జీవుని, త్రాటిచే పశువునుంబోలె, మనస్సు బంధించుచున్నది. పిమ్మట విషమునందుంబోలె విషయములందు వెగటును దృఢముగా పుట్టించి జీవుని బంధమునుండి ఆ మనస్సే విడిపించుచున్నది. ౧౭౩

తస్మా న్మనః కారణ మస్య జన్తో ర్బన్ధస్య మోక్షస్య చ వా విధానే
బన్ధస్య హేతు ర్మలినం రజోగుణై ర్మోక్షస్య శుద్ధం విరజ స్తమస్కమ్. 174

కావున జీవునకు బంధమునుగాని మోక్షమునుగాని కలిగించు కారణము మనస్సే. రజోగుణములచే కలుషితమైనప్పుడు మనస్సే బంధహేతు వగును. రజస్తమస్సులు తొలగి శుద్ధమైనప్పుడు మనస్సే మోక్షహేతు వగును. ౧౭౪

వివేకవైరాగ్యగుణాతిరేకా చ్ఛుద్ధత్వ మాసాద్య మనో విముక్త్యై
భవ, త్యతో బుద్ధిమతో ముముక్షో స్తాభ్యాం దృఢాభ్యాం భవితవ్య మగ్రే. 175

వివేకము వైరాగ్యము ననెడి గుణముల అతిశయముచేత మనస్సు పరిశుద్ధ మగును. పరిశుద్ధమనస్సు మోక్షమునకు సాధక మగును. కాబట్టి బుద్ధిమంతుడగు ముముక్షువునకు వివేకవైరాగ్యాలను దృఢపఱచుకొనుట కర్తవ్యము. ౧౭౫

మనో నామ మహావ్యాఘ్రో విషయారణ్యభూమిషు
చర త్యత్ర న గచ్ఛన్తు సాధవో యే ముముక్షవః. 176

విషయము లనెడి యరణ్యభూములలో మనస్సనెడి మహావ్యాఘ్రము సంచరించుచున్నది, మోక్షాభిలాషులగు సాధువు లచ్చటికి జనకుందురు గాక. ౧౭౬

# పరమహంస ప్రబోధవాణి

**ఒకభక్తుడు :–** దేవుని జూచుట శక్యమా ?

**శ్రీరామకృష్ణుడు :–** శక్యమే. సందేహము లేదు. దేవుని సాకారత నిరాకారత అను రెండు రీతులను గనుట శక్యమే. సాకారుడగు భగవంతుని జూచుట శక్యమే. సాకారుడగు భగవంతు డనగా రూపుదాల్చిన పరమాత్మ. నేత్రగోచరరూపవంతుడగు మానవునిలో దేవుని ప్రత్యక్షముగ గనవచ్చు. దేవు నవతారమూర్తిని చూచిన దేవునే చూచినట్లు. యుగయుగమందును దేవుడు మానవరూపమున అవతరించుచుండును.

**మహేంద్రనాథగుప్త :–** ఎట్టి పరిస్థితులలో దేవుని జూచుట శక్యమగును ?

**శ్రీరామకృష్ణుడు :–** మిక్కుటముగ తహతహపడు హృదయముతో దేవునికై ఆక్రందింపుము. తప్పక నీకు దేవుడు ప్రత్యక్షమగును. లోకులు భార్యలకై, బిడ్డలకై కడవలు కడవలుగ కన్నీరు కార్తురు. ధనముకై కన్నీట నీదులాడుదురు. దేవునకై విలపించువాడేడీ ? దేవునకై ఆక్రందింపుము. మనఃపూర్వకముగా ఆక్రందింపుము.

అమ్మ శ్యామకై ఆక్రందనమ్ము సలుపు
నిక్కముగ నో మనస యామె నీకు నెట్లు
దూరముగ నుండఁగల్గును ? దరియకుండఁ
గల్గు నెట్టులు ? మాయమ్మ కాదె కాళి ?
ఓ మనస నీకు నక్కఱ యున్న యెడల
బిల్వదళముల నొకకొన్ని బెండపూల
నమ్మపాదమ్ములకు నర్పణమ్ము సేయు
కలుపు మవ్వానితో ప్రేమ ఘుమఘుమలను.

తహతహపాటు అరుణోదయము వంటిది. అరుణోదయానంతరము సూర్యోదయము. తహతహపాటు పొడకట్టిన తర్వాతనే భగవత్సాక్షాత్కారము కలుగును. ఇహపరులకు ఐహిక సంపదయందున్నట్టి ఆస, తల్లికి బిడ్డయందున్నట్టి ఆస, పతివ్రతయైన సతికి పతియందున్నట్టి ఆస-ఈమూడు ఆసల ఉద్రేకము నొక్కటిగాకూడిన ఎంత యగునో అంతగా భక్తుడు భగవంతునికై ఉబలాటపడునేని, అతనికి దేవుడు దర్శనము గ్రహించును. ఈమూడు ఆశల శక్తి యొక్కటిగ కూడిన ఎంతో అంత ఆతురము దేవునం దెవనికి కలుగునో అతనికి భగవత్సాక్షాత్కారము కలుగును.

అనగా తల్లి బిడ్డ నెంత ప్రేమించునో భక్తుడు భగవంతు నంత ప్రేమింపవలెను. పతివ్రత భర్త నెంత ప్రేమించునో భక్తుడు భగవంతు నంత ప్రేమింపవలెను. ఇహపరులు ధనము నెంత ప్రేమింతురో భక్తుడు భగవంతు నంత ప్రేమింపవలెను. ఈ ముప్విధముల ప్రేమ శక్తిని ఆకర్షణశక్తిని ఒక్కటిగా చేర్చి ఆమొత్తమును భగవంతునిపై మరలింపుము. అప్పుడు నీవు తప్పక భగవంతుని దర్శింపగలవు.

ఉబలాటపడుచున్న హృదయముతో దేవుని ప్రార్థింపవలయును. మ్యావుమ్యావు మని యఱచుచు తల్లిని పిలుచు టొక్కటే పిల్లికూనకు తెలిసినది. తన్ను, తల్లి ఎచ్చట ఉంచినను ఆ కూనకు సంతోషమే. ఒకప్పుడు వంటయింటను, ఒకప్పుడు నేలమీదను, ఒకప్పుడు పాన్పుమీదను, పిల్లి తనకూనను పెట్టుచుండును. తనకు బాధ కలిగినను కూన ఏమిచేయును? మ్యావు మ్యావు మని యఱచును. అంతే. దానికి తెలిసిన దంతే. కాని ఆ కూత చెవిని బడినంతనే, తల్లి, తా నెచ్చట నున్నను కూన యొద్దకు వచ్చి చేరును.

మహేంద్రనాథగుప్త :-దేవుని జూచువాడు ఈ కన్నులతోనే చూచునా ?

శ్రీరామకృష్ణుడు :- ఈభౌతిక నేత్రాలతో దేవుని జూడలేము. ఆధ్యాత్మికసాధన సాగిన కొలదియు సాధకునకు ప్రేమశరీరము కలుగును. ఆ ప్రేమశరీరమునకు ప్రేమనేత్రములు ప్రేమ శ్రోత్రములు మొదలయిన యవయవము లుండును. దేవునిరూపు ఆ ప్రేమ నేత్రాలకు కానసగును. దేవునివాక్కు ఆ ప్రేమశ్రోత్రాలకు విననగును.

దేవునిపై గాఢప్రేమ లేనిదే, యివి సిద్ధింపవు. దేవుని అతిగాఢముగ ప్రేమించిన వానికి దేవుడే సర్వత్ర కనిపించుచుండును. కామాల గలవానికి సమస్తమును పసుపువన్నె కలిగి కనంబడును గదా? అట్లే, అప్పుడట్టి భగవత్ప్రేమగలవానికి 'సోఽహమస్మి' నేను నిక్కముగ అతడనే' అను ననుభూతి కలుగును.

రేయింబగళ్ళు దేవునే తలంచుచుండు వానికి దేవుడే సర్వత్ర కనబడుచుండును. ఎట్లనగా నొకచోట అగ్నిజ్వాలలను తెప్పపాల్పక కొంతసేపు చూచుచుండిన వానికి అన్నివైపులను అట్టిజ్వాలలే అగపడుచున్నటుండును గదా.

"అన్నివైపుల నతని కగపడెడి యగ్నిజ్వాలలు వాస్తవములు కావు కదా" అను తలంపు మహేంద్రుని మనసున కలిగెను.

ఎవనిమనసున నెంత యడుగున మఱుగువడియుండు భావమునైనను సరే గ్రహింపగలవాడైన శ్రీరామకృష్ణుడు మహేంద్రుని సందేహమును గుర్తించి ఇట్లనెను - 'ఆత్మమయుడును చిన్మయుడు నగు ఈశ్వరుని తలంచువానికి స్మృతినాశము కలుగదు. దేవునే మితిమీఱి తలంచుచున్నచో చిత్తభ్రాంతి కలుగు నని శివ

నాథు డొకసారి చెప్పినాడు. అప్పుడు నేను "జ్ఞానస్వరూపునే ధ్యానించువానికి జ్ఞానహాని ఎట్లు కలుగు'' నని యడిగితిని.

ఒక భక్తుడు: - భగవంతుని జూచుట అనున దెట్లుండును?

శ్రీరామకృష్ణుడు:-నీవు నాటక ప్రదర్శనము చూడలేదా? ప్రేక్షకులు పరస్పరము సాగించు సంభాషణలు గోలగా నుండును. తటాలున తెర ఎత్తబడును. అప్పుడు సకల ప్రేక్షకుల మనస్సును నాటకమువంక కున్ముఖ మగును. అప్పుడు వారు వేఱు దేనినిగాని చూడరు. సాధకు డావిధముగా అంతర్ముఖు డగుటే సమాధి. తెర వ్రాలగానే, ప్రేక్షకులు మరల చుట్టుపట్టుల జూచుచుందురు. అట్లే మాయాయవనిక వ్రాలి నప్పుడు, మనస్సు బహిర్ముఖ మగుచుండును.

ఒక బ్రాహ్మభక్తుడు:-ఏ సాధనలు చేసిన భగవంతుని దర్శింప వీలగును?

శ్రీరామకృష్ణుడు:-డెందమున మిక్కుటంపు ఉత్కంఠతో నీవు దేవునకై ఏడువ గలవా? ధనమునకై, దారపుత్రాదులకై మానవులు కడవలు కడవలుగా కన్నీరు కార్తురు. దేవునకై ఎవరు విలపింతురు? బిడ్డ, బొమ్మలతో ఆడుకొనుచు, ఆయాటలో మునిగి యున్నంత సేపును తల్లి వంటపనిని తక్కుంగల యింటి పనులను జూచుకొనుచుండును. విసుగుపుట్టి నప్పుడు బొమ్మలను పాఱవేసి, బిడ్డ 'అమ్మా' అని ఏడ్చును. అప్పుడు తల్లి ప్రొయ్యిమీద ఉడుకుచున్న అన్నపుతపెలను దింపి, పరుగున వచ్చి బిడ్డ నెత్తుకొనును.

## గురుస్తుతి

### నేతేటి విశ్వనాథశర్మ 'విశ్వశ్రీ'

షణ్ముఖప్రియరాగం – రూపకతాళం

పల్లవి: రామకృష్ణదేవరా ...... నన్ను బ్రోవ వేమిరా

అనుపల్లవి: సన్నుతింతు నయ్యా నిన్ను సద్గురూత్తమా సదా

చరణం: పంకజాసనాదిసురుల కైన ప్రస్తుతింప తరమె

మి: కామినికాంచనమోహము వీడిన సచ్ఛీలుండవు
కామితదాయినికాళి సద్దయ బడసినవాడవు ॥రామ॥

2. తుచ్ఛకామరాగభోగమత్సరంబులెల్ల వీడి
నిత్యయోగధ్యానమందు చిత్తవృత్తి నిల్పినావు

మి: సంతతబ్రహ్మానందము పొందిన సద్గురువరేణ్య
రాజితకోమలపల్లవపూజిత చరణాబ్జద్వయ ॥రామ॥

# గణేశస్తుతి

హంసధ్వనిరాగ - ఆదితాళం

పల్లవి : ముందుగ దలచెద మూషికస్యందన
ముదమున కనుగొనుమా (మిశ్రం) సురపూజితచరణా

చరణం : పార్వతినందన పాహి గజానన
పాపవిమోచన పావనచరణా

మి : కుడుముల కొబ్బరిపండ్లను
ఉండ్రాళ్ దండిగ నిడెదను
విఘ్నములెల్లను బాపఁగ, సత్కృప దాసుని నేలగ ॥ము॥

2. శాంకరిప్రియసుత సజ్జనసన్నుత
బ్రహ్మాసురార్చిత తనుసంశోభిత

మి : తొలుతను గొలిచెడి జనులకు
జయముల నొసగెద వనుచును
గణముల కధిపతి వనుచును
సతతము దలతును మనమున ॥ము॥

# త్రిప్పటల నడుమ నెమ్మది

ప్రొద్దున నిద్రలేచిన మొదలు మరల రాత్రి పాన్పుచేరువఱకును మనము కార్యరంగమున వ్యాపృతులమై ఉందుము. నిదుర మేల్కాంచినంతనే, కన్నులు తెఱచుకొనును, వెలుపలి జగత్తులోని వస్తునివహమును కనజేయును. శబ్దముల ఆలకింప వీనులు విచ్చుకొనును, కరచరణములు తమపనుల నారంభించును, ఆలోచనలు అనుభూతులు సంకల్పములు తమతమ దారిని సాగిపోవుచుండును. మనలో ప్రతియొక్కడును, ఎవనిదారిని వాడు, దినమంతయు కార్యనిమగ్నుడై యుండును. మొట్టమొదట దేహపు టక్కఱలను తీర్చుకోవలసియుండును. 'శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్' 'ధర్మానుష్ఠానసాధనములలో శరీరము అగ్రగణ్యము' కావున దాని ఆరోగ్యసుస్థితులకై చేయవలసిన వాని నన్నిటిని చేయుచుందుము. న్యాయ్యమే. కాని మానవుడు దేహమే తా ననుకొని, అదే సర్వస్వమని యెంచి దానిమీది యపేక్షలో మితిమీఱుచుండును. అతని ఆనందములును ఆశలును దేహముననే కేంద్రీకృతములై యుండును. ఈదేహ మెక్కడ రాలిపోవునో అను తలంపే అతని నెక్కువగ బాధించుచుండును. దేహమును నిలుపుకొనుటకు తన శాయశక్తుల నతడు పాటువడుచుండును. జీవితమున కెడతెం పుండకూడ దనెడి కోరిక, తాను నిత్యుడుగ నుండవలె ననెడి కోరిక ప్రతిమానవునిలోను గూఢమును గాఢమునై యున్నది.

ప్రస్తుతకాలమున భౌతిక వైజ్ఞానిక సాంస్కృతిక సాంఘికార్థికరంగములలో మానవుల కార్యక్రమాలు పెచ్చుపెరిగిపోవుచున్నవి. ఇప్పుడున్నన్ని చిక్కులుసు సమస్యలును - మానవ చరిత్రలో ఇంతకు మున్నెన్నడును ఉండినవి కావు. భయంకర వేగముతో మానవుడు పరుగులు వాఱుచున్నాడు, త్రిప్పటలకు లోనగుచున్నాడు. ఇవన్నియు ఎందునిమిత్తము— ధనము గడించుటకు, కీర్తి సంపాదించుటకు, అధికారము పడయుటకు, భోగ్యవస్తువుల సేకరించుకొనుటకు. కల్మిలేని సుఖమును గడింపవలె అను ఆత్రమే మానవునికి అన్నిరంగముల లోను ప్రేరకమై యున్నది. విప్పి పరికింతుమేని నిరవధికమైన ఆనందమే ప్రతిమానవునికి లక్ష్యము.

జ్ఞానార్జనముకూడ మానవుడు కోరుచున్నాడు. ఇంక నింకను జ్ఞానమును వర్ధిల్లజేసికోవలయునని, నిరవధికమైన జ్ఞానము తనకు దక్కవలయునని అతడభిలషించుచున్నాడు. జ్ఞానమెందులకు? ప్రకృతిబంధములనుండి తాను విడుపొందుటకు, ప్రకృతిని తన అదుపులోనికి తెచ్చుకొనుటకు. స్వేచ్ఛకేమాత్ర మడ్డు తగిలినను మన మాగ్రహపరవశుల మగుచున్నాము. మోక్షాభిలాష — స్వాతంత్ర్యాభిలాష—మనలో గూఢముగను గాఢముగను ఉన్నది. అజ్ఞానావరోధమునుండి విడుపొందవలె నను కోరికయే జ్ఞానసముపార్జనోద్యమముగా రూపుదాల్చుచున్నది. ఎన్నికష్టములకైనను త్యాగములకైనను మనము వెనుదీయలేదు. దగ్గఱివి దూరమువి అను భేదములేక సమస్తమును మనకు విధేయముగ నొనర్చుకొన పాటుపడుచున్నాము. ఒక్కొక్కరంగమును అదుపులోనికి తెచ్చుకొనుచున్నాము. జ్ఞానాభిలాషయు స్వాతంత్ర్యాభిలాషయు లేని మానవుడు లేనేలేడు. స్వాతంత్ర్యోద్యమములను జూచుచున్నాము. బానిసతనమునకు వ్యక్తి ప్రతిఘటించుటను గనుచున్నాము. మానవులకు సహజమను స్వాతంత్ర్యాభిలాషయే ఆయుద్యమాల. ప్రతిఘటనల రూపమున ఆవిష్కృత మగుచున్నది.

లాష, అసమ్మిశ్ర సుఖాభిలాష, నిర్నిరోధస్వాతంత్ర్యాభిలాష — ఇవే మానవుల పనుల కన్నిటికిని, తలంపుల కన్నిటికిని, అనుభవముల కన్నిటికిని మూలము లని తేలినది. మానవుడు ఇన్ని శోధనలకు విపత్తులకు లోనైనప్పటికిని, మహోజ్జ్వల విజయములను ఫలితములను సాధించుకొన్నప్పటికిని— పైని పేర్కొన్న యభిలాషలు నెఱవేఱు ఆవకాశ మెప్పుడైన గలుగునా అనుటను గమనింపవలెను. మృత్యుదేవత జీవులలో ఎచ్చుతగ్గులు పాటింపదు, దొర యని బంటని చూడక కబళించివేయును. ఒకనాడు మిన్నంటిన మహోద్యమములు మహాసామ్రాజ్యములు మఱునాడు అడుగంటిపోవుచున్నవి. పుట్టువొందిన ప్రతి ప్రాణికు ఒకనాడు మరణింపవలసినదే. కావున అసమ్మిశ్రసుఖ మనునది కుందేటికొమ్మే. అసమ్మిశ్రసుఖమును సాధించుకోవలె నని మానవుడనాదికాలముగా కావించుచున్న భగీరథ ప్రయత్నము భగ్న మనుచునే యున్నది. సుఖదుఃఖము లొకద్వంద్వము. ద్వంద్వ మనగా జత, రెండింటి గుత్తి. రెండింటి గుత్తిలో ఏ ఒక్కదానిని మనము లాగినను, రెండవదియు మన మెంత వల దనుకొన్నను వచ్చిపడును. సుఖమునంటి దుఃఖమును సంప్రాప్త మగుచుండును. అది ప్రకృతిధర్మము, స్వేచ్ఛయు, అక్కటా, ఎంత అస్థిరము! ఈ నిముసమున సిద్ధించిన ట్లుండును, మఱునిమిసమున మరల సంపాదించుకోవలసి ఏర్పడుచుండును.

ఇలా గనుట నిరాశావాదముగా గోచరింపవచ్చు, కార్యోత్సాహమునకు గొడ్డలిపెట్టుగా అగపడవచ్చు. కాని సునిశితదృష్టితో పరికించితిమేని—ఇది నిరాశావాదము కాదనియు ఆశావాదమును కాదనియు, అప్పటమైనసత్యమనియు యుగయుగములుగా రూపొందిన మానవుల యనుభూతి ప్రతిపాదనమే అనియు తెల్లమగును. దీనియాథార్థ్యము ననుభవపరులు ఔనన్నంతగా, లేబ్రాయమువారు ఔననరు. ఏలయన పసివారు లోకపు పైతళుకులకు ముగ్ధులగుచుందురు. విషయము నున్నదాని నున్నట్లుగా చూడకపోవుటయు అర్థము చేసికొనకపోవుటయునే ఆశావాదమునకును నిరాశావాదమునకును కారణము. నావి నీవి అను భేదము పాటింపక విషయముల నున్నవాని నున్నట్లుగా గనుచుందుమేని సంగరహితతి అలవడును. మేలిమియు చెడుగును సంభవించినప్పుడు మనకుపొంగుక్రుంగులు కలుగకుండును. వ్యామోహమునకు గాని మోసమునకు గాని దురభిమానమునకు గాని తహతహపాటునకు గాని ఆస్పద ముండదు.

ఈజగత్తు ద్వంద్వజగత్తనుట ప్రత్యక్షము. ఇందు చావుబ్రతుకు లున్నవి, దుఃఖసుఖము లున్నవి, దాస్యస్వేచ్ఛ లున్నవి. మృత్యుగహ్వరమున బడక భేదమోదము లనుభవింపక ఎవరును తప్పించుకోలేరు. మఱి మనలో ఆంతరముగా ఉన్న మరణరహితజీవితాభిలాషకును, దుఃఖరహితసుఖాభిలాషకును అర్థమేమి? వ్యర్థాశ లని ఎంచి వానిని మనము వదలుకోవలసినదేనా? సచ్చిదానందస్వరూపమగు ఆత్మ లేదా. ఈ పారమార్థికవిషయములను మనకు దెలియజేయ భౌతికాదిశాస్త్రములు సమర్థములు కావు. శ్రీరామకృష్ణులు వక్కాణించుచున్నారు:—"ఋషులు ఆత్మను సాక్షాత్కరించుకొనిరి. భౌతికాదిశాస్త్రములద్వారా బ్రహ్మజ్ఞానమును ప్రాపింప శక్యము కాదు ఈమూలవస్తువు ఆమూలవస్తువుతో కలిసిన అట్లు పరిణమించును, ఆ మూలవస్తువు ఈ మూలవస్తువుతో మిళితమైన ఇట్లు మార్పొందును—' అను ఈ రీతిగా ఇంద్రియగోచరములగు వస్తువులనుగూర్చిన, తెలివిడిని భౌతికాది శాస్త్రములు మనకు సమకూర్చును. ఈ సాధారణజ్ఞానము ద్వారా పారమార్థికవిషయముల నాకళించుకొనుట మానవునకు సాధ్యము కాదు. వానిని తెలిసికొనవలెనన్న — సాధుగోష్ఠిలో మెలగ వలయును."

కాబట్టి జీవితపరమార్థపు లోతులను తఱచినవారును బ్రహ్మానుభూతినొందినవారు నగు యోగులను మహాత్ములను మన మాశ్రయింప వలయును. వారిజ్ఞానము ప్రమాణగ్రంథములలో పదిలపఱుపబడియున్నది. భృగువు అధిగమించిన బ్రహ్మజ్ఞానమును తైత్తిరీయోపనిషత్తు తెలుపుచున్నది, ఆలకింపుడు—

"ఆనన్దో బ్రహ్మేతి వ్యజానాత్. ఆనన్దాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే. ఆనన్దేన జాతాని జీవన్తి. ఆనన్దం ప్రయన్త్యభిసంవిశన్తీతి"

"ఆనందమే బ్రహ్మమని ఎఱిగెను. ఏలయన ప్రాణులు ఆనందమునుండియే పుట్టువొందుచున్నవి, పుట్టువొందిన ప్రాణులు ఆనందముచేతనే జీవించుచున్నవి, ఆనందమువంకకే చనుచున్నవి, ఆనందముననే ఐక్యమొందుచున్నవి" ఆ యుపనిషత్తే ఆనందమునకు ప్రభవమైన దానిని గూర్చి ఇట్లు చెప్పుచున్నది—

"అసద్వా ఇదమగ్ర ఆసీత్. తతో వై సదజాయత. తదాత్మానగ్ం స్వయమకురుత. తస్మాత్తత్సుకృతముచ్యత ఇతి. యద్వై తత్సుకృతమ్. రసో వై సః. రసగ్గ్ హ్యేవాయం

లబ్ధ్వానన్దీ భవతి. కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్. యదేష ఆకాశ ఆనన్దో నస్యాత్" సృష్టికిముందు ఈ ప్రపంచము నామరూప విశేషరహితమగు అవ్యాకృతస్వరూపము గా నుండెను. సృష్ట్యనంతరము నామరూపవిశిష్ట మగు సత్స్వరూపము దానికి కలిగెను. నామ రూపములు లేని బ్రహ్మము నామరూపములు గల జంతువు తానుగా ఏర్పడినందున ఆ బ్రహ్మము స్వయంకర్తృక మని చెప్పబడు చున్నది. ఆ బ్రహ్మము రసస్వరూపము. ఈ ప్రాణికి రసమును బొందుటచేతనే ఆనందము కలుగు చున్నది. హృదయాకాశమున ఈ యానందము లేనివాడు ప్రాణనాది క్రియలను జేయజాలడు" (II-7-1)

విశ్వాససంధాయకమును సంతారకమును పరిణతిప్రదమునగు సమాధానము కదా ఇది మన దుఃఖాలను అడ్డంకులను సంకోచాలను నిర్మూలించు జవాబిది. ఆనందమే—నిరవధిక బ్రహ్మానందమే మన స్వరూపము. మనము పుట్టువందినది అందుండి, జీవించుచున్న దందులో, మనకు ప్రాప్యమదే, మనము విశ్వ మొందునదందులోనే, ఆ ఆనందమే లేకున్నచో మనము పుట్టియుండము, జీవించియుండము ఇంద్రియాదులద్వారా మన మనుభవించు క్షుద్రానందము నిరవధికమగు బ్రహ్మానందము నకు ప్రతిబింబమే. మనలో నున్న నిరవధిక సుఖాభిలాష ఆనిరవధిక బ్రహ్మానందమునకు సూచకమే. అట్లే మననిత్యజీవితాభిలాషయు- ఆత్మనిత్యత్వమునకు సూచకము. కావున ఇంద్రి యములచేతను ప్రతిభచేతను నిత్యజీవితాభి లాషయు నిరవధికానందాభిలాషయు తీర జాల నంతమాత్రముచేత ఆ యభిలాషలను అణచు కొనుట ఆత్మహానివంటిదే. కావలసినదేమనగా- భగవత్సాక్షాత్కారమునకై తహతహపాటు, సాధన. 'లెండి, మేలుకొండి. లక్ష్యమును సాధింపనిదే ఆగకుడి' అనెడి ఉపదేశానుసారము సాధన సాగించుట విధాయకము

మఱొక ప్రశ్న కూడ అడుగవచ్చు. ఉపనిష త్తుల కాలములో ఋషులు బ్రహ్మమును సాక్షాత్కరించుకొని రనుట సరియే. ఆధునిక యుగమున బ్రహ్మమును తాను సాక్షాత్క రించుకొని మనవంటివారికి మార్గదర్శకుడైనవా డెవడైన కలడా? ఈ ప్రశ్న నూహించు కొనియే కాబోలు అనదినట్లు ఆధునిక యుగ పురుషుడైన శ్రీ రామకృష్ణుడు బ్రహ్మమును సాక్షాత్కరించుకొనుటే కాక జీవితశేషమును ప్రకృతకాలోచితసాధనవిధానముల ప్రచార మునకై వినియోగించెను. ఆయన బ్రహ్మమును సాక్షాత్కరించుకొని అసమాధ్యనుభూతిలో ఆఱునెలలకాల ముండెను. తాను గడించిన పారమార్థికసంపదను అర్థించినవారికి అర్హులకు నెఱచూఱలిచ్చెను. నాటి భారత రాజధాని నగరమగు కల్కత్తావీథులలో సంచరించి కేవల ప్రజాక్షేమాభిలాషచే ప్రేరితుడై ఆత్మప్రాప్తి పథములను కఱపెను. భగవంతుడే ఆయనను ఊపిరి. భగవంతుడే ఆయనకు మనికిపట్టు. భగ వంతునే తప్ప వేఱుదేనినిగాని ఆయన ఎఱు గడు. ఆధ్యాత్మికసత్యములకు ఆయనజీవితచరి త్రము ఈనాడుసైతము మహోజ్జ్వలమైన సాక్ష్య ముగ నున్నది. ఆయనసూక్తులు స్వానుభవ విశదీకరణములే కాని వట్టిపుస్తకపాఠాలవల్లింతలు కానందున, జిజ్ఞాసువుల కవి క్రొంగ్రొత్త వెలుగుబాటలను జూప సమర్థములుగ నుండెను.

చేతులారంగ శివుని బూజింపఁడేని,
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని,
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని-
కలుగ నేటికిఁ దల్లుల కడపుచేటు!

అను బమ్మెరపోతరాజుగారి పద్యరత్నము జగత్ప్రసిద్ధము కదా! ఇందు శివపూజయు హరిసంకీర్తనమును దయయు సత్యము అను నాల్గు పేర్కొనబడియున్నవి. వీనిలో ఒక్కటి చాలును మానవజీవితమును సార్థక మొనర్ప అని పోతరాజుగారు చెప్పియుండగా శ్రీరామకృష్ణుని చరిత్రము ఇన్నింటికిని అద్వితీయ లక్ష్యమే. బ్రహ్మానుభూతిలో నేనిలువక, ఆయన క్రిందికి దిగినది పరమకరుణచే లోకము నుద్ధరించుటకు. శ్రీరామకృష్ణుని భౌతిక దేహమిప్పుడు మనకంటియెదుట లేకున్నను, ఆయన నోట వెలువడిన అమరవాణి, 'సూక్తిసుధ' మన కున్నది నూతేండ్లక్రిత‌ము పలుకబడినప్పు డావాక్యములలో ఏయావర్జనశక్తి ఉట్టిపడుచుండెనో ఇప్పటికిని అశక్తి వానిలో అట్లే యున్నది. ఐనను ఆయనజీవితసందేశాలను మన మవగాహనచేసికొనవలె ననిన ఆయనతోకూడ నుండి ఆయనచే సుశిక్షితులైనవారు చెప్పగా వినవలెను. అట్టి వారిలో అగ్రగణ్యుడు గురునాథుని సందేశహృదయమును గ్రహించినవాడు శ్రీ వివేకానందస్వామి. గురునాథుడు తనశక్తిని ఈ శిష్యవరేణ్యునిలోని కెట్లు సంక్రమింపజేసెనో ఇతని మాటలలోనే ఆలకింతురు గాక — ''దేహమును త్యజించుటకు రెండుమూడు దినములకు ముందు ఒకనాడు ఆయన నన్ను చెంతకు పిలిచి, తన కెదుట కూర్చుండబెట్టుకొని నాపై చూపు నిలిపి సమాధి నిమగ్నుడయ్యెను. అప్పుడు విద్యుదాఘాతమును బోలిన దొకటి నామేనిలో జొచ్చుకొనుచున్నట్లు నాకు తెలియ నగుచుండెను. కొంతసేపటికి నేనును బాహ్యలోకస్మృతిని గోల్పోయి కదలిక లేక కూర్చుంటిని. అట్టిస్థితిలో ఎంత కాల ముంటినో నే నెఱుగను. బాహ్యలోకస్మృతి గలిగి కన్నులను తెఱచి చూతును కదా, శ్రీరామకృష్ణుడు కన్నీరు కార్చుచు కనవచ్చెను. నే నడిగి నందుకు ప్రేమపూర్ణవాక్కుల ఆయన యిట్లనెను—'ఈదినము నాసర్వస్వము నీ కిచ్చితిని, నేను భికారి నైతిని. స్వస్థానమునకు మరుగుటకు ముందు, ఈ శక్తితో లోకక్షేమమునకై పెక్కు పనుల నీ వొనర్పవలసియున్నది' ఆ శక్తియే నన్ను ఈయాపనుల సాధింప దారిచూపుచున్నట్లు నాకు స్పష్టముగ తెలియనగుచున్నది. ఈనాదేహము సోమారిగా నుండుట కుద్దేశింపబడినది కాదు.''

శ్రీరామకృష్ణునిసందేశమును తాను తెలిసికొనుటకును లోకమునకు తెలియజేయుటకును అనితరలభ్యమగు దక్షత శ్రీ వివేకానంద స్వామికే యుండె ననుట కొక యుదాహరణమును దెలుపుచున్నాము–1884 వ సంవత్సరమున నొకనాడు శ్రీరామకృష్ణుడు నరేంద్రాది శిష్యులతో మాటాడుచుండగా వైష్ణవమత ప్రసక్తివచ్చెను. గౌరాంగ దేవుని సందేశమును సంక్షేపించుచు గురుదేవు డిట్లనెను: ''ఈ మతము బోధించు విషయములలో ముఖ్యములు మూడు – భగవన్నామాభిరుచి, సర్వభూతదయ, వైష్ణవసేవ'' ఈ మాటలు ముగించులోపుగనే ఆయన సమాధి నిమగ్నుడయ్యెను. తర్వాత బాహ్యలోకస్మృతి ఇంకను పూర్తిగా కలుగకుండగా ఆయన తనలో తాని ట్లనుకొనెను. ''సర్వభూతదయ! సర్వభూతదయ! ఓరి మూఢా, భువిపై ప్రాకు నొకక్షుద్రక్రిమివి నీవు, నీవు ఇతరులపట్ల దయచూపుటయా! దయ చూపుటకు నీ వెవరవు? నీవు దయచూపుట అనునది కేవలము అసంబద్ధ ప్రలాపము. నీవు మానవుల పట్ల దయచూపవలసినవాడవు కా వోయి, మానవుని భగవత్స్వరూపునిగా భావించి సేవ చేయవలసిన

వాడవు''. ఈమాట లక్కడ నున్న వా రంద అను విన్నవే. కాని వీని యర్థ మెఱుఁగగలిగి నది నరేంద్రుఁ డొక్కఁడే. గురుదేవుని ఆ యద్భుతవాక్యములలో క్రొత్తవెలుఁగును అతఁడు కనుఁగొన్నాఁడు. భక్తికి జ్ఞానమునకు అందు చక్కని సామరస్యము కుదిరియున్నది. శైవ మనుకూలించినచో ఈ సందేశమును తాను లోకమంతట వెదజల్లుదు ననుకొన్నాఁడు నరేంద్రుఁడు, అలాగే వెదచల్లినాఁడు కదా!

ప్రచండవేగసాధనములు బలిసిన యీ కాలమున సాంఘికార్థిక రాజకీయాది విప్లవములు భువి నల్లూాత లూపుచున్న యీ దినములలో ఈ సంక్షోభాలకు విఱుగుడు, ప్రశాంతి కేకైకసాధనము ఆత్మజ్ఞానము.

# శ్రీ శివానంద స్మృతులు - 43

## శ్రీమత్ప్రవ్రాజిక శ్యామాప్రాణ

క్రీ. శ. 1-5-1929 (బుధవారము)
బేలూరుమఠము

ఒకానొకయువకునిమనంబున వైరాగ్యభావ ముదయింప నతఁడు, తన బి.ఏ. పరీక్షలకు ముందు ఇల్లు వీడి, సాధనానుష్ఠానముల చేయు నుద్దేశ్యముతో మఠమునకు వచ్చెను. కాని వెంటనే యింటివారు యింటికి డనే, సాధనల సాగింప వచ్చునని అతనిని బలాత్కారముగ ఇంటికి తీసికొనిపోయిరి. ఇంటికి పోయినప్పటి నుండి అతఁడు శ్రీమహాపురుషుల ఆదేశానుసారము సాధనల చేయుచుండెను. ఆ బాలుఁడు నేఁడు శ్రీమహాపురుషులదర్శనార్థము బేలూరు మఠమునకు వచ్చెను.

అతఁడు ప్రణామ మాచరించిన పిదప, శ్రీమహాపురుషులు కుశలప్రశ్న లడిగిరి.

భక్తుఁడు: శరీరారోగ్యము బాగుగనే యున్నది, కాని మనస్సు చాల చంచలముగ నున్నది. ఇసుమంతయు శాంతి కుదురుట లేదు, ఘోరాశాంతిగ నున్నది.

మహాపురుషులు: నీమనస్సులో ఇట్టి అశాంతి కల్గుటకు కారణము, ఆ జగన్మాత నీపై కృపజూపుటకే అని ఎఱుఁగుము. ఆమెను పొందుటకే ఈ వ్యాకులత, కోరినదానిని పొందకపోవుటచే అశాంతి, ఇవన్నియు భగవత్కృపావిశేషముననే సంభవించును. పెక్కు జన్మలసుకృతఫలంబునను, భగవత్కృపాకటాక్షవీక్షణమునను మానవునిమనంబున ముముక్షుత్వము కల్గును. కాన నీవు కడువ్యాకుల చిత్తముతో విలపింపుము. తోడోడ ప్రార్థింపుము. ''తల్లీ, నాకు దర్శన మిమ్ము. నేను సాధనహీనుఁడను, భజనహీనుఁడను, దుర్బలుఁడను, నాపై కృప చూపి దర్శన మిమ్ము.' ఇలాగు ప్రార్థించుచు కాలము గడపుము. మనస్సు నిలువనీ, నిలువకపోనీ వేఱువైపుల దృష్టి ప్రసరింపనీయక కేవలము ప్రార్థనల సాగించుచుండుము. కృషీవలుఁడు వంశపరంపరాగతమగు సేద్యమును వదలక అంటిపెట్టుకొని యుండుచందమున నీవును ప్రార్థనల నెడతెగక సాగించుచుండుము. ఇటు నిటు తిరుగ నేల? స్వగృహముననే జగదీశ్వరి నీపై కృపజూపి, సంసారము అనిత్య మనెడి జ్ఞానమును కల్గించి, సంసారబంధముల నెల్ల త్రెంచి వేయును.

భక్తుడు: ఒక్కొక్కతరి ధ్యానము సాగి ఆనందము కల్గును. మఱొక్కప్పుడు మనస్సును వశపఱచుటకే సాధ్యము కాదు.

మహాపురుషులు: తరంగమువలె "(Wave-like motion)" ఎక్కుడు తగ్గుటలు మనస్సునకు నైజగుణము సుమా! సముద్రములో అలల ఆటుపోటులు చూడ లేదా? ఒక పెద్ద అల లేచును, దానివెనుక ఒక లోతుగుంట ఏర్పడును, అటుపై మరల పెద్ద అల లేచును. మనస్సుగతికూడ ఈలాగే. అప్పుడప్పుడు వశము కాకుండుటకు అర్థమే మన—మరల గొప్ప తరంగము లేచు ననియే ఎఱుంగుము. అటుపై ఆనందము కల్గును. కాని యథార్థభక్తుడు ఈ ఆనందమునకు ఉప్పొంగడు, నిరానందమునకు హతాశుడును కాడు. అంతయు జగజ్జనని ఇచ్ఛ. సర్వము తల్లికృప అని ఎఱింగి ఏకనిష్ఠచిత్తముతో విశ్వేశ్వరిని ప్రార్థించుచుండును. జగన్మాత నిన్ను ఎట్టి పరిస్థితిలో ఉంచినను, నీవుమాత్రము నీప్రార్థన కొనసాగించుకొనవలెను, నిరవచ్ఛిన్నానందము నీకు తప్పక లభించును. జగజ్జనని నీకు ప్రసన్నురాలగును. నాయనా, నీవు ఎట్టి పరిస్థితిలోను చలింపకుము. తల్లి నీపై కృపచూపుచున్నది, ఇకమీదను చూపును. నామాట విశ్వసింపుము. తలవెంట్రుకలు ఏల పెంచితివి? కత్తిరింపుము. గొప్పధార్మికుడనని చాటుకొనుటకా ఏమి? పదిమందిలో పదునొకొండవవాడుగ నుండుము. బాహ్యాడంబరములతో పని లేదు. బైట ఎట్టి పార్థక్యము చూపకు. కాని అంతరంగమున సర్వదా జగజ్జననిని ప్రార్థింపుము. చూడుము ఇది బైటవస్తువు ఎన్నటికిని కాజాలదు సుమా! ఇక లేచి ఆలయమునకు వెళ్లి శ్రీఠాకూరు దర్శనము చేసికొని వచ్చి ప్రసాదము స్వీకరింపుము.

# శివానందలేఖావళి

## 86

శ్రీరామకృష్ణమఠము,
బేలూరు, హౌరా
20 మే 1920.

ప్రియ శ్రీమర—,

నీజాబు చేరినది. మాతృశ్రీపరిస్థితి మునుపటియట్లే యున్నది. ఏమి సంభవింపనున్నదో గురుదేవునకే ఎఱుక. మనసుల కందని వారిదివ్యలీలలు ఎవ్వరికిని ఎప్పుడును అర్థము కావు ఆమె కృపతో మనకు పరిపూర్ణభక్తిశ్రద్ధలను ప్రేమానుకంపలను ప్రసాదించును గాక. ఇదే నా ప్రార్థనము.

నీ వడిగినదానికి సమాధానము: – ఎట్లో ఒకట్లు జపముద్వారానో ధ్యానముద్వారానో రెంటిద్వారానో కల్యాణగుణముల భావించుట ద్వారానో (ఇదియు నొక విధమగు ధ్యానమే) మనస్సును భగవానునిపై నిలుపవలయును. అట్లు సాగునేని మంచిదే. కాలమునుగూర్చి తలంపకు. శ్రమపడ నక్కఱ లేక సునాయాసముగా ఎంతమట్టుకు నిన్ను భగవంతునికి నివేదించుకొనగలిగిన అంత మేలు. మిక్కిలి శ్రమపడకు. ప్రధానమైనది భగవదనుగ్రహము. నీకు విముక్తిదాయకము భగవదనుగ్రహమే. ఆధ్యాత్మిక సాధనలచేత భగవత్ప్రాప్తి ఎవరికిని కలుగజాలదు. దేవుడు కేవలము తనకరుణచేతనే తన్ను చూపుకొనును. ఆయన పట్టుదలగలవాడు. దేనికిని పరతంత్రుడు కాడు. ఆధ్యాత్మిక సాధన లాయనను బద్ధపఱుప జాలవు.

ఆయన కృపకరించినచో, ఎవనికైనను సాధనలలో సిద్ధి కుదురును. నీ విక చింతిల్ల నక్కఱ లేదు. అమ్మయే నీకు దివ్యనామము నుపదేశించి అంత ప్రేమపూర్ణురాలుగ నున్నందున, ఇక నీకు భయ మక్కఱలేదు. ఆధ్యాత్మిక సాధనలను యథాశక్తి సాగించుచుండుము. మిక్కుటముగా శ్రమపడకు. నీకు హృదయపూర్తి గలుగును. గురుదేవునకు కనికరము నీయందిపుడున్నది, ఇకను నుండగలదు. మీ అమ్మకు ఆరోగ్యము గలుగుత మనియు మీ రందఱు ఎంతయు బాగుండవలె ననియు నా ప్రార్థన.

శ్రేయోభిలాషి,
శివానంద.

## 87

శ్రీరామకృష్ణమఠము,
బేలూరు, హౌరా.

ప్రియ శ్రీమన్ —, 10 జూన్ 1920.

నీ జాబు చేరినది. అన్ని సంగతులు తెలిసినవి. గురుదేవు నను గ్రహముచే నీకు సమున్నతి గలుగుగాత మనుటే హృదయపూర్వకమైన మా ప్రార్థన. దేహమునకు ఇప్పుడో మఱియొకప్పుడో మరణ మనివార్యము గురుదేవు డీ దేహమునకు సార్థకతను ప్రసాదించును గాత, అనగా భగవచ్చరణారవిందములందు దృఢభక్తి శ్రద్ధలను గలిగించును గావుత. జగమంతయు విలయమొందినను గురుదేవునకును ఆయన భక్తులకును సేగి యుండదు. ఇది నిత్యసత్యము. గురుదేవునకు శిష్యవర్గమును తమభౌతిక దేహములను వీడినను సూక్ష్మదేహములందు వారి యునికి సదా యుండును. వారు మోక్షమును కోరరు. మాతృశ్రీకి ఆరోగ్యము సరి లేదు. ప్రతిదినమును — ఒక్కొక్కప్పుడు దినమునకు రెండుపర్యాయములు ఆమెకు జ్వరము వచ్చుచున్నది. దుర్బలత మిక్కుటముగా నున్నది. అయినను మెల్లగా మఱుగుదొడ్డికి ఎట్లో పోవుచునే యున్నది. కడుపుబ్బరమును (ఆకలిలేకుండుటయు) మిక్కుటముగా నున్నది. ప్రస్తుతము ఆమెకు శ్రీయుత రాజేంద్ర కవిరాజు వైద్యము సేయుచున్నాడు. కీర్తిశేషులు దుర్గాప్రసాద సేనుగారి మనుమడు కాళీభూషణుడును ఉపచరించుచున్నాడు. జ్వరము ఇంచుకంత తగ్గియుండవచ్చు. అది ఏమంత ఎక్కువ తగ్గుదల కాదు. కాళ్ళలో రవంత వాపున్నది, అది రక్తహీనతకు సూచకము. కవిరాజును ఈలక్షణమును గుర్తించినాడు. అన్నము చాల తక్కువగా తినుచుండవలె ననుట అత డేర్పఱచిన ఆహార నియమము. ఇప్పుడు అంతయు గురుదేవుని సంకల్పాధీనము.

విజ్ఞానానందస్వామి అలహాబాదుకు మరలి వచ్చినారు. స్వామిజీ గుడినిర్మాణము చాల మట్టుకు సాగినది కట్టుబడిసామగ్రి వెలలు అతిమాత్రము హెచ్చి యున్నందున నిర్మాణకార్యమును ప్రస్తుతము ఆపియున్నారు. శ్రీ శామహారాజు క్షేమముగ నున్నారు.

నీకు నా హృదయపూర్వక ప్రేమానురాగాశీస్సులు.

శ్రేయోభిలాషి,
శివానంద.

అనుబంధము : ఇక్కడ ఎండలు తీవ్రముగ ఉన్నవి.

## 88

శ్రీరామకృష్ణమఠము,
బేలూరు, హౌరా.

ప్రియ శ్రీమన్ —, 12 ఆగస్టు 1920.

నీ జాబు యథాకాలమునకు చేరినది. మాతృశ్రీ భౌతికశరీరమును త్యజించినందుకు

ప్రతియొక్కరును దుఃఖాక్రాంతులై యున్నా రనుటకు సందేహము లేదు. ఆమె లేకపోదు నను తలంచినకొలదియు భక్తులకు ఆమె సాన్నిధ్యము మఱి తగా ననుభూతమై హృదయ శాంతి చేకూరును. ఆమెను మామూలు మానవాంగనగా తలపరాదు. సాధకురాలని గాని ముక్తాత్మురాలని గాని భావింపరాదు. కాళి తార షోడశి భువనేశ్వరి ప్రభృతులవలె ఆమె నిత్యపరిపూర్ణురాలు. మూర్తీభవించిన పరాశక్తియే. వారివంటిదే ఆమె. భగవదవతార మూర్తియైన శ్రీరామకృష్ణునకు సహచరురాలు యుగధర్మసంరక్షకురాలుగను (గురుదేవుని వలెనే ఆమెయు) తన్ను మఱుగుపఱచుకొని వంగదేశమున నొక యప్రసిద్ధ గ్రామమున పేద తల్లిదండ్రులకు పుత్రికగా అవతరించి. సకల జీవులకును లౌకిక పారమార్థిక సంక్షేమమును సమకూర్చుటయందు వ్యాపృతురాలై యుండినది. కావున ఆమె యనుగ్రహమును, అప్రార్థితముగ వెల్లిగొను ఆమె మాతృప్రేమను ఆస్వాదించినవారు ధన్యులు. కలకండవలెనిగ అందఱ కంతర్యామినిగ నున్న ఆ దివ్యమాత ప్రేమతో ఏ భక్తుని తనహస్తముతో స్పృశించెనో అతనికి సాక్షాత్కారము కలిగినట్లే. తప్పక కలిగితీరును. అది మాఅందఱి నమ్మకము ఇంకను నీకేమి తెల్పుదును? అమ్మ అనుగ్రహముచే మీలో ఒక్కొక్కరికు ఇదే యనుభూతి కలిగినది, పెక్కుండ్రకు కలుగనున్నది.

నీవు పంపిన వ్యాసమును చదివితిని. నా మనస్సున అది చాల బాగుగ నున్నది. దానిని ఉద్బోధన పత్రికకు పంపెదము, మీ కందఱికిని నా ప్రేమానురాగాశీస్సులు. ప్రభుకృపచే ఇక్కడ సమస్తమును చక్కగా సాగుచున్నది. కాని మలేరియా ఋతువు ఆరంభమైనది. కొంత వఱకు నది కననగుచున్నది.

నీ శ్రేయోభిలాషి,
శివానంద.

అనుబంధము :- మాతృశ్రీ శరీర శేషములకు చరమసంస్కారము జరిగినచోట ఒక గుడి కట్టవలయునని నిశ్చయింపబడినది. ఆమె అనుగ్రహముచే అందుకు విరాళములు అడుగకే వచ్చుచున్నవి. (మాతృశ్రీ జన్మగ్రామమగు) జయరామ్బాటిలో కూడ ఒకగుడి నిర్మింపబడవచ్చు. ఐనను అందుగూర్చి గట్టిగా చెప్పలేను.

# భీష్ముడు ధర్మజునకు కావించిన ధర్మోపదేశం

ప్రభాకర్

(గత సంచిక తరువాయి)

శ్రోత ధర్మరాజు.

ఇతని గుణగరిమను భీష్ముడే యీలాగు ప్రస్తుతించాడు——

ఎవ్వడు పుట్టిన నెల్లమునీంద్రులు
నత్యంత సంప్రమోదాత్ములైరి
పరమధార్మికులైన భరతులయందును
నెవ్వారు నెవ్వని నెనయలేరు
సత్యంబు దాంతియు శౌచంబు శాంతియు
నెవ్వడి యెవ్వనియందు వెలయుఁ
జ్ఞాతదానాధ్వర బంధురమౌది ధ
ర్మంబులెవ్వనికిఁ బ్రియంబు లెపుడుఁ
గామమునసైన విపులార్థకారణమున

నైన భయమునన్నైనను నపథవ ర్త
నంబునకేం బోంచెవ్వండు నన్ను నేమి
యడుగందలంచె నా ధర్మజుం డడుగుగాక.

సకలమనులకును సంతోష దాయకమైన జన్మ మట ధర్మరాజుది. ధర్మరాజు భరతవంశీయుడు, భరతవంశీయులందరూ పరమ భాగ్యవులే. కాని వారిలోనైన ఎవ్వడూ ధర్మరాజుకు సాటి కాజాలడట. సత్యం శౌచం శాంతి దాంతి అనే గుణాలు ఆయనలో సదా వెలుగొందుతుంటాయట. అర్హతకలవారికి దానం చేయడం యజ్ఞాలు చేయడం బంధువులను సంరక్షించడం ఇలాంటి ధర్మములంటే ఆయనకు అపరిమితమైన యిష్టము. కామంచేతగాని లోభంచేతగాని భయంచేతగాని ఆయన పెడదారిలో అడుగుపెట్టేవాడు కాడు. భీష్మునిలో ఆచార్యత్వ పరిపూర్తి అమరి ఉన్నట్టే ధర్మజునిలో శిష్యలక్షణసమగ్రత కుదురుకొని ఉన్నది. ఇకను ఉపదేశవిషయమూ, సకల సారస్వతమునకూ సారమైన ధర్మం. వేద వ్యాసుడు మహాభారతమంతటినిగూర్చి యీ ప్రతిజ్ఞ చేశాడు.

ధర్మేచార్థేచ కామేచ- మోక్షేచ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర-యన్నేహాస్తి నతత్ క్వచిత్

ధర్మాన్ని గురించి కాని అర్థాన్ని గురించి కాని మతాన్ని గురించి కాని మోక్షమును గురించి కాని యీ గ్రంథంలో చెప్పబడియున్న వే ఇతర గ్రంథాలలోను చెప్పబడిఉన్నవి. ఈ గ్రంథంలో లేనిది ఏ గ్రంథంలోనూ లేదు - అని యీ శ్లోకానికర్థం. ఈ శ్లోకాన్ని తిక్కన సోమయాజిగారు ఈలాగు తెనిగించారు—

అమల ధర్మార్థ కామమోక్షముల గఱిచి
యొలయు తెరువెద్దియును నిందుంగలుగు నదియ
యొండెడలంగల్గు, దీనలేకుండు చొప్పు
దక్కొకంటను, లేదు వేదజ్ఞులార.

రాజధర్మములు, వర్ణధర్మములు, ఆశ్రమధర్మములు, యుగధర్మములు, అహింసా-సత్య-శరణాగత సంత్రాణ-వైరాగ్య పాతివ్రత్యప్రముఖ పరమధర్మములు, మోక్షధర్మము, దానవిశేషములు, వాని మహిమానుకీర్తనము, పుణ్యతీర్థ విశేషములు, వివాహావిధానములు, ఔరసాది పుత్రవిభేదములు - ఇవన్నియు ఈ శాంత్యనుశాసనపర్వాలలో ప్రతిపాదితములై ఉన్నాయి. వీనిని గూర్చిన జిజ్ఞాసగలవారికి ఈ భీష్మోపదేశ ఘట్టం కల్పవృక్షంవంటిది

ధర్మోపదేశక వాక్యాలు సుభాషితాలు. సుభాషితాల విలువ ఇంతంతనలేము. ఎంతపెద్ద గ్రంథంలోనైనాసరే కండవంటి భాగాలు అందలి సుభాషితాలే. కావ్యాలలో నాటకాలు శ్రేష్ఠములనీ, నాటకాలలో కాళిదాసుని శాకుంతల నాటకం శ్రేష్ఠమైనదనీ, అందు చతుర్థాంకం రమ్యమైనదనీ - దానిలో నాలుగు శ్లోకాలు రత్నాలవంటివనీ ఆభాణకం ఉంది కదా. ఆ నాల్గుశ్లోకాలూ ఆ కథాఘట్టమునందే కాక అన్ని సందర్భాలలోనూ ఉదాహరణ ప్రాయాలు. సుభాషితాలకు ఇంతటి విలువ కలుగ డానికి కారణం - అవి రచయితగారి లోకానుభవంలోనుండి అవిర్భవించి, లోకుల అనుభవంతో సంవదించేవి. చదువరులకు లోకానుభవమును సమకూర్చేవి. ఈ హృదయసంవేదితయే సుభాషితాల మాహాత్మ్యమర్మం. భీష్ముడు ధర్మజునకు చేసిన ధర్మోపదేశము ప్రతిపాదితమైన భారతభాగం సుభాషిత సంపన్నం. మచ్చునకు కొన్ని సుభాషితాలను చదువుతాను, వినండి—

శ్రద్ధ నమ్మకం కూడదు, ప్రతిదాన్నీ సందేహించుండడమూ తగదు. బుద్ధి వినియోగించి గుణాగుణములను గుర్తించాలి అంటున్నాడు -

కడునమ్మి యునికియును నె
క్కుడు నమ్మమియును సుశీలకుశలతగా దె
య్యెడనైనను బుద్ధిఁ జొనిపి
తడవి కని కొనంగ వలయుఁ దగవుం
దగమియున్.

అందు ఇంకను సూక్ష్మం చెబుతున్నాడు – ఇతరులు మనలను నమ్మవలెనట. మనం వారిని నమ్మకూడదట.

నమ్మఁదగనివారి నమ్మక యున్నది,
తగినవారినైనఁ దద్దయు నమ్మి
యుండఁ దగదు, తన్ను నొరులు నమ్మునట్లు
యుండి యొరుల నమ్మకునికి నీతి.

ప్రజకూ రాజుకూ ఉన్న సంబంధం దేహానికీ ఆత్మకూ ఉన్న సంబంధం వంటిది. కాబట్టి ప్రజ రాజును అర్చించాలి, రాజు ప్రజను రక్షించాలి.

రాజునకుఁ బ్రజ శరీరము,
రాజు ప్రజకు నాత్మ, గాన రాజుం బ్రజయున్,
రాజోత్తమ, యన్యోన్య వి
రాజితులై యుండవలయు రక్షార్చనలన్.

తన్ను తన అదుపులో ఉంచుకోగల రాజే శత్రువులను తన అదుపులోకి తెచ్చుకోగలడు. తన్నే తాను వశపఱచుకోలేని రాజుకు శత్రువులు వశపడజాలరు అంటున్నాడు.

తను తాన తొలుత గెలువన్
మనుజపతికి వలయుఁ బిదపమార్తుర గెలువన్
మనమునఁ దలంచునదియును
దను గెలువని పతికి గెలువఁదరమే పగఱన్?

యజ్ఞమునకంటె తపస్సు అధికమైనది. తపస్సంటే దేహమును కృశింపజేసికోవడం కాదు. అహింసను సత్యమును పాటించటం, ఇంద్రియములను అణచిపెట్టడం, సకల ప్రాణులను స్వకుటుంబము వారినిగా ప్రేమించడం తపస్సు—

అధ్వరంబుకంటె నధికము తపము, త
పంబనంగ మేని ప్రస్నదనము
నివురఁ జేత కా, దహింసయు సత్యవా
క్యంబు దమము దయయుఁ గాని యరయ.

కల్పితములైన జంతువుల కథలద్వారా మానవుల నడవడులను నీతి కఱపుట అనే ప్రక్రియకు ప్రపంచమునకంతటికీ ఆచార్యకం భారత దేశముదే. మన పంచతంత్రమునూ, మన హితోపదేశమునూ, ఆంగ్లభాషలోని యీసాప్సు ఫేబిల్సుకంటె ఎంతో ప్రాచీనాలు. ప్రక్రియకు ప్రారంభం శాంత్యానుశాసనిక పర్వాలలో స్పష్టంగా గుర్తింపవచ్చు. వ్యాఘ్రగోమాయు సంవాదం, దీర్ఘదర్శి ప్రముఖ మత్స్యములకథ, కపోతోపాఖ్యానము, గృధ్రజంబుకోపాఖ్యానము, పవనశాల్మలీతరు సంవాదం యిలాంటివి ఎన్నో ఈ భారతభాగంలో ఉన్నాయి.

ఇందొక్కొక్కటీ ఒక ఖండకావ్యానికి చక్కని యితివృత్తం గాగలదు. కపోతోపాఖ్యానమును పెంచి అభినవ తిక్కన శ్రీ తుమ్మల సీతారామ చౌదరిగారు ఆత్మార్పణం అనే పేరుతో వెలయించిన కమ్మని ఖండకావ్యం ఇందు కుదాహరణం.

భీష్ముడు ధర్మరాజుకు అధ్యాత్మ ధర్మమును ఉపదేశించాడు. విష్ణుమహిమ శివమహిమ ఇందు సంగృహీతములయ్యాయి.

కో ధర్మస్సర్వధర్మాణాం
భవతః పరమోమతః

ధర్మము లన్నిట నీకు నచ్చిన పరమమైన ధర్మమేది అని ధర్మరాజు భీష్ముణ్ణి ప్రశ్నించాడు.

ఏష మే సర్వధర్మాణాం -
ధర్మోఽధికతమోమతః
యద్భక్త్యా పుండరీకాక్షం-
స్తవైరర్చేన్నరస్సదా.

భక్తితో స్తవములతో పుండరీకాక్షుని సదా అర్చిస్తుండడమే ధర్మములన్నిట అధికతమమైన ధర్మమని నా అభిప్రాయం—అంటూ భీష్ముడు ధర్మరాజుకు శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రమును ఉపదేశించాడు.

పరమశివుని మహిమను శ్రీకృష్ణుడేస్వయంగా వాక్రుచ్చాడు. ఈ ఘట్టంలో హరిహరనాథో పాసకుడైన తిక్కన సోమయాజి హరిశంభు హరుని ఒకమెట్టు పై కెక్కిస్తూ శ్రీకృష్ణునిచే ఈలాగు పలికించాడు - వినండి.

శివదేవు ముట్టఁగొల్వఁగ
నవనీశ్వర యతని పేళ్ళ యర్థ మెఱిఁగి సం
స్తవన కృతిఁగూర్ప నాకై
న విధాతకునైన నరిది నామదిఁ జూడన్.

ధర్మవిషయికమైన యీ భీష్మ యుధిష్ఠిర సంవాదం ధర్మజిజ్ఞాసువులకు పరమ ప్రమాణం అనడం అతిశయోక్తి కాదు.

# విద్యావిధానము - శ్రీరామతీర్థస్వామి

**నే. భ.**

'భారతదేశమును నేనే' అన్నాడు శ్రీరామతీర్థస్వామి. కాని విగ్రహమును బెట్టి యారాధించినట్లుగ దేశము నారాధించుట స్వామి హృదయము కాదు. దేశకాలానుభవాను గుణములైన యతని వాక్కుల నాలకింపుడు

"మీ రున్నది ఈ యుగములో, ఇప్పటి ప్రపంచములో. మీరు ఋషులసంతతివారనుట నిజమే కాని మీ రున్నకాలము ఋషుల కాలము కాదు. ఇప్పటి ప్రపంచమునుండి మిమ్ము మీరు కేటాయించుకోజాలరు. ఈ యిరువదవశతాబ్దములో అమెరికాలో యూరపులో నున్న శాస్త్రజ్ఞులతో కళాకారులతో కార్మికులతో సమన్వయింపక మీకు తప్పదు. కాలపరిసరాలమార్పులకు మిమ్ము సరిపఱచుకొనుట మీకు విధాయకము.

శ్లోకాలను వ్యాఖ్యానాలను వల్లించుచదువు చదువు కాదు. జీవితమున మన కించుకేని యుపయోగపడని విషయముల చదువుట చదువు కాదు. అమలులో పెట్టుటకు అందని చదువు జీర్ణముకాని అన్నమే. దేశసంపదలను వినియోగపఱచుకొన మనలను సమర్థుల నొనర్చుటే మన విద్యావిధానమునకు లక్ష్యముగ నుండవలయును. విద్యావంతులమైనందుకు మనము మన పొలాలను మఱింత సారవంతములుగ, మన గనులను మఱింత ఫలకరములుగ, మనవర్తకవ్యాపారములను మఱింత లాభదాయకములుగ, మన దేహములను మఱింత చుఱుకుగలవానినిగ, మన ప్రజ్ఞలను మఱింత స్వతంత్రములుగ, మన డెందములను మఱింత విశుద్ధములనుగ, మన పరిశ్రమల

(ఇండస్ట్రీస్) మఱింత వైవిధ్యసంపన్నములనుగ, మనదేశమును మఱింత యైకమత్యవంతముగ - చేసికొనసమర్థులమై యుండవలయును.

యూరపులో నేమి అమెరికాలో నేమి ఏల్ హార్వర్డు స్టాన్ఫర్డు షికాగోవంటి సుప్రసిద్ధ విశ్వవిద్యాలయాలు ఆయాప్రాంతప్రజాప్రముఖులేర్పఱచి వర్ధిల్లచేయుచుండునవేగాని ప్రభుత్వసంస్థలు కావు. అన్నిటికిని ప్రభుత్వము వారిపై నాధారపడియుండు మనదేశపరిస్థితి శోచనీయము.

విద్యావిధానమును గూర్చిన తన యాశయములను కార్యరూపమును దాల్పజేయుటకై శ్రీరామతీర్థస్వామి "జీవితసంస్థ" (లైఫ్ ఇన్స్టిట్యూషన్) నొకదానిని నెలకొల్పనెంచెను. ఆ సంస్థలో ఆయన సంకల్పించిన విధానాలు - విద్యార్థులకు అన్నిమతములను తత్త్వశాస్త్రములను కఱపవలయును. గ్రంథాలయాల పరిశోధనకేంద్రాల సహకారముతో వారికి భౌతిక రసాయనిక ప్రముఖములైన యాధునికశాస్త్రముల నన్నిటిని నేర్పవలయును. వారి యపోహాల నన్నిటి నంతమొందించి వారిని వివేకమార్గమున కార్యశూరులనుగ దిద్ది తీర్పవలయును. ఆ శాస్త్రములను పారమార్థికదృష్టితో నేర్చి దేశాభ్యుదయ సాధనమున కుపయోగించుకొనుటే అనుష్ఠానవేదాంతము. ఆ సంస్థలో నాస్తికుల రచనలను ఆస్తికుల రచనలను సమానాదరముతో స్వీకరింపవలెను. ఆ సంస్థకు లక్ష్యముగ నుండవలసినది "సత్యమే, అఖండసత్యమే, సత్యము తప్ప వేఱేదియును కాదు". అగస్పిజ్ అను శాస్త్రజ్ఞు నభిప్రాయమున గుడి ఎంత పవిత్రస్థలమో శాస్త్రపరిశోధనాకేంద్రము నంతపవిత్రస్థలమేనట; శాస్త్రపరమార్థాన్వేషణమును బ్రహ్మజిజ్ఞాసయు పర్యాయపదములట.

ఇట్టి సంస్థను నెలకొల్పవలెనని శ్రీరామతీర్థస్వామి సంకల్పించెను. కాని మన దౌర్భాగ్యము నేమందము? ఆ సంస్థను నెలకొల్పుటకు వలసినంతకాల మాయన జీవింపడాయెనే! ఐనను, నేటి విద్యావిధాత లనుసరించుటకు వీనికంటె నిక మేలైన లక్ష్యము లుండ వని తలచుట సాహసము కాదు.

('శ్రీరామదర్శన'పత్రికాధిపుల సౌజన్యముతో)

# సంతృప్తియే పరమసుఖము

శ్రీ వాసుదాసుగారు

కొంతకాలముక్రింద గోపాలశర్మయను నొక బ్రాహ్మణుఁ డుండెను. ఇతఁడు విద్యావంతుఁడు - బుద్ధిమంతుఁడు - సదాచారసంపన్నుఁడు - నయజ్ఞుఁడు - పెద్దలయందు వినయభయభక్తులు గలవాఁడై స్వకులాచారవర్తనము దప్పక, యభోజ్యములఁ దినక, యపేయంబులఁ ద్రాగక, యకార్యంబులఁ జేయక సజ్జనుల శ్లాఘకుఁ బాత్రుఁడై జీవించుచుండెను. ఈయన యొకానొకనాఁ డిట్టు లాలోచింపఁ దొడంగెను, 'లోకంబునఁ బుట్టిన ప్రతిజీవియు సుఖ

మునే కోరుచున్నది. సుఖము పొందుటకే సమస్తకార్యములు చేయుచున్నది. ఏది సుఖమిచ్చునని తోఁచునో యాకార్యమే దేహి చేయునుగాని దుఃఖమిచ్చునని తోఁచిన కార్యముచేయదు. అయినను బెక్కురు మనుష్యులు సుఖమును గోరుచు దుఃఖకరములైన జారత్వము చోరత్వము ద్రోహములోనగు పాపకార్యములు చేయుదురు. పూర్వజన్మములవారు చేసిన పాపములచేఁ బ్రేరేపింపఁబడిన బుద్ధియే దానికిఁ గారణము. కొందఱు లక్షలకొలఁది ధనమార్జించుటచే సంతోషింతురు. కొందఱు స్త్రీసంభోగములచే సంతసింతురు. కొందఱు రమ్యహర్మ్యముల వసించుటచే సంతోసిల్లుదురు. కొందఱు బిడ్డలఁగని యామోదింతురు. కొందఱ టారోగ్యమున నుల్లసిల్లుదురు. కొందఱు ప్రాజ్యరాజ్య భోగంబులఁ బ్రమోదింతురు. ఇట్లనేకానేకవిధమైన సంపదనొంది సంతోషించుచున్నారుగాని యిన్నిసుఖములు దుఃఖరహితములుగ ననుభవించువారు లేరు. ఐశ్వర్యముండెనా యనుభవించుటకు దేహారోగ్యములేక నేఁడిసిల్లు మికి యములపాళతోఁ గాలము ద్రోయుదురు. సంతానముండెనా దారిద్ర్యము వెంటనంటియే యుండును. విత్తముండెనా చోరులవలనను యాచకులవలనను రూపవతి భార్యయుండెనా జారులభయము. కావున భయరహితమైన సౌఖ్యము నీ లోకములో నుత్తమమైన దానిని సంపాదింప యత్నించెదను. ఇట్టి సౌఖ్యమునుసర్వఫలప్రదాతయు, సర్వశక్తుఁడు, భక్తజనకల్పకమైన శ్రీమన్నారాయణుండు తప్ప మఱియెవ్వరు నొసంగఁజాలరని నిశ్చయించుకొని యొక దివ్యతీర్థంబునొద్దున ఘోరతపంబుఁ గావించె. అతని నిష్ఠకు మెచ్చి భగవంతుఁడు ప్రత్యక్షమై నీకేమివరము కావలయునని యడిగెను. అతఁ డిట్లనియె. 'దేవా, నీ దర్శనము రిత్తపోదు. దానివలననే నాకు ముక్తిగలదని యెఱుంగుదు అయినను నీలోకంబున నివ్వడుండు పురుషులలో నెల్ల నెల్లవిధముల సుఖపురుషుఁ డెవఁడో వానియట్టి సౌఖ్యమును నాకనుగ్రహింపవలయును. ఏ విషయమందును లోపముండరాదు' అనిన భగవంతుఁ డిట్లనియె.

"నాయనా నీవిట్టి వరముకోరిన ప్రయోజనములేదు. నీకొక సంవత్సరము గడువిచ్చితిని. ఈలోపల భూసంచారము గావింపుము. నీవు మెచ్చిన సుఖపురుషుఁడెవఁడో వాని నేతి యట్టి సుఖపురుషునిగ నిన్నుఁ గావింపుమని కోరుము. ఈ నిమిత్తము నీవెందుఁ బోయినను నిన్నెల్ల రాదరింతురు గాని నిరాకరింపరు" అని చెప్పి యదృశ్యుండయ్యెను. గోపాలశర్మయు నేకోద్దేశముతో దేశాటనము గావించుచు నెందు సుఖపురుషు లున్నవారని వినికిడిగలదో యందెల్లఁబోయి వారి సౌఖ్యము దుఃఖమిశ్రితమై యుండుటఁ గాంచి నిరాకరించుచుఁ దిరుగుచుఁ దుదకు నొక సామంత ప్రభువువార్తవిని యచటికిఁ బోయెను. ఆయనయుండు పట్టనమునకుఁబోయి విచారింపఁగా నతనికే సౌఖ్యమందును గొఱఁతఁ గానరాదయ్యె. రాజ్యలక్ష్మి-ధనలక్ష్మి-ధాన్యలక్ష్మి-సంతానలక్ష్మి- సంపూర్ణమై యుండెను. సౌధమా వైజయంతియు. పురమా స్వర్గపురము. భృత్యులా విధేయులు. ప్రజలా యనురక్తులు. ఇల్లాలా సాక్షాద్రతీదేవి. బిడ్డలా యిందుకూనలు. రూపమున నా మన్మథుఁడే. విద్య-బుద్ధి-దానము-ధర్మము సమస్త సద్గుణములు గలిగి కీర్తివంతుఁడై చూచువారి కితఁడద్వితీయుఁడని పేరెన్నికగలవాఁడై యుండెను.

ఈ ప్రభువును గని యతని వృత్తాంతమువిని యపరిమితానందభరితుఁడై యా బ్రాహ్మణుడు

ఫలించెరా నేఁటికి మనయిష్టార్థమని మూఁపులు మూఁడుగాఁ బొంగి యితనివలెనుండ భగవంతుఁ గోరుదునని నిశ్చయించుకొని మఱియు నా మనీషి యిట్లు లాలోచించెను. 'ఇప్పుడు మనకు గోచరించినవన్నియు వెలుపలి విషయములే. లోగుట్టు మనకేదియుఁ దెలియరాదయ్యెను. ఇది యాయనకుఁదప్ప మఱెవ్వరికిఁ దెలియరాక యుండవచ్చును. మేడిపండు మెఱయుచుండును. పామువిషము తళతళలాడుచుండును. కుచ్ఛితులమాటలు తియ్యగనుండును. చెఱుపఁదలచిన ప్రభువు నవ్వుచు మాటలాడును. మిణుఁగురుపురుగు వెలుఁగు నిప్పుకాదు. కావునఁ బూర్ణముగ విచారింపక తొందరపడి కార్యము చేయరాదని యాలోచించి యా ప్రభువును దర్శింపఁ బోయెను.

సుశీలుఁడైన యా ప్రభువా విప్రుని నాదరించి కుశలప్రశ్నమడిగి రాక హేతువును బ్రశ్నించెను. ఆ బ్రాహ్మణుఁడును దాను భగవంతునిచే వరముఁ బొందిన విధమును జెప్పి 'నీయట్టి సుఖపురుషుఁడు లోకంబున నెందును నాకుఁ గానరాఁడయ్యె. నన్ను నీవంటివానిఁగఁ జేయ భగవంతు బ్రార్థింప నిశ్చయించుకొనియు నీవలననే యది దృఢపఱచుకొనఁగోరి నీ దర్శనము నిమిత్తమై వచ్చితిని. నీ కెందును సుఖహాని లేదు కదా' యని యడిగెను.

ఈ మాటలు వినినతోడనే యా ప్రభువు కన్నులనుండి జలజల వేఁడినీరు గాఱ నిట్టూర్పులు పుచ్చుచు కించిత్కాల మూరకుండి యా భూమీసురునితో నిట్లనియె.

'అయ్యా లోకములో నిరుపమాన సుఖపురుషుఁడను నేనా నీకుఁ గనఁబడితిని? ప్రపంచమున నాకంటె దుఃఖజీవి వేఱొక్కరుఁడు లేఁడని నా యభిప్రాయము. పై వేషములఁ జూచి ప్రమాదపడక నీవు నన్నడుగుటచే మేలుపడితివి. నీ మేలుకోరి కలది కలట్లు చెప్పెదను వినుము అని తాను దొడిగియుండిన చొక్కా తీసివేసెను. నాభినుండి మోఁకాటివఱకుఁ గుష్ఠరోగముచేఁ గ్రుళ్లి నీచునీరు గాఱుచుండెను. వస్త్రము దొలఁగించెనో లేదో జుమ్మని యీఁగలు గ్రమ్ముకొనెను. గవులు సహింపరానిదయ్యెను.

అది చూడఁగానే బ్రాహ్మణునకు దేహమునఁ గంపముపుట్టెను. గుండెలు తటతట కొట్టుకొనసాగెను. ఆ ప్రభువు మరల వస్త్రము ధరించి యిట్లనియె.

అయ్యా యిది నా దేహస్థితి. నాభార్య యందగత్తెయే కాని యిట్టిరోగముతో నేను దానితో నేమి సంభోగింపఁగలను? నా బిడ్డలలో నాకుఁ బుట్టినవాఁ డొకఁడును లేఁడు. అందఱు ధర్మపుత్రులే. నా భూమి యనువానినిజూచి భూమియు, నా ధనమనువానినిజూచి ధనమును, తన కొడుకుల నుపలాలించువానిఁగని జారిణియు, యుద్ధభూమి విడిచి పరువెత్తు రాజునుగని మృత్యువును హాసించుట స్వభావమే కదా. వీరు నా సింహాసన మెక్కఁగలవారు. వీరు నాకు శ్రాద్ధాదులు జరపువారు. వీరిచేతి నీళ్లతో నా కేలోకము ప్రాప్తించునో. ఈమాత్రమున నా మనస్సెంత యానంద పరిపూర్ణమో నీవే యూహించి యావల నీకుఁ దోఁచినట్లు చేయుము' అని యూరకుండెను.

'అయ్యా నీవు నాకు సత్యముఁజెప్పి మేలు చేసితివి. సెలవుతీసికొనెద'నని చెప్పి వెడలివచ్చి యిట్లు వితర్కించెను. ''ఆహా భగవంతుఁడు నన్నెంతటి ప్రమాదమునుండి రక్షించెను. ఈ లోకములో దుఃఖమిశ్రముగాని సుఖము లేదని తెలుపఁగాఁబోలు భగవంతుఁ డట్లాదేశించెను. అట్టి సుఖము ముక్తునికిఁదప్పఁ బ్రకృతి బద్ధునకెట్లు లభించును. నడచునపుడు కాలు ముందు

కాళ్ళలోఁ గ్రుచ్చుకొనకుండుటకై ప్రపంచ మంతయుఁ జర్మముచేఁగప్ప యత్నించుటకంటె మన కాళ్ళఁ బాదరక్షలు దొడిగికొని పోవుట మేలుకదా. మనకు భగవంతుఁడిచ్చినదానితో సంతుష్టిపడక పేరాస వహించితిమేని దుఃఖములు తప్పవు' అని తలపోయుచు నిల్లుచేరెను.

సంవత్సరము కాఁగానే మరల భగవంతుఁడు ప్రత్యక్షమై "యెవనివలె నుండఁగోరెదవో చెప్పుము వరమిచ్చెద"నన నా బ్రాహ్మణుఁడు నమస్కరించి యిట్లనియె.

'దేవా నే నెవరివలె నుండఁగోరను. నీవు నా కిచ్చినదానితో సంతుష్టిపడి యుండెదను. నాకేది శ్రేయస్కరమో సర్వజ్ఞుఁడవు సర్వలోకజనకుఁడవగు నీకుఁ దెలియును గాని యల్పజ్ఞుఁడ నగు నే నేమి యెఱుఁగుదును? లోకములో సర్వము భయముతోఁ గూడినదే. వైరాగ్యమే నిర్భయము నిరుపమానందము. కావున నీ పదభక్తియు వైరాగ్యము ననుగ్రహింపు"మని ప్రార్థించెను. శ్రీమన్నారాయణుఁ డట్లే యగుగాక యని వరమిచ్చిపోయెను.

క. వ్యాపిం బొందక వగవక ప్రాప్తంబును లేశమైనఁ బదివేలనుచున్
దృప్తిం జెందని మనుజుఁడు సప్తద్వీపములనైనఁ జక్కంబడునే?

క. తనకుఁ గలదానితోడం దనివిగొనకవాఁడు పూజ్యతముఁడును సుఖియున్
దనివెఱుఁగని శక్రుండును వనటలపాలగుచు దుఃఖవారిధి మునుఁగున్.

# విశ్వగుణాదర్శము

## శ్రీ రంగనాథానందస్వామి

ప్రశ్న- వేదాంతమందు అమెరికనులకున్న ఆసక్తి ఏపాటి వాస్తవము? ఆసక్తి మేధావంతులకు కూడ నున్నదా?

జవాబు—దాని పరిచయము వారికి కలిగినప్పుడు అందు వారికి ప్రగాఢాసక్తి గలుగుచున్నది. అపరిచయము అందఱికిని లేదు. ఒక్కశుభవార్త ఉన్నది. అది మీరు తెలిసికోదగినది. సంయుక్తరాష్ట్రాలలో పెక్కుకళాశాలలలోను విశ్వకళాపరిషత్తులలోను మనఉపనిషత్తులును భగవద్గీతలును పాఠ్యములుగ నున్నవి. సంయుక్తరాష్ట్రాలలోను కానడాలోను నేను ఎనుబదినాలుగు కళాశాలలకు పోయి ఉపన్యసించియున్నాను. నాపర్యటనములో నేను జూచిన కళాశాలలును విశ్వవిద్యాలయాలును నూటపదునైదు. వానిలో పెక్కింట విద్యార్థుల పాఠ్యాలలో ఉపనిషత్తులున్నవి. భగవద్గీతయు అలాగే దీనినంతటిని వారు వాస్తవముగ పాఠ్యముగ జదువుచున్నారు. ఇందులో వారికి పరీక్షలుకూడ గలవు. క్లీవ్లండు(రాష్ట్ర) విశ్వకళాపరిషత్తులో ఒకతరగతివారందఱును మాండూక్యోపనిషత్తును జదువుచుండుటను జూచితిని. విద్యార్థులు వరుసపాటింపు లేక అక్కడక్కడ కూర్చుండిరి. అనంతరము తా ముపయోగించుకొనుటకై ప్రసంగములను టేపురికార్డు చేసికొనిరి. వారిప్రొఫెస్సరు డేవిడ్ మిల్లరు. ఆయన ఒకటిన్నరసంవత్సరకాలము భువనేశ్వరమున నుండెను. భారతీయుల యాశయము లాయనకెంతయు అభీష్టములు. ఆయన గడపునద్ది

ఇంచుమించు ఆధ్యాత్మిక జీవితమే. ఆయనకు భువనేశ్వరాశ్రమమందలి యొకస్వామితోడి సాహచర్య ముండినది.

భారతీయుల ఆశయములను సన్నిహితరీతి గ్రహించినట్టి అటువంటివా రున్నారు. వారు పరమసంతోషముతో భారతదేశసందేశమును విద్యార్థుల కందజేయుచున్నారు. ఈ పాఠము లలో విద్యార్థులకు గాఢమైనఆసక్తియున్నది. కాని వారికి మంచిఉపాధ్యాయులు దొరక కుండుట తఱచు కానవచ్చుచున్నది ఉపని షత్తులనుగూర్చియు వేదాంతమునుగూర్చియు సారహీనములయిన ఆశయాలు విద్యార్థుల కందజేయబడుచుండుటను అప్పుడప్పుడు గుర్తించితిని. ఇందులకు కారణము వరిష్ఠులైన యుపా ధ్యాయులు వారికి లేకపోవుటే అయినప్పటికిని, భారతీయుల ఆశయాలు ముఖ్యముగా వేదాంతము వారి కందుబాటైన తావులందెల్ల అందు వారి కత్యంతాసక్తి గల్గుచున్నది.

ప్రశ్న — ఏకాగ్ర వేదాంతసాధనలకు అమెరికను ప్రజానీకమున పరిసరము లనుకూల ములుగ నుండునా? పాశ్చాత్యదేశాలలో వేదాంతవిహితసన్న్యాస మభివృద్ధిగాంచుట కవకాశము లేపాటి యుండును?

జవాబు—మానవుని పారమార్థికజీవిత విధానమును తెలిసికొనవలె నని, అట్టి జీవితము గడపుట కవకాశములు గలుగవలయు నని, కోరిక అచట ప్రజలలో ప్రస్తుత మెంతో ఉన్నది. ఏకాంతధ్యాన గోష్ఠికి ఏర్పాటులు చేసినచో ప్రజలు వచ్చి మూగుదురు. షికాగో వేదాంతసొసైటివారు పొరుగున ఉన్న మిచిగనురాష్ట్రములో ఎనుబదియకరాల నేల కొందుమని తెలుపుచుచేసినప్పుడు ఈసముత్సాహము ప్రత్యక్షముగ గననైనది. ఆనేల ఉన్న ఊరుకు గాంజీసు అని పేరు, భావగర్భమైన పేరు! ఆయూరులో ఒకమఠమును ఆధ్యాత్మిక విశ్రాంతికేంద్రమును నెలకొల్పు ప్రణాళిక ప్రకటింపబడినప్పుడు, ప్రజల ఆసక్తి పొంగెక్కినది. 1969-వ సంవత్సరము జూలై ౨౦-వ తేదినాడు అందుకు శంకుస్థాపనము జరిగినప్పుడు నూర్లకొలదిగా ప్రజలు ఆసమావేశములో పాల్గొనిరి. 'కాలమాజూ' 'పశ్చిమమిచిగను' విశ్వవిద్యాలయములనుండి ప్రొఫెస్సర్లు వచ్చిరి. తమకు ముప్పదిమైళ్ళ దూరమున ఇట్టిచక్కని యాధ్యాత్మిక విశ్రాంతికేంద్ర మేర్పడుచున్నందుకును తమవిద్యార్థులును ఉపాధ్యాయులును అందు పాల్గొనగలందులకును తమ కెంతో సంతోషముగ నున్నదని వారు తెలిపిరి.

అవకాశ మున్నదని వారికి తెలియవచ్చినచో వారు—ముఖ్యముగా మానవు నాధ్యాత్మికజీవితము నవగాహనచేసికొన్నవారు-వచ్చి కలియుదురు. ఆధ్యాత్మికవిషయకోపన్యాసము జరిగినచో శ్రోతలగుంపు పుష్కలముగా ప్రోగగును. హిందువుల క్రతుకలాపములందు గల శిల్పమునైతము వారి మనసుల కెక్కినది. అది వారి కెంతో ఆసక్తి గొలుపుచున్నది. ఉపాధ్యాయులకు భారతీయసంస్కృతిని కర్మకలాపాదికమును నేర్పి తర్ఫీదుచేయవలె ననుట గూడ సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వమువారి ప్రణాళికలలో కలదు. కొందఱుపాధ్యాయులకు హిందూక్రతుకలాపాలను చేసి చూపుటకై నేనును శ్రీభాష్యానందస్వామియు పోయియుంటిమి. హిందు కర్మకలాపాలలోని వివిధసూక్ష్మాలను తెలిసికోవలయు నని కోరుచు వా రెంతగనో సంతోషించిరి. ఇది కేవలము విదేశాచారముల ననుష్ఠింత మను కోరికకాదు, ఆధ్యాత్మికాంశములో పాల్గొనవలె నను కోరికయే.

# అరుదైన వరములు మూడు

## శ్రీ నిర్వాణానందస్వామి

మనజీవితములో అరుదైన మూడువరములనగా నేవై యుండునా యని మనలో మనము వితర్కించుకొనినచో, మనకు ఆనందము నిచ్చును. మనలో నెవరిచుట్టుకు వారికి పట్టిన యితరములగు ననేకవిషయముల వైపునకు మనస్సు పోవును. ఒకరు ప్రేమయనియు మఱియొకరు శాంతియనియు ఈవిధముగా నెన్నియైన చెప్పుదుము. కాని శ్రీ శంకరాచార్యుల వారు ఈవిషయములో చెప్పినది కేవలము నిశ్చయముగా ఆధ్యాత్మికవిషయమై యున్నది. మొదటివరము మానవజన్మ – రెండవవరము – మోక్షము పొందవలయు ననెడి తీవ్రమైన కోరిక – మూడవది – సద్గురువును పొందుట. ఈమూడును మిక్కిలి అరుదైన వరములని ఆయన చెప్పెను. వానిని ఒకదానితరువాత నొకదానినిగా పరిశీలించి చూతము.

మానవుని స్థితిని, ఉనికిని, మనలో చాల మంది ఒప్పుకొందురు. మన మిచ్చట శరీరము, ప్రాణము, మనస్సు, హృదయములను పొంది యున్నామే గాని వానినిగుఱించి విశేషముగా ఆలోచింపము. ఆలోచించి చూతుమేని ఈ ప్రపంచములోనికి మనము వచ్చి చేయున దేదియు లేదనెడి నిశ్చితాభిప్రాయమునకు వత్తుము. దైవము మనల నిచ్చటకు తెచ్చెను. అయినను మనగ్రంథములలో మానవునిపుట్టుక ఆకస్మికమైన సంఘటనగా పరిగణింపబడ లేదు. అది పూర్తిగా నొకపనికై యేర్పడి, ఒకలక్ష్యము ఒకఉద్దేశముకలదై యున్నది. మానవుని జన్మ ఆత్మను సాక్షాత్కరించుకొనుట కేర్పడినదనియు ఆత్మభయరహితము ధీరము అనియు, వేదాంతము బోధించుచున్నది. ఎన్నిజీవరాసు లున్నవో, ఆలోచింపుము. భూమిపైన ఎంత మంది మానవు లున్నారో ఊహింపుము. వారందఱు ఒక్క-విశ్వవ్యాప్తమైన ఆత్మయొక్క-వివిధరూపములు. ఒకానొకస్పష్టమైన పనిని నిర్వహించుటకు భూమిపైకి వత్తుము. మనము మానవమాత్రుల మగుట చేత, మాయవలన, మనము ఆత్మలమని గ్రహింపజాలము, ఆమర్మమును మనము ఆలోచనలోనికి తీసికొనక విడిచి పెట్టుదుము. అది యేమై యుండు నని అడుగ వచ్చును. మనము మనజీవితములో పొందుచున్న ఆనందానుభవమునకును ప్రాపంచిక ప్రత్యక్షవిషయములకును వెనుక మఱొకతత్త్వ ముండునా? మనము మానవమాత్రులమే అగుచో, జీవితానుభవములను పొందుచును, జీవితసుఖము ననుభవించుచును, దాని ఈతి బాధలను భరించుచును, అందలి గుణపాఠమును నేర్చుకొనుచును, మనజీవితమును సార్థకము చేసికొందుము కాని దూరదృష్టి కలిగియున్నటువంటి మనజీవితముయొక్క- తత్త్వజ్ఞానమున్నదే- అది, అట్టిజీవితానుభవములకు, బాధలకు వెనుక మఱొకతత్త్వ మున్నటుల చెప్పను. అందుచేతనే, మానవజన్మ అరుదైనదిగా చెప్పబడెను.

అరుదా!! సంతాననిరోధము పూనుకొనవలసిన స్థితిపట్టునంతటి దారుణమైన పెరుగుదల జనాభాలో కనిపించుచుండగా అరుదెట్లయ్యె నని యనుకొందువు. మానవునిజన్మ మనప్రాపంచిక జీవితమువలన పొందెడి కష్టసుఖముల ద్వారా–వానికావల నున్నటువంటి, పరతత్త్వమును సాక్షాత్కరించుకొనుటకై ఉద్దేశింపబడిన అత్యాశ్చర్యకరమైన అవకాశము కూడనై యున్నది. జీవితము పూర్తిగా కష్టమైనదియు కాదు. పూర్తిగా సౌఖ్యప్రదమైన

దియు కాదు-ఆరెండునుకూడనై యున్నది. దాని వెనుక తట్టున నున్నదాని ననుభవించుటకై ద్వంద్వములను మనము ముఖ్యముగా, ముందుగా పొందవలసియున్నది. ఆవలనున్న దే-అదే - మన మెవరమై యుంటిమో తెలిసికొనుట-ఇది గొప్పదైన మానవజీవితములో శ్రేష్ఠమైన ప్రధానోద్దేశ్యముగా నున్నది. ఈకారణముచేతనే మానవజన్మ లభించుట అరుదని చెప్పబడినది.

సత్యమును తెలిసికొనుట యనగా తన ఆత్మను తాను తెలిసికొనుట, తనబంధమునుండి తాను విముక్తుడగుట ఇందుకైన కోరిక యెంతయో సహజమైనది. ప్రతిజీవితపరిముఖమున మన మట్టిబంధవిమోచనము కోరుదుము. మనము మానవులము గనుకనే— మనము స్వాతంత్ర్యమును కోరుదుము, మన శక్తిని ప్రదర్శింప కోరుదుము. కాని బంధములో పడిపోవుటకు ఒప్పుకొనము. మన స్వాతంత్ర్యము నెడల మనకుగల ప్రేమ అట్టిది. ఎంతోమంది స్కూలుపిల్లలు ఇంటిలోనే పడియుండి ఎల్లపుడు తల్లిదండ్రులు చెప్పిన పనులుమాత్రమే చేయుట కిష్టపడకయు, కళాశాలలకు పోయి, తమ రెక్కలు తాము స్వేచ్ఛగా విప్పుకొని ఆటపాటలలో విహరించుట కిష్టపడెదరు. అదికూడ స్వాతంత్ర్యము నెడల వారికిగల ప్రేమయే అని అనుచున్నాను. అట్టి స్వాతంత్ర్యమును, వ్యక్తిగతజీవనములో-కుటుంబజీవనములో-సాంఘికజీవనములో- దేశస్వాతంత్ర్యముకొఱకైన జీవితములో పొందుటకు మన మపేక్షింతుము. ఇట్టి మనలోని తంమును పొందుటకొఱకైన ప్రేమ యనునది - దాని కదేకాక - మఱొకగొప్ప ప్రేమతో మిళితమై యున్నది. మానవుని జీవిత ప్రేమలో అన్నిప్రేమలు కలిసిపోయి యున్నచో, అది, సత్యమును ప్రేమించుట-మనలను గుఱించిన జ్ఞానమును ప్రేమించుట-మనఉత్పత్తి మూలమును ప్రేమించుట-అనువానితో అది మిళితమై యున్నది-జీవస్వాతంత్ర్యమును రెండవవరముగా శ్రీశంకరాచార్యులవారు ప్రతిపాదించినపుడు, ఎట్టితరహాకు చెందిన స్వాతంత్ర్యమును ఉద్దేశించెను? వ్యక్తిగతస్వాతంత్ర్యమా? రాజకీయ స్వాతంత్ర్యమా? ఆర్థికస్వాతంత్ర్యమా? అది యేదియును కాదు-ఆధ్యాత్మికస్వాతంత్ర్యమునే ఆయన ఉద్దేశించెను. అనగా నేమి? ఈప్రశ్న అనేకభాగములతోగూడిన తత్త్వశాస్త్రము నకు దారితీయును. దేహమే తానని అనుకొనుచున్నంతవఱకు జీవుడు బంధనములో నున్నాడనుటే తత్త్వశాస్త్రపు ప్రధానమైన అభిప్రాయము. పుట్టుకలోనే జీవన్ముక్తులై యుండి అవతారమూర్తిగా అవతరించెనని అనినచో చెప్పలేము గాని (వారికికూడ బాధలు తప్పవనియే చెప్పుచున్నారు.) సాధారణముగా, బంధనము ఒప్పుకొనక తప్పదు. మనము బద్ధులముగనే పుట్టితిమి. ఏలనగా-అట్టిపరిస్థితులలో మనము మన స్వాతంత్ర్యమునుగూర్చి ఆలోచింపలేము. మనము ఆత్మలము అనుకోలేము. దేహముల మనుకొనుటచేత బంధింపబడితిమి. సృష్టివలన - సృష్టిశాసనమువలన, సృష్ట్యధికారమువలన బంధనమే కాకుండ పైగా, మన మనస్సువలన, దాని దుష్టస్వభావమువలన బంధన. నిన్ను నీవు తర్కించి, విభజించి చూచుకొనిన పక్షము నీవు సర్వస్వతంత్రుడవుగా తెలిసికోగలవు. నీ పశుబుద్ధివలన, నీ మోహమువలన, నీ కోరికలవలన-ఎల్లపుడును నీవు వానికి లొంగిపోయి, వానిఆజ్ఞకు లోబడిపోవుచున్నావు. నీమనస్సు నిన్ను అన్నివైపులకు ఈడ్చివేయుచున్నది. నీమనస్సు నిన్ను మఱొక

వైపుకు లాగుకొనిపోవుచున్నందున, నీవు విధాయకముగా చేయవలసినదానిని చేయలేకున్నావు. ఇది స్వాతంత్ర్యమనిపించుకోదు. కాని స్వాతంత్ర్యమును నీవు బడయగలవు. అదే ఆత్మకు గమ్యస్థానము.

అయినను, బంధవిముక్తి నీకు కావలయునన్నచో, అట్టికోరిక నీకు ముఖ్యముగా నుండవలయును. పరిణామవాదమును, దాని అభిప్రాయమును వేదాంతము బోధించి చెప్పును. మనము ధరించిన యీ స్థూలశరీరముచేతను, మనస్సుచేతను, బుద్ధిచేతను, పరిపూర్ణమైన మానవులముగా మనము చేయబడలేదు. ఇంకను ఆధ్యాత్మికపరిపూర్ణత కోరవలసియున్నది. అదియే సత్యమును తెలియగోరుట, అదియే దైవమును పొందగోరుట-ఈభూప్రపంచము మన కియ్యగలిగినదానికంటె విలక్షణమైన మఱియొకదానిని కోరుటయే, అది. ఇట్టి బంధవిముక్తికి కావలయునంతటి కోరిక కలుగుట అరుదు అని చెప్పబడెను. ఎక్కువమంది పెద్దలందఱును, ఆధ్యాత్మిక శ్రేణిలో అట్టి కోరికకు చుఱుకు పుట్టింపలేనంతటి క్రింది మెట్టున మాత్రమే ప్రాకులాడుచున్నారు. దానివలత్రాళ్లలో చిక్కుపడిపోయి మనమింకను ప్రపంచముతో సంతృప్తిపడుచున్నాము. దానినే తక్కువ డిగ్రీలోని ఆధ్యాత్మికాభివృద్ధి యని అనెదరు. మనము బుద్ధిహీనుల మనియు, అజ్ఞానుల మనియు, భ్రాంతిలోపడి కొట్టుకొనుచున్నా మనియు బుద్ధిమంతులు మనలను ఇంకను ఏమేమో అనుచున్నారు. మన అష్టైశ్వర్యములు భూమిమీదనే ఉన్నట్లుగా భ్రమించి, అజ్ఞానముచే దానివెనుక నేమియు లేనట్టుగా భావించి మనము ప్రాపంచిక బద్ధుల మనియు, దాని మోహములో పడిపోయినామనియు, బంధింపబడినామనియు పెద్దలనెడి ఇటువంటి దుర్భరములైన మాటలను భరించుటకు మన కెంతయో నమ్రత, వినయము ఉండవలయును. అట్టి అజ్ఞానముచే బంధింపబడి, భ్రాంతిలో పడి కొట్టుకొనుచుండునంతకాలము దైవమును పొందవలయుననెడి కోరిక ఎన్నటికిని స్ఫురింపదు. మతసంబంధమైన సాధనలవలన, యథార్థస్థితిని పొందుట, లేక దైవమును పొందుట యనునది, మానవమాత్రునకు స్వాభావికమైన మార్గము కాదు. అది దైవమును పొందుటకు యోగ్యత కలిగిన మార్గముగా పాటింపబడలేదు. మన దేశములో మన దృక్పథము యావత్తు దైవమును పొందులే అయియుండియు, ప్రాపంచికజ్ఞానము దాని సహజమైన ఆచారముగా మాఱిపోయినది. భగవద్గీతలో ''వేలకొలదిమానవులలో ఎవడో ఒక్కడుమాత్రమే అరుదుగా పరిపూర్ణస్థితిని పొందుటకు ఉపక్రమించును...'' అని చెప్పబడెను. కాబట్టి దైవమును పొందు కోరిక కలిగియుండుట అను రెండవవరము నిశ్చయముగా అరుదైనది. మానవజన్మ లభించుటే అరుదు. లభించెనా బంధవిముక్తికి పాటుపడుట అరుదు.

ఈ రెండు అరుదైన వరము లేవైయుండెనో తెలిసికోలేనపుడు, మూడవవరము, సద్గురు సహవాసము అనుమాటకు అర్థమే లేకపోవును. మానవమాత్రులైనవారు, మానవులనే మార్గదర్శకులుగా ఉదాహరణగా తీసికొనుట అవసరము. మనకంటె ముందుగా మానవమాత్రులు, జీవన్ముక్తులైనవారు కల రని ఎఱిగియుండక పోయినపక్షమున మనము దైవమును పొందవలయునని ఆశపడలేము. శ్రీరామకృష్ణపరమహంస, బుద్ధుడు, క్రీస్తువంటి మహానుభావులందఱును జీవన్ముక్తులు, ప్రాపం

చిక గురువులు. మనము మానవమాత్రులము. అటువంటి జీవన్ముక్తులు లభించినట్లయిన మానవజీవితములో మనము మంచిఘట్టములో ప్రవేశించినా మన్న మాట. అటువంటి గురుని రక్షణక్రిందికి నీవు వచ్చిన పిమ్మట, ఆత్మ ప్రయాణము ముందుకు సాగుటకు ప్రారంభించును. శిష్యుని ఆత్మ యుని కిని, తెలిసికొనునట్లుగా గురువు చేయును. మానవజీవితపు విలువను గుర్తించు నట్లుగా ఆయన సహాయపడును. ముక్తిపొందు కోరికకు చురుకు పుట్టించును. శ్రీరామకృష్ణ పరమహంస తన్ను చదువురానివానినిగా చెప్పు కొనుచుండును. కాని నిజముగా చదువురాని వాడు కాడు. ఐహికవిద్యయందు కుతూహలము లేక పోవచ్చును. ఏ స్కూలులోను చదువు కొనియుండలేదు. దేవునియెడల ఆయనకు గల ప్రేమయే, ఆయన సమస్తము తెలిసికొను నట్లుగా జేసెను. సర్వజ్ఞుడాయెను. ఆయన జీవితములో దేవుని పొందవలయుననెడి కోరిక, అతని హృదయములో ఒక అగ్నిజ్వాలయై వెల్లువికెను. తానెవరో తెలిసికొని తద్ద్వారా బ్రహ్మజ్ఞానము పొందెను. అటువంటి మహాను భావుని కనుగొన గలుగుట అరుదైనవిషయము ఏలనగా ద్రాక్షతీగెకు గుత్తులుగుత్తులుగా ద్రాక్షపండ్లు పెరుగునట్లు గురువులు పెరగరు. రోడ్డుప్రక్కనుండు మునిసిపలు దీపపుస్తంభ ములవలె వారు తయారుచేయబడునట్టివారు కారు. మనదేశములో ప్రతిమతములోను, వేలకువేలు సాధువులు మతగురువులు గలరు.

వారు అదేవృత్తి కలవారుగా కొందఱును, నిజమైన గురువులుగా కొందఱును కలరు. నిజ మైన గురువులు అరుదుగా నుందురు. అట్టి వారిని నీవు కండ్లు విప్పుకొని చూచి గుర్తుపట్ట వలెను. తమకు తామే నియమించుకొనిన రెండవరకపుగురువులు ప్రపంచములో అనే కులు కలరు. అట్టివారు మనలను దైవసన్నిధికి గొనిపోజాలరు; సరికదా, మనలను తప్పుదారికి మళ్లించెదరు. ఎందుచేతననగా బంధములో పడియున్న గురువు బంధములో నున్న శిష్యుని తరింపజేయలేడు. గ్రుడ్డివానికి గ్రుడ్డివాడు దారి చూపునట్లే యుండును.

మూడువరములు కూడ నిశ్చయముగా అరుదైనవే. దేవుని కరుణచేతనే అవి పొందబడ వలయును. (1) మానవజన్మ (2) బంధవిముక్తి కైన కోరిక (3) సద్గురుసహవాసము. ఈ మూటిని నీవు పొందియున్నట్లుగా నీకు తోచిన యెడల నీవు భూమిపైన గొప్పఅదృష్టవంతు డవుగా భావించుకొనవచ్చును. ఆ మూటిని పొందినవారందఱు ఎల్లపుడును ఆధ్యాత్మిక ముగా అభివృద్ధిని గాంచుట లేదు. ఎందుచేత? పరిపూర్ణతను సిద్ధింపజేయు పర్వతమును అధి రోహించుట అంతచులకనైన పని కాదు. అట్టి మహనీయుని నీవు పొందగలిగినను నిన్ను నీవు తరింపజేసికొనుభారము నీపైనే యున్నది. ఆయన తటస్థముగా నుండి నీ అభివృద్ధికి మార్గము చూపుచు, ఆటంకములను అప్పు డప్పుడు ఒత్తిగించుచుండును. నీజన్మ పవిత్ర మైనదని నీవు గుర్తించుకో గలిగినను, యథార్థ మైన జీవస్వాతంత్ర్యముకొఱకై నీహృదయము పరితపించునెడలను దైవకారుణ్యమువలన నీకు లభ్యమైన యీ మూడు భాగ్యములను నీవు వృథాగా జార విడువకుము. ఒక అడుగు ముందునకు వేసి భ్రాంతిని, అజ్ఞానమును, భవ బంధమును త్రెంపుకొనుత్యాగము చేయుము.

# వార్తలు - విశేషాలు

# శ్రీరామకృష్ణమఠం, మద్రాసు-4

## శ్రీ శంకరజయంతి.

శ్రీ శంకరజయంతి తిథిపూజ 29-4-71 వ తేదినాడు. అందుకు సంబంధించిన పౌరమహాసభ 2-5-71 వ తేది భానువారంనాడు వివేకానంద హాలులో సమావేశమైనది.

భజగోవిందమును మంత్రపుష్పానుసంధానమును ముగిసినతర్వాత మఠాధ్యక్షులు శ్రీమత్కైలాసానందస్వాములు సదస్యులకు స్వాగతాశీస్సు లనుగ్రహిస్తూ ఈలాగు వాక్రుచ్చారు:—శ్రీశంకరాచార్యులమాహాత్మ్యము ఆయన సందేశముద్రయూ భారతదేశమందంతటా కనవచ్చు. విశ్వమానవుల ఆశయాలపై శ్రీశంకరప్రభావాన్ని గుర్తించవచ్చు. తన ముప్పైరెండేండ్ల అల్పజీవితంలో ఆయన సాధించింది మఱొకరికైతే పెక్కుశతాబ్దాలకైనా సాధ్యమయ్యేది కాదు. మన హిందూసిద్ధాంతానికి ప్రాణంపోసి తఱుగనిశక్తిని సమకూర్చింది ఆయనే:: అనంతరకాలాలవారికై ఆయన పెట్టిపోయిన అమూల్యవిజ్ఞానధనం సార్వకాలికం. ఇప్పటి భారతదేశాన్ని భావనలోకి తెచ్చుకోవాలంటే, ఈ కేరళీయబాలకుడు చేసిన ఘనకార్యాలను గుర్తించి తీరాలి. మనసులకు సులభంగా అందని అద్వైతప్రతిపాదనలోనే కాక దైనందిన మాతృపాసనలో కూడ శ్రీశంకరులప్రభావం స్పష్టం. అవతారపురుషుడు కానిదే, ఆయన సాధించినపనులను సాధించటం దుర్ఘటం. మండనమిశ్రప్రముఖు లగు కొమ్ములు తిరిగిన పండితులు ఈ ఆత్మజ్ఞానఘనుని శ్రీచరణము లాశ్రయించారు. సన్న్యాసులు సంఘంలో ముఖ్యాంగభూతులని శ్రీశంకరులు నిరూపించారు. ఆయన సడలని నిష్ఠకలవాడు, సమన్వయపరుడైనప్పటికీ ప్రమాణముల అతిక్రమింపడు. అట్టి మహనీయుని జయంతి మహోత్సవం జగన్మంగళదాయకం.''

తర్వాత విశ్వవిద్యాలయ సంస్కృత శాఖాధ్యక్షులైన డాక్టరు సి. ఎ. వేంకటేశ్వరం ఎమ్. ఏ., పి. హెచ్‌డి. అనువారు శ్రీశంకరులజీవితోపదేశాలనుగూర్చి విపులంగా ఉపన్యసించారు. వారు మొదట కొంతసేపు సంస్కృతభాషలో ప్రసంగించి పిమ్మట ఉపన్యాసాన్ని ఇంగ్లభాషలో సాగించారు. శ్రీశంకరుల జీవితంలో ముఖ్యసంభవాలను పేర్కొన్నారు శ్రీశంకరుల వ్యాఖ్యానాలచే తేటతెల్లమైన వేదాంతశాస్త్రసత్యాలను ప్రస్తుతించారు. శంకరులవంటివారు మానవతతికి పారమార్థిక వైద్యులు. వారికి మానవులు ఎంతగనో ఋణపడి ఉన్నారు. ఆఅప్పు తీర్చుకోలేం. అంతటి మహాత్ములు తాము జన్మించిన ప్రాంతానికి మాత్రమే చెందినవారుగా ఉండరు. 'వసుధైవ కుటుంబకమ్' అన్నట్లుగా ప్రపంచమంతా వారి వర్గమే, వారి కుటుంబమే. తపోజ్ఞాన - యజ్ఞదానాలు వారిసొమ్ము. పొట్టకూటిచదువుకంటె ఎంతో విలక్షణమైన ఆత్మవిద్యను వారు కఱపారు, లమునకు ముఖ్యాంగం వినయమే అని దానిని పెంపొందింపగలది ఆత్మసంయమమే అని—వారు బోధించారు. శ్రీశంకరులజీవితం చదువరులకు అద్భుతావహమైనది, ప్రతిసంభవానికి మహోత్సాహదాయకమైన ప్రగాఢత ఉంది. ఆయనప్రతిభయు నైపుణియు నిర్మాణాత్మకములు. దేనిలో ఐనా, ఆయనశక్తి అమోఘం. మహోన్నతాధ్యాత్మికానుభవాలను అవలీలగా ప్రతిపాదిస్తాడు. ఆత్మోద్ధారణోద్యమంలో ప్రారంభదశలో ఉండువానికి సైతం అందుబాటయ్యేట్లు ఆస్వాద్యమయ్యే

రీతిగా స్తోత్రాల అమృతం వర్షించాడు. భారత దేశాధ్యాత్మిక చరిత్రలో శ్రీ శంకరులస్థానం అమరము సార్వకాలికము.''

శ్రీ కె. చంద్రశేఖరంగారి వందనోపచారంతో నాటి సభాకార్యక్రమం ముగిసింది.

## శ్రీరామానుజ జయంతి

తిథిపూజ 29-4-1971 వ తేదినాడు. అందుకై పౌరసభ సమావేశమైనది 9-5-1971 భానువారం సాయంకాలం 6 గంటలకు.

ప్రార్థనగేయం మంత్రపుష్పం ముగిసింతరువాత శ్రీరామకృష్ణవిజయ (తమిళ) పత్రికా సంపాదకులయిన శ్రీమత్పరమాత్మానందస్వామి సభాధ్యక్ష్యం వహించి తొలిపలుకులలో ఈలాగు వక్కాణించారు—''ఈలాంటి ఆత్మ విద్యాగురువులజయంతిమహోత్సవాలను తప్పక జరపాలి. మన దేశీయాధ్యాత్మికవిజ్ఞానసంపత్సమృద్ధిని మన కెఱుకపఱచినవారు వారు. వారి ఆదర్శజీవితాలను మననం చేయడం మన సాధనోద్యమాలకు త్తేజకరం. ఋషులకు ఆచార్యులకు మోక్షమార్గాన్ని కనుగొన్నవారికి భారతదేశం పుట్టినిల్లు, వారధిగమించిన ఆధ్యాత్మికమహోన్నత శిఖరాలు లోకులకు ఆశ్చర్యకరములై ఉన్నాయి. భారతీయాధ్యాత్మికాన్వేషకులు ఆవిషయమును ఆమూలాగ్రంగా విభజించారు. వారి పురోగమనపు గుర్తులు చరిత్రలో స్ఫుటతరంగా కనిపిస్తున్నాయి. పరతత్త్వం ఒక్కటే అని, దాని ప్రాపించు దారులు పెక్కులు అని—ఆధ్యాత్మికవిద్యా సారాంశం. వేదాంతశాస్త్రాలలో ద్వైతము విశిష్టాద్వైతము అద్వైతము అను సిద్ధాంతత్రయమును లోకానికి ప్రదర్శించిన వారు భారతీయులు. శ్రీశంకరులయు శ్రీరామానుజులయు జయంతితిథి ఒక్కటే అగుటలో ఎంతో అంతరార్థం ఉంది. అది కేవలం యాదృచ్ఛికసంభవం కాదు. శ్రీరామానుజుల వారు గొప్పవెలుగు, యుగపురుషులు, లోకోద్ధారకులు, వైష్ణవాచార్యహారములో నాయక రత్నస్థానీయులు వారి నూటయిరవై సంవత్సరాల జీవితం అధీతిబోధాచరణప్రచారాలతో నిండిఉన్నది.''

తర్వాత శ్రీ సి. ఎస్. పార్థసారథి బి. ఏ., బి. ఎల్. గారు శ్రీరామానుజులవారి జీవితచరిత్రమును ఉపదేశాలనుగూర్చి పాండితీమండితంగా ఉపన్యసించారు. ''మనదేశంలో మహాపురుషులు ఎందరైనా ఉన్నారు కాని, జాన్సనును గూర్చి బాస్వెల్లు వ్రాసిపెట్టినట్లుగా, వారిని గుఱించిన విశేషాలను వ్రాసిపెట్టినవారు లేరు. ఐనా అనుశ్రుతంగా చెప్పుకొనబడుచున్న క్రమంలో శ్రీరామానుజులవారి జీవితాన్ని—శిష్యత్వము. శ్రీవైష్ణవప్రావణ్యము, ఆచార్యకమునకు సలసినవాని నెల్ల అధికరించడం, జీవిత లక్ష్యాలను సిద్ధింపజేయడం అనే నాల్గు శీర్షికల క్రింద అమర్చవచ్చు.'' అన్నారు. వారి జీవితంలోని ప్రతిసంఘటనకు గల ప్రాముఖ్యాన్ని వివరించారు. అప్పటిచారిత్రకపరిస్థితులను తెలిపారు. సమకాలిక మహాపురుషులతో శ్రీరామానుజులవారికి సమకూడిన సమావేశాలను వారి పట్ల అపారభగవదనుగ్రహమును విశదీకరించారు. శ్రీశంకర శ్రీరామానుజులసిద్ధాంత విభేదాలను ప్రదర్శించారు.

డాక్టరు ఎస్. వేణుగోపాలంగారి వందనోపచారంతో సభాకార్యం ముగిసింది.

## అశ్రుతర్పణం

శ్రీ తేజసానందస్వాములవారు 11-5-1971వ తేదినాడు తమ 75-వ ఏట, కల్కత్తాలో సేవాప్రతిష్ఠాన మనెడి రామకృష్ణమిషను ఆస్పత్రిలో మహాసమాధి నొందారు. వారు చాలకాలంగా

ప్రేగులలో రక్తస్స్రావంచే బాధపడుతుండినారు. పూర్వాశ్రమంలో వారిపేరు ఖగేంద్రనాథ. ఢాకాజిల్లాలో హాపానియా గ్రామంలో 1896 లో జన్మించారు. ఢాకామాణిక్ గంజ్ స్కూలులో మెట్రిక్యులేషను, రాజాసాహి గవర్నమెంటుకాలేజిలో బి.ఏ., కల్కత్తా విశ్వవిద్యాలయంలో ఎమ్.ఏ., పరీక్షలలో అగ్రశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. 1919 లో వారు శ్రీ బ్రహ్మానందస్వాములయొద్ద మంత్ర దీక్ష పొందారు. భువనేశ్వరంలోను మాయావతిలోను సుదీర్ఘకాలం ఉండి రామకృష్ణ మిషను సేవాకార్యక్రమాలలో అన్వయిస్తూ వచ్చారు. ఢాకాలోను ఇరవైనాల్గుపరగణాలలోను రెండు స్కూళ్ళలో హెడ్మాస్టరుగా కొన్ని యేండ్లు ఉద్యోగం చేశారు. 1927 లో వారణాశిలోని రామకృష్ణాద్వైతాశ్రమానికి పోయి ఉండి శ్రీరామకృష్ణసంఘంలో చేరారు. శ్రీశివానంద స్వాముల యొద్దనుండి మొదట బ్రహ్మచర్య దీక్షను, నాలుగేండ్ల కనంతరం సన్న్యాసదీక్షను స్వీకరించారు, నాలుగేండ్లకాలం 'వేదాంత కేసరి'కి సంపాదకులుగా ఉండినారు. తర్వాత కొంతకాలం ఉత్తరకాశీలో స్వాధ్యాయతపశ్చర్యలలో గడపారు. 'కల్చరల్ హెరిటేజి' సంపుటాలను ప్రకటించటంలో శ్రీ మాధవానందస్వామికి సాయపడ్డారు. రెండేండ్లకాలం మాయావతిలో ప్రబుద్ధభారతపత్రికకు సంపాదకులుగా ఉండినారు, తర్వాత మరల కొంతకాలం తీర్థయాత్రలో హృషీకేశంవద్ద తపశ్చర్యలో గడిచింది. 1941 లో బేలూరు విద్యామందిరకళాశాలకు మొదటి ప్రిన్సిపాలయ్యారు. 1948లోపాట్నా రామకృష్ణాశ్రమానికి అధ్యక్షులయ్యారు. 1951 లో కాలేజికి మరలి వచ్చారు. శారదాపీఠాదిసంస్థల నిర్వాహకపరిషత్తులలో స్వామి సభ్యులుగా ఉండినారు. 1961లో రామకృష్ణమఠధర్మకర్తలలో ఒకరుగా అయ్యారు. శ్రీరామకృష్ణ – వివేకానంద – సోదరి నివేదితా– ప్రముఖులనుగూర్చి ఈయన వ్రాసిన గ్రంథాలు జనప్రీతిని విశేషంగా చూఱగొన్నాయి. తన చరమఘడియలు ఆయనకు స్పష్టంగా తెలిసి ఉండినవి. ఆయన నిర్యాణం ఈసంస్థకు తీరని నష్టం. ఆయనఆత్మకు శాంతి చేకూరుత!

# గ్రం పరిచయం

## మనవిజ్ఞానం

రచన: కూర్పు, శ్రీరంగుడు వేంకటరమణమూర్తి (పూభా)గారు ప్రాప్తిస్థానం: శోభా ప్రచురణలు, విజయనగరము-2, చిన్నసైజు, పుటలు 67, వెల రూ. 1-25.

తమమతమునకు సంబంధించిన ఆచారవ్యవహారములనుగూర్చి హిందువులు తప్పక తెలిసికోవలసిన ప్రాథమికవిషయముల తెలివిడి ఈ చిన్నపుస్తకంలో ఉన్నది. ఆపరిజ్ఞానం బొత్తిగా లేక శోచనీయస్థితిలో ఉన్న హిందూయువకులందఱూ ఈగ్రంథాన్ని తప్పక చదివి జిహ్వాంచలముల ధరించుట వారి కెంతయు శ్రేయోదాయకం.

## ఉపనిషద్వాణి-1

ఇది ఆర్షసాహితి (సనాతన ధర్మప్రచార సంస్థ) వారి 25-వ ప్రచురణం. ప్రాప్తిస్థానం 25-7-18 ఆమంచివారి వీధి, విజయనగరం 2, చిన్నసైజు పుటలు 14. కావలసినవారు 20

పైసలు తపాలాబిళ్లలు పంపి ఈ పుస్తకం ప్రతి ఒకటి పడయ వచ్చు.

విద్య పరావిద్య అపరావిద్య అని రెండు విధములు. ఐహికజీవితసుఖసంపాదకమైన విద్య అపరావిద్య, బ్రహ్మసాక్షాత్కారసాధకమైన విద్య పరావిద్య. ఉపనిషత్తులలో పదిలపడియున్న పరావిద్యకు సంబంధించిన కొన్ని విషయము లప్పుడప్పుడు 'ఉపనిషద్వాణి' అనుపేర ప్రచురింప నెంచిన వీరి ప్రచురణలలో ఇది మొదటిది. బ్రహ్మవిద్యావిశిష్టత, అవిద్యావిద్యలు, బంధమోక్షములు, శరీరము-శరీరి, అనాత్మ-ఆత్మ, బ్రహ్మ అను ఉపశీర్షికల క్రింద వాని సరళ సంక్షిప్త వివరణ ఇందున్నది. జిజ్ఞాసువుల కవశ్యపఠనీయము.

ప్రభాకర్.

## చందాదారులకు విజ్ఞప్తి

'శ్రీరామకృష్ణప్రభ' చరిత్రంలో ఇరవైయేడు సంవత్సరాలు గడిచాయి, ఇరవైయెనిమిదవ సంవత్సరం ప్రారంభమౌతున్నది. ఈ 1971-వ సంవత్సరము జూన్ నెల [విరోధికృజ్జ్యేష్ఠమాస] సంచికతో ఇరువదియేడవ సంపుటము ముగిసి, జూలై నెల (ఆషాఢమాస) సంచికతో ఇరువది యెనిమిదవ సంపుటం ప్రారంభమౌతున్నది. శ్రీశారదా శ్రీరామకృష్ణులయూ, శ్రీవివేకానందాదిప్రముఖశిష్యవరేణ్యులయు జీవితసందేశాలచేత ప్రఖ్యాతమూ వ్యాఖ్యాతమూ ఐన మన సనాతనధర్మవిజ్ఞానమును ఈ పత్రికద్వారా యావదాంధ్రమహాజనులకు ఇతోధికంగా అందజేసే సేవకు 'శ్రీరామకృష్ణప్రభ' తన్ను పునరంకితం చేసుకుంటున్నది. రచయితలయు చందాదారులయు సహకారం పూర్వాధికంగాను నిత్యప్రవర్ధమానంగాను లభిస్తుండగల దని విశ్వసిస్తున్నాం. ప్రతిచందాదారు మఱినలుగురు చందాదారులను చేర్పించడంద్వారా ఈపారమార్థికజ్ఞానయజ్ఞమును విజయవంతంగా చేయవలసిం దని, సాధనానుభవవిశారదులు తమ అనుభవవిశేషాలను సరళసలక్షణసారధురమధురవక్కాణంలో పొందుపఱచి ఈ పత్రికద్వారా జిజ్ఞాసువుల కందచేయవలసిం దని ప్రార్థిస్తున్నాము.

సంపాదకులు

# తూర్పుబంగాళంనుండి వస్తున్న లక్షలాది కాందిశీకులకు సాహాయ్య కార్యక్రమం

విపులమైన యీ సాహాయ్యకార్యక్రమాన్ని—విపత్తు ఆరంభమైననాటినుండి గుంపులుగా వస్తున్న కాందిశీకులకు రామకృష్ణమిషనువారు నిర్వహిస్తున్నారు. పని నానాటికి ఎక్కువవుతున్నది. ఐవీజూన్నూ, మనుష్యబలమున్నూ ఎక్కువ కావలసివస్తున్నది.

ఈ నివేదిక వ్రాసేనాటికి ఏడు కేంద్రాలలో ప్రతిదినం 64,400 ప్రజలకు సేవ సమకూర్చబడుతూ ఉంది. కేంద్రాలు—(1) దాకి (నాలుగుమకాములు) మేఘాలయపు పొలిమేర. (2) షెల్లా - మేఘాలయపు పొలిమేరలోనే. (3) కరీమ్‌గంజ్ (మూడుమకాములు), ఆస్సాములోని కచర్ జిల్లాలో. (4) మాణిక్‌గంజ్, జల్పైగురిజిల్లా, పశ్చిమబంగాళం. (6) జష్మైదూర్పురు, నాదియాజిల్లా, పశ్చిమబంగాళం. (7) గైఘట, 24 పర్గణాలజిల్లా, పశ్చిమబంగాళం.

సేవాకార్యవివరాలు - మొదట 1,05,121 ప్రజలకు అన్నం, అటుకులు, బెల్లపునీరు పంచిపెట్టబడ్డాయి. ప్రస్తుతం వంటసామగ్రి వస్త్రాలు దుప్పట్లు, పాలపొడి, పరికరాలు మందులు ప్రతిదినం అందజేయబడుతున్నాయి.

పంచిపెట్టబడ్డ వస్తువుల పరిమాణ వివరాలు :—బియ్యం - 448 క్వింటళ్లు, అట్ట - 175 క్వింటళ్లు, పప్పు - 159 క్వింటళ్లు, ఉప్పు - 16 క్వింటళ్లు, మిరపకాయలు - 10 కిలోగ్రాములు, ఉర్లగడ్డ - 44 క్వింటళ్లు, అటుకులు - 11 క్వింటళ్లు.

వస్త్రాలు :—దోవతులు - 1900 చాపులు, చీరలు-1900, దుప్పట్లు-1350, ఉన్ని బ్లాంకెట్లు-98, స్వెటర్లు-228, వంటపరికరాలు, కుండలు, ప్లేట్లు, గరిటెలు వగైరాలు-291 ఉరుపులు.

పాలపొడి-6 క్వింటళ్లు, బార్లి-15 డబ్బాలు, 500 మందికి వైద్యసాహాయ్యం అందజేయబడింది.

## వి జ్ఞ ప్తి

మిషనువారు తూర్పుబంగాళప్రజలకై ఈ సాహాయ్యకార్యభారాన్ని చక్కగా నిర్వహించగలందులకు ఉదారమహాజనులను వస్తురూపంగాగాని, ధనరూపంగాగాని ధారాళముగా విరాళములు ఈయవలసినదని ప్రార్థిస్తున్నాం.

విరాళాలాను ఈ క్రింది విలాసాలలో దేనికైనా అందజేయవచ్చు :—

1. రామకృష్ణమిషను, బేలూరు మఠం పోస్టు, హౌరా, పశ్చిమబంగాళం.
2. అద్వైతాశ్రమం, 5 దేహిఎన్టాలీరోడ్డు, కల్కత్తా 14.
3. రామకృష్ణ మిషను, రామకృష్ణాశ్రమమార్గ, న్యూఢిల్లీ 55.
4. శ్రీరామకృష్ణమఠం, మైలాపూరు, మద్రాసు-4.
5. రామకృష్ణమిషను, ఖార్, బొంబాయి-52.

గంభీరానందస్వామి,
జెనరల్ సెక్రెటరి, రామకృష్ణమఠ మిషనులు,



# శ్రీరామకృష్ణ ప్రభ



## ఇరువది యేడవ సంపుటము

౧౯౭౦ జూలై సాధారణాషాఢము మొదలు ౧౯౭౧ జూన్ విరోధికృజ్జ్యేష్ఠము వఱకు

సంపాదకులు:

శ్రీ హీరానందస్వామి

శ్రీ నేలటూరి భక్తవత్సలము, ఎమ్.ఏ., బి.ఓ.ఎల్.




రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4.

సాలు చందా రూ. 5 విడి ప్రతి 50 పైసలు

# అకారాది విషయానుక్రమణిక

# శ్రీ రామకృష్ణ బోధామృతము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

పరిశోధితమగు 1121 మహోపదేశములతో, సంగ్రహ జీవితముతో నలరారుచున్నది.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధ గురువులు, లౌకికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు : వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, జీవుడు : దేవుడు, జ్ఞానము: భక్తి: కర్మము, బ్రహ్మతత్త్వము, సూక్తులు: నీతికథలు మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసిబిడ్డలకయిన నవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

...ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికి కాక, రెంటికీ సంబంధించిన సూత్రాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి...

—ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్వలమగు పంచమ ముద్రణము : వెల : అట్టబైండు : రూ. 4-50
క్యాలికో : రూ. 5-50

# శ్రీ రామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

రామకృష్ణదేవుని దివ్యోపదేశవాక్యము లాధారముగాగొని, వానిని విరివిపఱచి, మనోహరకథారూపముగను, సంభాషణరూపముగను అమర్చి, శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారి గారు తమిళభాషలో రచించిన జనాకర్షకగ్రంథము. దాని యనువాదాలు ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతి, హిందీభాషలలో నిప్పటికే అపారవ్యాప్తినొందినవి. ఆ గ్రంథమున కిది చక్కని ఆంధ్రీకరణము.

128 పుటలు వెల : రూ. 1-25

ప్రదేశు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

సంపాదకులు : శ్రీ హిరాణందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,

శ్రీ హిరాణందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౮ ౧౯౫౧ - జూలై : విరోధికృత్తు - ఆషాఢము సంచిక ౧

## విషయసూచిక

# విషయసూచిక

(1 వ పేజీ తరువాయి)



'అఖిలవిభు శరణొందుము, యీ క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౮ } ౧౯౭౧ - జూలై : : విరోధికృత్తు - ఆషాఢము { సంచిక ౧

శ్రీః

## వివేకచూడామణి

మూలము :
శ్రీ శంకర భగవత్పాదులు

వ్యాఖ్యాత :
అన్నమాచార్య

మనః ప్రసూతే విషయా నశేషాన్ స్థూలాత్మనా సూక్ష్మతయా చ భోక్తుః
శరీరవర్ణాశ్రమజాతిభేదాన్ గుణక్రియాహేతుఫలాని నిత్యమ్. 177

శరీరములు వర్ణములు ఆశ్రమములు జాతులు గుణములు క్రియలు కారణములు కార్యములు—వీని నన్నిటిని భోక్తయగు జీవునకై మనస్సు జాగ్రద్దశలో స్థూలరూపమునను స్వప్నదశలో సూక్ష్మరూపమునను సృజించుచుండును. ౧౭౭

అసఙ్గచిద్రూప మముం విమోహ్య దేహేన్ద్రియ ప్రాణగుణై ర్నిబధ్య
అహం మ మేతి భ్రమయ త్యజస్రం మన స్స్వకృత్యేషు ఫలోపభుక్తిషు. 178

అసంగుడును చిద్రూపుడు నగు జీవుని మోహింపజేసి, దేహేంద్రియప్రాణములం దహంకార మనెడి పాశముచేతను, దేహేంద్రియప్రాణగుణములందు మమకార మనెడి పాశము చేతను బంధించి, స్వకృత్యములందు ప్రవర్తింపజేయుచు, తత్ఫలముల ననుభవింపజేయుచు త్రిప్పుచుండునది మనస్సే. ౧౭౮

అధ్యాసయోగా త్పురుషస్య సంసృతి రధ్యాసబన్ధ స్త్వమునైవ కల్పితః
రజ స్తమోదోషవతో ఒవివేకినో జన్మాదిదుఃఖస్య నిదాన మేతత్. 179

ఆత్మకానివానియందు ఆత్మబుద్ధిరూప మగు అధ్యాస జనించుటే సంసృతికి కారణము. ఆయధ్యాసబంధమును కల్పించునది మనస్సే. రజస్తమోదోషములు గల యవివేకికి గలుగు జన్మాదిదుఃఖములకు ఆదికారణము మనస్సే. ౧౭౯

అతః ప్రాహు ర్మనో ఽవిద్యాం పణ్డితా స్తత్త్వదర్శినః
యేనైవ భ్రామ్యతే విశ్వం వాయునే వాభ్రమణ్డలమ్. 180

కావుననే తత్త్వదర్శులగు పండితులు 'మనస్సే అవిద్య' అనిరి. గాలి మబ్బుతుటుములకు త్రిప్పట కలిగించునట్లు విశ్వమునకు (జీవులకు) త్రిప్పట కూర్చునది మనస్సే. ౧౮౦

త న్మనశ్శోధనం కార్యం ప్రయత్నేన ముముక్షుణా
విశుద్ధే సతి చైతస్మి న్ముక్తిః కరఫలాయతే. 181

కావున మోక్షాభిలాష కలవాడు ప్రయత్నపూర్వకముగా మనస్సును శుభ్రపఱచుకోవలెను. మనశ్శుద్ధి కుదిరినవానికి మోక్షము అఱచేతిపండగును. ౧౮౧

మోక్షైకసక్త్యా విషయేషు రాగం నిర్మూల్య సన్న్యస్య చ సర్వకర్మ
సచ్ఛ్రద్ధయా య శ్శ్రవణాదినిష్ఠో రజస్స్వభావం స ధునోతి బుద్ధేః. 182

మోక్షమునందు మాత్రమే సక్తి గలిగి, విషయములందు రాగమును నిర్మూలించుకొని, సర్వకర్మలను సన్న్యసించి, పరిష్ఠమైన శ్రద్ధతో ఎవడు శ్రవణాదులందు నిష్ఠ నెరపునో, వాడు తన బుద్ధియం దుండిన రాజసికస్వభావమును దులిపివేసికొన్నవా డగుచున్నాడు. ౧౮౨

మనోమయో నాపి భవే త్పరాత్మా హ్యాద్యన్తవత్త్వా త్పరిణామిభావాత్
దుఃఖాత్మకత్వా ద్విషయత్వహేతో ర్ద్రష్టా హి దృశ్యాత్మతయా న దృష్టః. 183

మనోమయకోశముకూడ పరమాత్మ కాజాలదు. ఏలయన ఈమనోమయకోశమునకు ఆది యున్నది, అంత మున్నది, మార్పు లున్నవి. దుఃఖాత్మకత్వ మున్నది. ఆత్మచే చూడబడుచున్నది. దృశ్యము ద్రష్ట యగుట పొసగదు కదా. ౧౮౩

బుద్ధి ర్బుద్ధీన్ద్రియైః సార్ధం సవృత్తిః కర్తృలక్షణః
విజ్ఞానమయకోశ స్స్యా త్పుంస స్సంసారకారణమ్. 184

నిశ్చయాత్మకవృత్తియు కర్తృత్వలక్షణమును గల బుద్ధియు జ్ఞానేంద్రియములును కలిసి విజ్ఞానమయకోశ మగును. ఇదియు జీవునకు సంసారకారణమే. ౧౮౪

అనువ్రజచ్చిత్ప్రతిబిమ్బశక్తి ర్విజ్ఞానసంజ్ఞః ప్రకృతే ర్వికారః
జ్ఞానక్రియావా నహ మి త్యజస్రం దేహేన్ద్రియాదిష్వభిమన్యతే భృశమ్. 185

తనయందు చిద్వస్తువు ప్రతిబింబించుటచే భాసకత్వశక్తి గలదియు, మూలప్రకృతి యొక్క వికారమైనదియు, జ్ఞానమును క్రియలును గలదియు నగు ఈ విజ్ఞానమయకోశము దేహేంద్రియాదులందు సదా నేననెడి తాదాత్మ్యాభిమానము వహించుచున్నది. ౧౮౫

అనాదికాలో ఽయ మహం స్వభావో జీవ స్సమస్తవ్యవహారవోఢా
కరోతి కర్మాణ్యపి పూర్వవాసనః పుణ్యాన్యపుణ్యాని చ తత్ఫలాని. 186

భుఙ్క్తే విచిత్రాస్వపి యోనిషు వ్రజ న్నాయాతి నిర్యా త్యధ ఊర్ధ్వ మేషః
అస్యైవ విజ్ఞానమయస్య జాగ్రత్స్వప్నాద్యవస్థా స్సుఖదుఃఖభోగాః. 187

జీవునితో తాదాత్మ్యానుబంధము గల యీ విజ్ఞానమయకోశము అనాదికాలముగ నున్నది, ఇదే జీవుడు. సమస్త వ్యవహారముల నిర్వహించునదియు, పూర్వకర్మవాసనల ప్రేరణచే పుణ్యాపాపముల నొనర్చునదియు, వాని ఫలముల ననుభవించునదియు, వింతయోనులలో పుట్టువొందునదియు, ఊర్ధ్వాధోలోకములకు రాకపోకలు చేయునదియు, స్వప్నము, జాగరణము మున్నగు అవస్థలను సుఖదుఃఖములను అనుభవించునదియు ఈవిజ్ఞానమయకోశమే. ఆత్మకు, ఇవేవియు లేవనుట. ౧౮౬-౧౮౭

దేహాదినిష్ఠాశ్రమధర్మకర్మగుణాభిమాన స్సతతం మ మేతి
విజ్ఞానకోశో ఽయ మతిప్రకాశః ప్రకృష్టసాన్నిధ్య వశా త్పరాత్మనః
అతో భవ త్యేష ఉపాధి రస్య యదాత్మధీ స్సంసరతి భ్రమేణ. 188

చిద్రూపపరమాత్మ కత్యంతము సన్నిహితమైనందున అతిప్రకాశవంత మగు నీ విజ్ఞానమయకోశము దేహేంద్రియప్రాణాదులను తానుగా, ఆశ్రమ - ధర్మ - కర్మ - గుణములను తనవిగా భావించును. పరమాత్మ కిది ఉపాధి. ఈ యుపాధినే తానుగా భ్రమించు పరమాత్మ సంసారసుఖదుఃఖముల ననుభవించుచున్నది. ౧౮౮

యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృది స్ఫుర త్యయం జ్యోతిః
కూటస్థ స్స న్నాత్మా కర్తా భోక్తా భవ త్యుపాధిస్థః. 189

స్వయంప్రకాశమును విజ్ఞానమయము నగు పరమాత్మ ప్రాణములందు హృదయ పుండరీకమున ప్రకాశించుచుండును. కూటస్థమయ్యు అది ఉపాధివలన కర్తయు భోక్తయు నగుచున్నది. ౧౮౯

స్వయం పరిచ్ఛేద ముపేత్య బుద్ధే స్తాదాత్మ్యదోషేణ పరం మృషాత్మనః
సర్వాత్మక స్సన్నపి వీక్షతే స్వయం స్వతఃపృథక్త్వేన మృదో ఘటా నివ. 190

పరమాత్మ సర్వాత్మకమైనను తన కుపాధియు మిథ్యయు నగుబుద్ధితో తాదాత్మ్యము నొందినందున, అపరిచ్ఛిన్నమైన తాను పరిచ్ఛిన్నమైనట్లును, (కుండలు మట్టియేయైనను మట్టికంటె వేఱైనవిగా అజ్ఞులు భావించునట్లు) జగత్తు తానే అయినను, దానికంటె తాను వేఱైనట్లును భావించుచున్నది. ౧౯౦

ఉపాధిసమ్బన్ధవశా త్పరాత్మా హ్యుపాధిధర్మా ననుభాతి తద్గుణః
అయోవికారా నవికారి వహ్నివ త్సదైకరూపో ఽపి పరస్స్వభావాత్. 191

ఏకరూప మగు అగ్ని ఇనుముతో జేరినప్పుడు దాని రూపభేదములను తాను జెందునట్లు, ఏకరూప మగు పరమాత్మ ఉపాధిసంబంధవశమున దానిధర్మములను తన కారోపించుకొనుచున్నది. ౧౯౧

శిష్య ఉవాచ:

భ్రమేణా ప్యన్యథా వాస్తు జీవభావః పరాత్మనః,
తదుపాధే రనాదిత్వా, న్నానాదే ర్నాశ ఇష్యతే. 192

శిష్యు డడుగుచున్నాడు—

పరమాత్మకు జీవభావము భ్రమచేత గలిగిన గలుగనిండు, వేఱు దేనిచేతనైన గలిగిన గలుగనిండు. ఉపాధియు అనాదియే కదా. ఆదిలేనిదానికి అంతమును ఉండదు కదా. ౧౯౨

# శ్రీ రామకృష్ణనుతి

శ్రీ శారదాచరణ్

అఖిలసాధకానీక లక్ష్యంబయయ్యు సాధకుని చందమునను వేషంబు దాల్చి
కృప నఖిలమానవుల నుద్ధరించినట్టి గురుమహారాజునకు నిరంతరము జయము.

జ్ఞానకర్మభక్త్యాదిసర్వయోగములకు గమ్యుండు తానయ్యు లీల వెలుగ
కాళికాలయపూజారికరణినైన గురుమహారాజునకు నిరంతరము జయము.

చిత్రముగ దానె దైవమై చెలగుచుండి దివ్యమై వెలింగెడి దైవతృష్ణలోన
బడుచు నానందరస మాని మత్తుడైన గురుమహారాజునకు నిరంతరము జయము.

దైవదూషకులౌ నాస్తికావళులనుగూడ నవ్యాజకరుణ భక్తులుగ జేసి
పతితపావనబిరుద మంకితముగొన్న గురుమహారాజునకు నిరంతరము జయము. 4

శరణ మనినంత నపరాధశతములైన గణన చేయ కత్యంతసత్కరుణతోడ
దన కరాబ్జములం దిడుకొనెడునట్టి గురుమహారాజునకు నిరంతరము జయము. 5

శరణుగోరినవారియంతరమునందు నిలిచి వారినానందవార్నిధిని దేల్చి
దివ్యసత్ప్రేమలోన బంధించునట్టి గురుమహారాజునకు నిరంతరము జయము. 6

# శ్రీ రామకృష్ణగీత

## I

## శ్రీ వెలుదండ రామేశ్వరరావుగారు

శ్రీకరుండైన దేవుండు నీకు, నరుడ, పగటివేళ చుక్కలు కనబడనియట్లు
కానరాకున్న నజ్ఞానకారణమున నంతమాత్రనె లేడని యనకు మతని. 1

కామితార్థంబు లెల్లను కల్పతరువువలెనె దయసేయు దేవుండు కలడొకండు
దుర్లభంబగు నరజన్మ దొరకుకతన నతని గాంచుటె పరమలక్ష్యమ్ము మనకు. 2

ద్వివిధసంస్కారముల గొని విశ్వమందు బుట్టుచున్నాడు నరుడు, విముక్తి గూర్చు
విద్య, బంధహేతువగు నవిద్య, నీవ బుద్ధి విద్యవైపున మ్రొగ్గ ముక్తి గలుగు. 3

అంకెతరువాతిసున్నల కబ్బు విలువ, అట్లె దేవునితరువాత నగును జగతి.
కాన నొక్కడౌ దేవుని గనిన పిదప నీవు లెక్కగొను మనేకజీవజగతి. 4

ఆత్మలాభంబె ప్రథమంబు నందవలయు, దాని తరువాత గడియింపు ధనము నీవు
ఆత్మ గని మీద సంసారమందు మెలగ శాంతి కెప్పుడు భంగంబు జరుగ బోదు. 5

మొదట దైవదర్శనమును బొంది గాని మీ రుపన్యాససంఘసంస్కారకృతుల
నలుప నర్హులు; కాకున్న సంఖ్యలేని సున్నల విలువవలె మీకు సుఖము సున్న. 6

క్రొత్తగను పట్టణము జేరుకొనిన నరుడు బసను మొదట వెదకి తనవస్తుతతిని
నందు జేర్చి - నగరశోభ నరయ నేగు, నటుల గాకున్న నిడుమల నందు నతడు. 7

అటులె ఈలోకమున బడినట్టి నరుడు నిత్యశాంతినిలయుడైన సత్యమూర్తి
ప్రాపుగాంచిన మీదనె భయము లేక నిత్యకృత్యము లొనరించు నేర్పుగనును. 8

పేలములపైని పేరాస విడువ లేక బోనునం దెలుకలు చిక్కి పోవునట్లు
తుచ్ఛవిషయసుఖాసక్తి దూలి నరుఁడు వద్ద నున్న బ్రహ్మానందపదవి గనఁడు.

సూర్యచంద్రలోకములపై సుద్దు లిన్ని బలికి నాల్గు కథల జెప్ప పరము లేదు
హృదయమందున సద్భక్తి యేపుగాఁగ తీవ్రపరితాపమున వాని దెలియవలయు. 10

దినమునం దెప్పుడైనను తిండి దొరకు, కొంత ముందు వెనుకలైన వంత యేల?
యటులె దైవదర్శన మబ్బు నందఱికిని ఏదొ యొకజన్మమందున నెట్టులైన. 11

బొమ్మలాటలాడుకొనెడి బుల్లిపాప లమ్మఁ బొడగని యవి వీడి యమ్మ జేరు
నట్లు, ధనకీర్తు లను బొమ్మలందు దగులు నతఁడు దివ్యమాతను జూడ నన్ని విడుచు. 12

అతిపరిశ్రమ కోడక యంబురాశి మునిఁగి గొనివచ్చెదరు గాదె ముత్యములను
నట్లె దీక్షమై నరుఁడు నిరాశవీడి సాధనము సేయ గనుగొను సత్యనిలయు. 13

సచ్చిదానందసద్ధ్యానసరణిఁ జేసి కనెదు నీవు బ్రహ్మానందగరిమ నెపుడు
విషయరాగము తగ్గిన, విభునియెడల భక్తి బలిసి యజ్ఞానంపు పరద తొలఁగు. 14

దేహదేవళంబున జ్ఞానదీప మొకటి వెల్గజేయు దివ్యజనని వీక్ష సేయ
భాగ్య మబ్బు; నంత గనెదు బంధముక్తి జీవపరమాత్మల గలియు జేయు విధము. 15

## II

## శ్రీ కృష్ణశ్రీగారు

శ్రీజగజ్జననికిఁ బ్రియతమసుతు డన న్మతతరంగిణులకు బతి యనంగ
నతికిని సుతు డన సంస్తుతింతును నిన్ను రాజహంసనిపుణ, రామకృష్ణ.

అమ్మ కంట బడిన బొమ్మలాటలు వీడి శిశువు వేగ నాపె జేరి చొక్క-
నంబఁ గాంచువాని కన్యంబు లిం కేల, రాజహంసనిపుణ, రామకృష్ణ! 2

ఎన్ని పాట్లు పడిన మున్నీటిముత్యాలు పడయవచ్చుఁ బడినపాటు మఱవ
విశ్వనాథుగూర్చు విశ్వ ప్రయత్నంబు రాజహంసనిపుణ రామకృష్ణ. 3

నీటియందె పుట్టి నీటనే తేలుచు నీటియందె డిందు నీటిబుడగ
నరుడు బుద్బుదంబు నారాయణుడు నీరు రాజహంసనిపుణ రామకృష్ణ.

ఉప్పుబొమ్మ భగవదుదధి రూపఱినచో, భక్తిజలముఁ బీల్చ బట్టబొమ్మ,
నరుడు తాటిబొమ్మ పరచింత గ్రోలక, రాజహంసనిపుణ రామకృష్ణ. 5

కరము దుష్టులందు బరమాత్మ గల దని వారి గలసి మనుట పాడి యగునె?
పులియు దేవు డనుచుఁ బులిఁ జేరవచ్చునా, రాజహంసనిపుణ రామకృష్ణ! 6

వరలు జలములెల్ల బానయోగ్యము గావు చూడ దగవు గలుఁగు చోటు లెల్ల
నెందు దేవు డున్న నీభేదములు పోవు, రాజహంసనిపుణ రామకృష్ణ. 7

పెద్దమేలిముసుగుముద్దియ, వాచాలి, చెవులఁ దులసిదళము సేర్చువాడు,
గదియ నొక్కకంట కనుపెట్ట దగువారు రాజహంసనిపుణ రామకృష్ణ. 8

రామ రామ యనెడి రాచిల్క కీచు మనఁ బిల్లివాత బడిన పేర్మి దక్క
పరమలౌక్యభక్తిభావ మీలాగున, రాజహంసనిపుణ రామకృష్ణ. 9

వడ్లు చల్లునెడల వరిచేలు పండును బేలములను జల్ల బెంపు లేమ
జన్మరహితు డగును జ్ఞానాగ్నితప్తుడు రాజహంసనిపుణ రామకృష్ణ. 10

సంద్ర మలలు రేగ సరి వచ్చు మాయకు, నలలు లేక బ్రహ్మ మయ్యె నదియె,
కార్యరూప మొకటి కారణ మొక్కటి రాజహంసనిపుణ రామకృష్ణ. 11

ఎండుమట్టితోడ గుండలు కుమ్మరి సేయు లేడు నీరు సేర్చి కాని
సృష్టిహేతు వగును శివశక్తు లుభయుంబు రాజహంసనిపుణ రామకృష్ణ. 12

బ్రహ్మలోని మాయ బ్రహ్మకు సోకదు భువన మాక్రమించి మోహపఱచు
పాముకోఱవిషము పామును జంపునా, రాజహంసనిపుణ రామకృష్ణ! 13

ప్రొద్దు మబ్బుపట్టి పొడగానగా రాదు తెల్లమగును మబ్బు తేలి పోవ
మాయ తొలగె నేని మహితాత్మ గనవచ్చు రాజహంసనిపుణ రామకృష్ణ. 14

నీరు తొలచి హంస క్షీరంబు గొనునట్లు మాయ వేఱుసేసి మహితబుద్ధి
పరమహంసలెల్ల పరమాత్మ గందురు రాజహంసనిపుణ రామకృష్ణ. 15

మాయ తోడు లేక మాయాపరాధీను లరయ రాదు పరమపురుషు జాడ
శర్వు గాన రాదు శర్వాణి గనకున్న రాజహంసనిపుణ రామకృష్ణ. 16

కలుగు మాయవలన జ్ఞానంబు మోదంబు ద్వంద్వబుద్ధి విశ్వదర్శనంబు
బొలియు మాయ కవల భోక్తృభోగ్యంబులు రాజహంసనిపుణ రామకృష్ణ. 17

చీలి యెలుక బట్టి చీలిచి చంపును బిల్లి కూనఁబట్టి ప్రియము సేయు
భక్తుఁ బ్రోచు మాయ, భంగించు నితరుల రాజహంసనిపుణ రామకృష్ణ. 18

మించు నరుని డింప మించు మేధానాడి, మేధనాడి మించ మించు శక్తు
లాత్మదర్శనంబు ననుకూలపఱచును రాజహంసనిపుణ రామకృష్ణ. 19

చెనకరాని పాము జేపట్టి శిఖయందు దాల్ప వచ్చు మంత్రదమనశక్తి
మారభీతి మాన్పు దారకమంత్రంబు రాజహంసనిపుణ రామకృష్ణ. 20

భూమి నాది యనుచు భూస్వామి వీగిన ప్రాణదాత ననుచు వైద్యు డేచ
నవ్వుకొనుచునుండు నలువ యిర్వుర గాంచి రాజహంసనిపుణ రామకృష్ణ. 21

రిక్కలచిఱువెల్గు రేరాజు కబళించు, రేవెలుంగు మ్రింగు వేవెలుంగు,
కలుగువారి మించు కలవార లుందురు రాజహంసనిపుణ రామకృష్ణ. 22

వఱద నీరు తెగక వంతెనక్రిందుగా దరలి పోవుచుండు నిరతగతిని
ముక్తు డెపుడు ధనము మూటలు గట్టడు రాజహంసనిపుణ రామకృష్ణ. 23

దాస్య సేవని చెంత ధనలక్ష్మి యొనరించు శ్రీకి దాస్య మెవడు సేయకుండు
మహితబుద్ధి యతఁడు మానవు డన జెల్లు రాజహంసనిపుణ రామకృష్ణ. 24

# పరమహంస దేవుని ప్రబోధవా

**ఒక పాటగాడు**– మహాశయా, భగవంతుని సాక్షాత్కరించుకొనుటకు మార్గ మేది?

**శ్రీరామకృష్ణుడు** – ముఖ్యమును ఏకైకము నైనది భక్తి. నిజమునకు సకలప్రాణులలోను దేవు డున్నాడు. మఱి, భక్తు డెవరు? దేవునందు నెలకొన్న చిత్తము గలవాడు. గర్వమును దంభము నున్నంతవఱకు మనసు దేవునందు నెలకొనుట సాధ్యపడదు. నీరు మిఱ్ఱున కెక్కనట్లు దేవు ననుగ్రహము గర్వితులమీదికి పాఱదు. నీరు పల్లమునకే పాఱునట్లు దేవు ననుగ్రహము అణకువగలవారిమీదికే పాఱును. నేను వట్టి యంత్రమును.

ఏమార్గము ద్వారానైనను సరే, దేవుని సాక్షాత్కరించుకొనుట సాధ్యమే, అన్నిమతములును సత్యములే. ఇంటిపైకప్పుమీదికి చేరవలె ననుట ముఖ్యము. రాతిమెట్లమీదుగ ఎక్కిపోవచ్చును, కొయ్యమెట్లమీదుగ ఎక్కిపోవచ్చు. వెదురునిచ్చెనమీదుగా ఎక్కిపోవచ్చు, ప్రగ్గముతోడ్పాటుతో ఎక్కిపోవచ్చు. ఒక వెదురు గడసాయముతో ఎక్కిపోవచ్చు

మఱొకరిమతములో ఎన్నో తప్పులు గ్రుడ్డి నమ్మకాలు ఉన్నవని నీవన వచ్చు. అందుకు నాజవాబు—ఉన్నవనియే అనుకొందము. దోషములు ప్రతిమతములోను ఉన్నవి. తన గడియారముచూపు గంటయే సరియైనదని ప్రతియొక్కడును తలంచుచుండును. దేవునకై తహతహపాటున్న చాలు, దేవునందు ప్రేమయున్న చాలు, దేవునివంక ఆకృష్టుడవైన చాలు. అంతర్నియంతగా నుండునది దేవుడే అని ఎఱుగవా? మన డెందమున ఉబలాటమున్నచో మన ఆత్మ తహతహపడుచున్నచో ఆ యుబలాటమును తహతహపాటును దేవుడు గ్రహించును. ఒకనికి చాలమంది పుత్రులున్నారనుకో. పెద్దవారు స్పష్టముగా 'నాన్నా' 'అప్పా' అని పిలుతురు. చాలపసివారు 'నా' అని 'అ' అని అస్పష్టముగ బల్కగలరు. వారి పిలుపు అస్పష్టముగ ఉన్నందుకు వారిపై తండ్రి కోపించునా? వారును తన్నే పిలుచుచున్నారని తండ్రి యెఱుగును, తనపేరును వారు చక్కగా ఉచ్చరింపజాలకున్నారు, అంతే. బిడ్డలందఱు తండ్రికొక్కంతే ప్రియులే. అట్లే భక్తులు వివిధనామములతో బేర్కొనుచున్నారు, లక్ష్యమేమో భగవంతుడే, పేర్కొనుచున్న దొక్కనినే, దేవుడొక్కడే, అతని పేరులు పెక్కులు.

మ:—బ్రతికినన్నినాళ్ళు సాగుచుండవలసిన దేనా సాధన?

శ్రీరామకృష్ణుడు—అక్కఱలేదు. కాని ప్రారంభదశలో మాత్రము ప్రతియొక్కనికిని మెలకువయును చుఱుకుదనమును ఉండవలెను, ఆదశ దాటినపిమ్మట అంత శ్రమపడ అక్కఱ లేదు. పడవ అలలపోటు - తుపాను - పెనుగాలి - నదులవంపులు అను వానిగుండ పోవుచున్నంతవఱకును చుక్కానివాడు చుక్కానిని గట్టిగ పట్టుకొని యుండును. వానిని దాటినవెంటనే అతడు తనపట్టును సడలించును. నదుల తిరుగుళ్ళు దాటి కొంత అనుకూలవాయువు వీవ దొడగినంతనే, అతడు హాయిగ కూర్చుండును, చేతిని మాత్రము చుక్కానిపై నుంచి యుండును. తర్వాత తెరచాపను విప్పబూనుకొనును, పొగ ద్రాగుటకును సిద్ధపడును. అట్లే సాధకుడును కామినీకాంచనము లనెడి కల్లోలములను తుఫానులను అతిక్రమించినంతనే, నెమ్మదిని శాంతి ననుభవించును.

కొందఱకు పుట్టినప్పటినుండియే యోగుల లక్షణము లుండును కాని, వారును మెలకువ గలిగియే యుండవలయును. కామినీకాంచనములే అడ్డంకులు. మానవుని యోగమార్గము నుండి తప్పించి సంసారకూపములోనికి కీడ్చుకొని పోవునవివే. వారికి భోగేచ్ఛ కొంతయుండిన నుండవచ్చు. ఆకోరిక తీరినంతనే వారు తమ మనస్సులను మరల భగవదున్ముఖములుగా చేసికొని, అవి యోగాభ్యాసమున కర్హములుగా నుండిన మునుపటి దశకు వానిని తెచ్చుకొందురు.

మనస్సు నిశ్చలము కానిదే యోగము శక్యము కాదు. మనస్సు వత్తిదీపమును బోలినది. దానిని ఐహికపరత అనెడి గాలి సదా అల్లాడించుచుండును. ఆ దీపజ్వాలకు స్తిమితత కలిగెనేని, మనస్సునకు నిలుకడ కుదిరెనేని, యోగము సిద్ధించినట్లే.

మ:—స్వామీ, భగవత్ప్రాప్తి యనగా నేమి? భగవత్సాక్షాత్కార మనిన నర్థమేమి? దానిని పొందు టెట్లు?

శ్రీరామకృష్ణుడు—వైష్ణవులు సాధకులను సిద్ధులను వివిధవర్గములవారినిగా విభజించి యున్నారు—ప్రవర్తకులు, సాధకులు, సిద్ధులు, సిద్ధసిద్ధులు. సాధనలలో ఇప్పుడిప్పుడే అడుగు

పెట్టినవాడు ప్రవర్తకుడు. పూజాజపధ్యానములు భగవన్నామమహిమల సంకీర్తనము మొదలైన జ్ఞానసాధనలను కొంతకాలముగా చేయుచుండువాడు సాధకుడు. భగవంతుని యునికిని తన యాంతరానుభవముచే తెలిసికొన్న వాడు సిద్ధుడు. ఈసిద్ధిని వివరించుటకై వేదాంత శాస్త్రమున నొసగిన యుదాహరణ మొకటి కలదు. ఒకయింటియజమానుడు చీకటిగదిలో నిద్రించుచున్నాడు. అతనిని గనుగొనుటకై యొకడు అంధకారమున దేవులాడుచున్నాడు. చేతికి మంచము తగిలినచో 'ఇది ఆయన కాదు' అనును, కిటికీని పట్టి చూచును 'ఇదియు ఆయన కాదు' అనును. తలుపును తాకి చూచి 'ఇదియు ఆయన కాదు' అనును. దీనికి వేదాంత శాస్త్రమున నేతి నేతి మార్గము [= ఇది కాదు, ఇది కాదు. అనుచు కానివానినెల్ల విడుచు పద్ధతి] అని వ్యవహారము. తుదకు యజమానుని శరీరము చేతికి తగులగానే అత 'డీడుగో ఇక్కడ నున్నా' డని అఱచును. అనగా యజమానుని కనుగొన్నాడు, యజమానుని ఉనికి తెలిసినది, కాని యజమానునితో సన్నిహిత పరిచయ మింకను లేదు.

సిద్ధసిద్ధు లను నొకవర్గమువా రున్నారు. స్వామికి అంతరంగికులై ఆయనతో మాటాడుటయు, భక్తిప్రేమలద్వారా దేవునితోడ నత్యంత మాంతరంగికమైన పరిచయము గనుటయు, అది ప్రత్యేకము కదా. సిద్ధునకు భగవత్ప్రాప్తి గల్గుట నిస్సందేహము. కాని సిద్ధసిద్ధునకు భగవంతునితో నత్యంతాంతరంగికమైన పరిచయ ముండును.

భగవంతుని సాక్షాత్కరించు కొనుటకు భక్తుడు శాంతభావమునైనను దాస్యభావమునైనను సఖ్యభావమునైనను వాత్సల్యభావమునైనను మధురభావమునైనను పూనవలయును.

భగవంతునిపట్ల శాంతభావము నెరపిన వారు ప్రాచీనమహర్షులు. వారికి ఐహికభోగ వాంఛ లేవు. అదిపతిపట్ల సతికుండు నేకాగ్ర భక్తివంటిది. సతిమదికి తనపతి ప్రేమ సౌందర్యముల మూర్తీభావము, ప్రత్యక్షమన్మథుడే.

శ్రీరామచంద్రునిపట్ల హనుమంతుడు నెరపిన దాస్యభావము. శ్రీరామునకై పాటుపడ వలసివచ్చినపుడు తనలో సింహబల మావేశించి నట్లుగ హనుమంతున కనుభూతి మయ్యెడిది. ఈవైఖరి పతియెడ సతికిని యుండును. సతి నిండు ప్రేమముతో నిండు అక్కరతో పతికి సేవ చేయును. శ్రీకృష్ణునిపట్ల యశోద కుండినట్లుగా ఈవైఖరి కొంతవఱకు తల్లి యొద్దకూడ నుండును.

సఖ్య మనగా మైత్రి. మిత్రు లొండొకరితో 'ఇటు రారా, ఇటు నాచెంత కూర్చోరా' అన్న విధమున మాటాడుకొందురు. శ్రీదాముడు మున్నగు మిత్రు లొక్కొక్కప్పుడు తమ భుక్తశేషమగు పండును శ్రీకృష్ణుచే తినిపింతురు, అతని భుజములపై తా మెక్కి కూర్చుందురు.

వాత్సల్యభావ మనగా శిశువుపట్ల తల్లి వైఖరి. శ్రీకృష్ణునిపట్ల యశోద వైఖరి యిదే. పతిపట్ల సతికిని ఇట్టి వైఖరి కొంతకలదు. తన జీవితసర్వస్వము నర్పించినట్లుగా సతి పతిని ఆహారింపించును. బిడ్డ తృప్తిగ భుజించుటనుజూచిన అమ్మ సంతోషించును. శ్రీకృష్ణునకు తినబెట్టుటకై చేత వెన్నను బెట్టుకొని యశోద వల్లడల క్రుమ్మరునట.

మధురభావ మనగా మగువకు కాముకుని పట్ల నుండు ప్రేమ. శ్రీకృష్ణునిపట్ల రాధకుండిన భావమిది. పతియందు సతికిని ఈభావముకలదు. తక్కిన నాల్గువైఖరులు ఇం దిమిడియున్నవి.



# గురుదేవుడు : పుత్ర శ్రీ : శిష్యావతంసులు

నిజమైన భారతదేశచరిత్రము ఏదనగా ఆదేశపు ఆధ్యాత్మికమహాపురుషుల కొందఱి జీవితచరిత్రమే. దేశజీవితమును రూపొందించిన వారు వారే, దేశభవిష్యమును నిర్ణయించిన వారు వారే. భారతదేశజీవితమున రాజులకును చక్రవర్తులకును ఉన్న ప్రభావమునకంటె శ్రీకృష్ణ - బుద్ధ - శంకరాచార్య - చైతన్యులవంటివారి ప్రభావము కడు హెచ్చు. భారతదేశాధ్యాత్మిక వైజ్ఞానిక జీవితములో ధర్మగ్లాని కలిగినప్పుడెల్ల ఒకయోగి అవతరించి వినాశమునుండి దేశమును గాపాడి ప్రజలకు సరియైన మార్గమును చూపియున్నాడు. అదే స్వారస్యము.

క్రిందటి శతాబ్ది ప్రారంభము భారతదేశ చరిత్రమున గొప్పచిక్కైనసమయము. పాశ్చాత్యనాగరకతకులోనై ఆంగ్లవిద్యను నేర్చి భారతీయులు దేశీయవిజ్ఞానమున ప్రీతివిశ్వాసముల గోల్పోయిరి. తమ మాతృభూమి భారతదేశమే ఐనను, అది అతి ప్రాచీన విజ్ఞానసంపన్నమే ఐనను ఆనాటి ఆంగ్లవిద్యావంతులైన భారతీయులలో స్వదేశీయవిజ్ఞానమును గూర్చిన సరియైన పరిచయము కలవారు అరుదైరి.

అట్టి అదనున వంగదేశమున నొక మారుమూలగ్రామములో ఒక మహనీయుడు అవతరించెను. ఆయనకు తెలియకే ఆయన జీవితము భారతదేశ మతవిజ్ఞానములయెడ్ల వ్యాపించుచుండిన నిరాదరమునకు అకృత్రిమమును అమోఘమునైన ప్రతిరోధి ఐనది. విధినిర్ణయములోని వింతనుగనుడు. కల్కత్తా భారతదేశ రాజధాని, ఆంగ్లవిద్యకు అదికోట, క్రైస్తవ మతప్రచారకులు హిందూమతమును విగ్రహారాధన మని తప్పులెన్నుచు నిందించుచుండిన దచ్చటనే. ఇంగ్లీషుచదువు చదువుకొన్న భారతీయులు అధికసంఖ్యాకులు ప్రకటముగనో ప్రచ్ఛన్నముగనో ఆమతప్రచారకుల పక్షముననే చేరుచుండిరి. ఆకాలముననే కల్కత్తా నగరమునకు కొన్నిమైళ్ళదూరముననే దక్షిణేశ్వరాలయారామమున శ్రీరామకృష్ణుడు తన గాఢసాధనలచేతను అద్భుతసాక్షాత్కారములచేతను హిందూమతసత్యముల పునరుత్తేజితములుగ జేయుచుండెను. అచిరకాలములోనే ఆయన భారతీయుల మనస్సులను దేశీయమత విజ్ఞానాల శక్తిసౌందర్యములవంకకు మరల్చు అమోఘసాధనభూతుడాయెను.

శ్రీరామకృష్ణుడు హుగ్లీజిల్లాలో కామార్పుకూర్ అను అప్రసిద్ధగ్రామమున 1836 సంవత్సరము జన్మించెను. అతని తల్లిదండ్రులు బ్రాహ్మణులు సనాతనాచారనిష్ఠులు భక్తియుతులు. ఆ కుటుంబ పరిసరాలలో పాశ్చాత్యనాగరకత అడుగిడుటకు అవకాశలేశమేని ఉండినది కాదు. శ్రీరామకృష్ణుడు ప్రకృతిబిడ్డడు. ఐహికపరిత్వపుష్పముక్క లేక అతడు తన జీవితకాలమంతయు నిజముగ ప్రకృతిబిడ్డడుగనే ఉండెను. ప్రకృతిలో సౌందర్యము గలదేదైనను కంటబడినప్పుడు కాని, ఏదేని పారమార్థికభావముచే ఉద్రేకము రేకెత్తినప్పుడు కాని అతని మనసు భావసమాధిలో బడిపోవును. చుట్టునున్న సమస్తమును మఱచి అతడావశగా చిరకాలముండును. పెద్దలు అతనిని పల్లెబడిలో చదువుకొమ్మని నిర్బంధించుచుండ అతడేమో మిత్రులనుగూడి బయళ్ళలో పౌరాణికనాటకాలాటలలోను భగవత్సంకీర్తనలలోను అధికప్రీతి వహించుచుండెను. పల్లెవాతావరణములో నతని జీవితము చెడిపోవుననుకొని చక్కని చదువువసతులు కల్కత్తాలో ఉండునని అతని పెద్దన్న అతనిని అచటికి పిలుచుకొని

పోయెను. కాని బాలుడు మొండిపట్టు పట్టెను. జననమరణసమస్యను పరిష్కరించు నట్టి జ్ఞానమునకై అతడు తృష్ణ జెందుచుండెఁ గాని రోతపుట్టించు నట్టి పొట్టకూటిచదువు తనకు వలదనెను. ఆసపాటు లేదనుకొని పెద్దన్న తమ్ముని చదివించు నుద్దేశము మానుకొని, ఇచ్ఛవచ్చినట్లు పోనిచ్చెను—

1855 లో దక్షిణేశ్వర కాళికాలయప్రతిష్ఠ జరిగినది. ఆగుడి పూజారిపదవికి శ్రీరామకృష్ణుని ఒప్పించుపని కష్టముతో నెఱవేఱినది. ఆపనియు ఆయన యభిరుచి కనుగుణముగ నుండెను. ఆ వాతావరణమును ఆయనకు నచ్చెను. నిత్యవిధులను నెఱవేర్చుటతోను యంత్రరీతిని ఆలయ కర్మకలాపమును నిర్వర్తించుటతోను తృప్తి చెందు చిత్తము కాదు శ్రీరామకృష్ణునిది. దినదినమును తాను కాళీవిగ్రహము నారాధించుచున్నప్పుడు 'నేను ప్రతిదినము మ్రొక్కుచున్నది నట్టి రాతిబొమ్మయేనా, అందులో దేవి సాన్నిధ్యము నిక్కముగ నున్నదా' అను జిజ్ఞాస ఆయనను పీడింపసాగినది. పరిశిశిహా చిత్రమైన యీ జిజ్ఞాసలో మునుగుటతో దినములాయనకు గొప్ప మనోవ్యాధితో గడచుచుండెను. అహోరాత్రము లాయన హృదయ భావములు అశ్రురూపమున వెలికుప్పొంగుచుండినవి. తుదకు సందేహలేశమునకేని అవకాశము లేని రీతిగా ఆవిగ్రహమున దేవీసాన్నిధ్యము ఆయనకు ప్రత్యక్షమయ్యెను. తదనంతరము ప్రాపంచిక వస్తువిషయములకంటె కాళీదేవియే ఆయనకు గొప్ప సత్యమాయెను. ఆమెను ఆయన లోకజనని అని పేర్కొనెడివాడు, ఆయన ఆమెతో సంభాషించును, ఆమెను ప్రార్థించును. ఆమె కంఠ మాయనకు వినిపించును. అంతేకాదు ఆమె నాసారంధ్రముల శ్వాసవాయువును తనచేతిస్పర్శచే తెలిసికొనును. అది ఎట్లు సాధ్యమాయెనో రుజువుచేయవలసిన వారము మనము కాము. ఆయన కేమో అది యథార్థమే.

ఏదో ఒక్కవిధమైన సాధనతో శ్రీరామకృష్ణుడు సంతృప్తి చెందలేదు. హిందూసిద్ధాంత చరిత్రమున వివిధయుగములలో ప్రశస్తిగన్న క్రమముల నన్నింటను ఆయన సాధన గావించెను. కావున భారతదేశ ప్రాచీనాధ్యాత్మిక చరిత్రమునంతటిని తన జీవిత మొక్కదానిలో ఆయన సూచించెనందురు. అట్టిది అపూర్వాద్భుతము కదా! సాధారణముగ ఏదో ఒక సాధనవిధానము ననుసరించి సిద్ధిపడయగనినంతనే సాధకుడు తన్ను ధన్యుడనుకొనును. మఱి ఈ మహానుభావుడో, అసంఖ్యాక సాధనలు కావించి, ప్రతిసాధనలోను అత్యల్పకాలములోనే సిద్ధి గాంచినాడు. అంతతో తనియక ఇస్లామునుకూడ అవలంబించినాడు, క్రైస్తవమత మార్గమునను పరమసత్యమును సాక్షాత్కరించుకొన్నాడు. ఇట్లు అన్నిమతాలును నిజములే అనుటయు ముఖ్యవిషయాలలో మతాలకుపరస్పర విరోధము లేదనుటయు ఆయనకు ప్రత్యక్షముగ దెలిసిపోయెను. ఆయన మిక్కిలి నొక్కి బోధించిన విషయ మిది.

జీవితచరమదశలో కొన్నియేండ్లు ఆయన బాహ్యాలోకస్మృతి గలిగిన దశలో నున్నంతకంటె ఎక్కువగా ఇంద్రియాతీతదశలోనుండెను. మనసు సదా భగవదున్ముఖముగ నుండుటచే ఆధ్యాత్మికమగునే సూక్ష్మాంశమైనను సరే ఆయనకు భావోద్రేకమును గలిగించెడిది. ఆయుద్రిక్తదశలో ఆయనకు పరిసరముల స్మృతియే కాదు, తన దేహస్మృతియు నుండదు.

అతని మనఃపరిస్థితి అట్లున్నందున ఐహిక చింతలతనికి అశక్యములు. సర్వసంగపరిత్యా

గము ఆయనలో రూపుదాల్చినది. ఏమరుపాటు ననైనను సరే ఏదైన కాసు చేతికి తగిలిన అతని వ్రేళ్లు వెనుదీసెడివి. వేలయన నాణెములు మానవుల విషయతృష్ణకు సూచకములు లోకమున నున్నను దివ్యదర్శనములందును భావోద్రేకములందును సమాధియందును నిమగ్నమైన అతనిమనస్సు లోకస్థాయి కందనిదిగ నుండెడిది.

అంతటి ప్రభావవంతుడైన వ్యక్తి అప్రసిద్ధుడుగ నుండలేడు. ఆధ్యాత్మికోత్సాహమునకనియు జీవితగాఢతర సమస్యల పరిష్కారమునకనియు ప్రజలు గుంపులు గుంపులుగ అతని యొద్దకు రాసాగిరి. రకరకాలవారు వివిధ వృత్తులవారు రాసాగిరి. జాతీయోద్యమ మహానాయకుడగు క్రిస్తోదాస్పాల్, గొప్పబంగాలి గద్యరచయితయగు బంకించంద్రఛటర్జి, వంగ నాటకరంగపితామహుఁడును నటకుడును నాటకరచయితయు నగు గిరీశచంద్రఘోషు వైద్యరాజు డాక్టరు మహేంద్రలాల్ సర్కారు,హిందు సనాతనపక్షనాయకుఁడును సంస్కృతమహాపండితుడునగు శశధరతర్కచూడామణి, బ్రాహ్మసమాజనాయకుడు కేశవచంద్రసేన్ మున్నగు నాటిప్రముఖులు శ్రీరామకృష్ణుని దర్శించి జ్ఞానసంభృతమగు తద్వాగమృతమును గ్రోలిరి. పెక్కండ్రు భక్తులయు భక్తురాండ్రయు జీవితముల నాయన పూర్తిగ మార్చివేసి అచ్చపు బంగారముగ రూపొందించెను. ఐనను శిష్యవర్గము నెడనే ఆయనకు ముఖ్యశ్రద్ధ. ఆవర్గములో మగవారును గలరు. మగువలును గలరు. ఉత్తరకాలమున వారిచే తనసందేశమును ప్రచారము చేయించుటకై ఆయన వారిజీవితములను దిద్ది తీర్చెను.

1888-వ సంవత్సరమధ్యమున శ్రీరామకృష్ణునకు వ్యాధి పైకొనెను. అక్టోబరు ప్రారంభమున వైద్యవసతులకై ఆయనను కల్కత్తాలోని శ్యాంపుకూరునకు చేర్చవలసివచ్చెను. పిమ్మట డిసెంబరులో ఆయన కాశీపూరులోని తోటమాళిగకు కొనిపోబడెను. అచట ఆయన తే 16-3-1886 దినాడు మహాసమాధి నొందెను. ఆదుఃఖకాలమునకును సార్థకత లేకపోలేదు. ఎట్లనగా అంతరంగశిష్యవర్గమున నప్పుడు ప్రేమబంధము బలపడినది స్వసందేశ ప్రచారసంస్థకు చాలినంత పునాదులను దృఢముగ వేయుటకు శ్రీరామకృష్ణున కవకాశము గలిగినది. ఆయన శిష్యులు మూడు వర్గాలవారు. మహిళలందఱొక వర్గము దాని కాయన ప్రేయసి మాతృశ్రీ శారదాదేవియే నాయకురాలు యువకులందఱొక వర్గము. దానికి నాయకుడు నరేంద్రనాథ్. అనంతరము ఆ యువకులందఱు సన్న్యాసులైరి. గృహస్థశిష్యులందఱొక వర్గము. నాగమహాశయ గిరీశచంద్రఘోషు మున్నగు వారు ఆ కోవవారు.

## మాతృదేవి

మాతృశ్రీ (శ్రీమా) అను పేర ఎల్లరెఱిగిన యోగినియు శ్రీరామకృష్ణుందదేవేరియు నగు శ్రీశారదాదేవి 1853-వ సంవత్సరమున జయ్రామ్బాటి అను పల్లెలో అవతరించెను. ఆ పల్లెకును శ్రీరామకృష్ణుని జన్మగ్రామమగు కామార్పుకురునకును ఎక్కువ దూరము లేదు. శ్రీరామకృష్ణుడు తన పరిసరాలను ఇంచుమించు మఱచిపోయి, సదా ఉన్నతజ్ఞానస్థాయిలో ఉండినను, పెండ్లి చేసికొనుటకు సమ్మతించెను. కాని ఆయన గృహస్థజీవితమును గడపుట అసంభవమే. సదా ఉన్నతస్థాయుల కెగయు చిత్తము గల అతనికి ఐహికమైన తలంపేదైనను అతి బాధాకరము. పవిత్రతాస్వరూపిణియగు శారదాదేవికిని ఐహికజీవితవాంఛలు లేవు. పెనిమిటి కోరికల విషయమున ఆమె ఆయనతో ఏకాభి

ప్రాయురాలై ఆధ్యాత్మిక సాధనలలో ఆయనకు సహాయురాలైనది. ఆమెకు కావలసినదేమనగా ఆయనకు పరిచర్య చేయు భాగ్య మొక్కటే. ఆభాగ్యము ఆమెకు సమృద్ధముగనే లభించినది. ఇకను శ్రీరామకృష్ణుడును ఆమెపట్ల అత్యంతానుకూలుడుగనే యుండెను. శ్రేష్ఠమైన రీతిలో ఆమెకు ఆధ్యాత్మికశిక్షణ మొసగెను, తన కనంతరము తన స్థానమును ఆమె అధిష్ఠింపవలసియుండుననియు ఆధ్యాత్మిక సందేశ ప్రచారమును నిర్వహింపవలసియుండుననియు స్పష్టముగ సూచించెను. ఆమెను లోకమాతృ ప్రత్యక్షరూపముగ భావించెను, లోకమాత నారాధించునట్లుగనే ఒకనాడు ఆమెను ఆరాధించెను.

శ్రీరామకృష్ణుని జీవితకాలపు కడపటి కొన్ని సంవత్సరాలలో శారదా దేవి తరచు దక్షిణేశ్వరమున వసించుచుండెను. తర్వాత శ్యాంపుకూరులోను కాశీపూరులోను వసించెను. ఆ దినాలలో ఆమె తన గదివెలుపలికి వచ్చి అగపడకున్నను ఆమెశీలమధురిమయును ప్రేమపూర్ణ హృదయమును పరమపవిత్రతయు శ్రీరామకృష్ణభక్తులయు శిష్యులయు ఆదరమును చూరగొన్నవి. ఆమెను తమతల్లిగ వారు భావింపజొచ్చిరి.

శ్రీరామకృష్ణుని నిర్యాణానంతరము కొంతకాలము ఆమె చాలచిక్కులను కష్టములను అనుభవించినది. కాని ఆమె దివ్యవ్యక్తిత్వము ప్రకటమగుకొలదియు, అధికసంఖ్యాకులై ప్రజలు తమయాత్మలకు శరణమును ఆశ్రయమును కోరి ఆమెకడకు గుంపులుగుంపులుగ రాజొచ్చిరి ఆమె పెక్కండ్రజీవితాలను మార్పొందించెను, నూర్లకొలది ఖిన్నాత్ములకు సౌఖ్యనిర్వృతులను కలిగించెను. ఆమెయాధ్యాత్మికప్రభావమునకు లక్ష్యభూతు లగుట దుర్లభభాగ్యము. ఆమెకు రవంత సేవ యైనను తాము చేయగల్గినచో దానిని శుభావకాశముగ ప్రజలు భావించిరి ఆమెయో ఎవరిచేతగాని ఎప్పుడు కాని సేవ చేయించుకొనదు, చేయించుకోకపోవుటే కాక తల్లివలె తానే తన్ను చేరిన యెల్లవారి సౌఖ్యములను విచారించుకొనెడిది. కడపటి దినాలలో ఆమె కల్కత్తాలోను జయరాంబాటిలో పుట్టినింటను ఉండుచుండినది ఉన్నతాధ్యాత్మికస్థాయిలో ఉన్నను పల్లెలోని సామాన్యురాలివలెనే ఆమె యింటిపనుల నన్నిటిని చేయగలిగియుండెను, చేయగోరుచు నుండెను. ఆమె చిత్తములోని యీసరళత చేత పెక్కండ్రకు జంకుకొంకులు లేక ఆమెతో కలసికొను అవకాశములు లభించినవి. కాని వాస్తవమైన ఆమె ఆధ్యాత్మోన్నతిని సూక్ష్మముగనైన చూచినవారు ఆశ్చర్యపరవశులైరి.

రామకృష్ణపరంపరలో ఆమెస్థానము గురుదేవుని స్థానముతో సమానమైనది, లేదా దానికి తరువాతిది. శ్రీవివేకానందస్వామి ప్రసిద్ధమైన తనకర్తవ్యమునకై పాశ్చాత్యయాత్రకు బయలుదేఱినది, ఆమె అనుమతిని ఆశీర్వాదమును బడసినపిమ్మటనే. ఈసంస్థకు చెందిన ముఖ్యవ్యవహారము లన్నిటిలోను ఆమె తీర్పే అన్నిటికంటె నది. ఆమె కోరిక ఎంతచిన్నదైనను సరే అది ప్రతివారికిని పవిత్రాతిపవిత్రమైన శాసనమే. భువిపై ఆమె జీవించియున్నంతకాలము, ఈ సంస్థకు ఆధ్యాత్మికముగ యథార్థమార్గదర్శకురాలు ఆమెయే. 1920-వ సంవత్సరము జూలై తే 21 ది నాడు ఆమె పరమపదించెను.

## శ్రీ వివేకానందస్వామి

వివేకానందస్వామి అను ప్రసిద్ధిని అనంతరకాలమున బడసిన నరేంద్రనాథదత్త సంఘమున కంతటికిని నాయకు డయ్యెను. ఆయన

నాయకత్వము అంతటికిని సమ్మతమే. ఏలయన ఆయన ఆధ్యాత్మికశక్తులు అసాధారణములు, ఆయన ప్రతిభయు హృదయగుణములును గొప్పవి. వింత ఏమనగా శ్రీరామకృష్ణుని స్వరూపమునకు వ్యతిరేకమైన స్వరూపము నరేంద్రనాథదత్తది. ఆయన కలకత్తాలో సంపన్న వంశమున, ఆధునిక పద్ధతులలో ఎదిగినవాడు, ఉన్నతాంగ్ల విద్యను వాడు. అసాధారణ మేధాశక్తిని ప్రకటించిన వాడు. ఆయన పాశ్చాత్యసారస్వతమును కళలను శాస్త్రములను తర్కమును నేర్చుకొనుటే కాదు, వానిని జీర్ణించుకొనెను. అతని తర్కనైపుణిని అసాధారణ ప్రతిభను గాంచి అతని గురువులు సైతము నివ్వెఅగందిరి. కొంతకాలము నరేంద్రనాథుడు ఆస్తికుడు కాకున్నను, దేవుడున్నాడా అని సంశయించువాడయ్యెను. ఐనను జననమరణ సమస్యకు పరిష్కారము కావలెనను నాత్రము సృష్టిమర్మమును తేటపఱచుకోవలెనను నొక బలాటము అతనికుండెను. భాగ్యదేవత అతనికిని శ్రీరామకృష్ణునకును సమాగమము నొనగూర్చినది. ఆ సమాగమము ప్రాచీన నవీన భారతదేశ సమాగమమనిపించుకొన్నది అంతే కాదు, భావికాలమున భారతదేశమునకు గలుగనున్న ప్రాముఖ్యమును సూచించెను.

నరేంద్రనాథుని మనస్సు అతిమాత్రమైన హేతుజిజ్ఞాసయు ప్రతివాదాభిరతియు గలది, ఐనను పరమార్థమును గూర్చిన తృష్ణ ఆయన నావేశించెను. శ్రీరామకృష్ణుని వ్యక్తిత్వ మతనిని మరులుగొలిపెను. లోకజననియందు గురుదేవుని అమాయకభక్తి, పారమార్థిక విషయములనుగూర్చి ప్రసంగించునప్పుడు గురుదేవుని విశ్వాసము, తనపట్ల గురుదేవునకుగల అసాధారణప్రేమ-ఇవి అతని నాకర్షించెను. నరేంద్రనాథుని హృదయము శ్రీరామకృష్ణునకు త్వరగానే వశపడినది. కాని అతని మేధ ఆయనకు లొంగలేదు. కావున పెనగులాటయు జగడమును సుదీర్ఘకాలము సాగినది. శ్రీరామకృష్ణుని ప్రతిపాదనలను పొల్లుపుచ్చుటకును కొంచెపఱచుటకును నరేంద్రనాథుడు ఖండన వాదములు చేయును గాని గురుదేవుని సరళసూక్తులయెదుట ఇతని డెబురొడ్డు ఆయుధములెల్ల వెంటనే వ్యర్థములయ్యెడివి. నరేంద్రనాథుడు శోచనీయదశలోనుండెను. మనోవ్యథ జెందెను, కలవరపడెను. తుదకు గురుదేవుని చరణములకు తన్ను పూర్తిగా అర్పించుకొనెను. ఎంతో అనుతాపముతో వివేకానందస్వామి అనంతరకాలమున ఇట్లనుచుండెను—"ఆయన పవిత్రుడనియే కాక పవిత్రతయే ఆయనలో రూపుదాల్చినదని గ్రహించుటకు నాకు ఆఱేండ్లు పట్టినవి."

తన జీవితచరమదశలో గురుదేవుడు పురారామభవనములో నుండగా, అది ఒక మఠమువలెనే పరిణమించెను. శిష్యుల పారమార్థిక ఔత్సుక్యమును గురుదేవుని జగదుద్ధారక మహిమయు అచటి వాతావరణమున నిండియుండెను. గురుదేవుని నిర్యాణానంతరము ఆయన యువశిష్యులు కొందఱు కలకత్తాసమీపమున బరానగరములో నొక మఠమును నెలకొల్పుటకై నరేంద్రుని నాయకత్వమున నొక సంఘముగా కూడిరి. గురుదేవుడు నిష్క్రమించిన పిమ్మట ఇండ్లకు మరలిన శిష్యులు ఐహిక జీవనమునకు పనుపడలేరైరి. ఒండొరులను కలసికొను టెప్పుడో అనియు దక్షిణేశ్వరదివ్యానందదినములు మరల రావు కదా అనియు వారు బెంగగొని కృశింపజొచ్చిరి. గురుదేవుడు తమకు చూపిన లక్ష్యమును అన్వేషించుటకై వారు అందఱు నొక్కచోట నుండగోరిరి. కావున మొదట మఠమును నెలకొల్పి, నరేంద్రుడు

వారి నచట సమావేశముకండని ప్రోత్సహించి నప్పుడు వారు ఒక్కొక్కరును ఇండ్లనుండి మరలి రాదొడంగిరి. 1887-వ సంవత్సర ప్రారంభమున నొకప్పుడు ఇంచుమించు వారందఱును యథావిధిగ సన్న్యాసదీక్షను స్వీకరించిరి. పిమ్మట కొన్నాళ్లకు నరేంద్రనాథుని (వివేకానంద స్వామిని) సన్న్యాసోచితమైన స్వేచ్ఛ ఆవేశించెను. ఆ యావేశముతో ఆయన భారత దేశ మంతటను పర్యటించి ఉన్నతులు నిమ్నులు సంపన్నులు దరిద్రులు అయిన సకల ప్రజలతో కలిసెను. భారత దేశమును దానికి సంబంధించిన వివిధసమస్యలను సన్నిహితముగ పరిశోధించుట కాయనకు మంచి యవకాశము గల్గినది.

అదృష్టదేవత ఇంకొక్కపెట్టున ఆయనను రెండు మహాసముద్రములను దాటించి అమెరికాకు చేర్చినది. అక్కడ 1893-వ సంవత్సరమున చికాగో నగర సర్వమతమహాసభలో ఆయన సర్వజనప్రీతిపాత్రుడైన హిందూమత ప్రతినిధి యయ్యెను. ఇంతకును ఒకరి పిలుపందుకొనిపోయినవాడు కాడు ఆయన ఆ గంభీర సదస్సులో ఈ కావిబట్టలసన్న్యాసిపలికిన తొలి పలుకులలో విశ్వభ్రాతృభావ ముండినది. ఆ, ఒక్క ఉపన్యాసమున కలకాలము లోకులు చెప్పుకొను దానినిగా కావించినాడాయన. హిందూ సిద్ధాంతమందలి ఉదారతను ఉదాత్తతను గంభీర వేదాంతమును ఆయన ప్రకటించినరీతి అమెరికావారి మనస్సులలో గాఢముగ హత్తుకొన్నది. భారత దేశమందలి క్రైస్తవేతర ప్రజలను క్రైస్తవమతములోనికి మార్చుటకై ఆ దేశమునకు ప్రచారకులను పంపుట ఎంత పరిహాసాస్పదమో ఆ ప్రజలకు తోపసాగినది.

అమెరికాయూరపులలో నాలుగేండ్లపాటు బోధనము సాగించి, స్వామి భారత దేశమునకు మరలెను. స్వదేశమునకు చేరగనే, కొలంబో నుండి ఆల్మోడావఱకు ఆయనకు సమగ్రరాజోచితసన్మానాలు జరిగినవి. ఏలయన స్వామి చేసిన సేవ భారత దేశ మంతటికిని ప్రతిష్ఠగూర్చినది. బౌద్ధయుగమునకు పిమ్మట భారత దేశసందేశమును మరల విదేశాలకు కొంపోయిన మొదటి సన్న్యాసి వివేకానందస్వామియే. అదియు అఖండ విజయవంతమైనది. ఆయన సన్న్యాసివరిష్ఠుడైనను, ఆయన వాక్కులో తీవ్ర దేశభక్తి మ్రోగినది. ఆయనవాణి దేశప్రజలలో భారతీయతను తద్దేశప్రాచీన చరిత్రమునకు గర్వమును, మహోజ్జ్వలభవిష్యత్తును గూర్చిన నమ్మకమును లేపినది. భారత దేశమునకు మరలిన పిమ్మట ఆ దేశోద్ధరణకే కాక సకల మానవుల క్షేమమునకై ఆయన శ్రీరామకృష్ణ ప్రచారసంస్థ (మిషను)ను స్థాపించెను. పని ప్రారంభము అయినదో లేదో కార్యశేషమును పూరింప సోదరశిష్యులకు విడిచి 1902-వ సంవత్సరము జూలై తే 4 దినాడు ఆ మహాస్వామి మహాసమాధి నొందెను

## శిష్యులు

శ్రీ వివేకానందస్వామి పరమపదించిన తర్వాత ఆయనపని ఆగిపోవును, లేదా సహజముగనే అంతరించును అని అనుకొనినవారున్నారు. కాని నిత్యాత్మరూపియైన వివేకానందస్వామిప్రభావము భౌతికశరీరమున నున్నప్పటి వివేకానందస్వామి ప్రభావమునకు ఎంతమాత్రమును తీసిపోలేదు. 'నే నొక అశరీర వాణిని' అని ఆయనే ఒకసారి చెప్పినాడు. అశరీరమే అయినను ఆవాణి సోదరశిష్యులయు సొంతశిష్యులయు అసంఖ్యాకభక్తులయు ప్రశంసకులయు చెవులలో మ్రోగజొచ్చినది. ఆయనయెడ వారి కుండిన ప్రేమాదరములు ఆయన ప్రారంభించిన యుద్యమమును కొనసాగించు

నుత్సాహరూపమును దాల్చినవి. కావున సంస్థ, ఆ దెబ్బనుండి త్వరగనే తెప్పరిల్లినది. కాలక్రమమున దాని ప్రణాళికలకు వృద్ధియు వ్యాప్తియు కలుగసాగినవి.

శ్రీరామకృష్ణుని సందేశ మిప్పుడు సర్వత్ర వ్యాపించినది. ఆ నవ్యభారతమహాప్రవక్తను కొనియాడువారును భక్తులును ప్రపంచమం దంతట గననగుచున్నారు. సోదరసంస్థలైన రామకృష్ణమఠమును రామకృష్ణ సేవాసంఘము (మిషను)ను ప్రస్తుతము వివిధ కార్యరంగాలలో ఎంతగనో పురోగమించుచున్నవి. వానికి పెక్కు కేంద్రములు దేశములోను విదేశములందును ఉన్నవి. ఇంకను ఎక్కువ కేంద్రములు కావలసిన జరూరు హెచ్చుచున్నది. గురుదేవుని యద్వితీయసందేశబలమును, మాతృశ్రీ వాత్సల్యమును వివేకానందస్వాముల శ్రేష్ఠమగు తేజమునే కావు, శ్రీరామకృష్ణుని తక్కిన శిష్యుల ఆధ్యాత్మిక సిద్ధులుకూడ, ఈయుద్యమవిజయమున కాధారములుగ నున్నవి. సోదరశిష్యులు వివేకానంద స్వాముల మహోన్నతికి మఱుగున బడినందున వారిని వెలుపలిలోకము చాలినంతగా ఎఱుగదు, కాని వారిలో పెక్కండ్రు అసాధారణ వ్యక్తులే. ప్రతివారును గురుదేవుని కార్యసాధనకు తోడ్పడవలసినవారే, ప్రతియొక్కరును తన జీవితమున మహోజ్జ్వలముగ నెగ్గినవారే, అట్టివారినే గురుదేవుడు తన చుట్టును జేర్చుకొన్నట్లున్నది.

పెద్దదీపము ఆఱిపోయినపిమ్మట అందుండి వెలిగింపబడిన దీపములు పెక్కుచోట్లలో తమ వెలుగులను వెదజల్ల నారంభించినవి. నిజముగ గురుదేవుని ప్రతిశిష్యుడును విశాలప్రభావమునకు కేంద్రమై నూర్లకొలది మానవుల జీవితములలో మార్పుగల్గుటకు హేతుభూతుడయ్యెను. శిష్యులలో ఒక్కొక్కడును ఆధ్యాత్మిక మహావ్యక్తి, మహోత్కృష్టశీలుడు, నిరతిశయసిద్ధిమంతుడు, మానవతతికి కొంగుబంగారము. ఈ విషయమును తలంచుకొన్నచో ఒక్కకాలమున ఒక్కచోట ఇందఱు అతిమానుషశీలురు ఎట్లు సమకూడిరో అను అబ్బురము గలుగును. నిక్కముగ శ్రీరామకృష్ణుడు గొప్ప రత్నాభరణనిర్మాత. కావున ఆయన ఇన్నిరత్నములను(=ఇందఱుశ్రేష్ఠులను) ప్రోగుచేసి లోకమునకు ఒక ఆస్తిగా సంక్రమింపజేయగలిగెను.

---

# హిందూమతము - శ్రీరామకృష్ణావతారము

డా. దివాకర్ల వేంకటావధానిగారు

వేదకాలమునుండియు భారతదేశమున నవిచ్ఛిన్నముగా కొనసాగివచ్చుచున్న మతము హిందూమతము. కాలపురుషుని కరాఘాతముల తీవ్రత కించుకయు సడలక యింతకాలము నిల్చుటయే యామతముయొక్క ప్రాశస్త్యమునకు తార్కాణము. కాని యది యిన్ని శతాబ్దులకాలమును నిరుపద్రవముగను నిరాటంకముగను సుఖపరిణామము నొందియుండలేదు. అనేకసంస్థల జీవితమునందువలెనే దాని జీవితమునను పెక్కుక్లిష్టపరిస్థితు లరుదెంచినవి. నిదాఘకాలమున కృశించియుం బ్రావృట్సమయమున మరలం బుష్టినొందు జీవతరంగిణివలె నది యట్టిపరిస్థితు లరుదెంచినప్పుడు కొంచెము వెనుకంబడియు మరల శక్తిసంప

దల నలవఱచుకొని వృద్ధిఁబొందఁగల్గినది. అనన్యబాధకములును, సహనోపేతములును, సర్వోదాత్తములు నగు నందలిసిద్ధాంతముల యనవద్యతయే దాని కాబలము చేకూర్చినది.

హిందూమతవాహినికి మొదటియుపరోధము బుద్ధునికాలముననే గలిగినది. అందు యజ్ఞయాగాదికర్మలకుఁ గాలక్రమమున గలిగిన యతిప్రాధాన్యమును జూచి బుద్ధుఁడు దానిపై నొకవిప్లవము లేవఁదీసెను. సామాన్యజనులును సార్వభౌములునుగూడ నాతనిమతము నవలంబించి దానికి భారతదేశము నవ్వలఁగూడ వ్యాప్తి కలిగించిరి. ఆసమయమున హిందూమతము మిగుల కృశత్వము నొందిన మాట నిజమే కాని సంపూర్ణవినాశమును మాత్రము పొంద లేదు. గుప్తరాజులకాలమువఱకు నది యట్లే యడఁగి యుండి యుండి వారిపోషణమున మరల విజృంభించెను. ఆకాలమున సంస్కృతభాష వర్ధిల్లెను. పురాణములు వ్రాయఁబడెను; శాస్త్రములు వికాస మొందెను. తద్ద్వారా హిందూమతముగూడ నొకవిధమైన పునరుద్ధరణమును గాంచెను.

తరువాత భారతదేశము నేలినరాజులు కొందఱు బౌద్ధమును, కొందఱు హిందూమతమును బహుమానించిరి. యజ్ఞయాగాదులకు విరుద్ధముగా జైనబౌద్ధములు చేయుచుండిన ప్రచారము హిందూమతమునకు బాధకము గనే యుండెను. అందుచేతనే యేడవశతాబ్దిలోఁ గుమారిలభట్టు పట్టుపట్టి కర్మప్రాధాన్యముతోఁగూడిన పూర్వమీమాంసామతము నుద్ధరింపవలసివచ్చెను. శంకరుఁ డేకాలమున వర్ధిల్లెనో యిదమిత్థ మని నిర్ణయింపఁజాలము. కాని యాతఁడుగూడఁ గొంచెమించుమించుగా నీకాలముననే జనించి యద్వైతమతస్థాపనము గావించియుండును. వారిపూర్వోత్తరమీమాంసాసిద్ధాంతములప్రచారము రెండుమూఁడు శతాబ్దులకాలము మరల హిందూమతవల్లరికి వసంతాగమమై విరాజిల్లెను.

క్రీ. శ. పదవశతాబ్దినాఁటికి బౌద్ధమతము చాలవఱకు క్షీణించెను. జైనమత మచ్చటచ్చటఁ దలయెత్తుచునే యుండెను. అవైదికములైన యీ మతముల నవలంబించినవారు దేశభాషలలోఁ దమతమమతముల యాథాత్మ్యమును బోధించుచు సామాన్యజనుల నందఁ జేరుటకుఁ బ్రోత్సహింప మొదలిడిరి. అప్పటికి సంస్కృతభాషాప్రాబల్యము తగ్గుటచేఁ బ్రజలకు వేదపురాణాదులందు సుప్రపంచితములైన వైదికమతసిద్ధాంతములు సుబోధములు కాకపోయెను. అవైదికమతానుయాయు, లాయవకాశమును జూఱగొని విజృంభించుట చూచి భారతదేశమునందలి యాయాభాగములలోని రాజులును పండితులును హిందూమతసిద్ధాంతములను సర్వజనసుబోధములను గావించు తలంపుతో భారతమువంటి యుద్గ్రంథములను దేశభాషలలోనికిఁ దెచ్చుటకై ప్రయత్నించిరి. ఈ సందర్భముననే చాళుక్యకులాలంకారమగు రాజరాజనరేంద్రుఁడు నన్నయభట్టారకునిచేఁ బంచమవేదము నాంధ్రీకరింపఁజేసెను. ఈ ప్రయత్నము దక్షిణభారతదేశమునఁ జాలవఱకవైదికమతస్థులప్రచారముల కవకాశము లేకుండఁజేసెను. భారతరచనమువలన నాంధ్రదేశమున నొకవంక దేశభాషాభివృద్ధియు నింకొకవంక వైదికమతప్రచారమును విరివిగా సంఘటిల్లెను.

తరువాత నొకశతాబ్దికి హిందూమతమున శైవవైష్ణవభేదము లంకురించెను. వీరశైవము కొన్నిప్రాంతముల విజృంభించి వేదసంప్రదాయములకు విరుద్ధముగాఁగూడ వర్తింపఁజొచ్చెను. శివాయ విష్ణురూపాయ, శివరూపాయ విష్ణవే

యను సిద్ధాంతము పూర్తిగా విస్మరింపఁబడెను. అజ్ఞానకృతోద్రేకమైన యీ యనుచితవిభేదముచే హిందూమత మాకాలమునఁ గొంత యావిలమయ్యెను. ఆంధ్రదేశమునఁ దిక్కన సూరల భారతాంధ్రీకరణమున కారంభించి, దానిని హరిహరనాథ దేవుని కంకితముచేసి యద్వైతమతప్రచారమునకుఁ బ్రయత్నించి సార్థకజన్ముఁడయ్యెను. దానితో శైవవైష్ణవ భేదములు కొంతవఱకుఁ జల్లారె ననియే చెప్పవచ్చును.

తరువాత మహమ్మదీయుల దండయాత్రల వలన హిందూమతమునకు మహత్తరమైన యాఘాతము సంభవించెను. కాకతీయరాజ్య పతనానంతరము హిందువులు పడ్డకష్టములు వర్ణనాతీతములు. గంగాదేవి మధురావిజయములో దానిని గన్నులకుఁ గట్టినట్లు వర్ణించెను. హిందూమతమున కీ కాలమునఁ గలిగిన యీ యకాండప్రళయమును దొలఁగించి హిందువులను గాపాడినవారు విజయనగరరాజులు. వారాంధ్రసంస్కృతికిఁ బ్రత్యేకముగను, హిందూమతమునకు సామాన్యముగను గలిగించిన యభ్యుదయ మింతంత యని చెప్పరాదు. విద్యారణ్యసోదరులు రచించిన వేదభాష్యము వారు కావించిన హిందూమతోద్ధరణమునకు నిత్యనిర్మలమైన నిదర్శనము. అప్పటినుండి రెండుమూఁడుశతాబ్దులకాలము హిందూమతము నిరుపద్రవమును నిరతిశయ వైభవోపేతమునగు జీవితము సాగించెను.

క్రీ. శ. పందొమ్మిదవశతాబ్దిలోఁ బాశ్చాత్యులరాకతో హిందూమతమునకు మరల నుపద్రవము కలుగు సూచనలు పొడకట్టెను. పాశ్చాత్యపరిపాలకులతో వారిమతమైన క్రైస్తవమతముకూడ భారతదేశమునఁ బ్రవేశించెను. క్రైస్తవమతప్రచారకులు హిందువులలో బహుళప్రచారమున నున్న విగ్రహారాధనము, బహుదేవతాపూజనము వర్ణవ్యవస్థ మున్నగువాని నధికముగా నిరసించుచుఁ దమమతమునుఁ బలువిధములఁ బ్రచారము చేయఁదొడంగిరి. దానికి ఫలితముగా భారతీయులకు స్వీయమతాచారములపై నవిశ్వాసము జనింప నారంభించెను. విద్యాధికులైన భారతీయులే పలువురు ప్రార్థనమందిరములు స్థాపించి యేకేశ్వరోపాసనమును బ్రచారము చేయుటకును క్రైస్తవమతమును స్వీకరించుటకును ముందంజ వేయుచుండిరి మధుమాంస సేవన మొనరించుచు సనాతనమతమార్గానుయాయుల బహువిధముల హేళనముచేయుట కొందఱికిఁ బరిపాటి యయ్యెను. వారు సనాతనభారతీయమతమునే కాక భారతీయవాఙ్మయమునుగూడ నిరసించుటకు వెనుదీయరైరి. మైకేలు మధుసూదనదత్తను భారతీయవిద్యాధికునికి, రామాయణముపై గల యభిప్రాయమును బరిశీలించినచో నాకాలపుఁ బరిస్థితులు కొంతవఱకుఁ దేటతెల్లమగును. "శ్రీరాముని ఆతని వానరసేనను జూచిన నాకసహ్యము జనించును. రావణుఁడు నిజముగా నాదర్శవ్యక్తి" యని యాతఁడు నుడివియుండెనఁట! ఆతఁడు మేఘనాథవిజయ మను కావ్యమును రచించి యందిట్టి విపరీతసిద్ధాంతములకే కొన్నింటికిఁ దావొసంగెను. ఆధ్యాత్మికచింతాపరాయణమును, భగవద్దర్శనైకలాలసమునైన భారతీయజీవన మనాత్మవాదమునకును నైహికసుఖాన్వేషణమునకును నెలవై కలుషితమైపోవ నారంభించెను. సనాతనసంప్రదాయానుసారులగు భారతీయులు భారతజాతీయమతమే రూపుమాసిపోవునేమో యని భీతిల్లసాగిరి. అట్టిసమయమున ధర్మసంస్థాపన మొనరించి భారతీయ జీవనమును విశుద్ధము కావించుటకై

యవతారమూర్తివలె శ్రీరామకృష్ణుఁ డుద్భవించెను. ఆ మహనీయుని యుదయము సనాతనధర్మజ్యోత్స్నకు శరద్రాక; భారతీయ సంప్రదాయవల్లరులకు వసంతోదయము.

శ్రీరామకృష్ణుని హృదయము విశాలగంభీరమైనది. అమాయకత కది పుట్టినిల్లు. సర్వమతసిద్ధాంత మాతని యాదర్శము. ఆతని బోధనవిధాన మత్యద్భుతమైనది. ఆతఁ డెన్నఁడు నెదుటివారితోఁ దర్కింపక యొక్కమాటచేతనో, కీర్తనచేతనో, కటాక్షముచేతనో యపూర్వవిషయములనుగూర్చి సుస్పష్టముగా బోధించుచుండెను. ఆత్మసాక్షాత్కారమే మానవుని పరమావధి యనియు, నాత్మానందభరితమగు చిత్తమున వాదోపవాదములకుఁ దావు లేదనియు, జ్ఞానోదయమైనంతనే యరుణోదయమున నంధకారమువలె సంశయము లన్నియుఁ బటాపంచ లగు ననియు నాతఁడు సర్వదా వాక్రుచ్చుచుండెను. హృదయనైర్మల్యమును, గామకాంచనవిజయమును మోక్షసౌధారోహణమునకు నిశ్రేణులవలె నుపయోగపడునని యాతఁ డుద్ఘోషించుచుండెను. సాధనసంపదలేని శాస్త్రపాండిత్య మెంతైనను నిరర్థకమే యని యాతఁడు గాఢముగా విశ్వసించెను. పండితంమన్యులు గృధ్రములవంటివా రనియు, నవి యాకసమున నెంత యెత్తుగా నెగురుచున్నను వానిదృష్టి పూతిగంధహేయములగు శవములమీఁదనే ప్రసరించునట్లు వారి దృష్టియుఁ గామకాంచనములందే లగ్నమై యుండు ననియు నాతఁడు నుడువుచుండెను. ఎవరిశక్తిసామర్థ్యముల ననుసరించి వా రాత్మా ధ యత్నింపవలె ననియు ననుభవలేశమైనను లేని విజ్ఞానము ప్రయోజనరహితమనియు నాతఁడు బోధించుచుండెను.

రామకృష్ణుని బోధనలందలి మహత్త్వమంతయు నాతని పవిత్రవర్తనమందును, సాధనానుభవములందును నిమిడియున్నది. ఆతఁడు తా నుపదేశించిన విషయములనెల్ల జీవితమున ననుసంధించి చూపఁగలిగెను. సాంఘికవర్ణాశ్రమాచారముల కెన్నఁడు నాతఁడు విరుద్ధముగా బోధించియుండలేదు. భగవంతుఁడు సర్వాంతర్యామి యనియు, నాతఁడు వివిధవ్యక్తులలో వివిధరూపముల గోచరించుచుండుననియు, నందుచే నెల్లర నారాయణస్వరూపులుగా భావింపవలె ననియు నాతఁడు శిష్యులకు బోధించుచుండెను. ఆతఁడు క్షుద్రదేవతారాధనమునుగూడ నెప్పుడును నిరసించి యుండలేదు. మోక్షసౌధప్రవేశమున కవి దొడ్డిగుమ్మమువంటి వని యాతఁడు పలుకుచుండెను. భక్తులు భగవంతు నేరూపమున నెట్లారాధించినను దీవ్రపరితాప మొక్కటే తద్దర్శనమున కావశ్యక మని యాతఁడు విశ్వసించియుండెను.

చైతన్యదేవుని బోధనలందు భాగవతసేవ, భగవన్నామాసక్తి, సర్వజీవకారుణ్యము ననునవి ప్రధానసిద్ధాంతములు. శ్రీరామకృష్ణుఁ డందలి జీవకారుణ్యమును గూర్చి ప్రసంగించుచు "నీచక్రిమితుల్యులైన మానవులు జీవకారుణ్యము చూపుట కేపాటివారు? ప్రతిప్రాణియు భగవత్స్వరూపమని వారు జీవసేవ చేయవలెను. జీవకారుణ్య మనునది యర్థము లేని మాట" యని నుడివియుండెను. భారతీయ వేదాంతమున మానవసేవ కంతప్రాధాన్యము లేదని పాశ్చాత్యు లభిప్రాయపడుచుందురు. శ్రీరామకృష్ణుఁడు మానవసేవయే మాధవసేవ యని పలుసార్లు ముక్తకంఠముతో ఘోషించియుండెను. జీవారాధనములేని దైవారాధన యర్థములేని ప్ర[illegible] మని యాతని గాఢవిశ్వాసము.

స్వానుభవవేదాంత తరంగములచే దేశమంతయు ముంచెత్తిన మహనీయయోగిపుంగవుఁడు శ్రీరామకృష్ణపరమహంస. ఆతఁడు భక్తి జ్ఞాన, కర్మసిద్ధాంతములకును సనాతనాధునిక సిద్ధాంతములకును దనజీవితమున సామరస్యము కల్పించెను. ఆతనిసంసర్గమను స్పర్శవేదిప్రభావముచే నయోమయములైన జీవితము లెన్నో హిరణ్మయములై ప్రకాశించెను. ఆయనబోధనలు "విలసద్ద్యోమార్గఝురాంబు పౌనరుక్త్యములు." అందోలలాడినవా రెల్ల మోక్షమును జూఱగొనఁగల్గిరి. అట్టివారిలో ముందు పేర్కొనఁదగినవాడు వివేకానందుఁడు రామకృష్ణుని యుద్దేశములనే, యాశయములనే, యాతఁడు వివరించి, యాచరణముద్వారా వ్యాప్తికిఁ దెచ్చెను. భారతజాతి కా పవిత్రమూర్తులు కలిగించిన చైతన్యమును, భారతధర్మమునకు వారు ప్రసాదించిన యభ్యుదయమును నిరుపమానములైనవి. ఆధ్యాత్మికశక్తిసముద్రుఁడైన యాగురుదేవుని ప్రభావమే యాశిష్యశేఖరుని కితర దేశములలోఁగూడ నద్వైతదుందుభిని మ్రోయించు బల మొసంగెను. పాశ్చాత్త్యులరాకచే భారతదేశమునకుఁ గలిగిన రాజకీయదాస్యమును దరువాతి కాలమున మహాత్ముఁడువలె మతదాస్యము నంతకుముందే యా మహనీయమూర్తులు తొలఁగింప యత్నించి కృతార్థులైరి. ఆకాలమున నాయద్వైతమూర్తులవతరింపకుండినచో భారతీయమతమును, భారతజాతియు నప్పుడే రూపుమాసియుండెడివి.

ఈ మహనీయుల యాదేశముల నాదర్శముగాఁ గైకొని శ్రీరామకృష్ణమఠసేవాసంఘము పనిచేయుచున్నది సనాతనమతమును భారతదేశమునఁ బునరుద్ధరింపవలె ననిన నాసంస్థకును సమానధర్మములైన యితరసంస్థలకును భారతీయులు హృదయపూర్వకముగాఁ దోడ్పడవలసియున్నది. వెనుకఁబడిన సనాతనమతమును మరల నుజ్జీవింపఁజేయుట కది యొక మార్గము.

# రామకృష్ణ పరమహంస

డా. పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

ఈ పవిత్రభారతభూమిలో ధర్మలోపము మిక్కుటమైన సమయములలోను, సంస్కృతి జీర్ణమైపోగల అవకాశమున్న వేళలందును మహాపురుషులు జన్మించుచు వచ్చిరి. వారు అవతారపురుషులు. ఇట్టి పురుషులలో కొందఱు నివృత్తిమార్గమును, మఱికొందఱు ప్రవృత్తిమార్గమును, ఇతరు లీరెండు మార్గములను ప్రపంచించిరి. ఉభయమార్గప్రతిష్ఠాపకులగు వారిలో శ్రీరామకృష్ణపరమహంస భగవానుడు శ్రేష్ఠపురుషుడు. పూర్వము శ్రీ శంకరభగవత్పాదులనుగూర్చి చెప్పిన శ్లోకము శ్రీరామకృష్ణులయందు చరితార్థము. "గురోస్తు మౌనం వ్యాఖ్యానం, శిష్యాస్తుచ్ఛిన్న సంశయాః" అనినట్లు శ్రీరామకృష్ణుల కటాక్షము, ఆధ్యాత్మిక సంపద, అనుగ్రహము అపారమైనవి. ఈ సందర్భమున కొన్ని సంఘటనల నిట ప్రస్తుతించుట అవసరము.

బ్రహ్మసమాజము, క్రైస్తవము, ఇస్లాము మొదలగు విభిన్నధర్మాలతో సమాజము క్లిష్టపరిస్థితులలో చిక్కుకొనియున్న సమయమున గదాధరుడుగా జన్మించిన శ్రీరామకృష్ణులు చిన్న

తనమునుండి "తమసోమాజ్యోతిర్గమయ" అని ఆక్రోశించుచుండెను. చీకటినుండి వెలుగునకు బోవుమార్గమునే అన్వేషింప నిశ్చయించిన వాడగుటచే మామూలు చదువుసంధ్యల జోలికి పోక, దక్షిణేశ్వరమునగల కాళికాలయమున అర్చింపసాగెను. మిత్రుడగు సురేంద్రనాథుని ఇంటికి శ్రీరామకృష్ణులొకపరి వచ్చినపుడు భక్తికీర్తనలను గానము చేయుట కచటకు శ్రీ నరేంద్రనాథుడు వచ్చెను. ఇదే వారి ప్రథమ పరిచయము.

మన్ చలో నిజనికేతనే
సంసారవిదేశే విదేశీర్ వేషే.
భ్రమకేనో అకారణే

"ఓ మనసా, స్వగృహమున కేగుదము, రా. విదేశమగు ఈ సంసారమున పరదేశివై ఏల భ్రమించుచు తిరిగెదవు" అను అర్థముగల పాటను శ్రావ్యముగ నరేంద్రుడు పాడెను. శ్రీరామకృష్ణుని ఆనందమపారము. నరేంద్రుని ఏకాంతప్రదేశమునకు తీసికొనిపోయి, ఆనందాశ్రువులతో — "ఎంతకాలమునకు వచ్చినావోయి. నాయనా, ఇంతవఱకు నిర్దాక్షిణ్యుడవై ఎట్లుండ గలిగితివి!" అని పల్కి, నరేంద్రుని తనచెంతకు దెచ్చిన పరమేశ్వరుని స్తుతింప సాగెను. నరేంద్రునకిది విస్మయము కల్గించెను. లోకమనుకొనుచున్నట్లు శ్రీరామకృష్ణుడు పిచ్చివాడా అని ప్రశ్నించుకొనెను. కాని పిచ్చివాని లక్షణములు కన్పింపలేదు. నరేంద్రుని గూర్చి "ఇతడు ధ్యానసిద్ధుడు. పుట్టుకతోడనే ధ్యానపరిపాకమునందిన 'సిద్ధుడు' "అని శ్రీరామకృష్ణు డితరులతో ననెను. ఆనాటినుండి వారు ఒకరినొకరు చూడక ఉండలేక పోయెడివారు.

నరేంద్రు డొకనాడు శ్రీ రామకృష్ణులవద్దకు వచ్చి తన్ను అనేకదినములనుండి వేధించుచున్న ప్రశ్నను వేసెను. "మీరు భగవంతుని చూచితిరా!" అని ప్రశ్న. ఇంతవఱకాయనకు భగవంతుని నేను చూచితిని అని పల్కిన వ్యక్తి కన్పింపలేదు. అప్పుడు శ్రీరామకృష్ణులు— 'ఔను. నిన్ను చూచుచున్నట్లే భగవంతుని చూచుచున్నాను. ఇంతకంటె ఎక్కువ స్పష్టముగ గాంచుచున్నాను. భగవత్సాక్షాత్కారమును పొందవచ్చును. నేను నిన్ను ఇపుడెట్లు చూచుచుంటినో అట్లే భగవంతుని చూడవచ్చును. నీతో నేనెట్లు సంభాషించుచుంటినో అట్లే మనము భగవంతునితో మాట్లాడవచ్చును. కాని భగవంతునికొఱకు తపించువారేరి? సంతానములేదనియో, సంపద కలుగలేదనియో ప్రజలు విలపింతురు. కాని భగవంతునికొఱకు విలపించువారేరీ? నిజముగా పరితపించుచో భగవంతుడు తప్పక ప్రత్యక్షము కాగలడు" అని సమాధానము చెప్పెను. ఇంత స్పష్టముగా, ఆత్మవిశ్వాసముతో భగవద్దర్శనము చేసితిని అని పల్కినమాటలు నరేంద్రునకు తృప్తికలిగించినవి.

ఒకమాసము గడచిన తర్వాత నరేంద్రుడు మరల శ్రీరామకృష్ణులను దర్శించెను. ఆనందపరవశులైన శ్రీరామకృష్ణులు నరేంద్రుని దగ్గఱకు పిలిచి, అతని శరీరముపై తమ కుడిపాదము నుంచిరి. నరేంద్రునిలో తీవ్రమైన మార్పు వచ్చెను. ప్రపంచమంతయు తిరిగిపోవుచున్నట్లుండెను. భయాందోళనలు కల్గినవి. శ్రీరామకృష్ణులపుడు తమ చేతిని ఆయనమీద నిలుపగనే స్థిమితము చేకూరెను. వేఱొకసారి ధ్యాననిమగ్నులైన శ్రీరామకృష్ణులు నరేంద్రుని స్పృశింపగనే నరేంద్రునకు బాహ్యస్మృతిపోయెను.

నరనారాయణులు విడదీయరానిజంట. అనేకములగు అవతారములనెత్తి భారతభూమిని కాపాడిరి. నరుడర్జునుడై, నారాయణుడు కృష్ణు

డైరి. వారి ఎడబాటు ఇరువురకు వ్యథాజనకమే. అట్లే నరేంద్రుడు కన్పింపకపోతే శ్రీరామకృష్ణులు దిగులుపడెడివారు. ఇట్టి పరితాపసమయమున "అమ్మా, కాళీభవానీ, నారాయణస్వరూపుడగు నరేంద్రుని నాదరికి రప్పింపవా?" అని శ్రీరామకృష్ణులు వేడుకొనెడివారు. నారాయణుడే నరేంద్రావతారమునెత్తి ప్రజలకు ధర్మోపదేశము నీయవచ్చెనని పురుషోత్తముడగు శ్రీరామకృష్ణుని భావన. కావుననే ఒకసారి ఆయన నరేంద్రునకు సమాధిస్థ నొసగి అతనిచే తనకు కావలసిన విషయములపై సమాధానములను రాబట్టుకొనెను.

ఇంకను తనగురువు శ్రీరామకృష్ణులే అను స్థిరభావము కలుగకపోవుటవలన నరేంద్రుడు పరమహంసను పరీక్షింపనెంచెను. ఇతర శిష్యులును, పరమహంసయు లేని సమయమున శ్రీరామకృష్ణుని ప్రక్కక్రింద నరేంద్రుడొక రూపాయి నాణెమునుంచెను. కామినీకాంచనములను పరిత్యజించిన గురువుగారికి పరీక్ష. తర్వాత శ్రీరామకృష్ణులువచ్చి ప్రక్కపై కూర్చుండిరి, కాని వెంటనే మనస్సు వికలమాయెను. శరీరము కంపరమెత్తెను. "ఇందేమైన పురుగుగలదేమో" అని ప్రక్క దులిపించిరి. వెంటనే ఆ వెండినాణెము క్రిందపడినది. శ్రీరామకృష్ణులు ఇది ఎవరుంచిరో గ్రహించి ఆనందించిరి.

నరేంద్రునకు వివాహము చేయవలెనని తల్లి సంకల్పించుచున్న సమయములో ఆయన శ్రీరామకృష్ణుని దర్శించుచునే యుండెను. "పండ్రెండేండ్లు బ్రహ్మచర్యనిష్ఠను గడపిన సూక్ష్మగ్రహణశక్తి వికసించును. అపుడు మిక్కిలి సూక్ష్మవిషయములను సహితము మనస్సు గ్రహింపగలదు. విశుద్ధ విజ్ఞానమలవడును. దానితో భగవత్సాక్షాత్కారమును పొందవచ్చును" అని శ్రీరామకృష్ణుల ఉపదేశమును ధారణ చేయసాగెను. ఒక పరమప్రయోజనమును సాధింప నరేంద్రుడవతరించెనని శ్రీరామకృష్ణుల దృఢవిశ్వాసము. కాని ఆయన తనంతట తానే దానిని చెప్పలేదు.

దారిద్ర్యబాధతో ఒకనాడు నరేంద్రుడాయనవద్ద కేతెంచి, దారిద్ర్య విచ్ఛిత్తికి ఉపాయము ప్రార్థించెను. 'ఐహిక సుఖములకై నేను దేవిని ప్రార్థింపజాలను నీవే ఆమెను అడుగుము" అని శ్రీరామకృష్ణులు 'నిర్మొహమాటముగ పలికిరి. అప్పుడు నరేంద్రుడు దాలయములోనికి పోయి—"తల్లీ, నిర్మలజ్ఞాన, భక్తి, వైరాగ్యములను ప్రసాదింపుము" అని హృదయపూర్వకముగా ప్రార్థించెను. ఆలయమునుండి బయటకు రాగానే తానుచేసిన ప్రార్థనను శ్రీరామకృష్ణులకు వినిపించెను. మరల ఆలయములోనికి పోయిరమ్మని శ్రీరామకృష్ణులనిరి. ఇట్లు ఇదేప్రార్థనను ముమ్మారు చేసి వచ్చిన తర్వాత సంప్రీతులైన పరమహంస— "నరేంద్రా, మీ కుటుంబమున కిక అన్నవస్త్రముల కొరత లేదు. ఆపనిని జగన్మాతయే చూడగలదు" అని పలికిరి. శ్రీరామకృష్ణుల అనుగ్రహమువలన నరేంద్రుడొక విగ్రహము ముందు నిలబడి ప్రార్థించుట అదే తొలిసారి.

శ్రీరామకృష్ణ పరమహంస జీవితము ధన్యమైనది. వివిధ విధానములతో సంఘము తారుమారౌచున్న సమయములో ఆయన అవతరించి, నరేంద్రునివంటి శిష్యుని బడయగలిగెను. ఔపనిషద సూక్తి ననుసరించి "ఆచార్యవాన్ పురుషో వేద." వివేకానందస్వామి తమకు సరియైన గురువును వెదకి, పొందగలుగుటచేతనే భారతదేశము మరల ఆధ్యాత్మికముగా పునరుజ్జీవితమైనది. నరేంద్రుడు వండిన పదార్థములను తినుటలో శ్రీరామకృష్ణులు సంకోచింపలేదు.

ఆయన పవిత్రహృదయుడు. జీవసేవ, జీవకారుణ్యము కావలసిన ముఖ్యప్రవృత్తులు అను ప్రబోధమును నరేంద్రుడు పూర్తిగా తెలిసికొనగలిగెను.

ఒకనాడు ధ్యానములోనున్న నరేంద్రునకు ఆకస్మికముగా ఒక దివ్యజ్యోతి కన్పించెను. ఆ వెలుగులో ఆయన మునిగిపోయెను. శరీరము బిగిసిపోయెను. సహచరులు భయభ్రాంతులై పరమహంసకు విన్నవించిరి. "అతనిని కొంత కాలము అట్లే ఉండనిండు. దానికై అతడు నన్ను చాల కాలమునుండి వేధించుచున్నాడు" అనిరి. ఆ నిర్వికల్పసమాధినుంచి బయటకు వచ్చిన నరేంద్రునితో "అమ్మ నీకిపుడు సర్వమును చూపినదిగదా! నీవు చేయవలసిన మహత్కార్యము చాలగలదు" అని గురువుగారనిరి.

పరమహంస భౌతికకాయమునకు అంత్యఘడియ లాసన్నమైనవి. అప్పుడు నరేంద్రుని చేరబిలిచి తదేకదృష్టితో ఆతనివంక జూచుచు ధ్యాననిమగ్నుడాయెను. అట్టియెడ విద్యుత్ప్రవాహమువలె ఒక తేజస్సు శ్రీరామకృష్ణుల నుండి తనలోనికి ప్రవేశించినట్లు నరేంద్రుడు గ్రహించెను. తర్వాత నరేంద్రునకు స్మృతి తప్పెను. కొంతసేపటికి తెలివివచ్చెను. అప్పుడు శ్రీరామకృష్ణులు — "నరేంద్రా, నాసర్వస్వమును నీకు ధారపోసితిని. నాలో నిపుడు ఆధ్యాత్మిక సంపద లేదు. బిచ్చగాడనైతిని. నేనిచ్చిన శక్తితో లోకమున నీవు మహత్తర కార్యము లొనర్పవలెను" అని ఆదేశించిరి. అట్టి మహనీయమూర్తి చిరస్మరణీయుడు.

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ.

# శ్రీరామకృష్ణ భగవానుడు

## శ్రీ కేశవతీర్థస్వామివారు

పరివర్తనశీలమైన ప్రపంచంలో, సంస్కారణావశ్యకత కలిగినప్పుడు, విశ్వశక్తి సాగరము (శ్రీమహావిష్ణువు) నుండి మహాదివ్యతరంగ మొకటి సముద్భూతమై, అధర్మకలుషప్రవాహ నాశనం చేసి, ధర్మసముద్ధరణం చేస్తుంటుంది. అట్టి జగదుద్ధారకులైన అవతారపురుషులకు భారతవర్షం జన్మభూమి.

నవయుగారంభ మది. జగతిలో జడభావతమస్సులు దట్టంగా క్రమ్ముకొన్నవి. మానవులు తమలోని దివ్యత్వమును విస్మరించి, కామకాంచనవిభ్రాంతులైనారు. భౌతికవాదప్రపూర్ణమైన పాశ్చాత్యసంస్కృతిప్రవాహం, ప్రమత్త భారతంపై ఉప్పొంగిపడింది. భారతఋషిసంస్కృతిపై తిరస్కృతులు విజృంభించాయి. భారతజాతి, సనాతన ధార్మికజీవనప్రకాశమును విస్మరించి, పాశ్చాత్యభావప్రభావితమై, స్వధర్మశ్రద్ధావిశ్లథమై, సంశయాందోళన ప్రవాహంలో పడి కొట్టుకొని పోసాగింది. అర్థపరమార్థసమన్వయజ్ఞానం అంతరించింది. మానవకోటి అనుష్ఠానమతరహితమై అపన్నమైంది.

అప్పుడు భారతరంగమున వివిధసంస్కారణోద్యమాలు ఆవిర్భవించాయి. ఆశాతారలుదయించాయి. మెల్లమెల్లగ చీకటి విరియసాగింది. విశ్వసుప్రభాత మేతెంచింది. ఆర్యావర్తప్రాచీదిశయందు శ్రీరామకృష్ణసూర్యభగ

వానుడు సాక్షాత్కరించాడు. ఆవిశ్వబాంధవుని సార్వజనీనసందేశకిరణాలు, నిద్రాణజగతికి జాగృతి కలిగించాయి.

సర్వమతసామరస్యాత్మకమైన, విశ్వజనీన ప్రయోజనకరమైన భారతీయసనాతన వేద విజ్ఞాన పరిపూర్ణస్వరూపం, శ్రీరామకృష్ణుని యందు ప్రకటితమైంది. ఆయన మహాదర్శజీవి తోపదేశాలు విపర్యయ ప్రపంచ వ్యవహారాలను సంస్కరించి స్వాస్థ్యమును చేకూర్చాయి. అవి సర్వమతాలను, సర్వసంస్కృతులనూ, సర్వసిద్ధాంతాలనూ, సర్వాచారాలను సమన్వయించి పునర్నిర్మాణ మొనరించాయి. ఇహపరాలకు ముడివేశాయి. నరునిలోని నారాయణాత్వమును కప్పియున్న తెరను తొలగించి, తృష్ణాతీతమైన ఆదివ్యప్రకృతిని ప్రకాశింపజేసి, జీవితకల్లోలమును పరిష్కరించాయి.

శ్రీరామకృష్ణపరమహంస, వంగదేశమున కామార్పుకుర్ అనే ఒకగ్రామంలో క్రీ. శ. 1836 ఫిబ్రవరి 18 వ తేదీ, సనాతనధర్మాను క్రమమైన, త్యాగతపోనిలయమైన, ఒకదరిద్ర బ్రాహ్మణకుటుంబంలో జన్మించారు. ఆయన ప్రథమనామం గదాధరుడు. విరాగము, ఈశ్వరాన్వేషణము, ఆయనలో శైశవమునుండే మొలకెత్తసాగినవి. ప్రహ్లాదునివలె ఆయన లౌకికవిద్యలయెడ కేవలం విముఖుడు. ఆత్మ జిజ్ఞాస, మహాపురుష సమాశ్రయణాదులయందాయనకు అభిరుచి అనంతం. పదునేడేండ్ల వయస్సున ఆతడు కలకత్తాకు చేరాడు. అన్న గారైన రామకుమారునకు దక్షిణేశ్వరకాళీ సమర్చనయందు తోడ్పడుతూ, తుదకు ఆ దక్షిణేశ్వర కాళికాలయమందే పూజారి యైనాడు. ఆత డొనర్చిన విగ్రహారాధన విధానం, హైందవవిగ్రహారాధన ప్రయోజన విశిష్టతలను నిరూపించింది.

ఆతడు, భగవంతుని జగన్మాతృరూపమున ఆరాధింపసాగాడు. ఆ బాలభక్తునిలో సాక్షాత్కారకాంక్షాజ్యోతి ప్రచండమై దీపించింది. గాఢప్రార్థనలతో, ఈశ్వరప్రణయపరితాప నైరంతర్యముతో, ఆతరుణతపస్వి దేవీదర్శన శ్రీని పొందాడు. తదుపరి, వివిధశాస్త్రవిధానములద్వారా, హైందవ - క్రైస్తవ-మహమ్మదీయాది వివిధమతసాధనలద్వారా, ఏకైక గమ్యముగా బ్రహ్మానుభూతినొంది, 'ఏకం సత్, విప్రా బహుధా వదంతి' అన్నవైదిక సందేశమును విస్పష్టపఱచి, సర్వమతాశయాలను సార్థకపఱచాడు. ఆతని దివ్యసారవశ్య జీవనసౌందర్యసమ్ముఖమందు, మానవునిలోని జడవాదము తన వికృతరూపమును గ్రహించి లజ్జించింది. బ్రహ్మ సత్యం, జగన్మిథ్య - అన్న పరమాస్తిక్యదర్శనశ్రీ నతడు లోకమునకు తిరిగి ప్రసాదించాడు. ఆదివ్యపురుషునిలో పొంగిన శాశ్వతబ్రహ్మానందోన్మాదం, నాగరిక ప్రపంచ క్షణికవిషయసుఖోన్మాదాన్ని విరిచివేసింది.

భైరవీబ్రాహ్మణి అనే వైష్ణవయోగిని, ఆయన అవతారరహస్యమును వివృతంచేసింది. ఆతడుతన అసాధారణ నిర్వికల్పసమాధిస్థితిచేత తనకు అద్వైతోపదేశమిచ్చి సన్న్యాసమొసగిన తోతాపురిని, ఆశ్చర్యచకితుని చేశాడు. నవ యువతియైన ఆయన సహధర్మచారిణి శ్రీ శారదాదేవి, సాధనకాలమునుండి మహాసమాధివఱకు, ఆయన సన్నిధియందే బ్రహ్మచారిణియై వసించి. స్త్రీరూపమునగల శ్రీరామకృష్ణ దివ్యరూపమై, భారతసాధ్వీ తేజమును నవప్రపంచానికి చూపి, ధన్యమొనర్చింది. స్త్రీపురుషులకు కావలసిన సర్వాదర్శములు, శ్రీశారదారామకృష్ణులలో ప్రత్యక్షమైనవి.

శ్రీరామకృష్ణదేవుని దివ్యానందతన్మయత, అమోఘోపదేశాలు, ఆబాలగోపాలమును నాకర్షించాయి. నాస్తికు లాతనిమ్రోల ఆస్తికులైనారు. ఆస్తికు లాతని సన్నిధిలో పరమాస్తికులైనారు. పండితు లాతనిమ్రోల విద్యార్థులైనారు. నిరక్షరు లాతని కటాక్షవీక్షణముతో పండితులైనారు. మధుపానమత్తు లాతని సాంగత్యశ్రీచే, బ్రహ్మానంద రసపానమత్తులైనారు. ఆయన విశ్వప్రేమ అపారమైంది. చండాలగృహము నాతడు తన శిరోజములతో నూడ్చి, నరనారాయణసేవాపథమును నవప్రపంచానికి చూపించాడు.

వారాంగనలలోసైత మాతడు జగన్మాతను సందర్శించి, కామాంధప్రపంచానికి కన్నులు తెరిపించాడు. ఆ మహాపురుషుని గభీరప్రేమామృతము, సార్వజనీనమై ఏకధారగా వర్షించింది. ఆయన సమన్వయ సంస్కారణవిధానాలు, వివిధమానవులకు వివిధోపకరణాలను గూర్చి, జీవితగమ్యమును చేకూర్చాయి. ముఖ్యంగా ఆయన, కొందఱు శిష్యులకు విశిష్టశిక్షణ నిచ్చి, దైవసాక్షాత్కారబలోపేతులనుగా జేసి, సన్న్యసింపజేసి, మానవసేవాయజ్ఞమునకు ఉపక్రమింపజేసి 1886 లో మహాపరినిర్వాణపద మధిష్ఠించాడు.

ఆ సర్వమత సమన్వయప్రవక్తకు ముఖ్యశిష్యుడైన శ్రీమద్వివేకానందస్వామి తన ఆచార్యుని సనాతనధర్మసందేశమును ప్రాక్పశ్చిమ ఖండములందు ప్రతిధ్వనింపజేశాడు. ఆయన దివ్యసందేశ ప్రచారానికై జనతాజనార్దనసేవాదృష్టితో, శ్రీరామకృష్ణమఠ - సేవా సంస్థలను - సంస్థాపించాడు.

శంకరుని అగాధమేధ, చైతన్యదేవుని మహాహృదయము, శ్రీరామకృష్ణదేవునిలో ఏకాకృతి ధరించాయి. సనాతనసత్యములను, జగతికి ప్రకటించి ప్రస్ఫుటం చేయడమే శ్రీరామకృష్ణుని అవతారప్రయోజనం. ఆధునిక ప్రపంచానికి శ్రీరామకృష్ణునిమహాసందేశమును శ్రీవివేకానందస్వామి వారిట్లు వినిపించారు: "సిద్ధాంతాలు, మతవాదాలు, సంప్రదాయాలు, ఉపాసనామందిరాలు, దేవాలయాలు మొదలైనవన్నీ నిమిత్తమాత్రాలు. మానవహృదయంలో ప్రకాశిస్తున్న ఆత్మవస్తువుతో ఉపమించేయెడల ఇవి గౌణాలు. ఆత్మసాక్షాత్కృతికి ఉపకరణాలు. ఆ ఆత్మవస్తువే ఆధ్యాత్మికశక్తి. ఈ శక్తి ఎంతగా అభివృద్ధిపొందితే, అంతగా మానవునియందు జగత్కల్యాణకరశక్తి అభివృద్ధి పొందుతుంది. ఈ దివ్యశక్తిని ముందు సంపాదించుకో. దీనిని పొందడానికి యత్నించు. ఇతరధర్మాలను నిందించకు. ప్రతి మతంలో, ప్రతి సిద్ధాంతంలో ఏదో కొంత మంచి ఉన్నది. ధర్మము (మతము) మాటలలో, సంప్రదాయాల్లో దాగిలేదు. ధర్మమంటే - దైవానుభూతి-అని జీవితగమనంలో ప్రదర్శించు. సాక్షాత్కారానుభవశాలులే సత్యాన్ని గ్రహించగలుగుతారు. వారే జగద్గురువులు. వారే జ్ఞానజ్యోతి ప్రసాదించే శక్తికేంద్రాలు.

ఓం! ఓం!! ఓం!!!

# శ్రీరామకృష్ణ పరమహంస - సనాతన ధర్మము

శ్రీ పోలూరి హనుమజ్జానకీరామ శర్మగారు

1. శ్రీరామకృష్ణుని స్మరించినంతనే ఆత్మావలోకన నిరతమైన యొకానొక యానందమూర్తి మనోగోచర మగును. అట్టి సిద్ధపురుషు లనేకులు ప్రపంచసంగము నిచ్ఛగింపక నిరంతరము సమాధినిష్ఠు లయి యుందురు. వారిలో కొందఱు మాత్రమే దయాతిశయమున తమ్ము నాశ్రయించినవారికి తరణోపాయము నుపదేశించుచుందురు. వారియుపదేశము లన్నియు ప్రశ్నోత్తర రూపముననే యుండును; ఉపన్యాసముల వలె నుండవు. వారు ఒక్కొక్క శిష్యునకు, వాని యోగ్యతనుబట్టి ఒక్కొక్క పద్ధతిని బోధించుచుందురు. ఒకనికి యోగ్యమైనది వేఱొకనికి శ్రేయస్కరము కాకపోవచ్చును ఆ యుపదేశములు చాలవఱకు నాయా వ్యక్తులసంశయ నివారణమునకే పరిమితము లయి యుండును. కావుననే వానిని గ్రంథరూపమున వెలయింపవలయు నను కుతూహలము ఆ గురువులకుఁగాని, శిష్యులకుఁగాని సాధారణముగ నుండదు. అయినను మిగుల విఖ్యాతులైనవారి యుపదేశములు అప్పుడప్పుడు గ్రంథరూపమున వెలయుచుండును. అవి శిష్య సంశయ నివారణమునకు పరిమితములై యున్నను ఇతర జిజ్ఞాసువులకు కూడ పెక్కు సంశయములను తొలగించుచు సద్విషయముల బోధించుచు బహుముఖముల నుపకరించుచుండును. భాగ్యవశమున శ్రీరామకృష్ణుని యుపదేశములు కూడ శిష్యావతంసుల శ్రద్ధవలన గ్రంథముగ రూపొందింపఁబడినవి. వానిని శ్రీ చిరంతనానందస్వామి "శ్రీరామకృష్ణ బోధామృత" మను పేర తెలుఁగునకు తెచ్చినారు. ఆ గ్రంథ మాధారముగ ఆత్మానందశిఖరము నందుకొనుటకు మనకు శ్రీరామకృష్ణపరమహంస నిర్దేశించిన మార్గ మెట్టిదో కొంతవఱకు గ్రహింపవచ్చును.

2. ఆత్మసాక్షాత్కార మను గమ్యమునకు స్వధర్మమే ఎవనికైనను యుక్తమార్గ మనుట ఆయనయుపదేశములలో ముఖ్యమైనది. ఈ విషయమును ఆయన ఇట్లు స్పష్టపఱచియున్నాఁడు. "ప్రతివ్యక్తియు తన మతధర్మముల ననుసరింపవలయును. క్రైస్తవుడు క్రైస్తవమతమును, మహమ్మదీయుడు మహమ్మదీయమతమును అవలంబింపవలయును. హిందువు ఋషులు అవలంబించిన సనాతనధర్మము నవలంబించుటయే సర్వోత్తమము." [ఉపదేశము 482.] శాఖాసంప్రదాయములను గూర్చి సైతము ఆయన ఇట్లే బోధించియుండెను. "పార్వతి యొకసారి పరమేశ్వరుని ఇట్లు ప్రశ్నించెను. 'నాథా, శాశ్వతబ్రహ్మానందమును పొందుటకు కీలక మేది?' 'అందులకు శ్రద్ధయే కీలకము' అని పరమేశ్వరుడు సమాధానము చెప్పెను. కావున శాఖాసంప్రదాయములలో నేమియును లేదు. ప్రతి మానవుఁడును తన సంప్రదాయము నందలి నియమములను సాధనలను శ్రద్ధాభక్తులతో నవలంబించుట పాడి." [ఉపదేశము-499.]

3. తత్త్వసాక్షాత్కారము పర్యంతము శాస్త్రవిహితములైన ధర్మకర్మములను ఆచారములను తప్పక పాటించుచుండవలయు ననియే ఆయన యుపదేశించెను. "వరిగింజ మొలకెత్తి పెరుగుటకు అందుండు అంకురమే ప్రధానమనియు పైనున్న ఊక అప్రధానమనియు సామాన్యముగ దలంతురు, అయినను ఊకలేని బియ్యపుగింజను నాటిన యెడల అది మొలకెత్తి మొక్కయై పంట నీయజాలదు గదా! పంట

కావలసిన యెడల ఊకగలిగి చెక్కు చెదరక యున్న విత్తనములనే నాటవలయును. మత ధర్మములు నిలుచుటకేమి, అభివృద్ధిబొందుటకేమి, కర్మములును ఆచారములును ఆవశ్యకములై యున్నవి. అవి తత్త్వాంకురములను తమలో భద్రపఱచుకొనిన విత్తనములు. పరమార్థమును - పరతత్త్వమును - స్వానుభవముచే తెలిసికొనువఱకు ప్రతి మానవుఁడును కర్మములను ఆచరించుచుండవలసినదే.'' [ఉపదేశము-309.] ''పుండు మానిపోయిన తర్వాత పక్కు దానంతట అదియే రాలిపోవును. కాని అంతవఱకు ఆగక పక్కును బలాత్కారముగ లాగివేసితిమా, పుండునుండి నెత్తురు కాఱ నారంభించును. బ్రహ్మసాక్షాత్కారము కలిగిన వానినుండి జాతిభేదములు వానియంత నవియే వీడిపోవును; కాని పామరులై యుండియు (జనులు) అట్టి భేదముల నతిక్రమించుట తప్పు. దానివలన అనేకములైన అనర్థములు వాటిల్లును.'' [ఉపదేశము-312.] ''చెట్టున పక్వమై రాలిన పండు మధురముగ నుండును; కాని కోసి పండవేసిన కాయ అంత తియ్యగ నుండదు; మఱియు శీఘ్రముగ వాడిపోవును. ఆరీతినే ముక్తుఁడై సర్వభూతములందును గల ఏకత్వమును గాంచిన మహనీయునుండి జాతిభేదములు కులాచారములు తమంత తామే రాలిపోవును. కాని ఇట్టి దివ్యానుభవము కలుగకుండునంత వఱకు ఇతరులయందలి ఎక్కువ తక్కువలను లక్షింపకుండుట ఎవ్వరికిని సాధ్యము కాదు. అట్టి వారెల్లరును జాతిభేదాదులను పాటింపవలయును. అజ్ఞానస్థితిలోనే కులాచారములను జాతిభేదములను అన్నిటిని త్రోసిరాజని విచ్చలవిడిగ సంచరించుచు సిద్ధత్వము పొందినటుల నటించునేని అట్టివాడు కృత్రిమముగ పండవేసిన లేత కాయవలె చెడును.'' [ఉపదేశము-313.]

౪. ఆహారనియమమును గూర్చియు శ్రీరామకృష్ణుడు జాగరూకత ఆవశ్యక మని బోధించినాడు. ''ఒక విద్యార్థి శ్రీరామకృష్ణుని సందర్శించి ఇట్లు ప్రశ్నించెను. 'అయ్యా, ఒకే దేవుడు సర్వభూతములందును సంస్థితుడై యుండ ఎవని చేతి యాహారమును, గైకొనినను హాని ఏమి ?' శ్రీగురుదేవుడు, 'నీవు బ్రాహ్మణుడవా?' అని యడుగ నాతడు 'అవు' ననియెను. అంత గురుదేవు డిట్లనియెను. 'అందువలననే నీవు నన్ని ట్లడిగినావు. నీవొక అగ్గిపుల్లను వెలిగించి దానిపై ఇన్ని ఎండుకట్టెలను పడవైచితి వనుకొనుము. ఏమగును?' 'వానిచే కప్పబడి నిప్పు ఆరిపోవును' అని విద్యార్థి బదులుచెప్పెను. మరల గురుదేవు డిట్లనియెను: 'కార్చిచ్చు మండుచుండగా ఇన్ని పచ్చి అరటిబోదెలను తెచ్చి దానిలో డవేసితి వనుకొనుము, అవి ఏమగును?' 'ఒక్కక్షణములో భస్మమయి పోవును.' అని విద్యార్థి సమాధానము చెప్పెను. అంత గురుదేవు డిట్లు బోధించెను. 'ఆవిధముగనే నీలో ఆధ్యాత్మికశక్తి చాల దుర్బలముగ నున్నప్పుడు విచక్షణ లేకుండ, అడ్డమైన వారి చేతినుండియు తినుచుండిన యెడల ఆ రవంత శక్తి కూడ అణగిపోవచ్చును, ఇదియే యిందున్న ప్రమాదము. కాని ఆ శక్తియే ప్రబలముగ నున్నపుడో, నీవు ఎట్టి ఆహారము తిన్నను బాధ లేదు'.'' [ఉపదేశము - 388.]

౫. సనాతనధర్మమున తల్లిదండ్రులు ప్రత్యక్షదైవతములు, ప్రతిమానవునకును వారి నారాధించుటయే ప్రథమకర్తవ్యము. దీనిని శ్రీరామకృష్ణపరమహంస నొక్కి వక్కాణించెను. ''తల్లిదండ్రులు నరునకు ముఖ్యులు. వారు సంతుష్టులు కానిదే ఏ సాధనలు ఫలింపవు; శ్రీచైతన్యుని గనుడు, భగవద్భక్తిపరవశుడయ్యును తాను సన్న్యాసము స్వీకరించుటకు

పూర్వము తల్లిని సమాధానపఱచుటకు ఎంత శ్రమపడెనో! 'అమ్మా, దుఃఖింపకుము; అప్పు డప్పుడు వచ్చి నిన్ను దర్శించుచుందును' అని చెప్పెను. దేవతల ఋణము, ఋషుల ఋణము, పితరుల ఋణము, భార్య ఋణము—అని మానవుడు తీర్పవలసిన ఋణము లెన్నో యున్నవి. తల్లిదండ్రులఋణమును దీర్పనిచో నే కర్మమును ఫలింపజాలదు. భార్యయెడలను దీర్పవలసినఋణ మున్నది. తనభార్యను విడిచి పెట్టి హరీశు డిక్కడ నున్నాడు. ఆమె కేదియో జీవనోపాధి కల్గింపకుండు నెడల నే నాతని దుర్మార్గు డని యందును. రామప్రసన్ను డెంత సేపును హఠయోగికి నల్లమందు పాలు సమ కూర్చుటకై దేవులాడుచున్నాడు. మనువు సాధు సేవను విధించియున్నా డని ఆతడు చెప్పెను. ఈత డిట్లు తిరుగుచుండ ఇతని ముసలితల్లి తిను టకు లేక పస్తుండవలసివచ్చుచున్నది. ఆ తల్లి తానే బజారునకు బోవలయును. ఈ చర్య జూచిన నాకు ఒడలు మండుచున్నది.'' [ఉప దేశము - 443]. ''లోకమున ఎల్లరకును తల్లి దండ్రు లెంతయు పూజార్హులు. వారు జీవించి యున్నంతవఱకు శక్తికొలదియు వారిని సేవింప వలయును. మరణానంతరము యథోచితముగ వారికి శ్రాద్ధకర్మముల నొనర్పవలయును. పుత్రుడు గర్భదరిద్రుడై యున్నను, శ్రాద్ధము జరుపుటకు శక్తిలేనివాడై యున్నను, వనమునకు బోయి తన అశక్తత నెంచి కన్నీరు విడువవల యును. అప్పుడు తల్లిదండ్రులయెడ ఋణ విముక్తు డగును......'' [ఉపదేశము - 445]

6. ఆధ్యాత్మికవికాసమునకు తీర్థయాత్రలు కూడ ముఖ్యసాధనములే. అయినను, భగవం తుడు సర్వాంతర్యామియై యుండగా ఆయనను ప్రార్థించుటకై ఎచ్చటికో పోవుట యెందులకు అని సంశయించువారును నేడు కొందఱు గలరు. అట్టివారికి శ్రీరామకృష్ణుడు చెప్పిన సమాధా నము కడుమనోహరము. ''ఆవుపాలు నిజముగా రక్తమూలమున ఆవు శరీరమంతటను వ్యాపించియున్నను చెవులను కొమ్ములను పిండు టచే పాలు రావుకదా? పొదుగునుండి మాత్రమే పాలు లభించును. అటులనే భగ వంతుడు సర్వాంతర్యామియై యున్నను, ఎల్లెడ లను నీవు వానిని గనజాలవు. పూర్వపు భక్త వరులు తమ పవిత్రజీవితముచేతను పారమార్థిక సాధనలచేతను భక్తిమయమొనర్చిన పావన దేవాలయములందు భగవానుడు సులభముగా ప్రత్యక్షము కాగలడు.'' [ఉపదేశము - 333] ''బ్రహ్మసాక్షాత్కారమునుగోరి అసంఖ్యాకు లైన జనులు చిరకాలము జపతపములను, ధ్యానమును, ప్రార్థనలను, పూజలను సలిపిన పుణ్యస్థలములందు భగవానుడు నిశ్చయముగా వెలసియుండునని గ్రహింపుము. వారి శ్రద్ధా భక్తులచే పారమార్థికభావము లచ్చట ఘనీ భూతమై యుండునని చెప్పవచ్చును. ఇట్టి పుణ్య తీర్థములందు మానవుడు సులభముగా ఆత్మ ప్రబోధము నొంది భగవంతుని గనజాలును. అనాదిగా అసంఖ్యాకులగు సాధువులు, భక్తులు, జ్ఞానులును ఇట్టి పుణ్యక్షేత్రములను దర్శించి సకలవాంఛలను విడనాడి భక్తిపూరితహృదయ ముతో ఈశ్వరసాక్షాత్కారముకొఱకై నిష్ఠలు సలిపియుందురు. కావున భగవంతుడు సర్వత్ర నిండియున్నను ఈ క్షేత్రములందు ముఖ్యముగా వెలసియుండునని గ్రహింపుడు. ఎక్కడ త్రవ్వి నను నీరు దొరకును; కాని బావియో, కోనేఱో, సరస్సో ఉన్న తావున త్రవ్వవలసినపనిలేక యే కావలయునన్నప్పుడెల్ల సిద్ధముగా జలము లభిం చును గదా!'' [ఉపదేశము - 334].

7. పై యుపదేశములను గమనించినచో ఆధ్యాత్మికసాధనమునకు శాస్త్రవిహితకర్మ

చరణమునకును అవినాభావసంబంధము కల దని స్పష్టపడును. ఆచారముల పాటించుచు సంధ్యావందనాదికర్మల ననుష్ఠించుచున్నగాని దురితక్షయము గాదు. దురితము నశించిననే తప్ప చిత్తమునకు నిర్మలత్వము కలుగదు నిర్మలమైన చిత్తముననే ఆత్మసాక్షాత్కారము సంభవించును. కావున పాశ్చాత్యసంస్కారములచే ప్రభావితులై కొందఱు తాము ఆధ్యాత్మిక సాధనలు కావించుచున్నామను తలంపుతో ఆచారములను పాటింపక, తల్లిదండ్రులగూర్చి తలంపక, శ్రాద్ధాదుల విడనాడి కేవలము జప ధ్యానాదులచేతనే పురోగమించుచున్నామని తలంచుట భ్రాంతి యనుట స్పష్టము. యథార్థముగా శ్రీరామకృష్ణునియెడ భక్తిగలవారు శాస్త్రవిహితములైన ధర్మకర్మముల తప్పక ఆచరించుచు, అవి నిర్వహింపబడిన తరువాతనే ధ్యానము, భజనము మొదలగువాని నవలంబించుట తగునని గుర్తింపవలసియున్నది.

# శ్రీరామకృష్ణుడు - ధర్మసమన్వయము

## శ్రీ మత్ప్రవ్రాజిక శ్యామాప్రాణ

అనాదికాలమునుండియు మానవసమాజ జీవితములలో అనవరతముగ, బాహ్యాభ్యంతరములదైవాసుర ద్వంద్వముజరుగుచునేయున్నది. ఒకొక్కప్పుడు దైవశక్తి ప్రాధాన్యము వహించును మఱొకప్పుడు ఆసురీశక్తి ప్రాధాన్యము సూచించును. ఈ అసురశక్తి బలము ప్రబలమైనతరి, ఈశ్వరశక్తిప్రభావసంపన్నుడగు మహాపురుషుడో లేక అవతారమూర్తియో మానవ దేహమును ధరించి అసురభావసంపన్నులైన మానవుల మతిభ్రంశమును తొలగించును. రాముడు కృష్ణుడు బుద్ధుడు ఏసుక్రీస్తు మున్నగు అవతారపురుషుల ఆవిర్భావములు ఇందులకు ప్రత్యక్ష నిదర్శనములు.

క్రీ. శ. 19-వ శతాబ్ద పూర్వార్ధ పరిస్థితుల నించుక గమనించినచో, ప్రాక్పశ్చిమ ప్రపంచ మంతయు సంసారబంధనమునకు కారణమగు ఆసురసంపదకు లోనైయుండెను. అందుచే ధర్మము, శౌచము, సత్యము, సదాచారము లడుగంటెను. అభీరుత్వము, వ్యవహారకాలమున పరవంచన చేయకుండుట, మిథ్యావచనము లాడకుండుట శక్తికొద్ది దానముచేయుట, బాహ్యేంద్రియ సంయమము, శాస్త్రవిహిత కర్మలుచేయుట, స్వాధ్యాయము, సరళత, అహింస, సత్యము, క్రోధహీనత, త్యాగము, శాంతి, లోభము లేకుండుట, మృదుస్వభావము, సచ్చింత, దీనులకు సాయపడుట, ఇతరుల దోషము లెన్నకుండుట; అసత్కార్యములందు లజ్జ, అచపలత, తేజము, క్షమ, ధైర్యము, బాహ్యాభ్యంతరశుచి, అవైరభావము ఇట్టి దైవీసంపదలనెల్ల కోల్పోయెను. వేయేల! మానవకోటి సహజమగు తన జీవితాదర్శమును మఱచి, శ్రేయోదాయకమైన ఆధ్యాత్మిక మార్గమునువీడి, వినాశకరమును క్షణభంగురమునగు భౌతిక మాయాజాలమున జిక్కుకొనినది. భారతదేశము బాహ్య సౌందర్యపూరితమగు, పశ్చిమదేశాల కృత్రిమ మోహజాలములకు భ్రమించి, తన ఆధ్యాత్మిక సంప్రదాయములకు తిలాంజలి సమర్పించెను. నాగరికతాహంభావ పూరితములగు జాతులకు స్వార్థమును అసుర బలమునే ఆదర్శములు. ఈ అసురబలము విజృం

భించి, ప్రపంచమును దిగ్భ్రమము గొల్పుచుండెను. పరార్థమును స్వార్థము అణచివైచుచుండెను. కాని ఈ బూటకనాటకము ఎక్కువ కాలము నడువలేదు. భగవానుడు ఈ భౌతిక మాయావరణమును తునాతునకలుచేసి తొలగించుటకై ఆధ్యాత్మిక జ్ఞానమనెడి కత్తిని తన యొరనుండి బైటికి తీసెను. ఇదియే శ్రీరామకృష్ణుని ఆవిర్భావము. శ్రీరామకృష్ణుని ఆవిర్భావ కాలమునుండి భారతదేశమున ఒక నూతనాధ్యాత్మిక ప్రవాహము వెల్లివిరిసెను. ఆ ప్రవాహ తరంగములు పాశ్చాత్య ఖండముల సైతము స్పృశించెను. మృతప్రాయమగు మానవజాతి నాడులలో నవజీవితస్పందనములు పొడసూపెను. అతీత భారత గౌరవము పునః ప్రతిష్ఠ కావింపబడెను. మానవ జాతీయ జీవితమునకై గట్టి పునాదులు వేయబడెను.

ప్రపంచేతిహాసమున కనివిని ఎఱుంగని ఆధ్యాత్మిక దైవసంపత్తితో శ్రీరామకృష్ణుడు జన్మించి వేదాంతసారమును గ్రహించి, సర్వశాస్త్రమర్మార్థముల అనుభూతి బడసి, ద్వైతాద్వైత విశిష్టాద్వైత భావములనెల్ల అతిక్రమించి, సర్వభూతములలో బ్రహ్మదర్శనము కావించెను. లోకము అతృప్త భోగతృష్ణ, నిత్యనూతన భోగవాసనల వెంట పరుగిడి, దిగ్భ్రాంతమై, అలసి, సొలసిపోయి, అవసాన కాలమును సమీపించినట్టి సమయమున, లోక కల్యాణార్థము, మానవప్రేమను, ధర్మసమన్వయమును అభయవాణిని ప్రచారము చేయుటకు శ్రీరామకృష్ణుని ఆవిర్భావము. ప్రఖ్యాత పాశ్చాత్య విద్వాంసుడగు ''రోమైరోలా'' శ్రీరామకృష్ణుని ''నవయుగపథప్రదర్శకు'' డని చాటెను. తన జీవితములో కఠోర సాధనల సల్పి, సమగ్రమానవజాత్యాధ్యాత్మికానుభవములనెల్ల శ్రీరామకృష్ణు డార్జించెను. సర్వశాస్త్రములు, సమస్తమతములు సత్యము లని స్వీయానుభూతులద్వార నిరూపించెను.

శ్రీరామకృష్ణుడు నూతనధర్మప్రవర్తకుడు కాడు. కాని యుగయుగాంతరములుగ ప్రాచీన ఋషిపుంగవుల కంఠములనుండి వెలువడినట్టి విభిన్నస్వరముల నెల్ల మేళవించి చక్కని గీతి మనకు వినిపించెను. ప్రాచీనావతార పురుషుల వాణినే నవీనయుగమునకు తగినట్లుగ బోధించెను, సర్వధర్మముల అంతర్నిహిత సార మర్మము సత్యముపైనే ప్రతిష్ఠింపబడినది. సర్వమతములు మానవునికి అభీప్సిత మార్గమందు పురోభివృద్ధి నొందుటకే సాయపడును. వ్యక్తుల అభిరుచి భేదముల ననుసరించి, పురోభిగమన మార్గములు విభిన్నములుగనే యుండును. విభిన్న నదులు, విభిన్న మార్గములబట్టి ఋజుకుటిల మార్గంబుల ప్రవహించి తుదకు సాగరమున ప్రవేశించును. దేశకాలపాత్రల భేదములంబట్టి విభిన్నమతము లుద్భవించినను, అవన్నియు తుదకు ఒకే సత్యమును ప్రకాశింపచేయుచున్నవి. అందుచే ప్రాచీన ధర్మము లుండవలసినదే—కేవలము వానికి కొంత నూతన దృగ్విధానము చేర్పవలెను. ఈయుగమునకు అనుకూలముగ వానిని సంస్కరించుకోవలెను. శ్రీరామకృష్ణుడు పురాతన సత్యమార్గమునకే నూతన దృక్పథముచూపి మానవజాతి మైత్రి, ఐకమత్యము, శాంతిపథమును సులభమార్గము చేయగల్గెను. సృష్టికి మూలకారణం బగు, ''ఏకమే వాద్వితీయ'' మను వేదసారమును ఉపలబ్ధి నొంది ఈ దృశ్యప్రపంచమంతయు ఒకే సూత్రమున బంధింపబడిన దని గ్రహించెను. నవీన వైజ్ఞానికులును ఈ ''ఏకమేవా ద్వితీయ'' సిద్ధాంతమును తమ ప్రయోగశాలలలో గ్రహించిరి, కాని సనాతన భారతీయులకు ఈ జ్ఞానము కరతలామలకము.

ఈ వర్తమాన చింతాశీలమగు యుగమున శ్రీరామకృష్ణుడు ఒక నూతన దృక్పథమును సూచించెను. అతడు ఈశ్వరదర్శనమును ప్రత్యక్షోపలబ్ధిద్వారా సంగ్రహించెను. ఈశ్వరుడు, ఆత్మ, ఇవియే సత్యము. అకపటబుద్ధితో, చక్కని పద్ధతి ననుసరించి ప్రయత్నించినచో ప్రతివ్యక్తియు, ఈ జీవితముననే ఆసత్యమును ఉపలబ్ధి చేసికోవచ్చుననియే శ్రీరామకృష్ణుని బోధ. మొదట ఈశ్వరుడు, అటుపై జగత్తు. ఏసుక్రీస్తుకూడ ''మొదట స్వర్గరాజ్యము యొక్క అనుసంధానము చేయుము, మిగిలిన వన్నియు తమంతటనే వచ్చితీరును'' అని బోధించెను.

కేవలము సమాజకర్తవ్యములను, మానవ ప్రీతికరములగు కార్యముల నాచరించినంత మాత్రముననే మానవులలోని అంతర్నిహిత క్షుధ తీరదు. ఇందుచే మన ఆధ్యాత్మిక సాంఘిక, నైతిక సమస్యలు పరిష్కరింపబడవు. విశ్వ మానవ సౌభ్రాతృత్వమును, విశ్వకల్యాణమును నెలకొల్ప సంకల్పించి, శ్రీరామకృష్ణుడు ఈశ్వరారాధన శివజ్ఞానముతో జీవసేవ-అను ఈరెంటికిని సమాన ప్రాధాన్య మొసంగెను. శ్రీరామకృష్ణుని ముఖ్యాదర్శము ''ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయచ''

నేడు హింసా, ద్వేషము, భయము, సందేహము, బీభత్సము అగు ఆసురపరిస్థితిని ఎదుర్కొనుటకుగాను, విశ్వమానవజాతి హృదయములో సాహసము, విశ్వాసము, ప్రేమ యను దైవీప్రకృతిని మేల్కొల్పవలెను. శాంతిస్థాపనకు శ్రీరామకృష్ణుని దివ్యజీవిత దివ్యోపదేశముల అనుకరణమే సాధనము.

# శ్రీరామకృష్ణ పరమహంస బోధించిన విశ్వజనీన మతము

## శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు

అనాదిగా చరిత్రలో చూచినయెడల, మతమును మతసంబంధమైన భావోద్రేకమును మానవుల జీవిత పరిణామములకు బలవత్తరమైన కారణము లనుటలో సందేహము లేదు. ఇవి కాదనరానివి. సంఘము కలసియుండుటకు వృద్ధిజెందుటకు అనాదిగా మతము కారణముగా నుండినది. ఒక్కొక్కమానవుని ఆధ్యాత్మికతృష్ణోపశమనమునకేగాక మానవుల నందఱను సమాజములుగా, సంఘములుగా చేర్చుటకు ఉపకరించినది మతము. కాని, వింత ఏమనగా, మానవుల సంఘీభావమునకును అభివృద్ధికిని తోడ్పడిన ఈ హృదయోద్రేకము, మరల మానవులలో తద్విరుద్ధమైన ఫలమునకును, కలహములకును ఐకమత్యభంగమునకును కారణమైనది. మతములు వేనికవి పూర్తిగా మార్పునకుగాని, పరస్పరము అభిప్రాయభేదములకుగాని బొత్తిగా చోటీయని పద్ధతుల నవలంబించినట్లు తోచును. పరస్పర సంబంధ మేర్పడెనా, అది విరోధమే. ఒకదానితో నింకొకదానికి శత్రుత్వము తప్ప మఱియొక సంబంధము కానరాదు. తమకున్న సంకుచిత సాంఘిక శాఖీయ పరిధిలో ఈ మతములకు గల సౌఖ్యాపాదక శక్తులు, వాని యాశీర్వచనముల బలము, విశాల ప్రపంచపరిధిలో శాపములుగా నేర్పడుచున్నవి. ప్రతి మతముయొక్క పద్ధతులును ఆయా మతములను అనుసరించువారి అభిప్రా

యములకు తగినట్లు వారిని ఇతరులతోడి యుద్ధములకో, వారిని బాధించుటకో, చంపుటకో ప్రోత్సాహకారణములైనవి. అట్లే చూడగా చరిత్రలో సంభవించిన కొన్ని ఘోరహత్యలు, అమానుషచర్యలును మతము పేరిట జరిగినవే. సకలమత చరిత్రలలో నివి అతి దారుణ ఘట్టములు. ఈ మతములు ఆంతరంగికముగా వారి వారికి ఏమి మేలుచేసి యుండినను, అదంతయు ఈ రాక్షస చర్యలచేత తుడుచుకొని పోయి నష్టైనది.

## భారతీయుల మతముల స్వరూపము అందలి ప్రత్యేకత

మతయుద్ధములు, కలహములు, మత హింసలు చాలవఱకు లేవనదగిన దేశము మన భారతదేశమే. ఇది ఎందువలన అనగా మనము చక్కగ గుర్తింపదగిన కారణములు గలవు. కొందఱు ఆక్షేపకులు-స్వమతాభిమానమనగా పరమత విద్వేషమను భావము గలవారు - తలంచునట్లు, గాఢమైన ఆధ్యాత్మిక చింతన మనకు లేకపోవుట కాదు; మతవిషయమందు, దృక్పథమందు కొంత వైవిధ్యము లేకపోవుట చేతను కాదు. చరిత్ర చూచినయెడల మతోద్రేకమందుగాని, మతభావ వైవిధ్యమందుగాని భారతదేశము ప్రపంచములో ప్రథమగణ్యము. ఇది నేటికిని నిజము. సకలమత పరీక్షా శాస్త్రకారులు ఏమనుచున్నారనగా, ప్రపంచములోని అన్ని మతముల భావపరిణామములు చాలవఱకు ఒక్కవిధముగానే నడిచినట్లున్నవి - అని. ఎందును భేదములేదు. కాని భారతదేశముకాక ఇతర దేశములలో ఈ మత భావ పరిణామములు ఆయాగణ సమూహముల వఱకే వ్యాప్తిచెంది, ఏకైక దేవతానురక్తితో నిలిచిపోయి యుండగా, ఇచ్చట మతాన్వేషణ ప్రతిభ నవనవోన్మేషముగా పరిశ్రమించి, ఇన్ని దేవతోపాసనాక్రమములకు వెనుకనున్న సకల దేవతల ఏకత్వమును గ్రహించినది. ప్రపంచ మతముల చరిత్రలో నిది యొక ప్రధాన విషయము. ఎందుచేత ననగా, తత్పూర్వమునట్లు, మతము కొంతవఱకే ఉపకారి, పూర్తిగాకాదు అని యనక, ప్రాచీనకాలముననున్నట్లు మానవ వర్గమునకంతటికిని శాంతి సౌఖ్యముల కలిగించునదిగా నేర్పడినది. భారతదేశమునకు ఈనూతన జ్ఞానము గొప్పది. ఇందువలన ఎంతో మత హింస, హింసాపరంపర తగ్గినది. ఈభావమునకు ఒకపాటి విశ్వజనీనమైన దృష్టి ఏర్పడినది. ఉత్తర వైదిక కాలపు, ప్రధానముగా ఉపనిషత్తులకాలపు భావములు వీని కాధారము. ఇవి ఒక న్యాయమునకు, తర్కమునకు నిలుచునవి. ఈ యుపనిషత్తుల తత్త్వజిజ్ఞాసాక్రమ పరిణామముగా నీమతము ప్రభవించినది. సకల సృష్టికిని వెనుక నొక సమైక్యము కలదని ఇది గ్రహించినది.

## సంకుచిత మతదృష్టి, దాని దోషములు, తన్నివారణోపాయములు

మతమతమునకును గల సంబంధము ఎప్పుడును విరసమే. సరసత, సామరస్యము లేనే లేదు. మతములు తా ముద్భవించినచోట చక్కగా ప్రకాశించి నట్టివి, బాహ్యప్రపంచమున కెక్కక పోయినవి. ప్రేమ, సౌభ్రాత్రము, శాంతి మొదలైన భావములకు బదులు, ద్వేషము, తిరస్కారము, అశాంతి ఏర్పడినవి. మతముపేరిట, దేశములు పాడైపోయినవి, గొప్ప సంస్కృతులు వినాశ మొందినవి. గుంపులు గుంపులుగా జనులు చంపబడిరి— ఇదంతయు భగవంతుడు ఒక్కడే యను పవిత్ర భావము పేరిట. భగవంతుని సామ్రాజ్యమును

భూమిమీద నెలకొల్పుట కిది మార్గము కాదని మతోన్మాదులు కొంచెముకూడ భావింపలేదు. మెక్సికో, పెరు, మున్నగు చోట్లలోని సామ్రాజ్యముల వినాశము భగవద్విషయమునకొఱవనే తెలుపుచున్నవి. సకలమానవసంఘమునకును హృదయంగమమై, ప్రత్యేకముగా ఏ కొందఱికో చెందక, చాల శాస్త్రీయముగా నుండు ఆధునికకాలపు మనోధర్మమునకు చాల విరుద్ధముగా నున్నది. ఆధునిక ప్రపంచమున మతమనునది వాస్తవముగా జనోపకారియగు శక్తియై భావికాలమునకు అభివృద్ధికరముగ నుండవలయునన్న శాస్త్రీయ పద్ధతులలో సాధ్యాసాధ్య తర్కములకు నిలుచునదిగా పునర్నిర్మాణమును పొందవలెను. గతించిన మూడు శతాబ్దములలో కలిగిన విజ్ఞానముచేత, అనాదిగా ప్రాచీనకవులును వేదాంతులును ఆశపడి ఎదురుచూచిన సందర్భములకు తగిన మహదవకాశములు ఏర్పడినవి. ఇవి మనకు ఫలప్రదములు కావలయునేని వాని కంతటికిని ఒక ఐక్యము నాపాదించు నూతనభావము, నూతనదృక్పథము, నూతన ప్రబోధము రావలెను. మతమునకు మతమునకును, మతమునకు శాస్త్రీయ విజ్ఞానమునకును, సామరస్యము కుదుర్చునదిగా నుండవలెను ఈ సమన్వయవిధానము. ఇట్లు సమన్వయపఱచునట్టిది, పురోగమనమునకు తగిన ప్రబోధము ఎట్లు రావలెను? ఈనిరంతర సమస్యకు తగిన సమాధానమునకు ప్రాచ్య పాశ్చాత్య దేశాల మేధావులు ఆశతో భారతీయ ప్రాచీన వేదాంతభావనిధుల వంకకు తమ దృష్టిని సారించుచున్నారు.

## భారతీయ జీవితముపైని తత్త్వజిజ్ఞాసపైని వేదాంతప్రభావము

ఇందేమియు అతిశయోక్తిలేదు. దురహంకారముతో చెప్పుకొను ఆత్మోత్కర్ష కాదు. భారతీయ తత్త్వచింత బహుదేవతోపాసనల రూపమున కనబడు ఏకైకదేవతను గుర్తించినప్పుడే ఎంతో పురోగమించినదనువిషయము ముందే గ్రహింపబడినది. ఋగ్వేదములోని ఈ మహావాక్యముయొక్క భావమిదియే. (I-164, 46) 'ఏకంసద్విప్రా బహుధావదన్తి' 'వాస్తవమొక్కటే దానిని ఋషులు పెక్కుపేర్ల చెప్పుదురు,' ఇంద్రుడు, మిత్రుడు, వరుణుడు మొదలుగా. ఇంతేకాదు. శాస్త్ర విజ్ఞాన, జ్ఞానములలో ఏదిగాని భారతదేశములో నిరాకరింపబడలేదు, అణగద్రొక్కబడనులేదు, అన్నివిధములైన జ్ఞానమార్గములును పవిత్రములుగా చూడబడుచోట ఏదిగాని దాపబడుట ఎట్లు సంభవించును? ముండకోపనిషత్తు (I-2.4)పరాఅపరవిద్యల నుపన్యసించుచున్నది. 'ద్వే విద్యే వేదితవ్యే ఇతిహస్మయద్ బ్రహ్మవిదోవదన్తి పరాచైవ అపరాచ', అన్నిశాస్త్రములును, వేదములు లోనుగా, 'అపరా' జ్ఞానమే, 'అపరా' యనగా తక్కువయని తలంపరాదనుటను గుర్తింపవలెను. మానవానుభవములో అచ్చటచ్చట కొంతగాని, ఏదో కొన్ని అంశములకు సంబంధించినదిగాని 'అపరా' జ్ఞానమనియు, అనుభవముయొక్క సమగ్రమైన జ్ఞానము 'పరా' జ్ఞానమనియు భేదము. 'అపరా' జ్ఞానము పరావిద్య— బహిఃప్రకాశనముమాత్రమే. ఇదియే బ్రహ్మవిద్య. బ్రహ్మ మనగా జీవితము, జీవితానుభవములయొక్క సమష్టి. ఇదియే వేదాంతము, భారతీయవిజ్ఞానసారము, విజ్ఞానలతాసుమము. భారతీయసంస్కృతికి ఒక ప్రత్యేకతయు ఆధిక్యమును దీనివలననే కలిగినవి. సకలభారతీయ జీవితవిధానములకును ఒకరూపమిచ్చి, అవాంతరశాఖలకు ఒక కలుపుగోలుతనమునిచ్చి, అత్యున్నత, భిన్నభారతీయ తాత్త్వికచింతన

ములకు అన్నిటికిని ఒక సామరస్యము కుదిర్చినది. మంత్రమహిమవలె పాశ్చాత్యదేశాల తాత్త్విక చింతనాపరులు పలువురహృదయములను ఇది ఇప్పుడిప్పుడే ఆవేశించుచున్నది. భారతీయులభావముల మహిమ ఇదే. హిందూమతమును లెక్కలేని గందరగోళపు తాత్త్విక సాంఘిక భావముల సమూహము అని చెప్పునట్టి వారికి వేదాంత మింకను బోధపడ లేదని యర్థము. భారతదేశమును హిందూమతమును చక్కగా అర్థము చేసికొనవలెనన్న వేదాంత పరిజ్ఞానము పూర్తిగా నుండవలెను. ఈ వేదాంతముయొక్క బలముచేతనే మనము భారతదేశముయొక్క ఐక్యభావమును గూర్చి గట్టిగా చెప్పగలిగియున్నాము. ఇంకను దీనిబలము చేతనే సకలమానవజాతియొక్క సంఘీభావమును గుఱించి, మాటలాడుటమాత్రమే కాదు, దానిని సాధింపగలము. ప్రస్తుతము భారతదేశమందు మతసామరస్యము, సాంఘికాభివృద్ధి, దేశీయస్థైర్యము, చక్కగా లేకపోయినందులకు, శీఘ్రాభివృద్ధికి తగుప్రోత్సాహము వలన రావలెను. ఎందులకనగా అది సకల విజ్ఞానములకు నిధి.

## భారతీయవిజ్ఞానము: శ్రీరామకృష్ణపరమహంస

వేదాంతముయొక్క ప్రబోధము ప్రపంచమందలి సకలచరాచరములలో కనబడు ఐక్య ప్రకాశనము. జీవితముపైనను, తాత్త్విక చింతనపైనను ఈ ప్రబోధమువలనతటాలున కలుగు ప్రభావముయొక్క అంతరార్థము బహుమతముల వైవిధ్యములకు పూర్తివిరోధ భావము. వాస్తవశాస్త్రీయవిధానముల సారము అంతర్గతశక్తి. వివేకానందస్వామి చెప్పినట్లు 'మానవుడు పొరపాటునుండి జ్ఞానమునకు ఎగబ్రాకుట లేదు, జ్ఞానమునుండి జ్ఞానమునకు పురోగమించుచున్నాడు. వాస్తవము గోపురము వంటిదైనయెడల సకలవిషయముల ఐక్యము యొక్క తాత్త్వికజ్ఞానము దాని శిఖరము వంటిది. ఈ మహోన్నత్యమునుండి చూచినచో ప్రపంచమందలి ఏ జీవితవిధానముగాని, ప్రయత్నముగాని అసత్యముగా నుండదు, తప్పుగా కనబడదు. ముఖ్యముగా నేటికాలమున మనల నెదుర్కొనుచున్న పెక్కు జీవిత సమస్యలను విడదీయుటకు ఈ సిద్ధాంతము నుపయోగించుటలో శ్రీ రామకృష్ణ పరమహంసయొక్కగాని, శ్రీవివేకానందస్వామి యొక్కగాని ప్రబోధములు చాల సార్థకములు. వీరిప్రబోధముల మూలముననే భారతీయజ్ఞానము, ముఖ్యముగా వేదాంతము, నేటి ప్రపంచమునకు సకలకష్టనివారణోపాయమును బోధించుట ఏర్పడినది. తైత్తిరీయోపనిషత్తులో చెప్పబడిన — 'సత్యాత్మప్రాణారామం మన ఆనందం, శాంతిసమృద్ధం అమృతమ్' (సత్యము జీవితమునకు హాయిని మనస్సునకు ఆనందమును కూర్చునది నిండుగా శాంతితో కూడినది చావు లేనిది)—విధానమునకు తగిన జీవితపరిస్థితిని భూమిమీద స్థాపించునది.

## విశ్వజనీనత: ప్రాచీన నవీనమార్గములు

మతమునందు విశ్వజనీనభావము ప్రపంచ తాత్త్వికసిద్ధాంతములకు క్రొత్తగాదు. ఇది రెండు విధములుగా భావింపబడుచువచ్చినది. ఒకమతము తనస్థానమును వదలి దిగ్విజయము చేయుచు, తనలో ఎందఱినో చేర్చుకొనుచు, ఒకమహాసామ్రాజ్యము విస్తరించినట్లు, అల్లుకొనిపోయినయెడల అది విశ్వజనీనమని యనదగును. అట్టిమతము, తాను త్వరలో సర్వప్రపంచమతమగుటను తనకు ఆదర్శముగా పెట్టుకొనియుండును. ఇట్టివానికి ప్రసిద్ధోదా

కారణములు క్రైస్తవము, ఇస్లాము, బౌద్ధము. వీనిలో చివరిది విస్తరించు పద్ధతులలోను, ఉద్దేశములలోను మొదటి రెంటికన్నను భిన్న మార్గ మవలంబించినది. ముఖ్యముగా అహింస, శాంతి అనునవే పై రెండింటిలో కానరాక ఈ మార్గములు ఇందు ఏర్పడి ఈ మతమునకు ఒక ప్రత్యేకతను ఆపాదించినవి. ముఖ్యముగా తాత్త్విక చింతనయొక్క ప్రభావము దీనిపై నుండుటచేతను, అందులో నుండియే ఇది జనించుటచేతను, అందులోనికి వేళ్లు దిగపాతియుండుటచేతను ఇది సాధ్యమైనది. దిక్కులేని, 'సంశప్తులైన' జీవులను 'కాపాడు'టకు అంతులేని విధ్వంసకాండను, మతహింసాపద్ధతులనుఅవలంబించినవి క్రైస్తవ మతము ఇస్లాముమతము. ఈవిధమైన విశ్వవ్యాప్తమతము ఆత్మవినాశకారి. బలాత్కారము, యుద్ధవిజయము, ఒక మతమునకు విశ్వవ్యాప్తత కలుగజేయుటకు దార్లుకావు. ఇది క్రైస్తవ ప్రాచీన నిబంధన గ్రంథము (Old Testment) లో చెప్పబడిన విషయముల వంటివి. ఒకగూడెము ఇంకొక గూడెమును జయించినప్పుడు ఆ గూడెము వారి దేవతను తొలగించి తమ దేవతను ఉపాసింపుడని ఓడిపోయినవారికి విధింతురు. ఈ భావమే, ఈ పద్ధతియే ఇప్పుడు ఈ ఆధునిక కాలమున కనబడుచున్నది. పాతకాలపు గూడెములకు బదులు నేటి కాలపు విరోధి సంస్కృతులును, మతములును కలవు. ఇట్లు రెండుమతములు తుల్యబలము, సమానమూర్ఖవిశ్వాసము, పట్టుదల, ఆవేగము గలవి ప్రపంచ మతస్థాపనమునకు పోరాడినయెడల మతముల ఐక్యభావము పాడైపోయినది, సామరస్యవిఘాతము నందినది. అనగా–'నా దేవుడొక్కడే నిజమైన దేవుడు, నీవు ఒప్పుకొని తీరవలెను' అని యనుటకును, 'నా దేవుడుగాని, నీ దేవుడుగాని ఇరువురు ఒక్కరే, భేదమేమైన నున్న అది పేరులో మాత్రమే' అనుటకును ఎంతో భేదము కలదు. ఒక ప్రత్యేకతగలమతము, దాని వారు దానిని అతివిశ్వాసముతో అనుసరించునట్టిది, చెదరగొట్టబడి వినాశమొందింపబడినప్పుడు సార్వజనీనమతభావము పాడైపోయినది.

రెండవపద్ధతి; అక్బరు మున్నగువారును, కొందఱు ఆధునికమతాల, ఉద్యమాలవారును అన్ని మతములనుండియు తమకు తోచిన విషయములు గ్రహించుట యనునట్టిది. ఒక్కొక్క మతమునుండియు కొద్ది కొద్ది సద్విషయములను ఏర్చికూర్చుటయును సాకర్యగ్రహణమార్గము, ఏర్చికూర్చిన పూలచెండువంటిది. అట్లే, ఆ విభిన్న పుష్పగుచ్ఛమువలె ఇదియును జీవము కలదికాదు. దానివలె వాడిపోవునట్టిదే. ఇంతకన్న ఘాటుగా చెప్పవలెననిన—ఈ విభిన్న మత భాగస్వీకరణమార్గము ఒక పరిమిత పద్ధతిగా, విస్తరింపజాలనిదిగా నేర్పడి తనయుద్దేశమునకే భంజకముగా నేర్పడును. ఈ పద్ధతి యొక్క అర్థమేమి—'ఈ ప్రపంచమున లెక్కలేని మతశాఖా భేదములుగలవు. అవన్నియు నుండరాదు. వానిని నాశమొందించి వాని స్థానమున క్రొత్తమతమును స్థాపింపవలెను'—అని. ఇది ఎట్లున్నదనగా "ఇకమీద యుద్ధములే రాకుండుటకు ఒక మహాయుద్ధము చేయవలయును"—అని యుద్ధకాలములందు అందఱును తలంచు ఈరీతిని పోలియున్నది—ప్రాచీనమతములలో ఏయొక్కటియు విశ్వజనీనమైన మతమగుటకు న్యాయముగా ఎట్లు అనర్హమో ఆవిధముగానే ఏ క్రొత్తమతముకూడ ఆస్థాయిని అందుకొనజాలదు.

## విశ్వజనీన మతమునుగూర్చి శ్రీరామకృష్ణపరమహంసయొక్క ఆదర్శము

పైనిపేర్కొన్న వివరణముచే ఇట్లు కుదురుచున్నది. ఏమతముగాని తనవఱకు విశ్వవ్యాప్తి గలది కానేరదు. వైవిధ్యములో ఐక్యభావము ఉండుటయే విశ్వవ్యాప్తతకు నిదర్శనము. ఏమాత్రము మార్పులేని, మనోరంజకతలేని ఒకటే పద్ధతికాదు. ముందు వివరింపబడిన రెండుభావములకును పూర్తి భిన్నమార్గము శ్రీరామకృష్ణ పరమహంసయొక్క ఆదర్శము. ఈయాదర్శముయొక్క మూలసూత్రమేమనగా-'ఒకమతము నిజమైనయెడల ఆ న్యాయముచేతనే మిగిలిన మతములన్నియుకూడ, వానికవి, వాస్తవనిరూపకములేగదా కావలెను. దీని సత్యతయు అసత్యతయు ఎట్లు తెలియుననగా —— భగవత్సంబంధము గలిగియుండుట, పవిత్రత, త్యాగశీలత, అనునవి ఏ క్రైస్తవగుడికిగాని, హిందూమతమునకుగాని దేవాలయమునకుగాని, ప్రపంచమున ప్రత్యేకముగా చెందియుండక, అందఱికిని చెందియుండుట ప్రతి మతమందును అత్యుత్తమ స్త్రీ పురుషులు పుట్టియున్నారు. అందువలన ఈ గొప్ప మతప్రవక్త ఏ మతమును గాని తాకలేదు. క్రొత్తగా తానొకమతమును ప్రారంభింపనులేదు. అట్లుండియు వాస్తవమతమునకు సాధకముగా నుండినది ఆయన జీవితము. అంతేకాదు ఆయన జీవితమార్గమే విశ్వమత మహాసభవలె అన్నిటి అంశములతో కూడియుండినది. హిందూమతములయొక్క విభిన్న మార్గాంతరము లన్నిటిని అవగాహన చేసికొని ఒక్కొక్కదానియందును సంపూర్ణత నందినాడు. వీనితో తృప్తినందక దైవభక్తిగల క్రైస్తవునివలెను, పూర్తివిశ్వాసముగలమహమ్మదీయునివలెను ఆయామార్గముల నాచరించి వాని శిఖరములను తాకినాడు. ఇట్టి యోగములయొక్క, ప్రయత్నములయొక్క, ఫలితముగా ఈ మహానుభావుడు గ్రహించిన దేమనగా, అన్నిమతములును లోతునకు దిగి చూచిన, అవి బోధించున దొక్కటే, ఒక్కటే గమ్యస్థానమునకు చేర్చు ఏకైక సత్యము. ఆయన మాటలలోనే చెప్పవలయుననన్న——

"భగవంతునియొక్క నామములు అనేకములు. ఆయనను తెలిసికొనుట కుపకరించు మార్గములు, పద్ధతులు అసంఖ్యాకములు. ఏ పేరిట, ఏ రూపమున, భగవంతుని చూడ గోరుదువో, ఆ పేరిటనే ఆ రూపముననే చూడగలవు. వివిధమతములు భగవంతుని, అద్వితీయుని, ఎఱుగుటకు భిన్నమార్గములు. కాళీఘాట్‌లోనుండు కాళిదేవ్యాలయమునకు పోవుటకు మార్గములు చాలగలవుగదా (కలకత్తాలో). ఆవిధముగానే భగవంతుని చేరుటకు మానవులకుదారులు ఎన్నియో. ఒక్కొక్క మతమును ఈ ఒక్కొక్క మార్గమువంటిది."

"ఒకతల్లి ఆరోగ్యము చెడిన తన పిల్లలకు-ఒకరికి కూర, ఒకరికి సగ్గుగంజి, ఆరోరూటు గంజి, ఇంకొకరికి వెన్నయు రొట్టెయు, ఇచ్చినట్లు, దేవుడు భిన్నజనులకు వారివారి స్వభావములకు తగినట్లు మార్గములు కుదిర్చినాడు."

దీనిఫలితము - మరల శ్రీరామకృష్ణుడే——"ప్రతి మానవుడు తన మతమును తాను అనుసరింపవలెను. క్రైస్తవుడు క్రైస్తవమతమును, మహమ్మదీయుడు ఇస్లామును, హిందువునకు ఆర్యఋషులు చూపిన ప్రాచీనమార్గము ఉత్తమము. నిజమైన భగవద్భక్తుడు, మత విశ్వాసి, ఇతర మతములుకూడ సత్యపథమునకు మానవునిచేర్చు మార్గములని గ్రహింపవలెను. ఇతర మతములను గౌరవించు పద్ధతిని మన మెప్పుడును అవలంబింపవలెను."

ఈ విధముగా శ్రీ రామకృష్ణ పరమహంస యొక్క అభిప్రాయమున లెక్కలేని మతములును, వాని అవాంతర భేదములును విశ్వజనీనమైన మతసాధనకు అడ్డములు కావుగదా, మీాదు మిక్కిలి సహాయకారులే. ఈ భేదములు హెచ్చిపోవుచుండవలయును. ఒక్కొక్క మానవునికిని ఒక ప్రత్యేక మతము ఏర్పడవలయును. ఇరువురు మనుజులలో ఏ ఒకరుగాని, అభిరుచిలోగాని, దృక్పథములోగాని, శక్తిసామర్థ్యములోగాని పూర్తిగా మఱియొకరివలె నుండజాలరుగదా. ఆవిధముగానే ఏ మతముగాని, తనంత తానే, అందఱిని తృప్తిపఱుపజాలదు. అందువలన చిల్లరమత భేదములు ఎక్కువై మానవుల సంఖ్యకు సమానముగా మతసంఖ్య ఏర్పడవలెను. అప్పుడు ప్రత్యేకమత భావము అదృశ్యమగును. ఈ ప్రత్యేకత పోగానే మతమునకు విశ్వజనీనత ఏర్పడి పై యాదర్శము సిద్ధించును. వాస్తవముచూడగా ఈ యాదర్శము క్రొత్తగా నిర్మాణము కానక్కఱ లేదు. అది సిద్ధించియే యున్నది. కావలసిన దేమనగా ఎవని వఱకు వాడు దీనిని గుర్తింపవలసియున్నది అంతే. దీని సమరసత ప్రత్యేకసిద్ధాంతముల చేత పాడైపోవుచున్నది. ఈ ప్రత్యేక మత భావము ఎప్పుడు పోవుననగా, శ్రీరామకృష్ణ పరమహంస ఉపదేశించిన సర్వమత సామరస్య మార్గమును లోకము చక్కగా అర్థము చేసికొన్నప్పుడు; మానవులు ప్రతిమతములోను సత్యమున్నదని గ్రహించినప్పుడు, ప్రతిమానవ హృదయమును తన హృదయావేదన కొద్దియు సత్యాన్వేషణకును వెలుగుచూచుటకును చేయు ప్రయత్నమునుచూచి అందఱును సానుభూతిచూపి మెచ్చుకొనుటకు నేర్పబడినప్పుడు.

### ఉపసంహారము

ఈ విశ్వజనీనమతము నేటికాలపు మనోధర్మములకు చాలవఱకు తగియున్నది. మతములు మానవాభివృద్ధికి పాటుపడుటలో పరస్పరశత్రువులుగా గాక, పరస్పరసహాయములైనవిగా కలిసి పనిచేయుటకు ఈ భావము తోడ్పడును. మతమందు ఒనగూడు సమాన స్నేహభావము మానవావళియందును అట్టి స్నేహమునకే కారణమై, సర్వమానవసౌభ్రాత్రమునకు దారితీయును. ఇందువలన ఒక సమష్టి జ్ఞానభావము కలిగి ప్రపంచ సంస్కృతికిని సర్వమానవ నాగరికతాభావమునకును కలిసి జనులు పాటుపడుట కుదురును.

## శ్రీరామకృష్ణుని బోధనలు

### శ్రీ కేతా వసంత రవీంద్రనాథ

మానవుడు విషయాసక్తుడై, తన కర్తవ్యమును, ధర్మమును మఱచి, అప్పుడప్పుడు పెడత్రోవ పట్టుచుండుట జరుగుచునే యున్నది. తన సృష్టి పెడత్రోవ పట్టుట ఏమాత్రము ఇచ్చగింపని శ్రీభగవానుడు వారిని సరిత్రోవను పెట్టుటకై వివిధావతారములు దాల్చుచుండును. అధర్మమును అరికట్టి, ధర్మసంస్థాపన మొనరించును. తప్పు చేయుచున్న వారిపై ఆయన కెట్టి కోపమును లేదు. వారిని అతి మృదువుగా మందలించి, సరియైన మార్గమునకు మరల్చును. ఈవిధముగా భగవంతుడు పలుమార్లు పలు భాగములలో తన యంశలను ఉద్భవింపజేసెను.

శ్రీరామకృష్ణుని జీవిత చరిత్రను, ఆయన చేసిన ప్రబోధనలను పరిశీలించినచో ఆయనకూడ భగవంతుని యంశయే యనియు, పెడద్రోవ పట్టిన మానవులను సద్రోవ పెట్టుటకై ఉద్భవించిన కారణజన్ముడనియు తెల్లమగును.

హిందూమతమే కాక-అన్ని మతములును మానవుల ఆసక్తిని ఆకట్టుకొనలేక పోవుచున్న సమయమున రామకృష్ణుడు జనించి, మతావశ్యకత యెత్తిచూపెను. ఆయన భగవంతుడొక్కడే యనియు, అన్ని మతములును ఆ భగవంతుని చేరుటకే స్థాపింపబడినవనియు, ఎవ్వరు ఏమతమును అనుసరించినను, వారు దేవుని జేరగలరనియు వివరించెను. దేవునిలో ఐక్యమొందుటకు పలు మతములు పలు మార్గములు మాత్రమే. ఏమార్గము ననుసరించినను ఫలిత మొక్కటే. వేర్వేరు నదులలోని జలము, చివరకు సముద్రమును చేరునట్లే, వేర్వేరు మతస్థులు దేవుని జేరుదురు. కనుక, పరమత దూషణము వ్యర్థప్రసంగము మాత్రమే. అట్టి ప్రసంగము వలన ఏవిధమయిన లాభము లేకపోవుటయే కాక, భగవంతుని ధ్యానింప దగిన సమయము వృథాయగును. కనుక, ఎవరికి నచ్చిన త్రోవను వారు పయనింపవచ్చును. ముక్తిని బడయవచ్చును.

ఇదేవిధముగా ఒక్క మతములోనే పలువురు పలువిధములుగ దేవుని గుర్తించుటను కూడ, రామకృష్ణుడు వివరించెను. భగవంతుడు ఒక్కడే అయినప్పటికిని, మానవులు ఎవరికి నచ్చిన విధముగ వారు ఊహించుకొందురు. కొందఱు మహావిష్ణువు రూపమున పూజింపవచ్చును. మఱికొందఱు పరమేశ్వరునిరూపమున పూజింపవచ్చును. వేఱొక కొందఱు జగజ్జనని రూపమున పూజింపవచ్చును. కొందఱు భగవంతుని తమ తండ్రిగా దలంపవచ్చును: మఱికొందఱు తమ తల్లిగా దలంపవచ్చును. వేఱొక కొందఱు తమ బిడ్డగా తలంపవచ్చును. మఱొకరు తమ ప్రియునిగా తలంపవచ్చును. ఎవ్వరేవిధమున తలంచినను, పూజించినను భగవంతుడొక్కడే. ఎవరికి వారు వారివారి పరిస్థితులనుబట్టి, మానసిక స్థితినిబట్టి భగవంతుని రూపగుణములను ఊహించుకొందురు. అందేమాత్రము తప్పులేదు. కాని, భగవంతుని ఒక రూపముగ ఊహించువారు, మఱొకరిని తప్పుపట్టుట పెద్ద తప్పు. ఎవరికి నచ్చినట్లు వారు వారి ప్రయత్నములను సాగింపవలెను; భగవంతునియందైక్యము కావలెను. స్వమత దురభిమానులు నూతిలోని మండూకములు-సమానులే. మత దురభిమానము గూర్చియు, పరమత సహనమును గూర్చియు యెంత చక్కని విమర్శ!

శ్రీరామకృష్ణుడు సన్న్యాసిమాత్రమే కాక సంసారికూడ భగవంతుని చేరుటకు అర్హుడే యని ప్రబోధించెను. అందులకై సంసారి తన సంసారసముద్రములోనే ఎల్లప్పుడును మునిగి యుండక, సమయమును కల్పించుకొని, భగవంతుని ధ్యానముచేయుట ఎంతయేని ఆవశ్యకమని బోధించెను. అదేవిధముగ తాను సర్వమును పరిత్యజించితిని కనుక తనకు ముక్తి తప్పక కల్గునని తలపక, సన్న్యాసియును భగవంతునియందే తన మనస్సును నిలుపవలయును. ఈ ప్రబోధనను శ్రీరామకృష్ణుడు చిన్నకథమూలముగ చాల చక్కగా వివరించెను. ఒక ఊరియందు ఒక వేశ్య యుండెడిది. ఆమె తన కిష్టము లేకపోయినను, కులవృత్తినే పాటించుచుండెను. తన పాపమును క్షమింపుమని ఎల్లప్పుడును భగవంతుని ప్రార్థించుచుండెడిది. అదేయూరియందున్న ఒక సన్న్యాసి ఆమె నడతను గమనించుచు, ఆమె నసహ్యించుకొనుచు, ఆమె ఎటువంటి ఫలితముల ననుభ

వించునో కదా యని ఎల్లప్పుడును ఆలోచించుచుండెడివాడు. వారి మరణానంతరము వేశ్యకు ముక్తిలభింపగా, సన్న్యాసికి లభింపలేదు. దీనికి కారణము వేశ్య శారీరకముగా తప్పు చేయుచున్నను, మానసికముగా తన తప్పును తెలిసికొని, తనతప్పును క్షమింపుమని దేవుని సదా ప్రార్థించుట యని, సన్న్యాసి శారీరకముగా సర్వము త్యజించినను, మనస్సును భగవంతుని యందు నిలుపక, ఇతరుల తప్పుల గూర్చి యోచించుచుండుటయేయని, శ్రీరామకృష్ణుడు వివరించెను. ఈవిధముగా సంసారులను కూడ భక్తిమార్గమునకు త్రిప్పికొనెను.

భగవంతుని పూర్తిగ విశ్వసించినచో ఆయన తప్పక తన భక్తులకు తగిన రీతిని సాహాయ్యమొనరించునని రామకృష్ణుడు ఉద్బోధించెను. ఇందులకు ఉదాహరణముగా ఆయన జటిలు డనెడి బాలుని కథ చెప్పుచుండెనట. జటిలుడు ఒక అరణ్యముగుండ తన బడికి పోవలెను. అతనికి ఆ అరణ్యప్రదేశము మిక్కిలి భయమును కల్గించుచుండెను. ఈ విషయము నతడు తన తల్లికి తెలుపగా, ఆమె 'నీకు భయము కలిగినపుడు నీయన్న కృష్ణుని తోడు పిలుచుకొను' మని చెప్పెను. ఆమె వాక్కులందు కృష్ణుడు తనకు తోడు వచ్చు ననుటయందు అత్యంత నమ్మకము కలిగియుండి, తనకు భయము కల్గినపుడు శ్రీకృష్ణుని తోడు పిలుచుచుండెను. శ్రీకృష్ణుడును అతనికి తోడువచ్చుచుండెను. కనుక భగవంతుని కృపను బడయుటకు అన్నింటికన్న అవసరమైనది - ఆయనయందు విశ్వాసమని, శ్రీరామకృష్ణుడు వివరించెను.

శ్రీరామకృష్ణుడు చాలవఱకు ధ్యాన సమాధియందే నిమగ్నుడైయుండి, పరమేశ్వరునిగాంచి ఆనందించుచుండెను. మిగిలిన కాలములో తన శిష్యులకు, తనకు సత్యధర్మములని తోచిన విషయములను వివరించి, వారినికూడ పాటింపుడని ప్రోత్సాహపఱచెడివాడు. మనఃపూర్వకమైన భగవదారాధనకన్న శ్రేష్ఠమైన ఆరాధన వేఱొకటి లేదని రామకృష్ణుని నమ్మిక. కాని పూజలు, హోమములు మొదలయినవి భగవంతునియందు మనస్సును నిలుపుటకు ఉపకరించు పరికరములు మాత్రమే. వానిమూలముగ భగవంతుని సులభముగా ధ్యానింప గల్గినచో అట్లు చేయుట ఏమాత్రము తప్పుకాదని బోధించెను.

ఆత్మపరిశీలనమును పెంపొందించుకొని 'సత్యము' నుండి మిథ్యనువేఱుచేసి సత్యమును మాత్రమే గ్రహింపవలయునని రామకృష్ణుడు బోధించెను. ఇది ఆయనకు గల గొప్పశక్తి. హంస క్షీరనీరములను విడదీసి క్షీరమును మాత్రమే గైకొనునట్లు, రామకృష్ణుడును సత్యమును మాయను వేఱు చేసి సత్యమును మాత్రమే గ్రహించును, కనుకనే ఆయనను పరమహంస యని యందురు.

ల ణ స్త్రీలందఱును తనకు మాతృసమానలే యని నమ్మినవాడు. ఆయన-సతినికూడ అదేదృష్టితో చూచిన సర్వసంగ పరిత్యాగి.

శ్రీరామకృష్ణుడు అతి నిరాడంబరి. ఆడంబరము పెరుగుకొలది-కోర్కెలును వానిని దీర్ప యత్నములును పెరిగి, భగవంతుని ధ్యానించు సమయము లభింపక పోవును.

ఆడంబరములకై ప్రాకులాడెడివాడు, మిథ్యలో పడి, భగవంతుని మఱచిపోవును. కనుక నిరాడంబరత ఆవశ్యకము.

శ్రీరామకృష్ణుని బోధనలను విని, 'ఆహా' యని ప్రశంసించినచో ఆయనకు తృప్తి కలుగదు. ఆయన బోధనలను ఆచరించినపుడే ఆ మహానుభావుని ఆత్మకు తృప్తి. కారణ జన్ముడైన ఆయన జన్మమును సఫలమగును.

# పరమహంసకథలు

## శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

### ౧. తోఁటమాలి—బెస్త

కం. ఒకతోఁటమాలి యింటికి సఖురాలగు బెస్తపడఁతి చనుదెంచెను మ
న్నొక రేయి; దానికయ్యది యకృత్రిమంబైన ప్రీతి నాతిథ్యమిడెన్.

గీ. అచట నచ్చికబుచ్చిక లాడుకొనుచుఁ గుసిచికదుపారఁ బ్రొద్దువోవుడును వారు
పండుకొన లేచి చాపలుపఱచుకొనిరి పూలగంపానుకొని పాక మూలయందు.

ఆ. వె. అలరుపుటిక కమ్మవలపుఁజిమ్ముచునుండెఁ; గూర్కరాక బెస్తకూఁతు రచట
నిరుఁగెలంకులకును బొరలాడుఁ: జేఁదర వడుచుఁగూరుచుండుఁ; బండు; లేచు.

ఆ. వె. అడిగెఁదోఁటమాలి "అక్క, నీవిట్లేల పొరలుచుంటి నిద్రవోక?" యనుచు
బదులు వలికెబెస్తపడఁతి "ఏమోనమ్మ, అలరుకంపు గిట్టనట్టులుండె.

కం. నాచేపలబుట్టనెటం దాఁచితివో తెచ్చియిమ్ము దయచేసి" యనన్
ఆచానయొసఁగె: దానిని మూచూమచు బెస్తపొలఁతి పోయెనునిద్రన్.

కం. పరమేశ్వరు చరణాంబుజ పరిమళముఁ రోసి మూర్ఖ ప్రాపంచిక దు
ర్భర వాసనకె తపించును, నిరయంబే స్వర్గమాతనికిఁ దలపోయన్.

### ౨. సాక్షాత్కారము

కం. "భగవత్సాక్షాత్కృతియెట్లగునో? దయచేసి దేవరా తెలుపుఁ" డటం
చొగిశిష్యుఁడు ప్రశ్నించెను స్వగురుని వేదాంతశాస్త్ర పారము వేళన్.

కం. "తెలుపుదు నాతోరమ్మ"ని పలుకంగా గురువు వెంటఁబడె ఛాత్రుఁడు; వా
రలు మెల్లఁబోయి డాసిరి కొలంది దవ్వులఁగలట్టి కొలనొకదానిన్.

కం. మొలబంటి నీటిలోపల నిలిచి గురుఁడు శిష్యుఁబట్టి నీటనుముంచెన్,
దలయెత్తనీక తనచేతులతో నిర్దయునిరీతి తొడ్డోనదిమెన్.

ఆ. వె. విడిచిపుచ్చె నలఁతితడవుంచి యట్టులు గురుఁడు: శిష్యుఁడెత్తి శిరము నిలిచె
అడిగె "నీటమునిఁగినప్పుడే చందాన నుండెనోయి నీదునునికి?" యనుచు.

ఆ. వె. "ఉద్దుగుడుచుకొంటి: నుక్కిరిబిక్కిరై బయటఁబడఁగ నాత్రపడితిఁగడిఁది
చచ్చిపోవుచున్న సరవిదోఁచెను నాకు" నంచుగురుని కాతఁడాడెబదులు.

కం. "భగవత్సాక్షాత్కారం బగుఁబో; తద్దర్శనమున కాత్మను క్షోభి
ల్లఁగ నీకీచందంబునఁ బగలును రేయియు; నిదే తపంబగుఁజుమ్మా!"

కం. అనిపలుకఁగ నాచార్యుఁడు విని శిష్యుం డంతఁ గట్టిపెట్టి చదువులన్
అనవరత తపశ్చర్యను గొనె నపరోక్షానుభూతిఁ గొలఁది తడవులన్.

## ౩. స్నేహపరీక్ష

కం. "అగు బ్రహ్మ మొకటె సత్యము జగంబు మిథ్యయ; నశించు సకలము దృశ్యం
బిఁగనాతో నరుదేరము భగవత్సాయుజ్య మోయి ప్రాపింతువు సూ!"

కం. అని యుపదేశింప గురుం డనె శిష్యుం "డార్య నాకు నాలుం బిడ్డల్
జననీజనకులుగల. రా జనంబు నాకోసమిడు నిజప్రాణంబుల్.

గీ. స్నేహపాశంబుచేత బంధింప నన్ను నెట్లు వదలించుకొని స్వామి యేగుదెంతు!"
అన, గురుం "డేను; నాదిది" యన్నతలఁపు గలవఱకె యెంచెదవు వారు వలతురనుచు.

ఆ. వె. వట్టిమిథ్యసుమ్ము! వారు నిం బ్రేమింతు రన్న నీకొఱకయి ప్రాణములను
విడుతురన్న నదియుఁ బెద్ద విభ్రాంతిపో, అనుభవమునఁ గాని యది తెలియవు.

గీ. ఇదిగో! ప్రత్యక్షపఱచెద నిపుడె చూడు! మీగుటిక మ్రింగుమీ! పోయి యింటికేవు
మృతుని వలెఁ గానిపింతువు మృతిని గొనవు; వినుదు వీనుల నెల్లయుఁ. గనుదు కనుల.

కం. అరుదెంచెద నీకడ కత్తఱి మరలం గూర్తు స్వస్థతను నీ" కనుడుం
గరములు మోడిచి ఛాత్రుం డరిగి గృహము మందుఁ ద్రావి యవనిం గూలెన్.

గీ. గొల్లుమని రొక్కతూరి యింటిల్లిపాది; దల్లిదండ్రులు దారపుత్రకులు నపుడు
'లబలబ' యటంచు నెత్తినోళ్లను గడింది బాదుకొంచును నేలపైఁబడిరి కట్ట!

కం. "పితరులకు నేకపుత్త్రుం డతండు ప్రాయమునఁ బిన్న; యధిగతవిద్యుం
డతిలోకచరిత్రుం;" డని ప్రతివేశిజనంబు జాలిపడెఁగని వానిన్.

ఆ. వె. తండ్రిఁ గడచి తల్లి. తల్లిం గడచి కళత్ర మెంతయోఁ గలంగి యెడఁద
"నతఁడు లేని మాదు బ్రతుకేటి?" కనుచు గొం తెత్తి వడ్డమునకు నేడ్చుచుండ.

ఆ. వె. బ్రాహ్మణుం డొకండు వచ్చి యచ్చటికిఁ దదార్తికారణంబు నరసి తెలిసి
వానినాడిఁ బట్టి పరికించి యనె "వీఁడు మృతుఁడ; కాని మరల బ్రతుకఁగలఁడు.

గీ. కలదు దివ్యౌషధంబు నాకడనొకండు; దానఁద్రుటిలేచి బ్రదుకు నీతం'' డనంగ
నేడ్పుసాలించి యెల్లరు నెలమిఁగొనిరి అతఁడు దమపాలిదైవంబ యనుచు మ్రొక్కి.

ఆ. వె. మరలఁ బలికె నిట్లు మస్కరుం ''డీమందు మ్రింగవలయు నెవ్వరేనిఁబరులు;
మందుదిన్నవాఁడు మరణించు; నీతండు బ్రదికిలేచు నుత్తరక్షణంబె.

కం. కలరిచ్చటఁ దలిదండ్రులుఁ గళత్ర మత్యార్త లితనికై మిక్కిలియున్
విలపించువార; లీతఁడు వెలియగు బ్రదుకేలయని తపించెడువారున్.''

ఆ. వె. జనకుఁడంతఁబలికె ''స్వామినే సిద్ధమే పుత్త్రుకొఱకుఁ బ్రాణములఁద్యజింప;
గాని యొక్కచిక్కు గలదు; నేలేకున్న నడవదొక్కనాఁడు నింటబండి.

ఆ. వె. ఎచట నేమిగలదొ యెవ్వరేమాయుంగ వలెనొ వీరికెఱుకపడదు లవము;
కాలఁదన్ని యింత గంపంతసంసార మేఁగ నేను, వీరికెవరుదిక్కు?''

ఆ. వె. అనుడుఁ దల్లి యిట్టులనెఁ ''ద్రిశుద్ధిగ నెంతు సుతునికొఱకు నేను మృతినిఁబొందఁ,
గానినాదుబిడ్డ కడుపుతోనున్నది, యెవరు పురుడుపోతు రేనుదక్క?''

ఆ. వె. అంతఁబలికె భార్య ''ఆర్య, నేఁజత్తుఁబో, ఇతఁడుపెండ్లియాడు నాతినొకతె
ఎవరుసాకు వారలీపసికూనల నకట! కనులు దెఱవనట్టివారి.''

గీ. చచ్చెనని యందఱనుకొన్న ఛాత్త్రుఁడెల్ల కతలనాలించి యాకస్మికముగ లేచి
అంజలి ఘటించి ''స్వామి మిమ్మనుసరింతు; విరిసె నాభ్రాంతి''యని వ్రాలెఁజరణములను.

౪. ఇదిగాదు - ఇదిగాదు

ఆ. వె. అత్తవారియింటి కల్లుండు క్రొత్తగా నరుగుదెంచెఁగూడి యాత్మసఖులఁ
తమదు నేస్తురాలి రమణుని దరిసింప వచ్చి రిరుగుపొరుగు పడుచులటకు!

గీ. సమవయోరూపములతోడఁ జూప పయినిఁ జావడింగూరుచున్న యాజనగణంబుఁ
తలుపువెనుకల డాఁగి తత్పరతఁ గనుచు నొకరినింద్రొసికొనుచొక్కరొదిగియొదిగి.

గీ. సఖినిఁ బ్రశ్నించి రొక్కనిం జారుమూర్తిఁ దర్జనింజూపి ''యితఁడెనీదయితుఁ?'' డంచు
విఱిచి పెదవిని బొమముడి బిగియఁజేసి యాదలం ద్రిప్పెనా పిల్ల యడ్డముగను.

కం. మరియొకని నుజ్జ్వలాంగునిఁ గరాంగుళినిఁ జూపి ''నీదు కాంతుఁ డితండే
నెఱిఁగింపు'' మనుడు నయ్యది పరికింపక పెడమొగంబు వయిచి నిలఁబడెన్.

ఆ. వె. చూపి మరల వేల సుందరాకారు వేఱొకని నోసి, నీ ప్రియుం డితండె?
యనుచు నడుగ విసువుగొని మోము ముడిచెనా కన్నె: వారితండు గాదనంగ.

ఆ. శిరిగి యొక్క దివ్యతేజోవిలాసుని నందు మిగిలియున్న యతనిఁ జూప
నగును నాక, గాదు నాక, స్మితాస్యయై, చెలులవంకఁ దిరిగెఁ జిన్ని పడుచు.

కం. ఇదిగా దిదిగా దని కల పదార్థములనెల్లఁ జేయఁ బ్రతిషేధ మిఁకఁగా
ఎది శేషించునొ బ్రహ్మం బది; దానింగన్న మౌనియై హర్షించున్.

## ౫. ఊసరవెల్లి

ఆ. వె. అడవికేగి మొన్న నాకులు గోయంగ నెక్కియుంటి నొక మహీరుహంబుఁ;
గానఁబడియెఁ బురుగొకండందుఁ జక్కని యెఱ్ఱపట్టు బ్రాటి కెనయనంగ.

కం. అనియొక్కరుఁడు వచింపఁగ విని వేఱొక్కండు "గానిపించెను జుమి నా
కనునది: కాదది యెఱ్ఱది కనఁబసరికవన్నె" దనుచు గట్టిగఁ బలికెన్.

కం. ఇరువురి వాదము విను చొక తెరువరి "యద్దానిఁ గాంచితిని నేనును ము;
న్నెఱుపును బసరుం గాదది యరయంగాఁ బసుపురంగు" దని వాదించెన్.

కం. మఱియొకఁ డనె ధూసరమని, యొకుఁడనె నూదాయటంచు! నొక్కొక్కరుఁడా
ర్పరికించిన వర్ణంబే సరియైనదటంచుఁ బలుకసాగిరి మఱియున్.

ఆ. వె. అలఁతి తడవు వాదులాడివారందఱు చనిరి కాన; కందుఁగనక దాని
నా మహీజ మూలమందుఁ గూర్చున్న బైరాగిఁగాంచి దాని రంగు నడుగ.

కం. అతఁడనె "నాకీ జంతువు కత యామూలాగ్రముగను జ్ఞాతము, మీలోఁ
బ్రతివాఁడు గన్నదియు సూనృతంబ; యది పెక్కురంగులీను సతంబున్.

కం. అది యూసరవెల్లి సుఁడీ, తదీయ వర్ణములు బహువిధంబులు: మఱియొ
క్కదనున నిర్వర్ణమునగు, సదా పరీక్షించువారె చాలుదు రెఱుఁగన్."

కం. అనవరతము భగవచ్చింతనంబుఁ గావించువాఁడె తద్యాథార్థ్యం
బును దెలియఁజాలు నవ్విధిఁ, గనఁబడు నీశ్వరుఁ డనేక గతులఁ బెరలకున్.

## ౬. ప్రేక్షకుడు

ఆ. వె. చాపచుట్ట నొండు చంకఁ బెట్టి యొకండు గనఁగ వీథినాటకమున కరిగె
నాటమొదలు వెట్టునదను గాలేదని వినియె నచట నున్న జనమువలన.

ఆ. వె. నేలఁబఱచెఁ జాఁప నిద్రింపఁదలచి తా నలఁతి తడవు. పిదప మెలఁకువ గొని
కనఁగ నాట ముగిసెఁ; జనెఁజాపచుట్టను జంకఁబెట్టి మగిడి సదనమునకు.

గీ భాగవతతత్త్వ మెఱుఁగంగ వలసినంత కాలమున్నది గద! తొందరేల యనుచు
బ్రాయమంతయుఁ బురుషుండు వ్యర్థపుచ్చి దానిఁ దెలియకె వచ్చినదారి నేగు.

## ౬. అర్థజ్ఞాన మనర్థకరము

గీ. "బ్రహ్మమయ మీ సమస్త విశ్వము నృపాల దాన బ్రహ్మస్వరూపు లందఱు" నటంచు
సదుపదేశం బొసంగ నాచార్యుఁ డతఁడు గళిత సంకోచుఁడై పెద్ద యెలమిఁ గాంచె.

కం. పరికించి రాణి "బ్రహ్మ స్వరూపు లెల్లరును గాన వాస్తవ భేదం
బరయఁగ నీకును నీదగు వరవుడు నకు లే" దటంచుఁ బ్రభువు వచించెన్.

ఆ. వె. కొంచెమాఁగి మఱలఁ గొంకక యిటువల్కె "నట్టులగుట రేపు దొట్టి నీదు
దాసి నాదు రాణిఁ జేసికొందు" నటంచు రాణి మదినిఁ బెద్ద రాయివడఁగ.

ఆ. వె. రాణి యంత గురుని రప్పించి "యోస్వామిత్వదుపదేశ మిట్లు పరిణమించె"
నని స్వభర్తయాడినట్టి యమ్మాటను వాని పూనికయును బలికె నెల్ల.

కం. ఉపదిష్టసదర్థంబును నపక్వహృదయులకుఁ దోఁచు నథరోత్తరమై
విపరీత గుణంబిచ్చును వపుర్విశేషముల కమృతపానం బేనిన్.

గీ. బ్రోదార్చి యాచార్యపాదుఁ డపుడు "అమ్మ నీ భర్తతో నీ గృహంబు నందె
ఆరగించెదనేఁ డొక్కటాచరింపు" మనుచు వచియించెఁ జెవిలో రహస్య మొండు.

కం. తినుచుండె నేఁడు; వడ్డించెను గోమయపిండమొండు చెలువ యతని యా
కున; నిస్సీ! యటంచును జనపతి కాలాగ్ని రుద్ర సదృశుఁడయ్యెన్.

ఆ. వె. పరిహరించి భుక్తి పాత్ర లేవఁ దలంచు ధరణి పతినిఁ గాంచి గురుఁడు పలికె
"అగుదు గాదె పెద్దయద్వైతి; విటు గోమ యాన్న భేదమేటికయ్య నీకు?"

గీ. ఆజ్యధారకు జ్వలియించు నగ్నిభాతి భగ్గుమని పల్కె యాచార్యువచనమునకుఁ
బరమ గురుఁడవు నాకు, నద్వైతనిధివి, తినుము పెండను జూతు"నంచనె నృపుండు.

కం. గురుఁడనియె నిదే తిందును బరికింపు మటంచుఁ బలికి భృత్యమును వలెఁ
దరమిడి గోమయపిండము ధరణిపుఁ డేవగొని చూడఁ దమి భుజియించెన్.

కం. కనివాంచి తలను నరపతి యనుతాపంబును వచించి యర్థజ్ఞానం
బనయం బపాయకరమని యనుకొని వందన మొనర్చె నాచార్యునికిన్.

## ౭. సర్వం విష్ణుమయం జగత్

కం. క్రమముగఁ బఠించి శ్రుతిశాస్త్రములను సాధనమొనర్చి తగ "సర్వం వి
ష్ణుమయం జగ"త్తనెడు వాక్యము యాథార్థ్యంబెఱిఁగి యొకం డిలువాసెన్.

కం. పరునకుఁ దనతోఁ దనకుం బరుతోఁ బనిలేక వాడవాడలఁ దిరుగన్
దరిసించు శునకఖరముల హరిస్వరూపులుగ నమ్మహాత్ముం డెడఁదన్.

ఆ. వె. అతఁడు బాలు పగిది నవ్యాజముగ నవ్వు, వెడఁగు మాటలాడు వెఱ్ఱి పగిది,
నటుచుఁబో పిశాచమావిష్టమైనటు లితఁడు వెడఁగటంచు నెల్లరాడ!

కం. నడయాడుచుండ వీధులఁ బడి యే పుణ్యాత్మురాలొ వానిం గని ప
ట్టెడు పాదంబును బెట్టెను గడుం గనికరంబు హృదయగర్భం బుబుకన్.

ఆ. వె. దానిఁ దెచ్చి వాఁడు తరుమూలమునం జేరి తినుచు నుండ వచ్చె శునక మొకటి
ఒక్క ముద్ద దానికొసఁగు; దానొక ముద్ద దినును; మిత్త్రు లట్లు దినిరి వారు.

కం. కని వానిఁ బిచ్చివాఁడని జనములు నగుచుండఁగాంచి సాదనె "నవ్వం
గ నిటేల! హరియె కూర్చుం డెను హరికడ; హరియె హరికిడెం గబళంబుల్.

ఆ. వె. హరులె మీర లెల్ల; హరులు వృక్షములెల్ల; హరులు పులుఁగులెల్ల; హరులు పసులు,
హరివినా యొకండు పరగనే విశ్వంబు నం!". దటంచుఁ బలుకు చతఁడువోయె.

## ౯. కూపస్థమండూకము

కం. చిఱుకప్పయొకటి నూఁతం జిరకాలము నుండియును వసించుచు నుండెన్
బరఁగ నది యందె పుట్టిం బెరిఁగెనందె; యెఱుఁగదది వెలుపలి జగమున్.

ఆ. వె. అరుగుదెంచె నొక్కపరి క్రొత్త కప్పయా బావిలోని కెట్లొ? ప్రశ్న సేసె
ప్రాఁత "దెచటినుండి వచ్చితి"? వని; "క్రొత్త దుదధినుండి వచ్చియుంటి" ననియె.

ఆ. వె. "ఉదధియా? యదెంతయుండు!" నాఁ బ్రాఁతది క్రొత్తదనియె" "జాలగొప్ప" దనుచు
ప్రాఁతకప్ప సాఁచి పాదయుగ్మము లెస్స యడిగె నింత పెద్దదా!" యటంచు,

ఆ. వె. "ఇంతకన్నఁ బెద్దదే" యనెఁ గ్రొత్తది; ఇవలినుండి దూఁకి యవలి దెసకు
బ్రాఁత దడిగె "నింత బావికన్నంగూడ నది మహత్తరంబె" యనుచు మరల.

కం. చిఱునవ్వు నవ్వి క్రొత్తది మరలన్ వచియించె "హా సితపశకముల కటుల్
పరగున్ సముద్రకూపాం తరంబు వేయేల?" యని; మొదటి కప్పంతన్.

గీ. అలిగి 'నా నూతికన్న మహత్తరంబు; లేదు ముల్లోకములయందు లేదు లేదు
పొమ్ము! నోర్మూసికొని; వేగఁ బోవకున్న నవ్వలికి గెంటుదును జూడు''మనుచు బలికె.

## ౧౦. ధన మదము

కం. దురదృష్టవంతుఁ డెవ్వఁడొ పొరపాటుగ జేబుఁజార్చి పోఁగొట్టుకొనన్
దొరకిన రూపాయినిఁ దన బొఱియను మండూక మొండు మొగిదాఁచుకొనెన్.

గీ. తన సమీపంబుగాఁ బోవు జనులఁ గాంచి మున్ను భయపడి నట్టిది మొఱుగఁ దొడఁగె
చిన్నలను బెద్దలను లెక్కసేయఁబోక మీఁది మీఁదికి దూఁకం గ్రమించుచుండె.

కం. తన బిలము సమీపంబునఁ జనుచుండఁగ మదపుటేన్గు చయ్యనఁ దన్నం
గను గాలినెత్తి "నా బిలమునఁ గాలిడ సాహసింతె? పో! పో!" యనియెన్.

# గురుభక్తికి మూర్తీభావమే శ్రీ వివేకానందస్వామి

శ్రీ చేరాల కృష్ణప్రసాద్

పదునెనిమిదవ శతాబ్ద ప్రారంభమున పాశ్చాత్య నాగరికత కొద్దికొద్దిగా ఈకర్మభూమిని ఆక్రమింపసాగెను. వారు మనజాతి సంస్కృతులను కించపఱుపసాగిరి. మన సనాతన ధర్మతత్త్వములు అర్థరహిత గంభీర ప్రలాపములని నిర్ధారణగూడ చేసిరి, వారి ప్రగల్భ ప్రలాపములు యావద్భారతావనిని గడగడలాడించెను. సామాన్య ప్రజానీకము వారి పలుకులకు లొంగి 'సనాతన భారతజాతీయ జీవనము పాశ్చాత్య నాగరిక ప్రణాళిక ననుసరించి క్రొత్తత్రోవలు త్రొక్కవలయు నను' భావము కలిగియుండిరి. క్రమక్రమముగా ప్రజలలో ఆధ్యాత్మికచింతన పూర్తిగ నశించి ఐహికభావములు నెలకొన ప్రారంభించినవి. అనాత్మవాదములనెడి విషవాయువులు భారతజాతినే అంతరింపజేయునేమో అన్నవిధముగా తీవ్రరూపము దాల్చి స్వైరవిహారము చేయుచుండెను. ఇట్టి క్లిష్టసమయమున — కూపస్థమండూకభావములో అనాత్మవాదనే అఖండమని, అపురూపమని ఐహిక సుఖాన్వేషణలో పడి కన్నుమిన్ను గానక పయోముఖ విషకుంభములచేత, గోముఖవ్యాఘ్రములచేత పూర్తిగ అధములైన సామాన్య ప్రజానీకమునకు ఆత్మజ్ఞాన మొసగుటకై, భారతావనిని ఆవహించిన అనేక విషవాయువులను సంజీవమారుతములుగ రూపొందించుటకై, పయోముఖవిషకుంభములలో, గోముఖవ్యాఘ్రములలో నున్న విషపూరితశక్తిని ఆస్వాదించి; వ్యాఘ్రస్వభావమును మాయజేసి వారిలో నూతనాధ్యాత్మికశక్తిని ప్రసాదించుటకై ఈ కర్మభూమియందు వెలసిన కారణజన్ముడు, ఆజన్మ బ్రహ్మజ్ఞాని, సర్వమత సామరస్య ప్రవక్త, రాజయోగి—శ్రీ పరమహంస.

ఈవిధముగానే "సనాతన ధర్మమహాసాగరము నుప్పొంగజేయుటకై వేదాంతమతప్రకాశమును ప్రాక్పశ్చిమఖండములందంతటను వ్యాపింపజేయుటకై," ప్రాక్పశ్చిమ ప్రాచీన నవీన సంస్కృతి ప్రస్థానములందు సౌహార్ద సేతువులు నిర్మించుటకై, "ఈశ్వరసంభూతుడై భువనేశ్వరీ విశ్వనాథ పుణ్యదంపతులకు ఉదయించిన బాలచంద్రుడు, భారత భాగ్యోదయ బాలభానుడు," ఆజన్మ బ్రహ్మజ్ఞాని, జగత్కవి వేదాంతకేసరి శ్రీ వివేకానందస్వామి,

"పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే."

ధర్మము పూర్తిగ నశించి అధర్మము హెచ్చు పెరిగినప్పుడు 'భూభారమును తీర్చుటకుగాను అవతారమెత్తెదను' అని శ్రీకృష్ణపరమాత్మ గీతలో చెప్పిన విధముగానే అట్టి అవతారపురుషులలో, కారణజన్ములలో స్వామిజి యొకరు.

"పారమార్థికాశయములతో, మహోత్తమ తపశ్చర్యలతో, ఆత్మసందర్శన శక్తిసామర్థ్యములతో గూడిన ప్రాచీన భారతజాతీయజీవన గంగాప్రవాహమే శ్రీరామకృష్ణుడు, నూతన జాతీయాదర్శములతో ప్రకృతిశాస్త్ర విజ్ఞాన ప్రదర్శనములతో, ఆత్మవిషయక సంశయాత్మక భావములతో గూడిన నవీన భారతీయ జీవన యమునాప్రవాహమే నరేంద్రుడు" డని శ్రీచిరంతనానందస్వామి తమ గ్రంథరాజమైన శ్రీవివేకానందజీవిత చరిత్రమున లోకగురువు, ఆదర్శశిష్యులనబడు శ్రీ పరమహంస నరేంద్రులను బహువిధములుగ ప్రశంసించియున్నారు.

శ్రీరామకృష్ణపరమహంస మానవ సామాన్యమార్గమున కేమాత్రమును సంబంధించినవాడు కాడనుట స్పష్టము. జీవితము యొక్కయు, ఆత్మయొక్కయు ఉన్నతతరసత్యములపై మనబుద్ధిని మరల జేయుటకై అప్పుడప్పుడు అవతరించుచుండిన హైందవమహర్షి సంప్రదాయమునకు చెందినవాడని పండిత జవహర్‌లాల్ నెహ్రూ వ్రాసియున్నారు.

పాండిత్యవిహీనుడైన, ఆయనను అనేకులు దూరమునుండి పరిహసించుచుండిరి; కాని అతని దర్శనము పొందినపిదప, ఆదివ్యపురుషుని అఖండప్రభావమునకు తలలువంచి భక్తిచూప నారంభించిరి. తనవద్దకు వచ్చిన ఇతరులపై పరమహంస అమోఘమైన ప్రభావమును చూపుచు వచ్చెను. అనేకులు ఆయనను దర్శించి, తమ జీవితమార్గములకు స్వస్తిచెప్పి, ఈలోకగురువునకు శుశ్రూషలు చేసి, ఆయన శిష్యవర్గములో చేరిరి. వారిలో ప్రథమశ్రేణివారు బ్రహ్మానంద, శారదానంద, యోగానంద, నిరంజనానంద, రామకృష్ణానందం, దాఖండానంద, విజ్ఞానానం, దాభేదానందస్వాములు గిరీశచంద్రఘోషు, మహేంద్రనాథగుప్త: అఘోరమణీదేవి, గౌరీమాయి కేశవచంద్రసేను మొదలగువారు.

శ్రీ వివేకానందస్వామి ఈకోవలో చేరినప్పటికిని వీరికంటెను ఒకమెట్టు అధికముగనే అటు గురువైన పరమహంస మన్ననలను పొందుటయేగాక ఇటు మనదేశమందే కాక ప్రపంచమునందితర భాగములలోకూడ నవీన యుగ ప్రవక్తయని గొప్పజాతి నిర్మాణవిధాన నిపుణుడని ఖ్యాతికెక్కెను. శ్రీరామకృష్ణనరేంద్రుల గురుశిష్యసంబంధము అత్యద్భుతము, అనన్యసామాన్యము. ఈసంఘటన దైవసంకల్పము. ఇది భగవంతుడు మానవాళికి ప్రసాదించిన అమృతగుళిక. నరేంద్రుడు దక్షిణేశ్వరమున రామకృష్ణుని చూచినవెంటనే, పరమహంస నరేంద్రుని పాదములకడ మోకరించి చేతులు కట్టుకొని—

"భగవానుడా, నీవు నరుడనెడి గొప్ప ఋషివి. నారాయణసంభూతుడవు. మానవాళి దౌర్భాగ్య స్థితిగతులను తొలగించి వారికి ఆత్మజ్ఞాన మొసగుటకై ఈ కర్మభూమియందు అడుగుపెట్టినవాడవు" అనెను. మరల ఇంకొకసారి పరమహంస "నీలో శివుడు తాండవము చేయుచున్నాడు, నాలో 'శక్తి' దేవత కలదు! ఇవి రెండును ఒకటే అని పలికెను.

ఈవిధముగ నరేంద్రుని చూచిన వెంటనే అతడు సామాన్యమానవుడు కాడని. భగవత్స్వరూపుడని గ్రహించి—అతనిని ఆదరించి, అతనిలో జగజ్జనని స్వరూపమును జూచుచు, అతనిలో తన ఇష్టదైవమును ప్రార్థించుచు ఆనందపారవశ్యమున సమాధిస్థితిని చెందుచుండువాడు.

"ఏపుణ్యసమయమున నరేంద్రుడు, 'మహాశయా, తాము దేవుని జూచితిరా?' యని రామకృష్ణుని ప్రశ్నించెనో యాతరుణముననే అతని పారమార్థిక జీవనకల్పతరువు పుష్పింప నారంభించెను. శ్రీరామకృష్ణు నఖండాధ్యాత్మికశక్తి నరేంద్రునియందు బ్రవేశించిన సమయమున నయ్యది సంపూర్ణవికాసముగాంచెను. గురుసందేశమును నరేంద్రుడు ప్రాచ్యపాశ్చాత్యఖండములందంతటను వ్యాప్తిమొనర్చి, సనాతన ధర్మోద్ధరణము గావించినప్పు డయ్యది ఫలోన్ముఖమై వికసిల్ల నారంభించెను."

రామకృష్ణుడు తన్ను భగవంతునితో పోల్చుట తాను గొప్ప ప్రతిభావంతుడయి మానవాళికి మహోపకారము చేయుగలడనుట—

ఇత్యాది సత్యవిషయములను నరేంద్రుడు త్రోసిపుచ్చి, పరమహంస తనతో పరాచికము లాడుచున్నా డని, ఏదేదియో, పిచ్చివానివలె వాగుచున్నా డని తలచి—అతడు చెప్పిన వేవియు లెక్కచేయక తనధ్యాసలో తాను నిమగ్నుడై యుండెను. రామకృష్ణుడు అసత్యము లాడుటయా లేక బాలకునితో [illegible] లాడుటయా—ఇది ఎన్నటికిని కాదు. ఇతనికి ఇతడే సాటి, నరేంద్రుడు తన్ను సందర్శించుటకు పూర్వమే శ్రీరామకృష్ణుడు దివ్యదృష్టిచే అతనినిగూర్చి గ్రహించిన విషయములు అత్యాశ్చర్యకరములు. తన దివ్యదృష్టిచే నరేంద్రుని జననవిషయములు, దేవతాస్వరూపుడైన ఆ బాలకుడు తనయొద్దకు తప్పక వచ్చునని, తన తపస్సునకు ఫలము అతనిరాకయే యని—ఈ మున్నగు అనేకవిషయములు తెలిసికొన్న మహాపురుషుడు శ్రీ పరమహంస.

నరేంద్రుడు రామకృష్ణుని జూచుటకు అప్పుడప్పుడు వచ్చుచుండెడివాడు. కాని ఇతనిమీద గల అపారమైన ప్రేమచే ఎల్లప్పుడు రామకృష్ణుడు ఇతని రాకకొఱకు ఎదురుచూచుచుండును. ఇతడు రానిపక్షమున రామకృష్ణుడు కాళికాదేవిని సమీపించి "అమ్మా, జగజ్జననీ, అతనిజూడనిచో నేను జీవింపజాలను, కరుణించి యాతని రప్పింపుము" అని ప్రార్థించిన సమయములు అనేకములు గలవు.

శ్రీరామకృష్ణ సందర్శనమున నరేంద్రునికి మరియొక విచిత్రమైన దివ్యానుభవము కలిగినది. పరమహంస పాదస్పర్శవలన నరేంద్రుని మనోభావము అతనియెడ సంపూర్ణముగ మాఱిపోవ ప్రారంభించెను. శ్రీరామకృష్ణుడు పిచ్చివాడు కాడనియు "అహంకార మమకార పాశబద్ధులై, కామకాంచన నిర్మిత సంసారమున దగుల్కొని లోక మను ఉన్నత శరణాలయమున వసించు మదోన్మత్త ప్రమత్త జనసహస్రముల మధ్యమున నాతడొక్కడే సుస్థిరమతి యని, ధీరాగ్రేసరు డని" నరేంద్రుడు గ్రహింపసాగెను.

ఈ లోకగురువు, బ్రహ్మజ్ఞాని, రాజయోగి నరేంద్రుని అన్నివిధముల ఆకర్షించెను. ఈ గురుశిష్యసంబంధము దినదినప్రవర్ధమానమై, అనన్యసామాన్యమై సకలురను మెప్పించుచుండెను. అన్యోన్యమగు వారల ప్రేమ తాత్పర్యము లనుపమానములు. నరేంద్రుడు తనగురువుకు సకలోపచారములు చేయుచు ఎన్నియో ఉపదేశములు పొందెను. బహువిధముల శుశ్రూష చేసి, ఎన్నియో గొప్పవిషయములను గ్రహించెను. గురుశక్తి అతనిలో బాగుగా పనిచేసెను. రామకృష్ణుని ఆత్మజ్ఞానోపదేశరత్నములు ఈ నరేంద్రుని మనస్సులో తీవ్రముగా నాటుకొనెను.

1. 'నిన్ను నీవు తెలిసికొనగల్గిననాడు భగవంతుని తెలిసికొనగలవు.'

2. 'బ్రహ్మసత్యం జగన్మిథ్య' (పరబ్రహ్మమే సత్యమైనది జగత్తు మిథ్య)

3. పాదుకలు తొడిగికొని ముండ్లమీద ఏ అపాయము లేక నడువగలము. ఆధ్యాత్మిక జ్ఞాన మను పాదుకలు ధరించి ముండ్లతో గూడిన ఈ సంసారమందు సురక్షితముగా సంచరింపవలెను.

4 శ్లో॥ 'విష్ణూపరిస్థితో విష్ణుః
విష్ణుః ఖాదతి విష్ణవే
కథం హససి రే విష్ణో,
సర్వం విష్ణుమయం జగత్'

'అజ్ఞానమువలన మనుష్యుడు బాహ్యమున భగవంతునికొఱకు వెదకుచున్నాడు భగ

వంతుడు తనయందే కలడని అనుభవమువలన తెలిసికొనుటయే జ్ఞానము.'

నరేంద్రుడు సకలవిషయములను కొలది కాలములోనే సమగ్రముగా గ్రహించి, గొప్ప విద్వాంసుడై తన ప్రతిభావిశేషములను ప్రపంచమునకు చాటుచువచ్చెను. ఇతని అనర్గళ వాగ్ధాటి వినుటకు అనేకులు గుంపులుగుంపులుగా వచ్చుచుండెడివారు. ఈ భావములీ మహాపురుషునిలో ప్రజ్వలించుచుండిన అనర్గళ వాగ్ధాటితో, ఉత్తేజనప్రభావపూరితభాషతో వెలువడుచుండెను గనుక అందు నిరర్థకవాక్కొక్కటైనను లేదు.

ఒకప్పుడు రామకృష్ణుడు నరేంద్రునిజూచి ఇతరశిష్యులతో ఈవిధముగా చెప్పెను. "చూడుడు ఈ బాలుడెంత వినమ్రుడో! ఎంత శాంతమూర్తియో! ఈతడు నిత్యసిద్ధుడు. ఆ జన్మబ్రహ్మజ్ఞాని. ఇట్టివారీశ్వరకోటిలోనివారు. ఆచార్యకోటిలోనివారు. వీరు జగద్గురుత్వము వహించుటకై జన్మించుచుందురు. వీరు పొందు శిక్షణమంతయు లోకకల్యాణమునకే."

శ్రీరామకృష్ణుడు చెప్పిన విధముగానే నరేంద్రుడు లోకకల్యాణపురుషుడుగా మారెను. 'నిద్రాణమై, నిస్త్రాణమై యున్న భారతజాతిని లెండు మేల్కొనుడు కార్యసిద్ధి కలుగునంతవఱకు కర్తవ్యమును విడనాడకుడు' అని తన దివ్యవాక్కులతో మేల్కొల్పెను. 'భారతీయులారా త్వరగా లెండు. ప్రపంచమును పగటికలలు మఱచిపొండని సింహగర్జన చేయుడని ఘోషించినవాడగుటచే' స్వామినిగూర్చి నెహ్రూ ('Vivekananda came as a tonic to the depressed and demoralised world) 'నిస్త్రాణమై, అవినీతిపరమై యున్న ప్రపంచమునకు వివేకానందుడు దివ్యౌషధము వలె ఉద్భవించినాడు' అన్నాడు. ('Modern India is his creation if I err not') 'నేను పొరబడనట్లయిన నవభారతదేశమును ఆయన సృష్టించినా'డని సుభాస్‌చంద్రబోసు శ్లాఘించెను.

షికాగోనగర విశ్వమత మహాసభయందు స్వామి ప్రపంచమున కొసగిన సందేశములు, అచ్చట హిందూమతప్రాశస్త్యమును చాటి చెప్పినరీతి ఇక ప్రపంచమున్నంతవఱకు ప్రతిధ్వనించుచునే యుండును.

సనాతన ధర్మోన్నతినిగూర్చియు స్వామి సందేశమహత్త్వమునుగూర్చియు విశ్వమత మహాసభయందలి శాస్త్రశాఖాధ్యక్షుడు ఇట్లు చాటెను:

"హిందూమతమువలె విశ్వమహాసభను అమెరికాప్రజను అత్యద్భు[illegible] నరికట్టిన మత సంస్థయు తత్ప్రతినిధియగు వివేకానందస్వామి వంటి మహావక్తయు లేరనుట నిస్సంశయము. స్వామి యుపన్యాసమున్నచో [illegible] అపరిమితోత్సాహము, ఆనందము..." ఈ విధముగ వివేకానందుడు అపారమైన, అఖండమైన, అనన్యసామాన్యమైన కీర్తిప్రతిష్ఠలు పొందుటకు, ప్రపంచమున భారతజాతిసంస్కృతునకు, హిందూమతమునకు, ఎనలేని శాశ్వతస్థలమును ఆపాదించుటకు కారణము అతని గురుదేవుని కటాక్షమే.

"లోకోద్ధరణకై ఈశ్వరసంభూతుడై ఉదయించినటువంటి వివేకానందునిలో చిన్ననాటనే భక్తిబీజము నాటుకొనినది. దానికి పోయబడిన జలము తల్లిదండ్రుల, గురుదేవుల

గొప్పశిక్షణము. తత్ఫలితముగా 'వివేకానందుడు' అనెడు వృక్షము 'భక్తిజ్ఞానవైరాగ్యము' లనెడు ఫలములతో వెలసినది. అందుండి వెలసిన విత్తనములే స్వామిదివ్యసందేశములు. అది లోకమందంతటను ప్రజల హృదయాంతరంగములయందు నాటుకొని 'వివేకము' అనెడి చిన్నచిన్న మొక్కలై ఉద్భవించినవి. ఈవిధముగ తాను వివేకియై ఇతరులలో వివేకము కలిగించినాడు స్వామి''

అజ్ఞానమయాంధకారకూపములోపడి తారట్లాడుచు విలవిలతన్నుకొనుచున్న ప్రపంచమునకు వెలుగును ఆత్మజ్ఞానమును ప్రసాదించిన వివేకానందునకు మనము సర్వదా కృతజ్ఞులము.

# సామాజికవిద్య - వివేకానందుని దృక్పథము

## శ్రీ అల్లాడి రామచంద్రగారు

సామాజికవిద్య యనగా వివేకానందుని యభిప్రాయ మొక మేధావిస్వకపోలకల్పన కొకరూపము నేర్పఱచుటకాదు; మానవుడు క్రమవిధానమున అత్యున్నతలక్ష్యము జేరుటకు సాహాయ్య మొనర్చు సామాజికావసరముల గూర్చి తెలిసికొన్న సత్యోక్తులనమే సామాజికవిద్య.

వివేకానందునిబోధనలు భావము లాతని వ్యక్తిత్వాంతర్గతము లగుటచే వానిని నర్థము చేసికొనుటకు తద్వ్యక్తిత్వసాహిత్య మావశ్యకము. రామకృష్ణుని పాంచవర్షిక శిక్షణములో నరేంద్రుడు పలువిధములైన యాధ్యాత్మికానుభవములకు లోనైనను ఆతని వైజ్ఞానికదృక్పథము కుంటువడక మఱింత దృఢమైనది. శ్రీరామకృష్ణుడు తాను మరణించుటకు పూర్వము తన యాధ్యాత్మికశక్తుల నరేంద్రుని పరము చేసి దీనమానవాళి కాత్మజ్ఞాన మలవడజేసి వారిదైన్యస్థితిని పోగొట్టవలయు నని శి ని కనుల్లంఘనీయశాసనము చేసెను.

నరేంద్రుడు గురువునేర్పిన విద్యల నాతని యందలి భయభక్తులచే మౌనముగ నంగీకరింపక ప్రతివిషయమును స్వీయానుభవ మనెడి పాత్రలో కాచి వడబోసి ప్రత్యక్షముగ తెలిసికొనెడివాడు. అట్లాతడు నేర్చుకొన్నసత్యము లనేకములు, అందు ప్రస్తుతము లివి.

1. భగవంతుడున్నాడు. భగవంతు డొకడే. భగవంతుడు సర్వాంతర్యామి. సర్వస్వము భగవంతుడే. భగవంతుడు చూడబడగలడు.

పరమోత్కృష్టమైన ఈ జీవితసత్యమును విస్మరించినచో ఏ జీవితసమస్యయు నర్థవంతముగ పరిష్కరింపబడజాలదు.

2. దైవదర్శనమే జీవితపరమావధి.

దైవసాక్షాత్కారమే సంపూర్ణాత్మసిద్ధిదాయకము. ఇదియే సర్వసమస్యలకు తరణోపాయము.

3. దైవసాక్షాత్కార సంజనిత దివ్యజ్యోతిర్మయమైన ఈ జీవిత మగోచరమైనపుడు జీవితము పరస్పరవిరుద్ధభావముల సంఘర్షణలతో సతమతమై నిరర్థక మగును.

అట్లుగాక దైవసాక్షాత్కారమే జీవన ప్రధానసూత్ర మగునేని తక్షణమే పరమ

నిశ్చయసాపేక్షభావములకు, నేటికి నాటికి, శ్రోత్రప్రాతలకు, మేధకు–మనస్సుకు, వర్గ వర్ణములకు, విశ్వాసహేతువాదములకు, ప్రాచ్య పశ్చిమములకు, నీ–నాలకు, వ్యష్టిసమష్టులకు గల పరస్పరవిరుద్ధభావముల సంఘర్షణ లొక్కమారు సమసిపోవును.

4. సంఘములోని ఈ సంఘర్షణలకు మూల కారణములు మానవుల మూఢత్వము, తాను వేఱనెడి భ్రమ, ఆత్మనుగుఱించియు ప్రపంచమును గుఱించియు గల యపోహలే.

5. జీవాత్మపరమాత్మల మైక్యము నెన్నడు మానవుడు గుర్తించునో యప్పు డాతడు సకల జీవితసమస్యల పరిష్కారమును ఆత్మైక్యమందే ఇమిడియున్నదని గుర్తెఱుంగ గలడు.

కాబట్టి ఏతదైక్యోన్ముఖతయే మానవ నాగరికతావికాస మార్గాదర్శము. అంతియే కాదు. సాంఘికసమైక్యమునకు దోహదకారి.

6. నిర్జీవవిగ్రహారాధన భగవదారాధన మైనపుడు జీవారాధన ఏల శివారాధన కారాదను ఆధ్యాత్మిక సాంఘికభావముల తలక్రిందులుసేయునటువంటి సత్యమును రామకృష్ణుడు వివేకానందునికి నేర్పెను.

జీవుడే శివుడను గొప్పమంత్రమును రామకృష్ణుడు వివేకానందునికుపదేశించెను. అన్నార్తునికి మతమునకు సామరస్యము కుదుర దని గురువు శిష్యునకు గఱపెను.

7. తాను నిరంతర బ్రహ్మానందస్థితిలో నుండవలె నను శిష్యుని స్వార్థభావమును మాన్పి మానవాళికై ఆక్రోశించి వారికి సేవ చేయుచు వారి దైన్యమును బాపి, జీవన్ముక్తి దాయకమగు దివ్యజ్ఞానము వారి కుపదేశింప వలసినదిగా శిష్యుని కాదేశించె నా గురువు.

నరేంద్రుడు వివేకానందుడైన కాలపరిమితిలో జరిగిన మార్పు లనూహ్యములు. విజ్ఞానయుగమునకు పరమగురువుగా మానవాళికి మహోన్నతమార్గదర్శకుడుగా మన ముందు నిలుచు వివేకానందుని వ్యక్తిత్వములో నాతని కేప్రత్యేకములనిపించు విశిష్టాంశములు.

1 అద్వైత మను జీవనసమీకరణపరిష్కారము నందు సంపూర్ణానుభవమువడసి వెలుగొందిన బ్రహ్మజ్ఞాని వివేకానందుడు.

2. అశాస్త్రీయ స్వానుభవపరిమితమగు ప్రారంభదశనుండియు పరిమితమగు ననంతయాత్రా పరమావధి జేసుకొన్న విశ్వమానవుడు

"నేను సామ్యవాది" నని వివేకానందు డన్నచో నది బ్రహ్మజ్ఞానజనితస్వానుభవమే కాని రాజకీయవిధము గాదని గుర్తెఱుంగవలె.

3. విశ్వాత్మను తనలోను తన్ను విశ్వమందంతటను సాక్షాత్కరించుకొన్నప్పుడే మానవాళి కాతడు గురు వాయెను.

ఇట్లాతడు బ్రహ్మజ్ఞానియై గురువగుట కవతారపురుషుడగు రామకృష్ణునిచే నిర్దేశింపబడినాడనుట అతనిసేవలు బోధనలు ప్రస్తుతము మఱింత ప్రాముఖ్యము గలవగుచున్నవి.

4. సమగ్రపరిశీలనాశక్తి కలిగి సునిశిత బుద్ధియు వైజ్ఞానిక దృక్పథము గల యాధునిక మానవు డాబ్రహ్మజ్ఞాని.

5 అత్యుత్తమ యోగానుభవములు గలిగిన యతడు వివిధశాఖావిజ్ఞానసర్వస్వముతో నాధునిక విశ్వవిద్యాలయ మొకదానిలో రూపొందినవాడు.

6. ప్రపంచము సంచరించు జీవించు సామాన్యజనులసమస్య లన్నిటిని అవగాహన చేసికొన్నవా డాబ్రహ్మజ్ఞాని.

7. బ్రహ్మజ్ఞాని యగుటచే జీవితపరమావధి నెఱింగిన యాతడు చరిత్రను నిశితముగ పరిశీలించియుండుటచే ప్రాపంచికవిషయములలో ముఖ్యములగు సకలశక్తులగూర్చి క్షుణ్ణముగా తెలిసికొనగలిగెను

8. భవబంధములకు లోబడని మేటియయ్యు అతడు మానవతను సున్నితముగ ప్రేమింప గల్గిన సాంఘికదృక్పథము విశాలహృదయము కష్టజీవులపై సానుభూతియు కలవాడు.

9. నిర్భీకత, ఆత్మ చిరంజీవియను సనుభవసంజనితబలము ఆత్మశక్తి ఈ మూడింటి మూర్తీభావ మాతడు.

10. అంతిమ పరిశీలనలో జీవికి పరాజయము లేదనుట నెఱింగిన నిరంతరాశావాది.

ప్రతి పతనము పురోగమనమునకు దోహదకారి. కాలపరిధియందెచ్చటనో ఆత్మవిముక్తి తప్పనిసరి యని అత డెఱిగియుండెను.

## II

వివేకానందుని సాంఘికతత్త్వమున మహోన్నత పారమార్థిక భావముతోబాటు వాస్తవపరతయు మేళవించినది.

ప్రతివ్యక్తియు అభివృద్ధిచెంది జ్ఞానసిద్ధి వంకకు ఆత్మజీవన సముపార్జనప్రాప్తి వంకకు పురోగమించుటకు చేయూత నిచ్చుటయే యాతని తత్త్వధ్యేయము.

ఇది క్రిందివారిని పై మెట్లెక్కించుటే కాని, పైవారిని క్రిందికి పడలాగుట కాదు.

ప్రతివ్యక్తి క్రమక్రమముగ శారీరకముగను మానసికముగను, ఆత్మసంబంధముగను వృద్ధిచెంది సర్వోన్నతపథము చేరుటకు ఏ సమాజము తోడ్పడునో అట్టి సమాజము అత్యుత్తమమైన దని వివేకానందుని యభిమతము.

ప్రతి మనుజుని విభిన్న బాహ్యాంతరావసరముల ఏకతత్త్వసాహాయ్యమున ఎట్లు తీర్చుట యనుటయే ప్రతిసామాజిక చింతకుని సమస్య.

వివేకానందుడు ఈ సమస్యను విలక్షణమగు స్వీయమార్గమున పరిష్కరించెను. వివేకానందుడు,—

1. మానవుడు తన్ను గుఱించియు ఆత్మ గుఱించియు, ఆత్మదర్శనము గుఱించియు తెలిసికొన్న దానిని విశదీకరించెను.

2. తదుపరి శ్రీకృష్ణుడు అర్జునునికి ఆత్మ చిరంజీవిత్వముగూర్చి తెల్పి అతని అంతః ప్ర నెట్లు దృఢపఱచెనో యట్లే వివేకానందుడు మానవులగు వారిలోని దివ్యతను గుర్తింప జేసెను. అట్లు గుర్తించినప్పుడు జీవిత సమస్యలలో సగముపాలు పరిష్కరింపబడును గదా!

3. సరియైన విద్యయే సర్వసమస్యలకు తరణోపాయము.

4. బ్రహ్మజ్ఞానప్రాప్తియే జీవిత పరమలక్ష్యము. ఇందులకనుగుణమే విద్యనుగూర్చిన వివేకానందుని ఆశయము. కావుననే మానవునిలో స్వతస్సిద్ధమగు పరిపూర్ణత నావిష్కరించుటే విద్యయని యాతడు నిర్వచించెను.

వివేకానందు నభిప్రాయప్రకారము స్వతస్సిద్ధమగు పరిపూర్ణతావిష్కారము బాహ్యాంతర ప్రకృతుల స్వాధీనము చేసికొనుట ద్వారా చేయవలెను. వివేకానందుని దృక్పథమున మతానుష్ఠానమునకు గల ఉత్తమస్థానము శాస్త్రవిజ్ఞాన పరిశీలనకును కలదు.

5. మతము విద్యాసారము; మతము మానవునిలో స్వతస్సిద్ధమగు దైవత్వ ప్రకటన యని యాతని నిర్వచనము.

6. ఆతని సాంఘిక తత్త్వమునుండి మతమును జీవితావసరములను వేఱుచేయుట వీలుపడదు.

7. జీవితపరమావధి మోక్షము(జీవన్ముక్తి). ఉత్కృష్టమైన వతజాళమోన్ముఖము మాన వాళియొక్క మహాప్రస్థానము.

8. అందఱు ఒకేచోటనుండి ఒకే దిశలో పయనించుట లేదు. విభిన్నదృక్పథముల గుర్తెఱింగి, యందఱు మోక్షగాములై పురోగమించుటకు తోడ్పడుటయే సాంఘిక తత్త్వ కార్యము.

9. ఇందుకు వ్యష్టిసాధనయు పరస్పరసహకారము నావశ్యకములు.

10. మానవుడు మానవునిప్రక్కనిలబడి మానవునికి సేవ చేయవలెను. అందుచేతనే జీవుడే శివుడను రామకృష్ణుని ఉత్తేజకరమగు మంత్రప్రకటన. ఎవడు జీవారాధకుడో అతడే శివారాధకుడు. సరియైన మార్గమున మానవాళిని సేవించిన సంఘావసరముల తీర్చుటయే గాక దివ్యాత్మావసరములగూడ తీర్పగలము.

11. ప్రపంచమును సొంతము చేసి కొన వలెను. 'అహంత' ఎంత వినాశకారియో చరిత్ర చాటి చెప్పుచున్నది. కావుననే వివేకానందుడు త్యాగమార్గము బోధించెను. కృష్ణుడు లోకసంగ్రహమునకై చేసిన బోధను నూతన మార్గమున విస్పష్టీకరించి త్యాగమార్గమే జీవితమున పరమోన్నత ధర్మ మని చాటెను.

ప్రస్తుతము భారతదేశము దురాలోచనల భ్రమలకులోనై తబ్బిబ్బగుచున్నది. సందిగ్ధత దుఃఖము భారతదేశమున హెచ్చగుచున్నవి. అదేసమయమున చార్వాకమతము సుఖమే శ్రేష్ఠమైన పురుషార్థ మను నభిమతము అరాచకము వృద్ధిచెందుచున్నవి.

మనకై సర్వప్రణాళికల నేర్పఱచువారి కొకింత దూరదృష్టి కలిగియుండుటలో వీలుగాని దేమిటో తోచుట లేదు. వారింతదనుక చతుర్విధపురుషార్థములలో అర్థకామముల యభివృద్ధికి మాత్రము ప్రణాళికల నేర్పాటు చేయుచున్నారే కాని పైరెంటిని పొందుట వలన దేశము కాపాడబడునా యనుట చింతించుట లేదు.

భారతదేశము మోక్షదృక్పథమున వివేకానందుని సాంఘికతత్త్వమును గోల్పోయెనేని కుటుంబనియంత్రణము భారతదేశమును కాపాడజాలదు. కపటోపాయముల చేత దేశము గొప్ప యనిపించుకోబోదు.

వివేకానందుడు సెలవిచ్చిన భారతదేశపు మహోన్నతాదర్శములకు త్యాగశీలతా సేవాధర్మములకు ప్రతియొక్కరు ధైర్యముగ తమ్మర్పించుకొనుటయే భారతదేశపు ప్రస్తుతావసరము

తనయొక్క స్థితినుండి ఉత్తమముఉదాత్తము సత్యమునగు స్థితికి జీవుని నిరంతరపురోగమనమే వివేకానందుడు నిర్వచించిన త్యాగశీలత.

సేవయనగ అట్టియుద్యమము పరులకు అనుసరణీయముగ ప్రదర్శించి వారిని అదేమార్గమున పయనింపజేయుటయే.

మానవునిలోని దైవబలము వివేకానంద నిర్దిష్టమగు ఉన్నతమార్గముగూర్చి ఆలోచించి అంతటి ఉదాత్తరీతిగ నడచుకొనవలసినదని కట్టడి నిడుచున్నది.

మన మేది చేయవలసివచ్చినను అత్యుత్తమ లక్ష్యప్రాప్తి కభిముఖులమగుటయే గాక ఒరుల గూడ నట్లే చేయుటకు చేయూత నొసగెదము గాక.

అట్లు నడచుటయందే బుద్ధిస్థిరత్వము కలదు. అదియే మోక్షము. భగవంతుడే సత్యము నర్థముచేసికొను తెలివి నొసగి తదంతర్గతజీవిత సత్యముల ఉన్మీలనమునకు మనకు తగిన సాహసము నొసగుగాక.

# వివేకానందస్వామి – భారతదేశ భవిష్యత్తు

## శ్రీ కొమాండూరు కల్యాణరాంగారు

1757-వ సంవత్సరంలో ప్లాసీయుద్ధంతో ఆరంభమైన పరదేశపాలన ప్రభుత్వాలు మన దేశంలో 1947-వ సంవత్సరం ఆగస్టు తే 15 దినాడు అంతమైనాయి. సుదీర్ఘమైన మన దేశ చరిత్రలో ఈ నడమంతరపు రాజకీయ దాస్య కాలపు ప్రభావమును కొన్ని ఏండ్ల తర్వాతగాని మనము విషయాశ్రితంగా (Objectively) అంచనా వేయలేము. సామాన్యపౌరుడు తన దైనందిన జీవితమును తాకనంతవఱకు రాజకీయదాస్యమంటే ఏమిటో పట్టించుకోడు. రాజకీయాభిజ్ఞుడై స్వాతంత్ర్యాభిలాషియైన వానికి అది భరింపరానిదియగును. రాజకీయ పరిజ్ఞానమేర్పడడంతో జీవితంలోని ఆధ్యాత్మికములు నైతికములునగు విలువలమీద దృష్టి ఏర్పడి మానవుని వ్యక్తిత్వము వికసించి, అతడు పరిపూర్ణుడైన పౌరుడుగా సంఘంలోను, దేశంలోను తనపాత్రను నిర్వహించును. 19-వ శతాబ్దంలో పరదేశపాలనలోనుండినా, అంతకుముందెన్నడు లేని శాంతిభద్రత లున్నందున ప్రజలందఱు హిందువులుగాని, మహమ్మదీయులుగాని మఱి ఏయితరమతమువారుగాని తృప్తిగా నిశ్చింతగా నుండిరి. కాని ఆదశ కొలదికాలమే ఉండినది. రాజకీయదాస్యమువలన మనసంస్కృతికి హాని కలుగుటయే గాక స్వేచ్ఛాభంగకరంగా ఏర్పడునట్లు తోచిన తత్క్షణమే ఆ సవాలును ఎదుర్కొనవలసి వచ్చింది. పట్టుదల శక్తిగల ప్రజలు ఆసవాలును ఎదుర్కొన్నారు. అవి లేనివారైతే ఆసవాలును ఎదుర్కొనలేక లొంగిపోయి వ్యక్తిత్వాన్నికూడా కోల్పోతారు. మన దేశానికి ఈసవాలు సాంఘిక సంస్కృతీ క్షేత్రాలు రెంటిలోను ఎదురైంది, కాని మనదేశము ఈరెండు క్షేత్రాలలోను విజయం సాధించినట్లు ఇటీవలి చరిత్ర స్పష్టం చేస్తుంది. ఈ విజయసాధనంలో ప్రదర్శితమైన ముఖ్యగుణము మనలోనున్న ప్రబలమైన కలుపుగోలుతనము (dynamic synthesis).

మన సంస్కృతీగమనంలో వివేకానందునిలో ఈకళ బాగా కనబడుతుంది. ఆయన దీనికి ప్రతినిధిగా విలసిల్లినాడు. ఘనీభవించి కరడుకట్టిన మన సంఘాన్ని నాగరికతను ఆంగ్లేయుల సంపర్కంవలన భేదించి విస్తరిల్లజేయ వచ్చునని ఆయన అనుకొన్నాడు. ప్రాచీనుల వివేకము నవీనుల తెలివి ఆయనలో చాల పొందికగా సమ్మిళితమైనాయి. నూటికి నూఱుపాళ్లు హిందువేయైనను, ఆయన యితరమతాలను కూడ ప్రేమించి గౌరవించినాడు. విజ్ఞానశాస్త్ర రాజకీయార్థికరంగాలలో ఎంతో పురోగమనాన్ని సాధించిన అధునాతనభావాలు ఆలోచనలు ఆయనను పూర్తిగా ఆవరించినవి. ప్రస్తుత పరిస్థితులలో మానవులమధ్య సంబంధాలు అంతర్జాతీయపథంలో ఏర్పడవలెనన్న విషయం ఆయన చక్కగా గుర్తించినాడు. తనదేశాన్ని ఇతరదేశాల అంటు సోకకుండా ప్రత్యేకించి, తన జాతిరథాన్ని ఇతరదేశాల స్వాతంత్ర్యాలపై మొరటుగా నడిపించే ప్రతిచర్యాసక్తుడైన దేశభక్తుడు కాడు. భారతదేశాన్నేగాక సర్వ మానవాళిని సమానంగా ప్రేమించినాడు. అజ్ఞానులచే మానవుడని పేర్కొనబడే ఆ భగవంతునికి మన మందఱము పరిచారకులము. హిందువని, ముసల్మానని, ఆంగ్లేయుడని, అమెరికా వాడని భేదాలు కల్పించింది మనలో ఉండే అజ్ఞానశిఖామణులని ఆయన అభిప్రాయము. వివేకానందుని వ్యక్తిత్వం లోని యీ అంశాన్ని గొప్ప అంతర్జాతీయవాదియైన శ్రీజవహార్‌లాల్

నెహ్రూ తన 'డిస్కవరీ ఆఫ్ యిండియా' అనే పుస్తకంలో పేర్కొని పొగడియున్నాడు. ఏ వ్యక్తిగాని, జాతిగాని యితరులతో కలిసి ఉండక వేఱుగా ఉండలేదు. సొంత ఆధిక్యము కలదన్న దురభిప్రాయంతో అట్టివేర్పాటును అవలంబింప నెంచిన దాని ఫలితము వినాశకరంగానే ఉంటుంది. అట్లు ఇతరులతో చేరక వేఱుగానుండ ప్రయత్నించినందులకే మనము, మన దేశము హీన స్థితికి వచ్చినామనియు, బాహ్యప్రపంచ ప్రవాహంలో చేరిపోవుటయే దీనికి శిక్ష యనియు శ్రీ వివేకానందుడు గట్టిగా నమ్మియుండినాడు. స్వామివారికాలంలో మన దేశం ప్రపంచ వ్యవహారాల్లో చెప్పుకోదగ్గ స్థానం కలిగిఉండలేదు. ఎవరో కొందఱు పాశ్చాత్యపండితులు మన పూర్వ చరిత్రను సంస్కృతిని ఎఱింగినవారు సానుభూతి వెలి పుచ్చినారు కాని ఇతర ప్రపంచమంతయు మన స్థితిని దీనస్థితిగా అనుకొని జాలిపడింది. ఈపరిస్థితి మనకు స్వాతంత్ర్యం రాగానే మాఱిపోయింది. పరదేశపాలనవల్ల కల్గిన అవమానము గుప్తంగా లోలోన రగులుచుండిన అగ్నిజ్వాలలను రేకెత్తించి స్వజాతీయతను మేల్కొలిపినది. ఆ మేల్కొనడం కారణంగా ఏర్పడిన ఆత్మప్రకాశనము అగస్టు తే 15 ది నాటితో ఉచ్చస్థితి నందుకొన్నది. స్వాతంత్ర్యసాధనంతో అంతర్గతంగా ఉండినశక్తి బహిర్గతమై, నిర్మాణాత్మకమైన ఆత్మావిష్కరణం ప్రారంభమయినది. వ్యక్తిగా వివేకానందుడు మన దేశాన్ని ప్రపంచ సాంస్కృతిక బలాల ప్రవాహంలోకి నడిపించినాడు. భావంగా, వివేకానందుడు దేశాన్నంతా ఏకంచేసి ప్రపంచజాతుల సంఘంలోకి నడిపించినాడు. తన ప్రాచీనసంస్కృతివల్ల భారతదేశం ప్రపంచానికంతా నైతికనాయకత్వం వహించగల యోగ్యతశక్తి కలిగియుండినదని ఆయన గట్టిగా నమ్మియుండినాడు. కాని అట్టినాయకత్వం వహించుటకు ముందు తనలో రాజకీయ స్వాతంత్ర్యము, ఆర్థిక పురోగమనం సాంఘిక పటిష్ఠతవంటివి రావలె ననియు ఆయన అనుకొన్నాడు. ఇందు మొదటిది 15-8-1947 నాడు సిద్ధించినది. మిగత రెండును ఇక మీఁదట క్రమంగా వెనుకబడినందుననే మన దేశం యొక్క ఆధ్యాత్మిక నైతిక వ్యక్తిత్వానికి హాని కలిగిందని మొట్టమొదట గ్రహించి సూచించినది. శ్రీవివేకానందుడే. సాంఘికభేదాలు ఆచార్యాధిపత్యాలు దేశానికి పెద్దరోగాలుగా ఉండినవి. గురుదేవుని శుశ్రూషవల్ల దేశంలో శాశ్వతమైన భావైక్యము ఉంది అని గ్రహించిన వివేకానందుడు తన సొంతపర్యటనల మూలంగా దేశం యితరవిషయాల్లో ఎంత ఛిన్నాభిన్నంగా ఉండేది తెలుసుకొని బాధపడి, ఉండేపరిస్థితులను ఉండవలసినవిధంగా దిద్దుటకు తన యావచ్ఛక్తులను వినియోగించి కష్టించి జీవితాన్నే అకాలంలో అంతమొందించుకున్నాడు. నేటి మన దేశంయొక్క భావనలోను, రూపంలోను చెఱిగిపోని వివేకానందునిముద్ర కనిపిస్తూనే ఉంటుంది.

స్వాతంత్ర్యప్రాప్తిని కొనియాడుకొంటూ ఉత్సవాలను చేసుకొనే మనం వివేకానందుని, ఆయనదృష్టిలో దేశం భవిష్యత్తు ఎట్లు ఉండవలసినదిగా ఆయన ఆశించినది ముఖ్యంగా జ్ఞాపక ముంచుకోవలె. హిందు, మహమ్మదీయ, క్రైస్తవ అంశాలను ఆకళింపు చేసుకొన్న మనసంస్కృతి వివిధరంగులతో చిత్రించిన పటమువంటి దనియు హిందువులు, మహమ్మదీయులు, ఒకరినుండి ఒకరు అనేకవిషయాలను గ్రహించి, సంకుచితభావాలను వదలి విశాల హృదయాలతో మంచి హిందువులుగాను, మంచి మహమ్మదీయులుగాను మాఱవలె ననియు,

హిందువులు తమలోని కులభేదాలను విస్మరించి, మానవునిలోని నిండుతనమును, దైవత్వమును, ప్రకటించవలయునని ఆయన ఉపోద్ఘాటించెను. పరిపూర్ణుడైన మానవుని రూపొందించుటయే ఆయన మతము.

ప్రజాస్వామ్యముయొక్క బలం పౌరుని మీద ఆధారపడి ఉంటుంది. ప్రజాస్వామ్యము మన దేశములోని వివిధకుల మతముల వారిని కొన్ని ప్రాథమిక సూత్రాలతో బద్ధులుగా ఉండేటట్టు చేస్తుంది. రాజకీయార్థిక ప్రజాస్వామ్యము మతప్రేరితమైన జ్ఞానము ఉపదేశము లేక ఎక్కువగా రాణించవు; తప్పుత్రోవనుకూడ తొక్కవచ్చును. ఈ మతప్రేరిత జ్ఞాన మనేది మహోన్నతత్త్వసంకుచితసిద్ధాంతాల నుండియు ఆచారాలనుండియు గాక సర్వమతములకును మూలాధారములైన సత్యములనుండి ఏర్పడవలెను. ఈవిధంగా ప్రజాస్వామ్యమును నైతికంగాను ఆధ్యాత్మికంగాను ఉన్నతస్థాయికి కొనిపొయ్యే మహత్తరకార్యమును స్వతంత్ర భారతము చేపట్టవలె.

స్వాతంత్ర్యంతో కూడా మన దేశానికి విభజనము తారసిల్లింది. సంతోషానందాశ్రువులతోకూడ రక్తపుకన్నీళ్లు విడువవలసివచ్చింది. కాని యీవిభజన రాజకీయమైనది గాను. పరిపాలనావిధానానికి మాత్రమే ఏల కాకూడదు? దురదృష్టమైన యీ విభజనవల్ల ఎంతో ధన ప్రాణనష్టాలు కలిగినవి. హిందూమతస్పర్శవల్ల మహమ్మదీయ మత మెట్లు అపవిత్రం అవుతుంది? కాని కొందఱు మహమ్మదీయపండితులు, బుద్ధిశాలురుగ పరిగణింపబడేవారు, దేశవిభజన జరుగనిదే తగు రాజకీయార్థిక వ్యక్తిత్వాలు పెంపొంద వని పట్టుబట్టినారు. విభజన జరుగగనే ఆశ తీరి విభేదాలు అణగిపోతుంది. ప్రజలందఱు ఒకటే అనియు, అవసరం కొద్ది రెండు ప్రభుత్వాలుగా చీలినా రనియు, ఈ రెండుభాగాల వెనుక అవిభక్త భారతదేశం, తొంగిచూస్తూనే ఉంటుం దన్న భావాలు ఏర్పడుతవి. రాజకీయపుటొత్తిడివల్ల ఏర్పడిన విభజన మఱుగుపడి సాంఘికవిషయాలబత్తిడివల్ల ఐక్యము మరల ఏర్పడవచ్చు. మన ఉమ్మడి సంస్కృతి, సాంఘికార్థిక శక్తులచే బలపరచబడి ఈ ఐక్యసాధనకార్యక్రమానికి ఉద్ధృతి కలిగిస్తుంది. ఈ కార్యక్రమానికి కావలసిన ఉత్సాహోత్తేజాలను, మన దేశం వివేకానందునినుండియు ఆయన సందేశాలనుండియు గ్రహిస్తుంది. ప్రజాస్వామ్యం వల్ల సాంఘికబలాలకు స్థైర్యం ఏర్పడి సంఘంలోని కుల మత విభేదాలు అంతరిస్తాయి. సాంస్కృతికార్థికపురోగమనంవల్ల మహమ్మదీయపౌరుడు మతోన్మాదమును వదలి తన మతంలో ఉండే సర్వమతసామాన్యమైన సత్యాలను తెలుసుకొని పరమతసహనాన్ని అలవఱచుకొంటాడు. పరదేశప్రభువుల దండయాత్రలద్వారా మహమ్మదీయమతము మన దేశాన్ని బలవంతంగా ప్రవేశించినది అట్లా కాకుండా శాంతంగా స్నేహంతో ప్రవేశించి ఉంటే మన దేశచరిత్రయు, భారతదేశంలోని మహమ్మదీయమత చరిత్రయు వేఱువిధంగా ఉండిఉండేది.

సాంఘికశక్తులు కాలక్రమమున వ్యక్తుల ఉద్రేకాన్ని ఉన్మత్తతను అణచివేస్తాయి. మత సామరస్యాన్ని కబీరు, నానక్, సూరదాస్ వంటిమహనీయులు కొందఱు సాధింప ప్రయత్నించిరి. చరిత్రదృష్టిలో వారు సాధించినది అస్థిరంగాను, అతిస్వల్పంగాను కనిపించినా వారివల్ల మన మెంతో నేర్చుకొనవచ్చు. వ్రేళ్ళపై ఎంచదగిన ఏ కొందఱో ఆ మొరటు

కాలమున అంత సాధిస్తే, ఇప్పటి నాగరిక కాలపరిస్థితులలో ప్రజాస్వామ్యంవల్ల కలిగిన శక్తియుక్తులతో, కోట్లకొలది ఉండే ప్రజలందఱు కలిసి ప్రయత్నిస్తే ఎంత సాధించకూడదు!

దేశాన్ని, సంఘాన్ని నిర్మాణాత్మకమైన యీ మార్గంలో నడిపించుటకు తగిననాయకులు అవసరము. ద్వేషక్రోధాలను దేశం ఎక్కువ కాలం సహించి యుండజాలదు. స్వతంత్రభారతము, రెండు సార్వభౌమదేశాలుగా విడివడియుండునది, అస్త్రసన్న్యాసంచేసి తనప్రేమ ప్రవాహాన్ని నలువైపులకు పాఱించవలె. ఈ ఉజ్జ్వలభవిష్యత్తును భారతదేశం సాధించగలదన్న గట్టినమ్మకముతో శ్రీ వివేకానందుడు ఆ కార్యక్రమానికి కావలసిన ప్రాతిపదిక నేర్పఱచుటకు తన కాయశక్తుల నిర్విరామముగ కృషిచేశాడు. ఆయన సందేశాలను విన్న, కన్న, మనదేశము ఆయన అభిలషించినట్లు ప్రపంచదేశాలను నైతికాధ్యాత్మిక మార్గాలలో నడిపించును గాక.

# శ్రీరామకృష్ణ మఠ సేవాసంఘ సంస్థాపనము

ఆశుకవి కిశోర: శ్రీ చిలువూరి మాధవకృష్ణ కవి, అష్టావధాని

శ్రీవిసిల్లు నే ప్రభుని చిన్మయజన్మము వేదమూల, మే
దేవుని దివ్యజీవనము ధీయుతభాష్యము శాస్త్రపంక్తి, కే
దేవుని త్యాగమీ పతిత దీనజనోద్ధరణైక భాగ్య, మా
దేవుని రామకృష్ణగురుదేవునిఁ గొల్చెద మోక్షసిద్ధికిన్.

ప్రపంచమునందు వివిధదేశములందు వివిధ వేషభాషలు, వివిధాచారములు నున్నట్లే వివిధ మతములును విరాజిల్లుచున్నవి. ఈ మతములన్నియు సృష్టిస్థితిలయముల కధినాథుండగు ఒక్క పరమాత్మనే లక్షించుచున్నవి. భాషలు అనేకములు, వేషములు-వస్త్రధారణాదికములగు పద్ధతులు-అనేకములు, ఆచారము లనేకములు. అయినను ఇవియన్నియును శారీరకముగనేమి, మానసికముగనేమి, ఐహికముగనేమి, ఆముష్మికముగనేమి ఆనందప్రాప్తికై నిర్ణయింపబడిన, అనుసరించుచువచ్చిన, అనుసరించుచున్న విధులే కాని ఆయా భాషలయందలి భావములు వేషధారణమునందలి యుద్దేశములు ఆచారమునందలి పట్టుదలలు అన్నియు నిజముగా నొక్క మానసిక తత్త్వమునకే లోనయినవి. అట్లే మతములు వివిధములై, విభిన్నములై, కన్పట్టినను అవియన్నియు నేకైక పరమాత్మాన్వేషణమునకై - పరమపద గమ్య ప్రాప్తికై - మహాపురుషులు - సిద్ధపురుషులు- చూపిన మార్గములు. వేషభాషలు, ప్రాంతీయాచారములు మున్నగున వన్నియు ప్రపంచము (వారు వారు నివసించు భూభాగము యొక్క) నైసర్గిక స్థితిని, పరిసర వాతావరణమును, అనుసరించినవి. కాని మతము మానసమునకు సంబంధించినది; మీఁదు మిక్కిలి ఆధ్యాత్మికము. కావుననే ప్రపంచమునందు వివిధభాగములందుగల వేషభాషలు ఆచారములు మున్నగునవి భిన్నములై కన్పట్టు

చున్నను మతాన్వేషణమునందు అనగా పర తత్త్వాన్వేషణమునందు ఈ వివిధ దేశీయులు, వివిధములగు వేషభాషలకు నాగరికతలకు నల వాటుపడిన మహాపురుషులందఱును ఒకే సత్య మును – గమ్యమును – ప్రాపించిరి.

భగవదన్వేషణమునకెన్నియో మార్గములు గలవు. మహాపురుషు లెల్లరు ఆ మార్గములలో తమ తమ మనోజ్ఞములకు నచ్చిన మార్గముల నవలంబించియున్నారు. కాని ఈ మార్గము లందు స్వల్పముగ సాధారణ జనాంగమునకు గోచరింపగల భేదములు ఉన్నతస్థితి నందిన మహాపురుషుల జ్ఞాననేత్రములకు కనిపింపవు. వారిది విశాలదృష్టి, సంకుచిత దృష్టికి వారు లోనుగారు. వారి కింద్రియములు లిలలొగ్గును. వారు ప్రకృతినిగూడ శాసింపగల మహాను భావులు. అట్టి మహామహులు సాధించిన మార్గములందు–చూపిన విధులయందు–ప్రపంచ మునకు బోధించిన మతమునందు స్వార్థపరత గాని సంకుచితత్వముగాని ఆవంతయు లేదు.

ఇట్టి భగవదన్వేషణమున సర్వతో ముఖ ముగ ముందంజ వైచినది మన సనాతన మతము. (వైదికమతము) ఈ సనాతనమతము భగవదన్వేషణమున సమస్త ప్రాణులకును స్వేచ్ఛ నొసగినది. భగవంతుని 'ఫలానా జీవి' ప్రాపింపజాలదు అని యెంతమును ఈ వేద మతము శాసించియుండలేదు. కాని సమస్త ప్రాణులకును భగవదన్వేషణమున తత్తదుచిత స్థానము నొసగినది. ఇట్టి సనాతనమతము విశాలదృష్టి గమనార్హముగదా! మాతృ పితృ వాత్సల్య మధుర దాస్య శాంతాదిభావములు, సాకార నిరాకార ఉపాసనామార్గములు–కర్మ భక్తి జ్ఞాన రాజయోగాది రీతులు – ఇట్టివి ఇంకెన్నియో మార్గములు సూచింపబడినవి. ఈ మార్గములందు ఏ మార్గము ననుసరించినను భగవల్లాభము చేకూరగలదు. అట్లింకటో మహానుభావులు భగవల్లాభము నంది యున్నారు. ఇవియన్నియు శ్రుతిబోధకములగు మార్గములు. భగవాను డీ మార్గములవలననే కాక శ్రుతులకు ఆచారములకు వ్యవహారము లకు వెలియైన మార్గముల వలనను బడయ దగినవాడు. శరీరమును మనస్సునుగూడ వీడి జీవుని బ్రహ్మముతో నేకీభవింప జేయగల–జీవ బ్రహ్మైక్యమును సిద్ధింపజేయగల–మార్గ మెద్ది యైనను భగవానుడు త్రోసిరాజనడు. ఈ 'శ్రుతి వ్యవహారేతర మతమునే' మన పెద్దలు అనగా నాగరకులు 'మూఢ భక్తి' యని ప్రవ చించినారు. ఆ మూఢభక్తియే ఆధారముగా భగవల్లాభము నందిన ఆటవికులు – భక్తాగ్ర గణ్యులు–ఎందఱో కలరు. అదంతయు భగవా నుని కృపామహిమ. భగవాను డొక్కొక్క యుగమున ఒక్కొక్క ధర్మమును పరిపాలించి యున్నాడు. వేదములందేమి, గీతయందేమి ఈ విషయము లన్నింటిని ఆ భగవానుడు స్వయ ముగా ప్రవచించియున్నాడు. తన భక్తులచేత– జ్ఞానులచేత, యోగులచేత – వీని నన్నింటిని ఆయా కాలానుసారముగ ప్రచారము చేయించి యున్నాడు. ఆయనకు 'నీ నా' అన్న భేద భావమింతయు లేదు. సమస్తమును ఆయనయం దుండియే జనించుచున్నది, సమస్తమును ఆయన వలననే రక్షింపబడుచున్నది; చివరకు సమస్తమును ఆయనయందే లీనమగుచున్నది. ఇక ఆయనకు భేదభావము గలుగుటెట్లు?

భగవానునియేకత్వ ప్రతిపాదనమున శ్రుతులు, స్మృతులు, పురాణములు మున్నగున వన్నియు నొకేమార్గము నవలంబించియున్నవి. 'ఏకం సత్ విప్రాః బహుధా వదంతి; ఏకో దేవో కేశవో వా శివో వా, ఏకః పరాత్మా బహు దేహవర్తీ, సర్వం ఖల్విదం బ్రహ్మ' —ఇట్టి

వెన్నియో మన మతగ్రంథములందు గనిపించు చున్నవి.

కాని ఈ శ్రుతులు, స్మృతులు, ఉపనిషత్తులు, పురాణములు, ధర్మశాస్త్రములు-అన్నియును భక్తుల మానసిక తత్త్వము ననుసరించి వారి వారికి ఉపయుక్తములగు మార్గముల నిర్ణయించినవి. అంతమాత్రమున వారియందు ఆ శాస్త్రములు భిన్నదృష్టి నవలంబించె ననజెల్లునా? వ్యావహారికముగ విత్తనము, మొక్క-చెట్టు-అని వ్యవహరింప బడినను ఒక్క విత్తనము నుండియే ప్రభవించిన ఆ వస్తువులు పరస్పర భిన్నములగుటయెట్లు? సముద్రము, తరంగములు, బుద్బుదములు, శీకరములు జలము-వీనికి రూపమునందే కాక సత్తయందు భేదముగలదా? క్రమక్రమముగ పరిపక్వత నందుటయే యిందలి తారతమ్యము. అట్లే సాధకులు, వారి రీతులు, వేఱువేఱుగ గన్పించినను వారి యాప్సితము మాత్ర మొక్కటియే. వారి మానసిక పరిణామము ననుసరించి పరతత్త్వ మార్గాన్వేషణమున వా రనుసరించిన మార్గములు భిన్నములవలె కన్పట్టును. అంత మాత్రమున ఆ పరతత్త్వము భిన్న భిన్న ప్రకృతులకు లోనై యుండుననుట పొరపాటు. ఈ విషయమున మన యీ స్తోత్రపాఠముల గమనింపవలయును.

"శ్లో. రుచీనాం వైచిత్ర్యా దృజు
కుటిల నానా పథజుషామ్
నృణా మేకో గమ్య స్త్వమసి
పయసా మర్ణవ ఇవ."*

"శ్లో. ఆకాశాత్పతితం తోయం
యథాగచ్ఛతి సాగరమ్
సర్వదేవ నమస్కారః
కేశవం ప్రతిగచ్ఛతి."†

ఇక భగవానుడే గీతయందు స్వయముగ సెలవిచ్చిన

"శ్లో. యే యథా మాం ప్రపద్యన్తే
తాం స్తథైవ భజామ్యహమ్,
మమవర్త్మానువర్తన్తే
మనుష్యాః పార్థ సర్వశః"‡

అన్న విషయమును గమనార్హము. ఇట్టి భగవద్వాక్యమును గాదని కొందఱు 'కింభక్తులు' తమకంటె భక్తులు లేరనియు తమ యిష్టదైవము పేరునదప్ప భిన్ననామమున భిన్న విధమున పరమాత్మను సేవించుట వ్యర్థమే యనియు తలంతురు. మీదు మిక్కిలి అది మహాపాపమనియు వారు ప్రచారము గావింప మొదలిడుదురు. ఇందుమూలమున మతశాఖ లనంతములగు చుండును. ఇట్లు భక్తులు భక్తికి ప్రాధాన్యము నొసగక తమ గురునామమునకును ఆచారములకును ప్రాధాన్యము నొసగుటయే ప్రపంచమున పరతత్త్వాన్వేషణ మార్గములు శాఖోపశాఖలతో పెరిగిపోవుటకు మూలకారణము. కాని భగవానుడు మాత్రము ఒక్క-

* వివిధ ప్రదేశములందు బుట్టిన నదులు సముద్రమునే చేరునట్లు వివిధారాధనమార్గములన్నియు (పరమేశ్వరా) నిన్నే ప్రాపింపజేయుచున్నవి.

† ఆకాశమునుండి పడిన జలము సాగరగర్భమును జేరునట్లే (సర్వనామరూపముల లక్షించి) గావింపబడిన సర్వదేవతానమస్కారములన్నియు ఆ పరాత్పరునే చేరుచున్నవి.

‡ అర్జునా, ఎవరెవరు ఏయే రూపముల నన్ను గ్రహింతురో వారిని నట్లే యనుగ్రహింతును. వారును సమస్త మార్గముల చేతను తుదకు నన్నే ప్రాపించుచున్నారు.

శాస్త్రమునకు గాని ఆచారమునకు గాని వ్యవహారమునకుగాని కట్టువడి యుండువాడుగాడు. ఆయన యీ యన్నింటికి నతీతుడు. ఇవి యన్నియు నాయన కధీనములు. ఆయన ఎవరి నయినను, ఎట్టి ఆచరణ శీలుర నయినను, తన వారినిగా జేసికొనగలడు. ఆయనకు గావలసినది ఒక్క-శ్రద్ధయే-భక్తియే.

భగవానుని భక్తరక్షణ విధానము పలు తెఱంగులై భాసిల్లుచుండునని యీ విషయమున మనకు విశదమగుచున్నదిగదా! భక్తు డెవడన్నదిగాదు ఆయనకు వలయునది. వాడు బ్రాహ్మణుడే కానిండు, మాలడే కానిండు, శాకాహారియే కానిండు, మాంసాహారియే కానిండు, వానికి సాక్షాత్కారమునకు వలయు మానసిక పరిణామము కలదా యనుటయే భగవానుడు గోరునది. మనస్సు పరిపక్వస్థితి జెందుటయే భగవాను డభిలషించును. కాని ఆ పరిణామమునకు నాధారభూతమయిన ఆచారముతో గాని విధానముతో గాని ఆయనకు పనిలేదు.

మన పూర్వీకులు అనగా ప్రపంచమునందు పూర్వతరములవారు పరతత్త్వాన్వేషణమున ముముక్షుజన సందోహంబులకు, తమ తమ యనుభవములను బురస్కరించుకొని, కొన్ని మార్గముల జూపియున్నారు. వానినే నేడు మనము ఆచారములని వ్యవహరించుచున్నాము. అయినను ఏ మహాపురుషుడును పరతత్త్వాన్వేషణ మార్గమున దన్నే యనుసరింపవలయుననియు మార్గాంతర మననుసరణీయమనియు వచించి యుండలేదు. వృత్తము పరిధినుండి ఏ కోణము ద్వారా చూచినను మానవుడు కేంద్రమును వీక్షింపగలడు. ఏ మార్గమున నడిచినను కేంద్రమును జేరగలడు. కాని అతడు కేంద్రగమనమును లక్షించుటయే వలయునది. కేంద్రమును జేరవలయునని యెంతగా పట్టుపట్టునో అతడు కేంద్రమును జేరుట యంత సత్యము.

అయినను పట్టుపల వేకొలదిగనో యున్న మాత్రమున జాలదు. 'ఈ శరీర మేమయిన నగుగాక; నిర్వాణముప్రాపించువఱకు నాప్రయత్నమును వీడను.' అన్న బుద్ధభగవానుని నిశ్చయమును బోలి యుండవలయును మన సంకల్పము. భగవానుడల్పసంతోషి కాడు. పుట్టు రత్నములు భూషణములకు బనికిరానియట్లే అప్పుడప్పుడే భగవత్సాక్షాత్కారాకాంక్ష జనించుచున్న సాధకుడు సులభముగా పరాత్పరుని గనజాలడు. అంతకుముందాతడెన్నియో సాధనలను జేయవలయును. ఎన్నియో లౌకిక ఝంఝామారుతముల కాగవలయును. సానలదీరిన జాతిరత్నముగా మారినపుడే సాధకుడు భగవల్లాభమునకధికారి కాగలడు. ఈ సాధనకాలమున నెన్నెన్నియో సందియములు పొడసూపగలవు. కాని యాతడు వాని నన్నింటిని జయింపవలయును ఒక్కొక్కప్పుడు భగవదస్తిత్వమున సయితము సందియము లుప్పతిల్లగలవు చివరకు సాధకుని తులామానము నాస్తికత్వము వైపునకుగూడ మొగ్గు చూపవచ్చును. అయినను దృఢనిశ్చయముతో సాధకుడు తనసాధనలను విడువక పట్టుదలతో నాచరించుచుండవలయును. నిజముగా భగవానుడు భక్తుని నాస్తికుని గావింపడు. ఆతని శరీరమును, మనస్సును సానబట్టి భగవల్లాభమున కర్హునిగావించుటకే ప్రయత్నించును. లోకమునందు మహాభక్తశ్రేణికి జెందిన మహానుభావులందఱును ఇట్టి సానకు లోనయినవారే. అందఱును ఇట్టి సందియములకు గుఱియైనవారే. సనాతనమతమును-వేదాంతమతమును - సర్వమతసమన్వయరూపకమగుపరతత్త్వమతమును

లోకమునకు వెదజల్లిన మహామహుడు శ్రీవివేకానందస్వామిసయితము 'భగవానుడుగలడా? మీరు కండ్లార జూచితిరా?' యని మొదటనో ప్రశ్నించెనన్నచో సామాన్యుల కిట్టి సందియములు పొడముటబ్బురమా! పురాణములందును నిట్లు తీవ్రసాధనానంతరము సందియములు పొందినవారు ఎందఱో పేర్కొనబడి యున్నారు. కాని నిజముగా అన్వేషించినచో భగవానుడు సాక్షాత్కరించును.

శ్రీకరుండగు లోకరక్షకుడు సృష్టిరంగమున జగన్నాటక సూత్రధారియై జీవుల దత్తత్ప్రాణానుసారము ఆడించి పాడించును. అది యతని నిత్యలీల. ఆ రంగస్థలమున వేషపాత్రధారియేని తగు కళాకౌశలమును గోల్పోయి నాటకమును రసభంగమునకు గుఱిచేయనున్న యెడ, సూత్రధారి వానిదృష్టి నాకర్షించి, నేపథ్యమున, దన శిక్షణవిధానమును సంజ్ఞాదుల వాని హృదయ ఫలకమున హత్తుకొనజేయును. అంతట నాటకము నవరససంశోభితమును ప్రేక్షకజన సమాదరణీయమును నయి విరాజిల్లును. నటుడు సంజ్ఞాదివివరణమున కళాగ్రహణసమర్థుడుగాని యెడ సూత్రధారి కల్పితపాత్రధారియై రంగస్థలమునదోచి నాటకమును యథార్థదృశ్యమును శ్రావ్యమును గావించిమించును ఇదియే సృష్టి నాటకమున పరాత్పరు డవలంబించు విధానము.

నాటకరచనమునందేమి, ప్రదర్శనమునందేమి, నాయకునకో రసమునకో న్యూనత నాపాదించు నంశమును దొలగించి తత్ స్థానమున అన్యథాప్రకల్పనము విధియని కళాకారుల ప్రవచనము.* అట్లే జగన్నాటక సూత్రధారియగు ఆ పరాత్పరుడు తన జగన్నాటక ప్రదర్శనమున ఏవిషయమున నేని హైన్యము పొడచూపెనేని తన సృష్టికళావైచిత్రిని బురస్కరించుకొని ఆయాలక్షణముల మూలభావముల నట్లే నిలిపి శాఖా సంప్రదాయముల ప్రతిసృష్టి యొనర్చి లోకసంగ్రహము గావించుచుండును.

భగవానుడు ప్రపంచమునందే భాగమున ఏ దేశమున ఏ కాలమున మానవమూర్తియై-లీలానరవిగ్రహధారియై - యవతరించినను ఆ కరుణామయుని యాగమనము - అవతారము- లోకసంగ్రహము నిమిత్తమే. తాను కని పెంచిన బిడ్డలయందు వ్యావహారిక నామరూప మాత్రమగు భేదమేకాని యితర శత్రుత్వ మిత్రత్వాది విభాజ్యభావము మాతృహృదయము నంటజాలదుగదా! అట్టి మాతృమూర్తికి మూలమూర్తియైన పరమేశ్వరుని హృదయమున ఏమాత్రము భేదభావమేని ఎట్లు కలుగనోపును? తాను సృజించిన లోకమునందు ఆ బ్రహ్మస్తంబ పర్యంతము సమస్తజీవులయందును ఆయన ప్రేమ-దయ-నిర్హేతుకము, నిష్పాక్షికము, నిరవధికము నగుట నిస్సంశయముగదా! ఆ సృష్టియందలిజీవులు మాయామయులై నిజపథమును గానక అంధపరంపరన్యాయమున నొకరివెనుక నొకరు పెడత్రోవలు పట్టినపుడు, ధర్మచక్రము గతిదప్పినప్పుడు, భగవానుడు స్వయముగ తన యీశ్వరకోటిని, అంతరంగికులను, ముందుగా తన కార్యనిర్వహణార్థము లోకమునకు బంపును. వారును ఆయన ధర్మవృక్షమునకు పాదులు వెట్టుదురు. ఆయన మార్గము సరళముగావింతురు. సమస్తము తన

* శ్లో. యస్యాదనుచితంవస్తు నాయకస్యరసస్యవా
విరుద్ధం తత్పరిత్యాజ్యం అన్యథావాప్రకల్పయేత్.
—సాహిత్యదర్పణమ్.

నిర్ణయానుసారము పరిపూర్ణమయిన యనంతరము ఆపరాత్పరుడు తన సృష్టియందు నిహితముగ దన్ను దానే సృజించుకొని సామాన్య జీవియై ప్రపంచమునదోచును. అది మొదలు కొన్ని యెడల తన యవతారమును - అస్తిత్వమును - ప్రస్ఫురింపజేయు మహిమలు చూచాయగ ప్రదర్శించును. కొన్నియెడల ఆయా ప్రాంతపు జీవులు పారమార్థిక భావమున - పరమార్థాన్వేషణమున - నత్యంతము నంధప్రాయులై యున్నచో మహిమాతిశయముల నధికముగ ప్రదర్శించును. ఆమాహాత్మ్యసందర్శనముచే నాకృష్టులై తత్ప్రాంతీయులు పునః పరమార్థాభిముఖులగుదురు. ఇక భగవత్కార్యము - లోకసంగ్రహము - పునః ప్రారంభమగును. ప్రతియుగమునందును - ప్రతి కల్పమునందును - నిదియే ఆయన నిత్యలీల.

పారమార్థిక గ్రంథములన్నింటియందును, సకల దేశములందు గల వైదిక తాత్త్విక గ్రంథములన్నింటియందును, భగవద్వాక్యము, భగవత్సందేశము, ఏకరీతిని ఘంటాపథముగ ఘోషించుచున్నది. "ధర్మమునకుగాని ధర్మమార్గగాములగు సాధువులకుగాని, ఏమాత్రము గ్లాని సంభవించినను, నామాయచే నన్ను నేనే సృజించుకొని లోకసంగ్రహము - ధర్మసంస్థాపనము - కావింతును.* ఇదియే ఆ భగవద్వాక్యము, అభయప్రదానము. "ఎవరు సంపూర్ణముగ నితర చింతలను మఱచి, సమస్తవేళలయందును, సమస్తకార్యములందును, నన్నే చింతించుచుందురో - ఉపాసించుచుందురో - వారి యోగక్షేమములను సర్వదా నేను వహింతును. వారిని రక్షింతును"† అని భగవానుడు యుగయుగములందును తన అవ్యాజకారుణ్యామృతమును వెదజల్లియున్నాడు.

భారతదేశమున పందొమ్మిదవ శతాబ్దము ప్రారంభమున భగవానుడు మఱియొకమా రవతరింపవలసివచ్చెను. నాడు భగవదన్వేషణమున వివిధాభిప్రాయములు చెలరేగెను. అసమగ్రమగు నాటి విదేశీయ విద్యావిధాన మీయభిప్రాయముల నినుమడింపజేసెను. నాటి యాంగ్లవిద్యాధికులలో ననేకులు వేదాదిమతగ్రంథములన్నియు మానవశీలసంరక్షణార్థమే - సంస్కారణార్థమే - కల్పింపబడినవనియు. వానివలన నితర ప్రయోజనము మఱియొకటి లేదనియు, భగవదన్వేషణమున నివి నిష్ఫలములేయనియు, నిజముగా భగవంతుడను వాడొకడు లేడనియు, కలడేని మన కేల కన్పింపడనియు దృఢముగా విశ్వసింప జొచ్చిరి. దీనికి నాస్తికత్వము తోడయ్యెను. పైపెచ్చు స్వీయమతవ్యాప్తికై యవిరామముగ ప్రయత్నించుచున్న విదేశీయపాలకవర్గము - పాలకవర్గము గానిచో తదాశ్రితబృందము - గావించుచున్న భారతీయ మతగ్రంథములందలి దోషారోపణము నయితము మతకల్లోలములకు అంతఃకలహములకు భారతీయుల వివిధోపాసనావిధాననిరసనమునకు దారితీయజొచ్చెను.

నిజముగా భగవదన్వేషణమున యావచ్ఛక్తిని వినియోగించిన భక్తబృందము సహితము భగవత్సాక్షాత్కారము నందజాలకపోవుటచే

* శ్లో. యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్. —(శ్రీమద్భగవద్గీత, 4-7)

† శ్లో. అనన్యాశ్చింతయన్తో మాం యేజనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.' (శ్రీమద్భగవద్గీత, 9-22)

భగవదస్తిత్వమునందే విశ్వాసమును గోల్పోవ జొచ్చెను. వివిధోపాసనావిధానములును, బహుదేవతారాధనమును ముఖ్యముగా విగ్రహారాధనయు దోషములన్న భావము నాటి విద్వాంసులయందును ప్రబలెను. కావుననే కేశవచంద్రసేను మున్నగు భగవదన్వేషకులు బ్రాహ్మసమాజమును స్థాపనము గావింపవలసివచ్చెను. ఇట్టి సమయమున భగవంతుడు తన యస్తిత్వమును, నిష్పాక్షిక కృపాకటాక్షమును నిరూపింపవలసివచ్చెను. ప్రపంచమున వివిధమతాచార్యులు బోధించిన యుపాసనామార్గములను సాధనవిధానములను వీడి, వారి యనుచరవర్గము వారి నామములకు ప్రాధాన్యము నొసగుటయే మతభేదములకు – కల్లోలములకు – కారణమని గుర్తించిన భగవానుడీపరి మతసామరస్యమును గుదుర్పవలసివచ్చెను. అందులకే శ్రీరామకృష్ణావతారము

పదునెనిమిదవ శతాబ్దము మధ్యమున వంగరాష్ట్రమండలి హుగ్లీ జిల్లాకు జెందిన దెరేపూరు గ్రామమున మాణిక్యరామ్‌ఛటర్జీ యను మహనీయుడు నివసించుచుండెను. ఆయనకు క్షుదిరాముడు, నిధిరాముడు, రామకనాయి యను పుత్రులును, రామశీల యను పుత్రికయు గలిగిరి. మాణిక్యరాముని యనంతరము క్షుదిరాముడు కుటుంబ భారమును వహింపవలసివచ్చెను. ఇతడు దయార్ద్రహృదయుడు, నిత్యసత్యవ్రతుడు, నిశ్చలదైవభక్తిరతుడు. ప్రథమకళత్రము మరణించుటవలన నితడు చంద్రమణీదేవి యను మహాసాధ్విని వివాహమయ్యెను. వారిసంసారము నిరంతర భగవత్సంసేవనముతో సాగిపోవుచుండెను.

1836 వ సంవత్సరము ఫిబ్రవరి 18 వ తేది ప్రభాతసమయమున చంద్రాదేవి లోకోద్ధారకుడయిన దివ్యశిశువును ప్రసవించెను. ఆ ప్రసవకాలమున తోడై యుండిన ధని యను కమ్మరయిల్లాలు తల్లికి గావలసిన సాయముచేసి, శిశువునకై చూడ ఆ దివ్యశిశువు మున్ను తానుంచిన చోట లేక ప్రక్కనున్న ప్రొయ్యిలో నుండుటయు, సుమారు ఆఱుమాసముల ప్రాయపు శిశువు పరిమాణము గలిగియుండుటయు గాంచి యాశ్చర్యమందెను. ఇది తెలిసి జ్యోతిషశాస్త్రజ్ఞుడగు క్షుదిరాముడు భగవానుడే యీ శిశురూపమున దనయింట నవతరించెనని నిశ్చయించెను. గయాక్షేత్రమున భగవానుడు పలికిన పలుకుల దలచి యా శిశువునకు గదాధరుడని నామకరణము చేసెను. *

ఈ దివ్యశిశువు జనించినప్పటినుండియు వివిధములయిన యద్భుత సంఘటనలు జరుగ నారంభించెను. శిశువు కొన్నివేళల నెత్తుకొనజాలనంత బరువుగ నుండును! ఏడెనిమిదిమాసముల ప్రాయమున పాలిచ్చి శిశువు నిద్రించుచుండగా తల్లి ఏటినీటికై పోయి మరలివచ్చి చూచుసరికి బయిపుప్పై బిడ్డకు బదులు ఆజానుబాహుడగు పెద్ద మనుష్యుడు కనిపించెను. వెంటనే క్షుదిరాముడు వచ్చి చూచుసరికి బిడ్డ యెప్పటివలె కనిపించెను. ఇట్టి యసాధారణ సంఘటనలు దివ్యశిశువుల విషయములలో క్రొత్తలు కావని చెప్పి క్షుదిరాముడు భార్య భయమును బాపువాడు.

శ్రీరామకృష్ణుడు ఆధ్యాత్మిక సాధనలు గావించుచు వివిధ దివ్యభావములకు లోనై యొకపుడు విలపించుచు, మఱియొకప్పుడు హసించుచు, లోకసామాన్య కృత్యములందు

* జగత్ప్రసిద్ధమగు శ్రీరామకృష్ణ నామమునే మనము వాడుదము.

దూరీకృతచిత్తుడై ప్రబలుచుండెను. ఆయన దివ్యభావము లున్మత్తప్రలాపములై లోకులకు కన్పట్టసాగెను. ఆయన నిజముగా పిచ్చివాడనియే - ఆయనకు మతిపోయినదనియే - యెల్లరును శంకింపసాగిరి. ఈ విషయమును విని చంద్రాదేవి తన కుమారుని ఇంటికి రప్పించి, వివాహప్రయత్నము గావింపసాగెను. కాని యెచ్చటను తగిన సంబంధము కుదిరినదికాదు. తల్లియు నన్నయు చింతింపజొచ్చిరి. ఆ సమయమున "జయరామవాటియందు చంద్రముఖోపాధ్యాయునింట నాకై నిర్ణయింపబడిన వధువు కలదు" అని యాయన స్వయముగా దెలిపెను. ఆయన మాటమేరకు చంద్రాదేవి యనుమతి ననుసరించి శ్రీ శారదామాతృదేవికిని, శ్రీగురుదేవునికిని వివాహము జరిగెను. అయినను ఆయన ఎప్పటివలెనే ఆధ్యాత్మికసాధనల గావించుచు లోకకల్యాణమునకై తన యావచ్ఛక్తిని వినియోగించెను.

శాస్త్రవాక్యములం దెంతటిపట్టువల చూపినను శ్రీరామకృష్ణభగవానుడు వానియందు గల వైపరీత్యములను జటిలవిషయములను నెంతయో సులభముగ నొక్కమాటతో, నొక్కచూపుతో పరిష్కారము గావించెడివాడు. యుగధర్మమును తన నిత్యానుష్ఠానమున బ్రదర్శించి చూపెడివాడు. లోకకల్యాణము నిమిత్తమవతరించిన యీ మహానుభావుడు శాస్త్రవాక్యముల 'తు, చ' తప్పక యాచరించువాడయ్యు శరణాగతసంరక్షణబిరుదాంచితుడై తన్ను హృదయపూర్వకముగ బ్రార్థించిన కమ్మర ధని కడ తన ప్రథమభిక్షను గొని - శూద్ర యన్న జాతిభేదము నవ్వల ద్రోసిపుచ్చి, హృదయావేదనకు ప్రాధాన్యమొసగి - ఆమెను ధన్యురాలిం జేసెను. శబరీదత్తఫలాశనుడగు శ్రీరామచంద్రమూర్తి క్షత్రియపుంగవుడయ్యు ఆ సాధ్వి హృదయనివేదనము ననుగ్రహించి కైకొని కటాక్షించెనుగదా!

ఈ విషయమును శ్రీ గురుదేవుడు మధురునకు ప్రదర్శనపూర్వకముగా బోధించెను. "భగవానుడయినను తనసృష్టినియమముల కధీనుడు. ఆయన తనసృష్టి యేదైనను, ఆ ప్రకృతియందలి సహజత్వము నావంతయు మార్పజాలడు" అని ఒకానొకపుడు మధురుడు శ్రీ గురుదేవునితో బలికెను. ఈ ధర్మసూక్ష్మమును గ్రహింపజాలని మధురుని బుద్ధికి జాలిజెంది శ్రీరామకృష్ణుడు "ఓయీ, నియమకర్తయగు సర్వేశ్వరుడు వలయునెడ దననియమమును రద్దుగావించి దానిస్థానమున నియమాంతరమును నెలకొల్పగలడు. అది ఆయనయిచ్ఛ" యనిబోధించెను. కాని, మధురునకంత విశ్వాసము కుదురదయ్యెను. "ప్రభూ, మీయీప్రవచనము నేను నమ్మజాలను. తెల్లపూలు పూయుచెట్టున నెఱ్ఱపూలు పూయజాలవు. అది ప్రకృతివిరుద్ధము" అని పలికి మిన్నకుండెను. మరునాడు శ్రీరామకృష్ణభగవానుడు బహిర్భూమికి బోయి రెండు పూలుగల ఒక కొమ్మను దెచ్చి "ఓయీ, యిటు చూడుము. ఇదిగో యీ కొమ్మయందే స్వచ్ఛమై యలరారు శ్వేతపుష్పమొండు, తెలుపు ఆవంతయు లేని ఎఱ్ఱని పూవొకటియు బుట్టినవి. ఇది భగవదిచ్ఛయే. ఆయన ప్రకృతి కధీనుడు సుమా" యని వచించెను. ఇక మధురుడు ఆయన పలుకుల శిరసా వహించెనని వేఱుగ జెప్పవలయునే!

ఇట్లే శ్రీరామకృష్ణభగవానుడు వేదార్థములకు, శాస్త్రీయసూత్రములకు తనదివ్యజీవనము భాష్యమును లక్ష్యలక్షణసమన్వయమునయి భాసిల్ల ననుష్ఠించి చూపెను. ఆ మహానుభావుడు కావించిన సమస్తాధ్యాత్మికసాధనలు లోకకల్యాణమునిమిత్తమే. తాను సంపాదించిన

దివ్యశక్తులు సమస్తము ఆయన లోకసంగ్రహార్థమే - లోకోద్ధరణార్థమే వినియోగించెను.

శ్రీ గురుదేవుడు భవరోగవైద్యుడు. రోగము ననుసరించి యాయన యౌషధమును మార్చును. గృహస్థశిష్యులకు ఆయన గావించెడి బోధనలు వేఱు, సన్న్యాసశిష్యులకు గావించు బోధనలు వేఱు; లౌకికులకు గావించెడి బోధనలు వేఱు. తనశిష్యులకు బోధించునెడ లౌకికులు వచ్చుచున్నారేమో యని దిక్కులుచూచి యెవరును రాలేదని గమనించి యా పిమ్మటనే వారికి అనుష్ఠానపూర్వకములగు బోధనలు గావించెడివాడు. తనశిష్యులయినను సన్న్యాసశిష్యులకు బోధించునెడ గృహస్థశిష్యులు వచ్చుచున్నారేమో యని గమనించి యా పిమ్మటనే వారికి యోగ్యములగు బోధనలు గావించి ఆధ్యాత్మికసాధనలయందు వారిని తీర్చిదిద్దెడివాడు. ఒక్కసన్న్యాసశిష్యులయందే వారివారి శక్తిసామర్థ్యములను-వారివారియందు నిహితముగానున్న భగవదంశమును-గుర్తించి ఒకరికి సగుణారాధనము, ఒకరికి నిర్గుణారాధనము; ఒకరికి హృదయమార్దవము, వేఱొకరికి హృదయకాఠిన్యము —— ఇట్లు పాత్ర మెఱిగి దానమన్నట్లు తత్తత్పాత్రానుసారము ఆయన జ్ఞానదానము గావించెడివాడు.

ఆమహానుభావుడు తనశిష్యులయందు ఆధ్యాత్మికదివ్యశక్తిని బహుముఖముల మేల్కొల్పెను. ఆ యుద్బోధనమున ఆయన యవలంబించిన మార్గములు బహుముఖములు. ఒక్కచూపుతో ఒక్కస్పర్శతో ఆయన వారియందలి శక్తిని మేల్కొల్పెడివాడు. ఈ మేల్కొల్పుటయందు ఆయన ఒకరిని స్పృశించును, ఒకరియెదుట గూర్చుండి ధ్యానించును, ఒకరినాశీర్వదించును, ఒకరి నాల్కపై బీజాక్షరముల లిఖించును. ఇట్లు ఆయన తనశిష్యులయందు ఏయే దివ్యశక్తుల గల్పించెనో, యేయేశక్తుల బురికొల్పెనో ఆయనకే యెఱుక! ఈ సమస్తమును ఆయన పతితదీనజనోద్ధరణార్థమే కావించెను.

లోకసంగ్రహము నిమిత్తము అవతరించిన ఆ భగవానుడు మూడునాలుగుదినముల కవతారసమాప్తి గావింపనున్నసమయమున తన తపఃఫలము సమస్తమును శ్రీ వివేకానందస్వామికి ధారవోసెను. ఆ క్షణమున నిట్లు పలికెను: 'ఓయి నరేంద్రా, నేడు నా సర్వస్వము నీకొసగి నేను ఫకీరనైతిని. నాయీ తపశ్శక్తి వలన నీవు లోకసంగ్రహము కావింపవలయును. తదనంతరమే నీ ముక్తి!' అమానుషప్రయత్నము లెన్నియో సంవత్సరములు గావించి, తపస్సానర్చి తాను సముపార్జించిన తన ఆధ్యాత్మికైశ్వర్యము సమస్తము ఆ లోకరక్షకుడు లోకసంగ్రహము నిమిత్తము హృదయపూర్వకముగ దానమొనర్చెను. సామాన్యపుష్పమునో, బహుమానమునో యొసగునట్లు ఆయన తన సర్వస్వమును లోకకల్యాణము నిమిత్తము అనుగ్రహించెను. ఇదిగదా త్యాగము. ఇదిగదా లోకసంగ్రహము!

అవసానకాలమున శ్రీరామకృష్ణగురుదేవుని బస కాశీపురోద్యానవనమునకు మార్పబడియెను. అచట ఆయన ఆరోగ్యము కొంత చక్కబడినట్లు కనిపించెను. కాని 16-8-1886 శ్రావణ కృష్ణ ప్రతిపద్భానువారము రాత్రి యించుమించుగా నొంటిగంటకు శ్రీరామకృష్ణ పరమహంస పరబ్రహ్మైక్యము నొందెను.

శిష్యులు తండ్రిగతించిన పసిబిడ్డలవలె విలపించిరి. గురుదేవుని శరీరమును పరిశుద్ధముచేసి కాషాయాంబరములఁగప్పి చందనాది పరిమళద్రవ్యములతో పుష్పములతో నలంకరించిరి. శ్రద్ధాభక్తులతో భుజములనిడికొని 'జయగురు

దేవ్', 'హరిబోల్' నినాదములతో సమీపముననున్న వారానగరశ్మశానమునకు మోసికొనిపోయిరి. అచట బాలసన్న్యాసశిష్యులు, గృహస్థశిష్యులు, భక్తులు—అందఱును ఆ పరమ పవిత్రశరీరమునకు ప్రదక్షిణములు సలిపి సాష్టాంగ నమస్కారము లాచరించిరి. అనంతరము దహనసంస్కారము గావించిరి.

దగ్ధశేషమును-గురుదేవుని పావనాస్థికలను ఒకపాత్రమునునుంచి, ఆ పాత్రమును శిరస్సున ధరించి శ్రీ వివేకానందస్వామి కాశీపురోద్యానభవనమునకుఁ దీసికొనివచ్చెను. అచట నొకచోట వానిని భద్రపఱచి బాలసన్న్యాసశిష్యులు శ్రద్ధాభక్తులతోఁ బూజించుచుండిరి. అనంతరము వారు పవిత్రకాషాయాంబరములఁ దాల్చి వారానగరమునందుఁ దపోధ్యానాదికములలో నిమగ్నులై మెలఁగుచుండిరి. వారానగరమున నొక గృహము నద్దెకుఁదీసికొని, గురుదేవుని అస్థిసంచయమును ఛాయాపటమును నందొకచోటస్థాపించి నిత్యపూజాదికములు నిర్వర్తించుచు-సంకీర్తనము గావించుచు పవిత్రసన్న్యాసజీవనమును గడపుచుండిరి. నేడు జగద్వ్యాప్తమై విలసిల్లుచున్న శ్రీరామకృష్ణ మఠ సేవాసంఘములకు వారానగరమఠమే మూల బీజము.

అనంతరము గృహస్థశిష్యులు శ్రీ గురుదేవుని అస్థిసంచయమును పావన గంగాతీరమున స్థాపించునట్లు సన్న్యాసశిష్యులతో నొడంబడిక చేసికొనిరి. కాని గురుచిహ్నములఁ బూర్తిగా గృహస్థశిష్యుల పరముచేయుటకు సన్న్యాసశిష్యులకు మనసొప్పినదికాదు. కావున వారా యస్థికలయందు ముక్కాలుమువ్వీసము రహస్యముగ దాచియుంచుకొనిభస్మమునుమాత్రము గృహస్థశిష్యుల పాలుచేసిరి. ఆ పాత్రమును గ్రహించి గృహస్థశిష్యులు గంగానదికిఁబూర్వ భాగమున కాఁకురుగాచియనుగ్రామమున భక్తిప్రపూర్ణులై స్థాపించిరి. కాలాంతరమున యోగోద్యానమని పేరుగాంచిన యా పవిత్రస్థలమున శ్రీరామకృష్ణాలయ మొకటి నిర్మింపఁబడి నిత్యపూజాదికములు నిర్వర్తింపఁబడుచున్నవి.

ఇట్లు స్థాపింపఁబడిన శ్రీరామకృష్ణమఠము 1886-వ సంవత్సరముమొదలు 1892-వ సంవత్సరమువఱకును వారానగరమున నేయుండెను. అనంతరము దక్షిణేశ్వరసమీపమునగల ఆలంబజారునకు మార్పఁబడి 1897-వ సంవత్సరము వఱకును నచటనే ప్రవర్ధిల్లుచుండెను. ఆపిమ్మట గంగాతరంగిణీతీరమున నీలాంబరముఖోపాధ్యాయుని వసములోనికి మార్పఁబడియెను. తుట్టతుదకు కలకత్తాకు నాలుగుమైళ్లదూరమునగల బేలూరనుపట్టణమున శ్రీ వివేకానందస్వామిచే నార్జింపఁబడిన పవిత్రస్థలమున శ్రీరామకృష్ణ మఠము చిరస్థాయిగ వెలయుచున్నది.

మఠమున నిత్యపూజాదికముల నిర్వర్తించుచు శ్రీరామకృష్ణానందస్వామి (శశిభూషణ చక్రవర్తి) సోదరశిష్యుల పావనతపోధ్యానాదికముల నినుమడింపఁజేయుచుండెను. ఆనాడు శ్రీరామకృష్ణానందస్వామి శ్రీ గురుదేవుని ఛాయాచిత్రమును నిల్పి నిత్యపూజాదికముల నిర్వర్తించియుండనిచో శ్రీరామకృష్ణమఠమెట్లు పరిణమించియుండెడిదో! అందులకే "శశిమఠమునకు మూలస్తంభము, తల్లి" అని శ్రీ వివేకానందస్వామి ప్రశంసించియుండుట.

శ్రీరామకృష్ణానందస్వామి హనుమంతుఁడు రామునివలె మఠమునంటిపట్టుకొని గురుపూజాపరాయణచిత్తముతో నిత్యపూజాదికములు నిర్వర్తించుచు సోదరశిష్యుల యవసరములఁదీర్చుచు మఠమును నవనవోన్మేషమును గావించుచుండ దివ్యవైరాగ్యప్రపూర్ణులగు స్వామిజీ మున్నగువారు తీర్థముల సేవించుచు,

తపోధ్యానాదికముల నొనర్ప బయలుదేఱిరి. 1893-వ సంవత్సరమున శ్రీ వివేకానందస్వామి అమెరికాయందలి చికాగోసర్వమతమహాసభకు హిందూమతప్రతినిధియై వెడలి సంపూర్ణ విజయోపేతుఁడై పాశ్చాత్యదేశములందు సనాతనమతవైశిష్ట్యమును ప్రకటించి 1897-వ సంవత్సరమున భారతదేశమున తన పవిత్ర పాదపద్మముల మోపెను.

స్వామిజీ యభిప్రాయానుసారము అభేదానంద శారదానందులు పశ్చిమఖండములకేగి వేదాంతప్రబోధనమునకుఁ బూనుకొనిరి. శ్రీరామకృష్ణానందస్వామి చెన్నపట్టణమున మఠమునుస్థాపించి దక్షిణదేశమున గురుదేవుని సందేశమును ప్రచారము సేయసాగెను.

అనంతరము శ్రీ వివేకానందస్వామి దేశోద్ధరణము-లోకసంగ్రహముగావింప సంకల్పించెను. సుస్థిరఫలదాయకమగు సదాశయసంసిద్ధి సత్సంఘమునందిలేనిదే కలుగనేరదని విదేశపర్యటనమువలన గుర్తించిన స్వామిజీ అందులకనువగుసంఘమును స్థాపింప సంకల్పించెను. గృహస్థశిష్యులకెల్లరకు నాహ్వానము లంపెను. స్వామి చిత్తముమేరకు గృహస్థశిష్యులును, సన్న్యాసశిష్యులును బలరామ్‌బోస్ నింట సమావేశమైరి.

శ్రీ గురుదేవుని దివ్యనామమునే యీ సంఘమునకుఁబెట్ట నిశ్చయించిరి. లోకసంగ్రహము నిమిత్తము గురుదేవుడు ఆచరణపూర్వకముగ-లక్ష్యలక్షణసమన్వితముగ లోకమునకు బోధించిన ధర్మసూత్రములను ప్రపంచము నలుమూలల వ్యాపింపఁజేయుటయు, ఈ ధర్మాచరణమున లోకులకు సాయమొనర్చుటయు, సర్వమతసమన్వయమూర్తియగు శ్రీరామకృష్ణ గురుదేవుడు ప్రారంభించిన మహోద్యమమును శాస్త్రసమ్మతముగ నిర్వహించుటయు, ప్రజాసమూహమున నైహికాముష్మికవిద్యాముఖ సిద్ధహస్తులగు సన్న్యాసుల తీర్చిదిద్ది లోకమునకు సమర్పించుటయు, సేవాకార్యమున సన్న్యాసులను బ్రహ్మచారులను సుశిక్షితులనొనర్చుటయు సంఘోద్దేశములు-కార్యకలాపములుగ నిశ్చయించిరి. క్రమక్రమముగ యావద్భారతదేశమునందును, విదేశములందును శ్రీరామకృష్ణమఠసేవాసంఘముల నెలకొల్పి దీనజనోద్ధరణముగావించుట సంఘకార్యములలో ప్రధానముగ నిర్ణయింపఁబడెను. సంఘాశయముల కాదర్శప్రాయులగు సత్పురుషులెల్లరు నిందు సభ్యత్వము బడయనర్హులే.

నియమావళీ నిర్ణయానంతరము కార్యనిర్వాహకవర్గము నియమింపఁబడియెను. అనంతరము స్వామిజీ ఉత్తరదేశ తీర్థయాత్రకై బయలుదేఱెను.

1898 వ సంవత్సరము డిసెంబరు 9 వ తేదీ నాడు స్వామిజీ సుస్థిర శ్రీరామకృష్ణ మఠప్రతిష్ఠాపనమున కుపక్రమించెను. పావనగంగాతరంగిణియందు స్నానమాచరించి పవిత్ర కాషాయాంబరములఁ దాల్చి నీలాంబరముఖోపాధ్యాయుని వనగృహమున నున్న శ్రీగురుదేవుని అస్థిసంచయము నత్యంతశ్రద్ధాభక్తులతో నర్చించెను. అనంతర మా పాత్రమును భుజమున వహించి బేలూరునందుఁ గ్రొత్తగాఁ దానార్జించిన పుణ్యస్థలమున మంగళకరాసనమున నిల్పి పరిపూర్ణ భక్త్యుత్సాహములతో స్వామి సాష్టాంగ వందనమాచరించెను. భక్తులెల్లరును గురుదేవుని మహిమోపేతమగు నా పాత్రమునకు సాఁగిలఁబడి నమస్కరించిరి. ఇఁక స్వామిజీ శాస్త్రసమ్మతముగఁ బూజాదికమును విరజాహోమమును గావించి గురుదేవునకు స్వయముగా దాను పక్వముచేసిన పాయసమును నివేదించెను. "తండ్రీ, ఇచ్చట వెలసి

యీ పవిత్రస్థలమును సర్వమత సామరస్య నిలయముగా నొనర్చి లోకసంగ్రహ మాచరింపు" మని భక్తిపూర్వకముగఁ గరకమలములు ముకుళించి ప్రార్థించెను. శ్రీరామకృష్ణభగవానుఁడా ఋషీశ్వరుని ప్రార్థనమును మన్నించి యనుగ్రహించెను.

శ్రీరామకృష్ణ గురుదేవుని యనుగ్రహబలమున నేడు బేలూరునందు శ్రీరామకృష్ణమఠము ఆధునిక పద్ధతుల ననుసరించి నిర్మింపఁబడి యున్నది ఇదియే ప్రపంచమునందు శాఖోపశాఖలతో ప్రవర్ధమానమై వెలయుచున్న శ్రీరామకృష్ణమఠ సేవాసంఘములకు ప్రధాన కేంద్రము.

అనంతరము 1909 వ సంవత్సరమున నీ సంఘము శ్రీరామకృష్ణమఠమనియు, శ్రీరామకృష్ణ సేవాసంఘమనియు విభజింపఁబడియెను.

మఠమునఁ జేరు ముముక్షువులకు బ్రహ్మచారులకు సన్న్యాసజీవనమున కావశ్యకమగు శిక్షణము గఱపుటయే శ్రీరామకృష్ణ మఠము ముఖ్య కర్తవ్యము

ప్రపంచము నలుమూలల వైద్యశాలలు, విద్యాలయములు, అనాథశరణాలయములు సేవాశ్రమములుస్థాపించి, జనసామాన్యమునకు సేవచేయుటయే-సమస్త కష్టములఁ దొలఁగించి రక్షించుటయే సేవాసంఘ ప్రధానోద్దేశము.

శ్రీరామకృష్ణభగవానుని కృపాకటాక్షనిరీక్షణమున నేఁడు శ్రీరామకృష్ణమఠ సేవాసంఘములు దేశదేశముల, ఖండఖండముల-ప్రపంచము నలుమూలల-నెలకొనియున్నవి. అందలి సాధుసత్తములు 'మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ' యన్న ప్రాచీన మంత్రముల స్థానమున 'దరిద్రదేవోభవ, దీనదేవోభవ, ఆర్తదేవోభవ' యన్న నవీనమంత్రముల జపించుచు దీనజనకష్టనివారణమున, పతితజనోద్ధరణమున, ఆర్తజనసంరక్షణమున బద్ధకంకణులై మానవసేవయే మాధవసేవయన్న సత్యమును ప్రకటించుచున్నారు. ఈ సాధుసత్తములు తాము ప్రపంచమున నేభాగమున సేవాకార్యముకుఁ బూనుకొన్నను జాతి, మత, భాషాది భేదములఁ బాటింపక యచటి జనసామాన్యముతో నవినాభావసంబంధమును గల్పించుకొని తమ కర్తవ్యమును సక్రమముగ నిర్వర్తించుచున్నారు. కలరా, విషూచి, ప్లేగు, కుష్ఠు మున్నగు భయంకర వ్యాధులకు లోనై మృత్యువుతోఁ బోరాడుచు సతమత మగుచున్న రోగులకు వైద్యశాలలు స్థాపించియు, అగ్నిప్రమాదములవలన, వఱదలవలనఁ దమ సర్వస్వమును బోగొట్టుకొని యల్లాడు నార్తులకు అన్నవస్త్రాదుల నొసఁగియు విద్యాగంధములేని మారుమూల పల్లెలయందు విద్యాలయములు అనాథశరణాలయము స్థాపించి విద్యాదానము చేసియు, శ్రీరామకృష్ణమఠ సాధువులు లోకసంగ్రహము గావించుచున్నారు. మహాత్ములకు లోకమే కుటుంబము గదా !

స్త్రీజనోద్ధరణము నిమిత్తము శారదా మఠము స్థాపింపబడి యున్నది. అచటి సన్న్యాసినులును శ్రీరామకృష్ణ మఠ సాధువులవలెనే సేవాకార్యముల నొనర్చుచు లోకసంగ్రహము గావించుచున్నారు.

శ్రీరామకృష్ణభగవానుని యనుగ్రహము వలన శ్రీవివేకానందస్వామి కార్యదీక్షవలన స్థాపింపబడిన శ్రీరామకృష్ణమఠ, శ్రీశారదా మఠ సేవాసంఘములు దీనజన కల్పకములై శాఖోపశాఖలతోఁ బ్రవర్ధిల్లును గాక! వాని చల్లని నీడను జనసామాన్యము తాపత్రయము రూపుమాసి ప్రపంచమున శాంత్యానందములు విజృంభించును గాక!

లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు.

# వివేకానందుని సుభాషితములు

## శ్రీ యల్లంరాజు వెంకట సుబ్బారావుగారు

'భారతదేశాన్ని గురించి సమగ్రంగా తెలుసుకోవాలంటే, వివేకానందుని రచనలను చదవండి అందులో ప్రతివిషయము గ్రాహ్యమే, విసర్జనీయమైన దేదీలేదు' అని విశ్వకవి రవీంద్రనాథఠాకూరు అభిభాషణ. 'వివేకానంద స్వాముల రచనలన్నీ నేను ఆమూలాగ్రం పరిశీలనాత్మకంగా చదివాను. వాటిని చదివిన తర్వాత భారతదేశంపట్ల నాకు గల అభిమానం వేయిరెట్లు పెరిగింది' అని గాంధిమహాత్ములు వ్రాశుచ్చారు. ''వివేకానందస్వామి పురుషసింహం. ఆయనశక్తి నారాధిస్తూ, తమదేశవాసులకు ఆచరణ పూర్వకమయిన వేదాంతాన్ని ప్రబోధించారు. 'శక్తులు కండు' ఈ ఉపనిషద్వాక్యమునే ఆయన పలుమార్లు ప్రబోధించారు. ప్రతివారు చక్కటి శీలాన్ని అలవర్చుకోవాలని ఆయన హెచ్చరించేవారు. ఆయన సజీవులైయుంటే, నేను వారి పాదాల వద్ద ఉండే వాణ్ణి. నవభారతనిర్మాత ఆయనే' నని స్వ. సుభాశ్ చంద్రబోసు పేర్కొన్నారు.

వివేకానందులు విశ్వాసాన్ని శక్తినిగురించి తరచు మాట్లాడేవారు. మానవులు ఆత్మవిశ్వాసం కలిగియుండాలని, శక్తులు కావాలని వారి అభిభాషణ. తమలో విశ్వాసము లేనివారే నాస్తికులని వారి నిర్వచనము. దేశచరిత్ర అంటే అలాంటి విశ్వాసము కలిగిన యేకొద్దిమంది మహనీయుల చరిత్రమాత్రమే నని వారి భావన. విశ్వాసం లేకపోతే జాతి నశించగలదు. వేదాలు, ఉపనిషత్తులు బోధించే సారమే శక్తి. శక్తిలోనే ముక్తి ఇమిడియున్నదని, దేశవాసులంతా శక్తులై కష్టించి పని చేయాలని వారి ప్రబోధము.

మానవులు చిత్తశుద్ధి, ఏకాగ్రత కలిగియుండాలని వారు నొక్కి చెబుతూఉండేవారు. మనోనిగ్రహంవల్లనే ఎన్నో గూఢతమ రహస్యాలను విషయాలను తెలుసుకోనవచ్చునని వారిభావన. సుశిక్షితమయిన మనస్సుకల మానవుడు ఏపాపాలు చేయడని, తప్పులు చేయడని వారు ఉపదేశించారు.

మానవునిలోని పరిపూర్ణత్వముయొక్క వికాసమే విద్య. విద్యఅంటే కేవలం బహుళ గ్రంథపరిచయంగాని లేదా విషయపరిజ్ఞానం కాదని వివేకానందులు చెప్పేవారు. దేనివలన చిత్తైకాగ్రత, త్యాగబుద్ధి మానవులకు అలవడుతుందో అదియే నిజమయిన విద్యయని వారు సూత్రీకరించారు. 'న కర్మణా,న ప్రజయా, ధనేన - త్యాగే నైకే అమృతత్వ మానశుః' అనేదే ఉపనిషత్ప్రమాణవాక్యం. కేవలం సత్కర్మలవల్లగాని, సంతానమువల్లగాని, ధనమువల్లగాని అమృతత్వం సిద్ధించదని, ఒక్క త్యాగంవల్లనే ఈపని సాధ్యం కాగలదని దీనిభావం. భారతీయులకు కావలసినది భారతీయదార్శనిక దృక్పథంతో మిళితమయిన పాశ్చాత్యవిజ్ఞానము. ఇందులకు బ్రహ్మచర్యమెంతో అవసరం. ఆత్మవిశ్వాసము శ్రద్ధ కలిగి భారతీయులు పురోగమించాలి. మానవునిలోని విజ్ఞానసంపదను పెంచడానికి గురువుసహాయం ఎంతో అవసరం. కాని దీనికి మూలము మతము. మతము అన్నము లాంటిదైతే, మిగతవిషయాలు కూరల్లాంటివి. కేవలం కూరలుతింటే అజీర్ణంచేస్తుంది. అలాగే, అన్నము తిన్నప్పటికి. విద్యార్జనకు గురుగృహవాసం చేయాలి. అంటే విద్యార్థి గురువుతో వ్యక్తిగతమయిన సంబంధం కలిగి ఉండాలి. ఈనాటి విశ్వవిద్యాలయాలు విద్యా

ర్థులను పరీక్షించే యంత్రాగారాలుగ ఉన్నవే గాని మౌలికమయిన మానవున్ని తయారు చేయడానికి దోహదకారులు కావటం లేదు.

సత్యము సమాజానికి తలయొగ్గదు, సమాజమే సత్యముకే పునాదిపైన నిర్మించబడాలి. ఒక దేశంగాని, వ్యక్తిగాని, గొప్పవారు కావాలంటే మూడువిషయాలు కావాలి (1) మంచితనంలో విశ్వాసం (2) రాగద్వేషాలు సందేహాలు లేకుండడం. (3) మేలు చేస్తున్నవారికి, మంచిగా అందరికీ సహాయం చేయడం.

మనధ్యేయం ఆత్మ కావాలి. పదార్థాలపైన దృష్టి పోనీయరాదు. హిందువు అన్ని విషయాలు మతపరంగానే ఆలోచిస్తాడు—ఆహార విహారాల్లోను, వివాహాల్లోను, కడకు శోషణలో కూడా మతం పేరిటనే అన్ని కార్యక్రమాలు జరుపుతుంటాడు. ప్రతి దేశం విశ్వానికి అందించవలసిన సందేశం ఉంది. ఎన్ని ఆటంకాలు కలిగినా, ఆ సందేశానికి విఘాత కలుగనంత కాలం, ఆదేశం మనుగడ సాగిస్తుంది.

ఒకవైపు నవభారతం ఎలుగెత్తి చాటుచున్నది—'మనము పాశ్చాత్యులభావాలను, భాషను, ఆహారాన్ని, వేషాన్ని, ఆచారవ్యవహారాలను అలవర్చుకుంటే, మనముకూడా వారిలాగా దృఢకాయులుగా, శక్తివంతులుగా జీవించగలుగుతాము.' మరోవైపు ప్రాచీన భారతం ఇలా ఘోషిస్తున్నది — 'అవివేకులారా, అనుకరణవల్ల మీకు సంప్రాప్తమయ్యేది యేమీ లేదు. వారిభావాలు మీసొంతం కాబోవు. మీరు సంపాదించినదే మీసొంతం. సింహంచర్మం కప్పుకొన్న గాడిద సింహం కాగలదా?' ఇలాగే నవభారతం పిలుపు— 'పాశ్చాత్యదేశాలు చేస్తున్నదంతా మంచిపనే కాకపోతే వారంత గొప్పవారెలా కాగలిగారు?' దీనికి ప్రాచీనభారత మిచ్చే సమాధానం—'మెరుపు కాంతి నిజంగా చాలా ప్రకాశవంతంగా ఉంటుంది. కాని ఒకరెప్పపాటుమాత్రమే. భారతీయులారా, ఆ మిరుమిట్లుగొలిపే ప్రకాశం మీకళ్లకు చెరుపు కలుగజేస్తుంది. జాగ్రత్తవహించండి!' వైజ్ఞానికంగా, భౌతికంగా ఎంతో పురోగమించినప్పటికి పాశ్చాత్యదేశాలు మన ఉపనిషత్తుల సవాలును ఎదుర్కొనలేక పోవుచున్నవి—'న కర్మణా, న ప్రజయా, ధనేన, త్యాగే నైకే అమృతత్వ మానశుః' పాశ్చాత్యదేశాల్లో ఈసవాలును ఎదుర్కొని, దీని ప్రమాణాన్ని వమ్ముచేయడానికి ఎన్నోజాతులవారు ఎన్నో ప్రయత్నాలుచేసి విఫలులయినారు. వారిలో కోరికలు అధికమయినాయి. పరస్పర రాగ, ద్వేషాలు ప్రబలినాయి. అధికారంకోసం, ధనంకోసం స్పర్ధ ఎక్కువయింది. శాంతియా లేదా కలహమా అన్నదే వారిసమస్య. ప్రపంచంలో మంచి నిలుస్తుందా లేదా దుర్మార్గం నెగ్గుతుందా! భౌతికసంపదధాటికి ఆధ్యాత్మికశక్తి నిలబడగలదా? ఆధ్యాత్మికత గొప్పదా, భౌతికత విలువయినదా? ఈసమస్యను ఏనాడో మన ఉపనిషత్తులు పరిష్కరించాయి. మన సిద్ధాంతము పారలౌకికమే - అదే త్యాగము.

లక్ష్యసిద్ధికన్నా లక్ష్యసాధనాలు పవిత్రంగా ఉండాలని వివేకానందులు ప్రబోధిస్తూ ఉండేవారు. మనకర్తవ్యమంతా - ఇతరులకు సేవ చేయడం, ప్రపంచానికి మంచి చేయడం. బుద్ధుడు ఇదే మార్గాన్ని అవలంబించాడు - "భగవంతునిగురించి ప్రతిపాదించిన మార్గాల మీద సిద్ధాంతాలమీద చర్చ నాకనవసరం. ఆత్మను సంబంధించిన రహస్యతరమయిన సిద్ధాం

తాలను గూర్చి చర్చించినందువల్ల ప్రయోజన మేమిటి? మంచి చేయి, మంచిగా ఉండు దీని వల్ల నీవు ముక్తుడవు కాగలవు.'

భారతీయులు స్వార్థపుచింతవదలి సేవా భావాన్ని అలవర్చుకోవాలని వివేకానందుల ప్రబోధం. పరమాత్మ ప్రతిజీవిలోను భాసిస్తున్నాడు. ఆయన తప్ప వేరే దేవుడు లేడు. మానవసేవయే ఈశ్వరారాధన. నరకప్రాయమైన ఈజగత్తులో, ఏ ఒక వ్యక్తికయినా సుఖ శాంతులను కనీసం ఒకరోజయినా, మనము సమకూర్చ గలిగితే, అదియే నిజమైన సేవ; సత్కర్మ. 'ఈనగ్నసత్యాన్నే నేను జీవిత మంతా బాధపడి, కష్టాలనుభవించి నేర్చుకొన్నాను మిగిలినదంతా భ్రమయే; మెరిసే చంద్రకాంతియే.'

ఇతి శివమ్.

# 'ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయచ'

## శ్రీమత్ప్రవ్రాజిక వరదాప్రాణ

శ్రీరామకృష్ణుల జీవితపు ఆదర్శముద్వార, ఉపదేశముద్వార ప్రేరేపింపబడిన వివేకానంద స్వాముల కార్యప్రణాళికి ప్రపంచమే కార్యరంగము. భగవచ్ఛక్తి సంపన్నుడగు ఆతడు ముప్పది సంవత్సరములలోనే లోకగురువుగ పరిణమించెను - చికాగో ధర్మమహాసభమూలకముగ ఈసంగతి సర్వవిదితము.

ఈమారు భారతీయఋషుల ధ్యానలబ్ధమగు ఆత్మజ్ఞానము మారుమూలాలలో నున్న గిరిగుహలలోనుండి ఇంటింట, దేశమంతట, ప్రపంచపు నలుప్రాంతముల మారుమ్రోగుచు "మానవుడా, లెమ్ము; నిదురింపక లెమ్ము, నీవు దైవాంశసంభూతుడవు! నీవు దుర్బలుడవు కావు!" అని మేలుకొలుపుచున్నది. ఈమారు మానవుడు సాధించునది-వ్యక్తిగతమగు ముక్తి సాధన కాదు - సంపూర్ణ మానవజాతియొక్క జీవన్ముక్తి; పరలోకమ్మున కాదు ఇహలోకమునసే మానవుని శ్రేష్ఠకళ్యాణసాధన. కావున మన కర్తవ్యము - భగవత్ప్రేమను మానవ ప్రేమగ ప్రవహింపజేయుట, స్వర్గమున ముక్తి కామన త్యజించి మర్త్యలోకముననే ప్రజ్ఞావంతులమై, నిర్భయులమై విచరించుచు 'శివజ్ఞానముతో జీవ సేవను చేయుట; అనగా శ్రద్ధతో, ప్రేమతో నిస్స్వార్థముతో చేయు సేవద్వార, పూజద్వార, మనలోని, పరులలోని దైవత్వమును ఉద్బుద్ధము గావించుట - అప్పుడే పరమజ్ఞానము, పరమశక్తి, పరమానందము కలుగును. మృత్యుభయము తనంతట తానే దూరమై పోవును. ఇదియే స్వామిజీ యొక్క నవయుగధర్మప్రచారము, ఈ యుగ ధర్మము - "ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ."

గడచిన నూర్లకొలది సంవత్సరములు ఈ యుగసమస్య సమాధానమునకే భారతవర్షము వేచియుంటినది. ఈ దేశమున మతవాదులకు, ధర్మమార్గములకు కొఱత లేదు. ఆధ్యాత్మిక చింతనయందు శ్రేష్ఠతమమగు గవేషణ, ఉపలబ్ధి, ఇక్కడనే జరిగినది. ప్రమాణములు - మన వేదవేదాంతములు, పురాణేతిహాసములే! ఈనాటి ప్రపంచపు విజ్ఞానసోపానములు ఆ

ఆత్మోపలబ్ధిదరిదాపులకుకూడ చేరుకోలేదు అంతటిఉన్నత చింతాధారలకు కన్నతల్లియైన మన హిందూదేశపు పరిస్థితి ఎందుకింత దీనాతి దీనము ? శతశతవర్షములు పరజాతి పదాఘాతములు సహించి బానిసగా తయారైనందుకు కారణమేమి? అసలు సంగతి - ఇంతకాలము భారతదేశపు సంపూర్ణోన్నతినిగుఱించి ఆలోచనయే జరుగలేదు. దేశపు ఆర్థిక, ధార్మిక, రాజనైతిక, లౌకిక, వైజ్ఞానిక సమస్యలను గూర్చి సమ్యగ్దృష్టితో నిస్స్వార్థముగ ఆలోచించి సమాధాన మొనర్చిన ప్రయాసయే జరుగలేదు. దినదినము దేశపుపరిస్థితి దిగజాటి పోవుచు, సమస్యలు పెరుగుచుండగా ఇంకొకవైపు మిగతదేశములన్నియు ప్రాపంచికార్థిక విషయములందు ముందంజవేసి పైకెగసి పోవుచున్నవి.

ఎందఱో మహానుభావులు, ధర్మప్రవర్తకులు, వీరపురుషులు ఈదేశమున జన్మించిరి; ఎన్నోవిధములుగ దేశోన్నతిని సాధించుటకు ప్రయత్నించిరి. కాని ఒక్కవ్యక్తియే వీరుడుగను, ధర్మసంస్కర్తగను జన్మింపలేదని చెప్పవచ్చును. కేవలము ఉపన్యాసములతో కాక స్వీయచరిత్రతో, ఆత్మోపలబ్ధితో దేశమును భవిష్యన్మార్గమున సుదక్షతతో నడిపింపగల మహాపురుషుడు, భగవద్గీతలోని జ్ఞాన, భక్తి, కర్మయోగముల సంగమస్థానమైన యోగిపురుషుడగు వివేకానందస్వామివంటి వ్యక్తిని ప్రపంచేతిహాసములో ఇంతకుమునుపు చూచియుండలేదు. ఆ మహానుభావుడు చూపిన దారియే మనకు శ్రీరామరక్ష అనునది సుస్పష్టము,

స్వామిజీ చింతాధార ఆయన లేఖలను పరిశీలించినచో తెల్లమగును.

చికాగోనుండి క్రీ. శ. 1894 సం॥ మే మాసమున మద్రాసులోని అలసింగపెరుమాళుకు వ్రాసిన ఉత్తరములోని అంశము: అగ్నిమంత్రమున దీక్షితులగు కొందఱు యువకులను చేర్చి ఒక చిన్నగుంపును తయారుచేయుము. కొద్దిపాటి విరాళముతో కొన్ని మ్యాపులు, గ్లోబులు, మ్యాజిక్ లాంతరులు, కొన్ని రసాయనికపదార్థములు కొని, ప్రతిసాయంకాలము నిరక్షరులగు పేదలవద్దకు, మాలలవద్దకు వెళ్ళి, మొదట భగవద్విషయమునుగూర్చి ప్రసంగించి తరువాత పైవస్తువుల సహాయముతో వారికి భూగోళము, చరిత్ర, విజ్ఞానము మున్నగు విషయములను వారి కర్థమగుభాషలో నేర్పవలయును. అల్పముతో ప్రారంభించి కార్యమును మెల్ల మెల్లగ విస్తరింపజేయుము. సాహసము నవలంబింపుము. ఇతరులపై అధికారము చెలాయింపక నమ్రతతో సేవ చేయుము. అధికారపిపాసయే పెక్కు గొప్ప ప్రణాళికలను నాశనము చేయుచున్నది. ఆ మరణము నిస్స్వార్థముగ పనిచేయుటకు స్థిరనుకొని కమ్ము. భగవంతుడు మన కన్నివిధముల తోడ్పడును."

అదే సంవత్సరమున జూన్ 20 వ తేదిన దివాన్ హరిదాస్ విహారిదాస్‌కు వ్రాసినది: "హిందుదేశమును బ్రిటిషువారు అంత సులభముగ జయించుటకు కారణ మేమి? ఒక్కమాటలో:- వారిది సంఘబద్ధజీవనము, మనది-కాదు. కావున జనసామాన్యమును విద్యావిజ్ఞానముద్వార పైకి లేవదీయుటయే ఏకైకపథము. మనదేశపు హృత్పిండము, అసలు జాతిఅగు జనసామాన్యము కుటీరములలోనే ఉన్నారు. వారు తమ వ్యక్తిత్వమును, మానవత్వమును విస్మరించి యున్నారు. వారిని విద్యావంతులుగ చేసి తీరవలయును. విగ్రహ

పూజ చేయుటా, మానుటా? ఎందఱు విధ వలను పునర్వివాహము కలుగవచ్చును? కుల భేదములు మంచివా? కావా? అను ప్రశ్నల సమాధా : శిరోవేదన నాకు వలదు.''

పై జూలైమాసపు 23 వ తేదిన మైసూరు మహారాజుకు వ్రాసినది: ''హిందూదేశపు జీనదశకు మూలకారణము దారిద్ర్యము. పాశ్చాత్యదేశపు దరిద్రుల పిశాచప్రకృతితో పోల్చిచూచిన మన దేశపుదరిద్రులు దేవతా సమానులు. నిమ్నశ్రేణులను పైకితీయుటయే, వారిని విద్యావంతులను గావించి మృతప్రాయ మగు వారి వ్యక్తిత్వమును మేల్కొలుపుటయే, మన ముఖ్యకర్తవ్యము. పరాధీనత, పురోహితశక్తి వారిని వూర్లకొలది సంవత్సరము లు అణగద్రొక్కి నలిపి పాఱవైచినవి. తాము మనుష్యుల మను సంగతికూడ వారికి జ్ఞాపకము లేదు. మనదేశములో వేలకొలది దృఢచిత్తులు నిస్స్వార్థులు అగు సన్న్యాసు లున్నారు. వారం దఱు ధార్మికోపదేశములతోపాటు లౌకిక, వైజ్ఞానిక విద్యాదానము చేయవలయును.''

పై ఉత్తరములు చదివి చూచిన, అవి కేవలము ఎండుగడ్డిమంటవలె భగ్గునమండి వెంటనే ఆరిపోవునట్టి వట్టిమాటలు కావు; గంభీరధ్యానలబ్ధములగు భావము లని తెలియ నగును. ఆ ఉత్తరములు వ్రాయునప్పుడు అతడు ఏ పరిస్థితిలో నుండెనో తెలిసికొనుటకు ఆయన జీవితచరిత్రపు పుటలు తిరుగవేయ వలయును. క్రీ. శ. 1894 లో స్వామిజీ వయస్సు ముప్పదియొక్క సంవత్సరములు. ఆమాత్రపు వయస్సులో ఆ దూరదేశములో ఒంటరిగా ఎదుర్కొనవలసిన విపరీతపరిస్థితు లకు లెక్కలేదు. చికాగోధర్మమహాసభలో విశ్వవరేణ్యుడైనందుకు చాలమందికి కన్నెఱ్ఱగా నుండెను. ఒకవైపు స్వదేశపు మిషనరీలు, బ్రహ్మసమాజపుసభ్యులు మున్నగువారు ఆయన శీలమును గుఱించి, మతమును గుఱించి, సన్న్యాసాధికారమును గుఱించి కల్పనాతీతము లగు అపవాదులనుసృష్టించి లాంఛనపఱచుటకు విశ్వప్రయత్నములు చేయుచుండిరి. ఇంకొక వైపు స్వామిజీ అవిరామముగ పెక్కుసభ లలో, వివిధపట్టణములలో శాస్త్రజ్ఞులు, చింతా శీలురు, మనీషులు నగు శ్రోతల యెదుట ఉపన్యాసములుచేయుచు, అంతటి పరిశ్రమలో కూడ అల్పసమయము చేజిక్కినను నిర్జనమున సమాధిమగ్నుడై ఆత్మానందమున తన్మయుడై యుండునాతడు భారతదేశపు ఉజ్జ్వలభవిష్య త్తుకై ఆలోచించుచు, హృదయస్పర్శములగు లేఖలద్వార స్వదేశవాసులను ఉత్సాహపఱ చుట సామాన్యమానవునిపట్ల కల్పనాతీతము!

అటువంటి దైవశక్తిసంపన్నుడగు వివేకా నందుని పరికల్పితకార్యప్రణాళియే మన ఉన్న తికి, కల్యాణమునకు ఒకే ఒక దారి. 'నాన్యః పన్థావిద్యతే అయనాయ!'

నేటి ప్రపంచపు పరిస్థితులకు రీతినీతులే లేవు. మహాప్రళయమునకు సమ్ముఖీనులమై యున్నామా ఏమి? ఎటుచూచిన హింస, ప్రతిహింస, స్వార్థపరత, కాపురుషత! కాళ రాత్రి చితాగ్నిపై ఢాకినీ శాకినుల భయంకర నృత్యమే ఈనాటి పరిస్థితులకన్న మెఱుంగు కాబోలు! ఈ అంధకూపమునుండి బయట బడు దారి, సూర్యునివలె దేదీప్యమానముగ వెలుగుచున్న వివేకానందస్వాముల 'ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ' అను కార్య ప్రణాళియే కదా!

# వార్తలు - విశేషాలు

## శ్రీరామకృష్ణమఠము-మద్రాసు 4

### బుద్ధ జయంతి

1971 వ సంవత్సరం మే నెల 10 వ తేది సోమవారం వైశాఖపూర్ణిమనాడు మఠంలో బుద్ధజయంతి కొనియాడబడినది. 16-5-1971 భానువారము సాయంకాలం వివేకానంద హాలులో పౌరసభ సమావేశమైనది. ప్రార్థన గేయమూ మంత్రపుష్పానుసంధానమూ అయిన తర్వాత సభాధ్యక్ష్యం వహించిన శ్రీమత్పరమాత్మానందస్వాములు ఈలాగు వ్యాఖ్యానించారు.

బుద్ధదేవుని అవతారం, ప్రబోధం, మహాపరినిర్వాణం-ఈమూడు వైశాఖపూర్ణిమనాడే జరిగినందున ఆదినపావనతమమ్మైనది. అది సుబ్రహ్మణ్యస్వామికిన్నీ నమ్మాళ్వార్లకున్నూ అవతారదినమున్నూ శ్రీ జ్ఞానసంబంధయోగి శివైక్యంపొందినదినమున్నూ కావడంచేత దాని ప్రాముఖ్యం ఇంకనూ ఎంతగనో హెచ్చినది. క్రీ.పూ. 623 నుండి 543 వఱకు బుద్ధుడు భూమిపై జీవించియుండెనని తెలుస్తూఉంది. అతనివిశిష్ట గుణాలు పెక్కులు. అమితజాగరూకత గలవాడు. సంసారమును త్యజించి పోనున్న రాత్రి క్రొత్తగా పుట్టిన బిడ్డను ఎత్తుకొని లాలింతమను కోరిక అతని మనస్సులో కలిగినను, అది తన ఉద్యమానికి ఏమి అడ్డంకులు తెచ్చిపెట్టునో అని వెఱచి మనస్సును గట్టిచేసికొని, బిడ్డనెత్తుకొనకయే వెడలిపోయెను. అంతకు ముందతడు చూచియుండిన 'వికలాంగ' 'రుగ్ణ' 'మృత' 'సన్న్యాసి' దర్శనములు అతని డెందమును విశ్వజనులమీది యపారదయతో నింపివైచినవి. సొంతమునకు ఆయనకు సమస్యలు లేవు. విశ్వమానవుల సమస్యల పరిష్కారమునకై ఆయన ఉద్యమించాడు. స్వార్థరహితత యనలో రూపుదాల్చింది. ఎంత గాఢతమములైన తపశ్చర్యలనైనా నెగ్గించుకొను సామర్థ్యం ఆయనకుంది. సుజాత ఆయనకు క్షీరాన్నము సమర్పించడం ఆయనచరిత్రంలో హృదయద్రవీకరణసమర్థమైన ఘట్టం. తదనంతరమే ఆయన బోధివృక్షం క్రింద ఆసీనుడై మారుని ప్రలోభనముల నన్నిటిని వ్యర్థపఱచాడు. తన తక్కిన ఎత్తులన్నీ రిత్త అయినతర్వాత బుద్ధునకు ప్రబోధం కలిగిన తర్వాత "స్వయముగా నీవు నిర్వాణం పొందు. ఇతరుల ఊబును నీకెందు" కని కూడా చెప్పిచూచాడు. బుద్ధుని జగదుద్ధరణాధ్యవసాయాన్ని సడలింప జాలక పొయ్యాడు. బుద్ధదేవుడు తాను కనుగొని లోకానికి కఱపిన సత్యాలు నాలుగు— 1. దుఃఖం 2. దానికారణం 3. దానినివృత్తి 3. అందుకుపాయం. విశుద్ధతా-పావనతా-దరిద్రతాపూర్ణము బుద్ధునిజీవితము. తన జీవితోత్తరభాగమున అతనికి తండ్రితో సమాగమము కలిగినది. సామ్రాజ్యార్హుడైన పుత్రుని భిక్షుకవేషమున జూచి తండ్రి ల్లాడు. "మనవంశపూర్వు లెవరును అవలంబింపని యీ భిక్షుకవృత్తిని మాను" మన్నాడు. అందుకు బుద్ధుడు చెప్పిన జవాబు "నేను బుద్ధుల పరంపరకు చెందినవాడను. భిక్షాటనమే నాకు పరంపరాగతమైన వృత్తి." భార్యయగు యశోధరనుకూడ బుద్ధుడు కలసికొన్నాడు. పతి ధర్మమే సతికి నదే ధర్మమనెడి సంప్రదాయానుసారము ఆమెయు సన్న్యాసిని యయ్యెను. బుద్ధుని జీవితమువలెనే జీవితపరిసమాప్తియు గంభీరభావజుష్టమైనది. చుందుడు మితిమీఱ తినిపించిన పందిమాంసముచే ఆయన వ్యాధిగ్రస్తుడై మరణించాడు. కాని ఉదార

మైన ఆయనహృదయమునకు—సంజీవనముగా సుజాత సమర్పించిన అన్నము మారకముగా చండుడు సమర్పించిన అన్నమును సమానముగ ప్రియములే. అది ప్రబోధమునకూ ఇది మహా పరినిర్వాణమునకూ దారి చేసినది. బుద్ధదేవుని చరమసందేశం : "భౌతికపదార్థాలకు వినాశము సహజము. శ్రద్ధతో నీ విముక్తిని సంపాదించుకో" శుష్కతపఃపరతకు అంధభోగపరతకు మధ్యమార్గం ఆయన బోధించాడు. ఆయన బోధనలు పెక్కు సుబోధములు అంగీకార్యములు. "ప్రపంచము క్షణికము. జీవితము నదీ ప్రవాహామువంటిది, అవిచ్ఛిన్నతయూ ఉన్నది మార్పును ఉన్నది" నదికి అడుగునేల ఉండవలెను. దేవుని గూర్చిన బుద్ధుని మౌనము నాస్తికత కాదు. ఆత్మవిశ్వాసం మీద పురుషప్రయత్నంమీద ఊనిక ఉండవలె అనడమే ఆయనచిత్తం. బౌద్ధమతం భారతదేశంలో పెక్కుశతాబ్దాలు ఉచ్ఛదశలో ఉండి తర్వాత క్షీణించింది. ఆమతం తనజన్మదేశంలో క్షీణించినా, విశ్వమానవులలో ఒకమూడో వంతువాళ్లు ఈనాటికిన్నీ ఆమతాన్ని శిలదాలుస్తున్నారు. భారతీయులు బుద్ధదేవుని అవతారమూర్తిగా స్తుతిస్తున్నారు. శ్రీ వివేకానంద స్వామికి బుద్ధదేవునందుండిన భక్తి అపారము. బుద్ధదేవుడు ఆదర్శకర్మయోగి యని బౌద్ధమతం హిందూమతానికి అనుబంధమే అని శ్రీవివేకానందుల అభిప్రాయం. సాధుపరిత్రాణ - దుష్కృద్వినాశ-ధర్మసంస్థాపనము లనెడి అవతారప్రయోజనాలు మూడు బుద్ధుని చరిత్రలో సుసంపన్నము లయ్యాయి. ఏకము తథ్యము, అనేకము మిథ్య అనుట హిందుసిద్ధాంతం. ఏకము మిథ్య, అనేకము తథ్య మనుట బౌద్ధసిద్ధాంతము. అనేకముగ కనఁగునది ఏకమే అనుటయు, నామరూపములందలి అనేకత్వమును తత్త్వమందలి యేకత్వమును పరస్పర విరుద్ధములు కా దనుటయూ శ్రీరామకృష్ణుని నిర్వాహము. అగాధమైన బుద్ధుని హృదయమును అమోఘమైన శంకరుని ప్రతిభయూ, శ్రీరామకృష్ణునిలో మిళితము లగుట శ్రీవివేకానందస్వామికి ప్రత్యక్షము."

ప్రెసిడెన్సీ కాలేజి ఆంగ్లభాషాశాఖకు మాజీ అధ్యక్షులైన ప్రొఫెస్సరు ఎస్. రామస్వామి గారు బుద్ధదేవుని జీవితోపదేశాలను గూర్చి ఉపన్యసించారు. ఆ ఉపన్యాస సంక్షేపం - హిందూమతంలో జన్మించి దానిలక్ష్యాలు సాధించిన శ్రీరామకృష్ణుడు ఇతరమతసాధనలు కూడా చేసి సర్వమతాల లక్ష్యం ఒక్కటే అనుటను సాక్షాత్కరించుకొని మానవతతికి సమన్వయసమరస మార్గదర్శకు డయ్యాడు. ప్రతిమతంవారు ఇతరమతాలను గుఱించి కూడా తెలుసుకుంటే ఒకరొకరిని 'మ్లేచ్ఛ' లని, 'కాఫిరు' లని, 'విశ్వాసహీను' లని తూలనాడుకోవడం అంతరిస్తుంది. అన్యమతాల దూషణమే స్వమతసేవ అనే పెడబుద్ధి తొలగుతుంది. పరాత్పరునకు పక్షపాతం ఆరోపించడం ఒకరొకరి మతాలను దూషించుకోవడం - పారమార్థిక పరత కానే కాదు. బుద్ధుడు హిందువే అసి హిందువులలో తలమానికం వంటివాడని సదా జ్ఞప్తి ఉంచుకోవాలి. హిందూమతం వీడి మతాంతరానికి మార్పొందినవాడు కాడు బుద్ధుడు. హిందుబౌద్ధమతాల నడిమి చిన్నచిన్న విభేదాలను లెక్కింపరాదు. ఉమ్మడి ఆశయాలమీదే ఊనిక ఉంచాలి. నిష్పాక్షికబుద్ధితో చూస్తే బుద్ధోపదేశాల 'హిందూమూలకత్వం' స్పష్టమౌతుంది. ఉరువేలయొద్ద బుద్ధుడు సాగించిన సాధనాక్రమము లన్ని హిందు సాధనాక్రమములే. బుద్ధుడు ఉపదేశాలద్వారా బోధించినంత మౌనం

చేతనూ బోధించాడు. దేవుని గుఱించి బుద్ధుడు నోరెత్తకపోవడం—ఆవిషయం అనిర్వాచ్యం అని సూచిస్తుందే కాని దేవుడు లేడని సూచించదు. బుద్ధునిచరిత్రం అద్భుతాలతోనిండి అధ్యేతలను రంజింపచేస్తుంది. రాజకుటుంబంలో అవతరించాడు. కొంతకాలం భోగపటలి మఱుగున ఉండినాడు. కాని మానవజీవిత దుఃఖభూయస్త్వం ఎట్లో ఒకట్లు ఆయన కన్ను దాకినది. ఆయనబుద్ధి పరమార్థాన్వేషణ మార్గంలో ముందుకు తఱిమింది. సార్వభౌమ పీఠమునో విశ్వమానవాళిహృదయపీఠమునో అధిష్ఠింప గలడని జోస్యులు చెప్పిన రెంటిలో రెండవది చరిత్రలో నిజమైనది. పెద్దపోటిలో గెలుపొంది ఆయన యశోధరను పెండ్లాడాడు. కాని సంసారుల దుఃఖజీవితాలు చూచినప్పుడు ఆయనడెందము కరగినది. సముద్ధరణాభిలాషచే సంసారమును త్యజించాడు. పెక్కండ్రు బుద్ధుల పరంపరలో ఇతడు కడపటివాడు. ఆయన సాధనలు పండి ప్రబోధం కలిగింది. ప్రథమ ధర్మోపదేశాన్ని సారనాథమునొద్ద కావించాడు. ఆయన సంసారదుఃఖభూయిష్ఠతను నొక్కి చెప్పి, వర్ణవ్యవస్థను నిరసించి, అహింసను బోధించాడు. అహింస పరమధర్మమని అనాదివైదికమతమున్నూ ఘోషిస్తూనే ఉంది. ఆశ అంతరించడమే నిర్వాణం. బుద్ధుని మహిమను పర్యాలోచించే కొద్ది అతనిస్థితప్రజ్ఞతయు బ్రహ్మానుభూతియు స్పష్టమాతాయి. హిందూమతశాఖలలో ఒక్కటే బౌద్ధమతం అనిపిస్తుంది.''

ప్రొఫెస్సరు జి. ఎన్. శేషాద్రిగారి వందనోపచారంతో నాటి సభాకార్యక్రమం ముగిసింది.

## బొంబాయిలో భారతదేశ సింహద్వారంవద్ద శ్రీ వివేకానందస్వాముల ప్రతిమావిష్కారం. 31-5-1971

శ్రీ వివేకానందస్వాముల కాంస్యవిగ్రహం ప్రతిష్ఠితమై బొంబాయినగర సౌభాగ్యాన్ని హెచ్చించింది. అశ్వారూఢ శివాజి ప్రతిమకు చేరువగానే భారతదేశ సింహద్వారంవద్ద 18 అడుగుల ఔన్నత్యంగల పీఠంపై 12 అడుగుల ఉన్నతిగల స్వామిజి కాంస్యవిగ్రహం నెలకొని ఉంది. ఏడేండ్లకృతం స్వామిజి శతవార్షికోత్సవసందర్భంలో సమర్హమైన ఒకస్మారకమును ఏర్పఱచాలి అని రామకృష్ణమిషనువారు సంకల్పించారు. వారు కన్న కలలు ఇప్పుడు ఫలించాయి. ఆవిగ్రహం ఒక వారంరోజులు వస్త్రాచ్ఛాదితమై ఉండినది. పెనువాన కురుస్తూండినా 3000 ప్రజలు హాజరయ్యారు. వారి సన్నిధానమున ముఖ్యమంత్రి మాన్యశ్రీ వి. పి. నాయక్‌గారు విగ్రహాన్ని ఆవిష్కరించారు. కార్పొరేషనువారు ఈ ప్రతిమకూ, చుట్టూ తోటకు చాలిన భూమి నిచ్చారు. విగ్రహం బరువు 1250 కిలోలు. సరిగా 78 ఏండ్లకు పూర్వం ఈతేదినాడే షికాగోవిశ్వమతమహాపరిషత్తులో పాల్గొనడానికి స్వామిజీ బొంబాయి తీరంనుండి తరలాడు. కాబట్టి ఇక్కడ స్వామిజి విగ్రహాన్ని ప్రతిష్ఠించడం ఎంతయూ అనురూపమని ముఖ్యమంత్రిగారు వక్కాణించారు. ఇంకా ఈలా గన్నారు—1863 నుండి 1902 వఱకు సాగిన స్వామిజి జీవితం అల్పకాలముదే ఐనా విశిష్టమహిమాంశములతో నిండినది. దేశభక్తియోగిపుంగవు డన్నారు స్వామిజిని. ఆయన దేశభక్తిని మనం ఈనాడు చర్వణం చేయాలి. మనలను భారతీయులనుగా గుర్తించుకోవడం ప్రథమావశ్యకం. ఐక్యవిచ్ఛే

దకములైన మతభాషాప్రాంతీయాదులైన అభిమానాలను వదలుకోవాలి.''

బొంబాయి రామకృష్ణమిషను అధికారుల పరిషత్తుకు అధ్యక్షులైన డాక్టరు బి. గజేంద్ర ఘడ్కరు సదస్సుకు స్వాగతాభివందనం సమర్పిస్తూ ఈలా గన్నారు — ఇక్కడున్న ఈ స్వామిజీ విగ్రహం ఇప్పటితరంవారికి రాగల తరాలవారికి కూడా ఉత్సాహప్రదంగా ఉండగలదు. స్వామిజి జీవితసందేశాన్ని ఈ ప్రతిమ ఆగంతుకుల కండటికి అందజేస్తుంటుంది. హిందువుల జీవితాదర్శానికి స్వామిజి జీవితమున్నూ ప్రవచనములున్నూ సమగ్రవ్యాఖ్యానాలు. తప్పించుకుపోవడం పారిపోవడమూ— హిందూసిద్ధాంతం బోధించదు. జాతిమతవర్ణాది విభేదాలను పాటించక మానవతతికి సేవ చేయడమే హిందులక్ష్యం, స్వామిజి జీవితలక్ష్యమున్నూ అదే. ఇన్నియేండ్లుగా రామకృష్ణ సేవాసంఘంవారు తమకు ముందుంచుకొన్న లక్ష్యమూ అదే.''

బొంబాయి రామకృష్ణమిషను - ఆశ్రమాల అధ్యక్షులు శ్రీ హిరణ్మయానందస్వాములవారు తమ పరిచయప్రసంగంలో ఇట్లు సెలవిచ్చారు-సంఘజీవితానికి ఆధ్యాత్మికపరతయే గట్టిపునాది ఔతుంది. అదే భారతదేశం ప్రపంచానికి బోధించింది. స్వామిజి మానవస్వభావజ్ఞు డని మానవులందు ప్రీతిగలవా డని కొందరు అంటుంటారు. స్వామిజి చెప్పిన ఒక ఐతిహ్యం నాకు జ్ఞప్తికి వస్తూఉంది. హైందవ తత్త్వజ్ఞు డొకడు గ్రీసుదేశానికి పొయ్యాడట. అక్కడ ఒక గ్రీకుతత్త్వజ్ఞునికి ఇతనికి సమాగమం కలిగింది. 'మీ పరిశోధనావిషయం ఏమి' అని హిందుతత్త్వజ్ఞుడు గ్రీకుతత్త్వజ్ఞణ్ణి ప్రశ్నించాడు. తడుముకోకుండా గ్రీకుతత్త్వజ్ఞుడు ''సందేహం ఎందుకు? మా పరిశోధనకు విషయం మానవుడే'' అన్నాడు. ''దేవునిగూర్చి పరిశోధించకపోయినట్లైతే, మానవునిగురించి ఏం పరిశోధించగలరు?'' అని అడిగాడు హిందుతత్త్వజ్ఞుడు. సారాంశం అదే. దేవుని గురించిన తలంపే మనం కోల్పోయాం. ప్రపంచంలో ఎల్లెడల మనం అనుభవిస్తున్న కష్టాలకు కారణం అదే. ఈ విషయాన్ని మన కెత్తి చూపినవారు శ్రీ వివేకానందస్వాములవారు. కాబట్టే మనం స్వామిజినిగూర్చి చదవాలి, అర్థంచేసుకోవాలి. మనదేశపునర్నిర్మాణానికి సంఘోద్ధరణకూ అదొక్కటే దారి.''

శ్రీరామకృష్ణమఠమిషనుల కేంద్రాధ్యక్షులైన శ్రీ శ్రీ శ్రీ వీరేశ్వరానందస్వాములవారు, విగ్రహావిష్కరణోత్సవస్మారకంగా ముద్రితమైన సంచికను ఆవిష్కరిస్తూ ఆశీర్వదిస్తూ ఈలాగు వ్రాశుచ్చారు. ''భారతమాతృపుత్రవరేణ్యునకు మనమ్రొక్కులు చెల్లించుకునేందుకు ఇక్కడ సమావేశమయ్యాము. ఈ శిష్యవరేణ్యుని గౌరవింప సమావిష్టులమైన మనల నందఱిని ఆయన గురుదేవుడైన శ్రీరామకృష్ణు డనుగ్రహించునుగాక. భారతదేశమువారి సమన్వయశుభసందేశమును పాశ్చాత్యదేశాలవారికి అందజేయడానికై 1893 వ సంవత్సరం మే నెల ఇదే తేదినాడు ఇక్కడనుండి స్వామిజి తరలినారు. అమెరికానుండి ఒకజాబులో స్వామిజి ''ప్రాచ్యదేశాలకు అందజేయవలసిన సందేశం బుద్ధదేవునొద్ద నుండినట్లు పాశ్చాత్యదేశాలకు అందజేయవలసిన సందేశం నావద్ద ఉంది'' అని వ్రాశారు. పొట్టునుండి గింజను వేఱుపఱచండి అని స్వామిజి ప్రజలకు బోధించారు. పారమార్థికపరత అంటే ఏవో సిద్ధాంతాలను సూత్రాలను గుణాలను నమ్మడం మాత్రమే కాదు. సాక్షాత్కారమే సాక్షాద్భగవదనుభూతియే పారమార్థికపరత.

రామకృష్ణమఠమిషనుల జెనరల్ సెక్రెటరి శ్రీ గంభీరానందస్వామి సదస్సుకు వందనోప చారం కావించారు.

గొప్పసంగీతవిద్వాంసులూ సంగీతదర్శకులూ అయిన సుధీరఫాడ్కేగారు స్వామిజీమీద భజనగేయాలు పాడారు.

రామకృష్ణసంప్రదాయానికి సంబంధించిన స్వాములు దాదాపు ఎనుబదిమంది భారత దేశం నలుప్రాంతాలనుండి విచ్చేసి ఈ ఉత్స వంలో పాల్గొన్నారు. 31-5-1971 నాడు విగ్రహావిష్కరణోత్సవానికి ముందు మూడు దినాలు శ్రీరామకృష్ణ - శారదాదేవి-వివేకా నందస్వాములకు జయంతిమహోత్సవాలు జరి గాయి. వరుసగా శ్రీ గంభీరానందస్వాములు శ్రీ కైలాసానందస్వాములు శ్రీ రంగనాథానంద స్వాములు అధ్యక్షత వహించారు. చాలమంది స్వాములు ఉపన్యసించారు. పురప్రముఖవరే ణ్యులు సదస్సు నలంకరించారు.

~~~~

# గ్రంథ పరిచయం

## శ్రీ మల్లికేశ్వరస్తోత్ర పద్యతారావళి

రచయిత: శ్రీ వాకవల్లి సూర్యనారాయణ స్వామి, ప్రాప్తిస్థానములు: (1) శ్రీ దత్తాత్రేయ గీతాశ్రమము, సువాపడా, గంజాంజిల్లా, ఒరిస్సా (2) ఆంధ్ర సాహితీ ప్రచారసభ, కెల్విన్లైన్ $\frac{1}{4}$, తాల్పుకూరుపోస్టు, 24 పర గణాలజిల్లా, పశ్చిమబెంగాలు, పుటలు 13, వెల లేదు. అభిషేకతారావళి 27 పద్యాలు, అందుకు పూర్వాపరాంశగర్భములైన పద్య ములు 13, మొత్తముపద్య సంఖ్య 50. అన్నియు అందములు చిందు కందములే. విశాలమైన యెడారినడిమి పచ్చికపట్టువలె అపభ్రంశ మయమైపోయిన యీనాటి సారస్వతములో సరళసలక్షణమధురమైన యీ చిఱుకృతి విలక్షణమైనది. ఇది వాఙ్మయరూపముదాల్చిన భక్తిప్రవాహమే కావున భక్తిమాధుర్యము సూక్తిమాధుర్యముగ అనుభూత మగుచున్నది. ప్రతిపద్యములోను కృతహస్తత స్పష్టము. ఈ కృతికి స్వాగతము.

## వకుళభూషణనాయకి

### [నమ్మాళ్వారుల జీవితకవితాసాధన]

రచయిత విద్యావిశారద సాహిత్యరత్న భాషాప్రవీణ శ్రీ కె. ఎల్. నరసింహా చార్యులు, ప్రాప్తిస్థానము: శ్రీ గోదాగ్రంథ మాల, ముసునూరు, కృష్ణాజిల్లా పుటలు 66, వెల రూ. 1-50.

పరాంకుశులనియు శఠకోపులనియు నామాం తరములు గల నమ్మాళ్వార్ల జీవితకవితల ప్రశస్తి ఈ గ్రంథము. స్వకీయద్రవిడప్రబం ధంలో శ్రీ నమ్మాళ్వారు తమ్ము నాయకిగను సర్వేశ్వరుని నాయకునిగను అధ్యవసించి భక్తిలో 'మధురభావము'ను పలుదశకాలలో పలికించారు. కాబట్టి ఇక్కడ ఆళ్వార్లను వకుళభూషణనాయకి అని వ్యవహరించడం
~~~~

ప్రాప్తమే. ఈ గ్రంథరచయితలగు ఆచార్యుల వారు ఇతఃపూర్వం కొన్ని గ్రంథాలు సంతరించారు. కాని యీ గ్రంథం వైష్ణవకులకూటస్థులయిన నమ్మాళ్వార్ల గురించినది కావున శ్రీమదాచార్యులవారి డెందమున నిండియున్న వైష్ణవభక్తి ఈ గ్రంథరూపం దాల్చిందనవచ్చు. స్ఖాలిత్యరహితంగాను మాధుర్యభరితంగాను గ్రంథం రూపొందింది. హృదయసంభూతమగుటే కృతిమాధుర్యమర్మం అనడానికి చక్కని లక్ష్యమైన యీ గ్రంథానికి మా అభినందనములు.

ప్రభాకర్

---

## తూర్పుబంగాళంనుండి వస్తున్న లక్షలాది కాందిశీకులకు సాహాయ్యకార్యక్రమం

# విజ్ఞప్తి

తూర్పుబంగాళంనుండి నిలువ నీడ లేక లక్షలాదిగా కాందిశీకులు భారతదేశంలోకి వస్తున్నారనడం మహాజనుల కందఱికీ తెలిసిన విషయమే.

వారికి ఆదుకొని తోడ్పడేందుకై రామకృష్ణమిషనువారు ఆఱు కేంద్రాలలో ప్రతిదినం లక్షపదిహేనువేల ప్రజలకు సేవ సమకూరుస్తున్నారు. కేంద్రాలు మేఘాలయపు పొలిమేరలో (1) దాకి (2) షెల్లా, ఆస్సాములోని కచర్ జిల్లాలో (3) కరీంగంజ్, పశ్చిమబంగాళం జల్పైగురిజిల్లాలో (4) మాణిక్ గంజ్, దినాజ్పూరుజిల్లాలో (5) దాలీమోను, ఇరవైనాల్గు పర్గణాల జిల్లాలో (6) గైఘట. వంటసామగ్రి, అన్నం, అటుకులు, బెల్లపునీరు, వస్త్రాలు, దుప్పట్లు, పాలపొడి, గృహపరికరాలు, మందులు ప్రతిదినం అందజేయబడుతున్నాయి.

మిషనువారు తూర్పుబంగాళప్రజలకై ఈ సాహాయ్యకార్యక్రమాన్ని చక్కగా నిర్వహింపగలందులకు ఉదారమహాజనులను వస్తురూపంగా గాని ధనరూపంగా గాని ధారాళంగా విరాళములు ఈయవలసినదని ప్రార్థిస్తున్నాం. విరాళాలను ఈక్రింది విలాసాలలో దేనికైనా అందజేయవచ్చు.

1. రామకృష్ణమిషను, బేలూరుమఠంపోస్టు, హౌరా, పశ్చిమ బంగాళం.
2. అద్వైతాశ్రమం, 5 డేహీఎన్టాలీరోడ్డు, కల్కత్తా 14.
3. రామకృష్ణమిషను, రామకృష్ణాశ్రమమార్గ, న్యూఢిల్లీ 55.
4. శ్రీరామకృష్ణమఠం, మైలాపూరు, మద్రాసు 4.
5. రామకృష్ణమిషను, ఖార్, బొంబాయి 52.

గంభీరానందస్వామి

జెనరల్ సెక్రెటరి, రామకృష్ణమఠమిషనులు.

# శ్రీరామకృష్ణ ధామృ ము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

పరిశోధితమగు 1121 మహోపదేశములతో, సంగ్రహ జీవితముతో నలరారుచున్నది.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధ గురువులు, లౌకికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు : వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, జీవుడు : దేవుడు, జ్ఞానము: భక్తి: కర్మము, బ్రహ్మతత్త్వము, సూక్తులు: నీతికథలు మున్నగు అంశము లింకా తేటతెల్లముగ పసిబిడ్డలకయిన నవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

...ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూత్రాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి... —ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్వలమగు పంచమ ముద్రణము : వెల : అట్టబైండు : రూ. 4-50
క్యాలికో : రూ. 5-50

# శ్రీ రామకృష్ణోపనిష

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణదేవుని దివ్యోపదేశవాక్యము లాధారముగాగొని, వానిని విరివిపఱచి, మనోహరకథారూపముగను, సంభాషణరూపముగను అమర్చి, శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారిగారు తమిళభాషలో రచించిన జనాకర్షకగ్రంథము. దాని యనువాదాలు ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతి, హిందీభాషలలో నిప్పటికే అపారవ్యాప్తినొందినవి. ఆ గ్రంథమున కిది చక్కని ఆంధ్రీకరణము.

128 పుటలు వెల : రూ. 1-25

ప్రతులకు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# జ్ఞానయోగము

అనువాదకులు :
కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు    రెండవ కూర్పు    వెల : రూ. 4-00

నూతన ముద్రణము !    ఇప్పుడే వెలువడినది !

# రాజయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయ భాగము–రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)    ఆఱవ కూర్పు    వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు—4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౮ ౧౯౭౧ - ఆగస్టు : విరోధికృత్తు - శ్రావణము సంచిక ౨

## విషయసూచిక

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హాగ్లి) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.'
(సండే స్టాండర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి: 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

590+158 పుటలు                    వెల: రూ. 7-50

# ప్రబోధరత్నాకరము

అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు

శ్రీ వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

232 పుటలు                    మూడవ కూర్పు                    వెల: 2-50

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4




'అఖిలవిభు శరణొందుము, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.



# శ్రీరామకృష్ణ ప్రభ



సంపుటము ౨౮ } ౧౯౭౧ – ఆగస్టు : : విరోధికృత్తు – శ్రావణము { సంచిక ౨

శ్రీః

## వివేకచూడామణి

మూలము :
శ్రీ శంకర భగవత్పాదులు

వ్యాఖ్యాత :
అన్నమాచార్య

అతో ఽస్య జీవభావో ఽపి నిత్యా భవతి సంసృతిః
న నివర్తేత తన్మోక్షః కథం మే శ్రీగురో వద. 193

అందువలన పరమాత్మకు గలుగు జీవభావము నిత్యమే యగుచున్నది. సంసారమునకు నివృత్తి యుండదు. కావున నాకు మోక్ష మెట్లు? ఓ గురుదేవా, ఆనతిమ్ము. ౧౯౩

శ్రీగురు రువాచ :—

సమ్యక్పృష్టం త్వయా విద్వన్ సావధానేన తచ్ఛృణు
ప్రామాణికీ న భవతి భ్రాన్త్యా మోహితకల్పనా. 194

గురువు చెప్పుచున్నాడు:—

ఓ విద్వాంసుడా, బాగున్నదోయి నీ ప్రశ్న; కావున ఎచ్చరికతో ఆలకింపుము:— భ్రాంతిచే కావింపబడిన కల్పన ప్రామాణికము కాజాలదు. ౧౯౪

భ్రాన్తిం వినా త్వసఙ్గస్య నిష్క్రియస్య నిరాకృతేః
న ఘటేతార్థసమ్బన్ధో నభసో నీలతాదివత్. 195

ఆకాశమునకు నీలత్వాదు లున్నట్లు అజ్ఞులు కల్పించినను, నిక్కమున కవేవియు లేవు కదా. అట్లే అసంగుడును నిష్క్రియుడును నిరాకారుడునగు పరమాత్మకు దృశ్యవస్తువులతో సంబంధ మున్నట్లు భ్రాంతిచే కనిపించినను, నిజమునకు అది పొసగదు. ౧౯౫

స్వస్య ద్రష్టు ర్నిర్గుణ స్యాక్రియస్య ప్రత్యగ్బోధానన్దరూపస్య బుద్ధేః
భ్రాన్త్యా ప్రాప్తో జీవభావో న సత్యో మోహాపాయే నా స్త్యవస్తుస్వభావాత్. 196

ద్రష్టయు నిర్గుణుడును క్రియారహితుడును జ్ఞానానందస్వరూపియునగు ఆత్మకు, బుద్ధితోడి తాదాత్మ్యాభిమానరూపమగు భ్రాంతివలన కలిగిన జీవత్వము సత్యము కాదు. మోహము తొలగిన క్షణముననే అసత్తైన జీవత్వమును తొలగుచున్నది. ౧౯౬

యావద్భ్రాన్తి స్తావ దే వాస్య సత్తా మిథ్యాజ్ఞానోజ్జృమ్భితస్య ప్రమాదాత్
రజ్జ్వాం సర్పో భ్రాన్తికాలీన ఏవ, భ్రాన్తే ర్నాశే నైవ సర్పో ఽపి తద్వత్. 197

భ్రాంతియున్నంతసేపు భ్రాంతికల్పితవస్తువు నుండును. త్రాటిని జూచి పామను కొనుచున్నంతసేపు పాముండును. ఆ భ్రాంతి తొలగినంతనే పాము అదృశ్యమగును. అట్లే ఇచ్చటను. ౧౯౭

అనాదిత్వ మవిద్యాయాః కార్యస్యాపి త థేష్యతే
ఉత్పన్నాయాం తు విద్యాయా మావిద్యక మనాద్యపి 198

ప్రబోధే స్వప్నవ త్సర్వం సహమూలం వినశ్యతి
అనాద్యపీదం నో నిత్యం ప్రాగభావ ఇవ స్ఫుటమ్. 199

ఒకవస్తువు పుట్టుటకు ముందు అది లేదు కదా. ఎన్నాళ్లుగా లేదు? అనాదికాలముగా లేదు. కావున ఆ లేమి అనాది. అయినను ఆ వస్తువు పుట్టినంతనే దానిలేమి అంతరించును. కావున ఆదిలేనిదానికి అంతము నుండదను నియతి లేదు. అవిద్యయు విజ్ఞానమయకోశమును అనాదులే. ఐనను మెలకువ కలుగగనే నిద్రయు దానివలన గలుగు స్వప్నమును అంతరించిపోవునట్లు, బ్రహ్మజ్ఞానము గలిగినంతనే, అవిద్యయు దానివలన గలిగిన విజ్ఞానమయకోశమును అంతరించును. ౧౯౮,౧౯౯

అనాదే రపి విధ్వంసః ప్రాగభావస్య వీక్షితః
యద్బుద్ధ్యుపాధిసమ్బన్ధా త్పరికల్పిత మాత్మని 200

జీవత్వం న తతో ఽన్య స్తు స్వరూపేణ విలక్షణః
సమ్బన్ధ స్త్వాత్మనో బుద్ధ్యా మిథ్యాజ్ఞానపురస్సరః. 201

ఇంతవఱకు లేనట్టి దిప్పుడు పుట్టగానే దాని 'లేమి' ముగిసిపోవుచుండుటను ప్రత్యక్షముగ గాంచుచున్నాము. బుద్ధ్యుపాధిసంబంధమువలన ఆత్మయందు కల్పితమైన జీవత్వము మిథ్య. అట్టిది కాదు ఆత్మ. దాని స్వరూపము విలక్షణము. బుద్ధ్యాత్మసంబంధము మిథ్యాజ్ఞానహేతుకము. ౨౦౦,౨౦౧

వినివృత్తి ర్భవే త్తస్య సమ్యగ్జ్ఞానేన నాన్యథా
బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానం సమ్యగ్జ్ఞానం శ్రుతే ర్మతమ్ 202

మిథ్యాజ్ఞానమును నివర్తిల్ల జేయునది సమ్యగ్జ్ఞాన మొక్కటే, వే తేదియు కాదు. ఉపనిషన్మహావాక్యానుసారము బ్రహ్మాత్మైకత్వము నెఱుగుటే సమ్యగ్జ్ఞానము. ౨౦౨

త దాత్మానాత్మనో స్సమ్య గ్వివేకే నైవ సిధ్యతి
తతో వివేకః కర్తవ్యః ప్రత్యగాత్మసదాత్మనోః. 203

ఇది ఆత్మ అని ఇది అనాత్మ అని వివేచించుటచేతనే ఆ సమ్యగ్జ్ఞానము గలుగును. కావున ప్రత్యగాత్మను నిత్యాత్మను వివేచించుటే కర్తవ్యము. ౨౦౩

జలం పఙ్కవ దస్పష్టం పఙ్కాపాయే జలం స్ఫుటమ్
యథాభాతి, తథాత్మాపి దోషాభావే స్ఫుటప్రభః. 204

బురదతోగూడియున్న నీట తేటదన ముండదు. బురదను తొలగించినంతనే నీరు తేటపడును. అట్లే అనాత్మతోడి తాదాత్మ్య మనెడి దోష మున్నంతవఱకు ఆత్మ ప్రకాశింపదు. ఆ దోషము తొలగినంతనే స్ఫుటముగ ప్రకాశించును. ౨౦౪

అసన్నివృత్తౌ తు సదాత్మనా స్ఫుటం ప్రతీతి రేతస్య భవే త్ప్రతీచః
తతోనిరాసః కరణీయ ఏవ సదాత్మన స్స్యాదహమాది వస్తునః. 205

అసత్తు నివర్తిల్లగానే సదాత్మకు స్ఫుటప్రతీతి గల్గును. కావున ముముక్షువు అహంకారాది దేహాంతములైన యసత్పదార్థముల నెల్ల ఇది ఆత్మ కాదు, ఇదియు కా దనుచు త్రోసిరాజనవలయును. ౨౦౫

అతో నాయం పరాత్మా స్యా ద్విజ్ఞానమయశబ్దభాక్
వికారిత్వా జ్జడత్వాచ్చ పరిచ్ఛిన్నత్వహేతుతః
దృశ్యత్వా ద్వ్యభిచారిత్వా న్నానిత్యో నిత్య ఇష్యతే. 206

ఈ విజ్ఞానమయకోశము పరమాత్మ కాజాలదు. ఏల యన, పరమాత్మ నిత్యము. ఈ విజ్ఞానమయకోశ మనిత్యము. దీనికి జననమరణాదివికృతు లున్నవి. ఇది జడము, పరిచ్ఛిన్నము, దృశ్యము, వ్యభిచరణశీలము. అనిత్య మెన్నటికిని నిత్యము కాజాలదు. ౨౦౬

ఆనన్దప్రతిబిమ్బచుమ్బితతను ర్వృత్తి స్తమోజ్జృమ్భితా
స్యా దానన్దమయః ప్రియాదిగుణక స్స్వేష్టార్థలాభోదయః
పుణ్య స్యానుభవే విభాతి కృతినా మానన్దరూప స్స్వయం
భూత్వా నన్దతి యత్ర సాధుతనుభృన్మాత్రః ప్రయత్నం వినా. 207

బుద్ధివృత్తియం దాత్మానందము ప్రతిబింబితమైనప్పుడు దానినే ఆనందమయకోశ మందురు. 'తస్య ప్రియ మేవ శిరః, మోదో దక్షిణః పక్షః, ప్రమోద ఉత్తరః పక్షః ఆనన్ద ఆత్మా' అను శ్రుతియందు చెప్పియున్నటుల ఇష్టదర్శనమువలన గలుగు 'ప్రియము'ను, ఆవస్తు ప్రాప్తివలన గలుగు 'మోదము'ను, ఆవస్త్వనుభూతివలన గలుగు ప్రమోదమును ఆనంద మయకోశమున కంగములు. దర్శనప్రాప్త్యనుభవములు కలిగినప్పుడు కలుగుచును వేఱప్పుడు లేకయు నుండునది కావున ఈ యానందమయకోశ మనిత్యము. ధన్యులకు పుణ్యఫలానుభవ మప్పు డప్రయత్నముగానే కల్గు ఈ యానందము దర్పమునకు ధర్మోల్లంఘనమునకు దారి తీయును కావున ఇది పరిత్యాజ్యమైన తామసవృత్తి. ౨౦౭

ఆనన్దమయకోశస్య సుషుప్తౌ స్ఫూర్తి రుత్కటా
స్వప్నజాగరయో రీష దిష్టసన్దర్శనాదినా. 208

స్వప్నదశయందును జాగ్రద్దశయందును అన్యవృత్తు లీయానందమును ఖండించు చుండును. సుషుప్తిదశలో ఆ యాటంకములు ప్రసక్తింపనందున అప్పుడు దీని స్ఫురణ ముత్కటముగా నుండును. ౨౦౮

# పరమహంస దేవుని ప్రబోధవాణి

పొరుగువా డడిగిన ప్రశ్న—మహాశయా, గృహస్థజీవితమును గడపుచునే భగవత్సాక్షాత్కారము నొందుట ఎన్నటికేని సాధ్య మగునా ?

శ్రీరామకృష్ణుడు—తప్పక సాధ్యమే. కాని ఇప్పుడే చెప్పితిని కదా! సాధుగోష్ఠియం దుండ వలయును, నిరంతరప్రార్థనము సాగు చుండవలయును. భగవంతునికై విలపింప వలయును. మనోమాలిన్యము లీ రీతి క్షాళిత ములు కాగానే భగవత్సాక్షాత్కారము గలుగును. మనస్సు బురదలో మునుగుపడిన సూదివంటిది, దేవుడు అయస్కాంతమువంటి వాడు. బురదకప్పు తొలగిననే కాని సూది అయస్కాంతమువంక కాకృష్టము కాజాలదు. కామక్రోధలోభాదులును ఐహికభోగాభిరతి యునే బురద, ఆబురద కన్నీటిచే క్షాళిత మగును. బురద క్షాళితము కాగానే, అయ స్కాంతము సూదిని ఆకర్షించును. అనగా మానవునకు భగవత్సాక్షాత్కారము కలుగును. విశుద్ధహృదయులకే ఆసాక్షాత్కారము గలు గును. జ్వరగ్రస్తుని దేహములో మితి కెక్కు

డుగా నీరు చేరియున్నచో, ఆనీటిని వెలువ రింపనిదే, కైవ్యనామాత్ర మేమి చేయగలదు ?

సంసారిగ నున్న మాత్రమేమి ? భగవ త్సాక్షాత్కారము ఏల కలుగగూడదు ? ఐనను-నే జెప్పినటుల-సత్సంగమును, దైవప్రార్థన మును, భగవదనుగ్రహమునకై విలపించుటయు అప్పుడప్పుడేకాంత వాసమును-ఆవశ్యకములు. అందలు నడచు దారిలో నుండు వృక్షాంకుర ములను పశువులు మేసిపోకుండుటకై కొంత కాలము వానిచుట్టును కంచె యుండవలయును.

పొరుగువా డడిగిన ప్రశ్న—గృహస్థులకు గూడ భగవత్సాక్షాత్కారము గలుగుననన్న మాట ! అంతేనా ?

శ్రీరామకృష్ణుడు- ప్రతియొక్కనికిని మోక్షము తప్పక కలిగితీరును. కాని అతడు గురూపదిష్టమార్గము ననుసరింపవలెను. చుట్టు దారిని బడెనేని, సరిదారికి వచ్చుటకు శ్రమ పడును. ముక్తి లభించుటకు విలంబము కలు గును. ముక్తి ఈ జన్మములో లభింపక పోవచ్చు, భగవత్సాక్షాత్కారము పెక్కు జన్మ ముల కనంతరము లభింపవచ్చు. జనకాది రాజర్షులు ప్రాపంచిక విధులను నిర్వర్తించు చునే యుండిరి. నెత్తిపై కుండలనో తట్టలనో పేర్చుకొని నర్తించు నర్తకివలె, వారు భగవం తుని తమ నెమ్మనములలో పదిలముగ నిలుపు కొని ప్రాపంచికవిధుల నిర్వర్తించుచుండిరి. తలపై నీటికుండలను మోయుచు నవ్వుచు మాటాడుచు చనుచుండు మహిళలను వాయవ్యభారతమున నీవు చూడలేదా ?

'మ' అడిగిన ప్రశ్న ఈ లోకమున మనము జీవితము నెట్లు గడపవలయును ?

శ్రీరామకృష్ణుడు—నీకు విహితములైన కృత్యముల నన్నింటిని నిర్వర్తింపుము. మన స్సును మాత్రము దేవునిపై నిల్పుము. భార్యతో బిడ్డలతో తండ్రితో తల్లితో అందఱితోను గూడ వసింపుము. వారికి సేవ చేయుము. అత్యంతము ప్రీతిపాత్రులనుగా వారిని జూడుము. కాని నీయంతరంగమున మాత్రము వారు నీకు సొంతము కారు అని తెలిసికొనుము.

ఒక భాగ్యవంతునింటి పరిచారిక ఆ యింటి పనుల నన్నిటిని జేయును కాని, సొంతగ్రామము లోని స్వగృహముపైని తలంపులను వీడదు. ఆ భాగ్యవంతుని బిడ్డల నామె తనబిడ్డలను బోలెనే సాకును. వారినిగూర్చి చెప్పునప్పుడు 'నారాముడు' 'నాహరి' అనియే చెప్పు చుండును. కాని యంతరంగమున మాత్రము వారు తనబిడ్డలు కానే కారను విషయము ఆమెకు బాగుగ తెలియును.

తాబేలు నీటిలో నటునిటు తిరుగుచుండును గాని, దాని తలంపులు దేనిమీద నున్నవో ఊహింపవచ్చును. దాని తలంపులు గట్టుపై నున్నవి. ఆ గట్టుపై నున్నవి దాని యండ ములు. లోకములో నీ విధుల నన్నింటిని నిర్వ ర్తింపుము. మనసును మాత్రము దేవునిపై నుండనిమ్ము.

ముందుగా భగవద్భక్తి నలవఱచుకొనక లోకమున ప్రవేశింతువేని నీకు ప్రతిబంధక ములు నానాటికిని హెచ్చుచుండును. అందలి యిడుములు పరితాపములు ఏడుపులు నిన్ను ముంచివేయును. *ఐహిక విషయములను నీవు ధ్యానించుకొలది నీకు వానియందు సంగ మెక్కువగుచుండును.

* ధ్యాయతో విషయాన్ పుంస స్సఙ్గ స్తేషూపజాయతే. భగవద్గీత II. 62

మొదట నీచేతులకు నూనె పట్టించుకొని, అటుపిమ్మట పనసపండును తఱుగుము. లేకున్న దాని పాలజిగట నీ కంటుకొనును. మొదట దివ్యమగు ప్రేమతైలమును గడించుకొనుము, అటుపిమ్మట నీ లౌకికవిధులకు గడంగుము.

కాని ఆ దివ్యప్రేమ సిద్ధింపవలయు ననిన ఏకాంతవాస మావశ్యకము. పాలనుండి వెన్నను తీయవలెననిన, మొదట ఆ పాలను ప్రత్యేకస్థలమున తోడబెట్టవలయును. పాల నెక్కువగ కలియబెట్టిన, అది పెరుగు కానేఱదు. పెరుగైన పిదప నీవు తక్కిన పనులను విడిచి, ప్రశాంత స్థలమున కూర్చుండి పెరుగును చిలుకవలయును అప్పటికిగాని నీకు వెన్న లభింపదు.

అదియునుగాక ఏకాంతమున దేవుని ధ్యానించుటచేత చిత్తమునకు జ్ఞానమును వైరాగ్యమును భక్తియు అలవడును. ఆ చిత్తమే లౌకికాసక్తికి లోనైనయెడల అధఃపతనము గాంచును. ఈ లోకములో ప్రతివ్యక్తికి నుండునది * కామినీకాంచనముల స్మృతియొక్కటే.

లోకము నీటివంటిది, మనస్సు పాలవంటిది. పాలను నీటిలోపోసిన రెండు నేకమగును. అటు తర్వాత అప్పటమైన పాలు నీకగపడదు. అట్లు కాక, పాలను పెరుగుగాచేసి, ఆ పెరుగును చిలికి వెన్నగాచేయుము. ఆ వెన్నను నీటిపై నుంచిన, అది తేలును. కావున ఆధ్యాత్మిక సాధన నేకాంతమున చేసి భక్తిజ్ఞానము లనెడి వెన్నను గడింపుము. ఆ వెన్నను నీవు ఈలోకమనెడి నీటిపైనుంచినను, అది తేలునేగాని, నీటితో కలిసిపోదు.

ఇందుతోబాటు నీవు సారాసారవివేచనము నభ్యసింపవలయును. కామినీకాంచనములు నశ్వరములు. దేవు డొక్కడే నిత్యుడు. ధనము వలన మానవున కేమికలుగును? అన్నవస్త్రములు లభించును, నిలువనీడ లభించును, అంతే. అంతకన్న నెక్కువ ఏమియు లేదు. దేవుని సాక్షాత్కరించుకొనుటకు నీకు ధనము తోడ్పడజాలదు. కావున ధనమునకు జీవితలక్ష్యముగ నుండు నర్హత ఎప్పుడుకాని లేనేలేదు. వివేచించు క్రమమిది. తెలిసినదా?

మంచి తము.

* ఆధ్యాత్మికపురోగతికి ప్రతిబంధకములను పేర్కొనునప్పుడు శ్రీరామకృష్ణుని యమృతవాక్కున 'కామినీకాంచనము'ల ప్రస్తావము మాటిమాటికిని వచ్చుచుండును. కాని ఆపదములను అపార్థము చేసికొనుటయు తఱచు జరుగుచుండును. 'కామినీ' శబ్దమునకు 'కామము' అనియు 'కాంచన' శబ్దమునకు లోభము అనియునే అర్థము. అవేకదా ఆధ్యాత్మికాభివృద్ధిని వెనుకకు నెట్టునవి. మగవారిని దూరముగ పెట్టుడని స్త్రీలకును, స్త్రీలను దూరముగ బెట్టుడని పురుషులకును శ్రీరామకృష్ణుడు బోధించియున్నాడు. కావున 'కామినికి లోబడకు' మన్నప్పుడు 'కామమునకు లోబడకు' మనుటే ఆయనహృదయము. అట్లే కాంచనము (=బంగారు) లోభవాచకము. ఆధ్యాత్మికజీవితమున రెండవయడ్డంకి లోభము గదా! స్త్రీనిగాని స్త్రీజాతినే గాని ద్వేషింపు డని శ్రీరామకృష్ణుడు శిష్యుల కుపదేశింప లేదు. ఈ శీర్షిక క్రింద నున్న యాయన బోధనల నెల్ల సమష్టిగ పరిశీలించిన, ఈ విషయము స్పష్టపడును. మహిళలు జగన్మాతృ ప్రత్యక్షరూపము లని గదా గురుదేవుని భావన. తాను తంత్రసాధనలు చేయునప్పుడు తనకు గురుస్థానమున, ఆయన ఒకానొక మహిళనే ప్రతిష్ఠించుకొన్నాడు. ఆయనసతి, మాతృదేవి శ్రీశారద, ఆయనకు నిత్యసహచారిణియు, ప్రథమశిష్యయు. తన యాధ్యాత్మికసాధనల పరిసమాప్తిసమయమున ఆయన, శారదను కాళీమాత దాల్చిన ప్రత్యక్షరూపముగా గుర్తించి ఆరాధించెను. ఆయన నిర్యాణానంతరము శ్రీశారదామాత అసంఖ్యాకు లయిన గృహస్థులకు మాత్రమే కాక, శ్రీరామకృష్ణసంస్థలోని సాధువులకు సైతం మెందఱికో ఆధ్యాత్మిక మార్గదర్శకురా లయ్యెను.

# వ్యాసస్తుతి

శ్రీ కూరెళ్ళ రామ నరసింహారావుగారు

క. వ్యాసు, మహోజ్జ్వలకీర్తివిలాసుని, సుకవీంద్రహృదయలలితాంభోజా
వాసుని, సురుచిరహాసు, నుపాసింతును భక్తితోడ స్వాంతమునందున్.

గీ. చేతనాచేతనాన్వితసృష్టికెల్ల సారసనముద్భవుఁడు గాఁడె కారణుండు?
భాసురపురాణవేదప్రపంచమునకు శిష్టపూజ్యుండు వ్యాసుఁడు సృష్టికర్త.

ఉ. మానవకోటికెల్ల ఋజుమార్గముఁ జూపి తరింపఁజేయు వి
జ్ఞానము జ్ఞానము న్నొసఁగు సత్కృతులన్ రచియించినట్టి య
క్షీణయశస్వి వ్యాసమునిశేఖరుఁ బావనసాత్త్వికాకృతిన్
ధ్యాన మొనర్తు భక్తిని సదా జగదభ్యుదయంబు గోరుచున్.

చ. కవితయు యోగ మొక్కటె జగంబున నంచును దెల్పఁగా, ముని
ప్రవర, రచించినాఁడవు పురాణములన్ నిగమంబులన్ గథా
నివహము, శేషశాయియును నీ వొకరూప మటంచు సాధుపుం
గవులు నినున్ స్మరించుచుఁ ద్రికాలములందున నీకు మ్రొక్కరే?

క. సురలకు నమృతం బొసఁగెను కరివరదుఁడు తొల్లి, నీవు కవితామృతమున్
ధరణీజనముల కొసఁగితి, వరయఁగ మీ రొక్కరూపె, వ్యాసమహర్షీ.

మ. అదియే కృష్ణుఁడు, అలమంద లవిగో, ఆతండె యక్రూరుఁడున్,
అదియే గోపసతీవ్రజం, బదియె బృందారణ్యమున్, రాసలీ
లదిగో—భాగవతప్రబంధమున మా కానందము న్గూర్చుచున్
ఎదుట న్గన్పడుచుండె నిప్పటికి నీసృష్టిన్ మహాప్రాభవా.

శా. కాలాతీతుఁడ వయ్యు నేఁటికిని నీ గ్రంథంబు లత్యంతశో
భాలాలిత్యముతో విరాజిలెడి యావద్ధారుణీమండలిన్
వేలీలన్ వినుతింతు నిన్ను మునిరాజేంద్రా, త్వదీయంబు వా
గ్జాలం బెల్లను గాదె! నీ కిదె నమస్కారంబు గావించెదన్.

# రామకృష్ణానందస్వామి చరితోపోద్ఘాతము

## శ్రీమత్కైలాసానందస్వామి

అవతారపురుషుని జీవితము అద్భుతరస నిబిడమగు నొక యితిహాసమును బోలినది. ఆ మహాపురుషుని లీలానాటకమున పాల్గొను నవతారసహాయుల జీవితమును అట్లే ఆశ్చర్య కావ్యముగ చవులూరుచుండును.

శ్రీరామకృష్ణుడు నిర్వహించిన జగదుజ్జీవన మహాకార్యమునకు స్వకీయ పరమహంసానుభూతియే మూలాధారముగ నుండినది. ఆ మహాకార్యమును నిర్వర్తించుటలో నానారీతుల సహకరించు మహాభాగ్యమును బడసి కృతార్థులైనవారు ఆయనగారి ప్రత          లు.

వారిలో శిఖర మనదగినవాడు జ్ఞాన దిగ్విజ ము చేసిన శ్రీవివేకానందస్వామి. ఆయన సోదరశిష్యులు, పదిపదునైదుగురు తమ యొడళ్ళను వితములను ప్రాణములను స్వామిజి నిర్ణయించిన కార్యప్ర
అర్పణము చేసిరి.

అట్టి వీరిలో ఒకరు రామకృష్ణానందస్వామి. దక్షిణ భారతమున ఆధ్యాత్మికోద్యమమును వర్ధిల్లజేయుటకే ఈయన శ్రీవివేకానందస్వామిచే నియమింపబడెను. స్వామిజి నియమమును ఈయన సక్రమముగా వాంఛితాధికముగా నిర్వహించి దక్షిణ భారతదేశమునకు మహోపకారము గావించెను. దక్షిణభారతమున శ్రీరామకృష్ణోద్యమమునకు బీదమును నాటినది శ్రీవివేకానందస్వామి. దానిని విశ్వజనాశ్రయముగ వర్ధిల్లజేసినది శ్రీరామకృష్ణానందస్వామి. ఈయనలో వెలుగొందిన అనుగ్రహ ప్రభావప్రకారములు పెక్కులు. ఆదర్శ సన్న్యాస మార్గమునకు రామకృష్ణానంద స్వాముల జీవిత ముత్తమలక్ష్యము. ఈయన జీవిత విశేషములను దక్షిణ భారతదేశీయులు ఎఱిగి అనుసంధించుట వారికి ఆధ్యాత్మిక శ్రేయఃప్రద మని వానిని ఈ ప్రాంతీయ భాషలలో ప్రకటించుచున్నారము. వారు ఈ సారస్వతమును అనంత శుభఫలముల బడయుదురు గావుత మనుట మా ప్రార్థన.



# శశిసాంత్వన వచస్సుధాశీకరములు

ఈ ప్రాపంచికబంధమునుండి విడుపొందుటెట్లని కదా నీప్రశ్న! వేనవేల జన్మములలో సంచితమైన దాని నొక్కదినమున రూపుమాయజేయ శక్యమా? ఈ సంసారవాగుర నుండి ఈక్షణముననే తప్పించుకోజూడవలెనను నీయాశయము సమంజసమైనదే. అత్యంత ప్రేమాదరములతో మనల నావరించియుండు మనకుటుంబమునుండి మృత్యుదేవత మనల ఏ నిమిషమున లాగుకొనిపోవునో ఎవ్వ డెఱుగును? అట్లని మన మున్నట్టుండి యొకనాడు ఆపాతముగ ఒకనిశ్చయము చేసికొన్నంత మాత్రమున ఉపయోగ ముండదు. శ్రేష్ఠమైన మార్గ మిది - బాలురు తమ కేమి సాయముకావలసినను అందుల కంతటికిని తల్లిదండ్రులనే నమ్ముకొనియుందురు గదా. అట్లే నీవు శ్రీకృష్ణుని నమ్ముకొనియుండుము.

నీమనస్సు నేకాగ్రముగ శ్రీకృష్ణునందు నిలిపి ఆయన నిన్ను ఏస్థితియం దుంచినను అందే సంతుష్టుండవై యుండ నలవఱచుకొనుము.

ఈశ్వరుడు నిన్నుంచినచోట శాంతచిత్తుడవై యుండుము. శ్రీరామకృష్ణుని సూక్తులను జదువుము, మననము సేయుము. ''లేత మొక్కకు చుట్టు కంచెకట్టి మిక్కిలి జాగ్రత్తతో కనుపెట్టి యుండవలెను. లేనిచో అది మేకలపాల బడును. ఆ మొక్క ఎదిగి వృక్షరూప మొందినప్పుడు దాని విశాలశాఖల నీడ నాశ్రయించి ఎన్ని మేకలైనను విశ్రమింప వచ్చు'' నని ఆయన చెప్పుచుండువాడు. కావున అదృష్టవశమున నరుని మానసమున నించుక శ్రద్ధయు విరక్తియు నంకురించెనేని, అత డైహిక జనసంపర్కమును విడనాడి ఆ యంకురములను అత్యంత జాగరూకతతో పోషించి పెనుపవలయును. కాని అవి అంతరంగమున సుస్థిరముగ పాదుకొన్నపిదప వాని నెవ్వరును కదల్పజాలరు.

మంచి పుస్తకములు చదువుము. 'ది ఇమిటేషన్ ఆఫ్ క్రైస్ట్' ('క్రైస్తు ననుకరించుట') అనునది సద్గ్రంథములలో ఒకటి. అది నీకు మనశ్శాంతిని చేకూర్పగలదు. ఈశ్వరునికిని జీసుక్రైస్తునకును యథార్థభక్తుడగు థామస్ ఎకెమ్పే రచించిన యీ యమూల్యగ్రంథమున ప్రతిపుటలోను శాంతిప్రదములును భక్తియుక్తములు నగు వాక్యరత్నము లెన్నియో నీ కవశ్యము కానవచ్చును. వానిని నీ హృదయ ఫలకముపై హత్తించి యుంచుకొనుము.

మానవునకును మృగమునకును గల ముఖ్య భేదమిది – నిలువనీడయు తినతిండియు దొరకు చున్నంతవఱకు పశువు మఱొకచోటికి పోగోరదు. మానవ నామార్హుడు అట్లుకాక ఉన్నతస్థితుల నందగోరుచుండును. ఉన్నతాదర్శాల సిద్ధికై తహతహపాటుతో నిర్విరామముగా ఉద్యమించుచుండుటే' మానవ నామార్హునిలో గల విశేషము. ఉత్తములు కాగోరువారందఱును, మహాత్ము లొందగోరువారందఱును,

సర్వధర్మాన్ పరిత్యజ్య
మా మేకం శరణం వ్రజ.

(సర్వధర్మములను పరిత్యజించి న న్నొక్కనినే ఆశ్రయింపుము) అను నీతిసూత్రము ననుసరించి జీవించుటే గమ్యముగా నుంచుకోవలయును.

మన మందఱము భగవంతునే చేరబోవు చున్నాము. కాని మన త్రోవలు వేఱు. ప్రతివాడును తన త్రోవను తానే ఏర్పఱచుకొని యీశ్వరుడు తనకు ప్రసాదించిన సాధనముల నుపయోగించుకొని పయనము సాగింపవలెను.

మన మందఱమును మనలను బంధించి యుంచు సంకెళ్ళను భేదించుకొనవలెను. కాని యున్నట్టుండి తటాలున యొకదెబ్బకు సంకెలలు తెగిపోవుట నెచ్చటనైన చూచి ఎఱుగుదువా! వానిని భేదింప నెంచితివేని, సందీక దెబ్బమీద దెబ్బ పెక్కు దెబ్బలు కొట్టవలెను. ఆకస్మికముగ నిర్వర్తితమైన యొక పనిచే సత్ఫలము గలుగుట వాడుకలో లేదు. వైరాగ్యము నీలో పోటెక్కినప్పుడు తక్కిన బంధము లన్నియు దుర్బలములై సంసారవృక్షమునకు నిన్ను అంటిపెట్ట నసమర్థము లగును. అప్పుడు ముదుర మాగిన పండువలె నీవు భగవంతు నొడిలోనికి రాలి పడుదువు.

# శ్రీ రామకృష్ణానందస్వామి సంస్మృతి

)రామకృష్ణుని శిష్యులలో అనితరసాధారణమహిమాన్వితుడు ప్రథమగణ్యుడు శ్రీవివేకానందస్వామి యనుట నిస్సందేహము. శ్రీరామకృష్ణసందేశోద్ఘాటనమును శ్రీరామకృష్ణోద్యమప్రారంభమును శ్రీ వివేకానంద స్వామి నిర్వహించిన కార్యములే. మిఱుమిట్లు గొలుపు ఆయనకీర్తిసముజ్జ్వలతలో ఆయనతో సహకరించి ఈ యుద్యమమునకు వేరులు పాఱించిన సోదరశిష్యుల మహిమలు లోకుల కనుదాకవాయెను. ఈ సోదరశిష్యులలో ఒక్కొక్కడును శ్రీరామకృష్ణుని యాశీస్సుల బడసినవాడే, ఆధ్యాత్మికనిశ్రేణిలో చాలపైమెట్లధిరోహించినవాడే. అందులో కొందఱు విపులాగాధవైదుష్యమండితులు. శ్రీరామకృష్ణానందస్వామి అట్టివారిలో నొకడు.

పూర్వాశ్రమమున ఆయన పేరు శశిభూషణ చక్రవర్తి. 1863-వ సంవత్సరమున వంగరాష్ట్రమున హుగ్లిజిల్లాలో సనాతనాచారనిష్ఠమైన యొక బ్రాహ్మణకుటుంబమున జన్మించెను. ఆయనతండ్రి ఆచారనిష్ఠాసంపన్నుడే కాక లోకమాత్రుపాసకుడుగను ఉండెను. కావున శశికి ఆచారపరతయు భక్తియు శైశవముననే అలవడెను. చదువుకై కల్కత్తాకు పోవలసివచ్చుటచే అతనిభక్తిప్రవణతల కించుక అంతరాయము గల్గినను, ఈవిచ్ఛేదము కేవలము తాత్కాలికమే. కళాశాలలో అతని ప్రతిభ సాటిలేనిదై వెలుగొందెను. కొంతకాలమతడు చదువులో తదేకతానముగ నిమగ్నుడై యుండెను. కాని ఆధ్యాత్మికమైన యశాంతికిలోనై అతడు మతగ్రంథముల జదువనారంభించెను. శ్రీ కేశవచంద్రసేను నాయకత్వమున ప్రాముఖ్యము గాంచుచున్న బ్రాహ్మసమాజమువంకకు సమాకృష్టుడయ్యెను. ఇతని శ్రద్ధార్జవముల కెంతయు ప్రీతుడై కేశవచంద్రసేను ఇతనిని తనపుత్రుల కుపాధ్యాయునిగ నియమించెను. ఆయనతోడి సాంగత్యము శశిభూషణుని పారమార్థికక్షుధాగ్నిని రెచ్చగొట్టెనే గాని చల్లార్ప జాలదాయెను.

1883-వ సంవత్సరము అక్టోబరు నెలలో లోకగురుదేవుని శ్రీరామకృష్ణుని గలసికొన్నపిమ్మటనే ఆ క్షుదాగ్ని చల్లాఱినది. అప్పుడు బ్రాహ్మసమాజమువారు తమ వార్షికోత్సవసమావేశమును దక్షిణేశ్వరాలయారామమున జరుపుకొనిరి. అచ్చటికి శశియు శరత్తు నిద్దఱును బోయిరి, గురుదేవుని దర్శించిరి. శ్రీరామకృష్ణుడు వీరి నెంతయు ననురాగముతో చేరదీసెను. ప్రసంగవశమున శ్రీరామకృష్ణుడు ''అతిబాల్యవివాహములచే పెక్కండ్రు యువకుల యాధ్యాత్మికజీవితములు నాశమొందుచున్న'' వని చెప్పెను. 'పెండ్లాడుట తప్పా' అని వీరడిగిరి. అంత గురుదేవు డచ్చట షెల్ఫులో నున్న యొక గ్రంథమును వారిచేతి కిచ్చి అందొకపుటను బిగ్గరగా జదువు డని కోరెను. ఆ పుటలో వివాహమును గూర్చి క్రైస్తు వాక్రుచ్చిన యీ వాక్యములు గలవు:- ''కొందఱు మాతృగర్భమునుండి నపుంసకులుగనే జన్మింతురు, మఱికొందఱు నపుంసకులుగ నొనర్పబడుదురు. కొందఱు స్వర్గరాజ్యప్రాప్తికై తమ్ము నపుంసకులుగ నొనర్చుకొందురు. ప్రతిగ్రహింపగలవాడు ప్రతిగ్రహించును గాక'' ఈ క్రిందివి పాలు యోగీంద్రుని సూక్తులు: ''కావున అవివాహితులకును విధవలకును చెప్పుచున్నాను. నావలె మీరును ఇట్లే యుండుట మీకు మంచిది. నిగ్రహశక్తి లేనిచో పెండ్లి చేసికొనుడు. ఏల యన ఉడుకుచుండుట కంటె పెండ్లాడుట మేలు''. తర్వాత గురు

దేవుడు శశిని "నీకు విశ్వాసము సాకార బ్రహ్మమునందా నిరాకారబ్రహ్మమునందా" అని అడిగెను. "దేవు డున్నా డను నిశ్చయమే కుదురకున్న నేను దేవుడు సాకారుడో నిరాకారుడో చెప్పజాల" నని శశి చెప్పిన జవాబు గురుదేవు నెంతయు నలరించెను.

ప్రథమదర్శనమప్పుడే గురుదేవుడు శశి డెందమున శాశ్వతస్థానము నధిగమించెను. ఆనాటినుండి శశి దక్షిణేశ్వరమునకు తఱచు రాసాగెను. భక్తివైరాగ్యములమీది మోజుచే నతనికి బడిచదువులో రక్తి తగ్గజొచ్చెను. శ్రీరామకృష్ణునిపట్ల అతని కతిగాఢప్రేమాదరములు వర్ధిల్లినవి. గురుదేవునిసేవకును ఆయన యుపదేశానుసారము ఆధ్యాత్మికసాధనలు సల్పుటకును ఎక్కువకాలము వినియోగింపసాగెను.

1885-వ సంవత్సరమున శ్రీరామకృష్ణుడు వ్యాధిగ్రస్తుడు కాగా, శిష్యులు పన్నిద్ద ఱొక వర్గముగ గూడి, ఇండ్లను వీడి, చదువులకు స్వస్తి చెప్పి, గురుదేవుని సన్నిధానముననే యుండి పరిచర్య చేయుచుండిరి. వారిలో శశియు నొకడు. అతని గురుసేవానిష్ఠ అతి విలక్షణము, అనుపేక్ష్యము. నిద్రను విశ్రాంతిని మానుకొని శశి రేయుంబగలు గురువున కుపచరించుచుండెను. సదా పజ్జనే యుండి సమస్తమును నిర్వహించుచుండెను. ఇతరశిష్యులు భక్తిసాధనల కెంతో కాలమును వ్యయించుచుండిరి. కాని శశికి గురుపరిచర్యయే వరిష్ఠ తపస్సాధన. దానిచే నతడు సర్వసిద్ధిని బడసెను. ఇప్పు డిట్లలవడిన యీ గురుసేవానిష్ఠ శశికి ఆమరణాంత ముండెను.

1886-వ సంవత్సరము ఆగస్టునెలలో గురుదేవుడు మహాసమాధి జెందెను. యువ శిష్యు లందఱు వివేకానందస్వామి నాయకత్వమున ఒక సన్న్యాసివర్గముగా గూడిరి. అందు శశియు చేరెను. సన్న్యసించినపిమ్మట ఆయన యే రామకృష్ణానందస్వామి యనుపేరు పెట్టుకొనెను. మొదట ఈ పేరును తాను పెట్టుకో గోరియుండిన శ్రీ వివేకానందస్వామి శశి కుండిన గురుభక్తిగరిమను గుర్తించి ఆ పేరు శశికే మిక్కిలి యనురూపముగ నుండు నని ఆ పేరును శశికే వదలుకొనెను. రామకృష్ణానందస్వాముల ఏతదనంతరకాలజీవిత మంతయు ఆయన పెట్టుకొన్న యీ పేరునకు అక్షరాల సార్థకత సమకూర్చినది. శ్రీరామకృష్ణుని నిర్యాణానంతరము ఆయన శరీరశేషములను వీడి యేగ నని రామకృష్ణానందస్వామి వ్రతము పూనెను. మాట తప్పక, బరానగరమఠమున గురుదేవుని యస్థికల నారాధించుచు తావు తలగక స్వామి పంద్రెండేం డ్లుండెను; జీవించి యుండగా గురుదేవునకు సేవ చేసినట్లే ఇప్పు డాయనప్రతిమకు సేవ చేయుచుండెను. సోదర శిష్యులు మఠములో నుండిరా, విశేషకాలమును తపస్సాధనలలో గడపెడివారు, లేదా పరివ్రాజకులై గ్రామైకరాత్రముగా సుదూర పుణ్యక్షేత్రాలలో పర్యటించుచుండెడివారు. ఒకొక్కప్పుడు గురుదేవునిగుడిలో పూజ సల్పుచున్న రామకృష్ణానందస్వామి తప్ప, వేఱెవ్వరును లేక, మఠము నిర్జనముగా సైత ముండెడిది. శశి ప్రతిదినము గంగనుండి నీరు తెచ్చి, గుడిపాత్రలను శుభ్రపఱచుకొని, పుష్పములను సేకరించి, వండిన అన్నమును గురుదేవునకు నివేదించి ప్రసాదమును సోదర శిష్యులకు పంచిపెట్టెడివాడు. ఈ కార్యక్రమము దినము తప్పక సాగిపోవుచుండెను. ప్రతికృతిలో గురుదేవుడీశిష్యావతంసునకు సదా ప్రత్యక్షమే. రామకృష్ణానందస్వాముల అధ్యవసాయముచే మఠ మీరీతగ నవిచ్ఛిన్నముగ సాగుచుండి

నది. కావుననే శ్రీ వివేకానందస్వామి 'మన సేవాసంఘమునకు శశిరేమ మూలస్తంభ' మని ప్రస్తుతించెను.

1897-వ సంవత్సరమున శ్రీవివేకానంద స్వామి రామకృష్ణానందస్వామిని మద్రాసులో రామకృష్ణోద్యమప్రచారార్థము సంపుటత్రయము ముగిసి నూతనాధ్యాయము ప్రారంభమయ్యెను. రామకృష్ణానందస్వామి వైదికాచారనిష్ఠయు ఆంగ్లగీర్వాణభాషావైదుష్యమును గలవాడగుటచే దక్షిణభారతమున ప్రచారకార్యమున కెంతయు సమర్థుడని శ్రీవివేకానందస్వామి అందుల కీయన నెన్నుకొని నియమించెను.

మదరాసులో స్వామి ఐస్హౌసుసమీపమున నొకచిన్నయింట నుండెను. తర్వాత కొన్నాళ్ల కాయన విడిది ఐస్హౌసులోనికి మారెను. పిమ్మట అచిరకాలములో ఆయింటిసొంతదారు ఐస్హౌసును వేలములో అమ్మివేసెను. అప్పుడు స్వామి ఎంతో ఇబ్బందిపడుచు కొన్నాళ్లు ఔట్హౌసులో నుండవలసివచ్చెను. 1907 లో మైలాపూరు బ్రాడీసురోడ్డులో 5500 రూపాయల కొకయిల్లు నిర్మితమై, మఠమునకు శాశ్వతావాస మయ్యెను. అనంతరకాలమున ఆ కట్టడము పడగొట్టబడి ప్రస్తుతపు మఠభవనము నిర్మిత మాయెను. స్వామి కంతరంగానుచరులయిన యొకరు ఇట్లు తెలుపుచున్నారు- "క్రొత్తయింట ప్రవేశించి స్వామి శిశువువలె సంతోషించెను. 'శ్రీరామకృష్ణుడు వసించుటకిది బాగుగ నున్నది. ఆయన ఇచట నున్నాడనుట నిజమే. కావున ఈ భవనమును మనము చాల శుద్ధముగా నుంపవలెను. చీలలు కొట్టి గోడలను పాడుచేయరా' దనెను."

మద్రాసులో స్వామి జీవిత మంత సుఖముగా గడవలేదు. చాల శ్రమపడవలసియుండెను. తఱచు ఆర్థికముగా గడ్డుచిక్కుల నెదుర్కొనవలసివచ్చెడిది. తొలిదినాలలో తనకు తానే బంటుగా తనకు తానే వంటవాడుగా స్వామి యుండవలసి యుండెను. గుడిలో పూజను అతివిపులక్రమమున చేయవలసియుండెను. దర్శనార్థుల నాదరింపవలసియుండెను. మఠభవననిర్మాణమునకు విరాళముల సేకరింపబోవలసియుండెను. నగరమున పలుతావుల ప్రవచనము చేయవలసియుండెను. వెలుపలి పనులు ముగించుకొని మఠమునకు మరలునప్పటికి వండుకొను ఓపిక ఆయన కుండెడిది కాదు. కాని ఎంత చిక్కుపరిస్థితిలోనైనను ఆయన క్షోభ చెందలేదు, ఒకరియొద్దకు పోయి దేహీ అని అడుగలేదు. ఆయన తన మొఱను గురుదేవునితోనే పెట్టుకొనెడివాడు. గుడిగదిలో గురుదేవుని ప్రతికృతి యెదుట, ఆయన తన కష్ట పరిస్థితులను బిగ్గఱగా చెప్పుకొనుచుండగా ఆదినాలలో విన్నవా రున్నారు. 'మఠములో బియ్యపుగింజైన లేదు, రేపు జయంతి మహోత్సవ మెట్లో' అని దిక్కుతోపనిసమయములలోగూడ స్వామి గురుదేవునందు న్యస్తభరుడై యుండెడివాడు. వలసిన ధనమును వస్తుపరికరములును అత్యద్భుతముగ నిరీక్షింపని తావులనుండి వచ్చి సమయమున కందుబాటయ్యెడివి. కొన్నాళ్ళకు పరిస్థితులు రవంత చక్కబడినవి, స్వామికి తోడ్పడ మఱి కొందఱు సన్న్యాసులువచ్చి చేరిరి. ఆర్థిక పరిస్థితి కూడ మెఱుగుదేలెను.

మద్రాసులో స్వామి మొత్తము పదునాలుగు సంవత్సరములు మఠ కార్యభారము నిర్వహించుచుండెను. 1911-వ సంవత్సరమున క్షయవ్యాధికి గుఱియై వైద్యమునకై కల్కత్తాకు చేరుకొనెను. రెండునెలలు వ్యాధిబాధ ననుభవించి ఆయన మహాసమాధి నొందెను.

తానున్న పదునాలుగేండ్లలో, స్వామి, రామకృష్ణోద్యమమునకు దక్షిణభారతమున చక్కని పునాదు లేర్పఱచెను. మద్రాసు కేంద్రము వారు ప్రస్తుతము నిర్వహించుచున్న సేవా కార్యశాఖల కన్నింటికిని ప్రారంభకు డాయనయే శ్రీరామకృష్ణారాధనక్రమము నేర్పఱచిన వా డాయనయే. శ్రీరామకృష్ణుని 'గాస్పెల్' (కథామృతము)ను, శ్రీవివేకానందస్వాముల 'దైవప్రేరితవాణి'ని (ఇన్‌స్పైర్డుటాక్సును) స్వకీయగ్రంథములను కొన్నిటిని ముద్రించుట మూలముగా రామకృష్ణానందస్వామి ఈ మఠ గ్రంథప్రచురణకార్యమునకు శ్రీకారము చుట్టినవా డాయెను. ఆయన వంగభాషలో శ్రీరామానుజులవారి చరిత్రమును *వ్రాసెను. త్రిమతాచార్యుల సిద్ధాంతములను సమన్వయపఱచుచు సంస్కృతభాషలో నొకగ్రంథము వ్రాయవలయు ననియు స్వామి సంకల్పించియుండెను. శ్రీశారదా-శ్రీరామకృష్ణ-వివేకానందుల జయంతిమహోత్సవములు ప్రస్తుతము జరుగుచున్న విపులవిభవోత్తరవిధానములకు ప్రారంభకుడు శ్రీరామకృష్ణానందస్వామియే. కోయంబుత్తూరులో ప్లేగువ్యాధిచే బంధువుల నెల్ల కోల్పోయి దిక్కుమాలియున్న యొక శిశువునకు స్వామి యిచ్చిన ఆశ్రయమే రామకృష్ణస్టూడెంట్సుహోమునకు బీజము. ఆ 'హోము' ఇప్పుడు దక్షిణహిందుదేశమున అతిప్రవృద్ధ విద్యార్థివిడుదులలో నొకటిగ వెలుగొందుచున్నది.

మదరాసులోని కార్యముల నిర్వహించుటే కాక స్వామి దక్షిణభారతదేశమున పెక్కు నగరములలో పర్యటించి ఉపన్యాసములు కావించెను. దక్షిణభారతమున బెంగుళూరును తిరువనంతపురమును స్వదేశప్రభువుల రాజధానులు. ఆ రెండు నగరాలలోను స్వామి కావించిన ప్రచారకార్యము ముఖ్యగణ్యము. అచిరకాలములోనే ఆ రెండు నగరములును రామకృష్ణోద్యమప్రముఖకేంద్రము లయ్యెను. 1904-వ సంవత్సరములో స్వామి బెంగుళూరులో శాశ్వతకేంద్రమును శ్రీఅపూర్వానందస్వాముల పర్యవేక్షణమున నెలకొల్పెను

వేషనైఖరులం దెంత అశ్రద్ధగా నున్నను రామకృష్ణానందస్వాముల రూప మతిగంభీరమైనది. సరళత కాయన మూర్తిభావము. మందహాస మాయన యాధ్యాత్మికసుహాసమున కెత్తిన దివిటీయగా ప్రకాశించెడిది. ఆయనకు సభాకంప ముండినప్పటికిని సదస్యుల నుఱ్ఱూతలూపు వాగ్మిత లేనప్పటికిని ఆయన కావించు ప్రవచనము శ్రోతల డెందముల తిరముగ ముద్రితమయ్యెడిది. సంవాదరూపమైన బోధనలో ఆయన అందెవేసినచేయి. శ్రోతలసంఖ్య బహుళముగ నున్నప్పుడును విరళముగ నున్నప్పుడును స్వాముల ప్రవచనాస్థ భేదిల్లెడిది కాదు.

ఎందుకుగాని స్వామి కాలమును క్రమమును తప్పడు. ఆయన దినకార్యక్రమము భగవద్గీతల విష్ణుసహస్రనామముల పారాయణముతో నారంభమయ్యెడిది. మఠములో ఆయన నిరంతర సేవారాధనల నిమగ్నుడై యుండెడివాడు. దర్శనార్థము వచ్చిన ప్రతియొక్కరికి ప్రసాదమిచ్చి సాగనంపుట ఆయనకు వాడుక.

ఆయన శాకాహారనియతియు వైదికాచారనిష్ఠయు గలవాడు. బాల్యములో శ్రీగౌరాంగుని గుఱించిన యొక గ్రంథమును జదివినప్పటి నుండి ఆహారవిషయమున సాధకులకు గౌరాంగదేవుడు విధించిన నియతిని స్వామి పాటింప

* దీని ఆంగ్లానువాదము మద్రాసు మఠప్రచురణశాఖలో లభ్యమగును.

దొడగెను. ఈయన ప్రవణతలను గ్రహించి ఆధ్యాత్మికాభివృద్ధికి వాని యావశ్యకతను గుర్తించి గురుదేవుడు వానిని పెంపొందించెను. గురుదేవునకు నివేదించిన యన్నమునే కాని వేఱు ఏయన్నమును తినగూడ దనుట స్వామికి జన్మవ్రతము. కావున తనకు మధుమేహావ్యాధి వచ్చి అందులకు గోధుమాహారమును భుజింపు మని వైద్యులు కోరినను, మధుమేహవ్యాధియు గోధుమల నారగించువాడుకయు శ్రీరామ కృష్ణున కుండియుండనందున ఆయనకు గోధుమలను నివేదించుట కాని ఆయనకు నివేదింపక తాను భుజించుట కాని స్వామి కసాధ్యమే. మనుప్రముఖమహర్షులు నిస్వార్థపరులనియు జగద్ధితైకాభిలాషు లనియు స్వామి విశ్వాసము. కావున వారిస్మృతులందు ఈయన కాదర మపారము. ఐనను ఈయన హిందుత్వము సంకుచితమైనది కాదు. అన్యమతములపట్ల ఎంతో గౌరవము గల స్వామి అవకాశము వచ్చినప్పుడెల్ల మతాంతరులగోష్ఠులలో మెలగెడివాడు. మద్రాసులో సెయింట్ థామసు మౌంటునొద్ద స్వామి, చర్చిలో ప్రవేశించి దైవప్రార్థన గావించెను. మహమ్మదీయునితో సమాగమమొనగూడినప్పుడు స్వామి కొరానును గుఱించి ముచ్చటించెడివాడు. అద్వైతి అయినప్పటికి భక్తిమాధుర్యాభిరతి గలవాడు. కావున ఆరాధనమందలి ఆయన శ్రద్ధయు ఆర్జవమును స్పృహణీయములు ప్రేక్షణీయములు. భక్తిజ్ఞానము లాయనలో సమము లయిన పాళ్ళలో మిళితములైనవి. గణిత శాస్త్రజ్ఞుడును విద్వాంసుడునగు నాయన ప్రతిభ అలోకసామాన్యము. అయినను దాని నాయన వెలికి ప్రదర్శించుకొనడు. ఆధ్యాత్మిక పరత ఆయనకు జీవితము, విద్యావిషయములు వినోదములు. అయినను ఎక్కువగ చదువు కొన్నది తన హృదయగ్రంథమునే. అందలి లోతులకు దిగి మర్మముల గనుగొన్నవా డాయన.

తటస్థముగ ఏకాంతముగ ప్రశాంతముగ నుండు నునికి ఆయనకు ప్రియము. ఒకసారి ఆయన ఇట్లు వ్రాసెను. దేవుడు నాలో నిండుగ నున్నప్పుడు, ఒరులు నా కెందుకు? ఒంటిగనుండుట యనగా ఏకాగ్రతయు పవిత్రత యునే. ఏకాకిత యనగా భయరహితతయు అర్థమే. ఇద్దఱున్నచో భయమును ఉండును. ఒంటిగా నున్నప్పుడు మనము ఆడవచ్చు, పాడవచ్చు, ముఖవికృతులు పూనవచ్చు, ఏమైనను చేయవచ్చు. ఒకమిత్రుడు మన చెంతకు వచ్చెననుకొనుడు. వెంటనే నడవడిలో మన మొక మెలకువను వహింతుము, అవధులను పాటింతుము, భయ మున్నంతవఱకు సుఖము లేదు, శాంతి లేదు'' ఇతరులభక్తి కంటె ఈయనభక్తిని విలక్షణముగ వెలుగొందించినది ఈ యద్వైతప్రవణతయే. పరిసరములందున్నవారిలో కపటత కనిపించెనా, ఆయన సహింపడు. భజనసంకీర్తనము సాగుచున్నప్పుడు ఆయన తటస్థుడుగ నుండ లేడు. భక్తిపరవశుడై నర్తింప జొచ్చును. ప్రేక్షకులుకూడ సమాకృష్టులై నర్తింపదొడగుదురు.

ఆయనకు 'గురువు' 'దైవము' ఒక్కరే. పటమున గురుదేవు డాయనదృష్టికి ప్రత్యక్షము. కావున ప్రత్యక్షగురుసన్నిధానమున మెలగునట్లే స్వామి గురుదేవుని ప్రతికృతినెదుటను మెలగెడివాడు. వర్షించుచుండగా చినుకు గురుదేవునిపటముపై బడి గురుదేవుని నిద్రను చెడగొట్టకుండగలందులకై రామకృష్ణానంద స్వామి రాత్రియంతయు గొడుగు పట్టుకొని యుండెనట!

సోదరి దేవమాత రామకృష్ణానందస్వామిని గూర్చి ఈలాగు వ్రాసియున్నది. "నాలో నున్నది క్రైస్తే. క్రైస్తుకంటె వేఱుగా నేను లేను" అని పాలుయోగీంద్రుడు చెప్పిన వాక్యములు అక్షరాల రామకృష్ణానందస్వామికిని వర్తించును. స్వామిలో నిండియున్నది గురుదేవుడే. గురుదేవునికంటె వేఱుగా రామకృష్ణానందస్వామి లేడు. తన్ను తానే ఆయన ఈలాగు వర్ణించుకొనెను. "నా జీవితము నిత్యము. ఈ అల్పజీవితమునకు దేవుడే స్వామి. దీనిని సృజించినవాడు దేవుడే. దేవుడు దీనిని ఇచ్ఛమెయి వినియోగించుకొనునుగాక"

# శివానంద స్మృతులు-44

## శ్రీమత్ప్రవ్రాజిక శ్యామాప్రాణ

బేలూరు మఠము,
క్రీ. శ. 4-5-1929,
(శనివారము)

శ్రీ మహాపురుష మహారాజుగారి గదిలో పెక్కురు భక్తులు కూడియుండిరి. మహాపురుషులు వారితో ఆనందముగ సంభాషించుచుండిరి. అట్టితరి కలకత్తానుండి శ్రీవారి శిష్యురాలగు ఒక బాలికయు, ఆమెతల్లియు వచ్చిరి. బాలిక వయస్సు సుమారు పదుమూడో పదునాలుగో సంవత్సరములు. బడిలో చదువు విద్యార్థిని. తల్లికుమార్తెలు ప్రణమిల్లిరి. తల్లి శ్రీవారి ఆరోగ్యముగూర్చి ప్రశ్నించెను. అటుపై బాలిక తల్లి శ్రీ మహారాజుగారితో "స్వామీ, ఈ బాలికకు శ్రీ ఠాకూరుపై అచంచలభక్తి కల్గునట్లుగ ఆశీర్వదింపుడు. ఈమెకు వివాహము చేయుట నాకేమియు ఇష్టము లేదు. భగవన్నామము స్మరించుచు, ఆనందముగ జీవితము గడపుమనియే నావాంఛ. తండ్రీ, ఈ సంసారములో సుఖమేమి కలదు? నేను స్వయముగ అనుభవించితిని కదా! సంసారములోని బాగోగులెల్ల స్వానుభవమున తెలిసినవి. సంసారజ్వాలలతో నాతల బట్టకట్టిపోయినది. అంతయు తెలిసియు నాకుమార్తెను సంసారదావానలములో పడద్రోయుటకు మనస్సు ఒల్లకున్నది. మీరు కృపచూపి ఆశీర్వదింపుడు." అని విన్నవించెను.

మహాపురుషులు :- "అమ్మా, ఆశీర్వదించుచున్నాను. హృదయపూర్వకముగ ఆశీర్వదించుచున్నాను." అటుపై బాలికవైపు దృష్టి ప్రసరింపజేసి - వాత్సల్యపూరిత కంఠముతో - "అమ్మా, హృదయాంతరాళమునుండి శ్రీభగవానుని స్మరింపుము - పవిత్రముగ నుండుము. తల్లి, తండ్రి, స్నేహితుడు సర్వము భగవానుడే సుమా

త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బన్ధుశ్చ సఖా త్వమేవ
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ.

[నీవే తల్లివి, తండ్రివికూడను. నీవే బంధువవు, స్నేహితుడవు. నీవే విద్యయు, ధనమును. ఓ దేవదేవా, నీవే నా సర్వస్వము.]

నీవు శ్రద్ధగా చదువుము - స్వీకరించిన మంత్రమును జపింపుము. అమ్మా, నీవు చదువుకొనుము, లేక ఏమైన చేసికొనుము, నాకేమియు అభ్యంతరము లేదు. కాని భగవల్లాభమే

మానవజీవిత లక్ష్యము అను విషయముపై మనసునిలుపుము. ఈ సంసారము క్షణభంగురము. రెండునాళ్ళపాటిది. భగవంతుడే నిత్యవస్తువు. నీవు అతిపవిత్రురాలవై మెలంగుము. సరళహృదయులందును, పవిత్రాత్ములయందును భగవానుడు ఎక్కువగ స్ఫురించును. అధ్యాత్మ జీవనమునకు పవిత్రతయే గట్టిపునాది. శ్రీశ్రీ మాతృదేవి జీవితమును చదువలేదా? ఆమె ఈ యుగములోని సమగ్రనారీజాతికి ఆదర్శము. ఆమె జీవితము అత్యద్భుతమైనది. మానవదేహము దాల్చి సామాన్య గృహిణివలె ప్రవర్తించెను. కాని ఆమె సాక్షాత్తుగ ఆద్యశక్తి, జగజ్జనని, అని ఎఱుంగుము. శాస్త్రములలో కాళి, దుర్గ, తార మున్నగు *దశమహావిద్యల గూర్చి చెప్పబడియున్నది. వారిలో మాతృదేవి ఒకర్తె. శ్రీరామకృష్ణ యుగధర్మ సంస్థాపనా రూపమగు నరలీలను పూరించుటకుగాను ఆమె ఈ ప్రపంచములో అవతరించెను. సాధారణ మానవులు ఆమె గొప్పతనమును ఏలాగు తెలిసికొనగలరు? ఆమె తన దైవీభావమును కడు గుప్తముగ దాచి, అతి సామాన్యురాలివలె నటించెను. అందుచే సాధారణ మానవులకు ఆమెను యథాతథముగ తెలిసికొను అవకాశము కలుగదాయె. ఆమె యథార్థస్వరూపమును సంపూర్ణముగ శ్రీరామకృష్ణుడే ఎఱుంగును. స్వామిజీ కొద్దిగ తెలిసికొనెను. పాశ్చాత్యఖండములకు పయనించుటకు ముందు స్వామిజీ తన ఉద్దేశ్యమును శ్రీ మాతృదేవికి మాత్రమే ఎఱింగించెను. ఆమె ఆశీస్సుల బడసి సముద్రయానము సాగించెను. మాతృదేవి స్వామిజీని హృదయపూర్వకముగ ఆశీర్వదించెను. "నాయనా, నీవు దిగ్విజయము నందెదవు. నీనాలుకపై సరస్వతీదేవి నివసించుగాక!" మాతృదేవి ఆశీర్వాదఫలముననే స్వామిజీ విశ్వవిజయుడై యొప్పెను. మాతృదేవిపై స్వామిజీకి అగాధశ్రద్ధ. అందుచే ఒక్కొక్కప్పుడు స్వామిజీ, "శ్రీరామకృష్ణుని కన్న శ్రీమాతృదేవి మిన్న" యని చెప్పును. శ్రీరామకృష్ణుడు కూడ మాతృదేవినిగూర్చి ఈలాగు పల్కెడివాడు "నహబత్తులో (దక్షిణేశ్వరములో శ్రీరామకృష్ణుడున్న సమయమున మాతృదేవి నహబత్తులో నివసించెడిది. నహబత్తు అనగా మేళపుచావడి. బంగాళ దేశమున మేళగాండ్రు ఎత్తుగ పందిరిమీదనో, లేక ఆలయములలో మండపముమీదపై చావడి మీదనో కూర్చుండి మేళము వాయింతురు. ఆ మేళపు మండపము క్రింది భాగములో శ్రీమాతృదేవి నివసించెడిది.) నున్న వ్యక్తి ఏ కారణముననైన, ఎవ్వరిపైనైన కోపగించుకొనినచో, వానిని రక్షించుట నాకుకూడ సాధ్యము కాదు సుమా!"

ఈ విశ్వబ్రహ్మాండములో సమగ్రస్త్రీజాతిని మేల్కొల్పుటకై మాతృదేవి మానవరూపమున అవతరించినది. మాతృదేవి ఆవిర్భావము పిదప సర్వదేశములలోని స్త్రీజాతిలో ఎట్టి విచిత్రమగు మెలకువ కల్గినదో చూడుము! నేడు స్త్రీజాతి సర్వాంగ సుందరముగను సర్వవిషయములలోను, సర్వతోముఖ ప్రతిభకల్గి - సర్వక్షేత్రములలోను కార్యభారము వహించుటకుగాను నడుముకట్టుచున్నారు. ఇప్పుడే స్త్రీజాతి జాగరణ ప్రారంభము. కాలము గడచినకొలది ఇంకను విజృంభించెదరు. వైదిక యుగము లందలి, గార్గి, మైత్రేయి సీత, సావిత్రి మున్నగు మహిమాన్వితలగు నారీరత్న

* దశమహావిద్యలు = కాళికాదేవి; బగలాదేవి; తారాదేవి; షోడశి; భైరవి; మాతంగి; ధూమావతి; ఛిన్నమస్తా; కమలా; భువనేశ్వరి. ఈ పది శక్తులు ఉగ్రమూర్తులు.

ముల శీలమును ఆదర్శముగ నిడికొని, అభ్యుదయము కాగలదు. ఈ యుగములో కూడ అట్టివారిని మించి వజ్రతుల్యశీలముగల స్త్రీలు ముందంజ వేయుచున్నారు. ఆధ్యాత్మికరంగమునను, రాజనీతిక్షేత్రములోను, విజ్ఞానమునను, సాహిత్యమునను, శిల్పకళలోను సర్వవిద్యలలోను సమస్తకళలలోను కుశాగ్రబుద్ధి కల్గిన స్త్రీలచూచిన ఆశ్చర్యము కల్గుచున్నది. ఈనవచైతన్యము కొనియాడదగినది. భవిష్యత్తు ఇంకను ఉజ్జ్వలమైనది కాగలదు. ఇదంతయు ఆదైవీశక్తిలీల యనియే గ్రహింపుము. సాధారణ మానవుడు ఇందలి నిగూఢమర్మమును ఎఱుంగడు.

బాలిక :- శ్రీ మాతృదేవినిగూర్చి నాకు విశేషముగ తెలియదు. ఆమె జీవితచరిత్రగాని, ఉపదేశములుగాని ఇంతవఱకు నేను చదువలేదు. మీరు దయయుంచి, మాతృదేవినిగూర్చి కొంచెము చెప్పుడీ. వినవలెనని చాల కుతూహల పడుచున్నాను.

మహాపురుషులు :- మాతృదేవి ఎల్లరకును తల్లి. ఆమె దయను, ఓర్పును, ఏమని తెల్పుదును! మేము అయినను ఆమెను ఎంతవఱకు తెలిసికోకల్గితిమి? కాని మాపై కృపాకటాక్షముచూపి, తాను సాక్షాజ్జగజ్జనని యని ఎఱుకపఱచినది. ఆమె స్వయముగ తెలుపనిచో ఆమెను తెలిసికొనుటకు వేఱొండు ఉపాయము లేదు సుమా! మొదట యోగానందస్వామియు అటుపై శారదానంద స్వామియు మాతృదేవికి చాల సేవ చేసిరి. ఒకమారు జయరామవాటికి వెళ్ళి మేము వంట చేసి అమ్మకు తినిపించితిమి. కాని అది చాల సంవత్సరముల క్రిందటి సమాచారము. శ్రీరామకృష్ణుని నిర్యాణానంతరము మాతృదేవి జయరామవాటిలో నివసించుచుండెను. నేను, రామకృష్ణానందస్వామి, బహుశః సుబోధానంద స్వామియుకాబోలు, సరిగా జ్ఞాపకము లేదు, తల్లిని దర్శించుటకై వెళ్ళితిమి. అప్పుడు జయరామవాటి గ్రామమునకు రాకపోకల వసతి అంతగ లేనందున భక్తులు అచ్చటికి ఎక్కువగ వెళ్ళెడివారు కారు. మేము బయలుదేఱు ముందుగ ఆమెకు కబురంపితిమి. మమ్ముల చూచి మాతృదేవి ఆనందముతో ఉప్పొంగెను. ఆ గ్రామములో సామానులు దొరకవు అందుచే ముందుగనే మాకొఱకై అంగడి సామానుల తెప్పించెను, పాలు ఏర్పాటు చేసెను. మేము కలకత్తావాసులము కదా! తేనీరు త్రాగు అలవాటు. అందుచే ముందుగనే తేఆకును కూడ తెప్పించి యుంచెను. ప్రొద్దుటినుండి రాత్రివఱకు మాకు భోజన విశ్రామాది సకల సౌకర్యముల నేర్పాటు చేయుటయందే నిమగ్నురాలై యుండెను. ఆమె ఆనందమునకు మేరలేదాయె మేము కూడ ఆనందము ననుభవించితిమి. మాఇష్టము వచ్చినట్లు చెరువులో స్నానము చేసితిమి. మాకై అన్ని ఏర్పాట్లు చేసినను మాతృదేవి మాతో నేరుగా మాటలాడెడిది కాదు, మా ఎదుటికి వచ్చెడిది కాదు. రాత్రి భోజనమైన పిదప నేను, రామకృష్ణానందస్వామి కలసి ఆలోచించుకొని, ఆ మఱునాడు మాతృదేవి కొఱకై వంటవండి తినిపింప సంకల్పించుకొంటిమి. మఱునాటి ఉదయము తేనీరు త్రాగుట ముగియయగనే, మా ఈ అభిప్రాయమును మాతృదేవికి ఎఱింగించితిమి. మాతృదేవి మా ప్రస్తావన విని నవ్వి "అది ఏలాగు సంభవమగును? నేను తల్లిని, మీరు బిడ్డలు. తల్లి బిడ్డలకు వండి తినిపించును కాని, బిడ్డలు తల్లికి తినిపించుట, ఇది ఎక్కడిమాట! అదే కాక మీరు ఈ కష్టములలో వంటచేయుటయు

సాధ్యము కాదు, మీ కళ్ళు పొగచూరును... అని నానావిధములగు ఇబ్బందుల నెల్ల చెప్పి మమ్ము వారించెను. కాని ఆమె మాటలనెల్ల పెడచెవిని బెట్టి మేము 'ససేమిరా' అని మొండి పట్టు పట్టితిమి. కడపట నేను ఈలా గంటిని ''మేము కూడ బ్రాహ్మణకులసంజాతులము. మాచేతివంట భుజింప ఇంతగ అభ్యంతరము చేయుచున్నారు ఏల? శ్రీ రామకృష్ణులు సైతము మాచేతి వంటను స్వీకరించిరి.'' గత్యంతరము లేక మాతృదేవి కడకు ఒప్పుకొనెను. నేను, రామకృష్ణానందస్వామి కలసి వంటచేసితిమి, మాతృదేవి తృప్తిగ భుజించి కడు ఆనందించెను.

బాలిక :- మహారాజ్, మీరు శ్రీభగవానులకుకూడ వండి తినిపించితిరా?

మహాపురుషులు :- అవునుఅమ్మా, అప్పుడు గవానులు చాల జబ్బులో నుండిరి. చికిత్సకై దక్షిణేశ్వరమునుండి కాశీపూరు ఉద్యానభవనమునకు వారిని తీసికొని వచ్చితిమి. స్వామిజీతోసహా మేమందఱమును శ్రీవారిసేవకై అచ్చటనే యుండెడివారము. వంతులప్రకారము శ్రీవారిసేవ శుశ్రూషల చేయువారము. మా స్నానపానాదులుకూడ అచ్చటనే, భక్తుడగు శ్రీసురేశబాబు ఈఏర్పాటులనెల్ల కావించెను. ఒక వంటవానిని కూడ ఏర్పాటు చేసెను. ఒకమారు ఆ వంటవానికి జబ్బుచేసినందున మేమే వంటచేయుచుంటిమి. ఆ సమయమున మా మనోభావమే వేఱుగ నుండెను. ఆకలికి ఏదో వండి ఆహుతి ఇచ్చెడివారము. ఒకవైపు శ్రీభగవానులు కఠిన వ్యాధితో బాధపడుచుండిరి – మఱొకవైపు మేము జప, తపాది కఠోరసాధనల చేసెడివారము. ఒకదినము రాత్రిపూట నేను కూరలో దిరుగబోత వేయుచున్నసరి, ఆవాసన మిద్దెపైనున్న గవానుల గదిలోనికి కొట్టినది. వెంటనే ''వంట ఎవరు చేయుచున్నారని'' శ్రీవారు ప్రశ్నించిరి. నాపేరు వినుటతోడనే సేవకునితో ''నాకొఱకు కొంచెము కూర తీసికొనిరమ్ము. తిరుగబోతవాసన చాల బాగుగ వచ్చుచున్నది'' అని పంపిరి. ఆ కూరను, వారు కొద్దిగ ఆరగించిరి. కంఠములో వ్రణముతో బాధపడుచుండినందున శ్రీభగవానులు కేవలము పలుచని రవజావను మాత్రమే ఆరగించువారు. అదియు చాల కొద్ది పరిమాణము ఎంతో కష్టముమీద మ్రింగుడుపడెడిది. దానితోపాటు వారు తఱచు భావసమాధి నందుచు, బాహ్యేంద్రియజ్ఞానమును కోల్పోయెడివారు. కాశీపూరులోని మా జీవితమును ఏమని వర్ణింతును! సదా మా డెందములు ఆనందమున నోలలాడుచుండెడివి. శ్రీవారిసేవ శుశ్రూషలు, జపధ్యానములు ఇవి తప్ప వేఱొండు చింతలేదు. ఎంత ఆనందముగ దినములు గడచెడివి! మమ్ముల, సోదర శిష్యబృందమునెల్ల ఒక్కచో చేర్చి భావిరామకృష్ణ సంఘసంస్థాపనార్థమే కాబోలు, శ్రీవారు కఠోర వ్యాధిని ఆహ్వానించి, స్వీకరించినది. అవతార పురుషుల విచిత్రలీలలందలి నిగూఢ రహస్యమును, సామాన్యమానవులు ఏలాగు తెలిసికొనగలరు?

ఈలాగు పల్కుచు మహాపురుషులు హఠాత్తుగ మౌనము వహించిరి. కొంతవడి అదే స్థితిలోనుండి, అటుపై మెల్లగ సంభాషింపనారంభించిరి. ''అమ్మా, మీకు జయరామవాటి ప్రస్తావన చెప్పుచుంటినికదా! ఆమారు మేము మాతృదేవికడ మూడు దినములు మాత్రమే గడపగల్గితిమి. మాతృదేవి వాత్సల్యాభిమలను ఏమనివర్ణింతును? ఉదయము నుండి రాత్రివఱకు పనిలోనే నిమగ్నురాలు.

మాకు ఏలాటి ఇబ్బంది కలుగకుండునట్లుగ కంటికి రెప్పవలె కాచెను. చిన్నవయస్సులోనే నేను మా కన్నతల్లిని కోల్పోయితిని. తల్లి ప్రేమ ఎట్టివస్తువో మఱచితిని. జయరామ వాటికిపోయి మరల మాతృప్రేమవాత్సల్యములను జూరగొంటిని. మూడవ దినము సాయంకాలమునుండి నాకు కొంచెము జ్వరముగ నుండినది. భోజనము చేయనిచో, మాతృదేవికి నా జ్వరముసంగతి తెలిసిపోవునని తలంచి యథాప్రకారము భుజించితిని. రాత్రి అగుకొలది జ్వరము ఎక్కువ అయినది. రాత్రి అంతయు జ్వరముతో స్పృహలేక పోయెను. వేకువన రామకృష్ణానందస్వామిని లేపి మెల్లగ "సోదరా, ఈ జ్వరముతో ఇక్కడ నున్నచో మాతృదేవికి చాల కష్టము కల్గించుటే అగును. కాన ఉదయముననే ఆమెకడ సెలవు తీసికొని పయనింపవలసినదే. అటుపై వచ్చునదేదో రానేవచ్చును." శశిమహారాజు ఇందులకు సమ్మతించెను. ఇంతతొందరగ మేము తిరిగి పోవుట విని మాతృదేవి మమ్ముల పలువిధముల వారించెను. కాని మేము గట్టిపట్టు పట్టితిమి. ఎలాగో అతి కష్టముపై ఆమెకడ సెలవు గైకొని మేము పయనించితిమి. నేను నడువ లేక పోవుచుంటిని. చాలకష్టముతో కొంచెము దూరము పోవుసరికి ఒక బాడుగ ఎడ్లబండి దొరకినది. ఆ బండి (ఆరామబాగు) కొంత దూరముననున్న పట్టణమువఱకు పోవుటకు సమ్మతించెను. బండిలో ఎక్కుటతోడనే నా పరిస్థితి చాల శోచనీయమాయెను. స్పృహ లేదాయె. దారిలో ఒక గ్రామములో బండి ఆపిరి, వేడినీళ్లకై ప్రయత్నించిరి. అది మధ్యాహ్నసమయము. ఈ విషయము విని ఆ గ్రామస్థు డొకడు బిల్వపత్రరసము తీసికొని వచ్చి, వేడినీళ్ళలో కలిపి బలవంతముగ త్రాగించెను. మావద్ద వేఱుమందు ఏమియు లేనందున అదియే మాకు పరమౌషధ మాయెను. శశిమహారాజును, మఱొక స్వామియు అంగటినుండి కొంత ఫలాహారము కొనితెచ్చి భుజించిరి. మరల బండి పయనింప సాగెను. నా జ్వరము అలాగుననే యుండెను. ఆరంబాగు చేరినవెంటనే డాక్టరును పిలుచుకొని వచ్చి పరీక్షచేయింపగా ఆయన "మలేరియా" జ్వరమని నిర్ధారించెను. పది పదునేను సంవత్సరములుగ నాకు జ్వరమేమియు వచ్చి యుండలేదు. హఠాత్తుగ ఈ జ్వరము ఏలాగు సంక్రమించెనో అర్థముకాలేదు. కాని చిన్న వయస్సులో మలేరియాతో చాల బాధపడితిని. అందుచే శ్రీభగవానుల సాన్నిధ్యమునకువచ్చి చేరుటకు చాల సంవత్సరములకు ముందుగనే నేను బారాసాతు గ్రామము వీడితిని, ఆఖరు సారి పదునాలుగు పదునైదు సంవత్సరములు వయస్సున నాకు మలేరియా వచ్చినది. చాల దినములు ఆ జ్వరము నన్ను సతాయించినది. కొంచెము నెమ్మదికాగనే నన్ను పశ్చిమ ప్రదేశములోని ఒక ఆరోగ్యస్థలమునకు పంపిరి. అచ్చటనే చాలకాలము గడపితిని. అది మొదలుగ బారాసాత్ కు* వెళ్లినను ఎక్కువ దినములుండెడి వాడను కాను. జయరామ వాటిలో చెరువులో స్నానము చేసితిమి కదా! బహుశః పురాణజ్వర బీజములు మరల తల యెత్తెనా ఏమి అని తోచెను, ఎలాగైననేమి ఆరామబాగ్ లో కొన్ని దినములుండి జ్వరము నెమ్మది అయిన పిదప కలకత్తాకు తిరిగి వచ్చితిమి.

* బారాసాత్ గ్రామము శ్రీ మహాపురుషుల స్వగ్రామము.

## 89

బేలూరు, హౌరా,
31 ఆగస్టు 1920.

ప్రియశ్రీమన్,

నీజాబువలన అన్నిసంగతులును తెలిసినవి. పెక్కుకారణాలచే జవాబు పంపుట సాధ్యపడ లేదు. దైవానుగ్రహమున ఈపాటికి నీవు తేరుకొనియుందు వనుకొనుచున్నాను. దుర్గమము లైన కొండలను దాటి వచ్చి యుంటివి కావున నీ ఆరోగ్యము తాఱుమాఱు కావచ్చు. ప్రస్తుతము ఏచోటనైన కొన్నాళ్ళు విశ్రమింతువేని నీకు మరల స్వస్థత చేకూరవచ్చు. అలాగు చేయుము.

నీవు త ప్పేమియు చేయ లేదు. ఆత్మవిముక్తికై సంసారమును త్యజించితివి, అందుకే పర్యటనలు కావించితివి. మఱి, ఇందు త ప్పేమున్నది! విముక్తికై ఎవడుగాని వెలుపలికేగ నక్కఱ లేదు, అది సదా తనలోనే ఉన్నది. భగవంతుని కృపచే, నీబుద్ధికి పరిపాక మేర్పడి, ఈ తత్త్వమును నీవు గ్రహింపగల్గుదువు గాక.

మనసులోని భ్రమాంధకారమును అమ్మ కరుణించి తొలగఁజోపును గాక. భగవంతుని సాక్షాత్కరించుకొనజేయగల జ్ఞానజ్యోతి నీకు గలిగి యీ జీవితము ధన్యమగు గాక. ఇంత కంటె ఏమి వ్రాయుదును!

నీకు శాంతి చేకూరుత మని ప్రార్థించు చున్నాను.

భవదీయ శ్రేయోభిలాషి,
శివానంద.

## 90

శ్రీరామకృష్ణమఠము,
బేలూరు, హౌరా,
1 నవంబరు 1920

నీ జాబులోని సంగతు లన్నియు గుర్తించి నాను. ఈ మధ్యలో గడచిన మూడుదినము లును నే నిట లేను. సుదీర్ఘకాలముగా నీకారోగ్యము సరిలే దని తెలిసిన వెంటనే వ్యాకుల పడితిని. ఎట్లో గురుకృపచేత నీవు దరిద్రనారాయణ సమారాధన కార్యము నించుమించు పూర్తిచేసితివి. శేషించినదానిని పూర్తి చేయుము. మహారాజును (శ్రీ బ్రహ్మానంద స్వామిని) దర్శింపుము. ఆయన ఆశీస్సులను పొంది మరలి రమ్ము. పిమ్మట నీ కనుకూల మైనటువంటి ఏచోటనైనను కొన్నాళ్ళు విశ్రమింపుము. రవంత విశ్రమించి తేరుకొందువేని నీ మనస్సు తనంతట భగవచ్చరణారవింద ములను డాసి సుఖించు ననుటకు సందేహము లేదు మీ రందఱును దేవునికే మి మ్మర్పించు కొన్న శిశువులరు. దేవుని పనిలో మీరు వ్యాపృతులై యున్నారు. ఆయన సదా మిమ్ము కాపాడుచుండగల డని మేము గట్టిగ ఎఱుగుదుము.

మీ కందఱికీ నా విజయాశీస్సులు. మఠములో పూజ చక్కగా జరుపబడినది. విగ్రహము చాల అందముగ నుండెను. కార్నొ రేమనుపీధిలోని రామకృష్ణమిషను స్టూడెంట్సు హోముకు చెందినవాడగు భరతు డను విద్యా సంపన్నుడగు బాలుడు పూజకుడుగను, వాసు దేవానందుడు తంత్రధారకుడుగను (= సహాయ పూజారిగను) పనులు నిర్వహించిరి. చండీ పారాయణమును లలితు డొనర్చెను.

పెక్కండ్రు ఇతరులుకూడ, ఎవరికి వారు ప్రత్యేకముగా, చండీపారాయణము కావించిరి. మహాభక్తిగాంభీర్యానందములతో దుర్గాపూజ నిర్వర్తితమైనది.

నీ
శివానంద.

## 91

శ్రీరామకృష్ణమఠము,
బేలూరు, హౌరా,
13 డిసెంబరు 1920.

ప్రియశ్రీమన్,

నీజాబు యథాకాలమునకు చేరినది. ఈ నడుమ పదునెనిమిది పందొమ్మిది దినములుగా నేను మఠములో లేను. (దక్షిణ కల్కత్తా) భవానిపురమున ఒక రామకృష్ణాశ్రమము క్రొత్తగా నెలకొల్పబడినది. అచ్చట ఉంటిని.

ఎవరినిగాని ఏచోటునుగాని నిందింపరాదు. బాధ్యత మనదే. మనమనస్సులకు దుర్బలత కూర్చునవి మనపూర్వవాసనలే. సన్న్యసించుటచేతను ఆధ్యాత్మికసాధనలచేతను గురుదేవుని కృపచేతను నీమనసులో మంచిప్రవణతలే దృఢములుగ నున్నవి. అప్పుడప్పుడు దుర్వాసనలప్రభావమున దుర్బలత గల్గినను అది ప్రతిహతమగును. అట్టి మానసిక సంఘర్షణము, జీవ మున్నందుకు సూచకము. దేవునను గ్రహముచే అట్టి సంఘర్షణమున నెగ్గినప్పుడు మనస్సు ఎంతో పురోగతి నొందినదగును. గురుదేవునను గ్రహముచే నీ పురోగతి సాగును గావుత మనుట హృదయపూర్వకమైన నా యాశీస్సు.

ఆ ప్రాంతాలలో చలికాలమున అతిసార వ్యాధి గలుగుచుండును. బొజ్జకు చలిగాలి తగలనీయకు. ఆహారవిషయమునకూడ ఎంతయు జాగరూకత అవసరము. అక్కడ ఉప్పుడుబియ్యముగాని సన్నబియ్యముగాని లభించు అవకాశ మున్నదో లేదో నే నెఱుగను. లభించిన బాగుండును. లేనిచో సుదీర్ఘకాలము చపాతిని పప్పును మాత్రమే భుజించుచుండుట బంగాలివారికి సరిపడదు. ఇట్టి వ్యాధుల కగ్గమై ఎందఱో బంగాలి సాధువులు ఆఊరు వదలిపోవలసి వచ్చినది ఐనను గురుదేవుడు నిన్నక్కడ నుంచినంత కాల మచ్చటనే యుండుము.

పూజ్యమహారాజు (శ్రీబ్రహ్మానందస్వామి) మఠమునకు వచ్చి నేడు తొమ్మిదవదినము. ఈదినము ఆయన కలకత్తాకు బయలుదేఱుచున్నారు. ఆ ప్రాంతములో కొన్నాళ్ళుండి అక్కడినుండి ఆయన మరల భువనేశ్వరమునకు పోగలరు.

మఠములో కొందఱి ఆరోగ్యము సరిలేకున్నది. నీకు నా హృదయపూర్వకాశీస్సులు.

భవదీయ శ్రేయోభిలాషి,
శివానంద.

## 92

శ్రీరామకృష్ణమఠము,
బేలూరుమఠము, హౌరా,
22 డిసంబరు 1920.

ప్రియశ్రీమన్,

నీజాబులోని సంగతు లన్నియు తెలిసినవి. నీవు హృషీకేశమునకు పోయి యుంటివే, అది చాల మంచిది. ఆధ్యాత్మికసాధనలను గాఢముగా సాగింపుము. తపస్సాధనల కాచోటు అనుకూలమైనది, ఎంతయు మంచిది. గురుదేవుడు సదా నిన్ను రక్షించుచున్నాడు. అన్నిదశలలోను ఆయన నీకు సొంతమే, ఎన్నడు

కాని ఎడసిపోవువాడు కాదు. ఆపన్న ప్రజా సేవాకార్యములోగాని హృషీకేశమున తపశ్చర్యలోగాని నిమగ్నుడవై యున్నప్పుడు ఆయన సదా నీకు ప్రాపుగ నున్నాడు. సంసారమును త్యజించుటచే నీవు నీ దేహమును మనస్సును జీవితమును సమస్తమును భగవచ్చరణముల కంకితము చేసికొంటివి. కావున భగవదనుగ్రహమునకు సమర్హత నీకు సదా కలదు. ఆరోగ్యోత్సాహములందు స్థిరుడవై నీ సమస్తమును భగవదర్పితము చేసి ధన్యుడవౌదువు గాక! ఇదే నా హృదయాంతర్గత ప్రార్థనము. గురుదేవున కిష్టమువచ్చినన్ని రోజులు నీ వక్కడే యుండుము. నీ హృదయాభిలాష లెల్ల సఫలము లగుగాక. నా హృదయపూర్వకాశీస్సుల గ్రహించి అందఱికి నంద జేయుము. గురుదేవుడు నీకు పరమ శుభముల ప్రసాదించునుగాక.

నీ శ్రేయోభిలాషి
శివానంద.

## 93

శ్రీరామకృష్ణమఠము
బేలూరు, హౌరా
25 మార్చి 1921

ప్రియ శ్రీమన్,

నీ జాబుద్వారా సంగతులన్నియు తెలిసినవి. మహారాజుగారు మఠమునకు మరలిరి. పవిత్ర వారణాశిలో వా రుండిన రెండు నెలలలో ఆనందవాహినులు వెల్లివిరిసినవి. మరలివచ్చిన దాదిగా ఆయనకు ఆరోగ్యము సరిలేదు. అంతే కాదు. వారి మదరాసు ప్రయాణమును నిశ్చయింపబడినది. ఒకవేళ నేనును వారివెంట జనుదునేమో.

అభిమతులగు కొందఱి సాహచర్యమున ఏదే నొకచోట నిలుకడగా నుండవలయును. ఎక్కడగాని ఒంటరిగా నుండుట సాధ్యపడదు. గురుదేవుని భక్తమహాజనుల గోష్ఠిలో నుండుట ఆవశ్యకము. అనుగ్రహమయమును పతితోద్ధారకము నగు గురుదేవుని దివ్యరూపమును ధ్యానించుకొలది ప్రాక్తనవాసనలు క్రమక్రమముగా క్షీణించును. త్యాగనిస్సంగతలు తమంతట జొచ్చుకొనును. ఏకైకోపాయము ఆయన నుపాసించుటే, వేఱు మార్గము లేదు. ఆయన భక్తులతోడి సంసర్గ మనంత శుభదాయకము. మనసునకు ధ్యానప్రవణత కుదుర నప్పుడు, గురుదేవునిగూర్చిన చర్చలచేతను గ్రంథముల జదువుటచేతను ఎంతైన లాభ మొందనగును. మనసు పెడదారి పట్టదు, పట్టినను సరిదారికి మరలుటకు జాగుండదు. గురుదేవు ననుగ్రహమున భావికాలమున సైతము మనస్సు పెడదారి కీక జనకుండును. భయపడకు, సర్వకాల సర్వావస్థలందును గురుదేవుడు నిన్ను కాపాడుచున్నాడు. సుదూర గ్రామమున దరిద్రనారాయణసేవలో నిమగ్నుడవై యున్నప్పుడు నీదేహ మెంతో కష్టమున కోర్చినది. అన్నవిశ్రాంతుల విషయమునగూడ ఎంతో శ్రమపడితివి. ఆ దశలోసైతము గురుదేవుడు పరమకృపతో నిన్ను పర్యవేక్షించుకొనుచుండినాడు. ఇప్పుడు కేవల మాధ్యాత్మికాన్వేషకుడవుగా (మునుపటి వ్యగ్రతయు ఆధ్యాత్మికమే) హృషీకేశమున నున్నావు. ఇప్పుడు సైతము గురుదేవుడు నిన్ను రక్షించుచునే యున్నాడను నిజమును గుర్తింపుము. పరమానుగ్రహముతో ఆయన నీమనస్సును మెట్టుమెట్టుగ సమున్నతి నొందించు చున్నాడు. ఒందించుచుండగలడు. గురుదేవుడు నీకు సదా

పాపై యున్నాడను విషయమును గట్టిగ నమ్ముము.

ఇక నేమి వ్రాయుదును ? నీకును అందఱికిని నా హృదయపూర్వక ప్రేమానురాగాశీస్సులు. గురుదేవుడిష్టపడినన్ని నాళ్లిచ్చట నేయుండుము. శ్రద్ధాభక్తిప్రేమవివేకనిస్సంగత్యాగపరిపూర్ణుడ వగుదువుగాక.

శ్రేయోభిలాషి
శివానంద.

## 94

శ్రీరామకృష్ణమఠము
మైలాపూరు, మద్రాసు
11 మే 1921

ప్రియశ్రీమన్ —,

నీ జాబుచూచి సంతోషించితిని. నీవుత్తర కాశియందుండుట మంచిదే. ఉత్తర ఖండ మంతటికి ఆధ్యాత్మిక సాధన కెంతయు అనుకూల మైనచోటు అది. శ్రీగురుమహారాజు నీ జీవితమును పూర్తిగా తనలోనికి ఆకర్షించుకొనును గాక అనుటే హృదయపూర్వకమైన నా ప్రార్థన. మహాదేవుని ప్రత్యేక సాన్నిధ్య మున్నది ఆచోట. అచ్చటి యోగులను భక్తులను ఆయన అనుగ్రహించుచుండును. ఆధ్యాత్మికముగా ఎంతో పురోగమించిన సాధువు లొకకొందఱచట ఇంతకుమును పుండెడివారు. వారీపాటికి శరీరముల త్యజించి యుండవచ్చు. అక్కడ వర్షాకాల మంతగా అనుకూలింపదు. వేలయన నీరు ఆరోగ్యహానికరముగ మాఱును. ఎట్లో ఈశ్వరుడు సంకల్పించిన ట్లగుగాక. ఆధ్యాత్మికసాధనలు నీకింత ఆనందప్రదములుగ నుండుటకు కారణము నీపైని భగవంతుని ప్రత్యేకానుగ్రహమే అనుట నిస్సందేహము. లోతునకు పొమ్ము.

ఇంక నేమి వ్రాయుదును ? నీకు నా హృదయపూర్వక ప్రేమాశీస్సులు. విశ్వనాథ స్వామి నిన్ననుగ్రహించునుగాక, గంగామాత నిన్ను కనికరించునుగాక. ఇది నా హృదయాంతర్గతమైన ప్రార్థనము.

నీ శ్రేయోభిలాషి
శివానంద.

## 95

శ్రీరామకృష్ణమఠము
మైలాపూరు, మద్రాసు
22 మే 1921

శ్రీమన్ —,

నీ జాబువలన సంగతులన్నియు తెలిసినవి. గురుదేవు ననుగ్రహమున, నీ ఆరోగ్యము బాగున్నందుకు, యథాశక్తి నీ తపస్సాధనలు సాగుచున్నందుకు, భిక్షకు వసతికి సౌకర్యములు లభించుచున్నందుకు నేను సంతోషించుచున్నాను. నీకు భక్తిశ్రద్ధలును ప్రేమపవిత్రతలును మెండుగ నిండుగ కలుగవలయునని, తపస్సాధనల కనుగుణముగా నీ ఆరోగ్యము బాగుండవలయునని ఇదే నా ప్రార్థన. తోచినప్పుడెల్ల సేవాశ్రమమును దర్శించుచుండుము. అచటికి నీవు ప్రతిదినమును పోనక్కఱలేదు లెమ్ము. అక్కడ జరుగునదియు గురుదేవుని పనియే అనియు, అక్కడ ఉన్నవారందఱును గురుదేవుని భక్తులే అనియు గురుదేవునికి తమ్ముంకితము చేసికొన్నవారే అనియు నీవు జ్ఞప్తియుంచుకొనుట ఆవశ్యకము. వారు చేయుచుండు కార్యములు గురుదేవుని కార్యములే అనుట నీ మనస్సునందున్న చాలును. నీవు ఎక్కువగా పురోగమింపవలె ననుట హార్దమైన నా ప్రార్థనము.

దేహ సుస్థితిలో మాకు ఎట్టి కొదువయు లేదు. ఇచటి శీతోష్ణస్థితి ఎక్కువ అనుకూలముగా లేదు. ఎండలు మిక్కుటముగ నున్నవి. సముద్రముమీఁదుగ వీచు గాలి యున్నందున ఇచ్చట ప్రజలకు దినములు గడచుచున్నవి. ఇక కొన్నాళ్ళకు ఈ గాలు లాగిపోవునట. అప్పటి వేడిమి అతిదుర్భరముగ నుండునట. అప్పుడు మేము బెంగుళూరుకో చలువగల వే తేదేని ఊరుకో పోవుదుమేమో.

నీకు నా హృదయపూర్వక ప్రేమాశీస్సులు. తొందరపడకు ఈశ్వరానుగ్రహముచే నీ చిత్తము క్రమముగా భగవచ్చరణారవిందములందు నిమగ్నము కాగలదు. ప్రాతవాసనలు అంతరించిపోగలవు. నీ మనస్సు నిర్మలానందమున నోలలాడగలదు. అన్నిటికిని మూలాధారము గురుదేవుని కృపయే. సదా ఆయన కృపను కోరుచునే ప్రార్థించుచుండుము. ఏలయన వేఱు దారిలేదు. గురుదేవుడు నిన్ననుగ్రహించును గాక.

శ్రేయోభిలాషి.
శివానంద.

# విశ్వగుణాదర్శము

## శ్రీ రంగనాథానందస్వామి

జూన్ సంచిక తరువాయి

ప్రశ్న—అమెరికాలో విద్యార్థులసదస్సులలో పెక్కింట మీరు ఉపన్యసించితిరంటిరే, వా రడిగిన ప్రశ్నలనుబట్టి తెలియనగు వారి సమస్య లేవి?

జవాబు—భౌతిక (శారీరక) పరిధిని మించిన పరిధి ఏదేని మానవునకు గలదో తెలిసికొనవలయు ననుటే ప్రస్తుతము వారి ముఖ్య సమస్య. పాశ్చాత్యులయభిప్రాయమందంతటను మానవుని భౌతికపరిమితులే నొక్కి చెప్పబడుచుండును. మన యభిప్రాయమున మానవుని లోని ముఖ్యాంశము దివ్యత, ఆధ్యాత్మికత, ఈ యాశయము వారికి నచ్చినది. దీనిని వారు తెలిసికొనగోరినందున వేదాంతమునకు సంబంధించియు మానవునిదివ్యతకు సంబంధించియు నేవా రెక్కువ ప్రశ్న లడిగిరి. ఆ ఒక్కయాశయమునుండియే పెక్కు లితరము లుప్పతిల్లును. నైతికజీవితమున కంతటికిని, ఆధ్యాత్మికజీవితమున కంతటికిని, భౌతికావధుల నతిక్రమించిన జీవితమున కంతటికిని మూలాధారము 'మానవునిలోని సారతమాంశము దివ్యత, ఆధ్యాత్మికతత్త్వము' అను సూత్రమే. కావున ఈ విషయమునుగూర్చియే వారు పెక్కు ప్రశ్నలడిగిరి.

అమెరికనుప్రజలలో, ముఖ్యముగా విద్యార్థులలో వ్యాపించుచున్న రోగము పలుమందు దినుసులను మత్తుమందులు మొదలైన పెక్కింటిని సదా పుచ్చుకొనువాడుక. ఈదురభ్యాసము పెద్ద విద్యార్థులయొద్దనుండి చిన్న విద్యార్థులలోనికి వ్యాపించుచున్నది. ప్రస్తుత హైస్కూలు విద్యార్థులలో గూడ నిది వ్యాప్తమై యున్నది. కావున పెక్కుచోట్లలో ఇందుంగూర్చిన ప్రశ్నలును చర్చలునే జరిగినవి. ఒక్క అనుభవము చాల వింతగొలిపినందున ప్రత్యేకముగ

నాజ్ఞ ప్తిలో ఉన్నది. అది పిట్సుబర్గులోని కార్నెగిమెల్లన్ విశ్వవిద్యాలయములో ఘటిల్లినది. అక్కడ జరిగినదే నాతుది యుపన్యాసము. విశ్వవిద్యాలయములోని కాఫీచావడిలో అధిక సంఖ్యాకులమే సమావేశమైతిమి. ఆచారపు పాటింపు లేవియు లేక సభాకార్య మారంభమయ్యెను. చర్చ ప్రారంభముకాగానే వాతావరణము మాఱెను. అందఱు అందస్వయించిరి. ఎక్కడెక్కడనో పచారు చేయుచుండినవారు కూడ అక్కడికి వచ్చి నిలబడిరి. చర్చ సాగిన కొలది అందఱు అత్యంతసావధాను లైరి. పాల్గొన్న వారికెల్ల అ దొక ముఖ్యానుభూతి యాయెను.

అక్కడ చర్చకు వచ్చిన విషయము:— మానవజీవితమున ముఖ్యముగా ఆధ్యాత్మిక జీవితమున మత్తుమందులస్థాన మెట్టిది? "విద్యార్థులలో అత్యధికసంఖ్యాకులు మత్తుమందుల సేవించుచుందురు. ఇందులకు మీ రేమందురు, స్వామీ?" ఇది వా రడిగిన ప్రశ్న. మానవమనశ్శరీరాలకు ఆమత్తుమందులు ఎంతో చెఱుపు చేయు నని నే నెంతయు తీవ్రముగా చెప్పవలసివచ్చినది. మానవు నాధ్యాత్మికజీవితమునకును ఔషధసేవకును ఎట్టి సంబంధమును లేదు. మందులవల్ల మానసికమైన యొక పరిస్థితి ఏర్పడవచ్చు. కాని మందు కొక వరహాచొప్పున డబ్బిచ్చి ఆధ్యాత్మికపరతను విలిచికో జాలము. మానవశీలమున గల్గు సమగ్రపరిణామమే ఆధ్యాత్మికపరత. కావున అమెరికనుయువకులు మందుల దురభ్యాసపు చెడుగులను గుర్తింపవలయును. "ఈ గొప్పనాగరతను మీ అదుపులో నుంచుకొనునర్హతను మూడుతరములలో మీరు కోల్పోవుదురు" అని అమెరికను యువకులను నేను హెచ్చరించితిని. నా హెచ్చరికను వా రెంతయు శ్రద్ధతో ఆలకించిరి.

వారిట్లన్నారు—"మందుల నేల పుచ్చుకోరాదు? ఆధ్యాత్మికాభివృద్ధికి ప్రాతకాలపు గురువులకు తెలియని ఈ క్రొత్తమార్గమును అమెరికావారమగు మేము కనుగొంటి మను టే మావాదము." నే నంటిని: అది అమెరికనుల మతము కావచ్చు. కాని అందులకు నే నంగీకరింపను. మానవమనశ్శరీరముల ఆమత్తుమందు లేమి సేయునో మే మెఱుగుదుము. దేహమును మనస్సును మీ యౌషధసేవ చెడగొట్టును. అది మీకు కైపు కొలుపును, కునుకుపాట్లు కలిగించును, ఇంద్రియములస్థాయికి పైబడిన యొకయనుభూతిని అది మీకు కలిగింపవచ్చు. అది స్థూలజగమునకు పై నేమున్నదో దాని క్షణికదర్శనమే, ఈషద్దర్శనమే. సదా దానిపై ఆధారపడకుడు. అసాధారణవ్యక్తులు కొందఱు ఇట్టియనుభూతి నించుక గని, తర్వాత ఔషధసేవను మాని ఆత్మాన్వేషణము నాస్థతో నారంభించిరేమో! అందుపై మనవంటివార మాధారపడకూడదు. తఱచు మనము ఆస్థాయిలోనే చిక్కుకొందుము. మనశ్శరీరహానికరములగు ఆయౌషధ వ్యసనమునకు బానిసలముగ నుందుము.

విద్యార్థులలో ఆనాడు చుఱుకు పుట్టినది. 'మన మేమి చేయుద' మని కొంద ఱడిగిరి. కొందఱు "పిట్సుబర్గులో 'వేదాంతసొసైటిని' నెలకొల్పుదము. అది మనవిద్యార్థులకు ఉపకారకముగ నుండగలదు" అనిరి. ఒకవిద్యార్థి వేదాంతగ్రంథములసెట్టును కొని "ఒకగ్రంథాలయమును నెలకొల్పుద మని నాకోరిక ఈయాశయము లితరవిద్యార్థులకును అందును గాక" అనెను.

విషయము నీవిధముగ వివరించినప్పుడు విద్యార్థులు మిక్కుటముగ వహించిన యొక్క అను నేను గుర్తింపగలిగితిని. ఏదేనొక మతము వారు నిషేధించినమాత్రమున వేదాంతుల మగు మేము 'దానిని చేయకు' 'దీనిని చేయకు' అనువారము కాము. మేము శుష్కతపఃపరులము కాము. శ్రేయస్కరమైనదానిని తప్పక ఆమోదింతుము. హానికరమైనదానిని తప్పక త్రోసిరాజందుము. యువకుల సున్నితములైన శరీరములు ఈమత్తుమందులచే ఇక బాగుపడని రీతిగా చెడిపోగలవు. యువకులలో ఈమందు వాడుకల వ్యాప్తిని గూర్చి వేదాంతులమగు మేము ఆందోళనపడుటకు కారణ మదే. కొంత పరిణతవయస్కులకు ఆమందు లంత చెఱుపు చేయకపోవచ్చు, కాని లేబ్రాయమువారికి మాత్ర మది ఎంతయు హానికరమే.

ప్రశ్న—మీకొనగూడిన యీ సమావేశానుభవాలనుబట్టి—మన దేశమందలి యువకులసమస్యలకును అమెరికాలోని యువకుల సమస్యలకునుగల ముఖ్య భేదములు ఏవి యందురు ?

జవాబు—ఒక ముఖ్య భేద మిది-ఆర్థికాభివృద్ధియందేమి సాంఘికాభివృద్ధియందేమి వెనుకబడియున్న దేశము మనది. మన సమస్యల కన్నిటికి మూలము ఆ పరిస్థితి. ఉద్యోగాలకు ఇతరాభివృద్ధులకు మార్గము లేవి అనుటే మన సమస్య. పూటగడచుటకైనను చాలినంత డబ్బు మనకు లేదు. అమెరికాలోని పరిస్థితి భిన్నము. అక్కడి సమస్యలకు కారణము వస్తుసంపదల ఉత్కటత. నిజమునకు 'సంపన్న ప్రజానీకము' అను ఆశయమునకే అమెరికాలో తిరుగుబాటు కనఁగుచున్నది. యువకులలో అత్యధికసంఖ్యాకులు సంపన్నులనిపించుకొనుట నించుకైన సహింపకున్నారు. తిరుగబడుచున్నారు. విద్యార్థులలో బాలబాలికలలో అత్యధికసంపదగలవారు విశ్వవిద్యాలయాలకు సాదానిరాడంబర వేషములతో వత్తురు. శ్రీమంతులబిడ్డలని అనిపించుకొనుట వారికిష్టముకాదు. ప్రస్తుత సాంఘికపరిస్థితులకు వారివైఖరి యొక తిరుగుబాటు. మానవునకు పేదఱికము కలిగింపగల చిక్కులను మించిన చిక్కులు సంపన్నత వలన గలుగుచుండును. అమెరికాలో పరిస్థితిలో నేను చూచిన దది. వేలకొలది సంవత్సరములుగనుండిన పేదఱికము మానవు నుత్సాహమును చెడగొట్టలేదు. మానవు నుత్సాహమును భంజించుటకు సంపన్నత ఒక నూఱేండ్ల కాలమున్న చాలును—ఆధునిక కాలాను భూతులలో స్పష్టముగ గనిపించున దిది.

భారతదేశములో పరిశ్రమలు పెంపొందుట, ఆర్థికాభివృద్ధి కవకాశములు లభించుట-ఇటువంటివి చిక్కులనుండి మనకు విముక్తిని గలిగింపగలవు. మనదేశములో మనకును సమస్యలున్నవి. ఏల యన-ప్రస్తుత విద్యావిధానమున మన తత్త్వశాస్త్రానుగుణమైన జీవితలక్ష్యమేదియు స్పష్టపఱుపబడియుండలేదు. ఇప్పటికింకను మనచదువు పొట్టకూటిచదువే కావున అది మానవజీవితములోని ఉదాత్తాశయముల స్రవంతి నెండగొట్టును. మనప్రవర్తన ఎట్టి లక్ష్యమును లేని దగును. ఎటువైపు చనుచున్నామో తెలియకే చనుచుందుము. జీవితమున కొకలక్ష్యము లేనివాని శక్తియుక్తులు హానికరములగు త్రోవలలో దుర్వినియుక్తము లగును. ఈ లక్ష్యరహితత మనదేశములో పైతరగతుల ప్రజలలో నేర్పడుచున్నది. మన యువకుల చెడునడవడికి చాలమట్టుకిదే కారణము. వారికి మన మెటువంటి ఉన్నతలక్ష్యమును చూపెట్టినవారము కాము. మనదేశములో తాత్త్విక పారమార్థిక జ్ఞానసంపద

సమృద్ధిగనే యున్నది. ఆ యాశయములను ప్రజలలో చక్కగా ప్రచారము చేసితిమేని మన దౌర్బల్యము తొలగి ఆర్థికాభివృద్ధికూడ సిద్ధించును. ఆర్థికరంగమునసే కాక నైతిక పారమార్థికరంగములలో సైతము మనము ముందుకు జనుచున్నవారితో కలిసికోగలము. రోగ ముండుటే కాక అదృష్టవశమున మందు గూడ మనయొద్దనే ఉన్నందున సమస్యలను పరిష్కరించుకోగలము.

మందు ఎక్కడ నున్న దనగా మనతత్త్వ శాస్త్రములో నున్నది, మన ఆలోచనలలో నున్నది. కాని దానిని మనము యువకులయెదుట బెట్టుచున్న రీతిలో వారు గ్రహింపలేకున్నారు. దేనినిగాని నిర్బంధరూపమున చెప్పగూడదు. సవివేకవైజ్ఞానికమార్గములో జెప్పవలయును. భారతదేశములో ఇది నా సొంత యనుభవము. ఘనుడు మానుడు అని శాసించినచో ప్రజలు మన మాట వినరు. కాని మన విజ్ఞానసంపదను వారియెదుట బెట్టినచో వెంటనే వారు తదభిముఖు లగుచున్నారు. ఈనాడు ప్రాచ్యదేశములందేమి పాశ్చాత్యదేశములందేమి నిర్బంధముల కెదురుదిరుగుటే యువకులకు పరిపాటిగ నున్నది. మన తత్త్వశాస్త్రము ఎదుటివారిని నిర్బంధింపకే వారి మనసులకు నచ్చునట్టిది. యువకులను అందు కభిముఖులనుగా జేయు టెట్లు? భారతదేశములో మన సమస్య అది. అన్నము సిద్ధముగ ఉన్నది. ప్రజలకు దానిని అందజేయవలసియున్నది. అంతే. ఇతరదేశములలో అన్నము నికమీద సంపాదింపవలసి యున్నది. మానవుల పారమార్థికపోషణకు ఆవశ్యకమైన వరిస్థాన్న మిది.

ప్రశ్న—అమెరికాలోని యువకోద్యమములకు కారణము వారి ఆశాభంగమా, లేక వారిలో నూతనప్రబోధమా?

జవాబు—చాలమట్టుకు ఆశాభంగమే, రవంత నూతనప్రబోధమును గలదు. ఆశాభంగము అతిస్పష్టముగ గననగుచున్నది. ఆర్థికాభ్యున్నతివలన మానవతాంశములు కొన్ని నశించుచున్నవి. వ్యక్తులకేమి సమష్టికేమి ఒకవిసుగు ముంచుకు వచ్చుచున్నది. ఇట్లు వచ్చు నని డెబ్బదేండ్లకు ముందే శ్రీ వివేకానందస్వామి హెచ్చరించియుండెను. ప్రపంచచరిత్రలో అప్పుడప్పుడు ప్రపంచము మీాది ఈ విసుగు గననగుచుండును. పాశ్చాత్యనాగరకదేశాలలో ప్రస్తుతము అటువంటి యొకవిసుగు కననగుచున్నది. ప్రపంచయుద్ధానంతరము అమెరికా సంయుక్తరాష్ట్రాలలో ఆ విసుగు కననగుచున్నది. "ఇదంతయు ఎందుకు? ఈ సంపదకు ఈ శక్తులకు ఈ సాంకేతిక విద్యాభివృద్ధికి ఏమిప్రయోజనము?" అను తలంపు గలుగుచున్నది. హార్వర్డు విశ్వవిద్యాలయవిద్యార్థులు తమ కోరికల నొకపత్రములో దెలిపిరి. అందు ఈ విసుగు సూచితమై ఉన్నది. యుద్ధకాలములో దేశసంరక్షణార్థము ఆవశ్యకములైనవానిని ఉత్పత్తిచేయు పరిశ్రమయు ఉన్నతయంత్రవిద్యయు తమ కక్కఱలేదనివా రందు తెలుపుకొనిరి. "ఇవన్నియు ఎందుకు? మానవునిలోని పారమార్థికాంశము ఏ మాయెను?" అనుభావమును వెలిపుచ్చిరి.

మానవజీవిత పరమార్థ ప్రాముఖ్యాల అన్వేషణము సాగుచున్నది. కాని ఆ ప్రవణతలను సరియైన దారిలో ఫలాభిముఖముల చేయ సమర్థమగునట్టి తత్త్వశాస్త్రము పాశ్చాత్యదేశాలలో లేకపోవుట దురదృష్టము. కావున అమెరికాలో 'తెగిపోయిన గాలిపటమువలె నగుట' అనునది జరుగుచుండును. సంఘమునాదరింపనివారిని, సంఘమునం దన్వయింపనివారిని 'తెగిపోయిన గాలిపటమువంటివా' రను

చుందురు. అట్టివారిలో ఎందఱో యువకులు యువతులు ఉన్నారు. సంఘములో వారికి 'హాయి' లేదు. వేఱు గంతవ్య మేదీ? గంతవ్య మేదియు లేని త్రిప్పటయు అశాంతియు వారిది. వారిని ఊరుద్రిమ్మరులు (హిప్పీలు) అందురు. వారు తమ్ము అమెరికాతో సంబంధపఱచుకోరు. మఱి వారు ఏసంఘమునకు చెందినవారు? వారికే తెలియదు. కావున వారు సంఘమునకే కాక తమకు తామును ఒక సమస్యగా పరిణమించుచున్నారు. వారిలో కొందఱు దుండగీండ్రగుదురు. కొందఱు త్రాగుబోతు లగుదురు. కొందఱు రాజకీయ లగుదురు. కోటి కొకడో లక్ష కొకడో ఆధ్యాత్మిక విషయప్రవణు డగును. నేను వివరించిన పరిస్థితి పాశ్చాత్యదేశా లన్నింటిలో ఉన్నది, ముఖ్యముగా అమెరికాలో నున్నది.

పెక్కు సభలలో నేను ఈలాగు చెప్పవలసి వచ్చినది. ఈ 'తెగిపోయిన గాలిపటాలవంటి వారి సమస్య'ను భారతీయులు పరిశోధించి నారు, దానికి పరిష్కారమును సిద్ధపఱచినారు. భారత దేశచరిత్రలో వచ్చు మహాపురుషులలో వరిష్ఠులు కొందఱు తెగిపోయిన గాలిపటాలే. బుద్ధదేవు డొక తెగిపోయిన గాలిపటమంటిని, వా రాశ్చర్యపడిరి. సంఘము బుద్ధదేవునకు నచ్చలేదు. ఏమి చేసినాడాయన? తన విరక్తిని లోకాభ్యుదయకర సందేశరూపమున వెలువఱచినాడు. అమోఘముగాసాగిన భారతదేశ పునరుద్ధరణమునకు ఆయన ప్రథమనిర్వాహకుడు ప్రముఖ నిర్వాహకుడు నయ్యెను. ఈ తెగిన గాలిపటాలవంటి వారిలో అనేకులు జగద్ధిత సంపాదకావతంసు లైరి.

వారి శక్తియుక్తులకు సద్వినియోగమార్గమే కావలసినది. నే నొక తెగిపోయిన గాలిపటమును కాని సంఘశ్రేయమునందు నా కక్కఱ యున్నది. నా ఆశయాలను కార్యసాధకములనుగా జేసికొను దారి నా కున్నది. అమెరికా ప్రజల వాడుకలో అట్టిదాని లేదు. ఇది వారి కొక క్రొత్త యనుభవము. ఐనను ఇతర నాగరకతల సాహచర్యమున అమెరికా ప్రజలును తమ శక్తియుక్తులకు అమోఘ ఫలప్రద పథములను కనుగొన గలరనుట నా నమ్మకము. ఈ సమస్యను మేము గాఢముగా చర్చించితిమి. ఈ చర్చలు విద్యార్థుల కెంతో రంజకములుగా ఉండినవి. ఒక ఉపన్యాస మొకగంటసేపు సాగును. తర్వాత ఈ చర్చలు ఒక్కొక్కప్పుడు మూడుగంటలసేపు చెల్లును. ఇవి వారికి నూతనాశయాలు, ఇందు వారి కాసక్తి ఎంతేని కలదు.

శౌర్యంబు గలుగుట జన్మసాఫల్యంబు, శాంత మాత్మవివేకసాధనంబు,
మానంబు దనకును మహనీయసంపద, సిగ్గుతో బ్రతుకు సంజీవనంబు,
సవినయవచనంబు సర్వవశ్యకరంబు, వెలయు నాచారంబు వెనుబలంబు,
దానంబు నేయుట తన కదివ దాఁచుట, సజ్జనసంగతి సౌఖ్య మొసఁగు,—
గాన బుధు లీ గుణములు మాన కెపుడు, తగిలి మిమ్ము భజింతురు తలఁచి తలఁచి,
కలితలక్ష్మీశ, సర్వజగన్నివేశ, విమలరవికోటిసంకాశ, వేంకటేశ.

—తాళ్ళపాక పెదతిరుమలాచార్యుడు.

## వార్తలు - విశేషాలు

### శ్రీమత్కైలాసానందస్వాములకు వీడ్కోలు

క్రీ. శ. 1944-వ సంవత్సరంనుండి 1971 వఱకు ఇరవైయేడేండ్లకాలం మద్రాసు శ్రీరామకృష్ణమఠమిషనులకు ప్రెసిడెంటుగాను వేదాంత కేసరిపత్రికకు సంపాదకులుగాను ఉండిన శ్రీమత్కైలాసానందస్వాములవారు బేలూరు మఠంలో కోశాధ్యక్షపదవికి నియుక్తులై 1971వ సంవత్సరం జూలై 2-వ తేదీనాడు అక్కడికి విజయం చేశారు. వారికి వీడ్కోలు ప్రణామాంజలులు సమర్పించడానికి జూన్ 27-వ తేదీనాడు మైలాపూరు వివేకానంద సెంటినరిహాలులో పౌరమహాసభ సమావేశమైనది. హైకోర్టు ప్రధాన న్యాయమూర్తులు మాన్యశ్రీ కె. వీరాస్వామిగారు సభాధ్యక్ష్యం వహించారు. ప్రార్థనగేయానుసంధానానంతరం శ్రీ అణ్ణా ఎన్. సుబ్రహ్మణ్యంగారు సదస్సుకు స్వాగతాభివందనాలు అర్పించారు. మిషను ఆధ్వర్యంలో ఉన్న విద్యాది సకలసంస్థలవారిపక్షమున వివేకానందకళాశాల ప్రిన్సిపాలు జి. వేంకటరామన్‌గారు వీడ్కోలు వందన పత్రాన్ని చదివి స్వామికి సమర్పించారు. మఠ సేవాకార్యకలాపాలలో శ్రీమత్కైలాసానంద స్వాముల ఆధ్యక్ష్యకాలంలో ఒనగూడిన అభివృద్ధులన్నీ ఆ వందనపత్రంలో ప్రస్తుతింపబడ్డాయి. డాక్టరు టి. ఎమ్. పి. మహాదేవన్‌గారు ఆంగ్లంలోను కి. వా. జగన్నాథంగారు తమిళంలోను ఉపన్యసిస్తూ మద్రాసు నగరంలో తమిళనాడులో రామకృష్ణోద్యమ వ్యాప్తికి శ్రీ కైలాసానందస్వాములు కావించిన కృషిని కొనియాడారు. సభాధ్యక్షులున్ను స్వాములవారి ప్రభావవిశేషాలను ఉగ్ఘాటించారు. శ్రీ కైలాసానందస్వాములు ఈ ప్రశస్తులకన్నిటికీ సముచితమైన ప్రత్యుత్తరం వాక్రుచ్చారు. భగవత్పరతంత్రతను అలవఱచుకొండని శ్రోతలకు ఉపదేశించారు.

శ్రీ ఎస్కే. శివరాంగారు సభకు వందనోపచారం కావించారు.

శ్రీ కైలాసానందస్వామి కల్కత్తాకు బయలుదేఱిన దివసమైన 2-6-1971-వ తేదినాడు భక్తులు మిత్రులు మగవలు మగవాండ్రు అత్యధికసంఖ్యాకులు మఠంవద్దనున్నూ విమానాశ్రయంవద్దనున్నూ కూడి స్వాములవారిని భక్త్యాదరపురస్సరంగా సాగనంపారు.

ముప్పైఏండ్లుగా తిరువనంతపురం (త్రివేండ్రము)లోని శ్రీరామకృష్ణాశ్రమమునకు అధ్యక్షులుగా ఉంటూ వచ్చిన శ్రీమత్తపస్యానందస్వాములు ప్రస్తుతం మదరాసు మఠానికి అధ్యక్షులుగా విచ్చేసియున్నారు.

### శ్రీరామకృష్ణమిషను స్టూడెంట్సుహోము
### మైలాపూరు, మద్రాసు
### 1969-70 నివేదిక

హోములో మూడు శాఖ లున్నాయి— హైస్కూలు శాఖ, కాలేజిశాఖ, టెక్నికలు శాఖ. మైలాపూరు ఓరియంటలుస్కూలు విద్యార్థులు కొంతమందిమాత్రం చేర్చుకోబడ్డారు. వారికి భోజనమున్నూ వసతిన్నీ ఉచితంగా సమకూర్చబడ్డాయి. హైస్కూలు శాఖలోని విద్యార్థులందఱు హోములో ఉండి చదువుకొనేవారే. కాలేజిశాఖలో విద్యార్థులకు బస హోములో, చదువు వివేకానంద కాలేజిలో. టెక్నికలుశాఖలో డిప్లొమాకోర్సు చదివేవారికి భోజనం హోములోనే. పోస్టు

డిప్లొమా తరగతి విద్యార్థులలో పగటివేళ చదువుకు మాత్రం వచ్చి పొయ్యేవారు కొంద ఉన్నారు.

## హైస్కూలు

VIII-వ తరగతినుండి XI-వ తరగతివఱకు మొత్తం నాలుగుతరగతులే ఉన్నాయి. చదువు కుంటున్నవారిమొత్తం సంఖ్య 151. ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షకు కూర్చున్నవారి సంఖ్య 37. అందు 36 గురు ఉత్తీర్ణ లయ్యారు.

## కాలేజిశాఖ

విద్యార్థులసంఖ్య ప్రీయూనివర్సిటి తరగతి వారు 14; డిగ్రీతరగతులవారు 34; బి. టెక్కు-1. బి. ఎస్. సి. పరీక్షకు కూర్చున్న విద్యార్థులు 5. అందఱూ నెగ్గారు, నలుగురు ప్రథమ శ్రేణి (ఫస్టుక్లాసు)లో ఉత్తీర్ణ లయ్యారు. ఒక విద్యార్థి సంస్కృతంలో ఎమ్. ఏ. పరీక్షకు కూర్చున్నాడు, ఉత్తీర్ణ డయ్యాడు. పి.యు.సి. పరీక్షకు కూర్చున్న పదుమగ్గురూ నెగ్గారు, వారిలో పన్నిద్దఱు మొదటితరగతిలో నెగ్గారు.

## టెక్నికలు ఇన్‌స్టిట్యూటు

ఇందులో ఉన్న తరగతులు:-ప్రీటెక్నికలు కోర్సు (ఒక సంవత్సరం చదువు), మెకానికల్ ఇంజనీరింగు డిప్లొమాకోర్సు (రెండేండ్ల చదువు), ఆటోమోబైల్ ఇంజనీరింగు పోస్టు డిప్లొమా కోర్సు (ఒకటిన్నర సంవత్సరాల చదువు). మెషీన్‌షాపు టెక్నాలజిని ఆటోమోబైలు టెక్నాలజీని బోధించే ఏర్పాట్లు కూడా ఉన్నాయి. ఈ సంవత్సరం ఈయిన్‌స్టిట్యూటు లోని విద్యార్థులసంఖ్యా వివరాలు-ప్రీటెక్నికలు తరగతి 32, డిప్లొమాకోర్సు మొదటిసంవత్సరం 36; డిప్లొమాకోర్సు రెండోసంవత్సరం 35, పోస్టుడిప్లొమాతరగతిలో గటివేళ చదువుకు నేందుకు మాత్రం వచ్చిపోవు విద్యార్థులు 15; ఆలాగు వచ్చిపొయ్యేవాళ్లు ఇతరతరగతులలో మొ తం 18.

## సెంటినరి ప్రైమరీస్కూలు

బాలురసంఖ్య 345, బాలికలసంఖ్య 195. 24 మందికి మాత్రం మధ్యాహ్నభోజనం సరఫరా చేయబడింది.

## మిడిల్‌స్కూలు : మల్లియన్కరణై

బాలురసంఖ్య 134, బాలికలసంఖ్య 25. వృత్తి విద్య పూర్వాంగంగా ఇక్కడ వ్యవసాయం కఱపబడింది. హాస్టలులో భోంచేస్తున్న వారు 45 గురు. అందు 36 గురు పెద్యాల్లు వర్గాలవారు. 100 మంది విద్యార్థులకు మధ్యాహ్నభోజనం సరఫరా చేయబడింది.

## రామకృష్ణమిషను

తూర్పుబంగాళ కాందిశీకులకు సాహాయ్య కార్యక్రమం 1971.

14-4-71 నుండి 30-6-71 వఱకు సంగ్రహ నివేదిక.

ఈ రెండున్నరనెలలలో మిషను వారు క్రింద పేర్కొన్న కేంద్రాలగుండ 1,19,320 మంది ప్రజలకు సాహాయ్యం అందజేసియున్నారు. ప్రస్తుతం సాహాయ్యం పొందుతుండే వారిసంఖ్య 98,320

| సాహాయ్య నిర్వాహణ కేంద్రం | కాందిశీకుల సంఖ్య |
|---|---|
| పిల్లాంగు ఆశ్రమాధ్వర్యంలో మేఘాలయపు సరిహద్దున రెండు కేంద్రాలు 1 దాకి 2 మదన్ | 16,000 |
| చెత్లాపుంజి ఆశ్రమాధ్వర్యంలో మేఘాలయపు సరిహద్దున రెండు కేంద్రాలు 1 షెల్లా 2 ఇక్కామటి | 14,000 |
| ఆస్సాము సరిహద్దున కరీమ్గంజి (ఒక్కటే కేంద్రము) | 3,000 |
| బెరుబారివద్ద శకటిలో జల్పైగురి (ఒక్కటే కేంద్రము) | 14,000 |
| పశ్చిమ దినాజ్పూరులో దార్జిమోన్ (ఒక్కటే కేంద్రం) | 30,000 |
| నరేంద్ర పూరాశ్రమాధ్వర్యంలో నాలుగు కేంద్రాలు. అన్ని ఇరవైనాలుగు పర్గణాల జిల్లాలోనే 1. గైఘట 2 కలాసీమ 3 బక్చార 4 లక్ష్మీపూరు. | 21,320 |
| నాదియాజిల్లాలో జమ్షెదుప్పూరు (ఇది 25-5-71 నాడు మూసివేయబడినది) | 21,000 |
| | 1,19,220 |

## నిర్వహింపబడ్డ సాహాయ్య కార్యక్రమ స్వరూపం

ఆహారపదార్థాల పంపకం: కొన్ని కేంద్రాలలో అన్నమే పెట్టబడింది. వస్త్రాలు దుప్పట్లు, పరికరాలు, పాలుపొడి శిశువుల ఆహారం, ఉచితవైద్యం—మందులు—పథ్యం, ఇవి సమకూర్చబడ్డాయి. ప్రభుత్వంవారు అందచేసిన ఆహారపదార్థాలు చాలక కొన్నిచోట్ల మిషను వారు అటుకులను బెల్లపునీటిని సరఫరా చేశారు.

వర్షాలు ప్రారంభం అయ్యాయంటే కాందిశీకుల అక్కఱలు ఎక్కువౌతాయి. తారు పూసిన కిత్తనారగుడ్డలు జరూరుగా కావలసి ఉన్నాయి. వానలు వెలసిన వెంటనే చలికాలం వస్తుంది. అప్పటి అక్కఱలు అప్పుడుంటాయి. మిషన్ జెనలు సెక్రెటరిగారు వస్తురూపంగాను రొక్కరూపంగాను విరాళాలు ఒసంగవలసిన దని విజ్ఞప్తి తెలుపుకొని ఉన్నారు.

## శ్రీ జగద్గురు విరాట్టు పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారి అఖండారాధనాయజ్ఞం

వరంగల్లు జిల్లాలో జనుగాము తాలూకాలో చేర్యాలగ్రామంలో పోలోజు నారాయణాచారిగారి గృహంలో 1971-వ సంవత్సరం

మే నెల 4, 5 తేదులలో పైని పేర్కొబడ్డ అఖండారాధనాయజ్ఞం యథావిధిగా విభవోత్తరంగా జరిగింది. ఇరవైనాలుగుగంటలు నామసంకీర్తనమూ, చేర్యాల గీతా సంఘాధ్యక్షులయిన శ్రీ వై. బాలకృష్ణరావుగారి ఆధిపత్యమున పౌరమహాసభయూ, శ్రీ జి. టి. యాదవగిరిరావుగారు, శ్రీ ఎస్. విశ్వనాథాచారిగారు, శ్రీ ఎస్. హరగోపాలుగారు, శ్రీ చెల్లన్నగారి బాలాజీగారు, శ్రీ ఆర్. చంద్రయ్యగారు, శ్రీ ఇప్పకాయల సత్యనారాయణగారు, శ్రీసంజీవాచారిగారు, శ్రీ పోలోజు నారాయణాచారిగారు అను ప్రముఖుల ఉపన్యాసాలు జరిగాయి. తీర్థప్రసాదవినిమయంతో కార్యక్రమం సమాప్తమైంది.

# గ్రంథపరిచయం

## శ్రీ నామ రామాయణమ్

ఇది ఆర్ష సాహితీవారి 7-వ ప్రచురణం. యావద్భారతదేశ ప్రసిద్ధమైన 'శుద్ధబ్రహ్మ రాత్పరరా' మేత్యాది అష్టోత్తర శతనామావళి రూపంలో ఉన్న రామాయణానికి ఇది చక్కని ముద్రణం. "ఆర్ష సాహితి, సనాతనధర్మప్రచార సంస్థ, 25-7-18 ఆమంచివారివీధి, విజయనగరం 2" అనే విలాసానికి పోస్టుఖర్చులకై 20 పైసల తపాలా బిళ్ళలు పంపి ఈపుస్తకాన్ని పడయవచ్చు. 'వక్త మహనీయుడు, ఆయనగ్రంథం ఇది' అని ఆదరింపబడే గ్రంథాలు ఉన్నాయి. "వక్త ఫలానా అని తెలియదు. విషయం మాత్రం అమృతమధురం" అని ఆదరింపబడే గ్రంథాలున్నాయి. నామరామాయణం ఈ రెండో కోవకు చెందింది. పేరుకు ముందు ఈ ప్రచురణకర్తలు తగిలించిన "సమర్థ రామదాసస్వామికృత" అను దళం నిరాధారం.

## శ్రీ రామరమామనోహర స్తవము

రచయిత : శ్రీ బండారుపల్లె సీతారామయ్యగారు. ప్రాప్తిస్థానం శ్రీగ్రంథి నాగయ్య, పొన్నెకల్లు పోస్టు గుంటూరు తాలూకా, పుటలు 34, వెల 50 పై.

గుంటూరు తాలూకా పొన్నెకల్లు గ్రామంలో శ్రీకరణం పొన్నెకంటి సూర్యనారాయణగారి గృహంలో ఒకగదిలో శ్రీ పొన్నెకంటి జోగయ్యగారు శార్వరి సంవత్సరంలో ఒక శ్రీరామభజనమందిరం స్థాపించారు. తర్వాత కొన్నియేండ్లకు గ్రంథి చెంచయ్యగారు శ్రీరామునకొక ఆలయం కట్టించారు. ఆ శ్రీరామచంద్రునకంకితంగా రచయిత శతకం వ్రాయ సంకల్పించి కొన్నిపద్యాలు వ్రాశారు. ఇంతలో వారు ఆగ్రామం వదలవలసి వచ్చినందున శతకం అసంపూర్ణముగ ఆగిపోయింది. ఆ అసంపూర్ణశతకం మధ్వశ్రీపల్లె పూర్ణప్రజ్ఞాచార్యులచే సంస్కరింపబడి ఈలాగు ముద్రితమైనది. పద్యాలలో ఒకచంపకం ఉంది, తక్కినవి అన్నీ ఉత్పలాలే. ప్రతిపద్యానికి మకుటం "పొన్నెకంటి పురమందిర, రామ, రమామనోహరా" అని. భక్తినిష్యందమైన ఆ పద్యావళికి, రచయితగారు "విన్నపము" అను పేర పారమార్థికవిషయకంగా ఒక వ్యాసం వ్రాసి జతపఱచిఉన్నారు. రామభక్తులకూ ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకూ ఈ పద్యావళియు ఈ వ్యాసమున్నూ, అత్యంత ప్రీతికరాలు.

# శ్రీ రామకృష్ణ కథామృతము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

పరిశోధితమగు 1121 మహోపదేశములతో, సంగ్రహ జీవితముతో నలరారుచున్నది.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధ గురువులు, లౌకికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు : వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, జీవుడు : దేవుడు, జ్ఞానము: భక్తి: కర్మము, బ్రహ్మతత్త్వము, సూక్తులు: నీతికథలు మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసిబిడ్డలకయిన నవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

...ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూత్రాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి...

—ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్వలమగు పంచమ ముద్రణము : వెల : అట్టబైండు : రూ. 4-50
క్యాలికో : రూ. 5-50

---

# శ్రీ రామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

'రామకృష్ణదేవుని దివ్యోపదేశవాక్యము లాధారముగాగొని, వానిని విరివిపఱచి, మనోహరకథారూపముగను, సంభాషణరూపముగను అమర్చి, శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారిగారు తమిళభాషలో రచించిన జనాకర్షకగ్రంథము. దాని యనువాదాలు ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతి, హిందీభాషలలో నిప్పటికే అపారవ్యాప్తినొందినవి. ఆ గ్రంథమున కిది చక్కని ఆం ణము.

128 పుటలు వెల : రూ. 1-25

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# ఎక్కువ లాభం ఆర్జించండి

సొమ్ముకు

# 7½%

## 7— ఏండ్ల నేషనల్ సేవింగ్స్ సర్టిఫికేటు
(నాల్గువ ఇష్యూ)

పొదుపు చేసుకునేందుకు అత్యుత్తమ పద్ధతి. పన్ను విధింపబడే ఇతర సెక్యూరిటీలు, డిపాజిట్ల మీద లభించే వడ్డీతో కలుపుకుని సంవత్సరానికి రూ. 3000 వడ్డీ వరకు రాబడి పన్ను ఉండదు.

మీ పోస్టాఫీసులో వివరాలు తెలుసుకోండి

జాతీయ పొదుపు మొత్తాల వ్యవస్థ

davp 70/662

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ హీరానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# తెలుగు, తమిళ పాఠకులకు అరుదైన అవకాశం

## ఈ క్రింది పుస్తకాల ధరలో 25 శాతం తగ్గింపు

పుస్తకాల ఖరీదు పంపి లాభం పొందండి.

తపాలా ఖర్చులు అదనం.

## తెలుగు

## శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి

(10 సంపుటాలు)

ప్రతి సంపుటంలోను పుటలు 500 ల కెక్కువే. ఆంగ్లభాషలోనున్న సంపూర్ణగ్రంథావళి కిది తేటతెనుగున అనువాదం.

| | | | | |
|---|---|---|---|---|
| అసలు ఖరీదు | సాదాఅట్టబైండింగు | ర్సూ. 51-50 | కాలికో | ర్సూ. 65-00 |
| 25 శాతం తగ్గింపు ధర | ,, | ర్సూ. 38-63 | ,, | ర్సూ. 48-75 |

## తమిళం

## 1. స్వామి వివేకానన్దరిన్ జ్ఞానదీపమ్

(10 సంపుటాలు)

ప్రతి సంపుటంలోను పుటలు 500 ల కెక్కువే. ఆంగ్లభాషలోనున్న సంపూర్ణగ్రంథావళి కిది సరళ తమిళములోనికి అనువాదం.

| | | | | |
|---|---|---|---|---|
| అసలు ఖరీదు | సాదాఅట్టబైండింగు | ర్సూ. 50-00 | కాలికో | ర్సూ. 65-00 |
| 25 శాతం తగ్గింపు ధర | ,, | ర్సూ. 37-50 | ,, | ర్సూ. 48-75 |

## 2. స్వామి వివేకానందర్

రచయిత : రా. గణపతి

(పుటలు 895)

స్వామిజీ జీవితచరిత్రం ఇందు విపులంగా పొందుపఱుపబడి ఉన్నది.

| | | |
|---|---|---|
| అసలు ఖరీదు | కాలికో | ర్సూ. 9-00 |
| 25 శాతం తగ్గింపు ధర | ,, | ర్సూ. 6-75 |

పుస్తక విక్రేతలకు 33⅓ శాతము కమీషను ఈయబడును.

---

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 4.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౮   ౧౯౭౧ - సెప్టెంబరు : విరోధికృత్తు - భాద్రపదము   సంచిక ౩

## విషయసూచిక

ఫోను : 71231 పోస్టు బాక్సు : 635

మా మాసపత్రికలు

# వేదాంతకేసరి

తత్త్వశాస్త్ర - మత - సంస్కృతివిషయికంగా 1914-వ సంవత్సరంనుండి నడపబడుతుండే ఆంగ్ల మాసపత్రిక

సాలు చందా : ఇండియాలోను, సింహళంలోను 6 రూపాయలు; ఇతర విదేశాలలో 3 డాలర్లు, లేదా 14 షిల్లింగులు.

# శ్రీ రామకృష్ణ విజయం

మత - సాంస్కృతికవిషయికంగా 1921-వ సంవత్సరమునుండి ప్రచురింపబడుతున్న తమిళ మాసపత్రిక

సాలు చందా : ఇండియాలో రూ॥ 5 లు, సింహళములో రూ॥ 7 లు.

# శ్రీ రామకృష్ణ ప్రభ

1944-వ సంవత్సరంనుండి ప్రచురింపబడుతూ విశ్వోపజీవ్యమైన ఆధ్యాత్మిక విజ్ఞానామృతమును పెదజల్లే తెలుగు మాసపత్రిక

సాలు చందా : ఇండియాలో రూ॥ 5 లు, సింహళములో రూ॥ 7 లు.

1. చందాదారులు ఉత్తరప్రత్యుత్తరాలలో తమ 'చందాదారు సంఖ్య' నుదాహరిస్తూ విలాసాలను స్పష్టంగా వ్రాయాలి.
2. పత్రిక అందకపోతే మాసాంతానికి మాకు తెలపాలి.
3. చందాదారులకు మేము ప్రచురించిన గ్రంథాలలో కొన్ని తగ్గింపు ధరలకు అందజేస్తాం. వివరాలకు క్రింది విలాసానికి వ్రాయండి.
4. ప్రముఖ సంస్కృతి కేంద్రాలలో ప్రచారంలో ఉన్న యీ ఆధ్యాత్మిక విజ్ఞాన పత్రికలు అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకాలు. రేట్లకు వ్రాయండి.
5. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపవలసినదని గ్రంథకర్తలకు ప్రకాశకులకు మా ప్రార్థన.
6. ప్రజారంజకములైన మత - తత్త్వశాస్త్ర - సంస్కృతివిషయిక స్వతంత్ర వ్యాసాలను రచయితలు అందజేస్తే సంపాదకులు కన్నుల కద్దుకొని ప్రచురిస్తారు.
7. పత్రిక స్పెసిమెన్కాపి కోరేవారు 75 పైసల పోస్టేజి పంపాలి.

ఇంకా వివరాలు కావలసినవారు :

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠం, మైలాపూరు, మద్రాసు-4

అనే విలాసానికి వ్రాయండి.

# మా 'దివ్యవాణి' గ్రంథమాల

**నేడే కొనండి** **పదే పదే చదవండి ॥**

దివ్యావతారమూర్తుల విశ్వోపజీవ్యములైన అమృతమధుర సూక్తులు సర్వసుగ్రాహ్యము హృదయ సన్నిహితములైన తేటతెనుగున వీనిలో అందజేయబడ్డాయి. ఇందులో ఒక్కొక్కటి నిరుత్సాహులకు ప్రోత్సాహప్రదం, అశాంతిసంక్షుభితులకు శాంతిదాయకం, సంశయాందోళితులకు సంశయాపనోదకం, జిజ్ఞాసువులకు పరమార్థజ్ఞాన సమన్వకం, అంతే శిక్షకం, సంస్కారకం, పరమాత్మానువాదకం. నాల్వన్నెల మేలి జాకెట్టుతో పాకెట్టుసైజులో చక్కని తయారింపు

| | | | |
|---|---|---|---|
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 0-40 | శ్రీ కృష్ణవాణి | 0-45 |
| శ్రీ శారదాసూక్తి నవనీతము | 0-40 | బుద్ధ ఉవాచ | 0-40 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0-40 | క్రీసు సూక్తిమాల | 0-40 |

మహమ్మదు సూక్తమంజరి 0-40

# దేవీ మాహాత్మ్యము

అనువాదకులు :

**కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు**

మార్కండేయ పురాణాంతర్గతమగు దేవీమాహాత్మ్యము భక్తులెల్లరు అవశ్యము పఠింపదగిన దివ్యగ్రంథము. పాఠకుల సౌకర్యార్థము శ్లోకములు పెద్దఅక్షరములతో ముద్రింపబడియున్నవి. ప్రతి శ్లోకమునకు తేటతెల్లమగు తాత్పర్యము గలదు.

పారాయణము చేయగోరు భక్తుల యుపయోగార్థము గ్రంథాదియందు చండికా ధ్యానము, అర్గలాస్తోత్రము, కీలకస్తోత్రము, దేవీకవచమును, గ్రంథాంతమున అపరాధ క్షమాపణస్తోత్రమును, దేవీసూక్తమును పొందుపఱచియున్నాము.

ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పారాయణముచేయు భక్తులకు శ్రీదేవీకృపాకటాక్ష వీక్షణప్రసారము తప్పక కలుగును.

1702+4 పుటలు   దివ్యమగు ద్వితీయ ముద్రణము   వెల : రూ. 2-50

అడ్రెసు : **మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4**



'అఖిలవిభు శరణొందుము, ఆ క్షణంబ యతనికృప నీకు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.



# శ్రీరామకృష్ణ ప్రభ



సంపుటము ౨౮ } ౧౯౭౧ - సెప్టెంబరు :: విరోధికృత్తు - భాద్రపదము { సంచిక 3

శ్రీః

## వివేకచూడామణి

మూలము : శ్రీ శంకర భగవత్పాదులు

వ్యాఖ్యాత : అన్నమాచార్య

నైవాయ మానన్దమయః పరాత్మా సోపాధికత్వా త్సవికృతే ర్వికారాత్,
కార్యత్వహేతో స్సుకృతక్రియాయా వికారసఙ్ఘాతసమాహితత్వాత్. 209

అన్నమయమున ప్రాణమయము, ప్రాణమయమున మనోమయము, మనోమయమున విజ్ఞానమయము, విజ్ఞానమయమున ఆనందమయము—ఈరీతిగా కోశములు ఒకదానిలో నొకటి గర్భితమై ఉన్నది. అన్నిటికంటె లోపలిదైన యానందమయకోశముకూడ పరమాత్మ కాజాలదు. ఏల యన ఇది పుణ్యకర్మలఫలరూపమైనది, అవిద్యయే ఇట్లు రూపొందినది. దీనికి ఉపాధి (=ఇష్టదర్శనాది నిమిత్తము) ఉన్నది. ౨౦౯

పఞ్చానామపి కోశానాం నిషేధే యుక్తితః
తన్నిషేధావధి స్సాక్షీ బోధరూపో ఽవశిష్యతే. 210

యుక్తిచే 'ఇది ఆత్మ కాదు' 'ఇది ఆత్మ కాదు' అని కోశము లైదును త్రోపుడు పడిన పిదప, నిషేధింపదగినది వేఱేదియు లేక, నిషేధమునకు అవధిగా నిషేధించువాడు—సాక్షి బోధరూపుడు మాత్రమే మిగులును. త్రాడును జూచిన వెంటనే కలిగిన పామనెడి భ్రాంతి తొలగినప్పుడు మిగులునది త్రాడే కదా. అట్లే ఆత్మ కాని వెల్ల తొలగిన పిదప మిగులునది సాక్షి చైతన్య మగు ఆత్మయే ౨౧౦

యోఽయ మాత్మా స్వయం జ్యోతిః పఞ్చకోశవిలక్షణః,
అవస్థాత్రయసాక్షీ స న్నిర్వికారో నిరఞ్జనః,
సదానన్ద స్సవిజ్ఞేయ స్స్వాత్మత్వేన విపశ్చితా. 211

ఆయాత్మ స్వయంప్రకాశమానము, పంచకోశములకంటె విలక్షణము, జాగ్రత్స్వప్న సుషుప్తు లనెడి మూడవస్థలకు సాక్షి, సత్యరూపము, నిర్వికారము, నిరంజనము, నిత్యానందము. ఆ ఆత్మనే తనలో నున్న ఆత్మ యనుటను వివేకి సాక్షాత్కరించుకొనును. ౨౧౧

శిష్య ఉవాచ:

మిథ్యాత్వేన నిషిద్ధేషు కోశే ష్వేతేషు పఞ్చసు,
సర్వాభావం వినా కిఞ్చి న్న పశ్యా మ్యత్ర హే గురో,
విజ్ఞేయం కిము వ స్త్వస్తి స్వాత్మనా ఽత్మవిపశ్చితా. 212

శిష్యు డడుగుచున్నాడు—

ఈ కోశముల నైదింటిని మిథ్యలని నిషేధించినపిదప, ఓ ఆచార్యా, శూన్యము తప్ప వే తేదియు నాకు కనిపించుట లేదు. ఇకను స్వాత్మగా వివేకి గుర్తింపదగినవస్తు వే మున్నది?

శ్రీగురు రువాచ:

సత్య ముక్తం త్వయా విద్వ న్నిపుణో ఽసి విచారణే,
అహమాదివికారా స్తే తదభావో ఽయ మప్యను. 213

సర్వే యే నానుభూయన్తే య స్స్వయం నానుభూయతే,
త మాత్మానం వేదితారం విద్ధి బుద్ధ్యా సుసూక్ష్మయా. 214

గురువు చెప్పుచున్నాడు—

ఓ విద్వాంసుడా, నీవు సత్యమునే చెప్పితివి విచారణలో నీవు నిపుణుడవే. జాగ్రత్స్వప్నావస్థలందు అహంకార మమకారాది వికారముల కలిమిని, సుషుప్తిలో వాని లేమిని ఏది యనుభవించుచున్నదో, ఏది స్వయముగ అనుభావ్యము కాదో అదే ఆత్మ యనియు వేదిత యనియు సూక్ష్మబుద్ధితో తెలిసికొందువుగాక. ౨౧౩-౨౧౪

తత్సాక్షికం భవే త్త త్త ద్య ద్య ద్యేనానుభూయతే,
కస్యా ప్యననుభూతార్థే సాక్షిత్వం నోపయుజ్యతే. 215

ఏయే పదార్థము నెవడు చూచుచున్నాడో (తెలిసికొనుచున్నాడో) ఆయా పదార్థమున కతడు సాక్షి. చూచువాడు లేకున్న సాక్షిత్వము పొసగదే. ౨౧౫

అసౌ స్వసాక్షికో భావో యతః స్వే నానుభూయతే,
అతఃపరం స్వయం సాక్షా త్ప్రత్యగాత్మా న చేతరః. 216

ఆత్మ స్వసాక్షికము. ఎఱుగునదియు తానే ఎఱుగబడునదియు తానే. కావున జీవుడు బ్రహ్మమే కాని వేఱు కాదు. ౨౧౬

జాగ్రత్స్వప్నసుషుప్తిషు స్ఫుటతరం యోఽసౌ సముజ్జృమ్భతే,
ప్రత్యగ్రూపతయా స దాహ మహ మి త్యన్తఃస్ఫుర న్నైకధా,
నానాకారవికారభాజిన ఇమాన్ పశ్య న్నహంధీముఖాన్,
నిత్యానన్దచిదాత్మనా స్ఫురతి తం విద్ధి స్వ మేతం హృది. 217

జాగ్రత్తి స్వప్నము సుషుప్తి అను మూడవస్థలందును ఎంతయు స్ఫుటముగ ఆవిష్కృత మగుచుండునది—పంచకోశములకు లోపల అత్యంతసూక్ష్మమై సదా 'నేను' 'నే' నని స్ఫురించుచుండునది—నానావిధములయిన ఆకారములను దాల్చు అహంకారాది దేహాంతములగు దృశ్యపదార్థముల కన్నిటికిని సాక్షిగ నుండునది. నిత్యసచ్చిదానందరూపమున భాసించునది—ఏదో అది నీ స్వరూపమని ఎఱుంగుము. ౨౧౭

ఘటోదకే బిమ్బిత మర్కబిమ్బ మాలోక్య మూఢో రవిమేవ మన్యతే,
తథా చిదాభాస ముపాధిసంస్థం భ్రా న్త్యాహ మి త్యేవ జడో ఽభిమన్యతే. 218

కుండలోని నీటిలో ప్రతిబింబించిన సూర్యబింబమును జూచి మూఢుడు సూర్యుడనియే భావించును. అట్లే భ్రాంతికి లోనైన జడుడు బుద్ధ్యుపాధియందు గనగు చైతన్యప్రతిబింబము 'నేనే' అని తలంచుచున్నాడు. ౨౧౮

ఘటం జలం తద్గత మర్కబిమ్బం విహాయ సర్వం వినిరీక్ష్యతే ఽర్కః,
తటస్థ ఏతత్ త్రితయావభాసక స్స్వయంప్రకాశో విదుషా యథా తథా. 219

విద్వాంసుడు కుండను నీటిని అందులోని సూర్యప్రతిబింబమును ఈ మూటిని విడిచి, ఈ మూటికంటె వేఱై ఈ మూటిని ప్రకాశింపజేయుచు స్వయంప్రకాశుడు నుండెడు సూర్యు నెట్లు గాంచునో-అట్లే, ౨౧౯

దేహం ధియం చిత్ప్రతిబిమ్బ మేవం విసృజ్య బుద్ధౌ నిహితం గుహాయామ్,
ద్రష్టార మాత్మాన మఖణ్డబోధం సర్వప్రకాశం సదసద్విలక్షణమ్. 220

నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మ మన్తర్బహి శ్శూన్య మనన్య మాత్మనః
విజ్ఞాయ సమ్య జ్నిజరూప మేత త్పుమాన్ విపాప్మా విరజో విమృత్యుః. 221

విశోక ఆనన్దఘనో విపశ్చి త్స్వయం కుతశ్చి న్న బిభేతి కశ్చిత్,
నాన్యో ఽస్తి పన్థా భవబన్ధముక్తే ర్వినా స్వతత్త్వావగమం ముముక్షోః. 222

దేహమును, బుద్ధిని, బుద్ధియనెడి గుహలోని చిత్ప్రతిబింబమును ఈ మూటిని (పరమాత్మ కా దని) విడిచి, సాక్షియు, అఖండజ్ఞానస్వరూపమును సమస్తమును ప్రకాశింప

చేయునదియు, సత్తుకంటెను అసత్తుకంటెను విలక్షణమైనదియు, దేశకాలాపరిచ్ఛిన్నమును, సర్వాంతర్యామియు, అత్యంతసూక్ష్మమును, అంతర్బహిశ్శూన్యమును, జ్ఞాతకంటె వేఱు కానిదియు నగు ఆత్మను, స్వస్వరూపమును చక్కగా నెఱిగిన జ్ఞానికి, పురుషునకు, ఆనందఘనునకు పాపము లేదు, రజస్సంపర్కము లేదు, మృత్యువు లేదు, శోకము లేదు, ఎందుగాని దేనివలనగాని భయము లేదు. భవబంధమోక్షాభిలాషికి స్వాత్మజ్ఞానము తప్ప వేఱు మార్గము లేదు.

బ్రహ్మాభిన్నత్వ విజ్ఞానం భవమోక్షస్య కారణమ్,
యేనాద్వితీయ మానన్దం బ్రహ్మ సమ్పద్యతే బుధః. 223

బ్రహ్మమునకంటె నేను వేఱు కానను జ్ఞానము చేతనే వివేకి తాను అద్వితీయమును ఆనందస్వరూపమునగు బ్రహ్మముగా నగుచున్నాడు. ౨౨౩

బ్రహ్మభూత స్తు సంసృత్యై విద్వా న్నావర్తతే పునః,
విజ్ఞాతవ్య మతః సమ్య గ్బ్రహ్మాభిన్నత్వ మాత్మనః 224

బ్రహ్మమువైన జ్ఞాని సంసారమునకు మరలరాడు. కావున జీవుడు బ్రహ్మమునకంటె వేఱు కాడనుటను క్షుణ్ణముగ నెఱుగుట విధాయకము. ౨౨౪

# పరమహంస దేవుని ప్రబోధవాణి

మ:—మహాశయా, ఎక్కువ పైకము గడించుటకు నేను పాటుపడవచ్చునా?

రామకృష్ణుడు:—ధర్మబద్ధమైన కుటుంబ పోషణకై ధనసంపాదనము శాస్త్రసమ్మతమే. నీ ఆదాయమును హెచ్చించుకొనుటకు నీవు ప్రయత్నింపవచ్చు, కాని ఋజుమార్గముననే ప్రయత్నింపవలెను. జీవితలక్ష్యము భగవత్సేవయే కాని ధనసంపాదనము కాదు. అర్థము భగవత్సేవకే వినియుక్తమగునేని దానివలన నెట్టి యనర్థములును గలుగవు.

మ:—ఆలుబిడ్డలకొఱకైన తన కర్తవ్యాలను నిర్వహింపవలసిన బాధ్యతను మానవు డెంత కాలము తలయొగ్గవలెను?

రామకృష్ణుడు:— వారికి అన్నవస్త్రాల నేదఱికము తీఱునంతకును తనకు ఆ బాధ్యత యుండును. కొడుకు తన్ను తాను పోషించుకొనగలవాడైన పిదప వాని పోషణబాధ్యతను తండ్రి వహింప నక్కఱలేదు. సొంతముగ ఆహారమును సంపాదించుకొనగలిగిన పక్షిపిల్లను తల్లిపక్షి తనయాహారములో పాల్గొననీయక పొడిచి తఱిమివేయును.

మ:—ఒకొక్కడును తన విహితకర్మల నెంతకాలము నిర్వర్తించుచుండవలెను?

శ్రీ రామకృష్ణుడు:—పూప పొడచూపగనే పువ్వు రాలిపోవును. భగవత్ప్రాప్తి కలిగిన

మీదట, ఎవడును కర్మలను ఆచరింప నక్కఱ లేదు. ఆచరింతమను బుద్ధియు పుట్టదు.

త్రాగుబోతు మిక్కుటముగ త్రాగునేని, స్మృతిని నిలుపుకోజాలడు. ఒకటిరెండు గ్లాసులు మాత్రమే త్రాగునేని, తన పనులను తాను చూచుకొనుచుండగలడు. భగవంతునకు నీవు సన్నిహితుడవగు కొలదియు నీ కర్మభారమును కొంచెము కొంచెముగ ఆయనయే తగ్గించును భయపడకు.

శేషించి యున్న యీ కొన్ని కర్తవ్యములను పూర్తిచేయుము. నీకు శాంతి కలుగును. వంట మొదలయిన యింటిపనులను ముగించుకొని స్నానము సేయబోయిన యిల్లాలు నీవు ఎన్ని కేకలు వేసినను రాదు.

ఒక బ్రాహ్మభక్తుడు:- మఱి, స్వామీ, భగవత్సాక్షాత్కారము కలుగువఱకును, మనము మనపనులను వదలుకోవలసినదేనా?

శ్రీరామకృష్ణుడు:- అక్కఱలేదు. ఎందులకు వదలుకోవలయును? దైవధ్యానము దైవసంకీర్తనము మున్నగు నిత్యసేవలను మీరు ఆసక్తితో నెఱపుచుండవలెను.

బ్రాహ్మభక్తుడు.- ధనార్జనము మొదలైన సాంసారిక విధులనుగూర్చి ఏమందురు?

రామ.- ఔను, మీ జీవికకు కావలసినంతవఱకును, మీరు ఆవిధులను నిర్వర్తించుచునే యుండవలెను. అదే సమయమున మీరు కన్నీరు కార్చుచు "ఆ విధులను నిస్స్వార్థబుద్ధితో నిర్వర్తించు సామర్థ్యమును బ్రసాదింపు" మని ఏకాంతమున దేవుని ప్రార్థింపవలెను. "దేవా, నా సంసారకృత్యముల సంఖ్యను నానాటికిని తగ్గింపుము. తగ్గింపకున్నచో పెక్కు పనులలో తగుల్కొని నేను నిన్ను విస్మరింతు నని శోకించుచున్నది. నిస్స్వార్థముగ పాటుపడుచున్నా నని నేననుకొన్నను, అది స్వార్థముగనే పరిణమించు"నని నీవు దేవునితో మొరపెట్టుకొనవలెను. బిచ్చము పెట్టువారుగాని అన్నదానములు సేయువారుగాని తమ హద్దులు మీఱినప్పుడు కీర్తి ప్రతిష్ఠలు కావలెననెడి లోభమునకు లోనౌదురు.

శంభుమల్లిక్కు ఒకసారి "వైద్యశాలలను నెలకొల్పవలెను, ఔషధశాలలను స్థాపింపవలెను. పాఠశాలలను ఏర్పఱుపవలెను, రాచబాటలను వేయవలెను, ప్రజల యుపయోగమునకై చెఱువులు త్రవ్వవలయును" అని యిట్టి ధోరణిలో మాటాడినాడు. "ఇట్టిపనుల జోక్యం పెట్టుకొని నీదారిని విడువకు. మిక్కిలి జరూరైన పనులను నీ యందుబాటులోనికి వచ్చు పనులను పూనుకొనుము. వానిని నిస్స్వార్థబుద్ధితో నెఱవేర్పుము" అని నేనంటిని. పెక్కుపనులలో తగుల్కొనుట మంచిదికాదు. అట్టి తగులాటము భగవంతుని మఱపించును. కొందఱు కాళీఘట్ట దేవాలయమునకు వచ్చి తామిచ్చట నున్నంతసేపును పేదలకు బిచ్చము పెట్టుటలోనే గడపివేయుదురు. గుడిలోపల వేంచేసియున్న యమ్మవారిని కన్నెత్తి చూచుటకు వారికి వ్యవధియుండదు! (అందఱును నవ్వుదురు). శ్రమపడి గుంపులో దారి చేసికొనియైనను ముందునకుబోయి ఎట్లో ఒకట్లు మొదట అమ్మవారి దివ్యమంగళ విగ్రహమును దర్శింపుము. తర్వాత నీకిష్టమున్న భిక్షాదానము చేయవచ్చు. చేయకపోవచ్చు. చేయగోరుదువేని నీ తృప్తికొలది నీవు బీదలకు దానములు చేయవచ్చు. దాన ధర్మాదు లన్నియు భగవత్సాక్షాత్కారమునకు సాధనములు మాత్రమే. "దేవా, నీచరణకమలముల ప్రాపు నాకనుగ్రహింపుము. నన్ను

నీయొద్దనే యుంచుకొమ్ము. నీయందలి ప్రేమను విశుద్ధమైన ప్రేమను, నిష్కపటమైన ప్రేమను నాకు ప్రసాదింపుమని భగవద్భక్తుడు ప్రార్థించు చుండును.

కర్మయోగము నిజముగ దుష్కరమైనదే. వేదవిహిత కర్మకలాపమును నిర్వర్తించుట, ఈ కలియుగమున మీదు మిక్కిలి కష్టసాధ్యము. ఈ దినములలో ఉదరపోషణ మొక్కటే మానవుని జీవితసారము. పెక్కులుగ నున్నట్టి వైదికక్రియలను అత డొనర్పలేడు. ఒకానొకడు జ్వరగ్రస్థుడై మంచముపట్టి యున్నాడనుకో. నీవు ప్రాతపద్ధతిని దేశీ యౌషధము లిచ్చి, వ్యాధిని మెల్లగా కుదుర్తమని అనుకొంటివేని, ఈలోగా రోగికి ప్రాణము పోయినను పోవచ్చు. అతని శరీరపరిస్థితి మిక్కిలి బాగు నోర్వదు. డి. గుప్తాగారి చుఱుకైన మందే ఈ దినాలలో సరియైనది. భగవత్ప్రార్థనము భగవత్సంకీర్తనము మున్నగు వానితో గూడిన భక్తిమార్గమే, భక్తియోగమే కలియుగమున ఉత్తమోత్తమమైనది. 'మతము' 'మతము' అనగా భక్తిమార్గమే ఈ కాలమునకు మతము. (బ్రాహ్మభక్తులతో) మీ మార్గమును భక్తిమార్గమే. మీరు హరినామములను జపింతురు, లోకజనని మహిమలను కీర్తింతురు. నిక్కముగ మీరు ధన్యులరు. మీవైఖరి నాకు నచ్చినది. అద్వైతులు ఈ జగమొక స్వప్నమందురు. మీ రట్లనరు. వారివలె మీరు బ్రహ్మజ్ఞానులు కారు. మీరు భక్తులు. దేవునందు మీకు ప్రేమ. దైవము నొకవ్యక్తినిగా పేర్కొనుటయు మంచిదే. మీరు భక్తులరు, శ్రద్ధతోను ఆస్థతోను ఆశ్రయింతురేని దేవుని తప్పక సాక్షాత్కరించుకొనగలరు.

# విష్ణుమహిమానుకీర్తనము-పూర్వార్ధము

## భాగవతకవులు

భూషణములు వాణికి నఘపేషణములు మృత్యుచిత్తభీషణములు హృ
త్తోషణములు కల్యాణవిశేషణములు హరిగుణోపచితభాషణముల్. 1

కలిదోషనివారణమై యలఘుయశుల్ వొగడునట్టి హరికథనము ని
ర్మలగతి గోరెడు పురుషుఁడు వెలయఁగ నెవ్వాఁడు తగిలి వినఁడు మహాత్మా? 2

హరివార్త లెఱుఁగువారికి హరిపదములు దలఁచువారి కనవరతంబున్
హరికథలు వినెడి వారికి మరణాగతమోహసంభ్రమము లే దనఘా. 3

శ్రీపంబులు ఖండితసంతాపంబులు గల్మషాంధతమసమహోద్య
ద్దీపంబులు పాషండదురాపంబులు విష్ణువందనాలాపంబుల్. 4

పావనములు దురితలతాలావనములు నిత్యమంగళప్రాభవసం
జీవనములు లక్ష్మీసంభావనములు వాసుదేవపదసేవనముల్. 5

వనజాక్షుమహిమ నిత్యము వినుతించుచు నోరులు వొగడ వినుచుఁ మదిలో
ననుమోదించుచు నుండెడు జనములు దన్మహిమవలనఁ జనరు మునీంద్రా. 6

హరినామాంకితసత్కథామృతరసవ్యాలోలుఁడై నట్టి స
త్పురుషశ్రేష్ఠుఁ డసత్కథాలవణవాఃపూరంబుఁ దాఁ గ్రోలునే?
వరమందారమరందపానకతుకస్వాంతద్విరేఫంబు స
త్వరమై పోవునె చేఁతివేములకుఁ దద్గంధానుమోదాత్మమై? 7

ధర సాధులు విమలాంతఃకరణులు భగవద్గుణానుకథనశ్రవణ
స్ఫురితస్వాంతులు ననఘులు వరధిషణులునైన భాగవతజనులసభన్. 8

సరసోదారమహాత్మ్యముఖరితములగు మధువిరోధికమనీయగుణో
త్కరసురుచిరచరితామృతపరిపూరితవాహినులను బరమప్రీతిన్. 9

మన మలరఁగ శ్రోత్రాంజలులను బానము సేయు పుణ్యులకు క్షుత్తృష్ణా
ఘనభయశోకవిమోహము లనయంబును సోఁకకుండు నవనీనాథా. 10

బ్రహ్మహత్యానేకపాపాటవుల కగ్నికీలలు హరినామకీర్తనములు
గురుతల్పకల్మషక్రూరసర్పములకుఁ గేకులు హరినామకీర్తనములు
తపనీయచౌర్యాఘతమసంబునకు సూర్యకిరణముల్ హరినామకీర్తనములు
మధుపానకిల్బిషమదనాగసమితికిఁ గేసరుల్ హరినామకీర్తనములు
మహితయోగోగ్రనిత్యసమాధివిధుల నలరు బ్రహ్మాదిసురులకు నందరాని
భూరినిర్వాణసామ్రాజ్యభోగభాగ్యఖేలనంబులు హరినామకీర్తనములు. 11

ముక్తికాంతైకాంతమోహనకృత్యముల్ గేలిమై హరినామకీర్తనములు
సత్యలోకానందసౌభాగ్యయుక్తముల్ గేలిమై హరినామకీర్తనములు
మహితనిర్వాణసామ్రాజ్యాభిషేకముల్ గేలిమై హరినామకీర్తనములు
బహుకాలజనితతపఃఫలసారముల్ గేలిమై హరినామకీర్తనములు
పుణ్యమూలంబు లనపాయపోషకంబు లభిమతార్థంబు లజ్ఞానహరణకరము
లాగమాంతోపలబ్ధంబు లమృతసేవ లార్తశుభములు హరినామకీర్తనములు. 12

# శ్రీ అచ్యుతభానూదయము

## శ్రీ దేవరాజసుధీమణి

పరీక్షిన్మహారాజు—మునిసత్తమా, చంద్రసూర్యుల వంశవిస్తారములను జెప్పితివి; ఆ యుభయవంశములందుఁ బుట్టిన రాజుల వంశవిస్తారములను, మిక్కిలి యద్భుతములయిన వారల చరిత్రములను జెప్పితివి. మఱియు వారియందు మిక్కిలి ధర్మశీలుఁడయిన యదుని వంశవిస్తారమును దెలిపితివి. ఆ యదుని వంశమునసే కదా తనయంశమగు బలరామునితోడం గూడి, విష్ణుండు శ్రీకృష్ణుండై యవతరించెను. కాన నట్లవతరించినట్టి విష్ణుని వీర్యగుణవిచిత్రములను మాకు వినిపింపుము. భూతభావనుండును విశ్వాత్ముండునగు నా భగవంతుని వీర్యచరితములను మొదటినుండియు విస్తరించి మాకుఁ జెప్పుము.

'పలుమాఱు విని వినియున్న విష్ణుని వీర్యముల నిపుడడుగనేల' యందువా? అట్లుకాదు. ఆయుత్తమశ్లోకుని కల్యాణగుణముల ముచ్చట మెచ్చయిన యమృతము సుమీ! ఇది ప్రసిద్ధమయిన యమృతముకంటె నతిశయించునది. ఆ యమృతము విషయాభిలాషులగు భోగులు కొనియాడునది. ఈ యమృతమో విషయస్పృహ వీడిన యోగులు కొనియాడునది. అది సంసారమును బెంచునది, ఇది సంసారమును ద్రుంచుమందు. మఱియు నిది దానివలె నాలుకకు మాత్రమే రుచ్యముగా నుండక చెవులకును మనస్సునకు నయితము నింపై సొంపారునది. అపూర్వమైన యిట్టి యమృతమునందు, భగవంతుని కల్యాణగుణ కథామృతమునందు, పశువులను జంపు క్రూరుఁడో పశువువలె వర్తించు మూర్ఖుఁడో, లేక పరులు చేసిన యుపకారమును జక్కఁగాఁ దెలియనేరని మూఢుఁడో కాక మఱి యెవ్వఁడు విరక్తినొందును?

ఆ యుత్తమశ్లోకుఁడు మాకుఁ జేసిన యుపకారమేమని చెప్ప! తొల్లి కౌరవ సేనాసముద్రము దేవతలకైన యుద్ధమున జయించునట్టి యతిరథులు భీష్మద్రోణాదులనెడు తిమింగలములు లావరించి యుండుటవలన దాఁటుట కెంతమాత్రముఁ దరము కాకుండఁగా, మా పెద్ద లెవ్వని తోడఁగాఁ గొని యట్టి మహాసాగరమును గోష్పదమును బోలె దాఁట నేర్చిరో, శిశు మాతల్లిగర్భమం దున్నప్పు డశ్వత్థామ తన బాణముల చిచ్చుచేఁ గౌరవ పాండవుల సంతతులను మొలపించు మూలబీజమైయున్న నా యీ దేహమును దహింపఁగా మాయమ్మ 'కృష్ణా, కావు' మని శరణుజొచ్చియుండఁగా, నపు డెవ్వఁడు చక్రము చేతఁ గొని మాతల్లికుక్షిలోఁ జొచ్చి నన్నుఁ గాచి పుచ్చెనో, అట్టి పరమోపకారి కల్యాణగుణామృతము నెంత ద్రావినను విరక్తి యెట్లు కలుగును? కాన నా భగవంతుని ని వీర్యచరితములనే ముచ్చటింపుము.

ఆ దేవుఁడు సమస్త దేహధారులలోపలను వెలుపలను వరుసగాఁ బెక్కు పురుష(క్షేత్రజ్ఞ) రూపములను, గాలరూపములను నెలకొని యుండి, స్థితివినాశములను గలిగించుచుండు సకలజగత్కారణుఁడు. అట్టి వానికి మనుష్యత్వమెట్లు కలిగె ననవలదు. అతఁడు మాయామనుష్యుఁడు సుమీ. ఆ లీలామానుష విగ్రహుని వీర్యవిలసనములను దెలుపుమా. నీ విది యంతయుఁ దెలిసినవాఁడవు గదా!

సంకర్షణావతారరూపుండగు బలరాముఁడు రోహిణికిఁ గొడుకని చెప్పితివి; మఱియు దేవకికి గర్భమందుఁ గలిగినవాఁ డంటివి. మఱి

యొక్క దేహమును గయికొనక ఒక్క దేహముతోనే యాయిరువురకును గొడుకుగాఁ బుట్టుట యెట్లు? భగవంతుఁడా ముకుందుఁడు, తండ్రియగు వసుదేవుని గృహమునుండి వ్రేపల్లె కేల పోయెను? ఆసాత్త్వతపతి జ్ఞాతులయిన యదువులతోడ నెక్కడ వసించియుండెను? కేశవుఁడు వ్రేపల్లెయందును మధురయందును వసించియుండి యేమేమి చేసెను? అతఁడు మానుష విగ్రహమును దాల్చి, వృష్ణులతోఁగూడ ద్వారకయందెన్ని యేండ్లుండెను? అవిభుని భార్య లెందఱుండిరి? కృష్ణచేష్టితములను నే నడిగినవానిని, మఱి యడుగనివానిని నన్నింటిని, మునీంద్రా, వినుటకువ్విళులూరుచున్న నాకు సవిస్తరముగాఁ జెప్పఁదగును. నీ వన్నియుఁ దెలిసినవాఁడవు గదే? నేను బ్రాయోపవేశమునుబట్టి జలపానమునుసైతము విడిచితిని. దానిచే నాకిదె కొంచమైనను సైఁపరాని పేరాఁకలి కలిగియున్నది. కాని నీ ముఖారవిందమునుండి దొరఁగు హరికథామృతమును బానము సేయుచున్నందున, నన్నది బాధింప లేకున్నది.

శుకుఁడు—రాజర్షిసత్తమా, నీబుద్ధి మిక్కిలియుఁ జక్కఁగాఁ గుదురవడియున్నది సుమీ, కావుననే వాసుదేవుని కథయందే యదియింతి నిష్ఠతో నెలకొనియున్నది. వాసుదేవుని కథల నూరక యడుగుటయుఁ, జెప్పువానిని, నడుగువానిని వినువానిని ట్లీమువ్వురు పురుషులను, నద్దేవుని శ్రీపాదసలిలంబగు గంగానదివలెఁ బావనులను జేయుచున్నది. ఇఁక దానిని విన్నను జదివినను జెప్పవలయునా?

దైత్యుల సమూహములు వందల వేల కొలఁదిని గర్వితులయి రాజుల రూపములం బుట్టి, భూమి నెంతయు నాక్రమించి, పీడించుచుండిరి, భూదేవియు వారి పెనుభారమునకు సైఁపనేరక బ్రహ్మదేవుని శరణుఁ జొచ్చెను. ఆదేవి గోరూపమును దాల్చి దీనయై నెమ్మొగము కన్నీళ్లు దొప్పఁదోఁగుచుండ, జాలి పుట్టునట్లు బిట్టు రోదనము సేయుచు, బ్రహ్మదేవుని సమీపమున నిలిచి స్తుతిచేయుచుఁ దన దుఃఖము నద్దేవునికి విన్నవించుకొనెను.

బ్రహ్మయును నాయమ దుఃఖము నెఱింగి, యంత దేవతాగణములను, త్రినయనుండగు నీశ్వరునిఁ గూడి, పాలసముద్రపుఁ దీరమునకుఁ బోయెను. అట్లుపోయి యచ్చట సమాహిత చిత్తుఁడై, యంత జగన్నాథుండును దేవదేవుండును బరమపురుషుండునగు నా మహావిష్ణువుఁ బురుషసూక్తంబున స్తుతించుచు, మనంబున ధ్యానించెను. బ్రహ్మ యట్లు సమాధియందుండఁగా నొక యశరీరవాణి యతనికి వినఁబడెను

అద్దేవుఁడు దేవతలను జూచి, 'సురలారా, నాకు సమాధియందుఁ బరమపురుషుని మాట యొకటి వినఁబడెను. దానిని జెప్పెదను వినుఁడు—విని యాచొప్పుననే మీరు వేగ చేయవలయును, జాగు కూడదు, పరమపురుషుఁడు మనము విన్నవించుటకు మునుపే భూమికిఁ గలిగియున్న క్లేశముచు దెలిసియున్నాఁడు. మీరు మీయంశములచేత యదువులయందుఁ బుట్టుఁడు. ఆ యీశ్వరేశ్వరుఁడు తన కాలశక్తిచేత భూభారమును హరింప నవతరింపఁ గలఁడు, అంతకు మునుపే మీరు పుడమియందుఁ బుట్టవలయును. భగవంతుఁడా పరమపురుషుఁడు తాను బరిపూర్ణుఁడై వసుదేవుని గృహమందుఁ బుట్టనున్నాఁడు. అతనిని బూజించుకొఱకు నప్సరఃస్త్రీలును భూమియందుఁ బుట్టవలయును. అద్దేవుని యానతినిబట్టి ఋషులు నయిన గోరూపములం బూని జనింపవలయును, వారు

తమ తపముచేతనే కాక యట్లు గోరూపమునఁ బృథివికి యర్పించుటచేతను గూడ విష్ణువునకుఁ దృప్తి గావించిన వారగుదురు. వాసుదేవుని కళయు సహస్రముఖుఁడును స్వతంత్రుఁడునగు ననంతుఁడును హరికిఁ బ్రియము సేయఁగోరి యతనికి నగ్రజుఁడుగాఁ బుట్టఁగలఁడు. జగమునంతయు మిక్కిలి మోహింపఁజేయు భగవతియగు విష్ణుమాయయుఁ బ్రభువు నాజ్ఞచేత, నతని కార్యము కొఱకు నంశమున నవతరింపఁగలదు'' అనెను. ప్రజాపతులకెల్లఁ బతియగు నాబ్రహ్మ యిట్లు దేవగణముల కానతిచ్చి భూమిని దగు మాటల నూఱడించి, యంత మిక్కిలి యుత్తమంబయిన తన నెలవునకుం బోయెను.

తొల్లి యదువులకు రాజయిన శూరసేనుండనువాఁడు మధురాపురియందు వసించియుండి మాథురములును శూరసేనములుననుదేశముల ననుభవించుచుండెను. అంతనుండియు నా మధుర యాదవులగు రాజుల కందఱకును రాజధానియై యుండెను. అందు భగవంతుఁడగు హరి (తన యావిర్భావస్థానమగుటం బట్టి) యెపుడును సన్నిహితుఁడై యుండును.

ఆ పురమునం దొకప్పుడు శూరుని పుత్త్రుఁడైన వసుదేవుఁడు దేవకీదేవిని బెండ్లాడి, యా పెండ్లికూఁతుతోడ స్వగృహమునకుఁ బయనమై రథమారోహించెను. అపు డుగ్రసేనుని కొడుకైన కంసుఁడు బంగారుమయములయిన నూఱు రథములు తన్నుఁ బరివేష్టించి వచ్చుచుండఁగా, నప్పసెల్లెలయిన యా దేవకికిఁ బ్రియము సేయఁ గోరి, యా తేరినెక్కి దానిని దోలుటకై గుఱ్ఱముల వాగెలను జేతం బూనినవాఁ డయ్యెను. అంతఁ దండ్రియగు దేవకుఁడు పుత్త్రికలందు మిక్కిలియు మక్కువగలవాఁడు కావునఁ దన కన్నకూఁతురయిన దేవకికి బంగారు పూమాలికలచే వెలుంగుచున్న యేనుంగుల నన్నూటిని, బదియేనువేల గుఱ్ఱములను, వేయు నెనమన్నూఱు రథములను, జక్కఁగ నలంకృతలై చొక్కపుఁగొమిరెప్రాయంబు గలుగుచున్న దాసీజనంబుల నిన్నూఱుగురను పల్లకీలు మొదలగు వాహనములను నరణముగా నిచ్చెను. వధూవరులు పయనంబగుట కుపక్రమించునపుడు మంగళార్థములుగా శంఖములయుఁ దూర్యములయు మృదంగములయు దుందుభులయు ధ్వనులొక్కుమ్మడిఁ జెలంగెను.

అట్లు పయనమై పోవుమార్గమున గుఱ్ఱముల వాగెలు పూని తోలుచున్న కంసునితో నొక యశరీరవాణి 'ఓరీ' యని పిలిచి ''నీవు పతిగృహమునకుఁ గొంపోవుచున్న యీ పడఁతి యెనిమిదవ చూలు నిన్నుఁ జంపఁగలదు సుమీ. ఇస్సీ! ఇది తెలియవుగా'' యనెను. ఇట్లు చెప్పఁగా నీ భోజకులపాంసనుఁడైన యా పాపాత్ముఁ డెంతయు మూర్ఖుఁడు కావునఁ దన చెల్లెలిని జంపు తెంపునకుఁ బూని, చేత ఖడ్గము గొని, దెప్పరంబున నాబిడ్డ కొప్పుఁ బట్టుకొనెను. చెల్లెలని తలంపక చంపునట్టి కుచ్చితపుఁ బనికి నొడిగట్టియున్న యా సిగ్గుమాలిన కట్టిఁడివానినిఁ జూచి వసుదేవుఁడు మిక్కిలియు బుద్ధిమంతుఁడు గావునఁ దిన్నని మాటల మట్టుపఱచుచు ''నీ గుణములు శూరుల కెల్లఁ గొనియాడఁ దగినవి కదా! మఱి నీవో భోజకులమునకెల్ల వన్నెఁ దెచ్చు కన్నాకవు. ఇట్టి నీవు తుదిఁ బోయి పోయి యొక యాఁడుదానిని అందును బెండ్లియై పతిగృహప్రవేశమను శుభకర్మము నాచరించుచున్నదానిని, మీఁదుమిక్కిలి నీ చెలియలిని నెట్లు చంపఁ బూనితివో కదా!... సౌమ్యా, నీకు మరణభయ మీపడఁతివలనఁ గలుగదు గదా. అశరీరవాణి నీకు భయము గలుగు నని

చెప్పినదియు, నీకును భయము పుట్టియున్నదియు దీనిపుత్త్రులవలననే. కాన నా పుత్త్రులను నీ కప్పగించెదను” అనెను. కంసుఁడు నా వసుదేవునిమాటల యభిప్రాయము నెఱింగి, తన చెల్లెలిని జంపక యరిగెను. వసుదేవుఁడు నందులకుఁ బ్రీతుఁడై యా కంసు నెంతయుఁ గొనియాడి తన గృహమునఁ బ్రవేశించెను.

అంత దేవకికిఁ జూలు గలుగఁగా సర్వదేవతాప్రాయమైన యాముద్దియుఁ, నేఁటేఁట నొక్కొక్కరుగాఁ గొడుకుల నెనమండ్రను నొక్క కూఁతును గాంచెను. అంత వసుదేవుఁడు మొట్టమొదటఁ దాను గన్న కొమరునిఁ గీర్తిమంతుఁ డనువానిని, దా నన్నృతమునకు మిక్కిలియు వెనుదీయువాఁడు కాన, దుఃఖంబునఁ గంసునికిఁ దెచ్చి యర్పించెను. ఓ పరీక్షిన్మహారాజా, సాధువులకు సైఁపగాని దెయ్యది? ఎఱుకగలవారికి నిష్టమెయ్యది? నీచులకుఁ జేయరాని దెయ్యది? ధృతిమంతులకు దిగవిడువ రాని దెయ్యది? ఎద్దియు గల్గదు. అట్లు వసుదేవుఁడు సుఖము గలిగినను దుఃఖము గలిగినను సమముగాఁ బాటించి, యాడిన మాటయందుఁ దప్పక నిలిచిన యా నిలుకడకుఁ గంసుఁడు మనంబున సంతుష్టుఁడై యల్ల నవ్వుచు నతనితో “ఈ కుమారుని నింటికి మరలఁ గొనిపొమ్ము. నాకు వీనివలన భయము లేదు సుమీ. మీ యిరువురకుఁ బుట్టు నెనిమిదవపుత్త్రుని గదా దైవము నాకు మృత్యువుగా విధించి యున్నది! కావున వీనితోఁ బనేమి?” యనెను. వసుదేవుఁడును వల్లె యని యా యల్లారుఁగొడుకు నెత్తికొని యింటికిఁ బోయెను. కాని, యా కంసుఁడు మనస్సు కుదురు లేనివాఁడు పాపాత్ముఁడు గాన నెప్పు డేమి మరలఁ జదునో యని వాఁ డాడిన యా తిన్నని మాటను బాటిగాఁ గయికొనక యులుకుచునే యుండెను.

భగవంతుఁడగు నారదుఁ డొకనాఁడు కంసుని గృహమునకుఁ బోయి వానితో “ఓయీ, వ్రేపల్లెయందున్న నందుఁడు మొదలయిన గోపకులును, వసుదేవుఁడు మొదలయిన యాదవులు, నీ యిరుదెఱఁగులవారి పడఁతులును, మఱియు వీరల జ్ఞాతులును బంధువులును సుహృదులును నెల్లవారును దేవాంశజనితులగుటఁబట్టి దేవతాసములు. కంసా, నీవును, నిన్ననువర్తించుచున్న వారలందఱును నసురసంపత్తిని బుట్టినవారు. కావుననే వీరు లోకమున కుపద్రవముఁ గావించుచున్నవారు. ఇట్లు భూమికి బరువై యుఱవడించుచున్న దుండగీండ్రగు దైత్యుల నెల్ల భగవంతుఁడగు విష్ణుఁడు వధింప నుద్యమించి యున్నవాఁడు” అని చెప్పెను. ఆఋషి వెడలిపోఁగానే, కంసుఁడు యాదవులు దేవాంశసంభవు లనియు విష్ణుదేవుఁడు తన్ను వధించుటకై దేవకిగర్భమందు సంభవించుననియు నెఱింగి, కలంకం బొంది, దేవకిని వసుదేవునిబట్టి సంకెలలు వైచి చెఱయందు బంధించి, వారికిఁ బుత్రులు పుట్టుచునుండఁగా నొక్కొక్కనిబట్టి, విష్ణువను జంకనను దన కరిష్టము గలుగునను వెఱపునను జంపుచు వచ్చెను. తాను పూర్వజన్మమున విష్ణువుచే హతుఁడైన మహాసురుండగు కాలనేమి యగుటయు, నిట్లీ జన్మమునఁ బుట్టి యుండుటయు నారదునివాక్యమువలన నెఱింగి, యాదవులతోడి విరోధంబూని, యదుభోజాంధకుల కధిపతియుఁ దన తండ్రియు నగు నుగ్రసేనునిఁ బట్టి యడంచిపుచ్చి, తానే మిక్కిలియు బలము మెఱసి శూరసేనదేశమును బరిపాలించుచుండెను; ప్రలంబుఁడు, బకుఁడు, చాణూరుఁడు, తృణావర్తుఁడు, గర్దభాసురుఁడు,

ముష్టికుఁడు, అరిష్టుఁడు, ద్వివిదుఁడు, పూతన, కేశి, ధేనుకుఁడు, మొదలగువారును, మఱియు నితరులగు బాణుఁడు నరకుఁడు మొదలగు నాసురప్రకృతులగు రాజులును, సహాయులుగాఁ గూడి బలవంతుఁడయిన జరాసంధుని ప్రాపున నేపు మీఱి, యదువులకెల్ల నుపద్రవము గావించువారఁ డయ్యెను. ఆ యదువు లట్లు పీడితులై పెక్కండ్రు తమపటు వదలి కురు పాంచాల కేకయ సాల్వ విదర్భ నిషధ మగధ కోసల దేశములం జొచ్చిరి. వారిలోఁ గొందఱు కంసుని ననుసరించి కొలుచుచుండిరి.

దేవకి బిడ్డ లార్వురు నిట్లు కంసునిచేతి హతులు కాఁగా, విష్ణువునంశమే యా దేవకికి నేడవగర్భముగాఁ గలిగెను. ఆ యంశమునే అనంతుఁ డందురు. ఆ గర్భము దేవకికి హర్షమును, కంసునివలని కీడుంబట్టి శోకమును బెంచునదయ్యెను. భగవంతుఁడగు విష్ణుఁడును తన్నే దిక్కుగా నమ్మియున్న యాదవులకుఁ గంసునివలనఁ గలుగు భయమును విశ్వాత్ముండు గానఁ దెలిసి, యంతఁ దన యోగమాయఁ జూచి "దేవీ, కల్యాణీ, గోసమూహములచేతను గోపకులచేతను వన్నెకెక్కుచున్న వ్రేపల్లెకుఁ బొమ్ము. ఆ నందుని గోకులమందు వసుదేవుని భార్య రోహిణి యనునది యున్నది. మఱియు నతని భార్యలు తక్కిన వారు కంసునికి వెఱచి యందుఁ బర్వతబిలాదుల వివరములందు దాగియున్నవారు. దేవకి యుదరమందు నాయంశము శేషుం డనఁబడి యున్నది. అది యా మగువ యుదరమునుండి సంకర్షించి రోహిణీదేవి యుదరమందుఁ జొప్పింపుము. అంత నేను నా యంశభూతుఁ డగు శేషునితోడ, శుభాత్మురాలా, దేవకికిఁ బుత్రుఁ డనై పుట్టెదను. నీవు నందుని పత్ని యగు యశోదయందుఁ బుట్టఁగలవు. నీవు సమస్తము లయిన కామితములను వరములను నొసంగుచుండువు. ఇంతే కాదు. సమస్త ప్రదాతల కెల్ల నీశ్వరివై యుండుట వలన మనుజులు నిన్ను నానావిధముల కానుక లొసంగియుఁ బూజలు గావించియు వర్ధింపుచుండఁగలరు. మఱియు నీకు నరులు భూతలమునఁ బెక్కులు నామధేయములను స్థానములను గల్పింపఁగలరు. నీను దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చండిక, కృష్ణ, మాధవి, కన్యక, మాయ, నారాయణి, ఈశాన, శారద, అంబిక యనెడు నామములు గల్పింతురు. ఆ యనంతు నొక గర్భమునుండి సంకర్షించుటవలన సంకర్షణుఁ డనియు, లోకులను రమింపఁజేయుట వలన రాముఁ డనియు, బలాతిశయమును బట్టి బలభద్రుఁ డనియు భూమియందు జను లాడుదురు" అని యానతిచ్చెను.

ఆ యోగమాయయు నా వచనమును వల్లెయని ప్రతిగ్రహించి, యద్దేవునికిఁ బ్రదక్షిణము గావించి, భూమికిఁ బోయి, భగవంతుఁ డానతిచ్చిన చొప్పునఁ గావించెను. యోగనిద్ర దేవకి గర్భమును రోహిణీదేవిని బొందింపఁగాఁ బురజనులు 'అహో! దేవకికి గర్భము జాఱిపోయినది' యని బిగ్గఱగఁ జెప్పుకొనఁజొచ్చిరి. అంత విశ్వాత్ముఁ డగు భగవంతుఁడు భక్తులకెల్ల నభయప్రదుండు గావునఁ దనయంశమగు శేషునితోఁగూడ వసుదేవుని (పుత్రత్వమునకై యతని) హృదయమును దొలుతఁ బ్రవేశించెను. అతఁడును బరమపురుషుని తేజంబును దాల్చి సూర్యుండుం బోలె నెంతయుఁ దేజంబునఁ బ్రకాశించుచుండెను...... అంత సమస్త జనంబులకు మంగళప్రదంబై యప్రచ్యుతంబయిన సంకల్పజ్ఞానము గలిగి, సమస్తచేతనాచేతన శరీరకమై, యాత్మభూతమై వెలుఁగు భగవంతుని, వసుదేవునికి హృదయస్థుం డగు వానిని

దేవకీదేవి. మబ్బులయందున్న యానందకరుండగు చందమామను దూర్పుదిక్కువలెనే గర్భమునఁ దాల్చిన దయ్యెను. కంసుఁ డంత నా కంజాక్షిని జూచి "ఈబిడ యింతకు మును పెన్నఁడు నింత తేజస్వినిగ నుండ లేదు. కాన నా ప్రాణములు హరించుటకై హరి దీని గర్భ వివరమును దప్పక పొందియున్నాఁడు. ఇది నిజము. నే నిప్పు డతనిని మట్టుపెట్టుటకై చేయవలసిన కర్తవ్యమేమి? దీనిఁజంపి నెమ్మదినుందు నంటినా, ఇది యాఁడుది; అందును జెలియాలు, మఱియును జూలాలు. ఇట్టిదానిఁ జంపితినేని నాయశస్సును సిరియు నాయువును బోవును" అని వెనుదీసెను. వాఁడు కూర్చున్నప్పుడును బరుండునపుడును, నిలుచున్నప్పుడును, ఆహారములు గుడుచుచున్నప్పుడును సిలుసటు దిరుగులాడుచున్నప్పుడును, పానీయములు ద్రావుచున్నప్పుడును హృషీకేశుండగు హరిని జూచుచుండెను. వానికి జగమంతయు హరిమయముగాఁ దోఁచెను.

అంత బ్రహ్మాదులు - మునులును దేవతలును దదనుచరులును వెంబడించిరా, ధిషణాత్మకుండును దేవకీగర్భస్థుండు నగు శ్రీ విష్ణుదేవుని తమకుఁ దెలిసినట్టి రీతిని దమ మది గొలఁదిని స్తుతించి యంత దివంబునకుఁ బోయిన వారయిరి.

జన్మరహితుండగు భగవంతు డవతరించు కాలము సమస్తశుభగుణములతోఁ గూడినదై యెంతయు సొంపు పెంపారుచు నరుగుదెంచెను. భగవంతుని జన్మనక్షత్ర మగు రోహిణియుఁ బొడతెంచెను. దేవతాసమానురా లగు దేవకి యందు జ్ఞానశక్తిబలాదిసమస్తకల్యాణగుణముల కాశ్రయుండగు విష్ణుండు పూర్వదిక్కునందుఁ బదియాఱు కళలతోఁ గూడిన పూర్ణచంద్రుండునుంబోలె నావిర్భవించెను. తామరసపత్త్రములవంటి విశాలనేత్రములును జతుర్భుజములును శంఖచక్రగదాద్యాయుధములును గలిగి యింతకు మునుపు చూచి యెఱుఁగని రూపమున వింతలు గొలుపుచున్న యాయబ్బురపుఁ జిన్నిబాలుని వసుదేవుఁడు చూచెను. మఱియు నా బాలుని వక్షంబున శ్రీవత్స మను మచ్చయు, నఱుతఁ గౌస్తుభమను రతనంబును, నడుమఁ బీతాంబరమును వెలయుచుండెను. అతఁడు దట్టమై కారుకొన్న మేఘముఁబోలె నల్లనిమిసిమిగాయ దొలఁకుచుండెను. మఱియు మిక్కిలియు వెలపొడుపయిన వైడూర్యాది మణులు పొదిగిన కిరీటమును, కుండలములయుఁ గాంతు లతని ముంగురులకుఁ గ్రొంబసిమి కొని సొమరు చూపుచుండెను. బలువైన మొలనూలు, బాహుపురులు, కంకణములు మొదలయిన యాభరణముల రుచులచే నతఁడు మిక్కిలియు వెలుంగుచుండెను. అపు డా వసుదేవుఁడు వింతపాటుచేఁ గన్నులంతయుఁ దేరకొన విచ్చి, యా కన్నచిన్నారి సుతుని శ్రీహరిఁగ నెఱిఁగి జూచి యాకృష్ణావతార మహోత్సవమువలని సంబరమున మునిఁగి, యపుడే స్నానము గావించి, మదంబు పొదల బ్రాహ్మణులకుఁ బదివేల గోవులను దన మనస్సున ధారవోసెను. అంత నతండు నిజప్రభావ పటలముచే నా పురిటింటి నంతయు వెలిఁగించుచున్న యా చిన్నికుమారునిఁ బరమపురుషుఁ డని నిశ్చయించి యంగముల కంసునివలని భయము డించి, బుద్ధికి దిట నూలుకొలిపి, వినయంబున నంగములను ముడిఁచి, యతని ప్రభావ మెఱిఁగి, స్తుతించెను. "నీ వవతరించి యున్నావని తెలియఁగానే యిపుడే కేల నాయుధ మెత్తికొని కంసుఁడు వాఱుతెంచును, కాన నీ దివ్యవిగ్రహమును మఱుఁగుసేయుము' అనెను.

దేవకియు చతుర్భుజాదు లయిన పరమ పురుషలక్షణములతోఁగూడియున్న యా కన్న కొమరుని జూచి, మున్ను కంసుని భయమున విన్ననై యుండియు నా బిడ్డ కొంత కలిగె నని తెలిసి చిఱునవ్వు నవ్వుచుండె నతని స్తుతించెను. "నీ వవతరించిన యీ నృశంసుఁ డేమి సేయునో యని యెంతో కలంగి దిగులుపడుచున్నాను. విశ్వాత్మా, కాఁబట్టి శంఖచక్రగదాపద్మవిరాజమానమై సిరి గులుకుచు నలౌకికమై చతుర్భుజముల వెలయుచున్న యీరూపము నుపసంహరింపుము" అనెను. అంత నా భగవంతుఁడు తన తల్లిదండ్రులు చూచుచుండఁగనే తటాలునఁ దనమాయచేత సామాన్యమగు నొక మనుష్యశిశు వయ్యెను.

వసుదేవుఁడును తన పుత్త్రుఁడయిన భగవంతుఁడు తన కానతిచ్చియున్న చొప్పున గావించువాఁడై యాబిడ్డనిఁ గేల నెత్తికొని యాపురిటింటినుండి వెలుపలఁ గొనిపోవ నుంకించెను. ఆసమయమందే నందుని యాఁడుది యగు యశోదకు యోగమాయ చిన్నికూతురై జనించెను. ఇంద్రియవ్యాపారములను ఆమె హరించుటచే ద్వారపాలకులును బురిజనులును మైమఱచి నిదురించుచుండిరి. వాకిళ్ళన్నియు సూర్యునికిఁ జీకట్లుం బోలెఁ దమంతట విచ్చి తెఱచుకొన్న వయ్యె! పర్జన్యుఁడు పురజనులు మేలుకొనకుండునట్లు ఉఱుముచు వాన గురియుచుండెను. యమునానది గట్లొరసికొనుచుఁ బ్రవహించుచుండెను, కాని సీతాపతి యగు రామునికి సముద్రుండుంబోలె నా వసుదేవునకుఁ ద్రోవ యొసంగెను. వసుదేవుఁడు నందుని మందను జేరి, చిన్నికృష్ణుని యశోదశయ్యయందొయ్యన నునిచి యాయమ కన్న కూతు నెత్తుకొని మరలఁ దన యిలు వచ్చి చేరెను. ఎప్పటి వలె నుండెను, ద్వారములు మును పటివలె తమంత మూసికొన్నవి.

ఆబిడ్డ యావు రని యేడువఁగా, నా చప్పుడు విని కావలి వారు కంసునకుఁ జెప్పిరి. కంసుఁడును కడు వేగఁ బురిటింటికి వచ్చి చెలియలి కూఁతును బట్టుకొని పుడమిని తాటిపయిని బడఁ గొట్టఁ బైకెత్తెను. అబ్బాల, ఆ యోగమాయాదేవి కంసుని కేలనుండి నేలం బడక యుప్పరంబున కెగసి నిజస్వరూపముఁ దాల్చి "ఓరీ, మూఢా, నిన్నుఁ దుదముట్టించు నీ శత్రువు ఒకచోటఁ బుట్టియున్నాఁడు. దీనులయిన కూనలను నిరర్థకముగ చంపకు" మని కంసు నదల్చి, భూతలమున పలుతావుల పలుపేరుల వెలసెను. కంసుఁ డంత దేవకికిని వసుదేవునకును సంకెలను విడిపించి "పుత్త్రఘాతకుఁడ నగు నాదుండగము క్షమింపుఁ" డని వారి యడుగులను బట్టుకొనెను. వారు మనస్సు కలంక మాని తిన్నని మాటల వీడుకొలుపఁగాఁ గంసుఁడు తన గృహమున కరిగెను.

ఆ రేయి గడవఁగానే కంసుఁడు తన మంత్రులను బిలిపించి యోగమాయ చెప్పినదంతయుఁ దెలిపెను. సాధువులను హింసించిన విష్ణువు హింసితుఁ డగు నని, బ్రహ్మాహింస తనకు హితమని భ్రమించి రక్కసుల నందు కాజ్ఞాపించెను.

నందుఁడు తనకుఁ గొమరుఁడు పుట్టఁగానే మిక్కిలియు నుప్పొంగి, శుచియై, వేదవిదులయిన విప్రుల రావించి స్వస్తివాచనికము జదివించి, బిడ్డకు జాతకర్మము జేయించి పితృదేవతార్చనల విధ్యుక్తక్రమంబున జరిపినవాఁ డయ్యెను.

# కృష్ణజననము *

## శ్రీ మాడభూషిమఠం వేంకటాచార్యులుగారు

వన్నెమాడువులను వరలు గోష్ఠిపురాన వెన్నుఁ డుద్భవింపఁ జెన్నుమీఱఁ
జమురు నున్ని గొని వసంతంబు లాడంగఁ బంక మయ్యెఁ గృష్ణుప్రాంగణంబు.

పరువులెత్తువారుఁ, బడువారు, ముద నూరఁ బెనఁగువారు, నేఁడె బిడ్డఁ డనుచు
నెమకువారు, వాయిదము గొట్టఁ బాడువా రాడువారు నైరి యాయపల్లె. 2

ఇడుమ వాసి చెల్వ మెసఁగ బిడ్డఁడు పుట్టఁ జూడఁబోవువారుఁ, జూచి మరలు
వారు, వీని సాటి రా రెవ్వరిలఁడు శ్రవణపతి, జగ మేలు ననెడి వారె!

ఉట్లఁ దెచ్చి యుంగి నూరలించి యాకువా ర్చాలు పెఱుఁగు నేయి పంచువారు
నెఱికురు ల్వీడంగ నెఱపి నాట్యము తెల్వి కూటకట్టె రయిరి గొల్ల లచట. 4

గట్టిత్రాటియుట్లఁ, గఱకైన గొడ్డండ్లు, మొగలిసెజ్జ దండమును, చెలంగ
మొల్లపూవుపంతముల గొల్ల లపుడు 'నెయ్యాడ' § లాట లాడి రాలపల్లె.

కాలు కేలు నిమిరి గంగాళిపు న్నీటఁ జక్క నార్చి చిన్ని చాయపసుపు
నాల్కఁ గీచినట్టి నాతికి వా నూప బిడ్డనోటఁ గాంచె విశ్వ మామె.

విశ్వ మట్లు గాంచు వెలఁదుకసఖులెల్ల గొల్లబిడ్డ గాఁడు, గొప్పదైవ
మఖిలసుగుణశీలుఁ డగు మేటిబాలుఁడు మాయకాఁ డటంచు మలయువారె.

పదిదినములు గడవఁ బిదప రెండవనాఁడు అన్నిదిక్కులను జయధ్వజంబు
నిల్పి కొండతాల్పు నేర్పుకానినిఁ గేలఁ గొనుచు సంతసిలిరి గొల్లలెల్ల. 8

పండఁబెట్టఁ దొట్ల పగులఁ దన్నును, జంక నెత్తుకొన్న నొడల నెల్ల విఱుచుఁ
జిక్కఁబట్టి యొమ్ము సేర్పఁ గడ్పునఁ బాలు నోర్వ కలసి సోలి నుపిదలార. 9

వరిపయిరులమళ్ళ వరగోష్ఠిపురమందు సామి యవతరించు చందమెల్ల
వెలయఁ జెప్పు విప్రవిష్ణుచిత్తులపాట లివి పఠించువారి కెడరు లేదు. 10

---

* శ్రీ విష్ణుచిత్తుడను వైష్ణవ దివ్యసూరి రచించిన 473 గేయాల మాలికలో ఒక దశకమున కిది యనువాదము.

§ 'నెయ్యాడల్' – ఇది గొల్లలాడుకొను నొకయాటకు తమిళమున పేరు.

# అహంకారనిరాసము

శంకరాచార్యులనుగూర్చి ముచ్చటైన ఐతిహ్యమొకటి చెప్పుచుందురు. ఆయన యొద్దనుండిన శిష్యులలో నొకనికి చిరకాలమాయన యెట్టియుపదేశమును చేయకుండెను. ఒకనాడు ఒంటరిగ కూర్చున్న శ్రీ శంకరాచార్యులకు వెనుకవైపునుండి అడుగులచప్పుడు వినవచ్చెను. "ఎవరక్కడ" అని ఆచార్యులడిగిరి. "నే" నని ఆ శిష్యుడు బదులు చెప్పెను. వెంటనే మహాచార్యు డిట్లనెను. "ఈ 'నే' ననునది నీకంత ప్రియముగ నున్నచో అందు యావద్విశ్వమిముడునట్లుగా దానిని విస్తరించుకొనుము, లేదా దానిని పూర్తిగా త్రోసి రాజనుము."

శ్రీ రామకృష్ణుని శిష్యులిద్దఱిలో శ్రీ శంకరుల యీ యుపదేశద్వయ మనుష్ఠితమైనది. అందొకరు శ్రీ వివేకానందస్వామి, రెండవయతడు నాగమహాశయుడు. ఈ యిద్దఱి నిరహంకారతనుగూర్చి శ్రీరామకృష్ణుని మఱొక శిష్యుడగు గిరీశచంద్రఘోషు సచమత్కారముగ ఇట్లనెను: అఖిలాండకోటి బ్రహ్మాండములను తనలో ఇముడ్చుకొన జాలినంతగా విస్తరింపజేసికొన్న శ్రీ వివేకానందస్వాముల అహంత మాయాజాలమున పట్టనందున ఆయన అందులో చిక్కుకోలేదు. నాగమహాశయుడు తన అహంతను పరమాణువుకన్నను అత్యంతసూక్ష్మమగునట్లుగా గుదించుకొన్నందున మాయాజాలమున చిక్కుకొనక దాని స్థూలరంధ్రముల గుండ అతడు వెలువడెను.

కోటి కొక్కరో లక్ష కొక్కరో అట్టివారు తప్ప తక్కిన మనమందఱము అహంత నంటిపెట్టుకొని యున్నందున మాయాజాలమున చిక్కుకొనియున్నాము. కావున మన కష్టాలకు అంతము లేకున్నది. ఈ 'అహంత' మనకు వశపడిననాడే మన ఆధ్యాత్మిక సాధన ప్రారంభమగుచున్నది. ఈ యహంత అంతరించినప్పుడు, లేదా భగవంతు ననంతత్వములో లయించినప్పుడు ఆధ్యాత్మిక సాధన సిద్ధి నందుచున్నది—

నేను ముక్తిని గన నేర్చు టెన్నటికో!
'నేను' జచ్చినఁ గల్గ నేర్చును ముక్తి

అనెడి ద్విపద శ్రీరామకృష్ణునకు ప్రియము. దానిని తఱచుగ ఆయన వల్లించుచుండెడివాడు.

మనకు మనస్సును చైతన్యము నుండుట ఎంతనిజమో అహంత యుండుటయు అంత నిజమే. అహంత లేకున్న ఐహిక జీవితము సాగదు. కాని దానిగూఢశక్తియు అమోఘసత్తయు మనకు బొత్తిగ తెలియకున్నవి. దయ్యాలపట్టులో ఉన్న వారివలె మనము 'అహంకారపు' చెప్పుచేతలలో ఉన్నామని అర్థము చేసికొనజాలకున్నాము. ఒక్క గంభీరసూక్తిలో శ్రీరామకృష్ణుడు అహంతయు మాయయు ఒక్కటే అని తెల్పెను. ఆ సూక్తి: "మాయయనగా దేహధారిలోని అహంతయే కాని వేఱేదియు గాదు."

ఏకమును విశ్వవ్యాప్తము నగు తత్త్వమును మఱుగుపఱచి అనేకత్వమును గనబఱచున దేదో అదే మాయ. మనలో ఒక్కొక్కరికిని అహంతయు ఆపనినే చేయుచున్నది. కావుననే శ్రీరామకృష్ణుడు అవిరెండు నొక్కటేయనెను. ఇతరులకంటె జగత్తునకంటె మనము వేఱని తలంపించున దేది? అహంతయే. ఈ సంకుచితాశయము నతిక్రమించి, తక్కిన జగత్తుతోను పరతత్త్వముతోను మనకు గల ఐక్యమును అనుభవమున కెంతవఱకు తెచ్చుకొందుమో అంతవఱకు మనకు మానసికాధ్యాత్మిక సుస్థితి మరల గలిగినట్లే. స్విట్జర్లండులోని డాక్టరు సి. జి. జంగ్ అను గొప్ప మనస్తత్త్వ

శాస్త్రజ్ఞుడు ఈ విషయమును వైద్యుల కిట్లు తెలుపుచున్నాడు: "అంగినుండి కత్తిరింపబడ్డ అంగమువలె, మానవతతినుండియు పరమాత్మ నుండియు వేఱుపఱచే అహంత నావహించిన రోగము అని మనోవైద్యు లంగీకరింపగల్గి యుండవలెను." భవరోగమును మాన్పుకో గోరు సాధకులకు ఇది విలువగల సూచనయే.

మానవునిలో ఆంతరముగను తనివి నొందింప రానిదిగను సౌఖ్యబుభుక్షకలదు అహంత నంటిపెట్టుకొనియున్నంతవఱకు మానవునకు ఈ యాకలి తీఱదు అంతవఱకుములగు వానివలన సౌఖ్యము గలుగదు, అహంత కంతము గలదు. ఏది అనంతమో అదొక్కటే సౌఖ్యవంతము. అంతరహితమైన ఆ సౌఖ్యము మానవునిలోనే యున్నదనుటకు సందేహము లేదు. మఱి వానిని సౌఖ్యము నందనీయక ఆటంకపఱచున దేది? ఆటంకపఱచునది అహంకారమే అనుచున్నారు శ్రీ శంకరాచార్యులు.

బ్రహ్మానన్దనిధి ర్మహాబలవతా
హ్యహఙ్కారఘోరాహినా
సంవేష్ట్యాత్మని రక్ష్యతే
గుణమయై శ్చణ్డై స్త్రిభి ర్మస్తకైః
విజ్ఞానాఖ్యమహాసినా ద్యుతిమతా
విచ్ఛిద్య శీర్షత్రయం
నిర్మూల్యాహి మిమం నిధిం సుఖకరం
ధీరో உనుభోక్తుం క్షమః.
(వివేకచూడామణి 302)

హృదయక్షేత్రములో బ్రహ్మానంద మను బంగారుపాతర ఉన్నది. మహాబలవంతమగు నహంకార మనెడి భయంకరసర్పము దానిని చుట్టుకొని కాపాడుచున్నది. వాడిమిగల పడగలు దానికి మూడున్నవి. సత్త్వము రజస్సు తమస్సు అను మూడుగుణములే ఆ మూడు పడగలు. లక్ష కొకడో కోటి కొకడో ధీరుడు తళతళలాడు విజ్ఞాన మనెడి పెద్దకత్తితో ఆ మూడుపడగలను కోసి సర్పమును నిర్మూలించి, సుఖకరమగు నా నిధిని అనుభవింపసమర్థుడగును.

వ్యాధికి కారణమెఱుగక వైద్యుడు దానిని మాన్పజాలడు. ఆధ్యాత్మికసాధకులయు బోధకులయు దృక్పథము సుస్థితిని చెడగొట్టు వ్యాధికి కారకము అహంకారమే. దానికి ప్రతిక్రియ చేయగల్గవలె ననిన దానిపుట్టువును వృద్ధిని, మనల బాధించుటకై అది దాల్చు రూపములను ఎఱుగవలెను. సకలమతములును అహంకారనిర్మూలనమే బ్రహ్మైక్యమునకు మొదటిమెట్టుగ చెప్పుచున్నవి. ఈవిశకంఠ్యము యాదృచ్ఛికము కాదు.

ముణ్డకోపనిషత్తు (III-i) అన్యాపదేశరీతిలో ఇట్లు చెప్పుచున్నది—

ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే
తయో రన్యః పిప్పలం స్వాద్వ త్త్య
నశ్న న్నన్యో ఉభిచాకశీతి.

సదా కూడియుండునవి మిత్రములు సమానాభివ్యక్తికారణములు గలవి చక్కని ఱెక్కలు గలవియు నగు రెండుపక్షులు (జీవుడు-ఈశ్వరుడు) (శరీరమనెడి) ఒక్కవృక్షమునే అధిష్ఠానముగా బడసి నెలకొనియున్నవి. మూల మూర్ధ్వమునను శాఖలు క్రిందను నుండు క్షేత్రమనెడి యశ్వత్థవృక్షమిది. సకలప్రాణుల కర్మఫలముల కిది ఆశ్రయమై యున్నది. ఇందు నెలకొన్న యాపక్షులం దొకటి(జీవాత్మ) అనేకవిచిత్రవేదనాస్వాదరూపమగు సుఖదుఃఖలక్షణముగు ఫలమును భక్షించుచున్నది. నిత్యశుద్ధముక్తస్వభావము గల్గి సర్వజ్ఞము సర్వ

సత్త్వోపాధియగు ఈశ్వరుడు అను రెండవ పక్షి ఫలమును తినక చూచుచుండును. భోజ్యములను భోక్తలను ప్రేరించుచు నిత్యసాక్షిత్వసత్తామాత్రముగ నుండు ననుట. మరి శ్లోకవ్యాఖ్యలో శ్రీ శంకరులీయహంకార మూలము నిట్లు వివరించియున్నారు-శరీర మనెడి ఆ వృక్షమందే జీవుడు అవిద్యాకామకర్మఫలరాగాది గురుభారాక్రాంతుడై కడలి నీట సొరకాయ వలె దేహమే ఆత్మ అనెడి భ్రాంతిలో మునిగి 'ఈ దేహమే నేను, ఫలానావారి పుత్త్రుడను, మనుమడను, కృశించియున్నాను. బలిసియున్నాను, గుణవంతుడను, గుణరహితుడను, సుఖిని, దుఃఖిని, ఈ దేహమునకంటె వేఱేమియు లే' దనుచు తిర్యఙ్మనుష్యాదియోనులలో పుట్టుచు చచ్చుచు బంధువుల కూడుచు వీడుచు నుండును. దీనుడై పరితపించును. (ఎన్ని జన్మ లిట్లు గడవగా ఒకానొకప్పుడు సంచితధర్మఫలముగా పరమకారుణికుడగు గురుని ప్రాపు లభించును. గురు వితనికి యోగ ముపదేశించును. ఆ మార్గమున నితనికి శమదమాదిగుణసంపదయు ఈశ్వరసాక్షాత్కారమును గల్గును. 'సకలజగదాత్మ అతడే, అతడే నేను' అనుట గుర్తింపబడగానే జీవుని సకలశోకములు తుడిచివేయబడినట్లుగ అంతరించును'')

దేహాత్మభ్రాంతియే అహంకారమునకు మొదటి కారణము, మూలకారణము. లౌకికపు మనుగడలోని చీకాకులు సుఖదుఃఖములు జనన మరణములు మున్నగు వానికెల్ల కారణము ఇదే. దేహాత్మభ్రాంతితోగూడనే మనః ప్రముఖేంద్రియములు తా ననెడి భ్రాంతియు గల్గుచున్నది. 'దృగ్దర్శనశక్త్యో రేకాత్మతైవాస్మితా' ''దృక్కరణమే ద్రష్ట ‒ భ్రాంతియే అహంకార'' మని పతంజలి సూత్రించెను. శుద్ధుడు ముక్తుడునగు ఆత్మయే ద్రష్ట. దృక్కరణములో జ్ఞానేంద్రియములన్నియు మనస్సునుగూడ జేరియున్నవి. ఇవి బాహ్యప్రపంచానుభవము నొందుటకు సాధనములు. ఈ సాధనములతో పరమాత్మ తాదాత్మ్యము నొందుటే 'అస్మిత' ( = అహంకారము.) 'నేను మనస్స' నియు, 'సంకల్పము' ననియు 'నాకు కోపమువచ్చిన' దనియు 'నేను సుఖి' ననియు మనము చెప్పుచుందుము. అజ్ఞానముచే అంతఃకరణముతో మనసును తాదాత్మ్యమును బొందుటే ఈ భ్రాంతికి కారణము.

అహంకారతత్త్వమును శ్రీరామకృష్ణుని యీ సుభాషితము మఱింత స్పష్టపఱచుచున్నది:- పొయ్యిలో నిప్పున్నది. కావున దానిపై నుంచిన పాత్రలోని బియ్యమును పప్పును ఉర్లగడ్డలును తక్కిన కూరగాయలును కుతకుత ఉడుకుచున్నవి. 'ఇదిగో మే మిచ్చట నున్నాము ఇచ్చట గంతులిడుచున్నాము' అని అవి తెలుపుకొనుచున్నట్లు అనిపించును. మన దేహమే పాత్ర. మనస్సును బుద్ధియు జలము. ఇంద్రియ విషయములే బియ్యము కూరగాయలు మున్నగునవి. ఇంద్రియములే తా ననెడు తలంపు ''నేను ఉడుకుచున్నా'' నని చెప్పించును. సచ్చిదానందమే నిప్పు.''

పాత్రస్థానీయమగు దేహము అహంకారమును ఏర్పఱచుటలో అంతటికిని మూలము. అంతట వేగముగా మనస్సును బుద్ధియు ఇంద్రియములును ఇంద్రియ విషయములును పనివడుచున్నవి. పరమాత్మ ఏమో నిప్పువలె అగపడకుండును. భగవద్గీత సప్తమాధ్యాయ భాష్యములో శ్రీశంకరులు 'అహంకార' వివరణము కావించియున్నారు. అచట వారు 'అహఙ్కార ఏవ హి సర్వస్య ప్రవృత్తిబీజం దృష్టం లోకే' ''లోకమున ఎల్లరను వారివారి

పనులలో ప్రవర్తింపజేయు బీజము అహంకారమే అనుట స్పష్టము'' అన్నారు. అజ్ఞానము దాల్చు తొలిరూప మీ యహంకార మని ఆచార్యులవారు వివేకచూడామణిలో కన బఱచి యున్నారు.

మానవునిలో అహంకారము చాల లోతునకు వేరులు పాఱియున్నది. మాటాడుచున్నప్పుడును, నడచుచున్నప్పుడును పని చేయుచున్నప్పుడును ప్రార్థించుచున్నప్పుడును, భుజించుచున్నప్పుడును ధ్యానించుచున్నప్పుడును— ఈ అహంకార మెంతగనో ఉన్నది. నేపథ్యగానమువలె అది అవిచ్ఛిన్నముగ సాగుచునే యుండును. జాగ్రత్స్వప్నదశలలో అహంకారమును తప్పించుకొనజాలము (గాఢ సుషుప్తిలో మాత్రమే ఇది తనకు కారణమైన అవిద్యలో అడగియుండును.) కావున అహంకారమును తొలగించుకొనుటకై పోరాటము సదా సాగుచుండవలసినదే. ఆధ్యాత్మిక సాధకుడు యావజ్జీవము అహంకారముతో పోరు సాగించుచునే యుండవలయును.

దానిని జయించు మార్గములు ఉపాయము లున్నవి. వాని నెఱిగి వినియోగించుకొన్నచో పోరాటపు పరిశ్రమ తగ్గును యోగులు మహర్షులును ఈ మార్గములచేతను ఉపాయముల చేతను నెగ్గిరి. కావున మనలనుసైత మవి నెగ్గింపగలవు. అహంకారనిరాసమార్గములు స్థూలముగ నాలుగు విధములు 1. పొరలొలుచుట. 2. పరివిపఱచుట 3. వేఱులోహమును బంగరముగా చేసినరీతిలో మార్పొందించుట. 4. 'నేను కాను నీవే' అను పద్ధతి.

## పొరలొలుచు పద్ధతి

ఇది శ్రీరామకృష్ణుని ఈ క్రింది సూక్తిలో వివృతమై యున్నది:— ''ఎవడైనను తన్ను విభజించి చూచుకొన్నచో 'నేను' అను పదార్థ మతనికి గోచరింపనే గోచరింపదు. ఒక ఉల్లి గడ్డను దీసికొనుము. పైనున్న యెఱ్ఱపొరను మొదట ఒలిచివేయుము. లోపల గట్టి తెల్ల పొరలు కానిపించును. ఒక్కొక్క దానినిగా ఆపొరలనుగూడ ఒలిచివేయుము. లోపల వేఱే మియు నుండదు. ఆదశలో మానవునకు తన యహంకారపుటునికి పూర్తిగ అదృశ్యమగును. దానిని వెదకుటకు ఎవరు మిగిలియున్నారు ?

తత్త్వబోధనలను సుగమములుగా చేయుటకు తగిన యుపమానములను ఉదాహరణములను చూపు నసాధారణప్రజ్ఞ శ్రీ రామకృష్ణునకు గలదు. ఉల్లిగడ్డయుపమాన మెంత యుక్తమైనదియు ఆలోచించినకొలది మనకు స్పష్ట మగును. దేహమునే ఆత్మ అనుకొను భ్రాంతి రూపములో నే—మన యహంకారము చాల పట్టుకున్నది. వివేకమును ప్రసరింప జేసితిమేని 'దేహ మాత్మ కాదనుట వెంటనే మనకు స్పష్ట మగును. ''ఈ చేయి నేనా? ఈ చరణము నేనా? ఈ రక్తమాంసాలు నేనా? ఈ యెముకలును కండలును నేనా? వీనిలో నేదియు నేను కాను.'' ఇట్లు అహంకారపుటుల్లిగడ్డకు గల వెలుపలిపొరలు ఒలువబడి తొలగిపోవును. మఱి కొంత గాఢముగ వివేచించితిమేని 'మనస్సు నేను కాను, బుద్ధిని నేను కాను, సహజావబోధములు నేను కాను, ఉద్రిక్తభావాలు నేను కాను' అనుట తెలిసి మఱికొన్ని పొర లూడి మఱుగువడును. ఇట్లింకనింకను పొరలను ఒలుచుకొనుచు పోయితిమేని అహంకారపు జాడసైత మదృశ్యమగును. ఈ పొరలకంటె వేఱైన 'నేను' లేదు.

ఈ పద్ధతిలో అహంకారనిరాసము ఉపనిషత్తులందు తఱచుగ గనబడుచుండును. ఆత్మాన్వేషి యగు సాధకుడు జ్ఞానమార్గమున నిట్లు

వివేచించుచు బోవలయును. ఈ మార్గమునకు నేతినేతి (ఇది కాదు, ఇది కాదు అను) మార్గ మనియు పేరు. ఇందు త్రోసివేయబడునవి దేహ మనః ప్రభృతులుమాత్రమే కాదు. జాగ్ర త్స్వప్నసుషుప్త్యవస్థలు కూడ త్రోసివేయ బడును. ఆత్మ నావరించియుండు కోశపంచక మును తైత్తిరీయోపనిషత్తులో చెప్పబడుచున్న మన కుపదిష్టమగు మార్గము 'ఈపొరలొలుచు' మార్గమే. కఠోపనిషత్తు కూడ కడపట,

> అఙ్గుష్ఠమాత్రః పురుషో ఽ న్తరాత్మా
> సదా జనానాం హృదయే సన్నివిష్టః
> తం స్వా చ్ఛరీరా త్ప్రవృహే,
> న్ముఞ్జాది వేషీకాం ణ
> తం విద్యా చ్ఛుక్ర మమృతమ్.

"బొటనవ్రేలియంతటి ప్రమాణము గల పురు షుడు అంతరాత్మగా సదా జీవుల దేహముల నెలకొనియున్నాడు. గడ్డినుండి వీనపుల్లను ఒలిచి కైకొన్నట్లు, దృఢచిత్తముతో ఒడలి నుండి పురుషుని వేఱు చేసికొనవలయును. ఆ పురుషుడే శుద్ధుడనియు అమృతుడనియు నెఱుగ వలయు" నని చెప్పుచున్నది.

కాని ఈ పద్ధతి మహాసత్త్వులకే కాని సామాన్యులకు దుష్కర మనుట నిస్సం దేహము.

## విరివిపఱచు పద్ధతి

అహంకారమువలన మనకు గల్గు 'సంకో చమే' దుఃఖమునకును బంధమునకును కార ణము. ఆత్మస్వరూపము అనంత మగుటచే అది ఎట్టి యవధులను సహింపదు. అహంకార మనెడి బంధమునుండి విడుపొందవలె ననిన సాధకుడు 'నేను' అను తలంపును విశ్వమునంత టిని తనలో ఇముడ్చుకొనగలంతగా విరివిపఱచు కొనవలయును. విశ్వాత్మతోడి తన ఐక్యమును అనుభవములోనికి తెచ్చుకొనవలయును. 'సమ స్తము నునేనే' అను తలంపు దృఢపడుకొలదియు సంకుచితాహంకారబంధము తొలగిపోవును. ఈ యాశయము శ్రీశంకరులు నిర్వాణ షట్కపు తుదిశ్లోకమున పొందుపఱచి యున్నారు

> (అహం నిర్వికల్పో నిరాకారరూపో
> విభుత్వా చ్చ సర్వత్ర సర్వేన్ద్రియాణామ్
> న చాసఙ్గతం నైవ ముక్తిర్ న మేయ
> శ్చిదానన్దరూప శ్శివోఽహం శివోఽహమ్.)

> నిర్వికల్పుండను, జటినిరాకార
> రూపుండ, విశ్వస్వరూపుండ నేను
> సకలేంద్రియాతీగ సంగిని నుందు
> జ్ఞేయుడ గాను మోక్షితుడగా బోను
> సచ్చిదానందుండ శంభుండ శివుడ.

ఈశావాస్యోపనిషత్తులోజ్ఞానిస్వరూపమీలాగు వర్ణింపబడియున్నది—

> యస్తు సర్వాణి భూతా
> న్యాత్మన్యే వానుపశ్యతి
> సర్వభూతేషు చాత్మానం
> తతో న విజుగుప్సతే
> యస్మిన్ సర్వాణి భూతా
> న్యాత్మై వాభూ ద్విజానతః
> తత్ర కో మోహః క శ్శోక
> ఏకత్వ మనుపశ్యతః

సర్వభూతములను ఆత్మలోను ఆత్మను సర్వ భూతములందును సాక్షాత్కరించుకొను నట్టి వాడు దేనిని గాని ఏవగించుకొనడు. సర్వ భూతములును ఆత్మయే అయినప్పుడు ఆయైక్య మును ప్రత్యక్షముగ గనుచున్న జ్ఞానికి మోహ మెక్కడిది? దుఃఖమెక్కడిది?

ఈరీతిగ నహంకారనిరాస మొనర్చినవారు శుకయోగి జడభరత ప్రముఖులు. ఈ మార్గము సామాన్యులకు సుగమము కాదు.

## మార్పొందించు పద్ధతి

ప్రాచీనకాలమున రసవాద మను నొకవిద్య అమలులో నుండెను. దానిచే వేఱులోహములు బంగారముగ మార్పొందింపబడుచుండినవి. అట్లే క్షుద్రమును రుగ్ణమును బంధకము నగు నహంకారమును ఉదారమైన దానినిగను ఆరోగ్యసంపన్నముగను బంధవిమోచకము గను మార్పొందించు పద్ధతి యొకటి కలదు.

ఐహికపరతను ఆపాదించి కామినీకాంచనాసక్తిని నింపెడి యహంకారమును శ్రీరామకృష్ణుడు దురహంకారమని పేర్కొన్నాడు. తాను నడుమ జొచ్చుకొని జీవబ్రహ్మభేద భ్రాంతిని గలిగించుచున్నది ఈ దురహంకారమే. నీటిపై అడ్డముగ ఒక కొయ్యను పెట్టుము. నీరు ఇరుపాయలైనట్లు కనిపించును. నిజముగ ఉన్న నీరంతయు నొక్కటే. ఆ కొయ్యవలన ఒకటి రెండైనట్లు అగపడును. అహంకారము ఆ కొయ్యవంటిది. కొయ్యను తీసివేసినచో మునుపటివలె ఒకటే నీరుండును. ఎన్నిపర్యాయములు ప్రయత్నించినను 'నేను' అను తలంపును విడివిడజేసుకొన నెంతగా శ్రమించినను, తొలగినట్లు కనిపించి—అహంకారము మరల మరల కలుగుచునే యుండును. కావుననే శ్రీరామకృష్ణుడు ఇట్లనెను :—"సామాన్యులకు అహంకారము ఎప్పుడును పోదు. రావిచెట్టును నీవు నేడు వేరంట నఱికినను రేపాక మొలక మొలవనే మొలచును, నీవు చూతువు. కాబట్టి 'నేను' అనునది యుండనే వలయునేని ఆపోకిరిని "దాసుడనైన 'నేను'"గా నుండనిమ్ము. బ్రతికినన్ని నాళ్ళును నీవు 'ఓ స్వామీ నీవు ప్రభువవు, నేను బంటను' అని అనుసంధించుచునే ఉండవలయును. భగవద్దాసుడను భగవద్భక్తుడ నని అనుకొనుచుండు 'నేను' ఎవరికిని బాధకము కాదు. కాకపోవుటే కాక భగవత్ప్రాప్తి సాధకమును అగును. తాను దాసుడ నను భావము ఒకనికి నిక్కముగ కలుగునేని, అతనిలో కననగు కామక్రోధాదులు ఆభాసమాత్రములే. కాలిపోయి నేలపై బడియున్న దారము, దూరమునుండి చూచు నీకు నిజమైన దారమువలె అగపడవచ్చు. కాని సమీపించి ఊదుదువేని అది నిశ్శేషముగా ఎగిరిపోవును. భగవత్ప్రాప్తి కనంతరము తన్ను భగవద్దాసునిగనో భగవద్భక్తునిగనో భావించు నాతడు ఎంతకిని హాని చేయలేడు. "పరుసవేది తాకినంతనే కత్తి బంగారుగా మాఱును. కత్తి రూపమున్మాత్రము నిలిచియుండును గాని అది ఎవరికిని గాయపఱుపజాలదు."

## నేను కాను నీవే అను పద్ధతి

'కర్తను నే' నని యెంచుట అహంకార లక్షణము. కాని ఇంచుకంత ఆలోచించి చూచినచో మానవుడు స్వప్రయత్నముచే సాధింపగల దేదియు లేదనుట స్పష్టమగును. మనలో ప్రతియొక్కనికిని స్వప్రాముఖ్యమును గూర్చిన భ్రాంతి యున్నది. కాని మనము పుట్టుటకు ముందు సాగుచున్నట్లే ఈ ప్రపంచము – దీనిని మనము వీడి యేగినపిమ్మటకూడ సాగుచుండగల దనుటను మనసుకు తెచ్చుకొంటిమేని మన పొంగు క్రుంగును. అయినను ఈ యహంకారమేమో "మనము లేకపోయినచో మనవారి గతి ఏమగునో" అనియే మనలను తలంపజేయుచుండును. గోపురముల కడుగున దాని బరువును తమ భుజములపై మోయుచున్నట్లు కొన్ని బొమ్మలు చెక్కబడియుండును. నిజము

నకు గోపురమునకు పునాదులు వేయున్నవి, దీని బరువు నాబొమ్మలు మోయుచుండ లేదు. ఊరక మోయుచున్నట్లు కనిపించు నంతే మన భార సాహిత్యమును మన ప్రాముఖ్యమును అట్టిదే అని శ్రీరమణమహర్షుల వారొకపరి వక్కాణించియుండిరి.

కురుక్షేత్రమున అర్జునుడు శత్రుహింసకును యుద్ధవిజయమునకును తన్ను కర్తనుగా భ్రమించి విషాదము చెందెను. అతని భ్రాంతిని గుర్తించిన శ్రీకృష్ణుడు దానిని పోగొట్టుటకై తన విశ్వరూపమును జూపెను. శత్రువులందఱు తమంతట వచ్చి అవిరామ్యార్తి వక్త్రగహ్వరమున బడి గ్రమందుచుండుటను అర్జునుడు చూచెను.

మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్

'ఓ కవ్వడీ, వీరందఱు ముందే నాచే చచ్చియున్నారు. నీవు కేవలము నిమిత్తమాత్రమవు కమ్ము' అని శ్రీకృష్ణుడు తెలియజెప్పి అతని కర్తృత్వాహంకారమును తుడిచివేసెను.

మన మందఱమును - ముఖ్యముగా ఆధ్యాత్మిక పథికులము - సంసారయుద్ధ క్షేత్రమున నున్నాము. మనము వెలుపలి శత్రువులను గెల్వగోరినను లోపలి పగతుర నణపగోరినను అర్జునుని స్థానమున నున్నాము. భగవంతుని శరణుజొత్తుమేని ఆయన అర్జునుని గెల్పించినట్లు మనలనుగూడ గెల్పించును. శరణాగతియే మనకు కర్తవ్యము—

సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో
మోక్షయిష్యామి మా శుచః.

"సర్వధర్మములను వీడి నన్నే శరణు జొరుము నేను నిన్నన్నిపాపములనుండియు విముక్తి నొందించెదను. శోకింపకుము" అనునదే కదా భగవద్గీతల చరమ సందేశము.

శ్రీరామకృష్ణుడును సెలవిచ్చి యున్నాడు - "వెయ్యిపర్యాయములు ప్రయత్నించితివేనియు భగవదనుగ్రహము లేక నీవు దేనినిగాని సాధింపజాలవు. దేవుడు కనికరింపనిదే ఆయనను మనము సాక్షాత్కరించుకొన జాలము. ఆయన యనుగ్రహమును బడయుట అంత తేలికయైన పనియా? అహంకారము పూర్తిగా అంతరింపవలె. సాధకునకు 'కర్తను నే' నను తలంపున్నంతవఱకు దైవసాక్షాత్కారము గలుగదు."

మనఃఖేదములును ఆందోళనలును ఆయుస్సును క్షీణింపజేయుటలో మారణవ్యాధులను మించినవి. నేటి శాస్త్రవిజ్ఞానముచేత యంత్రశక్తులచేత మానవునకు తానే లోకమునకు స్వామి అను భ్రాంతి కలిగియున్నది. ఇందుచే అతని యహంకారరోగము ముదిరి జన్నియు పుట్టుకవచ్చినది. ఆసన్నిపాతము తొలగి మన శరీరములు సుస్థితికి మరలవలె ననిన మానవుడు తన అహంకారము నణచుకొని తన్ను తన స్వామియైన భగవంతుని కర్పించుకొనవలయును. మానవు డట్లు చేసి మేలొందునో, చేయక కీడొందునో కాలమే నిర్ణయింపవలెను. ఐనను ఆధ్యాత్మికసిద్ధిని కాంక్షించువారు ఏదారి నెన్నుకొందురో అను సందేహము లేదు.

# తెలిసికోవలసిన విలువలు - 1

## కాలపువిలువ - సోమరితనపు చెడుగులు

గడచిపోయిన దినములు ఎప్పటికిని గడచిపోయినవే. రానున్న దినములు వచ్చునప్పటికి నీ వుండకపోవచ్చు. కావున ఓ నరుడా, గడచిపోయినదానికి వెత జెందకు. భవిష్యత్తుమీద మిక్కుటముగ ఆధారపడకు. ప్రస్తుతకాలమును సద్వినియోగపఱచుకో.

ఈక్షణము నీది, పై క్షణము భవిష్యత్కాల గర్భమున నున్నది. అది ఏమి తేగలదో నీ వెఱుగవు.

చేయ నెంచిన పనిని తొందరగా చేయుము. ప్రొద్దున చేయగలపనిని సాయంకాలమునకు త్రోసిపెట్టకు.

పేదఱికమునకును బాధలకును ప్రభవము సోమరితనమే. సన్మార్గమున పాటుపడువాడు సుఖము నొందును.

పాటుపడువాడు పేదఱికమును నిర్జించును. విజయములును సుస్థితియు శ్రద్ధతో శ్రమపడు వానికి కరతలామలకములు.

సంపదను గడించినవా డెవడు? పైపదవుల అధిరోహించినవా డెవడు? విధివోచితముగ వస్త్రమాల్యాలంకరణముల దాల్చినవా డెవడు? నగరజనుల ప్రస్తుతుల నందినవా డెవడు? సలహాకర్తగా రాజసన్నిధానమున నెలకొన్నవా డెవడు? సోమరితనమును తన యింటినుండి పాఱద్రోలినవాడే, "ఓ సోమరితనమా, నీవు నా శత్రువవు" అని పల్కినవాడే!

ఆ ఉత్సాహశీలుడు పెందలకడనే నిద్ర లేచును, ఎంతో ప్రొద్దుపోయి పరుండును. ఆలోచనలచే మనస్సునకును కర్తవ్యనిర్వహణముచే మేనికిని అతడు వ్యాయామము సమకూర్చి సుశరీరముల ఆరోగ్యమును కాపాడుకొనును.

సోమరి తనకు తానే బరువు. అతనికి నిమిష మొక యుగముగా గడచును. ఇక్కడి కక్కడికి తిరుగుచుండును. తా నేమి చేయునో తానే యెఱుగకుండును.

మబ్బునీడ దాటిపోవునట్లతనికాలము దాటిపోవును. అతనియనంతర మతనిని స్మరింప జేయున దేదియు శేషింపదు.

వ్యాయామము లేనందున అతని శరీరము చెడును. అతనికి పనుల నిర్వహింపవలె నను కోరిక యుండును గాని కదలు శక్తి యుండదు. అతని మనస్సు అంధకారావృతమై యున్నది. అతని తలంపులు గజిబిజిగా నున్నవి. అతనికి జ్ఞానమును పడయుద మను ఆతుర యున్నది కాని అందు కుద్యమము లేదు. బాదము పప్పును తినవలె నను నభిలాష యున్నది, బాదముకాయను పగులగొట్టుటకు బద్ధకించును.

అతనియిల్లు తాఱుమాఱుగా నున్నది. అతని పనివాండ్రు అవిధేయులు, వారు చేయునది దుబారా. అతడు పరుగులువాఱు పెల్ల వినాశోన్ముఖముగానే. రానున్న వినాశము అతని కన్నులకు కనిపించుచున్నది, అతని వీనులకు వినిపించుచున్నది, కాని 'రాదు' 'రా' దనుచు తలఊపుచుండును. అతడొక నిర్ణయమునకు వచ్చుటకు ముందే సుడిగాలి వలె వినాశ మతని ముంచివైచును. పరాభవ పశ్చాత్తాపములతో అతడు మృత్యుగర్తమున నడగిపోవును.

# శ్రీ శివానంద స్మృతులు - 45, 46

## శ్రీమత్ప్రవ్రాజిక శ్యామాప్రాణ

బేలూరు మఠము
క్రీ. శ. 7-5-1929
(మంగళవారము)

ఒకానొక భక్తునికి సన్న్యాసము స్వీకరింప వలెనని చాల నిష్టముగ నుండెను. అతడు తన మనోభీష్టమును స్వాములవారికి తెల్పెను. మహాపురుషులు నీకు నిజముగ సన్న్యాసము స్వీకరింప ఇచ్ఛ యున్నచో బయలు దేఱుము. ఈ సంసారము అనిత్యమని బోధపడుట ఉత్తమ మగు విషయము. ఏదో ఒక ప్రదేశమునకు పోయి నిలుకడగ ప్రబల సాధనానుష్ఠానముల సల్పుము. ఇందులో నా ఆదేశముతో గాని నిషేధముతో గాని ప్రయోజన మేమి? భగవన్నామము నాశ్రయించి, సంసారమును వీడి పోవుట అనిన మహాభాగ్యమగు విషయము. వానికృప యున్ననే ఇది సమకూడును. ప్రస్తుతము మఠములో చేరవలసిన ప్రయోజన మేమియు లేదు. మొదట సాధనానుష్ఠానములందు నిమగ్నుడవు కమ్ము. అటుపై ఏదేని ఆదేశము బొందినచో మంచిదే. అప్పుడు మఠములో చేరి శ్రీ భగవానుని పనిచేయుము.

బేలూరు మఠము
క్రీ. శ. 9-5-1929
(గురువారము)

శ్రీమహాపురుషుల పాదుకల నర్థించుచు భక్తుడొకడు జాబు వ్రాసెను. శ్రీవారి పాదుకల పూజలో పెట్టి పూజింపవలెనని వాని కోర్కె, శ్రీవారు ఈలాగు జవాబు చెప్పిరి - ''పాదుకల పూజింపుము, లేకున్న వేఱేమైనను చేయుము. కావలసినది భగవంతునిపై భక్తి. భగవంతుడు అంతరంగమునే చూచును. అతడు అంతర్యామి. భక్తితో ఏమి చేసినను సరే, భగవానుడు ప్రసన్నుడగును. ప్రత్యక్షముగ చూచుట లేదా. లోకులు మట్టితో శివలింగము చేసి, పూజించి భక్తివిశ్వాసముల బడయుచున్నారు. చైతన్యము కల్గి చివరకు ముక్తులగుచున్నారు. మన్నుతో చేసిన శివుడైన నేమి? భక్తి, ప్రేమలతో పూజించినచో భగవానుడు ప్రసన్నుడై పూజను స్వీకరించును. అదే జడమగు మృణ్మయపదార్థము చిన్మయమగును. అంతియే కాక ప్రాణమయ మగును. కాని సారవస్తువు భక్తి. ఎచ్చట భక్తికలదో అచ్చటనే భగవత్కృప కలదని యెఱుంగుము. ఈ బాహ్య పూజాదులు కేవలము అవలంబనలు మాత్రమే సుమా!

### శార్దూలద్వయము

నీవే తల్లియుఁ, దండ్రియున్, విభుఁడు, సన్మిత్రుండుఁ, జుట్టంబులున్;
నీవే దాతవు, దైవమున్, గురుఁడు, నా నిర్వాణనిక్షేపమున్;
నీవే నాదగు తోడునీడ, మఱియున్ నీవే సమస్తంబుగా—
భావింతున్, భవ దన్య మే మెఱుఁగ, సాంబా, భక్తచింతామణీ.

నీ పాలం బడితిన్, నిరంతరము నే నీ పాదముల్ నమ్మితిన్,
నీ పద్యావళిఁ బాడుచుంటి నెపుడున్, నీకంటె నన్నెవ్వరున్
గాపాడం దొర లేఁ డటంటి, నిది నిక్కం, బింక నీ చిత్త, మో
పాపగ్రావవిభేదశంబ, శివ, సాంబా, భక్తచింతామణీ.

—శ్రీ కూచిమంచి సోమసుందర కవి.

## 96

శ్రీరామకృష్ణాశ్రమము
బుల్టెమ్పిల్ రోడ్డు
బసవనగుడి పోస్టు
బెంగుళూరుసిటి (మైసూరు)
20 జూన్ 1921

ప్రియ శ్రీమన్—

నీజాబును అందుతో నీవు జతపఱచిన రూపాయినోటును చేరినవి. మా లమ్మ యను వ్యాధినుండి గురుదేవు నను గ్రహమున నీవు తెప్పరిల్లితివని తెలిసి నేను ఎంతో సంతోషించితిని. ఎల్లప్పుడును ఎల్లయెడలను గురుదేవుడు న్ను కాపాడుచున్నాడు. అది మా నమ్మకము. మాతృదేవి యనుగ్రహభాగ్యము నీకు గల్గినది, శ్యాసించితివి. నీ జీవితము ధన్యమైనది మహాదేవుని కాశిలో, పుణ్యా హిమవత్ప్రశాంతనిలయమున పరమకృపాళు పరమపావని గంగానదీమతల్లి ప్రవహించు చోట సాధుసంగతిలో వసించుచ

ఆలాగు వసింపగనుట ఎవరికైనను మహా భాగ్యమే. వివేక వైరాగ్యములు లేనివానికి అట్టితావుల వసించు నభిలాష పొడమునా? నీలో వివేకవైరాగ్యములు తప్పక యున్న వనుట నిస్సందేహము. నీ భక్తిశ్రద్ధలును ప్రేమజ్ఞానములును నానాటికి దృఢములగును గాక. మంచుకొండలోని మంచువలె నీమనస్సు స్వచ్ఛమగును గాక, నీకు బ్రహ్మసాక్షాత్కారము గల్గును, ఇదే నా హృదయాంతర్గతమైన ప్రార్థనము.

గురుదేవునిదైన యీ శాఖా కేంద్రమునకు మేమువచ్చి ఏడెనిమిది దినములైనవి. మా ఆరోగ్యము బాగున్నది. ఈ డబ్బును నాకు పంపుటకంటె ఏపేదవానికో ఇచ్చియుండిన బాగుండెడిది. ఆకొండ పరిసరాలలో పేదవారెందఱో ఉన్నారు ఏపేదవానికో నేనే అందింతునులే. మరల నీకు ఆశీస్సులు.

నీ శ్రేయోభిలాషి
శివానందః

అనుబంధము:—'చాకు' 'కల్యాణానంద'ల కనికరమునుగూర్చి తెలిసికొన్నంతనే నాకు గలిగిన ఆనంద మింత అని కాదు. అది ఎంతయు విశ్వాసాపాదకముగను ఉన్నది. గురుదేవుని భక్తపరేణ్యుల డెందములలో ప్రేమగల్గు అటువంటి సంపాదమునే మేము కోరుచున్నాము. నిజమునకు ఇది మహౌదార్యము! శ్రీ వివేకానందస్వామి అవతరించి భువిని పవిత్రించిన ఆశయము లట్టివి. ఏకారమునవైనను సరే ఈ లోకమున ఆవిష్కృతము లు కావలసినవి ప్రేమసానుభూతులే 'స ఈశో ఽనిర్వాచనీయ ప్రేమస్వరూపః'. బ్రహ్మమును నీ వెంతగ సాక్షాత్కరించుకొందువో అంతగా లోకము పట్ల ప్రేమానుశయములును లోకసేవయు నీ ఎప్పుడుగాని శుష్క వేదాంతివిగ నుండకు, జాగ్రత్త! గురుదేవుని రాజ్యమున శుష్కమైన దేదియు లేదు. శుష్కవేదాంతము మన ఆదర్శమునకంటె వేఱైనదని ఎఱుగుదువు గాక. అది మన ఆదర్శము కాదు—కానే కాదు.

## 97

శ్రీరామకృష్ణాశ్రమము
బుల్టెమ్పిల్ రోడ్డు
బసవనుడి పోస్టు
బెంగుళూరు సిటి
27 జూన్ 1921

ప్రియ శ్రీమన్—

నీజాబు చేరినది. మీ యందఱి క్షేమవార్త విని నేను సంతోషించితిని. శుద్ధానందాదు

లచ్చటనుండుటయు నీ సాహచర్యమున వారు హాయిగ నుండుటయు నాకు ఆనందదాయక ములు. గురుదేవుడు నీ హృదయాభీష్టముల నెఱవేర్చును గాక. భక్తిశ్రద్ధలును జ్ఞానాను రాగములును నీకు సమృద్ధిగ గల్గుగాక. ఇదే హృదయపూర్వకమైన నా ప్రార్థనము. నీ కను కూలమైన చోటును గురుదేవుడు తప్పకుండ లభింపజేయును. వర్షాకాలమున కది ఏమంత చెడ్డచోటు కాదులే. సెప్టెంబరు అక్టోబరు నెల లలో కాబోలు రవంత జ్వరమువంటి వ్యాధి రావచ్చు. నీకు సరి యని తోచిన ట్లుండువు గాక. సదా ఒకచోటనుండి మఱొకచోటుకు త్రిప్పట చెందుచుండుట ఆధ్యాత్మిక సాధనలకు తోడ్పడదు. సంకల్పమునకు కావలసినటు నడచుకో.

మహారాజ (బ్రహ్మానందస్వామి) గారి ఆరోగ్యము బాగున్నది. నాతోసహా తక్కిన ఆందఱును క్షేమముగా నున్నారు. మీ కందఱికి నా హృదయపూర్వక ప్రేమానురాగాశీస్సులు. సీతాపతి అమరనాథ క్షేత్రమును దర్శింప బోనున్నా డని తెలియుచున్నది. చాల మంచి వార్త. గురుదేవుడు వారికి ప్రేమశ్రద్ధలను భక్తి జ్ఞానములను ప్రసాదించును గాక, వారి జీవిత ములు చరితార్థములనుగ నొనర్చుగాత. జీవిత లక్ష్యము ఇదే కాని, ఊరక పుణ్యస్థలములందు తిరుగాడుట కా దని నీవు గట్టిగా నమ్మవచ్చు. గురుదేవుని జీవితోపదేశాలు సదా నీ జ్ఞప్తియం దుండనీ. ఇంక నేమి వ్రాయుదును? నీ భక్తి అపారముగ పెంపొందునుగాక, నీవు భగవం తునిలోనే నిమగ్నుడవై యుందువు గాక. బయటి సాధువులను మే మంతగా గ్రహింపలే కున్నాము. ఎందఱినో చూచినాము కాని, వారు చాలవఱకును మనకు నచ్చనివారే. ఒక రిద్దఱు సరియైన సాధువులుగ కనిపించినారు

శ్రేయోభిలాషి,
శివానంద.

## 98

శ్రీమము,
బెంగుళూరు సిటీ,
8 జూలై 1921.

ప్రియ శ్రీమన్—

నీ జాబు చేరినది. నీ పైకము నంతటిని దొంగ లెత్తుకొనిపోవుట మంచిదే. గురుదేవుడే అలాగు నిర్ణయించె నేమో. సర్వసంగపరి త్యాగము చేసిన సన్న్యాసులు తమయొద్ద పైకము నుంచుకోరాదు. నీ జీవితము సేవ కంకితము చేసికొన్న సన్న్యాసివి నీవు. కావున గురుదేవుడే ఒకదొంగద్వారా నీ సర్వస్వమును హరించెను. ఆయన చేసినది మంచిపని. సేవా వ్రతజీవనులగు యతులయొద్ద పైక ముండ కూడదు. పైక మున్నచో భగవత్పరతంత్రత తగ్గును. కోరికలు మొగ్గును.

శంకరానందు డను యోగిని గూర్చిన విష యములు తెలిసినందుకు సంతోషము. దేవు డతనికి పరిపూర్ణజ్ఞానమును ప్రసాదించును గాక. విశుద్ధదశలో భక్తియు జ్ఞానము నొక్కటే. గురుదేవు డా విషయమును జెప్పి యున్నాడు. ఆయన యనుగ్రహముచే మేమును మాజీవితములలో దానిని కొంతవఱ కనుభవ మున జూచియున్నాము ఆయన యనుగ్రహ ముచే ఆశల నంతరింపజేసికొనుట శక్యమే. సమాధికై తహతహపడు మనస్సులో కామ ములు నిలువజాలవు. లేచినంతసేపు పట్టదు అవి పడిపోవుటకు.

ఆశలు మానవుల మనస్సులకు సామాన్య లక్షణములే, కాని భగవద్భక్తుని డెందములో అవి చిరకాలము నిలువజాలవు. అక్కడ నీ మనస్సు చెదరుచున్నదనియు కావున వేరేచోటికైన పోగోరుచున్నాననియు వ్రాసియుంటివి. అది చాల మంచి తలంపే. గురుదేవుని కోరిక లెట్లుండునో చూడవోయి – అది ఇంతకంటె మేలైనదిగ ఉండవచ్చు. నీ హృదయాభీష్టము లెల్ల నెఱవేఱవలయు నని నేను ప్రార్థించుచున్నాను. పూర్తిగా దేవునందు నిమగ్నుడవై యుండుము, అప్పుడప్పుడు శ్రీ శంకరానంద స్వామిని దర్శించుచుండుము, అందుచేత తపస్సాధనలందు నీ యభిరతి పునర్నవీకృత మగును.

మే మెంతవఱకు నిట నుందుమో ఇంకను నిశ్చితము కాలేదు. తిరువాన్మ్యూరులో నూతన మఠభవన నిర్మాణము సాగుచున్నది, అది ముగియుతరుణ మాసన్న మగుచున్నది. తులసీ మహారాజ్ చెప్పుచున్నట్లుగా రెండు నెలల కనంతరము సంప్రోక్షణకై మే మచ్చటికి పోవలసి యేర్పడవచ్చు. ఇంతలోగా తక్కిన చోట్లను దర్శింపవచ్చు.

నీకు నా హృదయపూర్వక ప్రేమానురాగాశీస్సులు.

శ్రేయోభిలాషి,
శివానంద.

# విశ్వగుణాదర్శము

## శ్రీ రంగనాథానందస్వామి

(గతసంచిక తరువాయి)

ప్రశ్న—ఐహిక సంపత్సమృద్ధిచే కలిగిన విసుగు అమెరికాలోని సామాన్యప్రజలకు ఆధ్యాత్మిక సాధనలందు ఆధ్యాత్మికానుభూతులందును ప్రవృత్తిని కలిగించుచున్నదా?

జవాబు—ఇటువంటి ఆధ్యాత్మికపరత గల్గుటకును ఆధ్యాత్మికానుభూతి నొందుటకును అచట గల అవకాశము అల్పాల్పము. తమ క్షుత్తును వారు తీర్చుకోలేకున్నారు. పెక్కు పేరులతో నొప్పుచుండు ప్రొటెస్టెంటుచర్చిలు, ఆధునికులగు అమెరికనులకు, ఇటువంటి ఆధ్యాత్మికాహారము నొసగుటకు సమర్థములు కాకున్నవి. అవి సరియైన యవకాశములనైనను సమకూర్చుట లేదు. ఒక్కొక్కప్పుడు చర్చిలు నిండిపోవుచున్నవి. ఏలన వారు తమ పద్ధతిని మార్చుకొన్నారు. ఆధ్యాత్మిక పరతను కలుపుటకు బదులు వారు ఏవో సంఘసేవలను విధించుచున్నారు. వియత్నాములోని యుద్ధమును నిరసింపుడందురు. అటువంటి వేవో చెప్పుదురు. ఇప్పటి చర్చిల కార్యక్రమము లన్నియు సంఘసేవయు సాంఘిక విషయములందన్వయములే. పెక్కుచోట్లలో నే నీలాగు చెప్పవలసివచ్చినది. "ఆధ్యాత్మికపోషణగోరి ప్రజలు చర్చిలకు వత్తురు, అందుకొఱకు కావేని ఈచర్చి లెందుకొఱకు? ఇతర విధములైన పోషణ లిచ్చుటకును అన్వయము కలిగించుటకును ఇతరసంస్థలున్నవి. చర్చిలు ఆధ్యాత్మివిషయముల నొసగకున్నచో మానవుడు రిక్తుడగును. కాథొలిక్కు చర్చిలుకూడ వారి ప్రవృత్తులు మార్చుకొన్నారు. వారును నానాటికిని మఱింతగా సంఘసేవా కార్యక్రమాలలోనే ఉద్యమించు

చున్నారు. ఆధ్యాత్మిక కార్యక్రమాలను నిరాద రించుచున్నారు.

ఇప్పటి అమెరికను మానవుడు సంఘసేవా కార్యక్రమము నభిలషించుట లేదు. తన మూలములు పరిపుష్టి నొందునట్లుగా ఆధ్యాత్మిక పోషణ నతడర్థించుచున్నాడు. అది చెట్లకు నీరుపోయుట వంటిది. పెక్కు సన్యాసా లలో నే నీలాగు వచించితిని - మీరును నీటిని చెట్లపాదులలో పోయుదురే కాని చెట్ల పూలపైని, పండ్లపైని పోయరు. మానవుల పునాదులకు పరిపుష్టిని కూర్చు నుపాయము కలగు అదే మతము (= ఆధ్యాత్మికపరత.) దానిని సమకూర్చితివేని తక్కినవి సమంతట మే లొందగలవు. ధ్యానప్రవణసంస్థలు కొన్ని ఉన్నవి. అవియు నానాటికిని సన్నగిల్లుచున్నవి. కొన్ని అంతరించియే పోవుచున్నవి. గడియార ములో పెండులము ఈ వంక కెంతదూరము వచ్చునో ఎదుటివంకకును అంతదూరము పోవును కదా. అట్లే ఈ సంస్థలును పూర్వ సంప్రదాయములను ప్రతిఘటించి వానికి వ్యతిరిక్తమైన పరమావధిని దాటుచుండును. ఆ మార్గమునుకూడ వేదాంత మామోదింపదు.

పెక్కు విశ్వవిద్యాలయాలవారు కోరుకొన్న శీర్షికలలో "పారిశ్రామిక యుగమందలి యాధ్యాత్మికజీవిత" మనెడి దొకటి. 'కర్మల ననుష్ఠించుచు నే నీ యాత్మస్వరూపమును సాక్షాత్కరించుకో' అనుటే గీతోపదేశము. విధాన మదే, అనుష్ఠాన మదే. అదియు, ఏకాంత ము న నప్పుడప్పుడు సాగు ధ్యానానుభూతియు అమెరికనుల కావశ్యకములై యున్నవి. అది ఆంతరమైన పరిపుష్టిని చేకూర్చును. ఆ యను భూతి గల్గినప్పు డది అత్యాశ్చర్యకరముగ నుండునని వా రనుచున్నారు.

భారతదేశమందును నిజమిది. పెక్కుండు యువకులు గంగాస్నానము దేవాలయ గమనము పుష్పసమర్పణము మొదలుగా తము అవ్వాతాతల అనుష్ఠించుచుండిన ఆచారమే ఆధ్యాత్మికపరత అని అనుకొనుచున్నారు. వారి కందు సమ్మకము లేదు. ఆధ్యాత్మికపరత యనగా స్వాత్మానుసంధానమే అని తెలిసి కొన్నప్పుడు ఆ యనుభూతి ఆశ్చర్యకరమనుట వారి కర్థమగుచున్నది. ఆ యనుభూతి తమ కింక నింకను కావలయునని వారు కోరు చున్నారు. భారతదేశమునకూడ ఇట్టి అను భూతినిగోరు ఆధ్యాత్మికపరత ఆవశ్యకమై యున్నది. విద్యార్థులేమి ఉపాధ్యాయులేమి వైదికాచారనిష్ఠ లేనివారుగూడ ఇట్టి యను భూతికై తహతహపడుచున్నారు.

# కర్మతత్త్వము-భగవద్గీత

## శారదాచరణ్

### కర్మ స్వరూపము :

కర్మమున కర్థము కార్యము. కాయిక, వాచిక, మానసిక, ప్రభృతి వివిధరీతులలో ఈ కర్మము జీవజాలముచే నొనర్పబడు చున్నది. జీవజాలము లన్నింటియందును మానవు డుత్కృష్టుడు కావున మానవు డొన ర్చెడు కర్మము సైతము ఉత్కృష్టమైనదే! ఇంద్రాది దేవతలు సైతము ఈ "మానవకర్మ" నొనర్చిననే ముక్తిం బడసెదరు

కర్మము సకల యోగములకు మూలము. నైష్కర్మ్యము సకల యోగములకుగమ్యము. కర్మముద్వారా నైష్కర్మ్యము సిద్ధించు

టున్నది విచిత్రముగా తోపవచ్చును. కాని ఇది సత్యము: భగవద్గీతయందలి ౧౮ అధ్యాయములను పరికించిన అందు మొదటి ౬ అధ్యాయములు కర్మయోగ సంబంధములు, తర్వాత ౬ అధ్యాయములు భక్తియోగ సంబంధములు, తుది ౬ అధ్యాయములు జ్ఞానయోగ సంబంధములునైయున్నవి. ఈ ప్రకారము యోచించిన కర్మముద్వారా భక్తి, భక్తిద్వారా జ్ఞానము సిద్ధించునని తెలియుచున్నది. కావున భగవద్గీతోపదేశములకు మూలమైన దీ కర్మమే!

"న కర్మణామనారమ్భా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే"* అని శ్రీ భగవానుడు కర్మమున కుపోద్ఘాతముగా నుడివెను. దీనినిబట్టి కర్మ మొనర్పకుండ నైష్కర్మ్యము అసాధ్యమని తెలియుచున్నది.

కర్మముయొక్క స్వరూపమును పరికించిన నిది అనివార్యమని తెలియుచున్నది. ఏ ప్రాణియు కర్మమునుండి తప్పించుకొనలేదు. తప్పించుకొనుటకు ప్రయత్నించిన ఆకర్మము మరల తలపైబడును. ఉదాహరణకు: ఒక విద్యార్థి తనధర్మమును వదలివైచినచో అతడు పరీక్షలయందు దుత్తీర్ణుడు కాక, తిరిగి వానినే చదువవలసి వచ్చును. కావున కర్మమును తప్పించుకొన జూచుట అవివేకము.

## విధ్యుక్త కర్మము:

కర్మమనివార్యమని స్పష్టము. కాని మానవుడు ఏ కర్మ నొనర్పవలెను, ఏది యొనర్పరాదు? వివిధరూపములలో శాఖోపశాఖలతో కర్మములు కోకొల్లలుగా ఈ విశ్వమునందు గలవు. ఒక కార్యమును ఒకవ్యక్తి యొనరించిన లోకము హర్షించుచున్నది. అదే కార్యమును మఱియొక వ్యక్తి యొనరించిన లోకము తటస్థముగా నేమియు అనకున్నది. అదే కార్యము నింకొకవ్యక్తి యొనర్చిన తనకు మాలినధర్మమని నిందించుచున్నది. ఇట్లౌటకు కారణమేమి? అది కార్యమునందలి లోపమా? లేక, కర్తయందా? లేక, లోకమే తప్పటడుగు వేయుచున్నదా?

నిజమున కేదియు కారణముకాదు. స్వామిజీ♦ అన్నట్లుగా "Each is great in his own place"—ప్రతియొక్కడును తన స్థానమునందుండుటచే గొప్పవాడగుచున్నాడు.

ప్రతిమానవుడును విధినిర్ణీతమగు నొక్కొక్క స్థానమందు పుట్టుచున్నాడు. విధియనగా పూర్వకర్మమే. పూర్వకర్మానుసారము ఆయా స్థానములందాయా మానవునకు కొన్నికొన్ని కార్యములు చేతికివచ్చును. వీనినే విధ్యుక్త కర్మములనిగాని, బాధ్యతలనిగాని వచింపవచ్చును. నిజమునకు విధ్యుక్త కర్మమును ఎవరును నిర్వచింపలేరు, కాని అది అందఱకు విదితమే!

స్థూలముగా మానవులను చతుర్విధములుగా విభజింపవచ్చును: 1. బ్రహ్మచర్యాశ్రమస్థులు. 2. గృహస్థాశ్రమసులు. 3. వానప్రస్థాశ్రమసులు. 4. సన్న్యాసాశ్రమస్థులు. కానీ నేడీ విభజనము సరిగా కనుపడుటలేదు. ఆర్షసంప్రదాయ బ్రహ్మచారులుగాని, గృహస్థులుగాని నేడు ఎక్కువగా కన్పింపకున్నారు. వానప్రస్థాశ్రమస్థులు బొత్తిగా లేరు. సన్న్యాసాశ్రమస్థులు చాలమందియున్నను. "తలపులు బోడు"లైనవారు కొద్దిమంది మాత్రమే!

(సశేషము)

* గీత. 3 అ; ౪ శ్లో.

♦ శ్రీ వివేకానందస్వామి.

# వార్తలు - విశేషాలు

## శ్రీరామకృష్ణమఠము - మద్రాసు-4.

## శ్రీరామకృష్ణానందస్వాముల జయంతి మహోత్సవాలు

దక్షిణభారతదేశంలో శ్రీరామకృష్ణమఠ శాఖను నెలకొల్పి దానికి తొలి అధ్యక్షులుగా ఉండిన శ్రీరామకృష్ణానందస్వాముల 109-వ జయంతి మహోత్సవాలు మహోత్సాహంతోనూ విభవోత్తరంగానూ 1971-వ సంవత్సరం జూలై నెల మూడవవారంలో జరుపబడ్డాయి.

జూలై 20-వ తేదీ మంగళవారంనాడు తిథి పూజ జరుపబడింది. మఠభవనం తోరణ మాలాలంకృతమై ఉత్సవోచితసముజ్జ్వలత ... మంగళ నాదస్వర వాద్యంతో దినకార్యక్రమం ప్రారంభింపబడింది. ప్రభాతమున 5 గంటలకు గుడిలో మంగళహారతి చేశారు. పూర్వాహ్ణమంతా భజన సాగింది. పెక్కు బృందాలవారు అందు పాల్గొన్నారు. గాయకసమ్రాట్టుగా 'సిసి' ప్రపంచవిఖ్యాతి గాంచిన శ్రీ ఎస్. రాజేశ్వరరావుగారి మాధుర్య భరితములైన భక్తిగేయాలు నామసంకీర్తనలు అలనాటి భజనకార్యక్రమాన్ని శ్రోతలకు బ్రహ్మానందసంధాయకంగా కావించాయి. సహస్రనామ - చండీ - గీతోపనిషత్తుల పారాయణం నిర్వర్తితమైనది. గుడిలో ప్రత్యేక పూజ విశేషవిధానాలతో జరిగింది. గుడిక్రింది మండపంలో స్వలంకృతమైన శ్రీరామకృష్ణానందస్వాముల చిత్రపటం అమర్చబడింది' హోమమున్నూ పూర్ణాహుతిన్నీ అక్కడే జరిగాయి. భక్తులు, మగవారూ మగువలూ అత్యధికసంఖ్యాకులు పూజ రయ్యారు. పూజా హోమముల కనంతరం సేవార్థుల కందరికి ప్రసాదవినియోగం చేయబడింది. శ్రీరామకృష్ణమిషనుకు సంబంధించిన విద్యాసంస్థలలో చదువుచున్న విద్యార్థులూ విద్యార్థినులూ ఉత్సవనిర్వాహణంలో తోడ్పడ్డారు.

సాయంకాలం ఆరాత్రికం ఐన వెంటనే మఠమండపంలో సమావిష్టులైన భక్తులగోష్ఠిలో శ్రీ బోధస్వరూపానందస్వాములు 'తాపత్రయ చికిత్స' అను తెలుగుపుస్తకానికి మూలమైన 'కాన్సొలేషన్స్' అను ఆంగ్లగ్రంథంలోంచి వ్యథితచిత్తాహ్లాదనంలో అమోఘము లైన శ్రీరామకృష్ణానందస్వాముల సాంత్వనశ్రీసూక్తులను చదివి వినిపించారు. ... శ్రీమత్తపస్యానందస్వాములు శ్రీరామకృష్ణానందస్వాముల వైభవమునుగూర్చి ఉపన్యసించారు. పరమహంసదేవుని నిర్యాణానంతరముగూడ ఆయనరూపము సదా ప్రత్యక్షముగ నుండు శ్రీరామకృష్ణానందస్వాముల భక్తిప్రభావితదృష్టిని ప్రస్తుతించారు.

25-7-1971 భానువారంనాడు మధ్యాహ్నానంతరం శ్రీ వివేకానంద సెంటినరిహాలులో బహిరంగోత్సవకార్యక్రమం ఏర్పాటైనది. 3-30 గంటలనుండి 5-30 గంటలవరకు బ్రహ్మశ్రీ టి. ఎస్. బాలకృష్ణశాస్త్రులవారు 'యక్ష ప్రశ్నల' హరికథాకాలక్షేపాన్ని అత్యంతశ్రావ్యంగా వినిపించారు. ప్రార్థన గేయము మంత్రపుష్పానుసంధానము అయిం తర్వాత శ్రీ అణ్ణా ఎన్. సుబ్రహ్మణ్యంగారు తమిళంలో ఉపన్యసిస్తూ శ్రీరామకృష్ణానంద స్వాముల విశిష్టగుణాలను ప్రస్తుతించారు. ఇంకా ఈలా అన్నారు. ఆ గుణాలను పరిగణించినా, విన్నా-ఆధ్యాత్మికసంస్కారం సమకూడుతుంది. శశిమహారాజు కళాశాలావిద్యా

ద్ధిగ ఉన్నకాలంలోనే దక్షిణేశ్వరమున శ్రీగురుదేవుని యనుగ్రహాంతరంగంలోకి చేరుకోవడం భాగ్యవిశేషం. ఆ యోగీంద్రునితోడి తొలి సమాగమమే ఈ యువకుని జీవితమునకు అపూర్వమహోజ్జ్వల పరిణామమును కలిగించినది. నీటిపాముకాటువలె కాక నాగుపాముకాటువలె పరమహంసదేవుని మహిమ శిష్యుని అంతరాంతరములోనికి చొచ్చుకుపోయింది. శశి గురుదేవుని అంతరంగశిష్యవరేణ్యులలో నొకడయ్యాడు. గురుదేవుడు వ్యాధిగ్రస్తుడుగ నుండిన తుదిదినాలలో శశి ఆదర్శభక్తితో పరిచర్య చేశాడు. శ్రీ వివేకానందస్వామి 'రామకృష్ణానంద' నామమును శశి కిచ్చుట ఇతనికి గురుదేవునం దుండిన పరమభక్తికి తార్కాణము. గురుదేవుని నిర్యాణానంతరము క్రొత్తగ నెలకొల్పబడిన మఠమునకు రామకృష్ణానందస్వామిమాతృస్థానీయుడుగ నుండెను. కష్టాలతో నిండిన ఆ ప్రారంభదినాలలో ఈ సంస్థను పోషించింది ఆయనే. శ్రీ వివేకానందస్వామికిని రామకృష్ణానందస్వామికిని వరుసగా సుబ్రహ్మణ్యస్వామియు వినాయకుడును చక్కని ఉపమానము లవుతారు. ఒకరు సంచరించి సాధించినంత రెండోవారు తావు తలగకే సాధించారు. ఇద్దరూ సవయస్కులు సహాధ్యాయులు. ఐనా, శశికి వివేకానందునిపట్ల ఉండుభక్తి దేవునందుండు భక్తితో సమానమే. దక్షిణభారతదేశంలో రామకృష్ణోద్యమవ్యాప్తికి రామకృష్ణానందస్వాముల సభక్తికకృషియే మూలం. ఆయన జీవితచరిత్రంనుంచి సాధకులు నేర్చుకోదగ్గ పాఠాలు ఎన్నో ఉన్నాయి. ఆయన మహోద్యమాలకు నిత్యకార్యక్రమాలకు వన్నె గూర్చినది ఆయనకు సదా అనుభవగోచరమౌతుండిన గురుదేవుని సాన్నిధ్యం. తనచుట్టుపట్ల ఆయన భక్తిని వెదజల్లేవాడు. తన్ను సమీపించినవారి కందఱికి ఆయన శ్రోతకు సందర్భమునకు సముచితములున్నూ సంక్షిప్తము లున్నూ జ్ఞానజ్యోతిర్దాయకములున్నూ అగు సమాధానముల ద్వారా ఒక సమున్నతిని కలిగించేవాడు. “ఆయన జీవితసంభవాలలో ప్రతిదీ జ్ఞానులయు యోగులయు నడవడులను దెలుపు శాస్త్రవాక్యాలను స్మరింపజేస్తుంది. ఎందువల్లనంటే సులక్షణాలు కన్నిటికీ ఉత్తమలక్ష్యమున్నూ వాటి యాథార్థ్యమునకు నిరూపకమున్నూ ఆయన చరితమే.”

తర్వాత మదరాసు శ్రీరామకృష్ణమఠాధ్యక్షులైన శ్రీమత్తపస్యానందస్వాములు ఆంగ్లమున రచించిన ఉపన్యాసానికి ఇది సంక్షేపం— రామకృష్ణోద్యమవ్యాప్తికై ఏర్పడిన తొట్టతొలి కేంద్రాలలో మదరాసు కేంద్రం ఒకటి. దక్షిణభారతదేశంలో శ్రీరామకృష్ణసంస్థ ప్రణాళికలను అమలుపరచేందుకు ఎంతయు అర్హుడు సమర్థుడు ఈయనే అని శ్రీ వివేకానందస్వామి ఎన్నుకొని పంపినవారు రామకృష్ణానందస్వామి. ఈయన వైదికాచారనిష్ఠను వివేకానందస్వామి ఉద్ఘాటించారు. గీర్వాణాంగ్లభాషలలో చక్కని వ్యుత్పత్తి గణితశాస్త్రంలో ప్రత్యేకాభిరతి గలవారు శ్రీరామకృష్ణానందస్వామి. ఈయన కింత ప్రియమైన గణితం గురుదేవునకు నచ్చేది కాదు. గురుదేవు డితనిని కేవలం సారస్వతాభిరుచులను సామర్థ్యాలను గడించడంతో ఆగనీయ లేదు. ఇతనిని ఆయన ఆధ్యాత్మికజీవితోన్ముఖునిగ గావించాడు. గురుదేవుని నిర్యాణానంతరం మఠం బరానగరంలో ఉండగా శశి మరొక్కరితోడ్పాటు లేకుండా, గురుదేవు డొక్కడే మార్గదర్శకుడుగా సమస్తము నిర్వహించేవాడు. మదరాసులో ఆయన ఉండిన పదునాలుగేండ్లలో (1897–

1911) పలుమార్గాలలో ఆయన పడ్డ శ్రమ ఇంతంత కాదు. సేవకు అంకితం చేసికొన్న జీవితానికి ఆయన ఉత్తమాదర్శం. గురుదేవుని సందేశప్రచారానికై ఎంతె తదూరప్రయాణాలైనా, చేసేవాడు. నిర్ణయించుకొన్న కాలము క్రమము తప్పడు. గొప్పవాగ్మిగా మాటాడడు కాని విషయం శ్రోతల డెందాలలో హత్తుకునేటట్లు వారిలో శ్రద్ధ జనించేటట్లు చెప్పగలడు. విద్యాసంస్థల రంగములలో ఆయన నాటిన బీజాలే ఈనాడు అత్యధికసంఖ్యాకులకు ఆశ్రయములై మహావృక్షములుగా వర్ధిల్లినవి. ఈనాడు దక్షిణభారతదేశమున రామకృష్ణ వివేకానందాదర్శాలకు కలిగి ఉండే వ్యాప్తికాధారం ఓర్పుతోను సదానందంగాను రామకృష్ణానందస్వామి కావించిన కృషియే. ప్రతిభయు భక్త్యుద్రేకమును ఆయనలో మిళితములయ్యాయి. గుడిలో ఆరాధించేటప్పుడు భజనలో నర్తించేటప్పుడు ఆయనలో నిండి నిబిడంగా ఉన్న ఆత్మరతి ప్రకట మయ్యేడిది. పూజను ప్రాణప్రియునికి చేయు సేవగా ప్రీణన క్రియగా ఆయన రూపొందించారు. గురువే దైవము దైవమే గురువు అనుట ఆయన అధ్యవసాయం"

ప్రొఫెస్సరు సి. ఎస్. రామకృష్ణనుగారి వందనోపచారంతో సభా కార్యక్రమం ముగిసింది.

తర్వాత మఠమండపంలో శ్రీ వీతమోహానందస్వాముల ఆధ్వర్యాన మఠభజనబృందం వారు కాళీకీర్తన కావించారు.

# గ్రంథపరిచయం

## నిష్కామ కర్మయోగము

వ్యాఖ్యాత: భూమినాయుడు చిన్నసైజు పుటలు 124, ప్రాప్తిస్థానం: రచయితయే రామభద్రపురము, సాలూరు తాలూకా, శ్రీకాకుళంజిల్లా. వెల రెండు రూపాయలు.

ఇదొక క్రొత్తపద్ధతిలో నడచిన భగవద్గీతా ద్వితీయాధ్యాయవ్యాఖ్యానము.

## శ్రీ కృష్ణార్జున సంవాదము

రచయితయు ప్రాప్తిస్థలమును శ్రీభూమినాయుడుగారే. ఇది భగవద్గీతనుండి యేరుకొన్న 18 శ్లోకాల వివరణం. అపేక్షకులకు ఈగ్రంథం ఉచితంగా పంపబడుతుంది. ఈ రెండు గ్రంథాలున్నూ శ్రీనాయుడుగారి భగవద్గీతాభిరతికి చక్కని తార్కాణాలు.

## శ్రీరామకృష్ణపరమహంస

మూలము ప్రొఫెస్సరు పి. శంకరనారాయణను, అనువక్త శ్రీ కమలాకర వేంకటరావు, ప్రకాశకులు శ్రీ కె. వి. నారాయణరావు, శ్రీరామకృష్ణసమితి, విజయవాడ, పుటలు 16. వెల 25 పైసలు.

పరమహంసదేవుని జీవితసంక్షేపమునూ తదవతారప్రయోజనాలనూ తత్సుధామధుర శ్రీసూక్తులను చర్వణ చేస్తూ చదువరులచే చేయిస్తూ సాగిన యీ లఘువ్యాసానికి స్వాగతం. —ప్రభాకర్.



# శ్రీ రామకృష్ణ బోధామృతము

అనువాదకులు :

## శ్రీ చిరంతనానందస్వాములవారు

పరిశోధితమగు 1121 మహోపదేశములతో, సంగ్రహ జీవితముతో నలరారుచున్నది.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధ గురువులు, లౌకికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు : వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, జీవుడు : దేవుడు, జ్ఞానము: భక్తి: కర్మము, బ్రహ్మాతత్త్వము, సూక్తులు: నీతికథలు మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసిబిడ్డలకయిన నవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

...ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూత్రాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి...

—ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్వలమగు పంచమ ముద్రణము : వెల : అట్టబైండు : రూ. 4-50
క్యాలికో : రూ. 5-50

# శ్రీ రామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు :

## శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

## గౌ॥ న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణదేవుని దివ్యోపదేశవాక్యము లాధారముగాగొని, వానిని విరివిపఱచి, మనోహరకథారూపముగను, సంభాషణరూపముగను అమర్చి, శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారి గారు తమిళభాషలో రచించిన జనాకర్షక గ్రంథము. దాని యనువాదాలు ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతి, హిందీభాషలలో నిప్పటికే అపారవ్యాప్తినొందినవి. ఆ గ్రంథమున కిది చక్కని ఆంధ్రీకరణము.

128 పుటలు వెల : రూ. 1-25

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# జ్ఞానయోగము

అనువాదకులు :
కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు　　రెండవ కూర్పు　　వెల : రూ. 4-00

నూతన ముద్రణము।　　ఇప్పుడే వెలువడినది।

# రాజయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము-రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)　　ఆఱవ కూర్పు　　వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు–4

సంపాదకులు : శ్రీ హీరానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ బోధస్వరూపానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౮ ౧౯౭౧ - అక్టోబరు : విరోధికృత్తు - ఆశ్వయుజము సంచిక ౪

## విషయసూచిక

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హక్స్లి) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.'
(స్వతంత్ర్య స్టాండర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి కలది.' (భారతి: 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

590+158 పుటలు వెల: రూ. 7-50

# ప్రబోధరత్నాకరము

అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు

శ్రీ వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

232 పుటలు మూడవ కూర్పు వెల: 2-50

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4




‘అఖిలవిధ శరణొందుము, యా తీవ్రంబ యతనికృత వీడు ననుభూతి కందు శత్స’

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౮ } ౧౯౭౧ - అక్టోబరు : : విరోధికృత్తు - ఆశ్వయుజము { సంచిక ౮

శ్రీః

## వివేకచూడామణి

మూలము : శ్రీ శంకర భగవత్పాదులు

వ్యాఖ్యాత : అన్నమాచార్య

సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ విశుద్ధం పరం స్వతస్సిద్ధమ్
నిత్యానన్దైకరసం ప్రత్యగభిన్నం నిరన్తరం జయతి. 225

స్వతస్సిద్ధమును, సత్యమును, జ్ఞానస్వరూపమును, అనంతమును, విశుద్ధమును, పరమును, నిత్యానందైకరసమును, ప్రత్యగాత్మకంటె వేఱు కానిదియు నగు బ్రహ్మమునకు సదా జయము. ౨౨౫

స దిదం పరమాద్వైతం స్వస్మా దన్యస్య వస్తునో ఽభావాత్
న హ్యన్య దస్తి కిఞ్చి త్సమ్య క్పరమార్థత త్త్వబోధ దశాయామ్. 226

ఈ బ్రహ్మము సర్వకాలములం దుండునది. పరమార్థతత్త్వబోధదశలో వాస్తవిక సత్తగల వస్తువు బ్రహ్మమునకంటె వేఱొకటి లేదు కదా. కావున నిదే పరము, అద్వైతము.

య దిదం సకలం విశ్వం నానారూపం ప్రతీత మజ్ఞానాత్
త త్సర్వం బ్రహ్మైవ ప్రత్యస్తాశేషభావనాదోషమ్. 227

అజ్ఞానముచే నానారూపములు గలదిగా గనవచ్చుచుండు ఈ విశ్వమంతయు మానవ భావనాకల్పితములగు పరిమితు లేవియు లేని బ్రహ్మమే. ౨౨౭

మృత్కార్యభూతో ఽపి మృదో న భిన్నః కుమ్భో ఽస్తి సర్వత్ర తు

న కుమ్భరూపం పృథ గస్తి కుమ్భః కుతో మృషాకల్పితనామమాత్రః. 228

మట్టివలన రూపొందిన 'కుండ' పూర్తిగా మట్టియే. మట్టికంటె అది వేఱు కాదు. మఱి దానిని కుండ యనుట యన్ననో, వట్టి నామకల్పనముమాత్రమే. ౨౨౮

కేనాపి మృద్భిన్నతయా స్వరూపం ఘటస్య సన్దర్శయితుం న శక్యతే
అతో ఘటః కల్పిత ఏవ మోహా న్మృదేవ సత్యం పరమార్థభూతమ్. 229

మట్టికంటె కుండ వేఱని నిరూపించుట ఎవనికిని (బ్రహ్మకైనను) శక్యము కాదు. కుండ మట్టికంటె వేఱైనట్లు కనఁబడుట భ్రాంతియే. సత్యమును పరమార్థమును 'మట్టి'యే.

సద్బ్రహ్మకార్యం, సకలం సదైవ, తన్మాత్రమేత, న్న తతో ఽన్య దస్తి,
అస్తీతి యో వక్తి న తస్య మోహో వినిర్గతో నిద్రితవ త్ప్రజల్పః 230

సత్తైన బ్రహ్మమునుండి రూపొందిన యీ సమస్త జగత్తును సత్తే (=బ్రహ్మమే). బ్రహ్మము కానిది వేఱేదియు లేదు. వేఱొకటున్నదని పల్కువాఁడింకను మోహావశమునుండి తెప్పరిల్లకొన లేదన్నమాట. నిద్రించుచున్నవాని ప్రలాపములవంటివి అతనిమాటలు. ౨౩౦

బ్రహ్మై వేదం విశ్వ మి త్యేవ వాణీ శ్రౌతీ బ్రూతే ఽథర్వనిష్ఠా వరిష్ఠా
తస్మా దేత ద్బ్రహ్మమాత్రం హి విశ్వం నాధిష్ఠానా ద్భిన్నతారోపితస్య. 231

'బ్రహ్మైవేదం విశ్వ మిదం వరిష్ఠమ్' 'ఈ విశ్వము వరిష్ఠమైన బ్రహ్మమే' అను వరిష్ఠమైన సూక్తి అథర్వవేదమునకు జెందిన ముండకోపనిషత్తులో గలదు. కావున ఈ విశ్వము బ్రహ్మమే. ఎక్కడగాని అధిష్ఠానమునకంటె భిన్నమైన యునికి ఆరోపితవస్తువున కుండదు కదా.

సత్యం యది స్యా జ్జగ దేత, దాత్మనో ఽన న్తత్వహాని, ర్నిగమాప్రమాణతా,
అసత్యవాదిత్వ మపీశితు స్స్యా, న్నైత త్త్రయం సాధు హితం మహాత్మనామ్. 232

ఈ జగత్తు సత్య మగునేని (1) ఆత్మకు అనంతత్వము నిలువదు. (2) వేదములకు అప్రామాణికత వాటిల్లును. (3) ఈశ్వరు డసత్యవాది యగును. ఈ మూడును, మహాత్ముల తలంపున సాధువులును హితములును కావు. ౨౩౨

ఈశ్వరో వస్తుతత్త్వజ్ఞో న చాహం తే ష్వవస్థితః
న చ మత్స్థాని భూతా నీ త్యేవ మేవ వ్యచిక్లపత్. 233

వస్తుతత్త్వజ్ఞుడగు నీశ్వరుడు శ్రీకృష్ణభగవానుడు గీతలో (IX 4, 5) 'న చ మత్స్థాని భూతాని' 'భూతములు నాలో లేవు' 'న చాహం తే ష్వవస్థితః' 'భూతములందు

'నేను లేను' అనుటచే ఈ యర్థమునే (జగన్మిథ్యాత్వమునే) తెల్పియున్నాడు. త్రాడునందు సర్ప ముండుటవంటిదే బ్రహ్మమునందు జగ త్తుండుటయు. ఇంద్రియముల కందని బ్రహ్మము ఇంద్రియగోచరజగత్తున నుండుటయు పొసగదు. ౨౩౩

యది సత్యం భవే ద్విశ్వం సుషుప్తా వుపలభ్యతామ్
య న్నోపలభ్యతే కిఞ్చి దతో ఽస త్స్వప్నవ న్మృషా. 234

కలలో కన్నది నిజమైనచో అది జాగ్రద్దశలోను కనబడవలెను. జగత్తు సత్యమైనచో సుషుప్తిదశలో అగపడవలెను. సుషుప్తిదశలో కానరాకున్నందున స్వప్నమువలె అదియు మిథ్యయే. ౨౩౪

అతః పృథ ఙ్నాస్తి జగ త్పరాత్మనః పృథ క్ప్రతీతి స్తు మృషా గుణాదివత్
ఆరోపిత స్యాస్తి కి మర్థవత్తా ఽధిష్ఠాన మాభాతి తథా భ్రమేణ. 235

కావున పరమాత్మకంటె వేరైన జగత్తు లేదు. ఆకాశమున నీలత్వాదిగుణములు కనఁగునట్లు, పరమాత్మకంటె వేఱుగా జగత్తు కనఁగుటయు భ్రాంతియే. ఆరోపితమైన దాని కర్థ మేమున్నది? అధిష్ఠానమే ఆరోపితవస్తువుగ, త్రాడే పాముగ, గనఁగుచున్నది. అది భ్రాంతియే. ౨౩౫

భ్రా న్తస్య య ద్య ద్భ్రమతః ప్రతీతం బ్రహ్మైవ త త్త ద్రజతం హి శుక్తిః
ఇద న్తయా బ్రహ్మ స దైవ రూప్యతే త్వారోపితం బ్రహ్మణి నామమాత్రమ్. 236

భ్రాంతుఁడగువానికి భ్రమచే కనఁగు వస్తువు లెల్ల నిజమునకు బ్రహ్మమే. ముత్తెపుచిప్ప వెండివలె కనిపించును కాని నిజమున కది ముత్తెపుచిప్పయే కదా. ఈ జగత్తుగా రూపితమగుచుండునది సత్తైన బ్రహ్మమే. బ్రహ్మమునం దారోపితమైన జగత్తు నామమాత్రమే. ౨౩౬

అతః పరంబ్రహ్మ స దద్వితీయం విశుద్ధవిజ్ఞానఘనం నిరఞ్జనమ్
ప్రశా న్త మాద్య న్తవిహీన మక్రియం నిర న్తరానన్దరసస్వరూపమ్. 237

నిర స్త మాయాకృతసర్వభేదం నిత్యం సుఖం నిష్కల మప్రమేయమ్
అరూప మవ్య క్త మనాఖ్య మవ్యయం జ్యోతి స్స్వయం కిఞ్చి దిదం చకా స్తి. 238

కావున త్రికాలసత్యమైనది పరబ్రహ్మమే. అది అద్వితీయము, అప్రమేయము, నిర్దోషము, ఆద్యంతరహితము, నిష్క్రియము, నిష్కళము, విశుద్ధవిజ్ఞానఘనము, ప్రశాంతము, నిరంతరానందసుఖస్వరూపము, మాయాకల్పితసకలభేదముల కతీతము, నిత్యము, సుఖము, అరూపము, అవ్యక్తము, అనాఖ్యము, అవ్యయము, అనిర్వచనీయము, స్వయంజ్యోతి. ౨౩౭

జ్ఞాతృజ్ఞేయజ్ఞానశూన్య మనన్తం నిర్వికల్పకమ్
కేవలాఖణ్డచిన్మాత్రం పరతత్త్వం విదు ర్బుధాః. 239

జ్ఞాత జ్ఞానము జ్ఞేయము అను త్రిపుటి లేనిదియు, ఎట్టి పరిమితులును లేనిదియు, నిర్వికల్పమును, కేవలాఖండచిన్మాత్రమునగు పరతత్త్వమును బుధులు సాక్షాత్కరించుకొందురు.

అహేయ మనుపాదేయం మనోవాచామగోచరమ్
అప్రమేయ మనాద్యన్తం బ్రహ్మ పూర్ణ మహం మహః. 240

అఖండమును స్వయంజ్యోతిస్స్వరూపమునగు బ్రహ్మము విడువదగినదికాదు, క్రొత్తగా సంపాదించుకోదగినదికాదు, మనస్సులకును మాటలకును అందునదికాదు, కొలది యిడరానిది, ఆదియు నంతమును లేనిది. ౨౪౦

# పరమహంస దేవుని ప్రబోధవాణి

ప్రశ్న:-(ఒక భక్తుడడిగినది) మహాశయా, దేవుడు మనల నీ ప్రపంచమున ఎందుల కుంచి యున్నాడు?

శ్రీరామకృష్ణుడు:- ఈ ప్రపంచము కర్మభూమి. కర్మానుష్ఠానముచే జ్ఞానము సిద్ధించును. గురువు శిష్యునికి కొన్ని పనులను చేయుమనియు, కొన్ని పనులను మానుమనియు తెలుపును. ఫలాపేక్ష లేక కర్మము ననుష్ఠింపు మనియు గురువు బోధించును. కర్తవ్య నిర్వహణముచే మనోమాలిన్యములు నశించును. ఇది నిపుణుడగు వైద్యు నుపదేశానుసారము ఔషధసేవ నొనర్చి రోగమును బాపుకొనుట వంటిది.

ఈ లోకమునుండి దేవుడు మనకు విముక్తి నేల యొసగడు? మనకు రోగము నయమైనప్పు డాయన మనల నిందుండి విడిచిపుచ్చును. కామినీకాంచనానుభవాలు మనకు మొగము మొత్తిననాడు దేవుడు మనల విముక్తి నొందించును. ఆసుపత్రిలో పేరు వ్రాయించుకొన్న రోగి పారిపోవ జాలడు. అతని రోగము పూర్తిగా నయము కానిదే వైద్యు డతనిని పోనీయడు.

ప్రశ్న:- (ఒక భక్తుడడిగినది) అన్నిటికిని కర్త దేవుడే యగునేని ప్రజలు ధర్మాధర్మము లనియు, పుణ్యాపాపము లనియు ప్రసంగించుచుండు టెందులకు? మానవునిచే పాపము చేయించునది ఈశ్వరసంకల్పమే కదా?

శ్రీరామకృష్ణుడు:- పుణ్యాపాపములు లోకమున నున్నవనుట నిజమే కాని, అవి దేవు నంటవు. గాలిలో సువాసనలు దుర్వాసనలు కూడ నుండవచ్చు. గాలి కవి అంటవు. పుణ్యాపాపములు ధర్మాధర్మములు ప్రపంచమున నెల్లప్పుడు నుండును. వానియునికి ఈశ్వర సృష్టి స్వరూపానుగుణమే. తోటలోని చెట్లలో మామిడి చెట్లున్నవి, పనస చెట్లున్నవి, మారేడు చెట్లున్నవి. దుర్మార్గు లుండుటకూడ ఆవశ్యకమే అనుటను నీవు గుర్తింపలేదా? పొలము రైతులు పోటుతనమునకు పూనుకొందురేని వారిని అణచుటకు భూస్వామి యొక ఘాతుకుని పంపవలసి వచ్చును.

ప్రశ్న:-భగవంతుని త్రోవలను మానవు డెన్నటికేని అర్థము చేసికోగలడా?

శ్రీరామకృష్ణుడు:- ఒక్కొక్కప్పుడు భగవంతుడు మంచివాడని ఒక్కొక్కప్పుడు భగవంతుడు చెడ్డవాడని నేనుకూడ తలంచుచుందును. తనమాయచే దేవుడు మనల మోహితులనుగ జేసియున్నాడు. ఒక్కొక్కప్పుడాయన మనల మేలుకొలుపుచుండును. ఒక్కొక్కప్పు డాయన మనల నిదురపుచ్చుచుండును. అజ్ఞానము క్షణములో అంతరించుచు క్షణములో మన మనసుల ఆవరించుచు నుండును. పాచిగ్రమ్మిన తటాకములోని కొంతపాచి ముక్కను విసిరివేసితివేని, నీకు నీరు కానవచ్చును. కాని మఱునిముసములోనే పాచి కలుకుచు వచ్చి నీటిని కప్పివైచును.

దేహమే తా ననుకొనుచున్నంతవఱకు కష్టసుఖములు జననమరణములు రోగశోకములు అనుభూతము లగుచుండును. ఇవన్నియు దేహమునకు సంబంధించినవే కాని ఆత్మకు సంబంధించినవి కావు. దేహము పంచత్వమొందిన పిమ్మట దేవుడు దేహిని ఉత్తమస్థానమునకు జేర్చునేమో. ఇది ప్రసవవేదన ననుభవించిన పిమ్మట శిశువు జన్మించుటం బోనిది. ఆత్మజ్ఞానము గల్గినంతనే కష్టసుఖములు జనన మరణములు మున్నగున దంతయు స్వప్నమువంటి దగును.

మనజ్ఞాన మెంత ! సేర్ల పాలు పట్టునా ? ఎప్పుడుగాని కడలిలోతును కనుగొందమని ఉప్పుబొమ్మ అందులోని కుఱికునేని, అది నీటిలో కరగి మగును. అది మరలి వచ్చుటయు మనకు విషయము నెఱింగించుటయు సంభవింపజాలదు.

ప్రశ్న:-(ఒక భక్తుడడిగినది) దేవుడు మనల మోహితులనుగా జేయనేల ? ఆయన అలాగు సంకల్పింప నేల ?

శ్రీరామకృష్ణుడు:- భగవంతుడు మానవునకు దివ్యానందమును రవంత రుచిచూపునేని, ఐహిక జీవితమున మానవునకక్కఱ యుండనే యుండదు. సృష్టియే తుదముట్టును. ధాన్యవర్తకుడు బియ్యమును పెద్దపెద్ద బసాలలో నుంచును. వానికి సమీపమున తట్టలో కొన్ని బొరుగుల నుంచును. ఎందు కనగా ఎలుకలను దవ్వున నుంచుటకు. ఎలుకలకు ఆ బొరుగులు రుచిగ నుండును. రాత్రియంతయు అవి బొరుగులను కొఱికి తినుచుండును. బియ్యము నొద్దకు రావు. కాని ఆలోచించిచూడు. ఒక్కసేరు బియ్యము పదునాలుగుసేర్ల బొరుగు లగును. కామినీకాంచన సుఖమునకంటె బ్రహ్మానందమునకు ఉత్కృష్టత ఎంత అపారమైనది ! భగవంతుని సౌందర్యమును దర్శింపగన్న యతనికి రంభా తిలోత్తమల సౌందర్యము , తము చితాభస్మము వంటిదిగ కనసగును.

ప్రశ్న:- దేవుని పనులను ఉద్దేశములను అర్థము చేసికొనుట సాధ్య మగునా ?

శ్రీరామకృష్ణుడు:- సృజించువాడు దేవుడే, ప్రోచువాడు సంహరించువాడును దేవుడే. దేవుడేల సంహరించునో మన మర్థము చేసికొనగలమా ? లోకజననితో నే నిట్లనుచుందును - ''అమ్మా, నే నర్థము చేసికోవలసిన యావశ్యకత లేదు. నీ పాదకమల ప్రేమను నాకు ప్రసాదింపుము.'' భక్తి నధిగమించుటే మానవ జీవితలక్ష్యము. తక్కిన విషయములా, అందఱకన్న అమ్మకే బాగుగ తెలియును. మామిడి పండ్లను తినుటకు నేను తోటలోనికి వచ్చియున్నాను. అటనున్న చెట్లను కొమ్మలను ఆకులను నేను లెక్కపెట్టు టెందులకు ? మామిడిపండ్లను తిందును. అంతే. చెట్లయు ఆకులయు సంఖ్యను దెలిసికోవలసిన యక్కఱ నాకు లేదు.

శ్రీః

# ఆంధ్ర సరస్వతీదేవీ నవరత్నమాలిక

ఉ॥ అంబ, నవాంబుజోజ్జ్వలకరాంబుజ, శారదచంద్రచంద్రికా
డంబరచారుమూర్తి, ప్రకటస్ఫుటభూషణరత్నదీపికా
చుంబితదిగ్విభాగ, శ్రుతిసూక్తివివిక్తనిజప్రభావ, భా
వాంబరవీథివిశ్రుతవిహారిణి, నన్ గృపఁ జూడు, భారతీ. 1

మ. వరవస్తుప్రతిపత్తిధుర్యమగు నైశ్వర్యంబు పంచాశద
క్షరసంసిద్ధసమస్తశబ్దరచనాసంవ్యాప్తి నుద్దీప్తమై
పరఁగం, గల్పలతాసమృద్ధి యగుచుం, బ్రజ్ఞావిశేషాఢ్యులన్
గరుణం బ్రోచు సవిత్రి వాణిఁ ద్రిజగత్కల్యాణిఁ బ్రార్థించెదన్. 2

—'శంభుదాస' 'ప్రబంధపరమేశ్వర' చదలవాడ ఎఱ్ఱాప్రెగ్గడ.

ఉ॥ క్షోణితలంబు నెన్నుదురు సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ, జంచరీకచయసుందరవేణికి, రక్షితామర
శ్రేణికిఁ, దోయజాతభవచిత్తవశీకరణైకవాణికిన్,
వాణికి, నక్షదామశుకవారిజపుస్తకరమ్యపాణికిన్. 3

శా॥ పుట్టం బుట్ట, శరంబునన్ మొలవ సంభోయానపాత్రంబునన్,
నెట్టం గల్గను, గాలిఁ గ్రోల్వను, బురాణింపం దొరంకొంటి, మీ
దెట్టేవెంట రచింతుఁ దత్సరణి నా కీవమ్మ యోయమ్మ, మే
ల్పట్టున్ మానకుమమ్మ, నమ్మితిఁ జుమీ, బ్రాహ్మీ దయాంభోనిధీ. 4

ఉ॥ శారదనీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికా
హార తుషార ఫేన రజతాచల కాశ ఫణీశ కుంద మం
దార సుధాపయోధి సితతామర సామరవాహినీ శుభా
కారత నొప్పు నిన్ను మదిఁ గానఁగ నెన్నడు గల్గు, భారతీ! 5

—సహజపాండిత్య బమ్మెర పోతరాజు.

సీ. సింహాసనము చారుసితపుండరీకంబు, చెలికత్తె జిలువారు పలుకుఁజిలుక,
శృంగారకుసుమంబు చిన్నిచుక్కలరేఁడు, పసిఁడికిన్నరవీణ పలుకుఁదోడు,
నలువనెమ్మోముఁదమ్ములు కేళిగృహములు, తళుకుటద్దంబు సత్కవులమనసు,
వేదాదివిద్యలు విహరణస్థలములు, చక్కనిరాయంచ యెక్కిరింత,
యెపుడు నేదేవి, కా దేవి యిందుకుందచంద్రచందనమందారసారవర్ణ
శారదాదేవి మామకస్వాంతవీథి నిండువేడుక విహరించుచుండుఁ గాక. 6

—శ్రీనాథ కవిసార్వభౌముడు.

సీ॥ చేర్చుక్కగా నిడ్డ చిన్నిజాబిల్లిచే సిందూరతిలకంబు చెమ్మగిల్ల
నవతంసకుసుమంబునం దున్న యెలదేటిరుతి కించిదంచితశ్రుతులు సీన
ఘనమైన రారాపుచనుదోయిరాయిడిఁ దుంబీఫలంబు తుందుడుకుఁ జెందఁ
దరుణాంగుళిచ్ఛాయ దంతపుసరకట్టు లింగిలీకపు వింతరంగు లీన
నుపనిషత్తులు బోటులై యోలగింపఁ బుండరీకాసనమునఁ గూర్చుండి మదికి
నించు వేడుక వీణ వాయించు చెలువ నలువరాణి మదాత్మలో వెలయుఁ గాత. 7

—ఆంధ్రకవితాపితామహుఁడు అల్లసాని పెద్దన.

తే॥ వాణి నజరాణి ఘనసీలవేణి మధురవాణిఁ బల్లవసంకాశపాణిఁ బృథుల
సైకతశ్రోణి నాత్మలో సన్నుతింతు సుమధురమధురసుధావచఃస్ఫూర్తికొఱకు. 8

—నారాయణామాత్యుఁడు.

చ॥ తనహృదయాంబుజాతమునఁ దాల్చను నాథగతానురాగవా
హిని వెలిఁగ్రమ్మఁ జేసె నొకొ యీగతి నాఁగ, విధాత చెంగటం
దనరి జపాప్రసూనసవిధస్ఫటికాకృతి రక్తిగుల్కు వా
గ్వనజదళాక్షి మా కొసఁగు గాత వచోరచనాచమత్కృతుల్. 9

—కంకంటి పాపరాజు.

# శ్రీపాదగీతాతారావళి

## శ్రీ అయితం కాశీవరప్రసాదరావుగారు

దుర్దమము దుఃఖమూలంబు దోషవితతి ఆక్రమించెను భావగృహాంతరమున
మాత, కలయ వెదకెదఁ దమస్సునందు దివ్యతేజోఽస్పదంబు త్వదీయపదము. 1

ఏమహామాతృసత్కరుణేక్షణముల నభయకాంతిపుంజముల నుక్కణును లేమి
యామహామాతృచరణనఖామరారుణప్రభోదయానఁ బథంబు నడువఁ దలఁతు. 2

ఈగభీరనిశీథిని నీకరాళవసుమతీగుహాసఞ్చరద్భ్రాన్తసుతుఁడ
మాత, రత్నపాళీప్రభాధూతతమము త్వచ్చరణభూరజోరేఖ వర్త్మ మగుత. 3

యుష్మదీయదయాత్తభాగ్యోదయప్రభాకరేక్షణాంధీకృతపాపిఘూక
నఖరపాటితపండితముఖవిరావ మఖిలలోకంబు, మేల్కొని యభయ మిమ్ము. 4

త్వద్దయామధుమత్తవిభ్రమణశీలనీచభూదారకన్యస్తనిశితదీర్ఘ
కంటకాంకితమృదుపాదకంజ మిమ్ము సేర్తు ములు దీసి స్నేహాంబు నించి యొత్త. 5

స్వార్థరచితాన్యతాఘసంభారకల్పితప్రఘోరకారల నృపాథములు నిలుపఁ
జిరము నిలిచి కాఠిన్యముఁ జెందినట్టి పాద మిదె, కూర్తు స్నేహసంవాహనంబు. 6

త్వద్దయాకల్పితక్రీల వ్యర్థపఱచు పంకభూదారకల్పితప్రచురచర్చ
కాలకాకోలనీలజంబాలసమము మచ్చఁ దుడిచెదఁ జూపు, మంబా, పదంబు. 7

త్వచ్చరణచాలనోద్ధూతవాతపోతసీతమంజుహంసకరావపూతకర్ణ
యుగళి గలవాఁడ నగుట నేర్పుగ స్పృశింతు సంతమసములో శబ్దలక్ష్యమునఁ బదము. 8

మంజుమంజులశింజానరంజకములు కంజభవముఖ్యదారిద్ర్యభంజకములు
క్రమవాక్సతీవీణాప్రకారకములు త్వత్ప్రపూతమంజీరధ్వనులు తల్లి. 9

నవనవోన్మేషవాఙ్మధునలినవిసరచారుభావతటాకం బెడారి యిచట
తాపనిర్వాపణంబు పాదంబు నీది హత్తికొందుఁ గందమ్ముల హాయి గొలుపు. 10

భాస్వరచిరత్నరత్నసంభవకళాప్రభావభాసితహంసకద్వయము నీది
తనరి దారిద్ర్యదుర్ధ్వాంతదళనశీల తరణిరాకేందుమండలద్వయిగ నగుత. 11

క్రూరు లిట లేరు లే రిందు చోరవరులు హంత లిట లేరు లేరు నియంత లిచట
అకట అటు లయ్యు ననుభూతమైన వెతల వణఁకుచున్నది నీపదద్వయము, తల్లి. 12

చారుసౌవర్ణవర్ణప్రచారకములు రత్నమంజీరయుగ్మవిరాజకములు
మృదుశిరీషకోమలములు పదము లంబ, మూర్ధమునఁ దాల్తు ధన్యతఁ బొంద నెంచి. 13

తరణదుస్సాధ్యజీవనతరణిగాఁగ ఁగ
జీవనాశంకసమయసంజీవిగాఁగ నొనరు చరణంబు చూపు కన్నొత్తికొనెద. 14

మృదులమై స్నిగ్ధమై కళాసదన మగుచు శంఖచక్రాదిరేఖాప్రశస్త మగుచు
హరియురస్సరసీచరద్ధంసి యగుచు నలరు పదసేవ కోటిజన్మార్తఫలము. 15

కలుషమానవప్రాప్తపఃఫలముగాఁగఁ గరుణ నమ్ముదువోయి, తత్కలుషఖడ్గ
చాలనప్రఖేలనవిలోకాలఁ బదము తొట్రుపడె నీకుఁ జూపు చేదోయి మోఁద. 16

త్వద్దయాభోగమాహాత్మ్యభవధనాస్త్రసంప్రయోగరాక్షసలోకసంప్రభూత
సూరిరోదనతుభ్యహృన్నీరజమునఁ బరుగు లెత్తెదె! నిలిచి సేవలను గొనుము. 17

అచ్యుతకరారవిందసమర్చితంబు రాజరాజేంద్రవరసమారాధితంబు
పదము క్రూరశునకశునీవాసచారదుఃఖరజ మిట నిల్చి పోఁద్రోచికొనుము. 18

నవ్యనవనీతమృదులతాభవ్య మగుచు లలితలాక్షాకళారేఖికలను బొలిచి
షోడశకళాసువర్ణభాసురత వరలు పదము నీయది స్పృశియించు భాగ్య మిమ్ము. 19

నీకుఁగా నేడ్వఁ దొఱఁగు కన్నీరు గలదు విమలభావసుమంబులు పెక్కు గలవు
పంకిలముగాని చేయి యెప్పటికిఁ గలదు పాద్యపూజాప్రసేవనోపంబు దేవ. 20

బ్రహ్మహత్యాదిపాపకార్యప్రలబ్ధగాఁగ విను జెఱపట్టు గాతకుండఁ గాను
దోయిలించి కు నేచ్చియు దొరలి దొరలి పాటు మాతృభక్తి దనరు వత్స నగుదు. 21

బాలరోదనశాంతికై జోలవోలె భ్రమణమాయారికై ఘుకరవమువోలెఁ
బాల కేస్పు పాపకుఁ దల్లిపలుకువోలెఁ గులుకు నీపైఁడి యందెల పొలుపు నాకు. 22

భౌతికంబు కాయంబు ప్రభూత మగుట భూతకాయప్రవర్ధనమును త్వదీయ
శీతలామృతధారలచేత నగుట నస్మదీయశిరోఽభిషేకార్థ మగుమి 23

అనునయింపుమి, యనుభూతమైన యట్టి యధికతాపాగ్ని నార్పుమీ ఆర్ద్రమతిని
ఆన్మ నిచ్చెద నీకు సింహాసనముగ వాణిఁ గూర్చెద నీస్తోత్రపరతఁ దనర. 24

ముత్తియంబుల పోలిక పొదలి కదలి త్వత్పదాంబుజనిర్మలదళములందు
నిలిచి తాపోష్ణతను జార్చి నీదు మదిని గరుణఁ గలిగించుఁ గాత నా కనులనీరు! 25

అర్థిమాత్రుండఁ గాను త్వదర్థమైన యర్థవచ్ఛుద్ధసౌభాగ్యవర్ధితంబు
కైత గలదు సజ్జనశివంకరమనీష గలదు, గలదు సత్ప్రమతియు, నిక్కమగు భక్తి. 26

పాపనిష్పాపగుణపరీక్షాపరాత్మ కేమి, నాజంబు మాతకుఁ బ్రేమ గాన;
భయదమగు వేళ సాష్టాంగపడిన నన్ను సైఁచి కరుణాత్మ వజ్రపంజరమ వగుము. 27

ఓమ్ సత్.

# దైవమును మాతృరూపమున ఆరాధించుట

యా దేవీ సర్వభూతేషు
మాతృరూపేణ సంస్థితా
నమ స్తస్యై నమ స్తస్యై
నమ స్తస్యై నమోనమః.

ఎల్లభూతంబులందును దల్లిరూప
మున వెలసియున్న దేవికి మన మలరఁగ
మరల మరలను మ్రొక్కెద మరల మరల.

(దేవీమాహాత్మ్యము)

విశ్వోపకారమార్థిక సంక్షేమసాధనములో ప్రాచ్యదేశములు, అందును ముఖ్యముగా భారతదేశము, నిర్వహించిన వంతు ఇంతం తనలేము. మొట్టమొదట—'ఏకం సద్ విప్రా బహుధా వదన్తి' 'ఉన్నతత్త్వ మొక్కటే, దానినే జ్ఞానులు పెక్కు విధముల పేర్కొందురు' అను మహోదాత్తపాఠమును మనకు కఱపిన మహర్షుల యీ పరమోపదేశమును కృతజ్ఞులమై మనము తలదాల్పవలయును. ఆసూక్తి, వారిదృష్టి ఎంతవిశాలమో ఉదారమో వారి యనుభూతి ఎంత ప్రగాఢమో తెలుపుచున్నది. హిందువుల మనస్సులలో సంకుచితత్వ

మునకు చోటు లేకుండ చేసిన బోధన ఇది. ఆ యుపదేశమును అక్షరాల పాటించిన దేశము భారతదేశము. పెక్కు దేశాలనుండి అన్యమతాలవారిచే తఱుమబడిన పెక్కు మతాలవారికి భారతదేశ మాశ్రయ మొసగినది. దైవ మొక్కటే అయినను ఉపాసకులు తమ తమ సంస్కారానురూపముగ అభిరుచుల కనుగుణముగ భజించుటకు వీలుగా పెక్కు రూపముల పెక్కు నామములతో వెలసియున్న దనెడి సమరసమన్వయము హిందువుల సొమ్ము. అట్టి విధానములలో, దైవమును మాతృరూపమున ఆరాధించుటయు నొకటి.

దైవము నెఱిగిననాటినుండియు దైవమును మాతృరూపమున భజించుటయు నున్నది. ఋగ్వేద దశమమండలములోని దేవీసూక్త మిందులకు తొలిప్రమాణము. అందు ఋషి వాక్కుద్వారా దేవియే ఈలాగు వాక్రుచ్చినది - వసురుద్రాదిత్యప్రముఖులరూపములలో చరించునది దేవియే యట! అన్నమును గ్రసించునదియు చేతనులద్వారా పెక్కురీతుల పనులు నిర్వహించునదియు దేవియే యట! సాధువులకు శ్రేయస్సంపదల ప్రసాదించునదియు తనప్రీతికి పాత్రుడైనవానిని బ్రహ్మపదవినో ఋషిపదవినో జ్ఞానిపదవినో అధిష్ఠింపజేయునదియు దేవియే యట! జగత్సృష్టిస్థితిసంహారము లామె చేతిలో నున్నవట!

ఉపనిషత్తులును దేవీమహిమనే ప్రతిపాదించుచున్నవి. కేనోపనిషత్తును జూడుడు— దేవాసురయుద్ధమున వేల్పులు గెల్పొందిరి. ఆగెల్పు తమ వీర్యముచేతనే కల్గిన దని వారు భ్రమించి గర్వించిరి. వారికి బుద్ధిచెప్పుటకై బ్రహ్మమే ఒక తేజోరూపమున వారిముందు ప్రత్యక్ష మయ్యెను. బ్రహ్మము వారి ముం దుంచిన గడ్డిపోచనైన కదల్పలేక అగ్నియు వాయువును పరాజితులైరి. ఇంద్రుడు సమీపింపగానే ఆ జ్యోతి అంతర్ధాన మయ్యెను. దిక్కుతోపక నిల్చియున్న దేవేంద్రు నెదుట దేవిహైమవతి ప్రత్యక్షమై "ఆజ్యోతి బ్రహ్మము, దానిశక్తిచేతనే మీరు యుద్ధవిజయమును గాంచితిరి. విజయమునకు మీరు కొనియాడవలసినది బ్రహ్మమునే" అని యుపదేశించెను. దీని నెఱుగుటచేతనే ఇంద్రుడు వేల్పులలో వరిష్ఠుడయ్యెను అని ఆ యుపనిషత్తులో కథ తమై యున్నది

మహానారాయణోపనిషత్తులో ఈ దుర్గాస్తుతిసి గనుడు—

తా మగ్నివర్ణాం తపసా జ్వలన్తీం
వైరోచనీం కర్మఫలేషు జుష్టామ్
దుర్గాం దేవీం శరణ మహం ప్రప
సుతరసి తరసే నమః.

"అగ్నివర్ణయు తపఉజ్జ్వలయు, పెక్కురూపుల తన్నావిష్కరించుకొను దేవదేవుని శక్తియు, కర్మలయు తత్ఫలములయు శక్తిరూపిణియు నగు దుర్గాదేవిని శరణుజొచ్చుచున్నాను. సంరక్షణదక్షవగు నో దేవీ, నీవే మమ్ము కష్టాల తరింపజేయుదువు. నీకు మా ప్రణతులు."

ఈ సూక్తులే ఋగ్వేదమందును ఇతర వేదములందును అటనట కానవచ్చుచుండును మార్కండేయ పురాణము దేవీభాగవతము మున్నగు పౌరాణిక గ్రంథములలో ఈ యాశయమునకు సమగ్ర పరిపుష్టి కననగును. మన దేశములో పెక్కు భాగములలో ముఖ్య పారాయణ గ్రంథముగా విశేష ప్రచారములో నున్న దేవీమాహాత్మ్యము మార్కండేయ పురాణాంతర్గతము. ఇవిగాక 'తంత్ర' సారస్వత

మున్నది. శక్తితంత్రములలో శక్త్యుపాసనము విపులముగ ప్రతిపాదితమై యున్నది. హిందువులలో అన్ని శాఖలవారును లోకజననిని ఏదో యొకరూపమున భజింతురు. విష్ణుభక్తులు శ్రీమహాలక్ష్మిని శివభక్తులు పార్వతిని (ఉమను) కార్తికేయ భక్తులు వల్లిని దేవయానిని-పరమపురుషుని మహిషిగా శక్తిగా ఉపాసింతురు. 'దుర్గ'ను 'కాళి'ని పూజించువా రున్నారు.

మన దేశమున అమ్మవారిగుడులు లెక్కకు మిక్కిలిగ నున్నవి. పల్లె కొక యమ్మవారి గుడికి తగ్గక యుండును. ఉత్తరమున కాశ్మీరములో క్షీరభవాని యున్నది. దక్షిణపు కొనన కన్యాకుమారి యున్నది. నడుమ నడుమ వింధ్య ప్రాంతమున వింధ్యవాసిని, కంచిలో కామాక్షి, మధురలో మీనాక్షి – ఈ రీతిగా పరిగణనీయ నామరూపములతో దేవి వెలసియున్నది. ఇట్లు చూతుమేని మన దేశాధ్యాత్మిక చరిత్రలో దేవీపూజ సార్వకాలికముగను సర్వప్రాంతగతముగను గుర్తింపగలుదుము.

ఈ యుపాసన భారతదేశముననే పెంపొందనేల అని ప్రశ్నించుకొందుమేని-పెంపొందుటకు ఈ క్రింది కారణములు స్ఫురించును—

(i) సంఘములో స్త్రీలు పూజ్యస్థానమున నెలకొని యుండుట. (ii) శిశువుపట్ల తల్లికి గల సహజ ప్రేమానురాగములను భావించుకొన్నప్పుడు సాధకునకు గలుగు భద్రత. (iii) సృష్టిస్థితి సంహారములను ఈశ్వరుడు తన 'శక్తి'చేత నిర్వహించు ననెడి ఆశయము.

(i) వేదముల కాలముననుండి అంతకు కొంత పిమ్మటను గూడ సంఘమున స్త్రీలకు గౌరవార్హస్థాన ముండినట్లు స్పష్టముగ తెలియవచ్చుచున్నది. విద్యగఱపు సందర్భమున ఆ కాలములలో 'బాలుని'కి 'బాలికకు' ఎట్టి భేదముగాని పాటింపబడుచుండిన జాడ కానరాదు. గార్హస్థ్యమునో సన్న్యాసమునో అవలంబించుటకు మగవారి కున్నంత స్వేచ్ఛ మగువలకును ఉండియుండవలెను. లేకున్న వేదమంత్రద్రష్టలలో మహిళలుగూడ నుండుట ఎట్లు పొసగును? ఉపనిషత్ప్రసిద్ధలగు గార్గి మైత్రేయి ప్రముఖ మహిళల ప్రతిభ కంతటి ప్రశస్తి ఎట్లు గల్గియుండును? 'స్వయంవరాచారమున'కు అంతరార్థ మేమి? అనురూపవరు నెన్నుకొను మహిళల ప్రజ్ఞ కది పరమప్రమాణము కదా శ్రీమద్రామాయణమున పెక్కు ఘట్టములలో సీత శ్రీరామచంద్రునకు కర్తవ్యోపదేశము కావించి యుండలేదా? సీతయు సావిత్రియు అనసూయయు అరుంధతియు భారతీయ మహిళాధర్మమునకు నిత్యమహోజ్జ్వల లక్ష్యములు కదా. వారి నామములును చరిత్రములును ఎవరికైన నద్భుతాదరములు గల్గించునుకదా!

(ii) మన దేశమున ఆదికాలమునుండి శిశువులకు గావింపబడు ప్రథమోపదేశము 'మాతృదేవో భవ' 'మీ అమ్మయే నీకు దైవమగుత' అను వాక్యరత్నము కదా! అమ్మ యనిన యంతటి పూజ్యభావము! ఏల యన తొంతికి వాత్సల్యమునకు అమ్మయే మూర్తిభావము. పుట్టిననాటి శిశువుల భౌతికాధ్యాత్మిక పోషణ మామె యక్కఱ.

(iii) సృష్టిస్థితిసంహారముల నెఱవేర్ప భగవంతుడు 'శక్తి'ని వినియోగించుకొను ననుట అందఱు సమ్మతించిన విషయమే. పైనుదాహరింపబడిన శ్రుతివాక్యములచే అది స్పష్టము. ఈ క్రింది గీతాసూక్తియు అందులకు ప్రమాణమే.

ఈశ్వర స్సర్వభూతానాం
హృద్దేశే ఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని
యన్త్రారూఢాని మాయయా.

'అర్జునా, ఎల్లభూతములకు నియామకుడైన యీశ్వరుడు ఎల్లప్రాణుల హృదయములం దున్నవాడై యంత్రగాఁ బొమ్మల నాడించు రీతిగా మాయచేత ప్రాణులను భ్రమింపజేయు చున్నాడు.' 'శక్తి' శబ్దము స్త్రీలింగ మగు టయు దైవమును మాతృరూపమున భావించు టకు తోడ్పడియుండవచ్చు. పైకి కనవచ్చు చున్నంతకంటె విశాలతరమైన యర్థము ఆశబ్ద మున నిగూఢముగ నున్నది. ఆశబ్దమునకొక యర్థము లోకజననీ, మఱొక యర్థము ఆమె నుండి యుద్భవిల్లిన సృష్టి. కావున అగ్నికిని దాహశక్తికిని వేఱుపాటు లేనట్లు భగవంతున కును శక్తికిని వేఱుపాటు లేదు. శ్రీరామకృష్ణు డిట్లు వాక్రుచ్చి యున్నాడు—

''ఆదిశక్తిలీల సదా సాగుచునే యుండును. ఆమె క్రీడించుచున్నదియుం బోలె సృజించుచు, సంరక్షించుచు సంహరించుచు - ఉండును. ఆ శక్తికే కాళి యని పేరు. నిజముగ కాళి బ్రహ్మమే. బ్రహ్మమును నిజముగ కాళియే. అది ఒక్కటే తత్త్వమే, అభిన్నము. ఆతత్త్వము నిర్వ్యాపారము (=సృష్టిస్థితిసంహార వ్యాపార శూన్యము) అని మనము భావించునప్పుడు దానిని బ్రహ్మ మందుము. ఆ వ్యాపారముల నది నిర్వహించునప్పుడు ఆతత్త్వమునే శక్తి అనియును కాళి అనియును పేర్కొందుము. నామరూపములలో మాత్రమే భేదము, వేఱు భేదములేదు. తత్త్వ మొక్కటే.'' ఇట్టి ఆవరణమున ఎదిగిన హిందువు లోకజననియైన పరాశక్తిని ఆరాధించుట సహజమే.

శాక్తులం దీయాచారమున్న దని ఇంతకు మునుపే గుర్తించియున్నాము. శాక్తతంత్రము లలో విహితములైన సాధనలం గొన్ని అత్యంత పరిణతాత్ములకే కాని దుష్కరములు. కావలసిన శిక్షణము లేకే యొకడు దుష్కరసాధనను బూనుకొనునేని వీ మగును! పతనము గాంచును. తనపాటును సరిపెట్టుకొనుట కతడు తంత్రములనే ప్రమాణములనుగా జూపు కొన్నంతనే, తంత్రశాస్త్రములకును అపప్రథ కల్గినది. అట్టి సమయమున శ్రీరామకృష్ణు డవతరించి దైవమును జననిగా నారాధించుట లోని పవిత్రతను అమోఘతను ప్రదర్శించెను. తంత్రశాస్త్రప్రోక్త సకల సాధనలను శ్రీరామ కృష్ణుడు అనుష్ఠించెను మహిళలు లోకజననీ ప్రతిరూపము లనియు తాను శిశువ ననియు భావన యెప్పుడు మతనిలో సడలకుండెను. భగవ దుపాసనా మార్గములలో దేనినిగాని శ్రీరామ కృష్ణుడు ఖండింపలేదు. కాని మాతృపాసనము వరిష్ఠము పావనతమము నిర్బాధ మనుటను నొక్కి చెప్పుచుండెను.

మానవతతికి, ముఖ్యముగా సాధకతతికి శ్రీరామకృష్ణుడు ప్రదర్శించిన వరిష్ఠవిధానము దైవమును మాతృరూపమున ఆరాధించుటే. అందు కుత్తమలక్ష్య మాయనచరిత్రమే. ఆయన యేడేండ్ల బాలుడుగ నున్నప్పు డొక నాడు అనూరు విశాలాక్షిగుడికి కొందఱు భక్తమహిళల వెంబడి చనుచుండెను. దారిలో మాత బాహ్యలోకస్మృతి లేక ఆయన పడిపోగా ఆయనకు మరల స్మృతి గల్గింప లోకజనని నామసంకీర్తనము గావింప వలసివచ్చెను. అనంతరకాలమున దక్షిణేశ్వర మున భవతారిణి (కాళి)గుడిలో ఆయన పూజారి అయినప్పు డీ దేవీతృష్ణ మఱింతగా పొటమరించెను. అమ్మను సాక్షాత్కరించుకొన వలెనను తహతహపాటతనిలో నైకైకమును ఉత్కటకోటికము నయ్యెను. విరహమును విలంబమును నాయనకు దుస్సహము లయ్యెను. మిక్కుటమైన యశాంతిచే ఆయన పరవశు డయ్యెను. దేవిని సాక్షాత్కరించుకొనుభాగ్యము

తన కీజన్మమున లేదు కాబోలు ననే దిగులు పుట్టెను. బ్రతుకు నిష్ప్రయోజన మని తోచినది. అమ్మవారిగుడిలో శాకఖడ్గ ముండెను. శ్రీరామకృష్ణుని చూపు తటాలున దానిపై ప్రాలినది. ఆత్మహత్య చేసికొందు మని నిశ్చయించుకొని యున్మత్తునివలె ఎగిరి దానిని త్తి నొడిసిపట్టెను. అప్పుడు తటాలున జగజ్జననిదర్శనమును ప్రసాదించెను. ఆక్షణమునుండి ఆయన కభిలషితము ఆమెసాన్నిధ్య మొక్కటే. దానిని బడయుటకై ఆయన దేహబాధలను మనోవ్యధల నెంతగా ననుభవించెను! వివిధ సాధనల నాయన అనుష్ఠించె ననుట నిజమే. జననియానతిపైనే ఆయన వాని ననుష్ఠించె ననుటయు నిజమే. అద్వైతసాధనతో సహ ప్రతిసాధనయు ముగిసిన వెంటనే, లోకమాతృ శిశువుగ నుండుటచే ఆయన సంతోషించుచుండెను. 'శ్రీరామకృష్ణకథామృతము' నొకసారి చూచిన జాలును, శ్రీరామకృష్ణుడు మాతృసంకల్పపరతంత్రుడను విశ్వాసము దృఢపడును. అన్ని చిక్కులకు ఆయన కామెయే ఏకైకశరణము. ఆయనకు గలుగుచుండిన దర్శనానుభూతు లన్నియు మనఃకల్పన లని నరేంద్రు డన్నప్పుడు ఆయన మొఱపెట్టుకొన్నది అమ్మతోనే. "అమాయకుడ నైనంతనే అమ్మా, నన్ను నీవు మోసపుచ్చవలసినదేనా" అని యడిగెను. ఆదర్శనములు నిజములే అని అమ్మ నమ్మబలికినంతనే సందేహము లన్నియు పటాపంచలై తన్ను కలవరపఱచినందుకై ఆయన నరేంద్రుని చీవాట్లు పెట్టెను. జననియం దాయన కుండిన ప్రేమవిశ్వాసము లట్టివి. ఆయన యనుభూతిని ఆయన మాటలలోనే చిత్తగింపుడు – 'నాదివ్యజననికి నిరాకారతయు సాకారతయుగూడ నున్నవి. హృదయపూర్వకప్రేమద్వారా ఎవడైనను ఆమెదివ్య మంగళవిగ్రహసౌందర్యమును దర్శింపవచ్చు. అమ్మ తనభక్తులకు వివిధరూపములలో తన్ను జూపుకొనును.'

ఆమెను ప్రార్థింపవలసిన రీతిని ఆయన చేసి నేర్పెను. గురుదేవుని యీ యుపదేశప్రభావ మీనాడు స్పష్టముగ కనరా జొచ్చినది. ప్రాచ్యముననేమి పాశ్చాత్యమునేమి, శ్రీరామకృష్ణునుపదేశములు వ్యాపించిన ప్రతిచోటను దైవమును మాతృరూపమున నారాధింపవలసిన యావశ్యకతను ప్రజలు గుర్తించుచున్నారు. భారతదేశములో జరిగినంత వైభవముతోనే 'అమెరికా' 'యూరోపు'లలో పెక్కుప్రాంతాలలో 'దుర్గా' 'కాళీ' పూజలు జరుగుచున్నవి.

భువిని దేవు డవతరించినప్పుడు దేవుని శక్తియు నవతరించుచుండు ననుట ప్రత్యక్షసత్యము. ఈ యుగమున దేవుడు శ్రీరామకృష్ణుడుగా నవతరించినంతనే శక్తియు శ్రీశారదాదేవిగా అవతరించినది. ఆమె గడపిన జీవితము పైకత్యంతసరళముగ నున్నందున, ప్రజ లామెదివ్యతను గుర్తించుటకు జాగగుచున్నది. కాని కాలము గడచినకొలది ఆమె స్వరూపము మఱింతగా స్పష్టమగుచున్నది. నిరాడంబరమగు నామె యాధ్యాత్మజీవిత ప్రభావముచే పెక్కండ్రు మహిళలు సన్న్యసించి లోకసేవకు తమ్మంకితము చేసికొనుచున్నారు. ఆమెను గూర్చి గురుదేవుడు చెప్పియుండిన మాటల నాలకింపుడు— బాహ్యలోకస్మృతి సగ మున్నప్పుడే శ్రీరామకృష్ణుడు 'నాకై పుట్టియున్న యిల్లాలు జయరామవాటిలో నున్న' దని అమ్మకు అన్నకు దెల్పెను. వారి దాంపత్యము దైవనిర్ణీతము. ఆమెయే లోకజనని అను సత్యమును గురుదేవుడు తన భక్తులకు ఎన్నియోసార్లు తెలిపియున్నాడు. ఒకనాటి రాత్రి లోకమాతృపీఠముపై ఆమెనే

కూర్చుండబెట్టి శ్రీరామకృష్ణుం డారాధించెను. శ్రీ శారదమ్మ నోట అప్పుడప్పుడు వెలువడిన కొన్ని వాక్యాలుకూడ ఆమె దివ్యతకు తార్కాణములై యున్నవి.

అద్వైతులు సైతము మాతృపాసనమును తలదాల్చినవారే. శ్రీ శంకరభగవత్పాదులు అనుగ్రహించిన అంబాస్తోత్రములు విశ్వస్తోత్ర సారస్వతమున అగ్రస్థానము నలంకరించి యున్నవి. వాని ననుసంధించెడివారు ఉత్కట భక్తిభావపూరితు లగుచున్నారు. పెద్దదీపమే చిన్నదీపములను వెలిగింపగలద నెడి న్యాయాను సారము అనుసంధాతలను పరమభక్తులనుగ రూపొందించు స్తోత్రముల కాకరమైన శ్రీశంకరుల డెందము భక్తిమహార్ణవ మనుట నిస్సందేహము. సౌందర్యలహరినుండి కొన్ని శ్లోకరత్నములను చిత్తగింపుడు.

శివః శక్త్యా యుక్తో యది
భవతి శక్తః ప్రభవితుం
న చే దేవం దేవో న ఖలు
కుశలః స్పన్దితు మపి
అత స్త్వా మారాధ్యాం
హరిహరవిరిఞ్చ్యాదిభి రపి
ప్రణన్తుం స్తోతుం వా
కథ మకృతపుణ్యః ప్రభవతి. (1)

"అమ్మా, నీతో కూడియున్నప్పుడే శివుడు ఈశ్వరుడు కాగలుగును. నీతోడి కూడిక లేనప్పుడు దేవుడు సైతము కదలుట కేని శక్తి లేనివాడుగ స్థాణువుగ నుండును గదా. అటువంటి యప్పుడు బ్రహ్మవిష్ణు మహేశ్వరాదులకు సైతము పూజ్యురాల వగు నీకు మ్రొక్కనేర్పు గాని, నిన్ను కొనియాడు సామర్థ్యము గాని పుణ్యహీనుల కెట్లు కలుగును?"

తనీయాంసం పాంసుం
తవ చరణపఙ్కేరుహభవం
విరిఞ్చి స్సఞ్చిన్వన్
విరచయతి లోకా నవికలమ్
వహ త్యేనం శౌరిః
కథమపి సహస్రేణ శిరసాం
హర స్సఙ్క్షు ద్యైనం
భజతి భసితోద్ధూలనవిధిమ్. (2)

అమ్మా, నీపాదరేణువు నొక్కదానిని సంపాదించు కొన్నంతమాత్రముచేత బ్రహ్మ సర్వలోక సృష్టిని ఎట్టిలోటును లేక కావింపగలుగు చున్నాడు. దానిని దాల్చుటకే విష్ణువు తనకు వేయితల లున్నను, ఎంతో కష్టముమీద సమర్థు డగుచున్నాడు. పరమశివుడు నీ పాదరేణువును నూఱి, విభూతినిబోలె, ఒడలి కలదుకొనుచున్నాడు

భవాని త్వం దాసే మయి
వితర దృష్టిం సకరుణా
మితి స్తోతుం వాఞ్ఛన్
కథయతి భవాని త్వ మితి యః
త దైవ త్వం తస్మై
దిశసి నిజసాయుజ్యపదవీం
ముకున్దబ్రహ్మేన్ద్ర
స్ఫుటముకుట నీరాజితపదామ్. (22)

'ఓ భవానీ, నీ కింకరుడ నగు నాయందు నీ కృపాదృష్టిని పాఱింపుమా' అని నిన్ను స్తోత్రము చేయగోరిన భక్తుడు 'ఓ భవానీ, నీ' అని వాక్యమును ప్రారంభించిన తత్క్షణమే, ఆ వాక్యమైనను పూర్తియగు లోపుననే, అతనికి నీవు విష్ణు బ్రహ్మ దేవేంద్రుల కిరీటకాంతు లచే నీరాజనము నొందు చరణములు గల నీతోడి సాయుజ్యమును ప్రసాదింతువు.

శ్రీ శంకరాచార్యులవారు తాము నెలకొల్పిన మఠము లన్నిటిలో లోకమాతను ప్రతిష్ఠించియున్నా రనుట వారి మాతృభక్తికి ప్రమాణము.

క్రిందటి శతాబ్దిలోని కొన్ని చరిత్రాంశములను జూచినచో, మన మనస్సులో సంశయము లవలేశ మున్నను అది పటాపంచలగును. శ్రీ రామకృష్ణుని కద్వైతసాధన గఱపిన తోతాపురి సనాతన సన్న్యాసాశ్రమాచారమును ఇంచుకేని తప్పక పాటించువాడు, కావున ఏచోటను మూడు దినములకంటె ఎక్కువకాలమింతవఱకు నుండలేదు. దక్షిణేశ్వరమందు మాత్రము ఆయన పదునొకండు నెలల కాలముండెను. కొన్ని పాఠముల నాయనయు నేర్చుకోవలసి యుండెను. కామలోభాకర్షణలకు జిక్కు సామాన్యమానవులు పడు తిప్పలను తోతాపురి ఎఱుగనే యెఱుగడు. శిశువునకుండు నమాయికత ఆయనలో బ్రతికినన్నినాళ్లు చెడకుండెను. కాబట్టి ఇంద్రియములు మానవులను చెడుదారులకు ద్రిప్పు ననెడి విషయ మాయన మదికి పరిహాసనీయముగ నుండెను. జగతు మిథ్య యనియు దానిని తల చూపనీయక నెట్టివేయవలయు ననియు అతని గట్టి నమ్మకము. పుట్టినప్పటినుండియే అద్వైతియైన యాయనకు సగుణబ్రహ్మమందు విశ్వాసము లేదు. కాళిమాతృకరాళవైఖరియందేమి వాత్సల్యవైఖరియందేమి ఆయనకు నమ్మకము లేదు. ఆయన యభిప్రాయమున భజనయు పుణ్యనామ సంకీర్తనమును అర్థరహితములే. సగుణ బ్రహ్మోపాసనలో చెల్లించు భావోద్రేకమును ఆయన వెక్కిరించెడివాడు. ఇట్లుండ నొకప్పు డాయనకు అతిసారవ్యాధి తీవ్రముగా పైకొనెను. అందుచే ఆయనకు ధ్యానముసేయ శక్యము కాలేదు. ఒకరాత్రి నొప్పి దుర్భరమయ్యెను. ఒక్క నిముసమేని బ్రహ్మముపై మనసు నేకాగ్ర మొనర్ప జాలక పోయెను. చిత్తైకాగ్రతకు శరీరబాధ లడ్డుపడినవి. ఒడలి యక్కలు ఆయనను తొందరించినవి. ఆయన ముక్తాత్ముడే, దేహమును లక్ష్యపెట్టువాడు కాడు. కాబట్టి గంగలోదూకి దేహత్యాగము చేయుదమని నిశ్చయించుకొని, గంగలోనికి చరచర నడిచిపోయెను. కాని ఆశ్చర్యమేమనగా పోయిపోయి ఆయన వెనుదిరిగి చూచుకొను నరికి తాను గంగ కావలిగట్టున నుండెను. గంగలో చాలినన్ని నీళ్లు లేవా? ఆశ్చర్యస్తబ్ధుడై ఆవలిగట్టున నిలబడి, ఆయన గంగకిటువైపు చూపు మరల్చెను. వృక్షములును దేవాలయములును భవనములును ఆకాశనీలిమచే పరభాగశోభ నొంది అమరి యుండినవి. కన్నులు మిఱుమిట్లు గొన్న యొక్కక్షణమున తటాలున అన్నివైపులను దివ్యమాతృసాన్నిధ్యము అతనికి గోచరించెను. ప్రతివస్తువునందును ఆమె యుండెను. ప్రతివస్తువును ఆమెగనే యుండెను. నీటిలో నామె యుండెను. నేలపై నామె యుండెను. దేహ మామెయే, మన స్సామెయే, భేద మామెయే, మోద మామెయే, జ్ఞాన మామెయే, అజ్ఞాన మామెయే, ప్రాణ మామెయే, మృత్యువు నామెయే, చక్షుశ్శ్రోత్రమనోగోచరము లైన సకలపదార్థము లామెయే. కలిమిని లేమిగను లేమిని కలిమిగను ఆమె మార్పగలదు. మానవునకు స్వేచ్ఛలేదు. చావుకూడ మానవుని చేతిలోలేదు. దేవి కృపలేనిదే ఎవరును ఆమె యెలుబడిని దాటలేరు. ఇంతేకాదు మన శరీరముల కతీతమై విశ్వవ్యాప్తమైన తత్త్వ మామెయే, తోతాపురి తన జీవితకామంతయును ఉపాసించుచుండిన బ్రహ్మము ఆమెయే. తోతాపురి దక్షిణేశ్వరమునకు వచ్చి

ఆరాత్రి శేషమును దేవీధ్యానమున గడపెను. మఱునాటి యుదయమున నతడు శ్రీరామకృష్ణుని వెంట నిడుకొని, గుడికి జని, మాతృమూర్తి కెదుట సాష్టాంగముగ ప్రణమిల్లెను. దక్షిణేశ్వరమున పదునొకండు మాసములు తాను గడపినందుల ప్రయోజన మతనికి స్పష్టపడెను. దేవిమహిమ నిట్లు తెలిసికొని శిష్యుని వీడ్కొని తోతాపురి తనదారి నేగెను.

శ్రీ వివేకానందస్వాముల చరిత్రములో ఆయన దక్షిణేశ్వరమున శ్రీరామకృష్ణుని శుశ్రూషించుచుండిన కాలమున – లోకజననిపేర్మి నంగీకరించినరీతియు, కాశ్మీరమున క్షీర భవానిలో ఆయనకు కలిగిన యనుభూతియు-గమన్మార్మములు. అద్వైతులకు సైతము మాతృపాసన మవలంబనగు నను టకు ముఖ్యముల ప్రమాణములు.

ఆశ్వయుజమాస శుక్లపక్షమున మొదటి పదిదినములు దివ్యమాతయగు దుర్గాదేవికి పూజ సాంగోపాంగముగను విభవోత్తరముగను సాగుచుండును. అందు ఇతిహాసపు చవియు నున్నది. మానవ హృదయానుభూతియు నున్నది.

దానికి సంబంధించిన యితిహాస మిది - మహిషాసురుడు వేల్పులను నిర్జించి పాఱద్రోలి వారి హవిర్భాగములను హరించెను. వేల్పులు బ్రహ్మరుద్రులను పురస్కరించుకొని విష్ణుదేవుని దర్శించి మొఱపెట్టుకొందురు. క్రుద్ధుడైన విష్ణుదేవుని ముఖమండలమునుండి యొక జ్యోతి వెలువడెను. వేల్పులందఱి మొగములనుండియు అట్లే జ్యోతులు వెలువడి అన్నిజ్యోతులు నొక్కటిగ కలిసి దేవీరూపమును దాల్చినవి. సకలదేవతలు ఆ దేవిని ఆరాధించిరి; ఆయుధములను సమర్పించిరి, కైవారములు పాడిరి. ఆమె వారి కభయమిచ్చి మహిషాసురుని సబాంధవముగా సంహారించెను.

ఇందు గల మానవహృదయానుభూతి యిది-పార్వతి హిమవంతుని కూతురు. ఆమె ప్రతిసంవత్సరమును ఆశ్వయుజశుక్లపక్షారంభమున పుట్టినింటికి వచ్చుచుండును. పుత్త్రిక వచ్చుట తల్లిదండ్రుల కెంత సంతోషకరమైన సంభవమో సకలమానవుల కనుభవగోచరమే. వెళ్లిపెనిమిటింటినుండి మన అమ్మాయిని పిలుచుకొని రమ్మని తండ్రిని ప్రార్థించు గేయములు మొదట పాడుదురు. పుట్టింటికి వచ్చిన పార్వతి అచ్చట నుండు దినములు మూడే. మూడుదినములును మూడునిమిషములుగా చెల్లిపోవును. నాలుగవదినము అమ్మవారు కైలాసమునకు మరలుదినము, విజయదశమి. ఆనాడు దుర్గావిగ్రహములను ఆమె బిడ్డల విగ్రహములను ఆటలతో పాటలతో వాద్యములతో ఊరేగించుచు కొంపోయి తటాకజలములందో నదీతోయములందో సముద్రాంబువులందో ముంతురు. ఆనాడు ప్రజలు తమ ప్రాత పగలను దిగద్రావి ద్వేషములను విస్మరించి జాతివయోవిభేదము లేక ఒండొరులను కౌగలించుకొందురు. తమ జీవితములను మరల క్రొంగ్రొత్తగ నారంభింతురు.

లోకజననితోడి వియోగమువలని వ్యథ వర్ణనాతీతము. రాణిరాస్మణిగారి అల్లుడును, శ్రీరామకృష్ణుని కాలమున దక్షిణేశ్వరకాళి కాలయాధిపుడుగ నుండినవాడునగు మథురానాథుడు, శ్రీరామకృష్ణుడు తనకు స్వకీయ హృదయముననే దేవీసాన్నిధ్యమును కనుపఱచువఱకు కాళీప్రతిమను జలాశయమున ముంచివేయ అనుమతింపకుండెనట.

ఇది వర్షాకాలమునకును చలికాలమునకును మధ్యకాలము. మానవుడు తనస్థితిని

గట్టిపఱచుకొని శిశిరకాలపు పోట్లాటకు సిద్ధపడు కాలము. సీతను వెదకించి నీమాటను నిలబెట్టుకొమ్మని లక్ష్మణుడు సుగ్రీవుని ప్రబోధించిన కాల మిదే. ప్రతిమానవుని జీవితములోను భౌతికార్థికరంగములందే కాక ఆధ్యాత్మికరంగమందు సైతము నిప్పచ్చరపు చలికాలము వచ్చును. దాని నెదుర్కొన, మానవుడు భక్తివివేకము లనెడి ఆయుధములతో సన్నద్ధుడుగ నుండవలయును. మాతృసాక్షాత్కారము నడ్డగించు ఆయాసురప్రవణతలతో మానవుడు ఈ యాయుధములగొని పోరాడవలయును. ఇదే అందుకు సమయము. సమయానుకూలముగనే మన ప్రాచీనులు ఈ మాతృపూజ నేర్పఱచియున్నారు.

ఈ చరితములు ఋషులు ఊబుసుపోకకై కల్పించినవి కావు. 'అన్వేషింపవలసినది దేవునే, పారమార్థికపరతయే బ్రహ్మానందప్రదము' అను పాఠమును మన డెందముల హత్తుకొలుపుటే ఆచరిత్రముల పరమప్రయోజనము. మహిషాసురుడు కల్పితవ్యక్తి యగును గాక, ఆత్మప్రాప్తిని కలుగనీక మనలో ప్రకోపించు అసురప్రవణతలు వాస్తవములే. వానిని అపాకరింప మనము దేవిని ప్రార్థింపవలయును. అందఱు వేల్పులతేజమును దేవిలో రూపొంది యున్నందున ఆమె సమారాధనము సర్వదేవసమారాధన మగును. ఈ విషయమే ఆంధ్ర మహాభారతములోని

అచ్యుతుండు పూజితుం డగుడుం దేజమున
జగత్త్రితయముం బూజితమయి తృప్తిఁబొందుఁ
బుణ్యసమృద్ధిన్.

అను సుప్రసిద్ధవాక్యమున పొందుపడి యున్నది.

---

# తెలిసికోవలసిన విలువలు 2

**చూచి పెట్టు మోయి ముందడుగును :**

ఓ మానవుడా, నీలో నీవే ఆలోచించుకో, నీ వెందుకు సృజింపబడినావో గుర్తించుకో.

నీ శక్తులను తలంచుకో, నీ అక్కఱలను నీ చుట్టుపక్కములను స్మరించుకో. అదేరీతిలో జీవితకర్తవ్యాలను కనుగొందువు. అవే నీకు సకల మార్గదర్శకములుగా నుండగలవు.

నీవు పల్కనున్న మాటలను చక్కగా పరిశీలించుకో, నీవు అడుగిడు ప్రతిమెట్టునందలి ప్రవృత్తులను ముందుగా పరీక్షించుకో, అలాగు పరీక్షింపక మాటాడుటకు కాని పనికి పూనుకొనుటకుగాని త్వరపడకు. ఇట్లు మెలకువ వహింతువేని పరాభవ మనునది నీ యావరణమునకు కడుదవ్వున కేగును. అవమానము నీయింట జొచ్చి మెఱుగనిదిగా నుండును. పశ్చాత్తాపపడవలసిన అవసరమే నీకు కలుగదు. నీ నెమ్మొగమున దుఃఖచ్ఛాయ లుండనే యుండవు.

విచారమూఢుని నాలుకకు కట్టుబాటుండదు ఆలోచించుకొనకే అతడు మాటాడుచుండును, వివేకరహితములయిన తన మాటలచేతనే చిక్కపడుచుండును.

ఆవల గర్త ముండుటను జూడక త్వరపడి కంచెను లంఘించువాడు, గర్తములో పడిపోవునట్లు, ఫలితములనుగూర్చి ముందుగా ఆలోచించుకొనక ఏపనికైనను పరుగులు వాఱువాడు పతనము చెందును.

అంతరాత్మ ప్రబోధములకు చెవియొగ్గుము. అవి వివేకసమంచితములుగ నుండును, ఆ దారులు నిన్ను తప్పక సత్యభద్రతల నొందింపగలవు.

# కర్మతత్త్వము - భగవద్గీత

శారదాచరణ్

(గతసంచిక తరువాయి)

కావున, నవీనముగా ఎవరెవరి సౌకర్యమునకు తగినట్లు వారు వారు విధ్యుక్తకర్మములేవో, అనవసరకర్మములేవో యుక్తాయుక్తముగా విచారించుకొనవలయును.

కాని, ఇందొక కిటుకున్నది. ఎవరి సౌకర్యమునకు దగినట్లు వారు ప్రవర్తించుట యనగా, దొంగకు దొంగతనమే సౌకర్యముగా కన్పించుచున్నది అప్పుడది ఆతని బాధ్యతయా?

పై ప్రశ్నకు సమాధానము:—భగవద్గీత ప్రారంభమగుట "ధర్మ" యను శబ్దముతో, అంతమగుట "మమ" అను శబ్దముతో. "ధర్మమమ" లేక "మమధర్మ" అను మాటలో ఈ భగవద్గీత ఇమిడియున్నది. "నా యది ధర్మము" అని దీని అభిప్రాయము. కావున అధర్మ సంబంధమైన దేదియు ఇందు గాంచము. ఇక, ధర్మములం దన్నింటను అహింసయే ప్రధానమైనది.* దొంగకు దొంగతనము సౌకర్యమైనచో, ఆత డెవని వద్దనుండి దొంగిలించెనో, అతనిని హింసించినవాడగును. ఈ హింస కాయికమైనను, వాచికమైనను, మానసికమైనను—ఇంకేదైనను—హింస హింసయే! కావున మన బాధ్యతలను గుర్తించుటకు ధర్మమే గీటురాయి.

దేశకాలపరిస్థితులనుబట్టి ఈ ధర్మము మారుగాక; ఏ దేశమున, నే కాలమున, నే పరిస్థితియందు ఒక కర్మము సముచితమో, ఆ దేశమున, నా కాలమున, నా పరిస్థితియం దా కర్మమొనర్పవలయును.

**కర్మ రహస్యము :**

"కర్మ బ్రహ్మోద్భవం విద్ధి" † అను దివ్యమైన వాక్కుచేత భగవానుడు అర్జునునకే కాక, సకలమానవులకు వినూత్నచైతన్యమొసంగెను. కర్మము బ్రహ్మోద్భవము, అది వేదములనుండి పుట్టినది, వేదములు భగవానునియొక్క నిశ్వాసములే కావున కర్మము వేదములంతటి పవిత్రమైనది. కావున కర్మ రహస్య మెఱుంగవలెనన్న తొలుదొల్త సకలకర్మములు పవిత్రములని యెఱుంగవలయును. చర్మకారుని కర్మమునుండి చక్రవర్తి కర్మమువఱకన్నియు పవిత్రములే! ఏదియు నీచమైనది కాదు. నీచత్వము సంఘదృష్టిదోషమున కలదు.

కర్మము ఫలదాయకమైనది. ఇదియే సకల కర్మముల వెనుకనున్న ప్రధానరహస్యము. ఏ కర్మమును వ్యర్థమైనది కాదు; ఏదియో ఒక ఫలమును-అది మంచిదైనను, చెడ్డదైనను-ఒసంగును. సత్కర్మములు సత్ఫలములను, దుష్కర్మములు దుష్ఫలములను ఒసంగుచున్నవి.

కాని కర్మములను ఇది మంచిది, ఇది చెడ్డది అని విభాగించుటెట్లు? యుద్ధమున ఒకడింకొకని జంపిన నది వీరత్వము, సంఘమున నొకడింకొకని జంపిన నది ఘోరపాతకము! ఈ చిక్కునకు కారణము భేదించినచో అది కర్మ రహస్యమును వెల్లడించును. నిజమునకు కర్మము కారకము కాజాలదు. దాని వెనుక భావమే ప్రధానమైనది. యుద్ధమొనర్చుట

* అహింసా పరమోధర్మః

† గీత ౩ అ; ౧౫ శ్లో.

ఒక దేశముయొక్క ధనప్రాణమానములను కాపాడుటకొఱకు, కాని సంఘమున నొకడింకొకని చంపుట కేవలము స్వార్థపరత; లేక, నిరర్థకావేశము, లేక, ప్రతీకారవాంఛ. కావున భావమే కర్మము నొనర్పజేయుచు ఫలముల నిప్పించుచున్నది. ''యద్భావం తద్భవతి' ఏది భావింతుమో అది యగును.

ఈ కర్మ రహస్యము నెఱిగిన నరుడు పాపభూయిష్ఠకర్మముల నొనర్పకుండుట కుద్యమించుచున్నాడు.

కర్మయోగము :

యోగమనునది భవసంబంధబంధముల నుండి స్వేచ్ఛనందుటకు ఏర్పడిన రాచబాట కర్మయోగమనగా కర్మములచేతనే ముక్తిం బడయజేయుయోగము.

ఈకర్మయోగమునందు రెండుమెట్లుగలవు. ప్రతికర్మమును తగినఫలము నొసగునని యెఱిగినవెనుక, మొదట కర్మఫలములను వదిలించుకొనుటకై యత్నింపవలయును. మంచి ఫలమైనను, చెడుఫలమైనను స్వేచ్ఛాభంగకరమైనది. స్వామీజీ వచించినరీతిగా ఒకటి ఇనుపసంకెల, మఱియొకటి బంగరుసంకెల, కాని, యోగమునకు పరమావధి అనంతస్వేచ్ఛ లేక ముక్తి. కావున రెండు సంకెలలను విడగొట్టవలయును. కర్మఫలములను వాంఛింపకుండుటే దీనికి మార్గము. తొలుత బంగరు సంకెళ్ళచే నినుపసంకెళ్ళను నాశమొనర్చి, తర్వాత యోగముచే బంగరుసంకెలలను సైతము విడనాడవలయును.*

ఇక, నీ కర్మయోగమున రెండవమెట్టు నిరహంకారత. ఇది నిర్వాణమునకుముందును, కర్మఫలత్యాగానంతరమును నుండుదశ. ఇందుచే దేనికిని మనము కర్తలము కామను జ్ఞాన ముదయించును. తద్ద్వారా కర్తృత్వాభిమానము నశించి, సర్వత్ర సర్వేశ్వరుని దర్శనము కల్గునని భగవద్గీత వక్కాణించుచున్నది.

కావున ధర్మబద్ధముగా కర్మము లాచరించుచు, కర్తృత్వాభిమానమును, భోక్తృత్వాభిలాషను విడనాడుటే కర్మయోగము. ఈ రెండు నశించిన, యోగము సిద్ధించును.

పురుషార్థములు - కర్మయోగము :

పురుషార్థములు నాలుగు : 1. ధర్మము. 2. అర్థము. 3. కామము. 4. మోక్షము. ధర్మము తొలుదొల్తనున్నది కావున మానవుడు చేయవలసినవన్నియు

యుండవలయును. కర్మయోగమునకును ఇదియే తొలుత నున్నది. కావున, ధర్మబద్ధముగనే అర్థము సంపాదింపవలయును. ఒకవేళ ఈ యర్థము సిద్ధింపకున్నను తలక్రిందులు కాకుండుటే యోగము. తలక్రిందులైనచో పునః ప్రయత్న మసాధ్యముకదా? అదేవిధముగా అర్థములేని కామమును తగదు. అట్లే కామము లేని మోక్షమును (కామిగాక మోక్షకామి కాదు.)†

మానవులొనర్చు ఈ పురుషార్థము లన్నింటి యందును కర్మయోగము ప్రకాశించినచో మానవులు మానవాతీతులౌటకు సందియము లేదు.

* ఇనుపసంకెల బిగుసుకొనియుండ, యోగము సాధ్యము కాదు.

† ''కామ'' మన్నచో స్త్రీపురుషుల మధ్యనున్న కామముమాత్రమే కానక్కఱలేదు.

**కర్మతత్త్వము - శ్రీరామకృష్ణుడు :**

కర్మతత్త్వమును విశదీకరించుచు శ్రీ రామకృష్ణుడు పల్కిన సూక్తులు కొన్ని:-

"కర్మఫలమెల్ల భగవంతున కర్పించుటయే కర్మయోగ మనబడును."

"కర్మము ప్రకృతి సిద్ధమగుటచే మానవుల కనివార్యము. కావున మీమీ పనులను యుక్త విధమున (అనగా నిస్సంగబుద్ధితో) నెఱవేర్చుకొనుడు. నిస్సంగమగు కార్యాచరణమనగా ఇహపరములందు ప్రతిఫలాపేక్షగాని, శిక్షాభయముగాని లేక కర్మము నాచరించుట. ఇట్టి కర్మమువలన భగవత్ప్రాప్తి కలుగును."

"—కర్మము ఒక సాధనము మాత్రమే; అదియు నిస్సంగముగా ఆచరింప బడినప్పుడే! అసలు జీవితలక్ష్యము భగవంతుని దర్శించుట!"

శ్రీరామకృష్ణార్పణమస్తు

## పదండి ముందుకు పదండి తోసుకు

ఆత్మ ఒకవలయము, దానికి పరిధి (అంతము) లేదు కాని దాని కేంద్ర మేదో యొక దేహమున నుండును. ఈ కేంద్రము మాఱుటే మరణము. దేవు డొక వలయము. ఆ వలయమునకు పరిధి ఎచ్చటను లేదు. కేంద్రము మాత్రము ఎల్లెడల నున్నది. సంకుచితమగు దేహకేంద్రమునుండి మనము వెలువడగల్గినప్పుడు దేవుడే మన ఆత్మ అనుటను సాక్షాత్కరించుకొందుము.

ప్రబలనదీప్రవాహము సముద్రమువంక ఉరవడించుచున్నది. ఆ ప్రవాహములో కాగితపు ముక్కలు గడ్డిపరకలు అట నట నున్నవి. వెనుకకు పోవుటకై అవి పెనుగులాడవచ్చును గాని, తుదకు సముద్రములోనికి కొట్టుకొనిపోవుట తప్పదు. నీవును నేనును ఈ ప్రకృతి యంతయు సత్త - పరిపూర్ణత - దేవుడు అను సాగరము వంకకు పరుగులువాఱుచున్న ప్రవాహములో నున్న గడ్డిపరకలము. వెనుకకు పోవుటకై మనము పెనగులాడవచ్చు, ప్రవాహమున కెదురుతిరుగవచ్చు, అన్నిరకములైన చిలిపిచేష్టలు చేయవచ్చు, కాని తుదకు మనము ఆ సచ్చిదానందమహార్ణవములోనికి కొట్టుకొనిపోయి కలిసిపోక తప్పదు.

జ్ఞానమనగా ప్రత్యేకమతరహితత. అయినను ప్రత్యేకమతాలను జ్ఞానము ఏవగించుకోదు. ప్రత్యేకమతాలవారుగ నుండుటకంటె పైమెట్టధిరోహించుటే జ్ఞానమున కర్థము. జ్ఞానము అన్నిటికిని సాధకమే కాని దేనికిని బాధకము కాదు. 'ఇహలోకసంగమును విడువుము, ఇహలోకమును నీవు వీడ నక్కఱలే' దని జ్ఞానము బోధించును. సంగరహితముగ లోకమున నుండుటే వైరాగ్యమున కొరపిడిరాయి.

శ్రీ వివేకానందస్వామి.

# శ్రీ శివానంద స్మృతులు - 47

## శ్రీమత్ప్రవ్రాజిక శ్యామాప్రాణ

బేలూరుమఠము 13-5-1929

(సోమవారము)

ఉదయమున శ్రీమహాపురుషులు తమగదిలో ఆసీనులై యున్నతరి పెక్కురు సాధుబ్రహ్మచారులు అచ్చట గుమిగూడి పలురకములగు వార్తాలాపముల సల్పుచుండిరి. ప్రసంగవశమున వారు సాయంత్రము, హారతి ముగిసినపిదప జరిగెడి క్లాసువిషయమును గూర్చి ముచ్చటించిరి. స్వామిజీచే రచింపబడిన నియమావళినుండి ప్రతిదినము ఒక్కొక్కటిగ చదివి దానిపై విమర్శచేసి అధ్యయనముచేయుచుండిరి. ఈక్లాసుకు పెద్దసాధువులుకూడ వచ్చెడివారు. శుద్ధానంద స్వామి, విరజానందస్వామి, శర్వానందస్వామి మున్నగు పండితులగు స్వాములు కఠినమగు ప్రశ్నల సమాధానముల చెప్పెడివారు. క్లాసు విషయము విపులముగ విని శ్రీమహాపురుషులు- ఇటువంటి క్లాసులు జరుపుట చాలమంచిది. ఇది సన్న్యాసులమఠము. రాత్రింబవళ్ళు ఇచ్చోట పూజాపారాయణాదులు, జపధ్యానాదులు, ఉపన్యాసకాలక్షేపాదులు జరుగుచుండవలెను.

ఒకసన్న్యాసి-ప్రస్తుతము, మాక్లాసులో మఠనియమముల గూర్చి చదువుచున్నాము.

మహాపురుషులు - చాలమంచిది. స్వామిజీ పల్కులెల్ల వేదవాక్కులు, సూత్రాకారమున లిపిబద్ధములైనవి. ఒక్కొక్కవాక్కులో పెక్కురకములగు భావములు ఇమిడియున్నవి. దీనిని ఒక్కొక్కటిగ శ్రద్ధగా చదివి, విమర్శించినచో, క్రొత్తవిషయము లెన్నియో బోధపడును. మఠములో ఇట్టి ఆలోచనలే జరుగుచుండవలయునని నేను కోరుచున్నాను. ప్రతి వ్యక్తియు తనజీవితలక్ష్యముపై దృష్టి నిలుపవలెను. భగవద్భక్తి, విశ్వాసము, ప్రేమ, ప్రీతి — పవిత్రత, పరస్పరస్నేహము, — ఇవన్నియు జీవనోద్దేశ్యములు. మనమెల్ల ఇల్లు వాకిలి వీడి వచ్చితిమికదా, దీని తాత్పర్యమేమి? మన మిచ్చటికి ఎందులకై వచ్చితిమి? ఎందులకు సంఘబద్ధులమై కూడి యున్నాము? మన త్యాగవైరాగ్యములు దినదినాభివృద్ధి నొందునట్లుగ మనము హృదయపూర్వకముగ ప్రార్థింపవలయును.''

వారియెదుట ఒకసన్న్యాసి నిలిచి యుండెను. అతనివైపు దృష్టి పఱపి మహాపురుషులు—''నీవు క్లాసుకు పోవుచున్నావా?'' అని ప్రశ్నించిరి.

సన్న్యాసి— లేదండి, పగలంతయు పనిపాటులతో గడచును, సాయంకాలమగుసరికి ఎక్కడ లేని బడలిక, అందుచే క్లాసులో కూర్చుండు ఓపికకూడ ఉండదు.

మహాపురుషులు ఆలాగు కాదు. ఇవన్నియు వినుట చాలమంచిది స్వామిజీ దివ్యదృష్టిసంపన్నుడగు ఋషిపుంగవుడు భవిష్యత్తు ఘటనలనెల్ల ఎఱుంగును. అందుచే మఠముకొఱకై నియమనిష్ఠల ఏర్పఱచెను. మనము సాధువులము. వారివచనముల నెంతగ చదివి, విమర్శించి, విచారించి జీవితములో ఆచరింపగల్గిన, అంతగ మనకు మేలు ఒనకూడును. మనజీవితముల ఏకైక లక్ష్యము భగవత్ప్రాప్తి సుమా! ఈసంసారము మహాభయంకరమగు స్థలము. ఇచ్చట పనిపాటులతోపాటు - జీవితోద్దేశ్యముపై దృష్టి నిల్పి - ఆమార్గమున ముందంజవేసి పయనించుట కష్టతరమైన కార్యము. ఏమువూాత్రముులోనైన కాలుజాఱె దభ్రష్టులు కావ

చ్చును. శ్రీభగవానులు తఱచు ఈలాగు అనెడి వారు "ఎగుడు దిగుడు గనిమలపై నడచు పిల్లలు కాలుజాఱుట నైజము. అందుచే బిడ్డ తండ్రివ్రేలు పట్టుకొని నడచును, కాని అట్టి తఱిని సైతము కాలుజాఱిపడుటకుఅవకాశములు కలవు. కాని తండ్రి స్వయముగ బిడ్డచేయి పట్టుకొని నడిపించి తీసికొనిపోయినచో కాలు జాఱి పడుటకు అవకాశమే లేదు." అలాగే మనము కూడ ఎగుడు దిగుడులచే దుర్గమంబగు ఈ ప్రదేశమున సంచరించుచున్నాము. కాలుజాఱి పడు ప్రమాదము కలదు. కాని భగవానుడు మనకు చేయూత నొసంగి నడిపించుకొనిపోవుచో ఎట్టి భయమును లేదు. వాస్తవమున భగవానుడు మనల చేయిపట్టుకొనియే నడిపించుచున్నాడు. లేకున్న ఈపాటికి మన మెప్పుడు ఎక్కడ అడుసులోనో కాలువేసి ఏగుంటలోనో పడిపోయెడివారము. అందుచే మనోవాక్కాయములద్వార, త్రికరణశుద్ధిగ "భగవంతుడా మమ్ము చేయిపట్టుకొని నడిపింపుము. మేము కడుదుర్బలులము, అడుగడుగునకును జాఱిపడు అవకాశములు మెండు. నీవు కృపజూపి మాచేయి పట్టుకొనియున్నచో మేము రక్షింపబడుదుము." అని సదా ప్రార్థింపుము. అతడే మనప్రాణములకన్న మించిన ప్రాణము. మన లోనే విరాజిల్లుచున్నాడు. అతడు మన ప్రార్థనలనెల్ల మన్నించును. శ్రీఠాకూరు యుగావతారపురుషుడు. యుగధర్మ సంస్థాపనార్థమే శ్రీభగవానుడు, శ్రీరామకృష్ణరూపమును ధరించి వచ్చెను. అతడు మనయెల్లరపై కృప చూపును - చూపుచునే యున్నాడు- లేకున్న మనల నిచ్చటి కేలకొనివచ్చును?

"జృంభిత - జగ ఈశ్వర - జగదీశ్వర - యోగసహాయ." నాయనా ఇది స్వామిజీ వాక్యము సుమా! అతడే ఈయుగ దైవము. ఈయుగములో ఎవ్వడేని అతని శరణునందినచో తప్పక మేలుకల్గును. శరణాగతి - తోడ్తోడ ప్రార్థన - (చేతులు జోడించి) "భగవానుడా, మాలోని త్యాగవైరాగ్యముల వృద్ధిచేయుము. మమ్ముల పునీతుల కావింపుము. పరస్పర స్నేహము, ప్రీతి వృద్ధిచేయుము. నీవు మాచేయి పట్టుకొని యుండుము. మమ్ముల విడకుము!- "పరనింద పరచర్చ, ఇవి చాల చెడ్డవి. వీని వల్ల మనస్సు సంకుచితమై నీచమగును. వీలైనంతసేపు శ్రీభగవానుని జపము. ధ్యానము, పూజ పారాయణాదులు, చేయుటయు, మిగత సమయములలో మౌనముగ వానిస్మరణ మననములు కావించుటయు శ్రేయస్కరము. సంఘబద్ధముగ నుండుట అత్యంతావశ్యకము. ఇందు చాల ఉపయోగముకూడ కలదు, అందుచేతనే స్వామిజీ ఈసంఘమును ఏర్పఱచి పోయినది. తోడ్తోడ సేవ, మున్నగు విశుద్ధకర్మ ప్రవర్తన ఏర్పాటు కూడచేసెను.

---

సీ. సత్సంప్రదాయుఁడై శాస్త్రపారీణుఁడై యాగమజ్ఞుండైనయతఁడె గురుఁడు
పరమదయాళుఁడై పాపనిర్ముక్తుఁడై యాచారవంతుఁడౌ నతఁడె గురుఁడు
భూరిసుజ్ఞానియై బోధింపశక్తుఁడై యతిశాంతచిత్తుఁడౌ నతఁడె గురుఁడు
కడుఁదపోనిష్ఠుఁడై ఘనమంత్రసిద్ధుఁడై యధ్యాత్మవేత్తయౌ నతఁడె గురుఁడు
తెలిసి యిటువంటిగురుఁ జేరి వెలయవలయు సుజనులగువార లీడేఱఁ జూచికేని
కలితలక్ష్మీశ, సర్వజగన్నివేశ, విమలరవికోటిసంకాశ వేంకటేశ.

—శ్రీ తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు.

## 99

శ్రీరామకృష్ణాశ్రమము
బుల్టెమ్పుల్ రోడ్డు
22 జూలై 1921

ప్రియశ్రీమర్ —,

ఎంతోకాలమునకు నీవు వ్రాసిన జాబు చేరినది. చూచి ఎంతయు సంతోషించితిని. గురుదేవుననుగ్రహముచే నీవు మాకు సొంతముగను మేము నీకు సొంతముగను అయియున్నామనుట నిజమే. ఇందు కిసుమంతయు సందేహము లేదు. గురుదేవుడు నిన్ను సదా రక్షించుచున్నాడని నిజముగ మే మెఱుగుదుము. తండ్రియే శిశువుచేతిని పట్టుకొని యుండునప్పుడు శిశువు పడిపోడు. శిశువునకు కాలు జాఱినను పతన ముండదు. ఏలయన శిశువుచేతిని తండ్రిపట్టుకొని యున్నాడు కదా. ఇదే రీతిని గురుదేవుడు నిన్ను తనచేత నుంచుకొనియున్నాడు. నీకు విశుద్ధియు భక్తియు వైరాగ్యమును గల్గు ననియు నీలో ప్రేమయు దయయు పరిపూర్ణము లగు ననియు నా దృఢ విశ్వాసము.

మఠమునుండి వార్తలు నాకు అప్పుడప్పుడు వచ్చుచుండును. భాయిభూపతి గురుదేవు ననుగ్రహభాగ్యమును స్వయముగ పడసినవాడు జీవితములో చాలినంతగ తపస్సాధనలు గావించినవాడు. శ్రీగురుదేవుని చరణసన్నిధి నతడు ప్రశాంతముగ నెలకొనియున్నాడనుట నిజము.

జ్వరాలకాలము వచ్చియున్నది. గురుదేవు ననుగ్రహముచే జ్వరబాధ ఎవరికిని హెచ్చుగ కలుగకుండును గాక. కలుగకుండునని నా విశ్వాసము. నీవు ఒంటరిగా చాల పాటుపడుచుంటివి. అప్పుడప్పు డట్టిపరిస్థితి గలుగుచుండును కాని గురుదేవుని సంకల్పముచే విముక్తిమార్గము గల్గితీరును. ఏలయన కార్యము నిర్వహించుచున్న వారికి ఎటువైపును పోజాలని పరిస్థితి గలుగుట అసంభవము. ఇరుగుపొరుగుననున్న పేదలపట్ల నీకున్న కనికరము మే మెఱుఁగుదుము. గురుదేవుని దివ్యలీలలో ప్రత్యేకముగ స్ఫుటముగ గననగునది ఈ కనికరమే కదా. కనికరమును మించిన సుగుణము వేఱొకటి ఏమున్నది?

నాహృదయపూర్వక ప్రేమాశీస్సులు నీకు స్పష్టమే. నీవు వానిని అందఱికి అందజేయుదువుగాక. గురుదేవు ననుగ్రహముచే శ్రీమహారాజు (బ్రహ్మానందస్వామి)తోసహా మేమందఱము క్షేమముగనున్నాము. ఈచోటు ఆరోగ్యకరముగనున్నది. వానలు చాల తక్కువ. నాలుగుచినుకులు పడుచుండును. అది పరిగణనీయము కాదు.

నీ శ్రేయోభిలాషి,
శివానంద

## 100

శ్రీరామకృష్ణమఠము
బుల్టెమ్పుల్ రోడ్డు బెంగుళూరుసిటి
9 జూలై 1921

ప్రి మర్ —,

నీజాబువలన సంగతులన్నియు తెలిసినవి. ఇంచుకేని భయపడకు. కవిరాజుగారియొద్ద నీవు వైద్యము చేయించుకొనుచుండుట మంచిదే. సకాలముననే వైద్యము ప్రారంభింపబడినట్లుగా, కవిరాజుగారివలన తెలియనైనది. నీది నయముకాదగిన జబ్బే అని ఆయన స్పష్టపఱచినారు.

పూర్వజన్మమునుండి సంక్రమించిన కారణమేదేనియున్నచో, గురుదేవుననుగ్రహముచే

అది రూపు మాసిపోయినది. దేనిని గుఱించియు భయపడకు, నీకు వ్యాధి నయమగును. నీవు మఠమున నున్నావు. అది గురుదేవునిచోటు. కల్కత్తాలో సమర్థులైన వైద్యులున్నారు. వైద్యమేమో ఆరంభింపబడినది. కావున గురుదేవనుగ్రహముచే నీవు క్రమముగా తేరుకొందువు. మహారాజు (శ్రీ బ్రహ్మానంద స్వామి) వారితో నేను సకలవిషయములను దెల్పుచున్నాను. చక్కని వైద్యము చేతను గురుదేవ ననుగ్రహముచేతను నీకు వ్యాధి నయమగునని ఆయన వాక్రుచ్చెను. ఆందోళన పడవలసిన విషయమే లేదు. ప్రతియొక్కరును నిన్ను విచారించుకొందురు, నిన్ను ఏవగించుకొనువారును నిరాదరించువారును ఎవ్వరు నుండరు. గురుదేవునికృపచే జరూరైన సకల వస్తువులును సమకూర్చబడును. శరత్తుమహారాజు (శ్రీ శారదానందస్వామి) కావలసిన అన్ని యేర్పాట్లను చేయుచున్నాడు, చేయగలడు. ఏవిధముచేతగాని విషాదము నొందకు. నిబ్బరమైన చిత్తముతో ధ్యానజపముల గావించుచుండుము. కవిరాజు విధించిన మందులను సేవించుటలో పథ్యమును పాటించుటలో జాగ్రత్తగలిగియుండుము. ఏమేని యిబ్బంది గల్గిన శరత్తుమహారాజుకు తెలుపు. మఠములో అందఱికిని నీయందు ప్రేమ కలదని గుర్తింతువు కాక, వ్యాధి నీకు తప్పక నయమగును. నీలో నున్న భగవద్భక్తి జ్ఞానము వివేకము వైరాగ్యము కౌశలము మున్నగు సుగుణము లేవియు వ్యర్థములు కాజాలవు, చెడిపోవు. భవిష్యత్తును గూర్చి యెట్టి యాందోళనము చెందకు. మా మాటలు జ్ఞప్తిలో ఉంచుకో. మాతృదేవి యనుగ్రహమును మా ప్రేమయు-ఇవి యెన్నటికిని రిత్తవోవనువిషయమును గట్టిగా నమ్ము. శరీర వ్యాధులకు ప్రతివాడును లోనగుచుండును వాడు సాధువు కానీ! సంసారి కానీ. అప్పుడప్పుడు సాధువులకు కుదుర్పశక్యము కాని తీవ్రవ్యాధులు పైకొనుచుండును కాని అందుగూర్చి కలవరపడ నవసరమే లేదు. సంతోషముతోను ఆశతోను ధ్యానజపాదితపస్సాధనలను సాగించుచు నుండునకు నదు, ఈ జన్మలోనే పరభక్తి పరజ్ఞానములు నీకు తప్పక లభింపగలవు. ఇంకను నీకేమి వ్రాయుదును? మాతృశ్రీయు శ్రీగురుమహారాజును నిన్ను కాపాడుచున్నారు. మేమందఱము నిన్ను విచారించుకొనుచున్నాము. కాబట్టి నీవు దేనికిని భయపడనక్కఱలేదు. నీభక్తిశ్రద్ధలకు సేగియుండదు. అవి నూఱింతలుగా వేయింతలుగా వర్ధిల్లగలవు. నీవ్యాధియు నయముకాగలదు.

నీ శ్రేయోభిలాషి

శివానంద

అనుబంధము: గురుదేవుడు భక్తులకు శ్రేయ మొనగూర్చుపద్ధతులు మానవుల మనస్సులకు దుర్గ్రాహ్యములు. నీకు తప్పక మేలు కలుగును. మా హృదయపూర్వక ప్రేమాశీస్సులను మఠములో అందఱికి నందజేయుము. గురుదేవనుగ్రహమున మాకు కుశలమే.

# అల్లుని విద్యాహీనతను బయల్పఱచిన 'నవరాత్రి'

## శ్రీమత్కాంచి ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్యస్వామి

ఒకానొక సంస్కృత పండితునికి గారాబు కుమార్తె యొక్కతె యుండెను. ఆమెను చక్కగా సంస్కృతము చదువుకొన్న వరునకిచ్చి వివాహము చేయ గోరి అట్టివరునికై తండ్రి అన్వేషించుచుండెను. పొరుగూరిలో సంస్కృత పాఠశాలలో నొక విద్యార్థి సాహిత్యము చదువుచుండెను. కాని అతనికి చదువు వెక్కలేదు. అతనితండ్రి "అతను మహాసంస్కృతపండితుడని అసత్యము చెప్పి పైని చెప్పిన మామగారిని ఒప్పించుకొని పెండ్లి జరిపించుకొన్నాడు. తన అల్లుడు నిజముగ గొప్పపండితుడని యీ మామ గారు తలంచి సంతోషించెను. ఇట్లుండగా నవ రాత్రి మహోత్సవములు వచ్చినవి. మహానవమి నాడు సరస్వతీపూజ చేయుట వాడుక గదా. ఆపండుగకు రావలసిన దని మామగారు అల్లు నాహ్వానించియుండెను. ఆహ్వాన పాఠము దినములకు ముందే చేరినది. కావున తండ్రికి గొప్పచిక్కు వచ్చినది. సరస్వతీపూజాదినమున పుస్తకాల నన్నిటిని తీసి పరిష్కరించి కట్టి పూజించుట యాచారము గదా. ఆ సమయ మున తన కుమారు నచ్చటికి పంపినచో పుస్త కాలప్రసంగమువచ్చి, ఇతని నిరక్షరాస్యత బయటబడి, మామ, దుఃఖించునే. ఇక నేమి చేసిన బాగుండును?—అని మిగుల వగచెను. తుద కొకతీర్మానము చేసికొనెను—"పుత్రునికి సంస్కృతమున కొన్నిమాటలను ఐదారు దినా లలో కఱపి మామగారింటికి పంపవలసినది" అని నిశ్చయించుకొనెను. అట్లే 'పండుగకు కుమారుని పంపెద' నని వియ్యంకునకు జాబు వ్రాసివేసెను. నాటినుండి కుమారునికి పాఠము నేర్ప నారంభించెను. "అబ్బాయీ, సరస్వతీ పూజనాడు మీమామగారు తాళపత్రగ్రంథ ములను ఒక్కొక్కటిగా తీసి దుమ్ము దులిపి, మరల కట్టలు కట్టి పెట్టుచుందురు. అప్పుడు నీ వేమియు పల్కక ఊరకుండిన బాగుండదు. కావున నేను నీకు సంస్కృతమున కొన్ని మాటలు నేర్పెదను. ఈ మాటలను నాల్గు దినములలో వల్లించి కంఠపాఠము చేసికొని అచ్చట ఉపయోగపఱచుకో" అన్నాడు తండ్రి. కుమారుడు సరే అన్నాడు. తండ్రి పాఠము నేర్పినాడు. ఏమనగా:

మీమామగారు ఒక తాటాకుగ్రంథమును కట్టవిప్పినప్పుడు నీవు "కోయం గ్రన్థః" "ఇది ఏమిగ్రంథము" అని అడుగు. ఆయన "భాష్య గ్రన్థః" అనియో భగవద్విషయగ్రన్థః" అనియో బదులు చెప్పును. వెంటనే నీవు "ఇదం మయా అధీతమ్" "ఇది నేను చదివిన గ్రంథమే" అని చెప్పవలసినది. ఆయన నిన్ను పరీక్షించునేమో అని భయపడకు. అల్లుడవు కాబట్టి మర్యాద మీఱి పరీక్షింపబోడు. మరల ఆయన మఱొకగ్రంథముకట్టవిప్పును. అప్పుడు నీవు "కోయం గ్రన్థః" "ఇదేమి గ్రంథము" అని అడుగు. గ్రంథనామము నాయన చెప్పును. వెంటనే నీవు "ఇద మపి మయా అధీతమ్" "ఇదియు నేను చదివిన గ్రంథమే" అని చెప్పుము. ఇట్లే అడుగుచు చెప్పించుకొనుచు ఉండి గౌరవముతో వచ్చి యిల్లు చేరుదువు గాక" అని బోధించి "కోయంగ్రన్థః" "ఇదం మయా అధీతమ్" "ఇద మపి మయా అధీతమ్" అను ఈమూడువాక్యాలను నాలుగైదుదినములు వల్లింపజేసి, కుమారుని మహానవమినాడు మామగారింటి కంపెను.

దారిపొడుగునను ఆమూడు వాక్యాలను వల్లించుచు మనఃపాఠము చేయుచు పోయి చేరి

నాడు. తండ్రి చెప్పియుండినట్లే, అక్కడ మామ గారు ప్రొద్దున తొమ్మిది గంటలకు తాళపత్ర గ్రంథాల నన్నిటిని శోధింప నారంభించెను. ఒకకుర్చీ వేసి దానిమీద అల్లుని కూర్చుండ బెట్టెను. ఆయన ఒకతాటాకు గ్రంథపుకట్ట విప్పగానే అల్లుడు గంభీరముగా "కోయం గ్రన్థః" అని అడిగినాడు. ఆనందముతో మామ గారు "అయం ప్రౌఢమనోరమా గ్రన్థః" "ఈ గ్రంథము ప్రౌఢమనోరమ" అని చెప్పెను. వెంటనే అల్లుడు "ఇదం మయా అధీతమ్" "ఈగ్రంథము నేను చదివినదే" అనెను. మామగారి సంతోష మింతంత కాదు. తరువాత మామగారు మతొక పుస్తకపుకట్టను విప్పినప్పుడు మునుపటివలెనే అల్లుడు "కోయం గ్రన్థః" అని అడిగెను. "అయం ప్రామాణ్య వాదగ్రన్థః" "ఇది ప్రామాణ్యవాదగ్రంథ" మని మామ బదులు చెప్పెను. అందుకు అల్లుడు "ఇదమపి మయా అధీతమ్" "ఇదియు నేను చదివినగ్రంథ మే" అనెను. ఇట్లు ప్రశ్నోత్తరాలు సాగుచువచ్చినవి. ఇకమీద ఏమైన వ్రాసికొనుటకై సిద్ధపఱచి యుంచుకొన్న ఖాళీపత్రాల కట్టను మామ విప్పినాడు. అప్పు డల్లుడు ఇంత సేపును అడుగుచుండినట్లే "కోయం గ్రన్థః" అని అడిగినాడు. "అయం అలేఖగ్రన్థః" "ఇది ఖాళీ కాగితాల కట్ట" అన్నాడు మామ. "ప్రౌఢమనోరమ" "ప్రామాణ్యవాదమ్" మున్నగువానివలె ఇదియు ఒకశాస్త్రగ్రంథ మనుకొన్న అల్లుడు "ఇదమపి మయా అధీతమ్" అన్నాడు. వట్టికాగితాలనుకూడ చదివినాడట! ఈమాట విన్న మామగారికి శోకము భరింపరాకుండెను. అల్లుని చదువుపస బయట పడినది. తర్వాత ఏమి జరిగెనో దానిని కూడ వ్రాయవలెనా?

# విశ్వగుణాదర్శము

## శ్రీ రంగనాథానందస్వామి

[గతసంచిక తరువాయి]

ప్రశ్న—అహంకరింపక, ఏదో కనికరించుచున్నా మను భావము లేక, భారతదేశమును పాశ్చాత్యదేశాలును పరస్పరము తోడ్పడగల మార్గము లేవి?

జవాబు—క్రిందటి శతాబ్దాంతమప్పుడు అవిచ్ఛిన్నముగా సాగుచుండగలట్లుగా శ్రీ వివేకానందస్వామి ప్రారంభించిన మహాకార్యమిందే. ప్రపంచములో ఎవరిసంస్కృతియు సమగ్ర మైనది కా దనెడి పాఠమును భారతదేశమునకు తొలుత కఱపినది ఆయనయే. ప్రతిసంస్కృతియు – సంస్కృతిమార్గమున – పరిశీలనార్హమగు నొక ప్రయోగమే (ఎక్స్పెర్మెంటు). ఒకరొకరినుండి పాఠములు నేర్చుకొనుటే అందుగలఉద్దేశము. భారతీయసంస్కృతి ఎన్నో విషయములలో చాల గొప్పదే అయినను, అది సమగ్రము కాదని స్వామిజి భారతదేశమునకు చెప్పెను. దాని పరిమితులు దానికున్నవి. అది కొన్నిరంగాలలో ప్రత్యేకశ్రద్ధ

వహించును. ప్రత్యేకశ్రద్ధ జీవితరంగాలు కొన్నింటిలో నుండుట యనగా మఱికొన్నింటిలో లేకుండుటే కదా. ఆంతరజీవితమున మాత్రమే ప్రత్యేకశ్రద్ధ వహించిన దోషము వలని నష్టమును భారతదేశ మెంతగానో అనుభవించినది. మన బాహ్యజీవితమత్యంతము ఉపేక్షకు గుఱియైనది. నవ్యభారతదేశసమస్యలన్నియు ముఖ్యముగా మానవుని బాహ్యజీవిత సమస్యలే. పాశ్చాత్యదేశాలలో పరిస్థితి ఇందుకు విపరీతము. అచ్చట ఉపేక్షకు గుఱియైనది వారి ఆంతరజీవితము వారి బాహ్యజీవితము సర్వసంపన్నమైనది.

పెక్కు ప్రశ్నోత్తరాల సందర్భాలలో ఈ విషయము ప్రస్తావనకు వచ్చినది. "భారతదేశములో మీసమస్యలు మీకు మాత్రము లేకున్నవా, స్వామి" అని వారడిగెడివారు అందుకు నేను చెప్పిన జవాబు. "అవును తీవ్ర సమస్యలే ఉన్నవి మాకు; కాని మీ సమస్యలకును భారతదేశములోని మా సమస్యలకును గల భేద మిది—మా కొక ఆత్మ ఉన్నది, పవిత్రమైన ఆత్మ ప్రబలమైన ఆత్మ. దాని నావిష్కరింపసమర్థమైన రోగరహితమైన చక్కని దేహమునకై మేము వెదకుచున్నాము, మునుపటి మా దేహము అనంతమైన భారతాత్మను ఆవిష్కరింప నసమర్థమై దుర్బలమై యున్నది. కావున ఆరోగ్యవంతమును బలవంతమునగు దేహమును పెంపొందించుకొన మేము ప్రయత్నించుచున్నాము. పాశ్చాత్యులరైన మీకు చక్కని దేహ మున్నది. మీరు ఆత్మకై అన్వేషించుచున్నారు. దేహమును సంపాదించుకొనుటకంటె ఆత్మను సంపాదించుకొనుట కష్టతరము కదా" అని నే నడుగగా వారు ఔననిరి.

ఆత్మాన్వేషణ సమస్యను పరిష్కరించుకొనుటకంటె దేహాన్వేషణసమస్యను పరిష్కరించుకొనుట సులభతరము. ఆర్థికాభివృద్ధికి కావలసిన పారిశ్రామికశక్తిని రెండుతరాల (జెనరేషన్సు) కాలములో మనము నిర్మించుకోగలము. అందులో వింత యేమియు లేదు. పాశ్చాత్యుల సాయ మున్నది. ప్రాక్ప్రతీచీ దేశాలలో మానవుని యీ పరిస్థితిని గుర్తించి శ్రీ వివేకానందస్వామి భారతీయులతో నిట్లనెను—"మీకు నిత్యమైన ఆత్మ ఉన్నది. దానికొరకు చక్కని దేహమును సమకూర్చుడు. మానవత్వోదాత్తతపై ఊనిక నుంపుడు. జాతిమతాలను జూడకుడు. అవకాశము లనంతములుగా నున్నవి. అవి ఆవిష్కృతము లగును గాక. అప్పుడు సాంఘికార్థికాద్యభివృద్ధులు అన్నియు గల్గును." భారతదేశమునకు స్వామిజి యొసగిన సందేశము ఎంత యుదాత్తమైనది! ఈలాగన్నా డాయన: "దీనిని అమలుపఱచుటకు పాశ్చాత్యులను తోడ్పఱచుకొండి. వారిని శుశ్రూషింపుడు. వారు నేర్పగలదానిని వినయముతో నేర్చుకొండి. వీలయిన వారి సముత్సాహమును మీ రలవఱచుకొందురేని భారతదేశసమస్య లన్నియు పరిష్కృతము లగును." భారతదేశమునకు స్వామిజి కఱపిన గొప్పపాఠ మిది.

అమెరికావారికి స్వామిజి కావించిన యుపదేశము:—గొప్పసంఘమును మీరు రూపొందించుకొంటిరి. మీ దుఃఖమెల్ల ఆంతరము. మీ యాంతరజీవితములు శూన్యములు. ఈ రంగమున భారతదేశము మీకు సాయపడగలదు. మీ సకలాభివృద్ధులును మానవునకు ఆంతరమైన బలము నొసంగజాలక పోయినవి. భారతీయులొద్ద మీరు పాఠము నేర్చుకొండి. ఇట్లు ఆశయములయు విలువలయు పరస్పరవిని

మయము చేత మనము పెంపొందించుకొను సంస్కృతి అటు ప్రాచ్యసంస్కృతిగ నుండదు, ఇటు పాశ్చాత్యసంస్కృతిగ నుండదు. యావన్మానవసంస్కృతిగ నుండును. ప్రాచ్యమునకు పాశ్చాత్యమునకు సమానత్వము, వారి సంస్కృతులకు సమానత్వము, ఇందులో లేనివాని నందులోనుండియు అందులో లేనివాని నిందులోనుండియు కలుపుకొని ఉభయమును సుసంపన్నము గావించుకొనుట. ఈరీతిగా దేశీయ జాతీయవిభేదాలను తనలో లయింపజేసికొను మానవసంస్కృతిని రూపేర్పఱచుట—ఇదే లోకమునకు శ్రీ స్వామిజీ ప్రసాదించినది. శ్రీ స్వామి చెప్పినది ప్రాచ్యులును పాశ్చాత్యులును అందఱును నేర్చుకోదగిన పాఠము. "నీస్వరూపమును నీకు తెల్పుకో. ప్రతివానికిని వానిస్వరూపము తెలుపవలెను. నిద్రాణమై యున్న ఆత్మను మేల్కొల్పు; అది మేల్కొనురీతిని గమనించుము. ఆత్మప్రబోధము కల్గినంతనే శక్తివచ్చును, మహిమ వచ్చును; అన్ని గొప్పలును మెఱుగులును కలుగును."

ప్రాక్ప్రతీచీదేశాలలో మానవులకు గల లోటుపాట్లు ఈలాగుననే తొలగును, మానవునకు సమగ్రస్వరూపము తెలుకలోనికి తెచ్చునది వేదాంతము. వేదాంతసందేశము భారతదేశమున కెంతో అంత అమెరికాదేశమునకును అపేక్షితమే, ఇక రానున్న దశాబ్దాలలో మనములకు తేవలసిన యద్భుతాశయ మిది. ప్రాక్ప్రతీచీదేశాల పరస్పరాశయవినిమయము క్రీ. శ. 2000 సంవత్సరమప్పటికి ఎంతగనో నిర్వర్తితమై యుండును. ఏలయనగా యుద్ధానంతరసంవత్సరాలలో అది చాల చుఱుకుగ సాగుచున్నది. ఆశయములు ఇటు అటు అతి వేగముగా సంచరించుచున్నవి. ప్రజలు ప్రపంచమున అన్ని ప్రాంతములకు రాకపోకలు చేయుచున్నారు. ఈనాడు ఉన్నతవిద్య నభ్యసించుచు అమెరికాలో భారతీయవిద్యార్థులు 7000 మంది ఉన్నారు. వారు చేయుచున్న దేమి? అమెరికానుండి గ్రహింపదగిన వరిష్ఠాంశముల నెల్ల గ్రహించి వారు భారతదేశమునకు మరలి వత్తురు. కొందఱు మాత్రము అమెరికాలో ఆగిపోవువారు నున్నారు. వారు అమెరికానుండి భారతదేశమునకు వచ్చునప్పుడు స్వామిజీ ప్రస్తుతించిన కెళ్లుఱుకు అచ్చటి గ్రీకురోమక సముత్సాహం దేశమును తేజస్సం దేశమును తెత్తురు. అది భారతదేశమున కెంతయు తోడ్పడగలదు. ఇప్పటికే అది ఎంతగనో తోడ్పడుచున్నది. అమెరికనులు భారతదేశమునకు వచ్చిరా, దీనిని ఆధ్యాత్మికదృష్టితో కందురు. మన వేదాంతప్రచారకార్యక్రమము అమెరికాలో సాగుచున్నది. ఇతరసంస్థలును తమ తమ పనులను నిర్వర్తించుకొనుచున్నవి.

ఇట్లిచ్చిపుచ్చుకొనుటలు అతిధారాళముగ సాగుచున్నవి. ప్రపంచచరిత్రలో ఇది యొక ముఖ్యయుగము. మతసాంస్కృతికరంగాలలో కేటాయింపులు ప్రత్యేకతలు మాయమగును. విశ్వమానవులలో పరస్పరసంబంధములు పెంపొందగలవు. పాశ్చాత్యులబలము వారి 'విజ్ఞానశాస్త్ర' యంత్రవిద్యలే. ప్రాచ్యుల బలము వారి అంతరజీవితమును ఆధ్యాత్మికపరతయు. ఈ రెంటికి కలయిక వర్ధిల్లుచున్నది. స్వామిజీ మనయెదుట నుంచిన ఆదర్శమిదే.

ప్రశ్న—అమెరికాలో చదువుకొనుచున్న భారతీయవిద్యార్థులను గూర్చి ఇప్పుడే చెప్పితిరే. భారతదేశ సంస్కృతిసారములను వారెట్లు తెలుపుచున్నారు? ఆ తెలివిడితరము ఏపాటి? దానిని మేలొందింప చేయదగిన దేమి?

జవాబు—ఉన్న పరిస్థితి ఎంతయు దురదృష్టమే. అమెరికాలో ఉన్న భారతీయవిద్యార్థులలో అత్యధికసంఖ్యాకులును విదేశాలలో ఉద్యోగములు చేయుచున్న భారతీయులును భౌతికముగ భారతీయులే కాని మానసికముగ భారతీయులు కారు. వారిలో నున్న భారతీయత అంతస్వల్పము. వారిలో అనేకులు తమలోని యీ కొరతను పాశ్చాత్య దేశములకు పోయినపిమ్మటనే గుర్తించుచున్నారు. ఏలయనగ పాశ్చాత్యులు వీరిని ప్రశ్నలడుగుదురు. భారతదేశ సంస్కృతిని తత్త్వశాస్త్రమును గూర్చి తెలిసికొనవలె నను కోరిక పాశ్చాత్యులకు గలదు. ఆ ప్రశ్నలకు జవాబు చెప్పుటకు వలసిన సరకు అక్కడున్న భారతీయులయొద్ద బొత్తిగా లేకున్నది. తమ విద్యావిధానలోపభూయిష్ఠత అప్పుడు వీరికి గుర్తుకు వచ్చుచున్నది. మనసంస్కృతి మూలవిషయమును గూర్చిన పరిజ్ఞానము ఇంచుకైన మనకు కలిగింపనట్టిదిగా మనవిద్యావిధాన ముండుట దురదృష్టము. అమెరికా సంయుక్తరాష్ట్రములలో కొన్నిచోట్ల ఇటువంటి భారతీయయువకులను నేను జూచియున్నాను. వీరు తమ దేశమునుగూర్చి సంస్కృతినిగూర్చి శ్రోతల సహనమును గోరుచు ప్రసంగించుచుందురు. ఐనను విదేశీయుల ననుకరించుటకంటె, ఎంతయసమగ్రముగనైనను భారతీయులుగ నుండుటే శ్రేష్ఠమని వీరు గుర్తించుచున్నారు. ఆ పరిణామము జరుగుచున్నది. అందు కింకను కాలము సాగవలెను.

భారతీయసంస్కృతిని భారతీయతత్త్వశాస్త్రములగూర్చిన ఒకపాటి జ్ఞానమును విద్యార్థులకు తప్పక కలిగించునదిగా మనవిద్యావిధానముండవలయును. అన్నివివరాలు వారికి తెలియనక్కరలేదు. భారతీయసంస్కృతిలో మానవునిగూర్చిన తత్త్వశాస్త్ర మొకటి యున్నదని దాని నిగూఢార్థములు అమూల్యములై యున్నవని, ప్రపంచమునం దన్నిప్రాంతములలోను వానిని అమలునకు దెచ్చుట శ్రేయోదాయకమని, ఆధునిక విజ్ఞానశాస్త్ర యంత్రవిద్యలు అందు మనకు తోడ్పడగలవని భారతీయ సంస్కృతిలో మానవతత్త్వశాస్త్రములోని ఈ ముఖ్యవిషయములు భారతీయవిద్యార్థుల కందఱికిని తెలిసియుండవలయును. ఇవి తెలిసినమీదట విదేశములకు పోవుదురేని వారు మనదేశసందేశప్రాపకులును పాశ్చాత్యులకు సహాయులును సహచరులును కాగలరు. అట్టి పరిస్థితి ప్రస్తుతము లేదు. మన విదేశోద్యోగులు సైతము ఈ రంగమున సాధించుచున్నది అల్పాల్పమే.

ధ్యాన మది యెంతో, భక్తి దానంతె కలుగు,
భక్తి యది యెంతో, ప్రాప్తియుఁ బరఁగు నంతె,
సర్వమూలము చూపె విశ్వాస మిలను,
అమ్మకాళిపాదము లను నమృతసరసి
నోలలాడుచు నా హృది యొప్పునేని,
పూజ యేల? నివేదనల్ పుణ్యక్రతువు
లన్నియును నేల నాకింక నరసిచూడ?

శ్రీరామకృష్ణసూక్తిసుధ - పు. ౬౮.

# వార్తలు - విశేషాలు

## శ్రీరామకృష్ణాశ్రమము - రాజ్కోట
## నివేదిక 1966-1970

సమీక్షమాణకాలంలో ఈ ఆశ్రమం నిర్వ రించిన కార్యక్రమం—

కాలము క్రమము తప్పక గుడిపూజ, హారతి, ప్రార్థన, హోమము: నియతకాలము లలో ఆధ్యాత్మిక విషయిక ప్రవచనమూ జరుగుతూ వచ్చాయి. ప్రచారార్థం సన్న్యాసులు పర్యటిస్తుంచినారు.

ఆశ్రమ గ్రంథప్రచురణశాఖ ఇంతవఱకు ప్రచురించిన గ్రంథాలు పెద్దవి చిన్నవి కలిసి 65. ఘూర్జర భాషాభిజ్ఞులగు చదువరులకు ఈ గ్రంథాలెంతైనా విలువకలవి.

### వైద్యసేవ

ఈ ఆశ్రమంలో ఏనాటికానాడు వచ్చిపోవు రోగులకు ఆయుర్వేద హోమ్యోపతి విధానాలలో ఉచితవైద్యం చేయబడుతుంది. వైద్యం చేయించుకొన్న పేదప్రజల సంఖ్య దాదాపు 65,000.

### విద్యార్థిమందిరం

ఇందు గురుకులవిధానం అనుసరింపబడుతుంది. జాతి వర్ణ మత విచక్షణ లేకుండా బాలురు చేర్చుకోబడుతారు. అందధిక సంఖ్యాకులు పల్లెకుట్రవాండ్రు. వారి భౌతిక వైజ్ఞానిక నైతికాధ్యాత్మికాభివృద్ధికి ఆవశ్యకములైన మెలకువలన్నీ వహింపబడతాయి, ఎందుకుగాని ఇతరులపై ఆధారపడకుండడములోను నియమబద్ధులుగా ఉండడములోను బాలురిక్కడ సుశిక్షితులౌతారు, ప్రతిభావంతులగు కొందఱు పేదవిద్యార్థులకు భోజనాదులు పూర్తిగానో కొంతవఱకో ఉచితంగా సమకూర్చబడుతాయి, కులమతాదులు పాటించక ప్రతిభనుమాత్రమే గుర్తించి విద్యార్థి వేతనాలు ఒసంగబడ్డాయి. ఉన్న విద్యార్థుల మొత్తం సంఖ్య 80. 1969-70 లో ఎస్. ఎస్. సి. పరీక్షకు కూర్చున్న విద్యార్థుల సంఖ్య 9. పరీక్షలో అందఱూ నెగ్గారు. ఏడుగురు మొదటి తరగతిలో నెగ్గారు.

### ఉచితగ్రంథాలయ పత్రికాపఠనాలయాలు

గ్రంథాలయంలో 16,895 గ్రంథాలున్నూ దినపత్రికలు మాసపత్రికలు మున్నగునవి 121 న్నీ ఉండినాయి. ప్రజలకోరికపై మహిళలకు ప్రత్యేక పఠనాలయం ఏర్పఱుపబడింది. ప్రాంతీయశిశువులకై ముచ్చటైన శిశుశాఖయు ఉన్నది. గ్రంథాలయంలో ఒకభాగంలో విలువగల నిఘంటువులు మున్నగు ప్రమాణగ్రంథాలున్నాయి.

శ్రీ వివేకానందస్వాముల శతవార్షికోత్సవ జ్ఞాపకార్థంగా రాష్ట్రమందలి స్కూళ్ళ కాలేల విశ్వవిద్యాలయాల విద్యార్థులకు జరపబడిన వ్యాసరచనపోటి పరిగణనార్హమైన విశేషం, నైతిక పారమార్థికపు విలువలను విద్యార్థుల గుర్తుకు తెప్పించేందుకు వక్తృత్వపు పోటీలు గూడా నిర్వర్తింపబడినాయి, స్పృహణీయములైన బహుమతు లొసంగబడినాయి.

ఇటీవల ఆస్సాములోని వఱదబాధితులకై ఉత్తరప్రదేశ బీహారు బెంగాలులలో అనావృష్టి క్షామబాధితులకై నెఱవేర్పబడిన సాహాయ్య కార్యక్రమంలో ఈ ఆశ్రమంవారు పాల్గొన్నారు. సూరత్తులో వఱదబాధితులకై సాగింపబడుతుండిన సాహాయ్యకార్యక్రమం ఇప్పుడిప్పుడే పరిసమాప్తి నొందుతున్నది.

## శ్రీరామకృష్ణమఠం, మద్రాసు-4.
## శ్రీకృష్ణజయంతి

13-8-1971 తేది శుక్రవారంనాడు శ్రీకృష్ణ జయంతి మహోత్సవం కొనియాడబడింది. ప్రొద్దున గుడిలో శ్రీభగవద్గీత సమగ్రంగా పారాయణం చేయబడింది. సాయంకాలం 7-30 గంటలకు శ్రీశుకబ్రహ్మం రామస్వామిశాస్త్రి గారు శ్రీమద్భాగవతమున శ్రీకృష్ణావతార ఘట్టము నుపన్యసించారు. 9 గంటలనుండి నడి రాత్రివఱకు శ్రీకృష్ణపూజ సాగింది. పూజ జరుగుతున్నంతసేపు భజన సంకీర్తనమున్నూ జరిగింది. పూజానంతరం భక్తులకు ప్రసాదం పంచిపెట్టబడింది

ఆగస్టు తే 15 ది భానువారంనాడు బహిరంగోత్సవానికి ఏర్పాటైనాయి. విష్ణుసహస్రనామ స్తోత్రం అనుసంధించారు. మఱికొంత భక్తగానం అయిన తర్వాత, శ్రీమత్పరమాత్మానందస్వామి శ్రీకృష్ణావతార ప్రయోజనమునుగూర్చి తమిళంలో ఉపన్యసించారు. ధర్మమంటే ఏమో, శాస్త్రమంటే ఏమో, ధర్మోద్ధరణ సంస్థాపనాలకు, ఆధ్యాత్మికపరతను వ్యాపింపజేసేందుకు, దివ్యావతారా లేలాగు సాధకాలైనవో - స్వామి వివరించారు. శ్రీకృష్ణుడు అంశావతారం కాదు పూర్ణావతారం. సాధుపరిత్రాణ దుష్టవినాశన ధర్మసంస్థాపనములు ఆయన యవతారప్రయోజనములు. ఆర్తుడు జిజ్ఞాసువు అర్థార్థి జ్ఞాని అనెడి నాలుగు వర్గాలవారిలో భగవంతునకు అత్యంతప్రియుడు జ్ఞానియే. చేతనులకు ఉపాయమును ఉపేయమును భగవంతుడే. గీతలో భగవంతుడు పరమోదాత్త సత్యాలనుగూర్చిన ప్రగాఢరహస్యాలను బోధించాడు. 'న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కిఞ్చన; నానవాప్త మవాప్తవ్యం, వర్త ఏవ చ కర్మణి.' 'నాకు మూడులోకాలలో చేయవలసిం దేమీ లేదు. ఇంతవఱకు లభింపనిదియు ఇక సంపాదించుకోవలసినదియు నాకు ఏమియు లేదు. అయినను కర్మమును జేయుచునే యున్నాను.' 'యది హ్యహం న వర్తేయం జాతు కర్మ ణ్యతన్ద్రిత, మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః' 'ఏల యనగా, అర్జునా నేను చుఱుకుగలిగి కర్మానుష్ఠానము నొనర్పకయుందునేని; మనుష్యు లందఱు నా మార్గాన్నే అనుసరిస్తారు'-అన్నాడు శ్రీకృష్ణుడు.

డాక్టరు పి. నాగరాజరావుగారు తమ ఆంగ్లోపన్యాసంలో ఇట్లన్నారు. ఉదాత్తజీవిత విధానమును మానవతతికి కఱపేందుకే అవతారమూర్తులు ఆవిర్భవిస్తుంటారు. రక్కసులను ప్రక్కలించడంమాత్రమే కాదు, మానవులలో ఒక పరిణతిని తీసుకురావడంకూడ భగవదవతార ప్రయోజనమే. మహాభారతంలో లేని విషయం వేఱెందులోను ఉండదు. అందులో అంతర్భాగం భగవద్గీత. శ్రీకృష్ణుని సందేశమే భగవద్గీత. అందు పవిత్రత ప్రామాణికత రెండూ ఉన్నాయి. అదొక విశ్వశాస్త్ర సారస్వతం, ఆధ్యాత్మికపరతను అమోఘంగా అలవఱచేది. ఆధ్యాత్మికవిషయాల కది నిఘంటుస్థానీయం. శ్రీతిలక్కు — గాంధి — అరవింద ప్రముఖ మహాశయులు నిర్వృతికి ప్రబోధానికి భగవద్గీతనే ఆశ్రయించారు. అందలి 'సమన్వయ ప్రవణత'యే దాని ప్రత్యేకత. అది మనకు జ్యోతిని జీవమును ప్రసాదించే గ్రంథం, ఏ అంతస్తులో ఉండేవారికి ఆ అంతస్తుకే అందుబాటవుతుంటుంది. పరమార్థనిష్ఠ అనేది కేవలం ఆచారంకాదని, అదొక శక్తి అని భగవద్గీతాధ్యేతలు అతిసులభంగా గుర్తింపగలుగుతారు. అర్జునుడు సర్వమానవాళికి ప్రతినిధి. అతనికి ఉపదిష్టములు కావడం మూలాన విధినిషేధాలు విశ్వమంతటికీ ఉపదిష్టము లయ్యాయి. భగవ

ద్గీతలో నారాయణునుంచి నరుడు తెలిసికొన్న పాఠాలు :—కోరవలసింది కర్మత్యాగం కాదు, సంగత్యాగం; ఫలాపేక్షయూ కర్తృత్వాహంకారమునూ విడిచి, కర్మ ననుష్ఠించాలి. ఏకర్మనుగాని వీడరాదు, దాన్ని భగవదర్పితంగా చేయాలి. స్వధర్మం అపరిహార్యం.'

సభాధ్యక్ష్యం వహించిన శ్రీమత్తపస్యానందస్వాములవారి ఉపన్యాస సంక్షేపం— శ్రీకృష్ణుని బృందావనలీలకు నిగూఢమైన పరమార్థముంది. శాంత-దాస్య-సఖ్య-వాత్సల్య - మధుర భావాలలో ఎందులో అధ్యవసాయం కుదిరినా, పరమలక్ష్యానికి సాధనమే. భక్తిఅనేది ఒకనిధానం. భక్తునకు భగవంతుని శక్తిసామర్థ్యాలు లక్ష్యాలుకావు, భక్తుని ప్రేమకు భగవంతుడే లక్ష్యం. అక్రూర యశోద ప్రహ్లాద గోపవనితాదులలో భక్తి బహురూపముల వెలుగొందింది. శ్రీకృష్ణుడొక్కడే పురుషోత్తముడని 'స్త్రీప్రాయ మితరం జగత్' అని భక్తుని భావం, భక్తికి అత్యుచ్చమైన పరిపాకము కలిగినప్పుడు భక్తునకు తదనుగుణమైన రూపాంతరం సిద్ధిస్తుంది. శ్రీకృష్ణుని మురళీనాదసమాకృష్టలై గోపికలతనిని జేరి విహరించుచున్నంతసేపు వారి భౌతిక దేహాలు వారివారి గృహములలోనే ఉండినవట. శ్రీకృష్ణుడు మాయాధీశుడే గాని మాయాధీనుడు కాడనుటను జ్ఞప్తియందుంచుకొని ఆయన లీలలను పరామర్శించాలి. ఆయనకు అసాధ్యమంటూ ఏదీ లేదు.'

ప్రొఫెసరు సి. ఎస్. రామకృష్ణనుగారి వందనోపచారంతో నాటి సభాకార్యక్రమం ముగిసింది.

# గ్ర పరిచయం

## దృక్కోణాలు

రచయిత : శ్రీ మిట్టపల్లి రామనాథంగారు
ప్రచురణకర్తలు : సరళా పబ్లికేషన్సు, బోసు రోడ్డు, తెనాలి. పుటలు 64 వెల రూపాయి.

ఇదొక వ్యాసదశకసంపుటి. ఇందు పరతత్త్వ నిరాకారత-సాకారపూజావశ్యకత - ఏకేశ్వర ప్రాముఖ్యం, విగ్రహారాధనావశ్యకత, ఫలసంగరహిత కర్మానుష్ఠానము-పునర్జన్మసిద్ధాంతము మొదలయిన విషయాల చర్చ సవినయ నిరాడంబరరీతిలో సాగింది. ఎప్పుడో వ్రాసిపెట్టుకొని మరెప్పుడో ప్రకటితములైన వీనిలో భావకు కృతకరూపురేఖలను దిద్దేపనికి రచయిత పూనుకోనందువల్ల గనిలోని బంగారపు విలువవంటి విలువగల యీ చిఱుతగ్రంథానికి స్వాగతం.

## సత్యజ్ఞానం

రచయిత : కాలెపు బాలసుబ్రహ్మణ్యము ప్రాప్తిస్థానం-హిందూ తాత్త్వికపరిషత్తు, గండిపేట. హైదరాబాదు-3. పుటలు 32 వెల లేదు.

దాదాపు పుటకొక శీర్షిక ప్రకారం అమర్చి, విషయప్రకీర్ణకతచేతను. సంక్షేప మాధుర్యాల చేతను చదువరులకు ఆసక్తి గొలిపి, అత్యచిర కాలంలోనే మూడు ముద్రణములు వొరసిన ధర్మాధ్యాత్మిక జ్ఞాన సంభృతమగు ఈ వ్యాస సంపుటికి మా అభినందనములు.

ప్రభాకర్.

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారి యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు　　రెండవ కూర్పు　　వెల : రూ. 4-00

నూతన ముద్రణము !　　ఇప్పుడే వెలువడినది !

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయ భాగము-రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)　　ఆఱవ కూర్పు　　వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

సంపాదకులు : శ్రీ హిరణ్మయానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ బోధస్వరూపానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

శ్రీ వివేకానందస్వామి శతతమ జయంతి ప్రచురణములు

ఆంధ్ర పాఠకులకు అమూల్య తరుణము

# శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి

ప్రతిభోజ్జ్వలులైన ఆంధ్రపండితులచే ఆంధ్రీకరింపబడి 10 సంపుటాలుగా ప్రకటింపబడి ఉన్నాయి. ప్రతి సంపుటంలోను దాదాపు 500 పుటలు.

ఖరీదు: అట్టబైండు సెట్టు రు. 51-50 లు. క్యాలికోబైండు సెట్టు రు. 65-00 లు.

పోస్టేజి ప్రత్యేకం.

స్వామిజీసందేశం మాతృదేశభక్తిభరితం, ప్రాణప్రదం, ఆత్మోత్తేజకరం, విశ్వజనీనం. అది సమగ్రంగా ఆంధ్రమహాజనులకు అందడం ఇదే మొదటిసారి. స్వామిజీది దివ్యదృష్టి. ఆయన అమోఘ పరిష్కారవిధానం సూచింపని ముఖ్యసమస్య అంటూ లేదు. ఆయన గ్రంథావళిని చదివినవారికి ఉత్సాహమును ఉదాత్తతయున్నూ కలుగక తప్పదు.

పది సంపుటాలూ విక్రయానికి సిద్ధంగా ఉన్నాయి.

ఒక్కొక్క సంపుటం:

అటబెండు రూ. 5-00 క్యాలికో రూ. 6-50

(పోస్టేజి ప్రత్యేకము)

* ఆయిదవ సంపుటము క్యాలికో మాత్రమే కలదు.

ఇట్లు వ్రాయుడు:

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 4.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౮ ౧౯౭౧ - నవంబరు : విరోధికృత్తు - కార్తీకము సంచిక ౭

## విషయసూచిక

ఫోన్ : 71231 పోస్టు బాక్సు : 635

మా మాసపత్రికలు

# వేదాంతకేసరి

తత్త్వశాస్త్ర - మత - సంస్కృతివిషయికంగా 1914-వ సంవత్సరంనుండి నడపబడుతుండే ఆంగ్ల మాసపత్రిక

సాలు చందా : ఇండియాలోను, సింహళంలోను 6 రూపాయలు; ఇతర విదేశాలలో 3 డాలర్లు, లేదా 14 షిల్లింగులు.

# శ్రీ రామకృష్ణ విజయం

మత - సాంస్కృతికవిషయికంగా 1921-వ సంవత్సరమునుండి ప్రచురింపబడుతున్న తమిళ మాసపత్రిక

సాలు చందా : ఇండియాలో ర్పూ 5 లు, సింహళములో ర్పూ 7 లు.

# శ్రీ రామకృష్ణ ప్రభ

1944-వ సంవత్సరంనుండి ప్రచురింపబడుతూ విశ్వోపజీవ్యమైన ఆధ్యాత్మిక విజ్ఞానామృతమును వెదజల్లే తెలుగు మాసపత్రిక

సాలు చందా : ఇండియాలో ర్పూ 5 లు, సింహళములో ర్పూ 7 లు.

1. చందాదారులు ఉత్తరప్రత్యుత్తరాలలో తమ 'చందాదారు సంఖ్య' నుదాహరిస్తూ విలాసాలను స్పష్టంగా వ్రాయాలి.
2. పత్రిక అందకపోతే మాసాంతానికి మాకు తెలుపాలి.
3. చందాదారులకు మేము ప్రచురించిన గ్రంథాలను $6\frac{1}{4}$% తగ్గింపు ధరలకు అందజేస్తాం. వివరాలకు క్రింది విలాసానికి వ్రాయండి.
4. ప్రముఖ సంస్కృతి కేంద్రాలలో ప్రచారంలో ఉన్న యీ ఆధ్యాత్మిక విజ్ఞాన పత్రికలు అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకాలు. రేట్లకు వ్రాయండి.
5. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపవలసినదని గ్రంథకర్తలకు ప్రకాశకులకు మా ప్రార్థన.
6. ప్రజారంజకములైన మత - తత్త్వశాస్త్ర - సంస్కృతివిషయిక స్వతంత్ర వ్యాసాలను రచయితలు అందజేస్తే సంపాదకులు కన్నుల కద్దుకొని ప్రచురిస్తారు.
7. పత్రిక స్పెసిమెన్కాపి కోరేవారు 75 పైసల పోస్టేజి పంపాలి.

ఇంకా వివరాలు కావలసినవారు :

## మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠం, మైలాపూరు, మద్రాసు-4

అనే విలాసానికి వ్రాయండి.

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హక్స్లి) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేక ప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్వైతసగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.' (సన్డే స్టాన్డర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి: 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

590+158 పుటలు వెల: రూ. 7-50

# ప్రబోధరత్నాకరము

అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు

శ్రీ వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

232 పుటలు మూడవ కూర్పు వెల: 2-50

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4




'అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనికృప నీకు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౮ } ౧౯౭౧ – నవంబరు : : – కార్తీకము { సంచిక ౫

శ్రీః

## వివేకచూడామణి

మూలము : శ్రీ శంకర భగవత్పాదులు

వ్యాఖ్యాత : అన్నమాచార్య

తత్త్వం పదాభ్యా మభిధీయమానయోర్బ్రహ్మాత్మనో శోధితయోర్యదీత్థమ్
శ్రుత్యా తయో స్తత్త్వమసీతి సమ్య గేకత్వ మేవ ప్రతిపాద్యతే ముహుః. 241

ఐక్యం తయో ర్లక్షితయో ర్న వాచ్యయో ర్నిగద్యతే ఽన్యోన్యవిరుద్ధధర్మిణోః
ఖద్యోతభాన్వో రివ రాజభృత్యయోః కూపామ్బురాశ్యోః పరమాణుమేర్వోః 242

'తత్ త్వ మసి' అను మహావాక్యములో 'త్వమ్' అను పదము జీవుని, 'తత్' అను పదము బ్రహ్మమును, 'అసి' అను పదము జీవబ్రహ్మముల నైక్యమును దెల్పుచున్నవి. 'జీవ' 'బ్రహ్మము'లకు అభిధావృత్తిచే ఐక్యము కుదురదు, భేదమే స్పష్టముగ గనఁబడును. ఎట్టి భేద మనగా మిణుగురుపురుగునకును సూర్యునికిని, భృత్యునకును భూభర్తకును, కూపమునకును సముద్రమునకును, పరమాణువునకును మహా మేరుపర్వతమునకు నున్నట్టిభేదము! లక్షణావృత్తిచేత ఐక్యము సిద్ధించుచున్నది. 'తత్' 'త్వమ్' శబ్దములకు లక్ష్యార్థము 'చిన్మాత్రరూపి'. 'సోఽయం దేవదత్తః' అను వాక్యమునుబట్టి దేవదత్తైక్యమును గ్రహించినట్లు 'తత్త్వమసి' అను వాక్యమునుబట్టి బ్రహ్మైక్యమును గ్రహింపవలె ననుట. ౨౪౧, ౨౪౨

తయో ర్విరోధో ఽయ ముపాధికల్పితో న వాస్తవః కశ్చి దుపాధి రేషః
ఈశస్య మాయా మహదాదికారణం జీవస్య కార్యం శృణు పఞ్చకోశమ్. 243

జీవేశ్వరుల భేదము వాస్తవము కాదు, ఉపాధులచేత కల్పిత మైనది. ఈశ్వరున కుపాధి మాయ. మహదాదులకు కారణ మీ మాయయే. జీవున కుపాధి కోశపంచకము. ఇది మాయవలన నేర్పడునట్టిది. ౨౪౩

ఏతా వుపాధీ పరజీవయోః స్తయో స్సమ్య క్నిరాసే న పరో, న జీవః;
రాజ్యం నరేన్ద్రస్య, భటస్య ఖేటక; స్తయో రపోహే న భటో, న రాజా. 244

ఈశ్వరునకును జీవునకును ఇవి యుపాధులు. ఇవి పూర్తిగా తొలగినచో, ఈశ్వరుడును లేడు, జీవుడును లేడు. రాజునకు లక్షణము రాజ్యము, సిపాయికి లక్షణము డాలు. అవి తొలగినచో రాజును లేడు, సిపాయియు లేడు. ౨౪౪

అథాత ఆదేశ ఇతి శ్రుతి స్స్వయం నిషేధతి బ్రహ్మణి కల్పితం ద్వయమ్
శ్రుతిప్రమాణానుగృహీతబోధా త్తయో ర్నిరాసః కరణీయ ఏవ. 245

'అథాత ఆదేశో నేతి నేతి' అనెడి శ్రుతివాక్యము బ్రహ్మమునందు కల్పితమైన ద్వైతమును నిషేధించుచున్నది. మాయాకోశపంచకరూపములగు నా యుపాధులను రెంటిని శ్రుతిసమ్మతములైన యుక్తులచే త్రోసిరా జనవలయును. ౨౪౫

నేదం నేదం కల్పితత్వా న్న సత్యం రజ్జౌ దృష్ట వ్యాళవ త్స్వప్నవ చ్చ
ఇత్థం దృశ్యం సాధు యుక్త్యా వ్యపోహ్య జ్ఞేయః పశ్చా దేకభావ స్తయో ర్యః. 246

ఈశ్వరోపాధి జీవోపాధి యనెడి యీ రెండును కల్పితములైనందున త్రాడునందు కనబడు సర్పమువలెను స్వప్నమువలెను అయథార్థములే. ఈరీతిగా దృశ్యజగమును చక్కని యుక్తులచే త్రోసివేసి, పిమ్మట జీవేశ్వరుల యేకత్వమును గ్రహింపవలయును. ౨౪౬

తత స్తు తౌ లక్షణయా సులక్ష్యౌ తయో రఖణ్డైకరసత్వసిద్ధయే
నాలం జహత్యా న త థాజహత్యా కి న్తూభయార్థాత్మిక యైవ భావ్యమ్. 247

జీవేశ్వరులకు 'తత్' 'త్వం' పదముల వాచ్యార్థముచే కుదురని యఖండైక్యము, 'కేవలచిన్మాత్రు' లనెడి లక్ష్యార్థముచే సిద్ధించుచున్నది. వాచ్యార్థమును పూర్తిగా వదలను లేదు, ఒకంత వదలకయు పోలేదు. కావున ఇట జహదజహల్లక్షణావృత్తి వినియుక్తమైనది.

స దేవదత్తో య మి తీహ చైకతా విరుద్ధధర్మాంశ మపాస్య కథ్యతే
యథా తథా త త్త్వమసీతి వాక్యే విరుద్ధధర్మా నుభయత్ర హిత్వా 248

సంలక్ష్య చిన్మాత్రతయా సదాత్మనో రఖణ్డభావః పరిచీయతే బుధైః
ఏవం మహావాక్యశతేన కథ్యతే బ్రహ్మాత్మనో రైక్య మఖణ్డభావః. 249

'ఆ దేవదత్తు డిత' డని చెప్పినప్పుడు 'ఆ' 'ఇతడు' అను విరుద్ధాంశములను వదలి వ్యక్తి ఒక్కడే అనుటను గ్రహించుచున్నాము కదా. అట్లే 'తత్' 'త్వం' 'అసి' అను వాక్యమున గూడ కారణోపాధి కార్యోపాధి, ప్రత్యక్షత్వము, పరోక్షత్వము, పరిపూర్ణత్వము పరిచ్ఛిన్నత్వము లనెడి విరుద్ధధర్మములను వదిలి సచ్చిదానందస్వరూపు లనెడి లక్ష్యార్థమును స్వీకరించి బుధులు జీవేశ్వరుల యైక్యమును గ్రహించుచున్నారు. ఈవిధముగా వేదములందు నూర్లకొలదిగ నున్న మహావాక్యములు జీవబ్రహ్మల యైక్యమును దెలుపుచున్నవి. ౨౪౮, ౨౪౯

అస్థూలమిత్యేతదసన్నిరస్యసిద్ధంస్వతోవ్యోమవ దప్రతర్క్యమ్
అతో మృషామాత్ర మిదం ప్రతీతం జహీహి యత్స్వాత్మతయా గృహీతమ్
బ్రహ్మాహ మి త్యేవ విశుద్ధబుద్ధ్యా విద్ధి స్వ మాత్మాన మఖణ్డబోధమ్. 250

'అస్థూల మన ణ్వహ్రస్వ' మిత్యాది వేదవాక్యానుసారము అసత్తుల నన్నిటిని త్రోసి వేయుగా తనంతట సిద్ధించునది ఆత్మస్వరూపము. తర్కమునకు ఆకాశ మందనట్లుగా ఆత్మస్వరూపము నందదు. కావున ఆత్మగా ఇన్నాళ్లును నీవు గ్రహించుచుండిన దేహాదికము కేవలము మిథ్య అని గుర్తించి దానిని వీడుము. విశుద్ధబుద్ధితో 'బ్రహ్మమే పరిపూర్ణబోధమగు నా ఆత్మ' అని యెఱుంగుము. ౨౫౦

మృత్కార్యం సకలం ఘటాది సతతం మృన్మాత్రమే వాహితం
తద్వ త్సజ్జనితం సదాత్మక మిదం సన్మాత్రమే వాఖిలమ్
యస్మా న్నాస్తి సతః పరం కిమపి త త్సత్యం స ఆత్మా స్వయం
తస్మా త్తత్త్వ మసి ప్రశాన్త మమలం బ్రహ్మాద్వయం యత్పరమ్. 251

మట్టివలన రూపొందిన కుండ మొదలగు మున్నగున వన్నియు అంతటను ఎల్లప్పుడును మట్టియే. అట్లే సద్రూపమగు బ్రహ్మమునుండి వెలువడిన యీ సమస్తమును సద్రూపమగు బ్రహ్మమే, సన్మాత్రమే. బ్రహ్మమునకంటె వేఱైన దేదియు లేనందున, అదే ఆత్మ. అద్వితీయమును అమలమును ప్రశాంతిమును అగు ఆ పరబ్రహ్మమవే నీవు. ౨౫౧

నిద్రాకల్పిత దేశకాలవిషయజ్ఞాత్రాది సర్వం యథా
మిథ్యా, తద్వ దిహాపి జాగ్రతి జగ త్స్వాజ్ఞానకార్యత్వతః
యస్మా దేవ మిదం శరీరకరణప్రాణాహమాద్య ప్యసత్
తస్మా త్త్వ మసి ప్రశాన్త మమలం బ్రహ్మాద్వయం య త్పరమ్. 252

కలలో గననైన దేశము కాలము విషయములు జ్ఞాత మున్నగున వెల్ల అసత్యము లైనట్లే, జాగ్రద్దశలో స్వాజ్ఞానకల్పితమగు సమస్తజగము నసత్యమే. ఈ శరీరప్రాణేంద్రియాహంకారాదు లన్నియు నసత్యములే, కావున అద్వితీయమును అమలమును ప్రశాంతము నగు పరబ్రహ్మమవే నీవు. ౨౫౨

యత్ర భ్రాన్త్యా కల్పితం స ద్వివేకే త త్త న్మాత్రం నైవ తస్మా ద్విభిన్నం
స్వప్నే నష్టం స్వప్నవిశ్వం విచిత్రం స్వస్మా ద్భిన్నం కిన్ను దృష్టం ప్రబోధే. 253

ఎందు ఏది భ్రాంతిచే కల్పితమో, భ్రాంతి తొలగినంతనే ఇది దానికంటె వేఱైనది కాక అదే యగుచున్నది. స్వప్నము ముగిసి పోగానే, విచిత్రమైన స్వప్నప్రపంచమును తుడుచుకు పోగానే, మెలకువదశలో మిగులునది తానే కాని, తనకంటె వేఱైన దే మున్నది? ౨౫౩

జాతినీతికులగోత్రదూరగం నామరూపగుణదోషవర్జితమ్
దేశకాలవిషయాతివర్తి య ద్బ్రహ్మ త త్త్వమసి భావ యాత్మని. 254

జాతినీతికులగోత్రములకు దూరమైనదియు, నామరూపగుణదోషములు లేనిదియు, దేశకాలవిషయముల నతిక్రమించినదియు నగు బ్రహ్మమవే నీ వని మనసున భావింపుము.

య త్పరం సకల వాగగోచరం గోచరం విమలబోధచక్షుషః
శుద్ధచిద్ఘన మనాది వస్తు యద్ బ్రహ్మ త త్త్వ మసి భావ యాత్మని 255

వాక్కులకు గోచరింపనిదియు, విమలజ్ఞానమునకు గోచరించునదియు శుద్ధమును చిద్రూపమును అనాదివస్తువు నగు బ్రహ్మమవే నీ వని మనస్సున భావింపుము. ౨౫౫

షడ్భి రూర్మిభి రయోగి యోగిహృద్భావితం న కరణై ర్విభావితమ్
బుద్ధ్యవేద్య మనవద్య మస్తి య ద్బ్రహ్మ త త్త్వ మసి భావ యాత్మని. 256

క్షుత్తు తృష్ణ శోకము మోహము జర మరణము లనెడి కెరటములు లాఱు నంటనిదియు యోగుల హృదయములందు భావింపబడునదియు ఇంద్రియములకు గోచరింపనిదియు బుద్ధి కందనిదియు, అవద్యరహితము నగు బ్రహ్మమవే నీ వని మదిని భావింపుము. ౨౫౬

# పరమహంస దేవుని ప్రబోధవాణి

విజయుడు - మహాశయా, మన మిట్లు బద్ధులమై యుండనేల? భగవంతుడు మనకు కనిపింపకుండుటకు కారణమేమి?

శ్రీరామకృష్ణుడు - మాయ యనగా వేఱేమియుగాదు. దేహధారి కున్న యహంకారమే మాయ. అది యొక తెరవలె సమస్తమును కప్పియున్నది. అహంకారము సమసిన అన్ని యిక్కట్టులును తుదముట్టును. తాను కర్తను కా ననెడి యెఱుక మానవునకు భగవత్కృపచే నొక్కసారి కలిగిన జాలును. తత్‌క్షణమే అతడు జీవన్ముక్తు డగును. ఈ దేహముననే ఉన్నప్పటికిని, అతడు ముక్తుడే; అతని కిక భయము లేనేలేదు.

ఈ మాయ (=అహంకారము) మబ్బును బోలినది. పలుచని మబ్బుతునుక అడ్డముండినను సూర్యు డగపడడు. మబ్బు తొలగిన సూర్యు డగపడును. ఆచార్యానుగ్రహమున ఒకని కహంకార మంతరించునేని, తత్‌క్షణము అతనికి భగవత్సాక్షాత్కారము కలుగును.

సాక్షాద్భగవంతుడైన శ్రీరాముడు లక్ష్మణునకు ముందుగ రెండున్నర మూరల దూరముననే యుండెను. కాని శ్రీరాముడు లక్ష్మణున కగపడలేదు. ఏల యన ఇద్దఱికిని నడుమ సీత యుండెను. లక్ష్మణుడు జీవస్థానీయుడు, సీత మాయ. మాయ యనెడి యడ్డంకివలన మానవునకు దేవు డగపడకున్నాడు. చూడు. ఈ తుండుగుడ్డను నా మోమున కడ్డముగా నుంచుచున్నాను. నేను నీ కింత సమీపమున నున్నను అగపడకున్నాను. అట్లే అందఱికంటె మనకు సన్నిహితుడు దేవుడు. కాని మాయాచ్ఛాదనముచే ఆయన మన కగపడకున్నాడు.

జీవుడు సచ్చిదానందస్వరూపియే కాని వేఱు కాడు. మాయ (=అహంకారము) కల్పించిన వివిధోపాధులచేత అతడు ఆత్మ యాథార్థ్యమును మఱచినాడు.

ఒక్కొక్క యుపాధియు మానవుని స్వభావమును మార్పొందించును. నల్లంచు సన్నని దోవతిని కట్టుకొన్నంతనే మానవుడు నిధుబాబు వ్రాసిన ప్రేమగేయాలను ఆలపించును. చీట్లాట ఆరంభమగును, విలాసమునకై చేతి కఱ్ఱను దాల్చును. జబ్బుమనుష్యుడైనను సరే ఎత్తైన బూట్లు తొడుగునేని వెంటనే అతడు ఆంగ్లేయునివలె ఈల వేయును. ఒక మెట్టుపైనుండి పైమెట్టున కెక్కుచో గంతులిడును. చేత కలమొకటి యుండెనా, అతడు చేతి కే కాగితమందినను, దానిపై గిలుకుచుండును. అట్టిది కలము మహిమ.

ధనముకూడ నొక గొప్పయుపాధియే. ధనమబ్బినంతనే మానవునిలో ఎంత మార్పు గల్గును! అతడు మునుపటివాడు కానే కాడు. ఒక బ్రాహ్మణుడు ఈ గుడితోటకు తఱచు వచ్చుచుండెను. అతనిలో పైకి చాల వినయము కనుపట్టుచుండెను. ఒకనాడు నేనును హృదయుడును కొన్నగరుకు పోయితిమి. పడవ దిగితిమో లేదో, గంగగట్టున ఆసీనుడై యున్న ఆ బ్రాహ్మణుని జూచితిమి. మంచిగాలి అనుభవించుచున్నాడని మే మనుకొంటిమి. అతడు మావైపు జూచి ''ఓహోయి, పూజారీ, క్షేమమా'' అని నన్నడిగినాడు. నేనతని కంఠధ్వనిని గుర్తించి ''ఇతనికి కొంత ధనము లభించియుండును, కావుననే ఆలాగు మాటాడుచున్నా'' డని హృదయునితో నంటిని. హృదయుడు నవ్వినాడు.

ఒక కప్పయొద్ద నొక రూపాయి యుండెను. దాని నది తన తొఱ్ఱలో నుంచుకొనియుండెను. ఒకనాఁ డొక యేనుఁగు ఆ తొఱ్ఱ మీఁదుగా నడచుచు పోయెను. కప్ప ఆగ్రహపరవశమై వెలుపలికి వచ్చి, ఏనుఁగును కొట్టుటకుం బోలె నొక కాలి నెత్తి "నా తలమీఁదుగా నడచి పోవ నెటు సాహసించితి" వని గద్దించెను. ధనము గలిగించు గర్వము అట్టిది

మానవునకు జ్ఞానము సిద్ధించిన పిమ్మట, అహంకారమును తొలగించుకొన వీలగును. జ్ఞానము సిద్ధించిన, సమాధిదశ కలుగును. అందు అహంకారము మాయ మగును, కాని అట్టి జ్ఞానసిద్ధి దుర్లభము.

విజయుఁడు - భగవంతుని సాక్షాత్కరింకొనుట ఎటు.

శ్రీరామకృష్ణుఁడు - హృదయశుద్ధి లేకున్న భగవత్సాక్షాత్కారము గలుగదు. కామినీ కాంచనసక్తిచే చిత్తము కళంకిత మైనచో, బురదలో మునుఁగుపడినదియుం బోలె నైనది. బురదలో మునుఁగుపడిన సూదిని సూదంటురాయి ఆకర్షింప జాలదు. బురదను కడిగివేసినచో సూదంటురాయి సూది నాకర్షించును. అట్లే మనఃకాలుష్యమును కన్నీటిచే కడిగివేయనగును. అనుతాపాశ్రువులను కార్చుచు, 'దేవా, చెడ్డపని నిక నెప్పుడును చేయ' నని చెప్పుకొన్నచో ఈ కలుషము తొలగిపోవును. తర్వాత సూదిని సూదంటురాయి ఆకర్షించినట్లు భగవంతుడు భక్తుని మనస్సు నాకర్షించును. భక్తునకు సమాధిదశలో భగవత్సాక్షాత్కారము గలుగును.

నీవు వేయిసార్లు ప్రయత్నించినను, భగవత్కృప లేని యెడల దేనినిగాని సాధింపజాలవు. భగవత్కృప లేకున్న భగవత్సాక్షాత్కారము గలుగదు. భగవత్కృపను ప్రాపించుట సులభమైన పనియా? అహంకారమును పూర్తిగా విడచిపెట్టవలయును. 'కర్తను నేను' అను తలంపు చేతనున్నంతవఱకును భగవత్సాక్షాత్కారము గలుగదు. ఒక కుటుంబమున సామానుకొట్టు నొకడు తనయధీనమున నుంచుకొనియున్నాడనుకొనుము. 'ఆ గదినుండి దయచేసి నా కేమేని ఇయ్యగలవా' అని నీవు ఇంటి యజమాను నడిగితివేని "ఆ గదిలో ఒక డున్నాడుకదా? అక్కడ ఇక నేను చేయుట కేమున్నది?" అని యత డనును.

తనకు తానే ఒడయఁడు అనుకొనువాని హృదయమున దేవు డంత సులభముగ సన్నిధి చేయఁడు. భగవదనుగ్రహ మెప్పుడు గల్గునో తత్క్షణమే భగవత్సాక్షాత్కారము గలుగును. ఆయన జ్ఞానప్రభాకరుఁడు. ఆ ప్రభాకరుని కిరణ మొక్కటి జ్ఞానజ్యోతిని పఱపి జగమును వెలిగించినది. ఆ వెలుగుననే మన మొకరొకరిని చూచుకొనగలుగుచున్నాము. వివిధవిషయములను దెలిసికొనగలుగుచున్నాము. దేవుడు తన వెలుగును తన మొగమువైపునకు ద్రిప్పుకొన్ననే మనము ఆయనను దర్శింపగలము.

పోలీసుసార్జంటు రాత్రి చీకటిలో చేత నొక లాంతరు పట్టుకొని పహరా తిరుగును [ఆ లాంతరుకు మూడువైపుల నల్లద్దము లుండును] అతని మొగము ఎవరికిని అగపడదు. ఆ లాంతరు వెలుతురులో అందఱిమొగములును ఆయన కగపడుచుండును, వారును తమలో తా మొకరిమొగము నొకరు చూచుకొనగలిగి యుందురు కాని సార్జంటును చూడ గోరిన వాడు "అయ్యా, దయచేసి దీపపు వెలుతురును తమ మొగముపంకకు మరల్చుకొండు, నన్ను

మిమ్ము చూడనిండు'' అని సార్జంటును ప్రార్థింప నిమ్ము'' అని దేవుని గూడ ప్రార్థింపవలెను.
వలెను. అదేవిధముగ ''ఓ దేవా, అనుగ్ర ఇంటిలో దీపము లేకుండుట దారిద్ర్యసూచ
హింపుము, జ్ఞానదీపమును నీవైపు మరల్చు కము. కావున హృదయమున జ్ఞానదీపమును
కొమ్ము, నీవదనమండలమును నన్ను దర్శింప వెలిగించుకొనవలయును.



# పదండి ముందుకు పదండి తోసుకు

కర్మద్వారా ముక్తి పొందవలె ననిన ఫలసంగరహితముగ నిష్కామముగ కర్మము ననుష్ఠింపవలెను. అట్టి కర్మానుష్ఠానమువలన జ్ఞానము సిద్ధించును, జ్ఞానము విముక్తిని సమకూర్చును, జ్ఞానము కలుగకుండగనే కర్మమును విడిచిపెట్టినచో దుఃఖము ప్రాప్తించును. పరమాత్మకై అనుష్ఠితమైన కర్మము బంధము గలిగింపదు. సుఖమున కాశింపకు. దుఃఖమునకు వెఱవకు. ''దేహమును మనస్సునే కర్మకు కర్తలు, నేను కాను'' అని నీకు నీవు నిరంతరము తెలుపుకొనుచు ఆ పరమార్థమును సాక్షాత్కరించుకో. 'కర్మము చేయుచున్నది నేను' అను తలంపును తొలగించుకొన ప్రయత్నింపుము. ఏమి చేసినను భగవదర్పితముగ యజ్ఞవిశేషముగ చేయుము. నీట నుండియు నీరంటని తామరాకువలె, లోకమున నుండుము కాని, ఐహికములందు సక్తుడవు కాకుము ... నీ ప్రేమ నందరికిని జెందింపుము, వారు నీ కేమయిన చేయనీ! గ్రుడ్డివానికి రంగు కనిపింపదు, అట్లే దోషము మనయందుండనిదే ఒరులందు కనిపింపదు. మనలో మనము చూచుదానితో వెలుపల మనకు కనిపించుదానిని పోల్చుకొని తదనుగుణముగా గుణదోషముల నుద్ఘాటించుచుందుము. మనము పవిత్రుల మైనచో, అపవిత్రత మనకు గోచరింపదు. అపవిత్రత ఉండవచ్చును కాని, మన కది విషయము కాదు. ప్రతినరునందును నారియందును శిశువునందు నున్న దేవునే నీవు సాక్షాత్కరించుకోవలసినది. అంతర్జ్యోతి వెలుగున గనుగొనుము, దేవు డగపడినప్పుడు వేఱేదియు మన కగపడదు, ఇహలోకము నభిలషింపకు. ఏల యన దేని నభిలషింతువో దానినే నీవు పడయుదువు. దేవుని, దేవునిమాత్రమే అన్వేషింపుము. శక్తిసామర్థ్యము లెంత యున్న భయపారతంత్ర్యము అంత యుండును. చీమకంటె మనకు భయ దుఃఖాలు ఎంత హెచ్చు! ఆ సకలమునుండి వెలువడి భగవంతు నాశ్రయింపుము, సృష్టికర్త శాస్త్రము నాశ్రయింపుము, సృష్టిశాస్త్రమును కాదు.

—వివేకానంద.

# మహోజ్జ్వల ప్రదీపస్తంభము

## (సంపాదకీయము)

మనయితిహాసపురాణాలలో దధీచిమహర్షి కథ ఉన్నది. గొప్పసత్య మొకటి ఆకథలో ఇమిడియున్నది. వృత్రాసురునినాయకత్వమున అసురులు సురలను యుద్ధములో నిర్జించి తఱిమిరి. వేల్పులు విష్ణుదేవునితోడ్పాటు నభ్యర్థించిరి. "విద్యావ్రతతపస్సారుడైన దధీచిమహర్షిని దరిసి ఆయన దేహము నిమ్మని యాచింపు"డని విష్ణుదేవుడు వారికి కఱపెను. ఆ మునీంద్రుని యెముకలనుండి తయారైన వజ్రాదిశస్త్రములచే వృత్రాదిదానవులను తుదముట్టింపవలెను. వేల్పులు వచ్చి కోరినదే తడవుగ దధీచి సమాధిలోనికి జొచ్చి తనదేహము నిచ్చివేసెను. ఆయన యెముకలనుండి వజ్రాదులైన యాయుధములను తయారుచేసికొని, వేల్పులు రక్కసులను పోరికి పిల్చి అజేయుడగు వృత్రునితోసహ వారిని రూపుమాపిరి.

ఈకథ మానవజీవితములో దైవశక్తులకును అసురశక్తులకును సదా సాగుచుండు పోరాటమునకు స్ఫోరకము. ఆపోరాటములో గెలుపు ఒకప్పుడు దైవశక్తులకును మఱొకప్పుడు అసురశక్తులకును గలుగుచుండును. దైవశక్తులు గెల్పొందినప్పుడెల్ల ఆగెలుపునకు సాధకముగా భగవంతుని యనుప్రవేశము గననగుచుండును. భగవచ్ఛక్తి పరమపావనుడగు నొకవిశిష్టవ్యక్తి ద్వారా ఆవిష్కృతమగుచుండును. ఆవిశిష్టవ్యక్తులనే భగవదవతారమూర్తులని గుర్తించుచుందుము. వారు విద్యకు వ్రతమునకు తపస్సునకు మూర్తీభావములు. వారీయుపదేశములును ప్రభావమునే లోకకంటకవ్రాతనిర్మూలనమున కమోఘసాధనము లగుచుండును.

ప్రస్తుతయుగమున ఈపరమార్థమునకు శ్రీరామకృష్ణునిజీవితమే ప్రబలనిదర్శనము. నాస్తికతయు ఐహికభోగపరతయు భౌతికాది శాస్త్రపండితుల పెడసరపునియతివాదమును ఒండొంటికితోడై ధర్మమునకును పారమార్థికపరతకును ఇంతంతనరాని ముప్పును సమకూర్ప పనివడినవి. మతసూత్రాలును మతసంస్థలును అడుగున బడిపోయినవి. ఆత్మ దైవము పారమార్థికపరత అను ఆశయము లవనిలో పునరావృత్తిరహితముగ అంతరించిపోవు ననిపించినది. బురుజువలె నిలిచి ఆ ఉప్పెనలో ప్రపంచమును మునిగిపోనీయక కాపాడినవారు శ్రీరామకృష్ణుడును ఆయనశిష్యులును. పాపాధర్మశక్తులను తెగటార్చు ఆయుధములు శ్రీరామకృష్ణుని అస్థికలనుండి తయారైనవని చెప్పనొప్పును.

ఈనాటినాస్తికులును ఐహికపరులును తమ ఆశయాలకు తామే ప్రారంభీకులమనియు లోకమున కవి సరిక్రొత్తలనియు భ్రాంతి చెందకుందురుగాక. ఈయాశయాలు వేదములకంటె సైతము ప్రాచీనములనియు కొండలంతటి పురాతనములనియు మానవజాతి పుట్టువొందిననాటి నుండి మానవలోకమున నుండునవే అనియు జ్ఞప్తియుంచుకోవలయును. ఈయాశయాలు భగవద్గీతయందు పొంకముగా ఈరీతి పరిగణితములై ఉన్నవి :— "ఈజగత్తున దైవస్వభావసంపన్నులు, అసురస్వభావయుక్తులు అని రెండు విధములుగ మనుష్యులు సృష్టింపబడియున్నారు. దైవస్వభావసంపన్నుల విషయము విశదముగానే చెప్పితిని. ఇక అసురస్వభావయుక్తులనువారిని గుఱించి చెప్పెదను వినుము: అసురస్వభావముగలవారికి ధర్మమున ప్రవృత్తి గలుగదు, అధర్మమునుండి వారు నివృత్తులు కారు. వారికి సత్యశౌచసదాచారము లుండవు. వారు ఈ జగత్తు వేదపురాణాదిప్రమాణశూన్యమనియు

(అసత్యమనియు) ధర్మాధర్మవ్యవస్థాశూన్య మనియు (ప్రతిపాదింపరహిత మనియు) దీనికి కర్తయు ... ... ప్రభువు లేడనియు, కామవశమున స్త్రీపురుషసంయోగముచే ఈ లోక ముత్పత్తిల్లుచున్న దనియు, దీనికి వేఱు కారణము లేవియు లేవనియు చెప్పుచుందురు ఇట్టి నాస్తికదృష్టినవలంబించి పరలోకసాధన చ్యుతులును క్రూరకర్ములును అపకారులును అల్పబుద్ధులు నగువారు ప్రపంచవినాశము కొఱకే పుట్టుచున్నారు, ... ... వారు సర్వానర్థములకును సర్వదోషములకును మూలమగు అహంకారమును పరపీడాకరమగు బలమును ధర్మోల్లంఘనకారణమగు దర్పమును స్త్రీవిషయమగు కామమును, ఇచ్ఛ ప్రతిహతమగుటచే కలిగెడు కోపమును ఆశ్రయించి తమ శరీరములలోను ఇతరులశరీరములలోను (బుద్ధికిని కర్మములకును సాక్షినై) వెలయుచున్న నన్ను (ఈశ్వరుని) ద్వేషించుచున్నారు''—

ఈజగత్తునకు ఆధారముగ అప్రాకృతమగు సత్యము ఏదియు లేనందున ఈజగత్తునను ఈ దేహముతోను అనుభవింపదగినంత సుఖము ననుభవింపు డనుటే—ఈనాస్తికుల వర్తనము. వీరికి స్వార్థమును ఇంద్రియసుఖానుభూతియునే లక్ష్యములు. అందుకు ధనసంపదయు భోగములునే సాధనములు. తత్త్వముఖము నొక బంగారుపాత్ర కప్పియున్న దని బృహదారణ్యకోపనిషత్తు చెప్పుచున్నది. స్వార్థపరతయు భోగపరతయు లోభమునే ఆబంగారుపాత్ర. వీనికిలోనైనవానికి బ్రహ్మసాక్షాత్కారము సాధ్యము కాదు. ఇంద్రియాలవెలుగు ఈనాకుని కన్నుగప్పుచున్నది.

ఈనాస్తికు లేదో ఒకమూలలో అణగియుండువారుకారు. వారు ఎల్లెడల నున్నారు. ఒక్కొక్కప్పుడు పరమభక్తుల వేషములు వేసికొనియుందురు. దేహాభిమానమును ఇంద్రియతృష్ణయు అహంకారమునుగలిగి పరతత్త్వము లేదనుకొనుచుండువాడు నాస్తికుడు, పైకి వాడు స్వర్గముపై మహామతసంస్థపై ఒట్టుపెట్టి ఎంతైన వాగును గాక. వీరును వీరిఆశయాలునే అసురశక్తులు.

రామకృష్ణుని జీవితసందేశాలసారమును గాంధిమహాత్ముడు ప్రతిపాదించినంత పొంకముగా వేఱెవ్వరును ప్రతిపాదించియుండలేదు. శ్రీరామకృష్ణునిజీవితచరిత్రమునకు తాను వ్రాసిన యుపోద్ఘాతములో ఆయన ఈలాగు చెప్పియున్నాడు. ''ఆచరణరూపధర్మకథయే శ్రీరామకృష్ణపరమహంసజీవితకథ. భగవత్సాక్షాత్కారభాగ్యము నొందుటకు ఈయన జీవితము మనకు దోడ్పడగలదు. ఈమహనీయుని చరిత్రను జదివిన వారికెవ్వరికైనను 'భగవంతుడే సత్యము, మిగిలిన దంతయు మిథ్య'యను నిశ్చయము కలిగితీరును. రామకృష్ణుడు సజీవాకృతిని దాల్చిన దివ్యత్వము. ఈయనయుపదేశములు ఒకపండితమాత్రుని వాక్కులు కావు. అవి జీవితమను గ్రంథములోని పుటలు; స్వానుభవప్రకారములు. కావుననే వానిని జదువునప్పుడు పాఠకునికి అనివార్యమైన చిత్తసంస్కారము గలుగుచుండును. పారమార్థికవిషయములయెడ విశ్వాసహీనమైన యీ యుగమున సజీవమై ఉజ్జ్వలమై దీపించు విశ్వాసమునకు రామకృష్ణునిజీవితము ఉత్కృష్టనిదర్శనము. ఇదే కనుక లభించియుండనిచో వేలకొలది స్త్రీపురుషులు మనశ్శాంతిరహితులై ఆధ్యాత్మిక వికాసరహితులై యుండెడివారు. అహింసావిషయమున రామకృష్ణుని జీవితము లోకమునకు గుణపాఠమై యొప్పియున్నది. దేశకాలవర్ణాదులచే కట్టుపడక అపారమై ప్రవహించినది

ఈమహనీయుని ప్రేమప్రవాహము. ఈసచ్చరిత్ర చదువువారికెల్లగకును ఈయనదివ్యప్రేమ దివ్యాశయప్రేరకమై దీపించును గాక.''

శ్రీరామకృష్ణసందేశవ్యాఖ్యాతలలో నిస్సమాభ్యధికుడగు శ్రీవివేకానందస్వామి ఈలాగు వ్రాసెను :— ఈయుగమున విశ్వాంధకారమును పటాపంచలు సేయు దీపస్తంభ మీ మహాత్ముడు. ఈయన వెలార్చిన వెలుగే సంసారమహార్ణవసంతారకము... నాస్తికాశయాలను జ్ఞానఖడ్గము విధ్వంస మొనర్చు నవతార మిది. భక్తిప్రేమలు విశ్వైక్యబంధములు కాగలవు. ఈయవతారమున రజోగుణమును కీర్తిప్రతిష్ఠలపై మోజును బొత్తిగా లేవు.''

పైనుదాహరింపబడిన యిరువురు ప్రతిభానిధుల వాక్యములవలన జగదలంకారమైన శ్రీరామకృష్ణుని స్వరూపము మన మనసునకు వచ్చును. ఐహికపరత్వములకు ప్రతియోగియే ఆయనస్వరూపము. సంశయనాస్తికతాంధకారము తొలగిపోయినది, విధ్వంస మొందినది. భగవంతుని ఉనికి నిస్సందేహముగ అప్రకంప్యముగ స్థిరపడినది. సత్యజ్యోతిని ఆయన మహోన్నతస్థాయి కెక్కించుటే కాదు, దానితో తాదైక్య మొందినాడు. సంసారాంధకారకూపమునుండి వెలువడుటకు ప్రజలకు దారి జూపుచున్నాడు. రజఃప్రభవములైన గర్వాహంకారములు లేనే లేవు. పరతత్త్వము నాచ్ఛాదించు స్వర్ణచక్రము నతడు తొలగించి, పరంజ్యోతిని సాక్షాత్కరించుకొనెను.

దేవుడు లేడు పొమ్మను వాక్యాలకు వాదాలకు మనము వాడుకపడియున్నాము. ఆ చెప్పువారు భౌతికాదిశాస్త్రనిష్ణాతలయు తర్కశాస్త్రనిపుణులయు మాటలనాధారముగ జూపి' దేవుడు లేడు' పొమ్మనుచున్నారు. కొందఱు సాహసించి ''దేవుడు చచ్చెనా'' అనియు అడుగుచున్నారు. తమకు తెలిసినంతలో 'చచ్చె' ననియు చెప్పుచున్నారు. మేఘమండలముపై నుండు దాడిబాలావంటి ఏదో ఒకరకపు దేవుడగుచో అట్టి దేవుడు చచ్చె ననుట నిజమే. అది లోకమునకు శ్రేయస్కరమైన చావే కావచ్చు. దేవునిగూర్చి యుండిన యొకయాశయ మంతరించె ననుటే అందు కర్థము. మఱి నిర్వికల్పమై అక్షయమై బాహ్యాభ్యంతరజగత్తునకు బీజమై సారమైన భగవంతునిగూర్చి ఏమి? చచ్చెనా అను ప్రశ్న ఆసచ్చిదానందమూర్తినిగూర్చి అడుగబడునేని, అప్పుడు మనము శ్రీరామకృష్ణప్రముఖజ్ఞానయోగుల సందర్శని జూపి ''దేవుడు మృతుడు కాడు, ఆయన నిత్యుడు, నిజమునకు సజీవు డెవడేని యున్నచో, దేవు డొక్కడే ఆ సజీవుడు. ఏల యన ఆయన అమృతత్వమునకు మూర్తిభావము. అని ప్రత్యుత్తరము చెప్పవలయును.

ఆర్జవముతో భగవంతు నన్వేషించువా డొకప్పుడు సందేహము పాలు కావచ్చు. కాని 'దేవుడు లేడుపొ' మ్మనువాడు అరగొఱశ్రద్ధాళువే. లోకజననిని సాక్షాత్కరించుకొనుటకై తహతహపడుచుండిన దినములలో శ్రీరామకృష్ణుడు ''అమ్మా నీవుండుట నిజమేనా? మాటాడ వేమి? మరణించితివా'' అనుచు, కొన్నాళ్ళు సంశయాళువుగ నుండెను. కాని అట్లు ప్రశ్నించుటతో ఆయన ఆగలేదు. ఇంద్రియజగజ్జీవితము బూటకమనియు హానికరమనియు నిశ్చయము ఆయనకు గలిగెను. దేవిని సాక్షాత్కరించుకొనువఱకు ఆయన విశ్రమింపనేర డాయెను, సాక్షాత్కరించుకొని తీరెను.

సంశయాళువైనను ఋజుమతియగు నొక యువకుడు 'దేవుని మీరు చూచితిరా, చూచు

'ఎట్లు' అని అడిగినప్పుడు శ్రీరామకృష్ణు డిట్లు జవాబు చెప్పెను—"చూచితిని. నిన్ను జూచుచున్నట్లే చూచితిని, ఇంతకన్నను ఎంతో సన్నిహితముగా జూచియున్నాను. దేవుని సాక్షాత్కరించుకొనవచ్చు, చూడవచ్చు. నీతో నేనిప్పుడు మాటాడుచున్నట్లే దేవునితో మాటాడవచ్చు. కాని అందుకు కావలసిన శ్రద్ధ ఎవనికున్నది? భార్యకని బిడ్డలకని ధనమునకని ఆస్తికని కన్నీరు కడవలుగ కార్తురే కాని, దేవునికై అట్లు చేయువా రేరి? మనఃపూర్వకముగా దేవునికై విలపించువానికి దేవుడు తప్పక కనిపించును."

ఒకనాడు ఎమ్. ఎ. పట్టము వడసిన యొక విద్వాంసుడు అజ్ఞేయవాది శ్రీరామకృష్ణుని దరిసి తనకు గల అవిశ్వాసమును మనఃక్షోభమును తెలుపుకొనెను. దేవుడున్నా డను నమ్మకము లేనందున దైవప్రార్థనము కావింపడట. శ్రీరామకృష్ణు డతనిని నిందింపలేదు, తలతిమివేయలేదు, అజ్ఞేయవాదికి తగిన యొక ప్రార్థనాక్రమమును కఱపుచు ఇట్లనెను – "ఈలాగు ప్రార్థించుట నీకు నిరాక్షేపమే అనుకొందును. 'ఓ దేవా, నీవుండుట నిజమేని నా మొఱ నాలకింపుము' ఇట్లు ప్రార్థించితివేని నీకు మేలు కలుగును." అతడు రవంతసేపు ఆలోచించి "ఇట్లు ప్రార్థించుటకు నా కాక్షేపణ లే" దనెను. శ్రీరామకృష్ణు డతనిని మరల రమ్మని కోరెను. మరల వచ్చినప్పుడు అతడు పూర్తిగా మారిపోయియుండెను. శ్రీరామకృష్ణునిపాదముల బ్రవ విలపించుచు "నన్ను రక్షించితి" రనెను.

శ్రీరామకృష్ణకథామృతములో మాటిమాటికి వచ్చు జంటపదాలు 'కామినీకాంచనము'లు. ఈ మాటలు ఏకామునినికై నను చెఱుకు మరుట నిజమే. దేవునెఱుగగోరినవారికి కామినీకాంచనములు పూర్తిగా పరిత్యాజ్యము లని శ్రీరామకృష్ణుడు స్పష్టముగ జెప్పెడివాడు. కామినీకాంచనము లనగా కామలోభములను పే ఆయన యుద్దేశించినయర్థము. ఆత్మికజీవితమునకు దురారాధ్యములైన శత్రువులు కావా అని రెండును. కామినులపట్ల మెలకువ గలిగి యుండు డని మగవారిని కాముకులపట్ల మెలకువ గలిగి యుండు డని మగువలను ఆయన ఎచ్చరించినాడు.

ఇప్పుడు ప్రపంచమున మన చుట్టునుండు పరిస్థితులను జూచితిమేని ఆధ్యాత్మికసాధకునకు శ్రీరామకృష్ణుడు పల్కిన యెచ్చరికమాట ఎంత సుప్రసక్తమైనదియు గ్రహింపగలము. ఇతరప్రాణులనుబోలె మానవులును బానిసలుగ నొనర్చునది ఇంద్రియతృష్ణ. కాని అంతమాత్రముచేత మానవులు కేవల మింద్రియదాసులుగ నుండవలసినదేనా? మానవులలో భావోద్రేకము రేకెత్తింపబూనుకొన్న వారు ప్రచారమార్గముల నన్నిటిని తమ అదుపులోనికి తెచ్చుకొని మానవులను ఇంద్రియవిషయావర్తమున బడ ద్రోయుచున్నారు. దీనిని వ్యాపారలాభమార్గముగ వా రొనర్చుకొన్నందున ప్రాచ్యదేశములందేమి, పాశ్చాత్యదేశములందేమి మానవసంఘమును ముంచుకవచ్చుచున్న ముప్పు ప్రత్యక్షమే. ఈ పెడదారినుండి మానవులు సరిదారికి మరలవలె నన్న అందు కొక్కటే వెరవు. మగవాడు మహిళను లోకమాతృమూర్తిగాను మగువ మగవానిని దేవుని బిడ్డగాను భావింపవలెను. ఇది శ్రీరామకృష్ణుడు కనబఱచిన దారి. ఆవిధముగ భావింప దొరకొనినంతనే మనసుల కెంత పవిత్రత ఎంత యుదాత్తత కలుగుచున్నది! ఆ భావన మన స్సునకు మూలాధారబంధము వదిలించి దానిని

నిర్మలానందమయములగు ఊర్ధ్వభూమికల నధిరోహింపజేయుచున్నది.

భోగాభిలాష సంతానాభిలాష అను రెండు పురులు నొక్కటిగనై ఈ యింద్రియతృష్ణ స్త్రీపురుషులకు బంధకముగ నైనది. మఱికొందఱు మనస్తత్త్వశాస్త్రజ్ఞులు తమ సిద్ధాంతములచే ఈ బంధమును మఱింత బలపఱచిరి. ఇంద్రియప్రీణనము దుఃఖపర్యవసాయియే. అనుభవించుకొలదియు హెచ్చు పెరిగిపోవు స్వభావము గలది ఆ తృష్ణ. అతీంద్రియమును నిరుపమానమునగు నానందమును శ్రీరామకృష్ణుడు భగవదనుభూతియందు లోకమునకు జూపినాడు. అందుకు ఆయన జీవితచరిత్రమే ఉత్తమ లక్ష్యము. సంతానాభిరతియు, పుత్రనిర్విశేషులగు శిష్యుల బాహుళ్యముచే ఆయనకు ఇంద్రియేతరమార్గమున సఫలమైనది.

సేకరించు స్వభావము మానవునికి గలదు. ఇదే ధనలోభము. ఇది యున్నంతవఱకు మానవుడు దేవునివంకకు సమాకృష్టుడు కాడు. కాంచనవిరక్తిని భగవదాయత్తతను పరిపూర్ణముగ సాధించినవాడు శ్రీరామకృష్ణుడు. ఒకానొక శిష్యున కాయన ఇట్లుపదేశించెను: "నీవు సారాసారవివేచనము నభ్యసింపవలయును. 'కామినీకాంచనములు' క్షణికములు. దేవు డొక్కడే శాశ్వతుడు. ధనముచేత అన్నవస్త్రములను నిలువ నీడను సంపాదించుకో వచ్చును. అంతకు మించిన యుపయోగము ధనమునకు లేదు, భగవత్సాక్షాత్కారమునకు ధనము సాధకము కానే కాదు. కాబట్టి జీవిత లక్ష్యముగ నుండు నర్హత ధనమునకు లేదు."

కామినీకాంచన పరిత్యాగముతో బాటు శ్రీరామకృష్ణుడు లోకమునకు 'అహంకార నిరాసము'నుగూడ కఱపెను. అందు కాయన చూపిన పద్ధతులు రెండు. తన్ను తా నొలిచి చూచుకొని సోఽహమని ఆత్మ తప్ప వేఱు లేదను నిశ్చయమున స్థిరపడు జ్ఞానమార్గ మొకటి. భగవంతునికి తన్ను కింకరునిగ భావించుకొను 'దాసోహ' మనెడి భక్తిమార్గ మొకటి.

శ్రీరామకృష్ణునియు తచ్ఛిష్యులయు అతి విశుద్ధవ్యక్తిత్వములనుండి లోకజనని ఆయుధాగారమును తయారుచేసినది. శ్రీరామకృష్ణునిలో 'పిడుగు' 'శక్తి' 'వెలుగు' అను మూడు నున్నవి. అందు తొలిది నాస్తికతను ఐహికపరతను రూపుమాపునది. తక్కిన రెండును శ్రద్ధాళువులకు మార్గోపదేశమును దారివెలుగును సమకూర్చుచున్నవి. ఈ మహోజ్జ్వల ప్రదీపస్తంభము అసంఖ్యాకశతాబ్దములవఱకు మానవులకు పరమలక్ష్యమునకు వెలుగుబాట చూపుచు ధైర్యోత్సాహముల పెంపొందించుచుండగలదు.

---

"వెఱ్ఱినమ్మకములను మూఢవిశ్వాసములను బోధించి జనులచే సత్కార్యములను జేయింపనేల? జనులను స్వతంత్రులను జేయుఁడు. వారి సంకెలలను విదళింపుఁడు—అనియే నేను ఘోషింతును. బురదచే బురదను గడుగఁగలమా? దాస్యముచే దాస్యమును బాఱఁద్రోలఁగలమా? ఏది?—ఒక్క నిదర్శనము జూపుఁడు. సమాజమునిమిత్తము సర్వసుఖేచ్ఛలను త్యజింపఁగలిగిననాఁడు నీవు బుద్ధుఁడవై ప్రకాశింతువు. ముక్తుఁడవై వెల్గొందుదువు."

# గీతామాత, జోహారువుల్

## శ్రీ కట్టా త్రిమూర్తి కవిగారు

శ్రీకుంతంబు తమోపహంబగు కురుక్షేత్రమ్మునందున్ మహా
వ్యామోహాంతకుఁడైన కృష్ణుఁడు నరుండౌ క్రీడికిన్ సత్య సం
గ్రామజ్ఞాన పయస్సులం బిదుక సంకల్పింపఁగా ధేను చిం
తామణ్యాకృతి లెస్సఁ దాలిచిన గీతామాత, జోహారువుల్.

ఆవేళంబునఁ బోటికై రథముపై నాదిం బ్రవేశించి "యో
బావా, యుద్ధము వద్దు, తేరు మరలింపం గద్దు లాభంబు; రా
త్రోవల్ నచ్చవు నేఁడు మా" కనెడి పార్థుం దేర్చి, సంగ్రామ సూ
త్రావర్తిష్ణువుగాఁగఁ దీరిచిన గీతామాత, జోహారువుల్.

"భోగంబుల్ యమలోక యాతనలతో పోటీయొనర్పంగఁ జాల్
రోగంబుల్ సమకూర్చుటం దలఁపఁ, డారోగ్యంబుఁ జేకూర్చు స
ద్యోగంబున్ గొనఁ డజ్ఞుఁడైన నరుఁ డయ్యో!" యంచు మాయాపరి
త్యాగంబున్ గనుసన్నలం గఱపు గీతామాత, జోహారువుల్.

యుగముల్ నాల్గిఁట ధాత్రి నెప్డెపు డయోగ్యుల్ పుట్టి, దుర్మార్గులై,
పగలవ్వారిగఁ బెంచి, మంచికి వగల్ వాటించి, వంచించి, మి
థ్యాగధర్మంబును మార్తు, రప్డపుడు తద్భారంబు వారింపఁగాఁ
దగు రూపంబున మూర్తి దాలిచిన గీతామాత, జోహారువుల్.

సుమనస్సౌరభ సత్కథాతనులతన్ శోభిల్లి, సుజ్ఞాన భా
వమనోజ్ఞోక్తిమరంద పద్మముఖియై వర్ధిల్లు సుశ్లోకవృ
త్త, మహాభారత భారతీసతికిఁ బ్రోద్యత్కంఠహారంపు మ
ధ్యమ మాణిక్యమవై ప్రభల్ నెఱపు గీతామాత, జోహారువుల్.

# తెలిసికోవలసిన విలువలు 3

## వినయము

ఓ మానవుడా, 'ఇంత తెలిసినవాడను నే ననుకొనుటకు ఎవర వోయి నీవు? నీవు సాధించిన వానినిగూర్చి నీవే బడాయి పలుకులు పలికెదవేల?

వివేకవంతుడవుగ నుండగోరెదవా, అందుకు మొదటిమెట్టు "ఏమియు నెఱుగనివాడను నే" నని గుర్తించుటే. ఇతరులు నిన్ను మూర్ఖుడని తలంపకుండవలె నన్న నిన్ను నీవు బుద్ధిమంతుడనుకొన కుండవలెను.

సౌందర్యవతికి సాదాయైన ఉడుపే శ్రేష్ఠమైన యలంకారమైనట్లు, బుద్ధిమంతులకు ఉదాత్తమైన నడవడియే మహిమాలంకారమగును.

వినయశీలుని వాక్కు సత్యమునకు వన్నె గూర్చును. అతని మాటలలోని సంకోచము అతని తప్పిదములకు పరిహార మగుచుండును.

అతడు తన తెలివిపైని మాత్రమే ఆధార పడియుండడు. మిత్రుని సలహాను తూచి చూచి, దానివలని లాభమును బడయును.

తన్నుగూర్చి పొగడ్త పలుకబడినప్పు డతడందులకు చెవియొగ్గడు, ఆ స్తుతులను నమ్మడు. తనలోని సుగుణములనే వెదకుకొను పని కతడు ముందడుగు నిడనే యిడడు.

మేలిముసుగు సొగసును పెంపొందించునటుల వినయప్రభ పముగ నాచ్ఛాదన మతని సుగుణముల మఱింత సొంపొందించుచుండును.

# త్రివేణీ సంగమం—సాధకుని స్వాతిశయం

## కీ॥ శే॥ కులపతులు ముట్నూరు కృష్ణరావుగారు

సోదరా, ఒకటి హెచ్చుగ ఉన్నా, ఇంకొకటి తక్కువగ ఉన్నా, ప్రతివానికి జ్ఞానం, శక్తి, ప్రేమ–ఈ మూడూ ఉన్నాయి. ఇవి మూలంలో ఆత్మ ప్రత్యయంయొక్క స్వరూపలక్షణములు కాకపోతే, మానవజీవితంలో ఎట్లా ప్రతిభాసిస్తున్నాయి?

ఇవి మన భేదబుద్ధికి భిన్నంగా కనబడ్డా మూలంలో ఒక్కటే. వీని ఐక్యము నవగతం చేసుకోలేక, భేదబుద్ధి ననుసరించి, వీనిని ప్రత్యేకంగా అవలంబించి, భిన్నమార్గాలు త్రొక్కారు. ఇందుమూలంగా జ్ఞానయోగమనీ, కర్మయోగమనీ, భక్తియోగమనీ వేఱు పథములేర్పడ్డాయి.

జ్ఞానులు కర్మనూ, భక్తినీ గౌణికమని, నిమ్నాధికారుల కేర్పడినవని నిరసించడం మొదలుపెట్టారు. అట్లాగే భక్తియోగులూ, కర్మయోగులూ జ్ఞానులను సోమరులని, తమ కైవల్యాన్నే చూచుకొనే స్వార్థపరులని నిందింపసాగారు.

నీవు సూక్ష్మబుద్ధితో లోతులను తరచి చూస్తే – జ్ఞానంలో శక్తి, శక్తిలో సౌందర్యం అవబోధమై, ఆత్మయొక్క సమగ్రత, సంపూర్ణత గోచరిస్తుంది.

జ్ఞానమంటే పరాయివస్తువును తెలుసుకోవడంకాదు. ఆత్మే జ్ఞాత, ఆత్మే జ్ఞేయము.

కర్మ అంటే ఏదో బయట ఒక కార్యాన్ని చేయడం కాదు-ఆత్మే కారణం, ఆత్మే కార్యము. ప్రేమ అంటే అన్యుని ప్రేమించడం కాదు-ఆత్మే భోక్త, ఆత్మే భోగ్యము. జ్ఞానం-ఆత్మజ్ఞానం. కర్మ-ఆత్మశక్తి. ప్రేమ-ఆత్మరతి.

జ్ఞానంలో శక్తి ఉన్నది. జ్ఞానము తాను మఱుగుచేసుకోగలదు, వెల్లడిచేసుకోగలదు "నిషేధవ్యాపారా శక్తిః" అని చెప్పలేదూ ఋషులు? సత్యం జ్ఞానం అనంతం - తన్ను తాను భిన్నదృక్కోణాలనుండి చూచుకొని తన అనంతత్వాన్ని వెల్లడిపఱచు కొంటుంది. అట్లే శక్తి తన్ను తాను సంశ్లేషించుకోనూ గలదు, విశ్లేషించుకోనూగలదు-అది అక్షరము-ఇది క్షరము. అది Static-ఇది Dynamic అది రెండూ కాగల్గింది కనుకనే సర్వశక్తి.

ప్రేమకూడా అంతే-తానే భోక్త, తానే భోగ్యం - వియోగంలో దూరమై రసపిపాసను జూపుతుంది. సంయోగంలో రససిద్ధిని బొందుతుంది. ఏకరసమయ్యీ, నవరసస్ఫూర్తిలో విలసిల్లగలదు. సూర్యకిరణం వెలుగైతే, ఇంద్రచాపంలో విరజిమ్మే వర్ణప్రభలు దాని చిన్నివన్నెలుకావా? నాదాన్ని ఉపాసిస్తూ, అది ఊపే రాగంపుటుయ్యాలలో నీవు తన్మయుడవు కాలేవా? నీవు సౌందర్యాన్ని గ్రోలుతూ అంగోపాంగముల రామణీయకము నెట్లా తిలకించకుండా ఉండగలవు?

ఆత్మయొక్క స్వరూపం ఆనందం - దాని వెలుగే జ్ఞానం; దాని క్రీడే శక్తి; దాని రసమే ప్రేమమాధుర్యము. నీ జ్ఞాన, శక్తి ప్రేమలు సహజముగ సమ్మిళితములై సర్వాంగ సుందరముగ శోభిల్లినప్పుడే, నీవు ఆనందరసామృతమూర్తి వయ్యెదవు.

(కొఱవ ౧౯౪ వ పుట చూడుడు)

# భక్తి

## శ్రీ ఐనపర్తి వేంకటరావుగారు

ఓమ్ హరలీలావతారాయ
శఙ్కరాయ పరౌజసే
కైవల్య కలనాకల్ప
తరవే గురవే నమః ॥

అఙ్కోలం నిజబీజసన్తతి
రయస్కాన్తోపలం సూచికా
సాధ్వీనైజవిభుం లతాక్షితిరుహం
సిన్ధుస్సరిద్వల్లభమ్
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః
పాదారవిన్దద్వయం
చేతోవృత్తి రుపేత్యతిష్ఠతి సదా
సా భక్తిరిత్యుచ్యతే ॥

ఊడుగుచెట్టున గలిగిన పండ్లగింజలా చెట్టునకు దూరమైపోవక దానినంటియుండుమర్యాదను సృష్టికర్త పాదముల నాశ్రయించియుండు చిత్తవృత్తిని భక్తియంద్రు. అయస్కాంతము సన్నిధి నున్న సూది దగ్గఱ దాని కంటువడునట్లు సృష్టికర్తపాదములకు మరిగి విడివడని చిత్తముండువృత్తిని భక్తియంద్రు. మగనికి నర్ధాంగియై యిల్లాలుండుమాడ్కి సృష్టికర్త పాదాకృతి దాల్చియుండు చిత్తముయొక్క వృత్తిని భక్తియంద్రు చెట్టునబెనవైచికొనియుండు లతగతి సృష్టికర్తపాదములకు ముడివెట్టికొనియుండు చిత్తవృత్తిని భక్తియంద్రు. సముద్రజలముతో

నదీజలము గలిసిపోయినట్లు సృష్టికర్తపాదమయమైయుండు చిత్తముయొక్క వృత్తిని భక్తి యందురు.

చిత్తము సదా యాపోలికగ వర్తించుట భక్తి "చతుర్విధాభజన్తే మాంజనా స్సుకృతినః ఆర్తోజిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ, ఉదారా స్సర్వ ఏవ".

బహుజన్మాంతరములలో జేసికొన్న సుకృతములుగల నాల్గుతెఱగుల జనులు నన్ను భజింత్రు. ఆర్తుడు జిజ్ఞాసువు నర్థార్థి జ్ఞాని ఆ నాల్గు తెఱగులవారు వీరు. వీరందఱు విశాలోద్యములే. అని శ్రీకృష్ణబ్రహ్మము ప్రవచనము.

దిక్కుమాలినవాడొకడు, లోకవ్యాపారములయం దనురక్తిపుట్టనివాడొకడు; సుఖజీవనమునకు మోహపడువాడొకడు, జ్ఞానవంతుడొకడు - నిన్నల్వురు భక్తివహింత్రు. అట్టివారై యుండియు నందఱును భక్తివహింపరు. వారిలో సుకృతులకే భక్తి గల్గు.

నీవే తప్ప నితఃపరం బెఱుగ సంరక్షింపుమను మొసలిపట్టినగజరాజు భగవంతుని దలచి మొఱవెట్టు చందముగ, వివిధానేకవిషయసంపన్నుడై వ్యసనసంసక్తి నావంక బోక సదా చిత్తమచ్యుతుమీద జేర్చు ప్రహ్లాదునట్లు, నిజదారసుతోదరపోషణార్థమై శ్రీకృష్ణునికడ కర్థింప బోయి యర్థ మడుగుటయు కానుకగా గొంపోయిన యడుకు లర్పించుటయు మఱచిన కుచేలునిభంగి—భక్తి సేయవలయు. భక్తి యాచనావృత్తి గాదు.

ఈశ్వరుడు భక్తి మెచ్చు గాని ద్రవ్యంబులొసగెడి మేరలు మెచ్చడు.

పత్రం పుష్పం ఫలం తోయం
యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత
మశ్నామి ప్రయతాత్మనః ॥

అని శ్రీభగవానుని ప్రవచనము.

భక్తి యనగ బూజలు సేయించుట గాదు సర్వావస్థలందు భగవంతు నాశ్రయము నూని యుండుట.

జ్ఞాను లన్యచింతలు మానక యేకాంతికధ్యానపరులు గారేని బహువర్షను లై నిశ్చయవిరహితులై భగవత్తత్త్వము నెఱుగనివారే యగుదురు, ఇది జ్ఞానులకు ఘుల్లగూడని యోగము.

జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే—ఏకాగ్రభక్తియుక్తుడై జ్ఞాని విశిష్టతబడయును. యోగినామపి యో శ్రద్ధావాన్ భజతే మాం స యుక్తతమః—యోగులందేని నన్ను భజించు శ్రద్ధావంతు డుత్తమకర్మయోగి అనిపరమాత్మ ప్రవచనము.

భక్తిమాలి యార్తుడు వేదనపాలే యగు, నంతే; సంసారమునకు విసిగినజనుండు భక్తి లేక జడుండే యగు, నంతే. భక్తిలేక యర్థార్థి కల ధనమెల్ల వెచ్చించి భ్రష్టుండగు, నంతే. భక్తి లేక జ్ఞాని శాస్త్రంబు లుపన్యసించుచు నుపజీవించును. వీరు ముందుజన్మలందైనను భక్తి పుట్టుట కిప్పు డసత్కర్మలు మాని సత్కార్యార్థులు గావలయును.

జ్ఞానవిహీను లాయువుగలందాక బ్రతుకుట లేదా? భక్తిలేక యింక జ్ఞానప్రకాశ మెందుకు? భక్తిలేక యేదిగాని యెందుకు? దైవపూజ సేయుట ధర్మమే. పూజకు జ్ఞానమునకు జీవనమునకును భక్తి పట్టుగొమ్మ.

మాధుకయ్యు నొక్కండ దే పనిగా నీశ్వరారాధన జరుపు చుండును. అదొక స్వభావము.

అతడు మోక్షమును గోర నెఱుగడు. సుజ్ఞాని భావసమన్వితుడై భగవన్మాహాత్మ్యమును నెఱిగి చేయు భక్తి జనుడు ప్రీతిపూర్వకముగ దృఢ వ్రతముతో జేయు మనాత్మలోనె బుద్ధియోగము లభించి భగవద్భజనమే కర్తవ్యమని నిశ్చయాత్ముడై భగవత్సేవతో తుష్టుడై భక్తి పేడక యందే యోలలాడుచుండు భక్తికి ఫలము భక్తియె ఇంకేమి కావలయు? పూజలకు జ్ఞానమునకు జీవనమునకు నూత గదా భక్తి!

ఎవడు భక్తులను జూచియు భక్తుల కథలను, వినియు శ్రద్ధగలిగి దేవపూజ కిపు డారంభము చేసి, భక్తివృద్ధించిన భక్తునియందుగలయట్టి "యోప్రాణిని" ద్వేషింపకుండుట. మిత్రత్వము, కనికరము, దేనిని గాని యిది నాది యని దానికి దగులుడు పడకుండుట, తాను 'వెంకయ్య' నను ప్రత్యేకవ్యక్తిత్వమునందభిమాని గాకుండుట, సుఖమునువలె దుఃఖమును దుఃఖమును వలె సుఖము నొక్కచందముగ ననిష్టము నిష్టము లేక కడపుట, యది లేదిది లేదని కోరికలు లేకుండుట, మనస్సు సూపు వెంట బోవక దానిపై దానధికారము బూనుట యిట్టి తన నిశ్చయములనుండి బుద్ధిని మరల్పకుండుట, యమ్మనో బుద్ధులను భగవంతునిలో నిల్పుట. లోకులు దనకు, దాను లోకులకు, భీతిల్లువిధముగా వర్తింపక యుండుట, సంతోషభయక్రోధములకు జలింపకుండుట, యెద్దిగాని కావలయు నను దృష్టి లేక యుండుట. శుచియై యుండుట, యొక కార్యము నిర్వహింపనోపక యది వైరాగ్యముగా దలపక దానిని జేయగలుగు సమర్థతతో నుండుట, లోకవ్యాపారములయందు జోక్యము గలుగ జేసికొనక తటస్థుడై యుండుట, యీ కట్టుబాట్లకు లోనై వెలివెట్టినట్లు మనస్సులో దిగులుగలుగక యుండుట యేకార్యము గాని తనకు దానై సంకల్పింపకుండుట, హర్షము ద్వేషము శోకము గాంక్షలును లేక యుండుట, కీడు గలిగినయపుడు శోకమునకు మేలు గలిగిన యపుడు హర్షమునకు వశుడు గాకుండుట, శత్రులనైనను మిత్రుల నెట్లు చూచు నట్లు చూచుట. తన్నారులు గర్హించిన గుందక గౌరవించిన నుబ్బకయు నుండుట, యొదున స్నేహము—అంటువడుట యంతరంగములో లేకయుండుట, నిందాస్తుతుల యందొక్క ఫక్కి నిర్వికారముగ నుండుట, మూగగనుండి సదా లోలోపల భగవంతునిగూర్చి తలచుచుండుట, లభ్యమైనదానితో నూఱకిలి యుండుట. నివాసగృహమునం దిది నా కొఱకను మచ్చిక లేక యుండుట, బుద్ధి నేకాగ్రముగ జేయుటయు" నను లక్షణములను దన యందు పెంపొందించుకొనునో యతడు భక్తులలో మిన్న.

అనన్యాశ్చింతయన్తో మాం
యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహామ్యహమ్॥

అని శ్రీభగవానుని ప్రతిజ్ఞ. అట్లు భజించు భక్తుల యోగక్షేమములకు పరమాత్మ బాధ్యత వహించును.

మాం చ యో ఽవ్యభిచారేణ యోగేన సేవతే బ్రహ్మభూయాయ కల్పతే-భక్తియుపాయముగా పద్ధతి దప్పిపోవక నన్ను భజించు నతడుగూడ బ్రహ్మభూతు డగు నని శ్రీకృష్ణు నాజ్ఞ.

కృష్ణుని భజింప బ్రహ్మభూతు డగు ననుట యేటిమాట యనిన, కృష్ణుడు దేహమాత్రుడు గాడు "బ్రహ్మణో హి ప్రతిష్ఠాహమ్" శ్రీకృష్ణుడు స్వభావముగ బ్రహ్మము.

అద్వైతవేదాంతి, తార్కికుడు శ్రీమధుసూదనసూరి భగవద్భక్తిపరాయణుడు. ఆ ప్రమాణ మిదిగో!

ధ్యానాభ్యాసవశీకృతేన మనసా
య న్నిర్గుణం నిష్క్రియం
జ్యోతిః కిఞ్చన యోగినో యది
పరం పశ్యన్తి పశ్యన్తు తే
అస్మాకం తు త దేవ లోచనచమ
త్కారాయ భూయా చ్చిరం
కాళిన్దీపులినోదరే కిమపి య
న్నీల మ్మహో ధావతి ॥

ఈజ్ఞాని, తత్త్వమే మురళీకృష్ణుం డనును.

వంశీవిభూషితకరా న్నవనీరదాభాత్,
పీతామ్బరా దరుణబిమ్బఫలాధరోష్ఠాత్
పూర్ణేన్దుసున్దరముఖా దరవిన్దనేత్రాత్
కృష్ణా త్పరం కి మపి తత్త్వ మహం న జానే ॥

ఇక నద్వైతమతస్థాపకులు జగద్గురు శ్రీ శంకరుల భగవద్భక్తిభావాభిరతికి శివానందలహరి రుజువు.

ఆనన్దామృతపూరితా హరపదా
మ్భోజాలవాలోద్యతా
స్థైర్యోపఘ్న ముపేత్య భక్తిలతికా
శాఖోపశాఖాన్వితా
ఉచ్చై ర్మానసకాయమానపటలీ
మాక్రమ్య నిష్కల్మషా
నిత్యాభీష్టఫలప్రదా
భవతు మే సత్కర్మసంవర్ధితా ॥

శ్రీవారు నాకు పరమశివుని పాదములయందలి భక్తి శాశ్వత మోక్షఫలము నిచ్చుగాకని యరించిరి.

"సగుణం బెఱిగి భజించిన
నగు నిర్గుణసిద్ధి సిద్ధుడగునాతనికిన్
జగ మెల్లను బ్రహ్మమయం
బుగ దోచును సర్వకాలమును నొక్కగతిన్."

ఓమ్ తత్ సత్.

---

(౧౫౧ వ పుటకు తరువాయి)

II

సోదరా, నీ వింకా సాధకుడ వేసుమీ—నీవు నాలుగు వేదాంతపు ముక్కలు నోటపట్టినంతమాత్రాన సిద్ధుడవైనట్లు తలంచకు—అది చాల మోసము.

సాధకుని ముఖ్యంగా చెరిపేదేమిటో తెలుసునా? అజ్ఞానంకాదు. హృదయదౌర్బల్యమూ కాదు. ఆత్మవంచనము—అనగా నిన్ను నీవు మోసం చేసుకోవడం.

చాలమంది సాధకులను ముందుగ భంగపరిచే దిదే—ఆత్మవంచనము. ఆత్మవంచనం స్వాతిశయాన్ని పెంచి, ముందుకు బోర్ల దోస్తుంది. దానితో పతనం నిశ్చయం.

ధర్మగ్రంథాలెన్నో పఠిస్తావు — ఎన్నో ప్రమాణవాక్యాలను కంఠస్థం చేసుకొంటావు, అంతటితో నీవు పండితుడవైనట్లు గురూపదేశాలు మొదలుపెట్టుతావు.

నీవు కాషాయాంబరాలు ధరించు, ధరించకపో. నీ వితరులకంటె పవిత్రుడవైనట్లు భ్రమించావా, నీలో జ్ఞానదీపం ఆరిపోయిందన్నమాటే. గర్వం పతనహేతువు.

విద్వత్తును సంపాదించడం ఒక కష్టంలోనిది కాదు — వాక్యార్థాలు వ్యాఖ్యానాలుచేసే నిపుణతను సంపాదించవచ్చు. వచోవిలాసం కూడా నీకు అమరిందా, అమాయకప్రజనం నీ చుట్టూ చేరి ప్రణామాలుచేస్తూ పూజలు మొదలుపెట్టుతారు. ఎట్టి వంచన మోయి సోదరా!

నిజమైన జ్ఞాని ఇట్లా బాకా ఊదుకోడు, బయటకు జ్ఞానివలెనే కనబడడు. స్వాతిశయం పెరుగుతుందనేభయంతో వినయసంపన్నుడై ఉంటాడు. వినయం సాధకుని సహజశీలం.

నీ లక్ష్యమెక్కడ? నీ వెక్కడ? అది చుక్కల్లోఉంది—నీవో! మట్టిలో ఉన్నావు- ఆచుక్క నీకంటిలో అప్పుడప్పుడు మినుకు మినుకు మన్నంతమాత్రాన, తారాపథంలోకి వెళ్ళినట్లే ఎంచుకొంటావా?

నీవు రాత్రిళ్ళు నిదురకుబోయేటప్పుడు ఆత్మ పరీక్ష చేసుకొంటూ ఉండు—నీ దినచర్య— బాహ్యచేష్టలనే కాదు—నీ గూఢ ఆలోచనలను, నీ రహస్యసంకల్పాలను, లోపల దాగుడుమూతలాడుతూండే వాంఛలను బయటకు లాగి, పరిశీలించుకో.

అప్పుడు తెలుస్తుంది.—నీవు సత్యానికి, సుందరానికి ఎంతదూరంలో, ఎట్టి చీకటిమబ్బుల్లో పడియున్నది. నీకే బోధ అగుతుంది. సాధనమార్గం వైకుంఠపాళీవంటి ఆట. నిచ్చెన ఎక్కుతూ ఉంటావు — పదిమెట్లెక్కావు. ఇంతలో ఒక పాము కాటువేసి, నిన్నమాంతంగా మొదట్లోకి తీసుకువస్తుంది. సాధన దిన దినగండం. కఠోరమైన - అసిధారావ్రతం.

స్వాతిశయం కూడదంటే, అసలు ఉత్సాహమే ఉండకూడదని కాదు. కృపణత్వం ఉత్సాహాన్ని మందగింపజేస్తుంది. స్వాతిశయం ఉత్సాహాన్ని క్రియాశూన్యంగా జేస్తుంది. వినయ శాశీల్యములతో గూడిన ఉత్సాహశక్తే నీ సాధనను సఫలపరుస్తుంది.

# త్యాగరాజస్వామి - నవవిధ భక్తిమార్గము

## శ్రీ అల్లాడి రామచంద్రగారు

ఎందఱో మహానుభావులు. చంద్రవదనుని యందచందముల హృదయారవిందమున జూచి బ్రహ్మానంద మనుభవించువా రెందఱో మహానుభావులు. పతితపావనుడగు పరాత్పరుని గుఱించి, పరమార్థమగు నిజమార్గమున పాడుచు సల్లాపముతో స్వరరాగలయాది రాగముల దెలిసినవా రెందఱో మహానుభావులు. పరమభాగవత మౌనివర శశిభాకర సనక సనందన దిగీశ సుర కింపురుష కనకకశిపుసుత నారద తుంబురు పవనసూను బాలచంద్రధర శుక సరోజభవ భూసురవరులు పరమపావనులు ఘనులు శాశ్వతులు సదానుభవు లెందఱో మహానుభావులు. వారు చూపిన చక్కని రాజమార్గము నవలంబించి భాగవత రామాయణ గీతాది శ్రుతిశాస్త్ర పురాణపు మర్మములను శివాదిషణ్మతముల గూఢములను ముప్పదిముక్కోటి సురాంతరంగముల భావంబుల నెఱిగి భావరాగలయాది సౌఖ్యముచే నిరవధిసుఖాత్ముడైన మహానుభావుడు త్యాగరాజు.

కాకర్లవంశోద్భవుడై నారదకృపాతిశయముచే రజతగిరీశుడు నగజకు దెలిపిన స్వరార్ణవమర్మముల నెఱింగి సద్భక్తి సంగీతజ్ఞాన విహీనులకు మోక్షము కలదా యని వాపోయె నా మహానుభావుడు. ప్రాణానలసంయోగము వలన ప్రణవనాదము సప్తస్వరములై పరగెననియు బ్రహ్మస్వరూపము "నాదతనుమనిశ" మని తెలిసికొని,

"తనుహృద్భావమల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వముఁ వందనార్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం బను" తొమ్మిది భక్తిమార్గముల ఆనాదమూర్తిని కొలిచె నా మహానుభావుడు.

భగవన్నామశ్రవణము భక్తిమార్గమున మొదటిమెట్టు. ఆ రాముని సాహసోదార కృత్యముల విన్న త్యాగరాజు

"క్షీరసాగరశయన నన్ను
చింతలు పెట్టవలెనా రామా
వారణరాజును బ్రోవ వేగముగ
వచ్చినది విన్నానురా రామా
నారీమణికి చీర లిచ్చినది
నాడే నే విన్నానురా
ధీరుడై రామదాసునిబంధము
విచ్చినది విన్నానురా
నీరజాక్షికై నీరధిదాటిన
నీకీర్తిని విన్నానురా
తారకనామా దయతో
త్యాగరాజనుతా నన్నేలుకోరా"

యని భక్తిపరవశుడై స్వామిని ప్రార్థించెను. అంతటితో ఆగక సుధాకరాననుని, సుధామాధుర్యభాషణుని కథామృతము వినుటచే బహుకాలము ఆకలిదీరు నని చెప్పి

"రామకథాసుధారసపాన
మొకరాజ్యము సేయునే
భామామణి జానకి సౌమిత్రి
భరతాదులతో వెలయు
ధర్మాద్యఖిలఫలితమే మనసా
ధైర్యానందసౌఖ్యనికేతనమే
కర్మబంధజ్వలనాబ్ధినావమే కలిహరమే"

యని రామకథాశ్రవణఫలము వివరించి భక్తులలో భగవత్కథాశ్రవణవాంఛ రేకెత్తించిన ఘను డాతడు.

భగవంతుని మేను నామవైభవముల పరాక్రమధైర్యముల శాంతమానసము నీవులను వచనసత్యమును విన్న త్యాగరాజు ఆ స్వామి గుణభజనానంద సంకీర్తనము సేయదొడంగుటలో నాశ్చర్య మేమి. పైపెచ్చు తాను కీర్తనము చేయుటకే ఆ రాము డవతరించె నని పల్కినా డా భక్తుడు. రాముని జూచి

"ఏలావతార మెత్తితి వయ్యా రామా
అయోధ్యను పాలించుటకా
యోగులు చూచుటందుకా
భవరోగుల బ్రోచుటందుకా లేక
శతరాగరత్నమాలికలు రచించిన
త్యాగరాజునకు వర మొసంగుటకా"

త్యాగరాజు కడతేర తారక మని చేసిన రాగరత్నమాలికచే రంజిల్లు నట ఆ హరి. ఆ కీర్తనములు నైగమషట్ఛాస్త్రపురాణాగమార్థసహితములు. భాగవతోత్తములు గూడి పాడెడి కీర్తనము లవి. యోగివరు లానంద మొందెడి ఆ కీర్తనమార్గము "ఇంత సౌఖ్య మని జెప్పజాల డట త్యాగరాజు" ఎంత సౌఖ్యమో ఏమో ఎవరికి దెలియునో దాంత సీతాకాంత కరుణాస్వాంత ప్రేమాదులకే దెలియునే గాని ఇంత సౌఖ్య మని నే

జెప్పజాల. స్వరరాగలయ సుధారసమందు వరరామనామమను కండచక్కెర మిశ్రము చేసి భుజించు శంకరునికి దెలియునుగాని ఇంత సౌఖ్యమని జెప్పజాల ననుచున్నా డా భక్తుడు. స్వామి ఓరచూపు జూచినపుడు "రామా నిన్ను మఱచువాడనా నీ పదచింతన నాకు జీవనము. మదనజనక మరకతాంగ నేను మఱచువా డని ఎంచవలదు. కానివారలు కరుణలేక నాపై లేని నేరము లెంచినను శ్రీ నిజముగ నాచెంత చేరినను సుభముగ లభింపని నీదయను కీర్తించుట మఱచువాడను కా"డనుట త్యాగరాజు భక్తికి గీటురాయి.

మీదుమిక్కిలి నరుడై పుట్టినందులకు రామనామస్మరణమే సుఖము. వరరాజయోగ నిష్ణాతులౌ వారి కానంద మొసగెడు ఆ రామ నామస్మరణమే సుఖ మన్నా డా భక్త శిరోమణి.

కేవలము స్వామి కథాశ్రవణము భగవ న్నామ సంకీర్తనము రామనామ సంస్మరణ ములతో తనియక "సరగున పాదములకు స్వాంతమను సరోజమును సమర్పణము జేసిన" మహానుభావు డాతడు. స్వామి పదసేవనము భక్తుల కతిప్రియము. రాతిని నాతిని జేసిన స్వామిపాదమును గోపన్న కీర్తింప, "ఈ పాదము బ్రహ్మకడిగిన పాదము, బ్రహ్మము తానే ఈ పాదము కామినిపాపము కడిగిన పాదము వసుధను కొలిచిన పాదము ప్రేమప్రియసతి పిసికెడుపాద" మన్నారు అన్నమాచార్యులవారు. ఇంతెందులకు భరతుడు నాడే స్వామిపాదుకల మోయలేదా. ఆ మహానుభావులందఱు చూపిన చక్కని రాజమార్గమే త్యాగరాజుమార్గము. రాముని పాదము కృపకల్గిన చాలు ననును. త్యాగరాజు అమృతవాహినిరాగములో

"శ్రీరామపాదమా నీకృప చాలునే
చిత్తానికిరావే
వారిజభవసనకసనందన
వాసవాదినారదులెల్ల
పూజించే దారిని శిలయై తాపము తాళక
వారక కన్నీరును రాల్పగా
శూర అహల్యను జూచి బ్రోచితివి
యారీతి ధన్యుజేయవే త్యాగరాజగేయమా"

యని రామపాదధ్యానము జేసినా డా మహానుభావుడు. అంతటితో నాగక సందేహమును దీర్ప నయ్యా సాకేతనిలయ రామయ్య సందార్చితపాదయుగములు మేలో నాగరీకమగు పాదుకాయుగంబులు మేలో వరమౌనులెల్ల చరణంబులను స్మరియింప నీవు పద మొసంగ నే భరతార్చనచే పాదుకలు ధరణిని న్నొసంగె త్యాగరాజభాగ్యమా యని సందేహమును తీర్పుమను నాభక్తుడు. నిరంతరము రాముని పదసేవనము చేయుచున్న త్యాగరాజు స్వామి కటాక్షము లభింప కుండుటకై వగచుచు

"శ్రీరామరామరామ సీతాహృజ్జలధిసోమ
నీపాదముల భక్తినిండారగనొసగి
కాపాడు నాపాప మేపాటి రాదు
పలికి కొన్నాళ్ళిపుడు పలుకుంటే విడుతునా
కులమర్మముల నెల్ల దలచి నన్ను బ్రోవవయ్యా
పలుమారు నిను బాడి పాడి వేడుకొన్నాను
కలకలమని నాతో పలుక వేమయా ఇపుడు
లోకుల నెఱనమ్మకొనక నీపాదము లిందాకను
మది నుంచ క్రీగంట జూడ వేమి
రాజశేఖర దేవరాజరాజీవభవ
పూజార్హ శ్రీత్యాగరాజుని మొఱాలించవయ్యా

యని పలికిన రామ పదసేవాధురంధరు డా త్యాగరాజు. ఇంతెందులకు రాముని పదసరోజ

ముల సేవించుటే చిరకాలేప్సితమనియు పురుషార్థములు గాని స్వామిసారూప్యముగాని తనకు ముఖ్యము కాదు నిరంతర మా శ్రీమానినీ మనోహరుపదసేవనమే అతని చిన్నకోరిక యని తెల్పిన ఆ భక్తుని సాటి ఎవ్వరు ?

ఆ నిరంతర రామ సేవాపరాయణునికి కమలాక్షు నర్చించు కరములే కరము లని తెలిసెనో ఏమో గాని యాతడు స్వామిని నిత్యము అర్చించినవిధము స్వామికి జరిపిన షోడశోపచార విధానములు వర్ణనలకు లోబడవు. వేకువజాముననే లేచి తంబూర చేగొని గుణముల చెలువొంద బాడుచు నిద్ర మేల్కొలిపి స్వాగత మిచ్చు విధ మనమానము.

"హెచ్చరికగ రారా హే రామచంద్ర
హెచ్చరికగ రారా హే సుగుణసాంద్ర
పచ్చవిలుతుని గన్న పాలితసురేంద్ర
కనకమయమౌ మకుటకాంతి మెరయగను
ఘనమైన కుండలయుగ్మంబులు గదలగను
ఘనమైన నూపురయుగ్మంబు ఘల్లనను
సనకాదులెల్ల కని సంతసిల్లగను
ఆణిముత్యాల సరు లల్లాడగను
వాణీపతీంద్రు లిరువరుస పొగడగను
మాణిక్యసోపానమందు మెల్లగను
వీణ పలుకులు వినుచు వేడుక చెల్లగను
నిన్ను జూడవచ్చు భగినికరంబు చిలుక
మనసు రంజిల్లు నీ మహిమను బలుకు
మినువాసులెల్ల విరులను చాల జిలుక
ఘనత్యాగరాజు కనుగొను ముద్దు గులుక"

రమ్మని యాహ్వానించి,

"చేతులార శృంగారము చేసి చూతును
రామ

సేతుబంధన సురపతి సరసీరుహాభ వాదులు
బొగడ
మెరుగు బంగారు అందెలు బెట్టి
మేటియౌ సరిగవల్వలు గట్టి
సురతరుసుమముల సిగ నిండ జుట్టి
సుందరమగు మోమును ముద్దుబెట్టి
మొలను కుందనపు గజ్జెలు గూర్చి
ముద్దుగ నుదుటను తిలకము తీర్చి
అలకలపై రావిరేకయు జేర్చి
అందమైన నిన్నురమున జేర్చి
ఆణిముత్యాల కొండె వేసి
హాసుగ పరిమళగంధము పూసి
వాణి సురటిచే విసరగ
వాసి వాసి యనుచు త్యాగరాజనుత
నా జేతులార శృంగారము జేసెద"

పనుటలో త్యాగరాజు పొందిన ఆనందము ఆ ఖరహరునే మురిపించిన దేమో. అట్లలంకరింపబడిన స్వామిపై "చల్లరే రామచంద్రునిపై పూల, చల్లరే సొంపైన మనసుతో ఇంపైన బంగారుగంపలతో మంచి చంపకములను చల్లరే. పామరములు మాని నేమముతోను రమామనోహరునిపైని తామరపూలు చల్లరే, ధాతవినుతుడైన సీతాపతిపైని చేతులతో పారిజాత సుమముల జల్లరే, ఈ జగతిని దేవపూజార్హమౌ పూలమేలైన జాజి కుసుమముల చల్లరే. దినమణికులార్ణవ విమలచంద్రునిపై హృత్కుముదసుమముల జల్లరే" యని యర్చించి అట్లర్చించిన ఎన్నరాని జననమరణము లేవనియు భక్తులకు తెలిపినవాడు త్యాగరాజు. పూజానంతరము స్వామికి "ఆరగింపవే పాలారగింపవే రఘువీర జనకజాకర పవిత్రతమౌ వెన్న పాలారగింపవే సారమైన దివ్యాన్నము షడ్రసయుతమైన భక్షణముల దారసోదరాదులతో భుజింపు" మని స్వామికి

నైవేద్యకైంకర్య మనిశము జరిపెడివాడట త్యాగరాజు. భోజనానంతరము తాంబూలసేవనము సర్వసాధారణము. స్వామిని "విడెము సేయవే, నన్ను విడనాడకవే, పుడమితనయ చేతి మంచిమడుపులను చదలచి తలచి విడెము సేయవే రామా. రాజమూన్యుడా సౌమిత్రి రతన తమ్మపడిగ బట్టి తేజిల్ల నిలిచినాడు, దేవదేవా జాజికాయలు ఏలకులు జాపత్రి పక్కలాకులు రాజరాజవర" యని త్యాగరాజు దినము ప్రేమతో స్వామికి విడె మొసగి, ఉపచారములను జేకొన వయ్యా ఉరగశయన చపలకోటినిభాంబరధర శ్రీ జానకీపతి దయ చేసి నాదు ఉపచారములను గైకొనవయ్యా, కపటనాటకసూత్రధారివై కామిత ఫలము లొసగురామ, అపరిమితనవరత్నములు పొదిగిన అపరంజి గొడుగు నీకే తగునయ్యా, మెరుగు తీగలు రీతిని మెరిసే కరకుబంగారు కాడ లమరిన శరదిందు ద్యుతివిమానమౌ చామరయుగములు నీకే తగునయ్యా, జాజులు సంపంగులు మరువపు విరజాజులు కురువేరు వాసనలను విరాజమానమగు వ్యజనము త్యాగరాజవినుత నీకే తగునయ్యా" యని ఛత్రచామరాద్యుపచారముల జేసి స్వామికి జయమంగళం నిత్యశుభమంగళం కరుణారసాలయాయ కామారివినుతాయ తరుణారుణాభ సుందరపదాయ నిరుపమశరీరాయ నిఖిలాగమచరాయ సురవినుతచరితాయ సుందరాయ జయ మంగళ మని మంగళోపచారము జేసి రామ శ్రీరామ లాలీ, ఊగుచు ఘనశ్యామ బ్రోవు లాలీ, కాంచి సేవింతు లాలీ, శేష తల్పము సూచి పాడుదు లాలీ, ఏకాంతమున దాని పూజింతు లాలీ, ఆవేళ నిన్ను జూచు చుప్పొంగే లాలీ, ఓ వనమాలీ చాల పాలింతు లాలీ, మీగడ వెన్న పాలు దాగింతు లాలీ, శయ్యపై మల్లెపూల బరతు లాలీ, పరమైన విడేల నొసగె లాలీ, ఓ వనమాలీ వేదవేద్యమా లాలీ, కన్నుల జూడవే దయానిధీ లాలీ, నాదురమున నీపాదము లుంచు లాలీ, శ్రీత్యాగరాజ మోదరూపమా లాలీ ఓ వనమాలి" యని నిద్రపుచ్చి మరుసటి దినము ఉషఃసమయమున మేలుకొలుపువిధము అనితరసాధ్యము.

"మేలుకో దయానిధీ మేలుకో దాశరథీ
మేలుకో దయానిధీ మిత్రోదయమౌ వేళ
వెన్నపాలు బంగారుగిన్నెలో నే నుంచినాను
తిన్న గారగించి తేట కన్నులతో నన్ను బ్రోవ
నారదాది మునులు సురలు వారిజభవు
డిందుకలా
ధరుడు నీ సన్నిధిలో కోరి కొలువుగాచినారు
రాజరాజాది దిగ్రాజులెల్ల వచ్చినారు రాజనీతి
తెలియ
త్యాగరాజవినుత నన్ను బ్రోవ మేలుకోవయ్యా"

యని స్వామిని నిద్ర లేపెడి ఆ భక్తుని కిలలో సాటి యెవ్వరు? ఇట్లు షోడశోపచారపూజాదికము లనుదినము చేసి త్యాగరాజు రఘునందనునికి వందనము సేయురీతి నిరుపమానము.

"వందనము రఘునందన సేతుబంధన
భక్తచందన రామా
శ్రీరామా నాతో వాదమా,
నేభేదమాఇది మోదమా రామ
శ్రీరమాహృత్సారమా బ్రోవ
భారమా రాయబారమా
రామ వింటిని నమ్ముకొంటిని
శరణంటి రమ్మంటిని రామ
ఓడను భక్తివీడను నొరుల
వేడను నీవాడను రామ
వేగ రా కరుణాసాగరా
శ్రీత్యాగరాజహృదయాగారా"
రామా నీకు వందనము.

పై భక్తిమార్గములతో స్వామిని సేవించిన వానితో తృప్తిపడక త్యాగరాజు

"తవ దాసోహం తవ
దాసోహం దాశరథీ
వరమృదుభాష విరహితదోష
నరవర వేష దాశరథీ
సరసిజనేత్ర పరమపవిత్ర
సురపతిమిత్ర దాశరథీ
నిన్ను కోరితిరా నిరుపమశూర
నన్నేలుకోరా దాశరథీ
మనవిని వినుమా యని వేడి బంటురీతి
కొలువియ్య వయ్యారామ"

యనియు చెంతనే సదా ఉంచుకోవయ్యా యనియు స్వామి దాసుడనుటలో బ్రహ్మానంద మందె నా మహానుభావుడు.

అన్ని సేవలు చేసి అంతరంగమున ఆ రవికుల తిలకుని కీర్తించి తుదకు స్వామికి ఆత్మనివేదనమే చేసికొన్నాడా భక్తశిరోమణి. మాకేలరా విచారము మమ్ముగన్న శ్రీరామచంద్ర సాకేత రాజకుమార సద్భక్తమందార శ్రీకర జతగూర్చి నాటకసూత్రమును జగమెల్ల మెచ్చగ కరమును నికి గతి తప్పక యాడించెదవు సుమి నవత్యాగ రాజ గిరీశవినుతా యని తన్ను తాను స్వామి కర్పణము జేసికొన్నవా డాయోగివర్యుడు.

ఇన్నిభక్తిమార్గముల స్వామిని సేవించిన యాతనికి స్వామిపై వాత్సల్యమునకాలోటు? స్వామివారు చేసిన దివ్యనామసంకీర్తనములు, లాలిపాట లన్నియు ఆ దశరథసూనుపై నాతనికి గల వాత్సల్యమునకు నికషోపలములు. ఇంతెందులకు సీతమ్మ మాయమ్మ శ్రీరాముడు మాతండ్రి, వాతాత్మజ సౌమిత్రి వైనతేయ రిపుమర్దన తాత భరతాదులు సోదరు లనియు తెలుపుకొన్న రామభక్తు డాతడు.

ఇట్లు నవవిధభక్తిమార్గముల ఆరాము నారాధించి సేవించినఘను డాతడు. ఒక క్షణ మూ... నాడు గీర్వాణ తరుశాఖలపై రామనామ కూజితములొనర్చిన వాల్మీకిముని కోకిలము అంతటితో తనియక త్యాగరాజై యవతరించెనని తెలిసికొన్నపుడు త్యాగరాజంతటి భక్తు డనుటలో అతిశయము లేదనుట నిశ్చయము ఎందఱో మహానుభావులు అందరికి వందనములు.

# మతము ఐక్యమునకు దోహదకారి

## శ్రీ చీరాల కృష్ణప్రసాదుగారు

మతము ఐక్యమునకు దోహదకారి అని నిస్సందేహముగ చెప్పవలెనన్న, మత మనగా నేమి? మతము ఉద్భవించుటకు కారణ మేమి? మతము ఐక్యమును ఏవిధముగా సాధించును? అను ఈ మూడు విషయములను క్షుణ్ణముగా పరిశీలింపవలెను.

ప్రపంచ చరిత్రను బాగుగా పరిశీలించి చూచిన అందు మతమునకు సంబంధించిన విషయములు—ముఖ్యముగ మత మనెడిది ఏల ఉద్భవించెనో తెలియును. మతము ప్రకృతి శక్తులవలని 'భయము' నుండి ఉద్భవించె నని చెప్పుటలో అతిశయోక్తి లేదు. ఇందుకు నిదర్శనము చరిత్రయే.

ఆదిమానవుడు ఒంటరిగా జీవనము చేయు నప్పుడు అతడు ఎన్నియో సమస్యలను ఎదుర్కొన వలసి వచ్చెను. అట్టి సమస్యలలో అతి

ముఖ్యమైనది ప్రకృతి కొనసాగించు భీకరవిన్యాసములు. అతడు ఏకాకిగా ఉన్నప్పుడు ఈ సమస్యల యొత్తిడికి భయపడి ఇతరాదిమవాసులతో కలిసి సంఘ జీవనమునకు అలవాటు పడెను. ఇట్లు అనేకభయాకులులైన ఏకాకులు సంఘమును ఏర్పఱచుకొని అనేక సమస్యలను పరిష్కరించుకొనుచుండిరి. కాని అట్టి భయకంపితులైన ఆదిమవాసులు సంఘజీవులై ఉండి గూడ ఇతరానేక సమస్యలను పరిష్కరింపలేక పోయిరి. పైన చెప్పిన విధముగా ప్రకృతి దేవతాశక్తుల ప్రభావమునకు తలలు వంచి బానిస లయిరి.

[ఈ అణుయుగమున అపారవైజ్ఞానిక శాస్త్ర ప్రగతిలో ఎంతయో సాధించిన నవీన మానవుడే— ప్రకృతి భీకర ఘోర స్వైర విహారములకు అనగా కుండపోతవర్షములకు, వఱదలకు భయంకర భూకంపములకు ఈ మున్నగు వానికి లొంగి పోవుచున్నప్పుడు; దిగంబరుడైన ఆదిమవాసి ఈ అనన్యసామాన్యశక్తులచే పరాభవింపబడుట సహజమే.] వాయు, వరుణాగ్ని ప్రముఖశక్తుల తీవ్రతకు వారు తలలు ఒగ్గవలసి వచ్చెను. వారు సంఘజీవులై యుండిరి. కావున ఈ ప్రకృతి శక్తులపైన ఏకాభిప్రాయము కలిగి యుండిరి. ఈ నమ్మకమే నవీనశిలాయుగములో, లోహయుగములో కూడ చలింపక బహుకాల ముండిన దని ఊహింపవచ్చును.

తమ జీవితములను నిర్ణయించునది, పరీక్షించునది, అంతము చేయునది — తమకు సాధ్యపడనిది ఒకటి కల దని వారు తెలిసికొనిరి. (Human recognition of superhuman controlling power) ఇచ్చటనే మతము ప్రారంభమాయెను. వీరే మతచరిత్రకు నాంది పలికిన మానవయోధులు. ఈవిధముగ ప్రకృతి శక్తుల నుండి భయము, అందుండి సంఘము, సంఘము నుండి నమ్మకము, అందుండి మతము ఉద్భవించిన దని చెప్పవచ్చును.

[Nature→Fear→Society→Faith→Religion].

శిలాయుగమున మత మనగా నమ్మకమే. దీని కొక నామధేయము లేదు, నిర్వాహకులు లేరు. ఈ నమ్మకమును నవీనవైజ్ఞానిక సాంఘిక విషయములతో పరిశీలించిన వానిని గ్రుడ్డి నమ్మకము అనియే నిర్ధారణ చేయవలెను. 'నమ్మకము' రూపములో నుండిన మతము ఆదిమవాసులలో సఖ్యమును ఎట్లు సాధించెనో పరిశీలింతము. మానవమేధాశక్తి కాలచక్రగమనవేగముతోపాటు పోటీపడుచు ముందుకు పోవుచునే యున్న దని చరిత్ర సిద్ధాంతీకరించుచున్నది. కావున శిలాయుగమానవుడుకూడ 'పోరు నష్టము పొందులాభము', 'ఐకమత్యమే మహాబలము', 'కలిసి ఉన్న కలదు సుఖ'మని తెలిసికొనకలిగెను. ఆకాలమున 'దినగండము నూరేళ్ళాయు'స్సని వారు తలంచుచుండిరి. వారికి దినదినము ఎదుర్కొనవలసిన ప్రశ్న ఆహారము. వారు ఆకులు, అలములు, పండ్లు, కాయలు భుజించుచు ఆహారసమస్యను తీర్చుకొనుచుండిరి. కాని ఇవి లభ్యములు కానప్పుడు జంతువులను చంపి పచ్చిమాంసమును భక్షించుచుండిరి. ఈ ఆహారసంపాదనాకార్యమున వీరు ఐకమత్యపు విలువను బాగుగా గ్రహించిరి. అల్పజీవు లెట్లు వీరి దేహదార్ఢ్యమునకు, ధాటికి తట్టుకొనలేక ప్రాణములు కోల్పోయినవో అదే విధముగ వీరుకూడ ప్రకృతియందలి మిక్కిలి భయంకర క్రూరమృగముల స్వైర విహారములకు గుఱియై అసువుల బాసిరి. అల్పజీవియైన మార్జాలమును మథించి రేమో కాని మారుత వేగముతో పరుగిడి పచ్చినెత్తురు ఆస్వాదించు చిఱుతను, సింహరాజమును, 'పిల్లికి మేనమామ'గా పరిగణింపబడు బెబ్బులిని, యముని

వాహనమైన మహిషమును, ఉక్కును కరిగిన శిలలను తుత్తునియలు చేయు ఖడ్గమృగమును ఇట్లు అపాయకరములగు వన్యమృగము లనేకములను వారు ఏమియు చేయలేక పోవుటయే గాక వాని విజృంభణలకు భయకంపితులై కొండగుహలలో తలదాచుకొనిరి. కాని ఇట్టి క్రూరమృగవిజృంభణ అజేయముగ ఎంత కాలము కొనసాగగలదు? నవీనశిలాయుగము ప్రారంభ మాయెను. మానవుడు మునుపటి వలె కాక, ఈ కాలములో కఠిన శిలలతో దృఢములైన ఆయుధములు తయారుచేయుట తెలిసికొనెను, సంఘజీవనము పటిష్ఠ మయ్యెను. కాని ఈ నవీన శిలాయుగమునగూడ ఆవన్య మృగములు బ్రతుకుచునే యుండెను. అవి వీరితో తలపడినప్పుడు వీరుగూడ తాము తయారుచేసిన మిక్కిలి పదును గల ఆయుధములతో వానిని హింసించి వధించుచు, వాని బల మెక్కువైనప్పుడు వానిచే తాము మడియుచు తమ జీవితములను మిక్కిలి భయంకర వాతావరణములో గడిపిరి.

దేవతాశక్తులపైన ఏకాభిప్రాయము (నమ్మకము) లేకున్న వారు ఒకటిగా కలిసి ఉండెడివారు. అట్లు కలియకున్నచో క్రూరమృగ విజృంభణలకు, ప్రకృతిశక్తుల ప్రభావములకు ఏనాడో బలియై ఉండెడివారు. వారిపటిష్ఠమైన సంఘజీవనము, కలసికట్టుగా కార్యములను నిర్వర్తించుట—ఇత్యాది విషయములు వారిని పై చెప్పబడిన శక్తులనుండి విముక్తులను చేసెను.

ఈ ప్రకృతి శక్తులను రెండువర్గములుగ విభజింపవచ్చును. I అజేయశక్తులు, II అల్ప శక్తులు. అజేయశక్తులనిన వీరికి భయము. అందువలన భక్తి ఏర్పడెను. కాని అజేయ శక్తులను ఎదిరించుట గాని, లేక వానిపై నమ్మకమును పోగొట్టుకొనుటగాని వారు చేయ సాహసింపలేదు. ఇందులకు కారణము మేధాశక్తి లోపించుటయే.

మతము ఐక్యమును ఏవిధముగ సాధించెనో చూచితిమి. ఈ ఐక్యము కొఱకే అయినచో అది మానవునిలో సఖ్యమును సాధించుటకు తోడ్పడుటయే గాక ఒక గమ్యమును గూడ తెలుపుచున్నది. అదియే 'కర్మమార్గము' తద్ద్వారా దేశప్రగతి సాధనను సూచించున్నది.

మానవుడు క్రమక్రమముగా కాలచక్ర భ్రమణముచే మేధాశక్తిని ఆర్జించి ప్రకృతిని ఎదిరించుచున్నాడు. ఆదిమయుగమునుండి మానవుడు మఱియొక గొప్పయుగమునకు పయనించినాడు. ఈ కాలములో అతనికి ప్రకృతిపైగల నమ్మకము మఱింత దృఢమాయెను. ఇది మతరూపమున బహిర్గత మయ్యెను. శిలాయుగమున సంఘజీవనమునకు అలవాటుపడి; ఐకమత్యపు విలువను తెలిసికొనిన అతడు ఏ ప్రాణులను నిర్దయతో సంహరించి వాని పచ్చిమాంసమును భక్షించుచు వచ్చెనో ఆ ప్రాణులను మచ్చికచేసికొని వాని సహకారముతో తన జీవితమును ఇంకను శుభదాయకముగ చేసికొనినాడు. ఈ విషయమునందుకూడ అప్పటి ప్రజలలో నుండిన నమ్మకమే వారి జీవితములను నిమ్నదశనుండి ఉచ్చదశకు తీసికొని వెళ్లెనని ఘంటాపథముగా చెప్పవచ్చును. వారిలో ఉన్న పాపభీతివలనను భూతదయవలనను అల్పప్రాణులు గూడ తమవలె జీవులే అనియు, తమకు హాని చేయజాలనిజీవులను తాముసంహరింపరాదనియు వానిని పోషించి, వానినిగూడ తోడి మానవులతో సమానముగా గౌరవింపవలెననియు అభిప్రాయ మేర్పడెను. అటుతర్వాత గోవును గోమాతగా భావించి మిక్కిలి గౌరవముతో పూజింపనారంభించిరి ఆనాడు ఆదిమానవుడు మతమునకు నాంది పలుకగా ఈ యుగమున

అనగా నవీన శిలాయుగమున మతమునకు ఒక స్వరూపము ప్రసాదింపబడినది. మతము మానవులలోనే ఐక్యమును సాధించుటయేగాక సకల ప్రాణిసముదాయమునకు వారి సఖ్యజీవనమునకు హేతువాయెను.

ప్రగతి అనెడి మహాపర్వతమును అధిరోహించి జయపతాకమును ఎగురవేయవలెనన్న అందులకు ప్రథమసోపానము ఐకమత్యమనెడి గమ్యమనియు, సఖ్యము, సఖ్యముకొఱకే కాదనియు—ఇట్లు మతము — ఐకమత్యము — ప్రగతికి గల బాంధవ్యములను ఇదివఱకే తెలిసికొంటిమి. ఈవిధముగ మానవుడు ఒకప్పుడు ఏకాకిగా జీవించి ఈ యుగమున సంఘజీవియై తోడి మానవులతో కలిసి తన జీవితమును, తోడిప్రాణుల జీవితములను ఆనందదాయకములుగ చేయుచున్నాడు.

ఒకప్పుడు ప్రకృతి ప్రసాదించు ఆకులు, అలములు కందమూలములనే భుజించువాడు. ఇప్పుడు చెమటోడ్చి కష్టపడి, వ్యవసాయము చేసి, పంటలు పండించి ప్రకృతిపై అంతగా ఆధారపడక "కృషితో నాస్తి చ దుర్భిక్షం" అనెడి సూక్తిని సత్యము చేయుచున్నాడు. ఇట్లు ఒకవైపు ఆర్థికముగ మతప్రభావముచే ఆధ్యాత్మికముగ అభివృద్ధి చెందుచు నాగరికుడగుచున్నాడు. ఈవిధమున మానవుడు దేశప్రగతిని సాధించుటకు, అతని మేధాశక్తి మహోత్కృష్టస్థాన మలంకరించుటకు తోడ్పడిన సాధనము మతమే. మతమే మానవాళి ఐక్యమునకు కారణమని ఈ ఐక్యమే వారి ప్రగతికి హేతువని నిస్సందేహముగ చెప్పగలము.

శిలాయుగమున మత మనెడిది నమ్మకము రూపమున సాధారణస్థితియందుండిన దనియు, నూతనశిలాయుగమున ఈ నమ్మకమునకు ఒక రూపము ఏర్పడి కొద్దికొద్దిగా సిద్ధాంతములు నిర్ణయింపబడిన వనియు తెలిసికొంటిమి. లోహయుగమున నాగరికతాప్రభావముచే ప్రజలు శిలాయుగ ప్రజలవలె కాక ఇంకను ఉత్కృష్టమైన జీవనములు గడిపిరని తెలియుచున్నది. ఒక యుగమునుండి మఱియొక యుగమునకు మానవుడు పయనించుచు ఆతనితోపాటు నాగరికతనుగూడ మహోన్నతస్థితికి తీసికొని వెడలుచున్నాడు. ఈవిధముగ నాగరికత దినదినాభివృద్ధి గాంచుటకు మానవప్రగతి మహోన్నతస్థితి చెందుటకు మతమే మూలకారణము.

"Religion is the manifestation of the divinity already in man" (మానవునిలో అంతర్గతమైయున్న దేవత్వమునకు ఒకరూపమును ఆపాదించునదే మతము") అని శ్రీ వివేకానందస్వామి నిర్వచించియున్నాడు. "Religion is the opiate of masses"—'మతము మానవాళికి మత్తుమందు' అని పెద్దలు వ్రాసిచ్చియున్నారు. కావున మానవునిలో మఱుగుపడిన దేవత్వముచేత, మతప్రభావముచేత ప్రజలను సరియగుమార్గమున నడిపింపగలుగుచున్నాము. ఒక దేశమున మతమే లేకున్న ఆ దేశప్రజలు విభిన్నమార్గములలో, వేర్వేఱు ఆశయములతో సంచరించుచు, దేశపురోగతికి గొడ్డలిపెట్టులుగా మాఱిపోవుదురు. ఐకమత్యము నశించి దేశము అన్ని రంగములలో క్షీణించును.

మానవమేధాశక్తి ప్రభావము మతముపై మిక్కుటముగా కననగును. మానవునికి ఒక నమ్మకమువిూద ఎప్పుడు సందేహము కలుగ నారంభించెనో, ఒక సిద్ధాంతమును ఎప్పుడు ఎదుర్కొని తనకు తాను ఆలోచించి వేఱొక సిద్ధాంతమును ఏర్పఱచుకొన నారంభించెనో — అప్పుడే నామధేయము లేక సాధారణస్థితియందున్న 'నమ్మకము'నకు

వేఱువేఱు నామధేయములు ప్రసాదింపబడి నవి. వేఱువేఱు మతములు, మతప్రవక్తలు భువిపై వెలసిరి. క్రీ. పూ. 200 సంవత్సరమున ఆర్యనాగరకతాసంస్కృతులు మనదేశమున వ్యాపించెను. వారి మేధాశక్తి పరిణామమే చతుర్వేదములు. ఈవిధముగ మనదేశమున ఆధ్యాత్మికచింతన బహురూపముల నందు కొన్నది. అన్నిమతములలోను పురాతనమైన బహుప్రజానీకాదరణల నందుకొన్నది హిందూ మతమే. క్రమముగా తురుష్క, క్రైస్తవ, సిక్కు, బౌద్ధ జైనమతములు, మనదేశమున నిలుకడ గడించి విదేశములకు వ్యాప్తిచెంది నవి. ఈవిధముగ ఒకమతములోని లోటు పాట్లను విమర్శించుచు మఱియొకమతము, అందుగల లోటుపాట్లను సవరించుటకై మఱి యొకటి ఈవిధముగ ప్రపంచమంతటను ఎని మిదిమతములు ప్రజల ఆధ్యాత్మికచింతనకు మూలాధారములై ఉన్నవి.

ఇట్లు అనేకమతములకు చెందిన ప్రజలలో ఏకత్వ మెట్లు కుదురగలదు? అనేకవిభిన్నాభి రుచులుగల, విభిన్నవిశ్వాసములుగల ప్రజలు ఒక్కమార్గమునసే ఎట్లు పయనింతురు? 'మతము ఐక్యమునకు గొడ్డలిపెట్టు వంటిది' కదా! అని మనకు సందేహము కలుగుట అసమంజసము కాదు. కాని మతము లన్నియు వేఱు వేఱు నామధేయములతో వ్యవహరింప బడుచున్నను అవన్నియు మానవునిలో ఐహిక లాభపరాయణశక్తులను నిర్మూలించి ఆధ్యా త్మికచింతనాశక్తులను వృద్ధిపఱచుటకే తోడ్ప డుచున్నవనియు నదులన్నియు ఎట్లు వేఱువేఱు చోట్ల జనించి సాగరమున సంగమము పొందు చున్నవో, పలువన్నెల ఆవులున్నను అవన్నియు ఇచ్చు పాలు ఎట్లు తెల్లనివిగనే ఉన్నవో అట్లే వేఱు వేఱు నామధేయములతో దైవములను సంబోధించునప్పటికి అదంతయు ఒక్కశక్తిస్వరూ పమే అనియు గ్రహింపవలెను. కాని మనము 'భిన్నత్వములో ఏకత్వము' తప్పక కల దని ఎంత సమర్థింపజూచినను ఇన్ని విభిన్నదృక్పథ ములు గల ప్రజానీకమున ఘర్షణలు రాక మానవు. ఇదెట్లు ఉన్నదనగా కొన్నివేల లోహపు రాసులను భూమివైపు వైచి వాని సమీపముననే మఱికొన్ని ఆకర్షణశక్తులు గల అయస్కాంతములను ఉంచినచో ఈ లోహపు రాసులు ఒకదానితో ఒకటి ఘర్షణపడి ఏ అయస్కాంతము మిక్కిలి ఆకర్షణశ కలిగి యున్నదో ఆ ప్రదేశమునకు చేరును. ఇచ్చట మతప్రచారములను, అయస్కాంతశక్తులతో, అయస్కాంతములను మతప్రవక్తలతో పోల్ప వచ్చును.

భూమి ఒక ఇరుసుమీద ఆధారపడినట్లు, ప్రజానీకము ప్రగతి అనెడి ఇరుసుమీద ఆధార పడియున్నది. ఈ ప్రగతి అనెడి దృక్పథము ప్రజలలో శాశ్వతముగ చొచ్చుకొని ఉన్న జాతిమతకులభేదములను నశింపజేసి వారిని ఎల్లప్పుడు ఈ అనన్యసామాన్యమైన ఘనమైన గమ్యముపైనే దృష్టిని కేంద్రీకరింపజేయుటచే మతములు ఆయా దేశప్రజలను ఒక గమ్య మార్గములో సంచరించుటకు తోడ్పడుటచే, ఆర్థిక ప్రగతి. శాస్త్రనిపుణులు గూడ ఒక దేశార్థిక ప్రగతివిధానమున మతమునకు, సంఘాచారములకు, నాగరకతా సంస్కృతులకు గొప్పస్థాన మున్న దని, మతము ఆధ్యాత్మిక ప్రగతికేగాక ప్రజలలో ఐక్యమును అటుపిమ్మట వారి దేశార్థిక ప్రగతికి తోడ్పడుచున్నదని సిద్ధాంతీకరించియున్నారు.

# విశ్వగుణాదర్శము

## శ్రీ రంగనాథానందస్వామి

(గత సంచిక తరువాయి)

ప్రశ్న—అమెరికనుల నాగరకత అధఃపతన మొందుచున్నదా? అటులేని దాని కుజ్జ్వలపునర్భవము గలిగింప గలిగిన దేది? అందు వేదాంత మెట్టిపాత్రను నిర్వహింపగలదు?

జవాబు—ఇప్పు డున్న అమెరికను నాగరకత విషయమున అసంతృప్తి జెందిన మేధావులున్నారు అమెరికాలో. రాష్ట్రపతి నిక్సనుతో సహా రాజకీయనాయకులు అమెరికను సంఘమును రుగ్ణసంఘ మని పేరుకొన్నారు. అది రుగ్ణమే. ఏదో రోగ మున్నది. లేకున్న ఈ చెలరేగుచున్న దుండగాలకు ఇంద్రియోన్మాదమునకును ప్రజలఅసంతుష్టికిని వీని కన్నిటికిని కారణమేమి? యువకుల తిరుగుబాట్లనుబోలిన వెన్నో ఉన్నవి. ఇవన్నియు ఏదో యొక రోగపులక్షణములే. ఆ రోగ మేమో కనుగొనవలెను. అందు కొక మందును కనుగొనవలెను. అదే సమస్య. ఆధునిక నాగరకతలో మానవుని వరిష్ఠతను గూర్చిన మన యాశయము పూర్తిగా మఱింత గంభీరము కావలయును. ఈ విషయమునకు కీలక మదే. ఈలక్షణము లన్నియు కేవలము ఫలితములు. మానవుని స్వరూపమేమి? స్వరూపములోని సారతమాంశ మేది? దానిని చక్కగా అర్థము చేసికొనజాలమేని, ఏ మేలును గలుగదు. ఇక్కడ అక్కడ ఇంచుక అతుకుపని చేసినంతమాత్రాన సమస్య పరిష్కారము కాబోదు.

ఈసందర్భముననే ఆధునిక పాశ్చాత్యనాగరకతకు క్రొంగొత్తరూపు దాల్పుటలో యుక్తిసహము శాస్త్రీయము గంభీరతత్త్వశాస్త్రము నగు వేదాంతము మహిష్ఠపాత్రను నిర్వహింపనున్నది. ఈ ప్రయాణములో వేదాంతమును గూర్చి అధునికాశయాలనుగూర్చి పలువురు ప్రవక్తలతో శాస్త్రజ్ఞులతో నేను చర్చించినాను. వేదాంత మనగా నేమో తెలిసిన వెంటనే అది అద్భుత మని ఉదాత్త మని గుర్తించి వెంటనే వారు మనఃపూర్వకముగ దానికి తలయొగ్గుచున్నారు.

భారతీయుల మగు మనము గంభీరమైన యీ వేదాంతశాస్త్రమును కనుగొన్నవార మైనను, ఇందనుక దానిని సమగ్రముగ వినియోగించుకొన లేదు. పెక్కు సందర్భాలలో దానిని మనమింకను ఆచరణకు తేవలసియున్నది. కాని బలనైపుణ్యాలు పాశ్చాత్యులకు హెచ్చు. వేదాంతమును భారతీయులు వినియోగించుకొనగలంతకంటె ఎక్కువగా పాశ్చాత్యులు వినియోగించుకొందు రేమో అని శ్రీవివేకానందస్వామి పల్కియుండెను. ఈమన ప్రకృతయుగమున ఇట్టి యాశయాల వినిమయముచే ఉభయసంస్కృతులును ఉభయత్ర సారవంతములగును. అత్యధిక నూతనాభివృద్ధులకు పెక్కింటికి అవకాశ మేర్పడును. భారతీయుల సిద్ధాంతసారమైన వేదాంతముతోడి సంసర్గముచేత ఆధునిక పాశ్చాత్య నాగరకత ఎంతో మార్పొంద పెంపొంద అభిముఖమగుచున్నది. నవ్యప్రపంచమున మననశీలురగు ప్రముఖులందఱి యాదరమును చూఱగొనుచున్న తత్త్వశాస్త్ర మిదొక్కటే. జెకోస్లొవాకియా క్యూబా ప్రముఖప్రజాస్వామ్య దేశాలలో నేమి, అమెరికా ఇంగ్లండు ఫ్రాన్సు వంటి పాశ్చాత్య 'జననాయక' దేశాలలో నేమి ప్రజలు వేదాంతమునకు తలయొగ్గుచున్నారు. ఏలయన అది అంత యుక్తిసహముగను ఆచరణయోగ్యముగను విశ్వజనీనముగను ఉన్నది.

(సశేషము)

# వార్తలు - విశేషాలు

## మద్రాసులో 'సంస్కృత' దినము

భారతప్రభుత్వ విద్యాశాఖవారి ఉత్తరువు ప్రకారము ఇటీవలి సంవత్సరాలలో భారతదేశమంతటను 'సంస్కృతదినము'ను కొనియాడుచున్నారు కదా. ఈసంవత్సరానికి ఆ దినోత్సవం—మద్రాసు సంస్కృత కాలేజివారి, కుప్పుస్వామిశాస్త్రి రిసర్చి ఇన్స్టిట్యూటువారి, సంస్కృతఅకాడమివారి, సంస్కృతఎడ్యుకేషన్ సొసైటివారి, సంస్కృతరంగంవారి, మద్రాసు సాహిత్యఅకాడమి కార్యాలయమువారి ఉమ్మడి ఆధ్వర్యంలో—1971-వ సంవత్సరం ఆగస్టు నెల 7-వ తేదినాడు కొనియాడబడింది.

మద్రాసు రామకృష్ణమఠాధ్యక్షులైన శ్రీమత్తపస్యానందస్వాములవారు సభాధ్యక్ష్యం వహించి ఈలాగు వాక్రుచ్చారు:—స్కూళ్ళలో సంస్కృత విద్యకు 'గండ' పరిస్థితి దాపురించింది. 'సంస్కృత' 'ప్రాచ్య' విద్యాలయాలుకూడ క్షీణించిపోతున్నాయి. సంస్కృత విద్యాప్రచారానికై ధనం కేటాయించిపెట్టి ఉన్న కేంద్రప్రభుత్వంవా రిప్పుడు ఈపరిస్థితిని గుర్తించి స్కూళ్ళలో సంస్కృతవిద్యకు సుస్థితి కలిగించే ఏర్పాట్లు చేయాలి.''

పైని పేర్కొబడ్డ వివిధసంస్థలవారి తరపున శ్రీ టి. వి. విశ్వనాథయ్యరుగారు సదస్యులకు స్వాగతాభివందనాలు సమర్పించి స్వాములవారిని సభాధ్యక్ష్యం వహించాల్సిం దని ప్రార్థించారు.

వివిధ వేదశాఖలనుండి కొంత కొంత వల్లించబడింది.

అధ్యక్షోపన్యాసానంతరం డాక్టరు వే. రాఘవనుగారు సోవియత్తుదేశంలోని సంస్కృత విద్యాపరిస్థితిని గూర్చి ప్రసంగించారు. డాక్టరు రాఘవనుగారు భారతదేశప్రభుత్వమువారి పరస్పర సంస్కృతీవినిమయప్రణాళికానుసారం సోవియత్తుదేశంలో పర్యటించి వచ్చారు. సోవియత్తుదేశానికి రెండవపర్యాయం పోయినప్పుడు రాఘవనుగారు అక్కడ సంస్కృత ప్రముఖ విద్యల పరిస్థితి క్షుణ్ణంగా పరిశీలించి వచ్చారు. మాస్కో-లెనిన్గ్రాడ్ నగరాలకున్నూ జార్జియా-అజెర్బైజన్ రాజ్యాల రాజధానులకున్నూ శ్రీ రాఘవనుగారు వెళ్ళారు.

ఆ ఊళ్ళలో ఉన్న ప్రాచ్యసంస్థలను, సైన్సుపరిషత్తుల ప్రాచ్యశాఖలను, భాషాసంస్థలను, విశ్వసారస్వతాలను, పురావస్తువిధానాలను ప్రాతప్రతుల గ్రంథాలయాలను రాఘవనుగారు చూచి ఆదేశాలకు భారతదేశంతో అనాదికాలంగా ఉంటున్న చారిత్రక వైజ్ఞానిసంబంధాలను గుర్తించారు. ఆదేశంలో సంస్కృతవిద్య ఇంతగా చదువబడుతుండడం వెలుపలిదేశాలవారికి తెలియ దన్నారు. పత్రికలలో ప్రస్తుతింపబడు రాజకీయాలసమస్యలతో రష్యాదేశానికున్న సంబంధాన్నే అందఱూ సదా చెబుతుంటారు. కమ్యూనిజములో ఐహికపరతయే ప్రధానాంశం. కాబట్టి పారమార్థికతత్త్వశాస్త్రాదివిషయనిబడమైన సంస్కృతభాషయూ సంస్కృతవిజ్ఞానమున్నూ రష్యావా రభిమానించజాల రని అందఱు సాధారణంగా అనుకుంటుంటారు. 1958 లో తాము చూచిన దాన్ని 1971 లో తాము చూచినదాన్ని పోల్చి—రష్యాలో సంస్కృతవిద్య తిరోగమించలేదు, అవిచ్ఛిన్నంగా కొనసాగి ఎంతో పెంపొందింది అన్నారు రాఘవనుగారు. యువకులు చాలమంది సంస్కృతం చదువుతున్నా రట, సంస్కృతవిద్యలో వివిధ శాఖలను చదువుతున్నా రట. స్వరశాస్త్రం వ్యాకరణశాస్త్రం చిత్ర

లేఖనం, మహాభారతప్రముఖేతిహాసాలు, కథాసారస్వతం కావ్యనాటకాలంకారశాస్త్రాలు - ఇవన్నీ అచటి ప్రజలకు ప్రీతికరాలుగా ఉన్నాయట. మహాభారతాన్ని రష్యనుభాషలోనికనువదించవలెననే ఉద్యమం అంద చెలరేగిందే. మధ్యాసియానుండి సేకరింపబడ్డ బౌద్ధసంస్కృత గ్రంథాల వ్రాతప్రతులు లెనిన్గ్రాడ్ ఓరియంటల్ ఇన్‌స్టిట్యూటులో ఉన్నాయట. వారు వానిని శోధించి పరిష్కరిస్తున్నారట. లెనిన్గ్రాడులోని పురావస్తునిక్షేపశాలలో మధ్యాసియానుండి సేకరింపబడ్డ బౌద్ధసంస్కృత శాసనాలు చిత్తరువులు ఎన్నో ఉన్నాయట. లెనిన్గ్రాడ్ యూనివర్సిటీ భారతీయశాఖలో కొన్ని సంస్కృతగ్రంథాల వ్రాతప్రతులున్నాయట. జార్జియా యూనివర్సిటిలోను ఓరియంటల్ ఇన్‌స్టిట్యూటులోను భారతీయపారశీక శాఖలున్నవట. అక్కడ ముగ్గురు యువతులు అవెస్తను వ్యాకరణానికి సంస్కృతవ్యాకరణానికి గలసంబంధాన్ని శోధిస్తున్నారట. 'జార్జియా'కు ప్రాంతీయనామము ఘూర్జార్. అచటి వారు ఇండియాలోని ఘూర్జరులతో సంబంధం కలవారని కొందఱు పండితు లూహిస్తున్నారు. ప్రాచీన మిత్రోపాసనను సూచించు జాడలున్నవి. అప్పటి బలిపీఠములమీదనే అనంతరకాలపు క్రైస్తవ చర్చీలు నిర్మింపబడిన వట.

ఆర్మీనియా భాషకు సంస్కృతభాషతో సంబంధం ఉంది. ఆ దేశానికి మదరాసునగరానికి గల సంబంధాన్ని రాఘవనుగారు ప్రస్తావించి 'మొదటి ఆర్మీనియనుపత్రిక మద్రాసు ఆర్మీనియనువీధిలోను చర్చిలోను ప్రకటితమైనది' అన్నారు. క్రిందటిశతాబ్దంలో ఆర్మీనియాలో వ్రాసిపెట్టుకొన్న సంస్కృతవ్యాకరణ ప్రతి యొకటి ఆ దేశరాజధాని (ఎరెవన్) వ్రాతప్రతులగ్రంథాలయంలో భద్రపఱుపబడిఉన్నదట.

అజెర్బైజను రాష్ట్ర రాజధాని బాకు. అచట జ్వాలాజి అనే ఒకఅగ్నిదేవాలయం ఉండెట. అ దొకప్పుడు నల్లసముద్రతీరంలో ఉండిన భారతీయవలసరాజ్యానికి పోయే భారతదేశవర్తకులకు మజిలిగా ఉంటూ వచ్చిందిట. ఆగుడిలో సంస్కృతంలోను గురుముఖిలోను వ్రాయబడ్డ శాసనా లున్నాయి. బాకునగరానికి భారతీయవర్తకులే కాక, బ్రాహ్మణులు, ఇతర సాధువులు తఱచువస్తుండిన జాడలు అచటి గ్రంథాలయంలోని వ్రాతప్రతులలో కనిపిస్తున్నాయి. సంస్కృతపదములకు సజాతీయములైన పదాలను పెక్కింటిని రష్యను ఆర్మీనియనుభాషలలోనుండి ఎత్తి చూపి స్లావోనిక్ భాషల పరిశోధన ఇంకా సాగాలి అన్నారు రాఘవనుగారు.

పండిత శ్రీవత్సాంకాచార్యసంకలితమై మద్రాసు సంస్కృత 'ఎడ్యుకేషన్' సొసైటి వారిచే ప్రచురింపబడిన 'అవ్యయకోశ' మనే నిఘంటువును ఆవిష్కరిస్తూ మహోపాధ్యాయ కె. ఎస్. కృష్ణమూర్తిశాస్త్రిగారు సంస్కృత వ్యాకరణప్రాముఖ్యాన్ని వివరించారు. సంస్కృతవిద్యావ్యాప్తికై ఆసొసైటివారు చేస్తున్న సేవను ప్రస్తుతించారు.

ఒక్కో మాజీవైస్చాన్సలరగు ప్రొఫెసరు కె. ఎ. ఎస్. అయ్యరుగారిచే సంకలితమై సాహిత్యఅకాడమివారిచే ప్రకటితమైన సుభాషిత సంగ్రహ ప్రథమభాగాన్ని తమిళదినమణిపత్రికాసహాయసంపాదకులగు శ్రీమాన్. ఎ. జి. వేంకటాచారిగారు ఆవిష్కరించారు.

సాహిత్యఅకాడమి ప్రాంతీయకార్యాలయోద్యోగులైన డాక్టరు చల్లా రాధాకృష్ణశర్మగారు "సాహిత్యఅకాడమివారు పూనుకొన్న సంస్కృతప్రణాళికలు రెండు:-ఒకటి కాళిదాససారస్వతమునకు మేలైన ముద్రణము, రెండవది

కావ్యమాల రెంటికిని నిర్వాహకులు డాక్టరు రాఘవనుగారు'' అన్నారు.

శ్రీరాఘవేంద్రతీర్థుల తృతీయశతవార్షిక జయంతియు 'సంస్కృత దినము'ను కలిశాయి. కాబట్టి ప్రొఫెసరు ఉడిపి వేంకటకృష్ణరావు గారు ఆస్వాములవారిని, వారి రచనలను ప్రస్తుతించారు.

మద్రాసు సంస్కృతకళాశాల సెక్రెటరి గారగు శ్రీకృ. చంద్రశేఖరనుగారి వందనోపచారంతో సభాకార్యక్రమం పరిసమాప్తమైంది.

## గ్రంథపరిచయం

జాగృతి విరోధికృతు దీపావళి ప్రత్యేక సంచిక, శ్రీ టి. ఎల్. నారాయణసంపాదితం, ముద్రితం, ప్రకటితం పుటలు 150 వెల రూ. 2/-

దీపావళి – శ్రీ అరవిందశతజయంతి – శ్రీ ప్రకాశంపంతులుగారియు గోపాలాచార్లుగారియు శతజయంతులు – ఇన్నింటికి కొనియాటగా వెలువడి, విషయాల ప్రకీర్ణకతచేతను వైవిధ్యం చేతను, స్వకీయ 'రాజకీయ' పరిమళం సుంతైనా సడలక ముమ్మరంగా గుబాళించే ఈ ప్రత్యేక సంచికకు మా స్వాగతం. ఆకర్షకమైన శ్రీఅరవిందముఖచిత్రం, ఆయనతత్త్వాన్ని భావాలను పరిచయపఱచే రచనలు, బహుమతి పొందిన కథానికలు, ప్రముఖరాజకీయవేత్తల ప్రతిభాప్రసర్పిత విమర్శలు, కొన్ని తియ్యని గేయకవితలు – ఇవి ఈ సంచికలో పరిగణనీయాలు.

### యాత్రామార్గదర్శి
### ప్రథమభాగము

[దక్షిణభారత – మలబార్ – కేరళ – మైసూరు – కూర్గు ప్రాంతములు]

చతుర్థముద్రణము

రచయిత: శ్రీరాగం వేంకటేశ్వర్లుగారు, ప్రాప్తిస్థానం: శ్రీసీతారామనామ సంకీర్తన సంఘము, శ్రీరామనామక్షేత్రము, గుంటూరు-4 గ్లేజుకాగితాల మేలుప్రతి వెల రూ. 10- పోస్టేజి ప్రత్యేకము.

సార్థదశాబ్దిలో నాలుగు ముద్రణములు పొందడం ఈగ్రంథం చూఱగొన్న ప్రజాప్రీతికి చక్కని తార్కాణం. క్రిందటిముద్రణంలో లేని నూతన విశేషాలు, ఇందులో ఉన్నాయి. మఱి కొన్ని క్షేత్రాలనుగూర్చిన వివరాలుకూడ ఇందు చేర్చబడ్డాయి. విషయసూచి, అకారాది క్షేత్రసూచి, యాత్రలకుగూర్చిన శాస్త్రాది విషయసర్వస్వము. చక్కగ పొందుపఱచిన పీఠిక, ఇవి జిజ్ఞాసువుల కెంతయు రంజకములు. ప్రతిక్షేత్రమునుగూర్చి తెలిసికోవలసిన సకల విషయాలను, శ్రీవేంకటేశ్వర్లుగారు చక్కని శీర్షికలక్రింద అమర్చి ముచ్చటగా మనకు అందజేశారు. ఎంతటి ఛాందసులనైన ఉత్తమ లోకజ్ఞులనుగా రూపొందింపగల యీ గ్రంథం తీర్థయాత్రలు వినోదయాత్రలు విజ్ఞానయాత్రలు చేయ నెంచిన వారికి అత్యంతోపయుక్తం కావడం అతిశయం కాదు. విషయసామగ్ర్య సంపదలనుబట్టి ఈగ్రంథం ప్రతిగ్రంథాలయం లోను నిఘంటుకోటి నధిష్ఠింప సమర్థమై ఉన్నది. "పోయి సేవింప లేకున్నం బుణ్యతీర్థ మహిమ వినుటయు నఖిలకల్మషహరంబు'' అని అల్లసాని 'ప్రవరుడు' చెప్పినట్లు యాత్రాసహకారార్థ మవతరించిన యీ గ్రంథము యాత్రాఫలప్రదమున్నూ ఔతున్నది. శ్రీరామకృష్ణప్రభలో సమీక్షితపూర్వమైన యీ యుత్తమ గ్రంథపు చతుర్థముద్రణానికి స్వాగతం.

ప్రభాకర్.

# జ్ఞానయోగము

అనువాదకులు :
కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారి యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు　　రెండవ కూర్పు　　వెల : రూ. 4-00

నూతన ముద్రణము :　　ఇప్పుడే వెలువడినది :

# రాజయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయ భాగము–రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)　　ఆఱవ కూర్పు　　వెల : రూ. 2-5

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు–4

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ బోధస్వరూపానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౮ ౧౯౭౧ - డిసెంబరు : విరోధికృత్తు - మార్గశిరము సంచిక ౬

## విషయసూచిక



---

ఫోన్ : 71231 పోస్టు బాక్సు : 635

మా మాసపత్రికలు

# వేదాంతకేసరి

తత్త్వశాస్త్ర - మత - సంస్కృతివిషయికంగా 1914-వ సంవత్సరంనుండి నడపబడుతుండే ఆంగ్ల మాసపత్రిక

సాలు చందా : ఇండియాలోను, సింహళంలోను 6 రూపాయలు;
ఇతర విదేశాలలో 3 డాలర్లు, లేదా 14 షిల్లింగులు.

# శ్రీ రామకృష్ణ విజయం

మత - సాంస్కృతికవిషయికంగా 1921-వ సంవత్సరమునుండి ప్రచురింపబడుతున్న తమిళ మాసపత్రిక

సాలు చందా : ఇండియాలో ర్పూ 5 లు, సింహళములో ర్పూ 7 లు.

# శ్రీ రామకృష్ణ ప్రభ

1944-వ సంవత్సరంనుండి ప్రచురింపబడుతూ విశ్వోపజీవ్యమైన ఆధ్యాత్మిక విజ్ఞానామృతమును వెదజల్లే తెలుగు మాసపత్రిక

సాలు చందా : ఇండియాలో ర్పూ 5 లు, సింహళములో ర్పూ 7 లు.

1. చందాదారులు ఉత్తరప్రత్యుత్తరాలలో తమ 'చందాదారు సంఖ్య' నుదాహరిస్తూ విలాసాలను స్పష్టంగా వ్రాయాలి.
2. పత్రిక అందకపోతే మాసాంతానికి మాకు తెలుపాలి.
3. చందాదారులకు మేము ప్రచురించిన గ్రంథాలను $6\frac{1}{4}$% తగ్గింపు ధరలకు అందజేస్తాం. వివరాలకు క్రింది విలాసానికి వ్రాయండి.
4. ప్రముఖ సంస్కృతి కేంద్రాలలో ప్రచారంలో ఉన్న యీ ఆధ్యాత్మిక విజ్ఞాన పత్రికలు అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకాలు. రేట్లకు వ్రాయండి.
5. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపవలసినదని గ్రంథకర్తలకు ప్రకాశకులకు మా ప్రార్థన.
6. ప్రజారంజకములైన మత - తత్త్వశాస్త్ర - సంస్కృతివిషయిక స్వతంత్ర వ్యాసాలను రచయితలు అందజేస్తే సంపాదకులు కన్నుల కద్దుకొని ప్రచురిస్తారు.
7. పత్రిక స్పెసిమెన్కాపి కోరేవారు 75 పైసల పోస్టేజి పంపాలి.

ఇంకా వివరాలు కావలసినవారు

## మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠం, మైలాపూరు, మద్రాసు-4

అనే విలాసానికి వ్రాయండి.

# మా 'దివ్యవాణి' గ్రంథమాల

నేడే కొనండి ! పదే పదే చదవండి !!

దివ్యావతారమూర్తుల విశ్వోపజీవ్యములైన అమృత మధుర సూక్తులు సర్వ సుగ్రహము కృగయ సన్నిహితములైన తేట తెలుగున వీనిలో పొందు పరచబడ్డాయి. ఇందులో ఒక్కొక్కటి నిరుత్సాహులకు ప్రోత్సాహప్రదం. అశాంతిసంక్షుభితులకు శాంతిదాయకం, సంశయాందోళితులకు సంశయాపనోదకం, జిజ్ఞాసువులకు పరమార్థజ్ఞాన సంసూచకం, అందరికీ శిక్షకం, సంస్కారకం, సిర్వృత్త్యాపాదకం. మువ్వన్నెల మేలి వాకెట్లలో పాకెట్టుసైజులో చక్కని తయారింపు—

| | | | |
|---|---|---|---|
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 0-40 | శ్రీ కృష్ణ | 0-45 |
| శ్రీ శారదాసూక్తి నవనీతము | 0-40 | బుద్ధ ఉవాచ | 0-40 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0-40 | క్రైస్తు సూక్తిమాల | 0-40 |

మహమ్మదు సూక్తిమంజరి 0-40

# దేవీ మాహాత్మ్యము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

మార్కండేయ పురాణాంతర్గతమగు దేవీమాహాత్మ్యము భక్తులెల్లరు అవశ్యము పఠింపదగిన దివ్యగ్రంథము. పాఠకుల సౌకర్యార్థము శ్లోకములు పెద్దఅక్షరములతో ముద్రింపబడియున్నవి. ప్రతి శ్లోకమునకు తేటతెల్లమగు తాత్పర్యము గలదు.

పారాయణము చేయగోరు భక్తుల యుపయోగార్థము గ్రంథాదియందు చండికా ధ్యానము, అర్గలాస్తోత్రము, కీలకస్తోత్రము, దేవీకవచమును, గ్రంథాంతమున అపరాధ క్షమాపణస్తోత్రమును, దేవీసూక్తమును పొందుపఱచియున్నాము.

ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పారాయణముచేయు భక్తులకు శ్రీదేవీకృపాకటాక్ష వీక్షణప్రసారము తప్పక కలుగును.

170+24 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము వెల : రూ. 2-50

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

'సహజోద్గారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హక్స్లీ) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేట తెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేకప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.' (స్టాండర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి: 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

590+158 పుటలు వెల: రూ. 7-50

# ప్రబోధరత్నాకరము

అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వాములవారు

శ్రీ వివేకానందస్వాములవారు అమెరికాయందలి సహస్రద్వీపవనమున శిష్యులకు బోధించిన తత్త్వసారము సమస్తము ఇందు నిక్షిప్తమై యున్నది. శాస్త్ర జిజ్ఞాసకలవారికి ఇందలి పాదటీకలు ఎంతయో యుపయుక్తములు కాగలవు.

232 పుటలు మూడవ కూర్పు వెల: 2-50

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4




'అఖిలవిభు శరణొందుము, తత్క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౮ } ౧౯౭౧ - డిసెంబరు : : విరోధికృత్తు - మార్గశిరము { సంచిక ౬

శ్రీః

## వివేకచూడామణి

మూలము :

శ్రీ శంకర భగవత్పాదులు

వ్యాఖ్యాత :

అన్నమాచార్య

భ్రాన్తి కల్పితజగత్కలాశ్రయం స్వాశ్రయం చ సదసద్విలక్షణమ్
నిష్కలం నిరుపమానవద్ధి యద్బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని 257

ఏది తనకు తానే ఆశ్రయమో, ఏది భ్రాంతికల్పితవిశ్వమున కంతటికి నధిష్ఠానమో, ఏది స్థూలసూక్ష్మముల రెంటికంటెను విలక్షణమో, నిరవయవమును నిరుపమానమునగు ఆ బ్రహ్మమువే నీవు. ఈ పరమార్థమును సదా మదిని భావింపుమా ౨౫౭

జన్మవృద్ధిపరిణత్యపక్షయవ్యాధినాశనవిహీన మవ్యయమ్
విశ్వసృష్ట్యవనఘాతకారణం బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 258

జన్మము కాని, వృద్ధి కాని, పరిణామము కాని, కృశించుట కాని, వ్యాధి కాని, నాశనము కాని— లేనిదియు, అక్షయమును, విశ్వసృష్టిస్థితిసంహారకారణము నగు బ్రహ్మమువే నీవు. ఈ పరమార్థమును సదా మదిని భావింపుమా, ౨౫౮

అస్తభేద మనపాస్తలక్షణం నిస్తరఙ్గజలరాశినిశ్చలమ్
నిత్యముక్త మవిభక్తమూర్తి యద్ బ్రహ్మ తత్త్వ మసి భావ యాత్మని. 259

భేదిల్లుట లేనే లేనిదియు, ఇట్టి దట్టి దని లక్షింప నందనిదియు, అలలు లేకున్నచో సముద్ర మెట్లుండునో అట్లు నిశ్చలముగ నుండునదియు నిత్యముక్తమును అవిభాజ్యము నగు బ్రహ్మమవే నీవు. ఈ పరమార్థమును సదా మదిని భావింపుమా. ౨౫౯

ఏక మేవ స దనేకకారణం కారణాన్తరనిరాసకారణమ్
కార్యకారణవిలక్షణం స్వయం బ్రహ్మ తత్త్వ మసి భావ యాత్మని. 260

ఏది తాను ఏకమైనప్పటికిని అనేకములకు కారణమో, ఏది స్వయముగ కారణము లేందో, ఏది కారణముగనుండ వేఱు కారణము లక్కఱ లేదో, కారణమగు మాయకంటెను కార్యమగు జగత్తుకంటెను ఏది విలక్షణమో ఆ బ్రహ్మమవే నీవు. ఈ పరమార్థమును సదా మదిని భావింపుమా. ౨౬౦

నిర్వికల్పక మనల్ప మక్షరం యత్ క్షరాక్షరవిలక్షణం పరమ్
నిత్య మవ్యయసుఖం నిరఞ్జనం బ్రహ్మ తత్త్వ మసి భావ యాత్మని. 261

అద్వైతమును, అనంతమును, అవినాశ్యమును, క్షరమునకంటెను అక్షరమునకంటెను విలక్షణమును, సర్వోత్కృష్టమును నిత్యమును అఖండానందరూపమును నిర్మలము నగు బ్రహ్మమవే నీవు. ఈ పరమార్థమును సదా మదిని భావింపుమా. ౨౬౧

య ద్విభాతి స దనేకధా భ్రమా న్నామరూపగుణవిక్రియాత్మనా
హేమవ త్స్వయ మవిక్రియం సదా బ్రహ్మ తత్త్వ మసి భావ యాత్మని. 262

బంగారముతో తయారైన వస్తువుల నామరూపములు పెక్కులైనను వానియందలి బంగార మొక్కటే అయినట్లు, మాయోపాధిచే గలిగిన నామములు రూపములు గుణములు మార్పులు పెక్కులైనను నిర్వికల్పమగు బ్రహ్మ మొక్కటే. ఆ బ్రహ్మమవే నీవు. ఈ పరమార్థమును సదా మదిని భావింపుమా. ౨౬౨

య చ్చకా స్త్యనపరం పరాత్పరం ప్రత్యగేకరస మాత్మలక్షణమ్
సత్యచిత్సుఖ మనన్త మవ్యయం బ్రహ్మ తత్త్వ మసి భావ యాత్మని. 163

పరము లన్నిటికంటె పరమైనదియు, తనకంటె పరము లేనిదియు, ప్రత్యగాత్మకంటె వేఱుగానిదియు, ఆత్మలక్షణసమంచితమును సచ్చిదానందస్వరూపమును అనంతమును అవ్యయమును అగు బ్రహ్మమవే నీవు. ఈ పరమార్థమును సదా మదిని భావింపుమా. ౨౬౩

ఉక్త మర్థ మిమ మాత్మని స్వయం భావయే త్ప్రథితయుక్తిభి ర్ధియా
సంశయాదిరహితం కరామ్బువ త్తేన తత్త్వనిగమో భవిష్యతి. 264

ప్రసిద్ధయుక్తులతోను బుద్ధితోను పైని చెప్పిన యర్థమును మనస్సులో భావింపుము. అట్లు విచారణచేయుటవలన సంశయములు తొలగి, అరచేతనున్న నీర మట్లు తత్త్వము ప్రత్యక్ష మగును. ౨౬౪

సమ్బోధమాత్రం పరిశుద్ధతత్త్వం విజ్ఞాయ సంఘే నృపవ చ్చ సైన్యే
తదాశ్రయః స్వాత్మని సర్వదా స్థితో విలాపయ బ్రహ్మణి విశ్వజాతమ్. 265

సైన్యమధ్యమున రాజలక్షణములను బట్టి రాజును గుర్తించినట్లుగా దేహమందున్న పరిశుద్ధాత్మను జ్ఞానస్వరూపమునుబట్టి గుర్తించి ఆత్మయే ఆశ్రయముగ గలవాడవై విశ్వతతిని బ్రహ్మమందు లీన మొనర్పుము. ౨౬౫

బుద్ధౌ గుహాయాం సదసద్విలక్షణం బ్రహ్మాస్తి సత్యం పర మద్వితీయమ్
తదాత్మనా యోఽత్ర వసే ద్గుహాయాం పున ర్న త స్యాఙ్గ గుహాప్రవేశః. 266

సత్తుకంటెను అసత్తుకంటెను విలక్షణమైనదియు సత్యమును పరమును అద్వితీయము నగు బ్రహ్మము బుద్ధిగుహాయం దున్నది. స్థూల-సూక్ష్మ-కారణశరీరములకంటె విలక్షణమైన ఆ శుద్ధచైతన్యమును స్వవాస్తవికస్వరూపముగా గుర్తించుకొని ఆ శరీరములం దుండువానికి మాతృగర్భప్రవేశ మిక నుండదు. ౨౬౬

జ్ఞాతే వస్తు న్యపి బలవతీ వాస నానాది రేషా
కర్తా భోక్తా ప్యహ మితి దృఢా యాస్య సంసారహేతుః
ప్రత్యగ్దృ ష్ట్యాత్మని నివసతా సాపనేయా ప్రయత్నా
న్ముక్తిం ప్రాహు స్త దిహ మునయో వాసనాతానవం యత్. 267

కర్తృత్వభోక్తృత్వాహంకారవాసనే సంసారహేతుభూతము. అది అనాది, దృఢము ప్రబలము. బ్రహ్మజ్ఞానము కలిగిన పిమ్మటగూడ, అంతర్ముఖుడై ఆత్మనిష్ఠుడై హెచ్చరికతో ఎంతో ప్రయత్నించియే ఆ వాసనను తొలగించుకొనవలెను. వాసనాక్షయమునే మునులు ముక్తి యందురు. ౨౬౭

అహం మ మేతి యో భావో దేహాక్షాదా వనాత్మని
అధ్యాసో ఽయం నిర స్తవ్యో విదుషా స్వాత్మనిష్ఠయా. 268

ఆత్మకానటువంటి దేహేంద్రియాదులం దుండు ‘నేను’ ‘నాది’ అను ఆశయమే అధ్యాస. విద్వాంసు డాత్మనిష్ఠచే ఆ యధ్యాసను తొలగించుకొనవలెను. ౨౬౮

జ్ఞాత్వా స్వం ప్రత్యగాత్మానం బుద్ధితద్వృత్తిసాక్షిణమ్
సోఽహ మి త్యేవ సద్వృత్త్యా ఽనాత్మ న్యాత్మమతిం జహి. 269

'బుద్ధికిని దానివృత్తులకును సాక్షియగు ప్రత్యగాత్మనేనే'నని తెలిసికొనుము, 'బ్రహ్మమనే నే' ననెడి భావన నెడతెంపులేక సాగించుచుండుము. ఆలాగుచేసి దేహాదులం దాత్మబుద్ధిని నిర్మూలించుకొనుము. ౨౬౯

లోకానువర్తనం త్యక్త్వా, త్యక్త్వా దేహానువర్తనమ్
శాస్త్రానువర్తనం త్యక్త్వా స్వాధ్యాసాపనయం కురు. 270

లోకానువర్తనమును విడువుము, దేహానువర్తనమును వదలుము, శాస్త్రానువర్తనమును మానుము, అనాత్మ నాత్మ యనుకొనెడి అధ్యాసను నివర్తిల్ల జేసికొనుము, ౨౭౦

లోకవాసనయా జన్తో శ్శాస్త్రవాసనయాపి చ
దేహవాసనయా జ్ఞానం యథావ న్నైవ జాయతే. 271

లోకవాసన, దేహవాసన, శాస్త్రవాసన యనెడి మువ్వాసన లున్నంతవఱకు, యథాతథమగు నాత్మజ్ఞానము కలుగనే కలుగదు. ౨౭౧

సంసారకారాగృహమోక్ష మిచ్ఛో రయోమయం పాదనిబన్ధశృఙ్ఖలమ్
వదన్తి తాజ్ఞ్జాః పటు వాసనాత్రయం యోఽస్మా ద్విముక్తః సముపైతి ముక్తిమ్.

సంసారకారాగృహమునుండి వెలువడ తహతహపడు వానిపాదములకు తగుల్పబడియుండు నినుపసంకెళ్లు ఈ మువ్వాసనలు. ఈ సంకెళ్లు వదలించుకొన్నవాడు ముక్తి నొందుడు. ౨౭౨

# పరమహంసదేవుని ప్రబోధవాణి

ఒకభక్తుడు—భగవంతునిపట్ల నాప్రేమను వర్ధిల్లచేసికొను టెట్లు?

శ్రీరామకృష్ణుడు—భగవన్నామమును ఆవృత్తిచేయుము. పాపములు అంతర్ధానమగును. కామ క్రోధ లోభాదులనుకూడ నీ వీలాగే అంతరింపజేయగల్గుదువు.

ఒకభక్తుడు—భగవన్నామముచే ఆనంద మొందు టెట్లు?

శ్రీరామకృష్ణుడు—'నీనామముచే నాకానందము గలిగింపు'మని భగవంతునిఆర్తముతో ప్రార్థింపుము. ఆయన నీహృదయాభిలాషను తప్పక సఫల మొనర్చును.

ఆలాగు చెప్పి, దీనుల ననుగ్రహింపు మని లోకజననిని ప్రార్థించుచు, శ్రీరామకృష్ణుడు మధురకంఠముతో ఇట్లు పాడెను.

(గీతికామాల)

ఒరులతప్పుని భావింప నోపఁ దల్లి,
అయ్యో! నేఁ ద్రవ్వినది కాదె నాయ్యి
యిదియు?

ఆఱురిపువులతతియె నా పాఱగాఁగఁ
ద్రవ్వికొంటిఁ బవిత్రమౌ ధరణియందు
నల్లనీటి వెల్లువయో యనంగ మారి
ముంచుచున్నది నను నెట్లు బ్రోచికొందు?
నిక్కముగ నాకు శత్రువు నేనె సుమ్ము
మారకంబగు నీనల్లనీరు తొలఁగఁ
జిమ్ము టెట్టు? లిదిగొ నాదు బొమ్మబంటి
యామె, నన్ను గాచుకొనంగ నైతి కాదు.
నీవె నాకున్న దిక్కువు, కావు మమ్మ,
నీకటాక్షముచే భవనీరనిధిని
దాఁటఁ జేయుము భవదీయుదాసుని నను.

మరల నిట్లు పాడెను.

ఎట్టి జన్నిజ్వరంబొ హా యేచు నిట్లు!
దేవికృప యొక్కటే మందు దీని కిలను;
బూటకపుగర్వతాపము *బొంది నూచు;
అఱచుచుందును 'నేను' 'నాయది' యటంచు.
ఎంతచెడ్డదో యీమాయ యెంచి చూడ!
కోరుదు ధనంబుఁ, చెలి కాంద్రఁ గోరుచుందు,
తనివి నెఱుఁగని దీ తృష్ణ తఱుగ దెపుడు.
నాదు జీవితమున కిఁక నేది ప్రాపు?
వాస్తవంబులు కానట్టి వానిఁగూర్చి
వాగుచుండెగా నా సన్నిపాత మిపుడు
ఆలకింపవె సర్వభాగ్యప్రదాత్రి.
బూటకపునిద్ర నాకండ్లు మూఁతపడియె
క్రూరతాక్రిమిదుష్ట ముదర మదెల్ల
శర్థవిరహితచర్యల నలయుచుంటి
రుచి కలుగ లేదు నీదుపేరునసయితము
కుదురు నీవ్యాధి యనునాస కుదురు టెట్లు?

* బొందిక = దేహమును.

పిమ్మట శ్రీరామకృష్ణు డిట్లనెను :-"రుచి కలుగ లేదు. నీదుపేరున సయితము" సన్నిపాత జ్వరగ్రస్తునికి అన్నద్వేషము గలిగినచో ఇక నతడు జీవించు నను ఆశ నిరవకాశమే. కాని ఆహారమం దతనికి ఇంచుకేని రుచి యున్నచో, అతడు జీవించు నను ఆశ వదులుకోనక్కఱ లేదు. కావుననే భగవన్నామమం దభిరుచి నల వఱచుకొనుట అవశ్యకము. దుర్గనామము కాని కృష్ణనామము కాని శివనామము కాని ఏ నామమైనను సరే, పనికి వచ్చును. నామము ననుసంధించుకొలదియు అనుసంధాతకు దేవు నందు సక్తి దినదినాభివృద్ధి నందుచు, అతని హృదయ మానందపూర్ణ మగుచుండునేని, ఇక భయకారణము లేనే లేదు. జన్ని తప్పక అంతరించును. భగవదనుగ్రహము తప్పక కల్గును.

మానవునిలో ప్రేమ ఎంతఉన్న అంత లాభము కలుగును. ఒకనా డిద్దఱు మిత్రులు ఒకవీథివెంబడి పోవుచుండిరి, భాగవతమును చదివించి వినుచున్నట్టి కొందఱిని జూచిరి. వారిలో ఒకడు "మిత్రమా. రమ్ము, ఆ పవిత్ర గ్రంథమును విందము" అనుచు సభస్సులో జొరబడి కూర్చుండెను. రెండవవాడు లోనికి తొంగి చూచి తనదారిని పోయెను. పోయిన దెక్కడికి? వేశ్యయింటికి! కాని, పోయిన వెంటనే అతనికి ఆ చోటు విసుగెత్తించెను. 'నా మిత్రుడు పవిత్ర హరికథ వినుచున్నాడు. నన్ను చూడుడు, ఎచట నున్నానో ఛీ' అని అతడు తనలో ననుకొనెను. భాగవతమును విను చున్న మిత్రునకును విసుగుపుట్టెను, 'ఎంత

మూర్ఖుడను నేను! వీని వెఱ్ఱిపురాణమును వినుచు కూర్చుంటిని. నా మిత్రుడు డక్కడ మహానందానుభవములో ఉన్నాడు'' అను కొనెను. కొంత కాలమున కిరువురును మరణించిరి. భాగవతసదస్సులోనుండిన వానికై యమదూత వచ్చి అతనిని నరకమున కీడ్చుకొని పోయెను. ఆ వేశ్యాలంపటునికై దేవదూత వచ్చి అతనిని స్వర్గమునకు గొంపోయెను.

కాబట్టి నిజముగ మానవుడుండుచోటును బట్టి కాని అతడు చేయు పనులను బట్టి కాని చూడక-అతని హృదయమునుబట్టియే దేవుడు గుణదోషనిర్ణయము చేయును, భక్తుని హృదయాంతర్గతప్రేమయే శ్రీకృష్ణున కభిమతము.

ఒక బ్రాహ్మభక్తుడు-భగవంతుని సాక్షాత్కరించుకొను టెట్లు?

శ్రీరామకృష్ణుడు-నీ ప్రేమను భగవంతుని వంకకు మరలించితివేని 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' అనుటను సదా అనుభూతికి తెచ్చుకొనుచుంటివేని-భగవత్సాక్షాత్కారము గలుగును. రావిచెట్టే తిరమైనది. దానిపండు క్షణభంగురము.

ఒక బ్రాహ్మసమాజీయుడు - మనకు కామ క్రోధ ప్రముఖ మనఃప్రకోపము లున్నవే, అవి యుండగా, మన మేమి చేయగలము?

శ్రీరామకృష్ణుడు-ఆ ఉద్రేకాల నాటింటిని భగవంతునివంకకు మరలింపుడు. కామమును భగవత్సంశ్లేషాభిరతిగా మార్చుకోవలెను. దేవుని జేరబోవు దారిని నీకెవ రడ్డముగా నున్నారో, క్రోధమును వారిపై జూపుము. నీ లోభమునకును భగవంతునే లక్ష్యముగా జేసికొనుము. అహంకారమమకారము లుండవలసినచో అవియు భగవత్సంబద్ధములుగ నే ఉండును గాక. 'నా రాముడు' 'నా కృష్ణుడు' అనుచుండుము. గర్వమును నిల్పుకోగోరెదవా, అప్పుడు విభీషణు ననుకరింపుము. ''రామచంద్రుని శ్రీచరణస్పర్శభాగ్యము నధిగమించిన యీ నా శిరముతో వేరెవ్వరికిని నేను ప్రణమిల్లువాడను కా'' ననెను కదా విభీషణుడు.

# అమ్మ సుద్దుల సుధ

1. ధ్యానము నభ్యసింపుము. కొన్నాళ్లకు నీ మనస్సున కెంత నిశ్చలతయు స్థైర్యమును గల్గు ననగా ధ్యానపకుండ లేని వాడ వగుదువు.

2. నీ మనస్సు భగవదితరవిషయముల వెంట బడినప్పు డెల్ల, వాని నశ్వరతను స్మరించి, నీ మనస్సును భగవంతుని శ్రీచరణముల కర్పింపుము.

3. కర్మాచరణము మానవున కనివార్యము. కర్మబంధమును త్రెంచుకోవలె నన్న, నిస్సంగత నలవఱచుకోవలె నన్న, అందుల కుపాయము కర్మాచరణమే. క్షణకాలమైనను మానవుడు నిర్వ్యాపారుడుగ నుండగూడదు.

4. అనాదికాలముగా ఎందఱో విగ్రహారాధన ద్వారా విముక్తి నొందియున్నారు. విగ్రహారాధన నుపేక్షింతువా? [ముకించిత్కర మనుకొందువా?]

5. జీవితమందు కష్టానుభవము దాపురించి నందున భగవదభిముఖులగు వారే చాలమంది. కాని ఎవనిచిత్తము శైశవమునుండియే

పుష్పోపహారమువలె భగవత్సమర్పిత మగునో, నిజమున కతడే ధన్యుడు.

6. మనస్సు అడవియేనుగువంటిది, గాలి కనుగుణముగా పరుగులువాఱుచుండును. కావున సాధకుడు సదా సారాసారవివేచనమును గావించుచు భగవత్సాక్షాత్కారమునకై కష్టపడి ప్రయత్నములు సలయును.

7. పురాకృతకర్మఫలము నెవ్వరును తప్పించుకోజాలరు. కాని భగవత్ప్రార్థనతో నిండిన జీవితము గడపువాడు, కాలే సమ్మెటను పడవలసినసందర్భమున ఒకసూల్లు గ్రుచ్చికోలుతో తప్పించుకొనుచుండును

8. పెక్కువిచారాలతో నీ మనస్సు చిక్కుపెట్టుకొనకు. ఒక్కదానినేని ఆచరణలో పెట్టలేనిమానవుడు మనస్సును పెక్కువిషయాలతో నింపుకొనుచు చెదరుపాటును తానే కలిగించుకొనుచుండును.

9. ఇతరుల తప్పులపై దృష్టి నుంచువాని మనస్సే ఆ దోషములచే దూషిత మగుచుండును. వారితప్పులను కనుగొనుటచే ఇతని కేమి లాభము? అందువలన నితనికి కలుగునది చెడుగే.

10. కోరికనుండియే ఈ దేహ ముద్భవించినది. కోరిక బొత్తిగా అంతరించినచో దేహము రాలిపోవును. ఆశలు పూర్తిగా ఉడుగుటతో అవసానము సన్నిహిత మగును.

11. నీవు భగవంతుని ప్రార్థింపకున్న, అది నీ దౌర్భాగ్యమే కాని, అందువలన భగవంతుని కేమి?

12. పల్లమునకు పాఱుటే స్వభావముగాగల నీటినైనను సూర్యుని కిరణములు ఆకాశమువంక కాకర్షించుచున్నవికదా. అట్లే భగవత్కృప, ఇంద్రియవిషయప్రవణమగు మనస్సును సైతము సమున్నతి నధిరోహింపజేయుచున్నది.

13. పెక్కండ్రు దృఢోద్రిక్తభావప్రేరణ గలిగినప్పుడు ఘనకార్యముల నిర్వహించుచుండుటను జూచుచున్నాము. కాని మానవుడు నిత్యకృత్యములందు తన చిన్నపనులను చేసికొనువిధముచుబట్టి అతని యథార్థశీలము నెఱుగ నగుచుండును.

14. కర్తవ్యనిర్వహణ మావశ్యకమే. అందుకు సందేహము లేదు. కార్యవ్యగ్రత మనస్సును పెడదారిని బట్టకేక సంరక్షించును. కాని, దానితోపాటు, ధ్యానప్రార్థనలును, ఓడకు చుక్కానివలె అవశ్యకములే. కనీసము ప్రొద్దున ఒకసారి సాయంకాల మొకసారియైనను కూర్చుండి ధ్యానింపవలెను. సాయంకాలము ధ్యానింపగూర్చున్నప్పుడు, ఆ దినము జరిగిపోయిన కార్యక్రమాలనుగూర్చి ఆత్మపరిశీలనము నెఱపేటును.

15. గాలికి మేఘములు కొట్టుకొనిపోవునట్లు భగవన్నామోచ్చారణముచే ఐహికభోగతృష్ణ పటాపంచ లగును.

16. చంద్రకళలకుం బోలె మానవుని పరిస్థితులకును వృద్ధిక్షయము లున్నవి.

17. నీవు తిను ఆహార మేదైనను నగుగాక, దానిని ముందుగా భగవంతునికి నివేదింతువేని నీ మనశ్శరీరములు పరిపూతము లగును.

18. మానవులను లక్షించు ప్రేమ, దుఃఖమున పర్యవసించును. దేవుని లక్షించెడి ప్రేమ నిశ్శ్రేయసమును పొందించును.

19. ఆపదలును చిక్కులును రాకుండవలె ననుకొనుట వ్యర్థము, అవి రాక తప్పవు. కాని, పాదముల క్రిందుగా నీరు పాతిపోవునట్లు భగవద్భక్తునికి గలుగు ఆపదలును చిక్కులును వానిదారిని అవి పోవును.

20. అఖిలవిభు శరణొందుము యాతనంబ యతనికృప నీవు ననుభూతి కందు వత్స.

# పదండి ముందుకు పదండి తోసుకు

ప్రకృతి నతిక్రమించి పైకి పోవుటకై పెనగులాడుచున్నంతవఱకే మానవుడు మానవుడు. ప్రకృతి యనగా అంతఃప్రకృతియు బాహ్యప్రకృతియు రెండును ... బాహ్యప్రకృతి నదుపులోనికి తెచ్చుకొనుట మంచిదే, చాల గొప్పదే. అంతరప్రకృతిని గెలుచుట అంతకంటె గొప్పది. నక్షత్రములను గ్రహములను నడపునట్టి సూత్రములను తెలిసికొనుట గొప్పదే, మంచిదే; మానవుల మనఃప్రకోపాలను అనుభూతులను సంకల్పములను ప్రవర్తిల్లజేయు సూత్రాలను గ్రహించుట అంతకంటె ఎంతో గొప్పది, అంతకంటె ఎంతో మంచిది. ఈ యంతఃప్రకృతి నదుపులోనికి తెచ్చుకొనుటయు, మానవుని సూక్ష్మమనఃప్రవృత్తుల మర్మముల నెఱుంగుటయు, వాని యద్భుతరహస్యముల తెలిసికొనుటయు ఇదంతయు మతధర్మమునకు సంబంధించినది. మానవప్రకృతి ( = సామాన్యమానవప్రకృతి) ఐహికసంభవాలలో గొప్పవానిని కనగోరుచుండును. సూక్ష్మమైన దేనినిగాని సామాన్యమానవు డర్థము చేసికోలేడు ... పామరులు బాహ్యప్రపంచమున కననగు ప్రతిదానిని సుఖసాధనముగ భావింతురు, సుఖమును గందురు. కాని ప్రతిసంఘమందును మఱొకవర్గమువారిదృష్టికి సుఖము ఇంద్రియములందు కనబడక, వాని కతీతమైనదిగ నుండును, ప్రకృతి కతీతమైనది వారి కప్పుడప్పుడు తళుక్కుమని గోచరించుచుండును. దాని నధిగమించుటకై వారు పాటుపడుచుందురు. దేశచరిత్రములను మనము లోతునకు దిగి పరికింతుమేని ఇట్టివారి సంఖ్య హెచ్చుగ నున్నప్పుడే దేశము సమున్నతి నందుచుండుటను, ఆ యనంతతత్త్వాన్వేషణము ఆగినప్పుడే దేశము పతనము గాంచుచుండుటను గుర్తింపగలము. అనగా ఆధ్యాత్మికపరతయే ప్రతిజాతిబలమునకును మూలము. ఆధ్యాత్మికపరత తగ్గి ఐహికపరత మొగ్గినప్పుడే ఆ జాతివినాశము ప్రారంభమగును.

వివేకానంద

# మాతృశ్రీసందేశము

## [సంపాదకీయము]

మనుజుల మనస్సు లప్పుడప్పుడు భ్రమప్రమాదములకు లోనగుచుండును, ప్రళయములు ముంచుకొని వచ్చుచుండును, యుద్ధములు వినాశములు సంభవించుచుండును. యుగయుగమునను అట్టివి సంభవించుచుండును. మహాభారతయుద్ధమున ఘటిల్లిన విధ్వంస మింతయు నంతయునా! ప్రస్తుతశతాబ్దములోనే ప్రపంచ యుద్ధములు రెండు జరిగినవి. వానివలన గలిగిన అతిభయంకర జననాశము కొలది యిడరానిది. మూడవ ప్రపంచయుద్ధము వచ్చునేమో అను భయము లేకపోలేదు. ప్రస్తుతపు వెలుపలి పరిస్థితుల వర్ణన మిప్పుడు మనకు ప్రసక్తము కాదు. లోపలి పరిస్థితులు మన మెఱిగినవే, కాని వానిని పట్టించుకొనుటలేదు. స్కూళ్లలో క్రమశిక్షణకు గలుగుచున్న ప్రతిఘటనము ప్రత్యక్షమే. మానవుని శీలమును రూపొందించు వానిలో చదువును పరిసరములు గూడ నున్నవి కదా. ఎల్లెడల అశాంతి గల్గియున్నది. అధికారుల నధిక్షేపించుచున్నారు. ఆచారాలను శంకించుచున్నారు. చట్టాలకు ఎదురు తిరుగుచున్నారు. లేదా అప్రీతితో లోబడుచున్నారు. కారణ మేమి! ఈ యంతటికిని కారణము నూతన యుగప్రాదుర్భావమే. ఆ ప్రాదుర్భావమునకు అశాంతి విధ్వంసాలు పూర్వసంభవాలు.

భవిష్యత్తు నూహింపగల దూరదృష్టి సామాన్యుల కుండదు. కొందఱు సంస్కారములు సేయబూనుదురు. అవి క్షుద్రసంస్కారములుగ నుండును. వారికంటె సంకల్పులు మఱి కొందఱు నూతనత్వము మీద మోజుపడుదురు. ఈ ప్రళయ పరిస్థితినుండి త్ప్రపంచమును రూపొందింప వారు ప్రణాళికలు ఏర్పఱతురు. మానవతతి ఇప్పుడు ఎటు పురోగమించునో ఊహింపరాక వీధుల కూడలిస్థలమున నున్నట్లున్నది. ఇట్టి పరిస్థితియందు సమస్తమును సరిదారికి తెచ్చు సామర్థ్యము ఆధ్యాత్మికశక్తి కొక్కదానికే, అవతారమూర్తికి మాత్రమే యుండును. ప్రస్తుతము ఆ యాధ్యాత్మికశక్తి శ్రీ రామకృష్ణునందును శ్రీ శారదాదేవియందును శ్రీ వివేకానందస్వామియందును రూపుదాల్చినది. ఒక్క యవతారమే ఈ ముమ్మూర్తుల వెలసినదని చెప్పవచ్చు.

ఆధ్యాత్మికరంగమున వారద్వితీయులు. ఈ నవ్యకాల ప్రపంచ పరిస్థితులందును పరిసరములందును వారాధ్యాత్మికసాధనల జేసిరి. ప్రాచీనకాలమున [illegible]ములందును గుహాలందును అరణ్యములందును ఏ కొందఱి అనుభవములోనో ఉండిన వేదాంతతత్త్వమును వారు అందఱి నిత్యజీవితములోనికిని దెచ్చిరి. మహమ్మదునొద్దకు మల (=కొండ) రాలేకున్న, మహ[illegible]దే మలయొద్దకు రావలెనను నానుడిని వారు ఈ రీతి నిరూపించినవారైరి. శ్రీరామకృష్ణుడును శ్రీ శారదామాతయు శ్రీ వివేకానందస్వామియు తమ నిత్యకృత్యముల మధ్య ఆధ్యాత్మిక సాధనలను సాగించినవారే. అయినను ఒకవిధమున తక్కినయిరువురి సాధనలను మాతృశ్రీ సాధన లతిక్రమించినవి. ఎట్లనగా ఆమె సాధనలు ప్రజల దృష్టిని దాకక ఏకాంతమున సాగినవి. ఆమె బాహ్యజీవిత మత్యంత సరళమైనది. కావున ఆమె ఆధ్యాత్మిక జీవితపు లోతుల ఎవ్వరును కొలువజాలరు

ఐహిక రంగమున జీవించు మనవంటి సామాన్య మానవులు ఈ పాఠము నామెయొద్ద నేర్చుకోవలయును. పరిసరములను విడనాడకే,

నిత్యజీవితమున పారమార్థిక పరత నభ్యసించుచు, మన మాధ్యాత్మిక సమున్నతిని గడింపవలయును. క్లిష్టపరిస్థితులలో మాతృశ్రీ ఆ సాధనలను నిర్వర్తించియుండెను. అత్యంత క్షుద్రమైన పనియైనను ఆమెకు క్షుద్రముకాదు. ఆమె పాత్రలను శుద్ధిచేసికొనుచుండెను. వంట వండుకొనుచుండెను తక్కిన యింటిపనులను చేసికొనుచుండెను. వానితోబాటు ఆధ్యాత్మిక సాధనలను గూడ నామె యెడతెంపు లేక సాగించుచుండెను. ఆమె ఆచరణలోచూపిన వానిని మనమును ఆచరణలోనికి తెచ్చుకోవలెను.

ప్రాయము గౌరవము మున్నగువానిని మన మెంతగనో బహుమానింతుము. కాని అవి క్షణికములు. వాని కన్నిటికిని వచ్చినంత సేపు పట్టదు దాటిపోవుటకు! అంతే కాక గౌరవాదులు అందఱికిని ఏకరీతిని ప్రాప్తములు కావు. వెలుపలి పరిస్థితు లెంత ప్రతికూలములుగ నున్నను కలవరపడక అందఱితోను చల్లగ తియ్యగ వ్యవహరించుచుండవలెను — ఇది మాతృశ్రీ మనకు కఱపిన పాఠము. సుఖజీవితమునకు గృహస్థుల కేమేమి యుండవలెనో వానిలో ఒక్కటేని శ్రీ శారదమ్మకు లేకున్నను, గృహస్థ జీవిత బాధ్యతలు ఒక్కటేని తప్పక అన్నియు ఆమె పైబడినవి. తమ్ములను, మేనకోడండ్రను, ఒక మృతసోదరుని వెఱ్ఱిభార్యను, అతని విపరీతమతియగు పుత్త్రిని ఆమె విచారించుకొనుచుండెను. ఆ సోదరుడే జీవించియున్నచో వారిని విచారించుకొనగలంతకంటె మిన్నయైన రీతిలో ఈమె వారిని విచారించుకొన్నది. ఆమె ఇంటి వ్యవహారములను నిర్వహించుచుండిన దంతటి అవిక్కృత నిశ్చలచిత్తముతో!

అవతారమూర్తులకు వినయమును నిరహంకారతయు సహజములుగ నుండును. మాతృశ్రీకి అహంకార మమకారములు బొత్తిగా లేవు. ఆమె సమస్తమును శ్రీరామకృష్ణుని పేరటనే చేయుచుండినది. తన కేర్పడిన శిష్యుల శ్రేయస్సుకై ఆమె శ్రీరామకృష్ణుని ప్రార్థించెడిది. ఒకవైపు యింటిచిక్కులు ఆర్థికకష్టము లుండినవి, మఱొకవైపు ఆమె తన శిష్యుల ఆధ్యాత్మికపు టక్కఱలను దీర్చుచుండినది. రెండువైపుల ఎట్టి సంక్షోభము నొందక ప్రశాంతత నామె నిలుపుకొనుచుండెను. సోదరి నివేదిత మాతృశ్రీ కొక జాబులో ఇట్లు వ్రాసినది - 'సార'కై ప్రార్థింత మని నేను చర్చికి పోయితిని - అక్కడ ఉన్నవా రందఱు జీససు దేవుని తల్లియగు మేరిని తలంచుకొనుచున్నప్పుడు నా మనఃపథమున తటాలున నీవు స్ఫురించితివి. పాపము సార వ్యాధిగ్రస్తురాలై యున్న గదిలో అందఱికి నూరటను ఆశీస్సులను సమకూర్చుచున్న దివ్యసాన్నిధ్యము నీదే, అని నాకు తోచినది'. దేవునితల్లియే మానవతతికి తల్లిగ నవతరించిన ఈతల్లి యనుట సోదరినివేదిత సాక్షాత్కరించుకొని నేమో!

నిజముగ ఆమె అందఱికిని అమ్మ. కుటుంబమధ్యమున ఆమె సామాన్యమహిళవలె నడయాడుచుండెను. ఆధ్యాత్మికనిశ్రేణిలో ఆమెఅధిరోహించిన పరమోచ్చస్థానమును అర్థముచేసికొనజాలక కొందఱు ఆమెమాతృప్రేమను మాత్రము గ్రహించినారు. ఆమె సరళతను ఎంతని చెప్పగలము? తను చూడ జయరామ్బాటికి వచ్చిన కొందఱు శిష్యుల తేనీరుకు పాలకై అమ్మ స్వయముగా వెలుపలికి పోయి తీసికొనివచ్చెడిది. తేనీరు ఆకాలములో పల్లెలలో అతిదుర్లభము. పిల్లలు అశుద్ధపఱచిన తావుల నామె స్వయముగా శుభ్రపఱచెడిది. ఆమె దృష్టిలో అందఱునుసమానులే. ఒకసందర్భమున ఆమె పరమభక్తకింకరుడును గురుదేవుని సాక్షా

చ్ఛిష్యవరేణ్యుడునగు శారదానందస్వామి తన కెట్టి పుత్త్రుడో బందిపోటుదొంగయు మహమ్మదీయుడునగు అమ్జాదుకూడ అట్టి పుత్త్రుడే అని చెప్పెను. 'అమ్మా' అని సంబోధించుచు ఆమె నాశ్రయించినవారు స్వార్థాతీతమగు శ్రేయఃఫలమును బడసెడివారే. పతితలైన మహిళలనుసైత మామె చేరదీయుచుండెను. వారు వేడిన నిర్వృతిని వారికి ప్రసాదించుచుండెను. మనము నేర్వవలసిన గుణపాఠము కదా ఇది!

ప్రస్తుతము పరిస్థితు లతివేగముగ మారిపోవుచున్నవి కదా. జీవితములను మనము తదనుగుణములనుగా తీర్చుకొనవలెను. వైహాయసవిజయములు కాని వివిధ రాజకీయవర్గాల మతములు కాని మానవసమస్యలకు పరిష్కారములు కాజాలవు. మానవునిలో హృదయ పరివర్తనము కలిగిననే మనకు శాంతి దక్కును. ఇక వచ్చువిప్లవములు రక్తపాతహేతుకములుగ నుండగూడదు. మానవహృదయ పరివర్తన హేతుకములుగ నుండవలయును. జీవితమును మన మనుసరించు రీతి పూర్తిగా మార్పొందవలెను, మేలొందవలెను. పంచవర్ష ప్రణాళికలు మంచివే. కాని భోగభాగ్యముల నింకనింకను వర్ధిల్లచేసికోవలె ననెడి తృష్ణ ఈప్రణాళికలచేతీరదు. సంతృప్తిని స్వార్థత్యాగమును అలవర్చుకొనుటే అందులకు ప్రతిక్రియ. ఒరుల సాయము లభించిన మంచిదే, లేకున్న మనలను మనమే సంస్కరించుకోవలెను.

మగువలకును మగవారికిని, విద్యావంతులకును విద్యాహీనులకును, పిన్నలకును పెద్దలకును—ప్రతివారికిని గ్రాహ్యములగు నీతిపాఠములు సందేశములు మాతృశ్రీ జీవితమున గలవు. ఇంటిపనుల త్రొక్కట మనందరికంటె అమ్మకెంతో ఎక్కువ. అయినను ఆమె యావజ్జీవము కాలము క్రమము తప్పక ఆధ్యాత్మిక సాధనలను జేయుచుండినది. ఆమె యడుగుజాడలను మన మనుసరింపవలెను. ప్రపంచము మార్పొందుట కదొక్కటే దారి. ఈనాడు మనకు కావలసినది. 'ఉపదేశము' కాదు, ఆదర్శజీవితమే మనకు కావలసినది. ఆదర్శశీలమే మనకు కావలసినది. ఆదర్శజీవితమును ఆదర్శశీలమును ప్రతియుగమువారిని ఆవర్జింపగలవు. ఆధునికప్రపంచమున సైత మట్టియాదర్శశీలప్రభావ మమోఘము. ఆదర్శశీలమునకు మూర్తీభావము మాతృశ్రీ — ఆమె జీవితములోని ప్రతియణువులోను పరిపూర్ణత వెలుగొందుచుండును. ఆమె నిత్యజీవితములోని చిన్నచిన్న పనులుసైతము ఆమెగొప్పతనమును వెలువఱచుచుండును. ఈసుద్దిని మన మర్థము చేసికొని మనజీవితములలో పట్టింప వలెను.

జీవితచరమదశలో ఆమె వాక్కునుండి వెలువడిన అమరసందేశము—ప్రతియొక్కరిని నీస్వకీయునిగ జేసికొనుము. ఇతరులతప్పు లెన్నకు. మనదృష్టిని ఒరులలోటుపాట్లపైనుండి ఉపసంహరించుకొని మనలోటుపాట్లపై ప్రసరింపజేసికొందము గాక. ఇదే మాతృశ్రీశారదాదేవి సందేశము. ఏ రవంతియైనను మన మా సందేశమును ఆచరణలోనికి తెచ్చుకొందుమేని మన పరిసరాలమధ్య మనము తప్పక సమున్నతి గాంతుము, ఆమె పరిసరాలమధ్య ఆమె అత్యంత సమున్నతిని గాంచినటుల!

# దివ్యమాతృ వాత్సల్యము

## శ్రీహరిదేవ అచ్యుత కామేశ్వరరావుగారు

నేను ఈమధ్య నా మిత్రులయింటివద్ద శ్రీ ప్రభవానందస్వాములవారు శ్రీ శారదామణి దేవిని చూచి ఆమెతో వారికి జరిగిన సంఘట్టనలు ఆంగ్లమున రచింపబడియున్న ప్రబుద్ధ భారత అను వేదాంతపత్రికలో చదువుట తటస్థించెను. ఆ ఆంగ్లమున రచింపబడిన వ్యాసము చూచి అమితానందము పొందితిని. దానిలోని అంశములు తెలుగులోనికి అనువదించి భక్తులకు తెలియపఱచి, దివ్యమాత అయిన శ్రీ శారదామణి దేవి ఆశీర్వచనము పొందగోరెదను. నాచేతనైనంతగా అనువదించిన యీ వ్యాసము చదివి చదువరులు నేనుపొందిన ఆనందము పొందగోరెదను.

శ్రీ ప్రభవానందస్వాములవారు సాక్షాత్ శ్రీ జగజ్జనని, శ్రీ శారదామణిని చూచి, పాదములను స్పృశించి ఆమెతో మాట్లాడుట మొదలగు సంఘట్టనలు జరుగుటకు కారణము వారు జన్మాంతరమందు చేసిన పుణ్యవిశేషము అనుటకు సందేహము లేదు. శ్రీ ప్రభవానంద స్వాములవారికి 14-వ సంవత్సరముననే జగజ్జనని అవతారమైన శ్రీ శారదామణి దేవి పాదస్పర్శ లభించెను. శ్రీ ప్రభవానంద స్వాములవారు విష్ణుపూరు అను గ్రామములో జన్మించిరి. శ్రీ శారదామణిదేవి జన్మస్థలమైన జయరామవాటికి వెళ్లవలె నన్న విష్ణుపూరు రైల్వేస్టేషనులో దిగి రెండెడ్లబండిమీద వెళ్లవలయును.

సన్న్యాసము పుచ్చుకొనక మునుపు ఒక నాటి సాయంకాలమున శ్రీ ప్రభవానంద స్వాములవారు వారి స్నేహితునితో కలిసి షికారు బయలుదేఱిరి. దారిలో ఒకసత్రము నందు ఒకసన్న్యాసి స్త్రీల మధ్యనుండి మాట్లాడుచుండిరి. అట్టి సన్న్యాసిని చూచి వారు ఆశ్చర్యచకితులైరి. అంతట వారు ఎవరి ఇంటికి వారు వెడలుచు స్త్రీలమధ్య కూర్చుండి మాట్లాడుచున్న ఆ సన్న్యాసిని గుఱించి విమర్శించుచుండిరి. స్నేహితుడు ఇంటికి వెడలిన తరువాత, శ్రీ ప్రభవానందస్వాములవారు సత్రములోనికి వచ్చి ఆ సన్న్యాసికి నమస్కరించిరి. తత్క్షణమే ఆ స్వామి, ప్రభవానంద స్వాములవారిని దివ్యమాతయైన పరమహంస గారి భార్య అయిన శ్రీ శారదామణి దేవికి నమస్కరించెదరా అని అడిగెను. పరమహంసగారి భార్య శ్రీ శారదామణి ఇక్కడ ఉన్నదాఅని వారు అడిగిరి. శ్రీ శారదామణిదేవి ఆ సన్న్యాసికి కొలదిదూరములో కూర్చుండియుండెను. అదిగో అక్కడ నున్న దివ్యమాతకు శ్రీ శారదామణిదేవికి నమస్కరింపు మనెను. తత్క్షణమే శ్రీ ప్రభవానందస్వాములవారు ఆమెకు నమస్కరించిరి. ఆమె వారిని * ముద్దుపెట్టుకొనెను. నీవు నన్ను చూచియుండలేదా అని ఆమె అడిగి వారిని ఇదివఱకు చూచియుండినట్లు ఆమె మాట్లాడెను. అంతట శ్రీ ప్రభవానంద స్వాములవారు అజ్ఞానముచే కప్పబడిన వారి కుమారులమైన మనము ఆమెను కనలేము. దివ్యమాత అయిన వారు వారి కుమారులను తెలిసికొనెదరు, అనినంతనే ఆ దివ్యమాత చిఱునవ్వు నవ్వెను. బహుశః వారుకూడ వారు విమర్శించిన సన్న్యాసివలె అయ్యెదరు అని ఆమె అభిప్రాయ మని వారు తలచిరి.

శ్రీ ప్రభవానందస్వాములవారు హైస్కూలులో చదువు అయిన తరువాత కలకత్తాలో

* ముద్దుపెట్టుకొనుట అనగా ఆమె తనవ్రేళ్ళతో వారి గడ్డము పట్టుకొని ఆ వ్రేళ్ళను ముద్దుకొనును.

కాలేజీలో బి. ఏ. చదువుటకు చేరిరి. ఆ రోజులలో దివ్యమాత అయిన శారదామణి దేవి కలకత్తాలో ఉద్బోధన్ ఆఫీసులో, నివాసముగా ఉండెడిది. అక్కడ ఆమె మేలి ముసుగతో ఉండెడిది. పాదములు మాత్రము భక్తులకు కనిపించెడివి. ఒకనాడు శ్రీ ప్రభవానందస్వాములు వారమున కొకసారి పురుషులకు నియమింపబడిన కాలములో శ్రీ శారదామణి దేవినిచూచుటకు వెడలి ఆమె పాదములు స్పృశించిరి. తత్క్షణమే వారు ఒక విద్యుత్తంతిని ముట్టుకొన్నట్లుఒకఊపు అనుభవించిరి. కొన్ని నిమిషములువారి వ్రేళ్లు వణకెను. ఒకవిధమైన అనిర్వచనీయమైన ఆనందము దేహమంతట పొందిరి. అవతారపురుషుల స్పర్శవిద్యుత్తంతుల స్పర్శవంటిది అని చదువరులు గ్రహింపవలయును. ప్రభవానందస్వాములు వారమున కొకసారిపురుషులకునియమింపబడిన కాలములో ఉద్బోధన్ ఆఫీసుకు వెళ్లి, దివ్యమాత పాదములు స్పృశించి ఆనందము పొందుచుండిరి.

శ్రీ ప్రభవానందస్వాములవారు రాఖాలు మహారాజువద్ద ఉపదేశము పొందిరి. వారి పేర్ను అను స్నేహితుడును రాఖాలుమహారాజు వద్ద ఉపదేశము పొందిరి. ఇద్దఱును ఒకరోజు వనే శ్రీరామకృష్ణమఠములో చేరిరి. శ్రీ ప్రభవానందస్వాములవారు పేర్ను అను స్నేహితునితో కలకత్తా కాలేజీలో విద్యార్థులుగా నున్నపుడు జయరామవాటిలో నున్న శ్రీ శారదామణిదేవిని చూచుటకు వెళ్ల నిశ్చయించుకొనిరి. వారిద్దఱును రెండెడ్ల బండిమీద జయరామవాటికి బయలుదేఱిరి. రాత్రి అంతయు వారు బండిలో ప్రయాణముచేసి ''కొల్పార'' లో దిగి కాలినడకను జయరామవాటికి బయలు దేఱిరి. వారు వచ్చుసరికి భోజనము సిద్ధముగా అమర్చబడెను. శ్రీ శారదామణి, రాఖాలు కుమార్లు వచ్చుచున్నా రని తెలిసి భోజనము సిద్ధము చేయించె నని వారు గ్రహించిరి. రాఖాలుమహారాజ్ శిష్యు లిద్దఱు జయరాం బాటిలో నున్న చెఱువులో స్నానము చేయుటకు వెళ్లిరి. ఆ చెఱువునందు మఱొక స్నాన ఘట్టములో స్నానముచేయు స్త్రీలు, వారిని గుఱించి వారు శ్రీ శారదశిష్యులు అని చెప్పుకొనుచుండుట రాఖాలు శిష్యు లిద్దఱును వినిరి.

స్నానమైన తరువాత, రాఖాలు శిష్యు లిద్దఱు తిరిగి వచ్చిరి. వేఱువేఱుగా రెండు ఆకులలో వారికి శ్రీ శారదామణి అన్నము వడ్డించెను. ఆమె వారికి దగ్గఱగా కూర్చుండి కావలసిన పదార్థములు వడ్డించుచుండెను. కలకత్తాలో ఉద్బోధన్ ఆఫీసులో ఆమె ఎల్లప్పుడును, మేలిముసుగుతో నుండెడిది. ఆమెపాదములు మాత్రము పైకి అగపడుచుండెడివి. ఇక్కడ మాత్రము ఆమె మేలి ముసుగు లేకుండ వారిదగ్గఱగా తల్లివలె కూర్చుండి వారికి కావలసిన పదార్థములు వడ్డించుచుండెను. రాఖాలు శిష్యులిద్దఱు అమృతము త్రాగినట్లు భోజనము తృప్తిగా చేసిరి. భోజనము అయినతరువాత శ్రీ ప్రభవానందస్వాములవారు తినిన ఆకులు తీసివేయుటకు ప్రయత్నము చేయబోగా శ్రీ శారదాంబ ఆపుచేసి, నీతల్లి నీకు భోజనము పెట్టినపుడు ఆకులను నీవు తీసివేయుదువా అని అడిగెను. ఆ దివ్యమాత మాతృవాత్సల్యమునకు అబ్బురపడి ఆ పనిని విరమించిరి. ఆమె ఆకులు ఎత్తివేసి శుభ్రము చేసెను. మూడు రోజులు వారు అక్కడ ఉండిరి. మూడురోజులు శ్రీ శారదామణిదేవి వారిని తల్లి కుమారులను చూచినట్లు చూచెను. బయలుదేఱు రోజున తల్లి కుమారులను ముద్దుపెట్టుకొనునట్లు, వారిని ముద్దుపెట్టుకొని వీడ్కొలిపెను.

ప్రభవానందస్వాములవారు సన్యాసాశ్రమము పుచ్చుకొనిన తరువాత రాఖాలుమహారాజ్ ప్రభవానందస్వామిని మాయావతికి పంపునపుడు, ఉద్బోధన ఆఫీసులో నున్న శారదామణిజేరి ఆశీర్వచనము పుచ్చుకొనుటకు పంపిరి. శ్రీ ప్రభవానందస్వామి ఆత్మబోధానందస్వాములతో కలసి ఉద్బోధన ఆఫీసుకు అమ్మ ఆశీర్వచనము పడయుటకై వెడలిరి. స్వాము లిద్దఱు ఆమెకు సాష్టాంగపడిరి. అప్పుడు ఆమెకు మేలిముసుగు లేదు. శ్రీ శారదామణిదేవి వారిని ముద్దుపెట్టుకొని దేవాలయములో నున్న రెండు లు చేతి యొకటి వారి కిచ్చి పంపెను.

---

# తెలిసికోవలసిన విలువలు—4

## వినయము

దాంభికుని గర్వితుని గనుడు. ఉజ్జ్వలములగు ఉడుపులను ధరించును, రాజవీధిని సంచరించును, కన్నుల నలువంకల బఱపుచు అందఱి దృష్టికిని తాను లక్ష్యము కావలె నని కోరును.

తల నెగురవేయును, బీదల నొప్పరికించును, తనక్రిందివారిపట్ల అవమతి చూపును. అతని పైవా రతని గర్వమును అతని ప్రల్లదములను దిరస్కరింతురు, నవ్వుదురు.

ఇతరులు కావించు గుణదోషనిర్ణయము నతడు తృణీకరించును, తన యభిప్రాయమే సరి యనుకొనుచు తబ్బిబ్బుపడును.

లేనిపోని గొప్పలను తనలో తాను కల్పించుకొని యత డుబ్బిపోవుచుండును. ప్రొద్దస్తమానము ఇతరులును తానును తన్ను గుఱించి చెప్పుచుండవలె ననుటే అతని ప్రీతి.

తన్ను గూర్చిన స్తుతివాక్యముల నత డాత్రముతో ఆలకించును, ఇచ్చకములాడు వా డితనిని పొట్ట నిడుకొని పోవును.

### నిన్ను ఉదాత్తునిగ నొనర్చుకో

పూజ నొందవలె నను తృష్ణ నీయాత్మకు కలదా? పొగడ్త విన్న, నీ వీనులకు ప్రీతి కలుగునా? అటులేని ధూళినుండి రూపొందింపబడిన నిన్ను ధూళినుండి లేవనెత్తుకో. నీ లక్ష్యమును ప్రశంసార్హ మగు నొక సమున్నతి నొందింపుము.

ఇప్పుడు మిన్నంట నెదిగియున్న సిందూర మహావృక్ష మొకప్పుడు బీజరూపమున భూగర్భమున నుండినదే.

నీవృత్తి ఏదైన నగు గాక. అందు ప్రథముడవుగ నుండ ప్రయత్నింపుము. దక్షతలో ఎవడును నిన్ను మించకుండునుగాక. ఐనను ఒరుల మేలుముల కసహనము నెందకు. నీ దక్షతను హెచ్చించుకో.

పోటిపడువాని నణగద్రొక్కుటకు కపటానుసరణమార్గములు పట్టుట నీచమని గుర్తింపుము. అతని మేలిమికంటె హెచ్చు మేలిమిని నీవు గడించుటచే నిన్ను సమున్నతి నొందించుకొన ప్రయత్నింపుము. అట్టి ప్రయత్నమునకు సఫలత కలుగకున్నను సమాదరమేని కలిగి తీరును.

గొప్పవారివలె తానును గొప్పతన మొంద న్యాయ్యమార్గమున పాటుపడు నతనిలోని సముత్సాహము ఉదాత్తత నధిగమించును.

పందెమునకు పరుగిడువానికి ఆ పరుగు సంతోషము గలిగించునట్లు, కీర్తికై తహతహపడు నతనికి ఆ తహతహపాటే సంతోషకరమగును.

త్రొక్కిళ్ళను లెక్కింపక అతడు తాళవృక్షము వలె మహోన్నతు డగును; మింట పక్షిరాజువలె, నతడుపై కెగబ్రాకి సూర్యుని వెలుగులపై దృష్టి నిల్పును

మహాపురుషుల పరమాదర్శములే రాత్రులందతడు గాంచు కలలు. వాని యనుసరణమే పగటివేళల నతని వినోదము.

గొప్ప ప్రణాళికల నతడు రూపొందించుచు, వాని నములుసఱచి ఆనందించును. అతని పేరు దిగంతవిశ్రాంత మగును.

మఱి ఈర్ష్యాళునిడెందము ద్వేషదౌష్ట్యములతో పిక్కటిల్లుచుండును. అతనినాల్క విషమును గ్రక్కుచుండును. పొరుగువానికి కలుగు మేలు అతని చిత్తశాంతిని చెడగొట్టుచుండును.

తన గదిలో నతడు నాశిల్లుచుండును. ఇతరులకు మేలు గలుగుటే అతనికి కీడు గలుగుట.

పగయు ద్వేషము నతని గుండెను కరగదీయుచుండును. అతనికి శాంతి యుండదు.

సౌజన్యముపై మోజు తనహృదయమున లేనందున, పొరుగువాడును తనయట్టివాడే అని అత డెంచును.

తనకన్న మిన్నగ నుండువారినిగూర్చి యతడు తగ్గించియే పల్కుచుండును. వా రేమి చేసినను దాని కపార్థము కల్పించుచుండును.

అతడు కనుపెట్టియే యుండును, దుండగముసే తలపెట్టుచుండును. కాని మానవుల జుగుప్స అతనిని తఱిమికొట్టును. తనపట్టులో తానే నలిగిపోవు సాలీనివలె నతడు త్రొక్కుడు పడి పోవును.

# శ్రీ శివానందస్మృతులు - 48

## శ్రీమత్ప్రవ్రాజిక శ్యామాప్రాణ

బేలూరుమఠము
23-5-1929
గురువారము,

నేడు వైశాఖపౌర్ణమి, బుద్ధపౌర్ణమి. సాయంకాలము బుద్ధదేవుని జీవితముగూర్చి ప్రసంగములు జరిగినవి. మఠసన్న్యాసులు పెక్కురు ఉపన్యాసములు గావించిరి. రాత్రి శ్రీబుద్ధదేవుని పటమును పుష్పమాలలతో అలంకరించిరి. కీర్తనలు పాడిరి. బుద్ధదేవుని జీవితము చదివిరి. అటుపై శుద్ధానందస్వామి బంగాళము లోను, శర్వానందస్వామి ఆంగ్లములోను బుద్ధుని జీవితమును సిద్ధాంతములను, ఉపదేశములగూర్చి విపులముగ వ్యాఖ్యలు చేసిరి. భోజనము ముగించిన పిదప ఓంకారానంద స్వామి శ్రీమహాపురుషుల కడకు వెళ్ళి, మామూలు మాటలు ముగిసిన పిదప-''నేడు చాల సుదినము. నేడు బుద్ధజయంతి చాల బాగుగ జరిగినది, సాయంకాలము పెక్కు ఉపన్యాసములు కూడ జరిగినవి.''

శ్రీమహాపురుషులు-'అవును. చాల మంచి దినము, త్రిగుణీకృత పావనమగు సుదినము. అది సరే నేడు ఈపాట పాడిరా!—

'జుడాయితేబాయి, కోథాయి జుడాయి కోథాహోతే ఆశి, కోథా ఛేషేజాయి.''

[అర్థము :—శాంతిని కోరుచున్నాను, కాని అది నా కెక్కడ దొరకును? నేను ఎచ్చటి నుండి వచ్చుచున్నాను? ఎచ్చటికి పోవు చున్నాను?']

ఓంకారానందస్వామి.—లేదండి! మా కెవ్వ రికిని ఈపాట సరిగా పూర్తిగా తెలియనందున పాడలేదు.

మహాపురుషులు—ఇది చాల మంచిపాట, గిరీశబాబు (ప్రఖ్యాత నాటకరచయితయగు శ్రీ గిరీశచంద్రఘోషు) కట్టినది. అనుచుస్వర యుక్తముగ పాటను పాడ మొదలిడిరి. ఆహా! గిరీశబాబు ఈపాటను ఎంతచక్కగ కట్టెను! 'లలితావిస్తారము' నుండి భావముల సంగ్ర హించి ఈపాటను రచించెను. ఈభావములు 'లలితావిస్తారము'న చాలచక్కగ వర్ణింపబడి యున్నవి. బుద్ధుడు, సిద్ధార్థుడుగ నున్నతరి, ఒకానొకసమయమున తన ప్రియురాలగు గోపాతో (యశోధరతో) వినోదవిలాసములు సల్పుచుండెను. ఆసమయముననే ఆకసమునుండి అప్సరసలు ఈపాట పాడుచుండిరి. బుద్ధదేవుని చెవిని ఈపాటపడుటతోడనే, ఉలికిపడి వెంటనే, ఇది నే నెఱిగిన పాటయే! దీని నెవరు పాడుచు న్నారు! 'జుడాయి తే బాయి, కోథాయి జుడాయి!' ఇది నా చిరపరిచితమగు పాట!' ఈపాట విన్నవెంటనే బుద్ధునిమనస్సు మాఱి పోయెను. భోగవిలాసములపై మనస్సు విఱిగి పోయెను. సర్వదా ఔదాసీన్యభావము. ఆయన తండ్రి శుద్ధోధనుడీ వార్త విని, తనపుత్రుని మనస్సును భోగవిలాసములపై త్రిప్పుటకుగాను పలురకములగు ప్రలోభముల చూపి, ప్రయత్నిం చెను. బుద్ధదేవుని మోహనిద్ర వదలెను. అందుచే తండ్రిచేష్టలెల్ల విఫలములాయెను, కడకు ఒకనాటి రాత్రి బుద్ధుడు రాజప్రాసాదము వీడి బయల్పడెను.

*

మధ్యమార్గముగూర్చి 'లలితావిస్తారమును' ఆధారముగకైకొని, గిరీశబాబు మఱొకపాట కూడ కట్టెను.

'ఆమార్ ఏ సాధేర్ వీణే, యత్నేగాంథా తారేర్ హార్ ।
జే జత్న జానే, బాజాయి వీణే,
ఉఠేసుధా అనివార్ ।
తానే మానే బాంధలే దురి,
శతధారే బోయి మాధురీ ।
బాజేనా అలగా తారే,
టానలే ఛేడే కోమల తార'

[నా ఈవీణ నాకు చాలప్రియమైనది. దీని తీగెలు చాల జాగ్రత్తగ కట్టబడియున్నవి. ఈ వీణను జాగ్రత్తగ పెట్టుకోకల్గినవాడే దీనిని వాయింపగలడు. అపుడే దీనినుండి అనవరతము అమృతధార ప్రవహించును. తాళము లయ ననుసరించి తీగెలస్వరమును బిగించినచో, వీణా వాద్యమాధుర్యము, శతధారలుగ ప్రవహిం చును. కాని తీగెలు వదలుఅయినచో వాగదు, ఎక్కువగ బిగించినచో, సున్నితపు తీగెలు తెగి పోవును.]

(ఒశేషము)

## 101

శ్రీ రామకృష్ణాశ్రమము
బుల్టెమ్పుల్ రోడ్డు
బెంగుళూరు సిటీ
12 జూలై 1921

ప్రియ శ్రీమన్—

నీజాబు యథాక్రమముగ నా కందినది. మహారాజు (బ్రహ్మానందస్వామి)గారును నేనును వారి యనుచరసాధువులతో సహా ఏప్రిల్ 1-వ తేది మఠమునుండి బయలుదేఱి దారిలో 'భువనేశ్వర' 'మద్రాసు' కేంద్రాలను జూచుకొనుచు ఇక్కడికి వచ్చి చేరియున్నాము. గురుదేవుడు సంకల్పించునేని, తిరువాంకూరులోని క్రొత్త మఠమునకు సంప్రోక్షణచేయుటకై మేము కొన్నాళ్లలో అచటికి పోవలసియుండును.

అక్కడ నున్న గురుదేవుని కేంద్రమును గూర్చి విని నేనెంతో సంతోషించితిని. గురుదేవుని సేవకు నిన్నర్పించుకొంటివి. కావున నీవు ధన్యుడవు. మనప్రభువు ప్రత్యక్షదైవము. ఆయనసేవలో నీ వాసక్తుడవై యున్నావు. కావున ఇక నీకు ఏమి వ్రాయను? గురుదేవుని సేవగా నీ వేమి చేసినను అది నిజమునకు ఆధ్యాత్మికసాధనయే అని యెఱుంగుము. ధ్యానజపముల కది తీసిపోదు. ధ్యానజపములను గురుదేవుడు నీచే చేయించినంతమట్టుకే చేయుచుండుము. ఆయన సేవలో నీవు వ్యాపృతుడవుగ నున్నావు. కావున ఆయనే నీకు సరిదారిని చూపుననియు నీలోపములను మన్నించుననియు గట్టిగా నమ్మవచ్చు. చెదరని శ్రద్ధతో సాగించుచుండుము, ప్రతిసేవయు జపమే ధ్యానమే అని భావింపుము. దేవుని కింకరుడవు నీవు, నీకు శ్రేయస్సు తప్పక కలుగును. తన్ను సేవించువారు గురుదేవుని కత్యంత ప్రియులనుట నిజమని యెఱుగుము.

నీకును ఇతర భక్తులకును నా హృదయపూర్వకాశీస్సులు. గురుదేవునికరుణచే మాకు క్షేమమే. దరిద్రనారాయణులకై హోమియోపాథిక్ మందులు వెచ్చించుచున్నారను వార్త నాకు ముదావహము. ఇదియు గురుదేవుని సేవించు ప్రకారములలో నొక్కటని తెలిసికొనుము.

శ్రేయోభిలాషి,
శివానంద.

## 102

శ్రీ రామకృష్ణాశ్రమము
బుల్టెమ్పుల్ రోడ్డు, బెంగుళూరు సిటీ,
12 ఆగష్టు 1921

ప్రియ శ్రీమన్—

నీజాబులోని సంగతులెల్ల గుర్తించినాను. నీసోదరి చిన్నవయసులోనే మరణించినందుకు నేనెంతయు దుఃఖించుచున్నాను. ఆమె బహు సుగుణవతి. కావున ఆమె మరణించినందుకు మీ రందఱును ముఖ్యముగా మీ తల్లిగారు, దుఃఖార్ణవనిమగ్ను లయితి రనుట ఆశ్చర్యము కాదు. విధాతృనిర్ణయము లాలాగుండును, అవి అనతిక్రమణీయములు. దేవుడు తనసంకల్పము నమోఘముగ అమలుపఱచును. ఈ రీతిగా వివేచించుకొని, సకలభారమును దేవునిపై నుంచి నిబ్బరముగ నుండుము. అట్లు చేసినచో దేవునిలోని మన నమ్మకము మఱింత లోతువాఱును. మనమనోబలము హెచ్చును. ఎన్నడో ఒకనాడు మనకు పరస్పరవియోగ మనివార్య మనుట తెలిసివచ్చును. ఐహికసంబంధములు క్షుద్రములు, క్షణికములు. ఆత్మలకాత్మయైన సర్వేశ్వరు డొక్కడే జననమరణాతీతమును నిర్వికల్పము గు సత్యము. బంధువియోగదుఃఖము కొంత

కాల ముండుట సర్వసామాన్యమే. కాని భక్తుని డెందముపై దానిపట్టు చిరకాల ముండదు. ఏలయన నతని డెందమున భగవద్భక్తి బలమున్నది కదా. నీజాబునుబట్టి చూడ నీసోదరి విశుద్ధహృదయ యని తెలియుచున్నది. కావున ఆమె ఆత్మ దివ్యధామమునకు జేరుకొని యుండు ననుట నిస్సంశయము. గట్టిగ నమ్ము. భగవంతుని పాదసన్నిధి కామె నిక్కముగ చేరె నని యెఱుగుము. ఆశ్రమమును గూర్చిన వార్త విని సంతోషించినాను. ప్రతిదినము ఆశ్రమమునకు వచ్చు పిల్లలు స్థిరమైన రీతిలో సుశిక్షితులు కావలె ననుట నాయభిమతము ... సన్నిధిలో మీరు ముగ్గురు నలుగురు కలిసి భానువారము లందు రెండుగంటలసేపు ఉపనిషత్తులను జదువుచున్నా రనుట ఎంతయు నుత్సాహజనకమైన వార్త. ప్రతిదినము ఆరీతి నేదే నొకశాస్త్రగ్రంథపఠనము సాగుట ఎంతయు ఆవశ్యకము. ఆశ్రమములో విద్యుద్దీప ముండుట చాలమంచిది. అందుకు మహారాజుగారు చాల సంతోషించిరి. మేమును సంతోషించితిమి. కాని ఇవన్నియు అప్రధానము లనుటను దెలిసికొనుము. అన్నిటి కంటె ప్రధాన మిది — అధ్యయనసాధనభజనలద్వారా జీవితమును నిర్మించుకోవలెను. అందు దృఢవిశ్వాసము మన కుండవలెను. ఇప్పుడు సాగించుచున్నట్లే నీ తపస్సాధనల సాగించుచుండుము. నీవు స్పష్టముగ పురోగమించుచున్నా వనుట కెట్టి సందేహమును లేదు. భగవదనుగ్రహముచే నీ వింకనింకను యథాక్రమముగ పురోగమింపగలవు. నీవు లోతునకు పోవుకొలదియు భగవదనుగ్రహముచే నీ డెందము భక్తిప్రేమలతో నిండిపోవును. భగవంతుని ప్రార్థించుట తప్ప వేఱుపాయము లేదు. భగవన్నామమే మనకు మూలాధారము. భక్తిప్రేమలతో భగవంతుని దృఢముగ అవలంబింపుము. ఆయన నిన్ను తప్పక యనుగ్రహించును. ఇది నా గట్టి నమ్మకము. సందేహమునకు తావు లేనే లేదు.

ఇచ్చట మేమందఱము క్షేమముగ నున్నాము. ఈచోట చాల చల్లగా ఆరోగ్యకరముగా నున్నది. వేడిమి కొంచెమైనను లేదు. పగటివేళలోసైతము చలికాలపు దుస్తులు తొడుగుకొనవలసియున్నది. గురుదేవు ననుగ్రహముచే అన్నివిధముల నీకు శాంతి చేకుఱుత. ప్రేమభక్తులలో నీకు మఱింత నిలుకడ గలుగుగాత.

నీ శ్రేయోభిలాషి
శివానంద.

## 103

శ్రీరామకృష్ణాశ్రమము
బుల్టెమ్పుల్ రోడ్డు, బెంగుళూరుసిటి,
11, సెప్టెంబరు 1921.

ప్రియశ్రీమన్ —,

నీ జాబొకటి నాకు కొన్నాళ్ళక్రింద చేరినది. నీ కక్కడ బాగున్నందుకు నాకెంతయు సంతోషము. మానవజీవితములో సర్వప్రాణిసేవను మించిన కర్తవ్యము లేదు. ఆత్మను విశుద్ధ మొనర్చుకొనుట కంతకంటె సులభతరమైన యుపాయము వేఱే మున్నది? నిస్వార్థసేవచే మానవునకు తనహృదయములోనే భగవత్సాక్షాత్కారము సులభముగా గలుగును. తపస్సాధనలు నలుపుట అనివార్యము. నీకును ఇతరభక్తులకును నాహృదయపూర్వకప్రేమాశీస్సులు — మహారాజుగారును ఇతరులును మేమును క్షేమముగా నున్నాము.

ఈనడుమ కొన్నాళ్ళు నేను మైసూరుకు పోయి యుంటిని. అచట మహిషాసురుని మర్దిం

చిన చాముండేశ్వరి పెద్ద దేవాలయమును దర్శించితిని. ఆగుడి ఎత్తైన యొక కొండశిఖరముపై నున్నది. ఆనాడు శ్రీకృష్ణజన్మాష్టమి, లోకజననిమహామాయ జయంతికూడ. గురుదేవు నను గ్రహముచే నేనచ్చట 'దేవీమాహాత్మ్యము'ను అనుసంధించి దివ్యానందము ననుభవించితిని. అచటినుండి మేలుకోటకు పోయితిని. అది అక్కడికి ముప్పదిరెండుమైళ్ళ దూరమున నున్నది. అచట శ్రీరామానుజాచార్యులవారారాధించిన సంపత్కుమారస్వామిని సేవింపగంటిని. ఆమూర్తి ఎంత అందముగ నున్నది! శ్రీరామానుజులవారు విశిష్టాద్వైతసిద్ధాంతమును లోకుల కుపదేశింప నారంభించిన దీక్షేత్రముందే. ఇప్పటికిని ఆకాలక్షేపగోష్ఠి నక్కడ కనవగును. శ్రీవైష్ణవుల కతిముఖ్యములైన క్షేత్రములలో నిదొకటి. ఈక్షేత్రము ఇక్కడి గుడి చాల అందముగ ఉన్నవి. అడుగుపెట్టినంతనే సేవార్థుల చిత్తములు విశుద్ధోన్నత స్థాయుల నధిరోహించును. గురుదేవు ననుగ్రహమున ఈ క్షేత్రాల సంసేవనము నాకు గలిగినందులకు నేను ధన్యుడను.

శ్రేయోభిలాషి,
శివానంద.

# విశ్వగుణాదర్శము

## శ్రీరంగనాథానందస్వామి

(తరువాయి)

దక్షిణ అమెరికాలో పెరురాష్ట్రమున లిమా విశ్వకళాపరిషత్తులో ఉపాధ్యాయుల విద్యార్థుల వర్గములో నేను మాటాడుచుంటిని. ఆ విశ్వకళాపరిషత్తునకు మార్కోసు విశ్వకళాపరిషత్తని పేరు. అది కాథోలిక్కులది. దక్షిణ అమెరికాలో అన్నిటికంటె ప్రాచీనమైన దది. దురదృష్టవశమున విద్యార్థులు కలిగించిన చిక్కుల మూలముగా ఆ విశ్వవిద్యాలయము క్రిందటి (1970) ఫిబ్రవరి నెలలో మూసివేయబడినది. అక్కడికి నేను ఆగస్టునెలలో పోయియుంటిని. వేదాంతమునుగూర్చి అరగంటసే పుపన్యసించితిని. అక్కడి సైన్సు ప్రొఫెసరు నన్నిట్లడిగెను. "స్వామీ, ఇప్పుడు మీరు సెలవిచ్చినది, అత్యంతము యుక్తిసహముగాను శాస్త్రీయముగాను తర్కజుష్టముగాను ఉన్నది. ఈ తత్త్వశాస్త్రము భారతదేశములో యుగములకుముందే పెంపొందియుండెనా! ఆశ్చర్యముగ నున్నదే". "ఔను నాలుగు వేలేండ్లకు పూర్వమే భారతదేశమున ఆ శాస్త్రము అంతటి అభివృద్ధిని గాంచియుండిన" దని నే నంటిని.

భారతదేశము ప్రపంచమున కొసగిన యీ తత్త్వశాస్త్రమును పాశ్చాత్యదేశీయులు ఇకమీద అర్థము చేసికొనవలసియున్నది. నేను పర్యటించిన ప్రతిచోటను పరిస్థితి ఇదే. అర్థము చేసికొన్న తత్క్షణమే వారును తదారాధనోన్ముఖు లగుచున్నారు. చక్కని పండితులతో ప్రొఫెసర్లతో తాత్త్వికులతో శాస్త్రజ్ఞులతో కలిసి చర్చలు సాగించు అవకాశములు నాకు పెక్కులు కలిగినవి. వేదాంతమును వారికి వివరించి చెప్పితిమేని, యుక్తికి పరిశీలనమునకు నిరూపణమునకు అనువైన ఆ గంభీరశాస్త్ర

ముకు వారెంతయు మెచ్చుకొనుచుండుటను ప్రత్యక్షముగ గాంచితిని.

"మానవునిలో సహజముగ నుండు దివ్యతను ఆవిష్కరించుటే మతము (ధర్మము)" అని, మతము (ధర్మము)నకు శ్రీవివేకానంద స్వామి యొసగిన నిర్వచనము వారి కంఠశ్రీకి చక్కగా నచ్చినది. మానవునిలో దివ్యత ప్రబుద్ధమగునేని, నీతి నిష్ఠయు ఇతరులపట్ల అక్కఱయు తమంతట గలుగును. మానవుడు భౌతిక భూమికయందు మాత్రమే పెంపొందునేని, ఒక్కొక్కప్పు డది బాగుండవచ్చు, ఒక్కొక్కప్పుడు అది ఇతరులకును తనకును బాధకము కావచ్చు. అతడు దురాక్రమపరుడగును; మానవుని అంతఃప్రకృతి కలదు గదా, అదే వేదాంతము కఱపునది. ఆయంతఃప్రకృతి మహాశక్తులకు ఉత్పాదకము. ఈ శక్తులు భౌతికభూమికలోని అభివృద్ధులను అదుపులో నుంచుకొన తోడ్పడును. భౌతికాది శాస్త్రములచేతను యంత్రవిద్యచేతను మానవునకు గల్గిన శక్తుల నదుపులో నుంచుకొనుటకును వానిని శుభఫలప్రదములుగ పరిపూర్ణతాసాధకములుగనొనర్చుటకును మఱొక శక్తి కావలసియున్నది. దానిని గుర్తింపజేసినచో వేదాంతము పాశ్చాత్యులకు ప్రీతికరమగుచున్నది.

ప్రశ్న:—అమెరికాలోనే పెండ్లిసంబంధములు చేసికొని అక్కడే ఆగిపోయిన భారతీయుల భవిష్యత్తును గూర్చి మీ యభిప్రాయమేమి? వారిబిడ్డల భవిష్యత్తుపై అచటి జీవిత విధానము లేరీతి ప్రభావము చూపును?

జవాబు:—అమెరికాలో పెండ్లిండ్లు చేసికొని అక్కడే స్థిరవాస మేర్పఱచుకొన్న భారతీయు లెందఱో కలరు. తమపిల్లల తర్ఫీదున తమకు గలుగుచున్న చిక్కులను వారిలో అనేకులు నాకు తెల్పినారు. అమెరికాసంఘప్రవాహము ఆ పిల్లలను తనలోనికి లాగుకొనుచున్నది. అమెరికాసంఘశక్తులు అమెరికను శిశువులకునైనను హానికరములుగ నున్నవి. 'మన పిల్లలగతి ఏమగుచున్న'దని అమెరికను తల్లిదండ్రు లనేకులు వ్యథితు లగుచున్నారు. ఆ సంఘజీవితప్రవాహము పిల్లలను కొట్టుకొని పోవుచున్నది. దౌర్భాగ్యవశమున హాలీవుడ్డు చలనచిత్రాలయు, టెలివిషను దృశ్యాలయు నమూనాతో ఆ సంఘజీవితము రూపుదాల్చుచున్నది. కాబట్టి ఇది అట నున్న భారతీయ పితరుల కెంత సమస్యయో అమెరికను పితరులకును ఆపాటి సమస్యగానే ఉన్నది. దాని ఘాటి కాగు టెట్లో వా రెఱుగకున్నారు. అది వారికి దుష్కరముగ నున్నది. సమకాలికమైన అమెరికనుసంఘములో విలువ గలవిగా భావింపబడు వానినెల్లను వారి అపభ్రంశభాషను పిల్ల లతి సులభముగ అలవఱచుకొందురు. సంఘములో దేనిమీదగాని వారికి గౌరవ ముండదు. గౌరవము తల్లిపై లేదు, తండ్రిపై లేదు, సరేసరి, దేవునిపై లేనే లేదు. యాంత్రికముగను, పారిశ్రామికముగను అత్యున్నతి నందుకొన్న నాగరకతలలో గల్గు చిక్కు లివి. తండ్రినిగూర్చి 'అదుగో ఆ వృద్ధవియూపి' అని కొందఱు పిల్లలు చెప్పుచుండగా వినియున్నాను. "నాకీ దేహము నిచ్చుటతో ఆడొక్కపని ముగిసినది. ఇక నా దారి నాది"—ఇది అచటి పిల్లల ధోరణి.

మానవునిలో దివ్యాంశ మొకటి యున్నదను విషయము మానవునిగూర్చిన వారి శాస్త్రములో కాన రాదు. మానవస్వభావమును గూర్చి ఫ్రాయిడు మహాశయు డేమి చెప్పియుండెనో ఆ పరిజ్ఞానపు పొంగే ప్రస్తుత మచ్చటి పరిస్థితిలో అధికభాగమునకు కారణము. ఫ్రాయిడొక శాస్త్రజ్ఞుడు. శాస్త్రసేవ

లోను, మానవసేవలోను అత డద్భుతములను సాధించినాడు. ఐనను శాస్త్రమును రూపే ర్పఱచువారము మనమే. నానాటికి క్రొంగ్రొత్త విషయాలు బయటపడుచున్నవి. కాబట్టి ఫ్రాయిడు చెప్పినదానిపై నాధారపడి ఒకతత్త్వ శాస్త్రము నేర్పఱచి అంతతో ఆగుట విపత్కరము. పాశ్చాత్యదేశాలవారు ఆ ఫ్రాయిడు మహాశయుడు బోధించిన తత్త్వమునకు దాసులై యున్నారు. ఈ విషయ మిప్పుడిప్పుడే ఎక్కువగా గుర్తింపబడుచున్నది.

ఫ్రాయిడు మహాశయు డేమి బోధించెను:—"ఇవిగో మానవునిలో ఉద్రేకాలు. వానిని ధారాళముగ వెలువడనీయవలె, అడ్డగింపరాదు, అణపరాదు; విఘాత మొనర్పరాదు, దానిని అడ్డగించిన యెడల, మానవుని వ్యక్తిత్వము దెబ్బతినును మానవుని వ్యక్తిత్వమున కెట్టి సేగియు కలిగింపరాదు. కాబట్టి తల్లిదండ్రులు బిడ్డల దారులకడ్డము పెట్టుట లేదు. వారి ఉద్రేకము లన్నియు ఐహికములు దైహికములు, అంతకు పైమెట్టువి కావు. కాబట్టి మానవజీవితము భౌతికస్థాయిలో ఆగి పోవుచున్నది.

అమెరికాలో ఒక విశ్వకళాపరిషదధ్యక్షుడు ఈలోటును కనుగొన్నాడు. ఆయన ఒక మాట అన్నాడు. నా ఉపన్యాసాలలో ఆ మాటను నేను తఱచు ఉదాహరించుచుండెడివాడను. ఆయన చెప్పిన దిది. "బెత్తమును మూలబడ వేసినచో పిల్లలు చెడిపోదు రను పురాతనాభాణక మొకటి యున్నది. వివేకవంతులమై మనము దానిని విడనాడితిమి. పిల్లలను అభివృద్ధికి తేవలె ననిన ప్రేమచూపవలెనే కాని దెబ్బలు కొట్ట రాదనుట ఈనాటివిద్యాబోధన సిద్ధాంతము. మంచిసిద్ధాంతమే; ఐనను మన కిపు డొక క్రొత్తసుద్ది కావలసి యున్నది. ఆ సుద్ది ఇదే:—ఫ్రాయిడు మతమును త్రోసిరాజనుడు, పిల్లలను సరిదారికి తెండి. పిల్లలను కాపాడుకోవలె ననిన ఫ్రాయిడు మతము తొలగి పోవలెను. పిల్లలను అపేక్షలలోనుండు డనవలెను. అట్టున్నచే ఉన్నతుల నందుటకు వారికి శక్తియుక్తులు లభించును. పైస్థాయి అనున దొకటి ఉన్నదా! ఉన్నచో అది మనము గుర్తింపవలెను. ఇది మానవుల అంతరతత్త్వశాస్త్ర హృదయము. మానవు డధిరోహింపదగ్గ పైస్థాయి యొకటి యున్నదను నమ్మకమును వేదాంతశాస్త్రము మనకు కలిగించును.

నేటి సంఘములో ఫ్రాయిడుసిద్ధాంతమువలని చెడుగులను తొలగించుకొను టెటు లనుటను గూర్చి నే నుపన్యసించుచుంటిని. పాశ్చాత్యు లనేకులు కూడ ఆ ఫ్రాయిడు మతమును ఆక్షేపించినారు. వారిలో ఒక అమెరికను విశ్వకళాపరిషదధ్యక్షుని ఆక్షేపణమును పైని తెలిపితిని. ఆయన అన్నమాటలు, "మన కిపు డొక క్రొత్త సుద్ది కావలసియున్నది. ఇదే ఆ సుద్ది—ఫ్రాయిడుమతమును త్రోసిరాజనుడు, పిల్లలను సరిదారికి తీసికొనిరండు". ఫ్రాయిడుపదేశించిన పెడదారివలని చెడుగులు సారస్వతమును శిల్పమును విద్యాబోధనమును చెడగొట్టినవి. సంఘమునంతటిని చెడగొట్టినవి. ఆ చెడుగు ఒక సందర్భమున నాదారిని నా కెదురైనది. 'ఓరిగను'లో పోర్ట్లండు రేడియో స్టేషనులో రేడియోద్వారా శ్రోతలతో రెండుగంటలసేపు సంభాషణ సాగినది. పోర్ట్లండులో ఒక వేదాంతసొసైటి ఉన్నది. శ్రీ అశేషానంద స్వామి దాని కధ్యక్షులు. నే నక్కడ వారము దినము లుంటిని. రేడియోద్వారా సంభాషణకు వారు ఏర్పాటుచేసిరి. మొదట వారు చేసిన యేర్పాటు ఇరువదినిమిషాలసంభాషణకే. కాని పిమ్మట సంభాషణము రెండుగంటలసేపు చెల్లి

నది. వివిధప్రదేశములనుండి శ్రోతలు టెలిఫోను ద్వారా ప్రశ్నలడుగుచుండిరి.

సంభాషించినవారిలో శ్రీజ...అను నొకడుండెను. ఆధునికుడు, ఉత్సాహపూర్ణుడు స్థిరుడు, పట్టుదలకలవాడు. మీఁదికి వచ్చి పడు రకము వాడు. ఇప్పటి సంఘమతనికి నచ్చునది కాదు. అతడిట్టివాడని అతనిని సమాధానపఱచుట సాధ్యపడదని అనేకులు నాకు జెప్పిరి. 'పరవా లేదు లెండి' అని నే నన్నాను.

ఈ సమాగమసంభాషణలప్పుడు సాధారణముగా వారు మొదట చులకనగా "ఇదిగో క్రొత్తస్వామి వచ్చినారు" అని ఆరంభించెడివారు. 'స్వామి' అను పదమును చాలచులకన చూపుతో వాడెడివారు. కాని ఒక్క నిమిషములో అంతయు మాఱిపోవును. తర్వాతి సంభాషణలప్పుడెల్ల 'ఈయన క్రొత్తరకపుస్వామి' అనెడివారు, కేవలము క్రొత్తస్వామి యని మాత్రము కాదు. ధోరణి అట్లు వెంటనే మాఱెడిది, వ్యవహార మంతయు నిష్పరిహాసమయ్యెడిది. ఆనాడు నా ప్రసంగప్రారంభములో నేను 'ఆధునికమానవుడు తన్ను తాను క్రమశిక్షణమునకు లోబఱచుకోవలె' నంటిని. నే నామాట అన్నవెంటనే శ్రీజ. మహాశయుడు 'స్వామీ శిక్షణము అనుమాటలో మాకు నమ్మకము లేదు. శిక్షణముపై మాకు గుఱి లేనే లేదు. మేముకోరునది సహజత స్వాభావికత'– అన్నాడు.

అతనిచే ఆమాటను పలికించిన యాశయమును పూర్తిగా నే నర్థము చేసికొని 'మహాశయా, కొన్ని నిమిషములకు ముందే నీవు పండితరవిశంకరుని సితారువాద్యమును అపరిమితముగ కొనియాడితివి కదా. ఆసంగీతము ఎంతసహజముగ ఎంతస్వాభావికముగ ఎంత మధురముగ నుండినది! అదంతయు సరే. రవిశంకరసంగీతసహజతకును స్వాభావికతకును అడుగున ఎన్నియేండ్ల దృఢసాధన యుండియుండవలెను? నీ వెప్పుడేని నిదానముగ అందుంగూర్చి యోచించితివా?' అని అడిగితిని.

ఆరీతిగ అన్నంతనే అతనికి చుఱుకు పుట్టినది. 'చాల బాగున్నదే ఈయాశయము. ఈరీతిగ అందుంగూర్చి నేను యోచింపలేదు. ఇది అపూర్వము, ఈదృక్పథమున జూచిన క్రమశిక్షణావశ్యకత నాకు బోధపడుచున్నది'— అన్నాడు.

అప్పుడు నే నిట్లంటిని :–'సహజతాస్వాభావికతలను మేము నొక్కి చెప్పుచుందుము. మానవునకు సహజతయు స్వాభావికతయు తప్పక యుండవలెను. సహజతాస్వాభావికతలు రెండువిధములు. క్రమశిక్షణకు మునుపటి వొకవిధము. క్రమశిక్షణానంతరమువి మఱొకవిధము. సహజతాస్వాభావికతలు జంతువులకును ఉన్నవి. ఆవు ఉన్నచోటనే మలమూత్రములు విసర్జించుచుండును. అది దానికి సహజము స్వాభావికము. కాని మనుష్యశిశువును మనము శుభ్రతకై కట్టుదిట్టములలో నుంతుమే. శిశువులకు మనము నేర్పు మొదటి పాఠమదే. శిశువులు కొన్ని ఉద్రేకాల నణచుకొనవలెనని మనము నిర్బంధించుచుందుము. అది శిక్షణకు ప్రారంభము. అది తర్వాతను సాగుచుండును.

బుద్ధుడో జీససో శ్రీరామకృష్ణుడో అధిరోహించిన పరమోన్నతస్థాయిలో సర్వమును సహజమే స్వాభావికమే. ఆ సహజతాస్వాభావికతలకును ఈ సహజతాస్వాభావికతలకును మధ్య సాధనలు తపశ్చర్య సాగవలసినదశ. ఆ సాధన మానవులలోని మన ఆత్మశక్తులను అతని కనుకూలమైన పరమోచ్చదశ నందునట్లు వర్ధిల్ల జేయును. మానవసంఘములో ఈ

సాధనలను తొలగింప శక్యము కాదు. తొలగించినచో జీవితమును జంతుస్థాయికి దించినట్లగును. మానవులు బహుతరముగా అట్లే చేయుచున్నారు. మానవుడు జంతుదశకు దిగజాఱినాడు. ఏ ఉద్రేకము కలిగినను ప్రదర్శించును, ఇది కావలె నను, అది కావలె నను. తన్ను తా నదుపులో ఉంచుకోడు. క్రమశిక్షణకు తలయొగ్గడు. ఇది మహాదౌర్భాగ్యము.

శ్రీజ. మహాశయునకు నామాటలు నచ్చినవి. తర్వాత అడిగిన ప్రశ్నల నన్నిటిని సప్రశ్రయముగ అడిగినాడు. రెండుగంటల సంభాషణ సాగినది. అప్పటికే రాత్రి 11-30 గంటలైనవి. అప్పు డతనితో నే నిట్లంటిని 'మహాశయా, పోర్ట్లండులోని మా వేదాంతసొసైటిని నీవు చూడలేదే. పై భానువారము దయచేసి అచ్చటికి రమ్ము. నాటిపూర్వాహ్ణమున 11 గంటలకు నన్నుపన్యసింపు మని స్వామి నియమించియున్నారు. నీవు రమ్ము. మీశ్రీమతి కూడ రావలెను.' 'వచ్చుటకు ప్రయత్నింతు' నని యతడు బదులు చెప్పెను.

మఱుదినము ప్రొద్దున నా యుపన్యాసము ప్రారంభమగుటకుముందే శ్రీజ-దంపతులు ఒక బిడ్డనెత్తుకొనివచ్చి సభలో మొదటిశ్రేణిలో కూర్చుండిరి. వేదాంతశాస్త్ర విహితసాధనల నతఁ డర్థముచేసికొనగలిగినాడు. వేదాంత ప్రబోధమునకు ఇప్పటి ఆశయాలకు అక్కఱలకు అనురూపమైన మార్గమున్నది. అప్పుడెవ్వరును కాదనరు. వేదాంతము ఆనందము నంతరింపజేయు శాస్త్రము కాదు. బ్రహ్మానంద సంధాయకమైన శాస్త్రము. 'నాకు క్రమశిక్షణ మెందుకు' అను ప్రశ్నకు సంతృప్తికరమైన సమాధానము వేదాంతమం దున్నది. అదే దాని గొప్పతనము.

'తప' శ్శబ్దమును (క్రమశిక్షణ మను మాటను) నా ప్రసంగాలలో నేను తఱచుగ వాడితిని. సరియైన రీతిలో శ్రోతలయెదుట బెట్టితిమేని ఆక్షేప ముండదు. శాస్త్రములో గాని శిల్పములో గాని ఏరంగములో గాని గొప్పసిద్ధి, సృజనాత్మకమగు సిద్ధి-తపఃఫలము గానే చేకుఱును. అట్లంటిమేని తపస్సున కాక్షేప ముండదు. నేను నొక్కి చెప్ప గోరున దిది. విధినిషేధములను చప్పగా చెప్పక కార్యానుకూలమును యుక్తిసహము నైన రీతిలో కఱపవలెను.

# దైవానుగ్రహము - సాధన

## శ్రీ ఎమ్. ఆర్. చారిగారు

ఆధ్యాత్మికరంగములో మనము అనేకసమస్యలను ఎదుర్కొనవలసివచ్చును. అందులో శాస్త్రవిషయమునందు వాగ్వివాదము లెక్కువ. ఈవాదములను పరిష్కరించినగాని మనలో సంశయరాహిత్యము కలుగదు. సందేహపరుడు సాధకుడు కాజాలడు. అట్టివాడు రెండింటికి చెడిన రేవనివలె ఇహమునందు సౌఖ్యమును అనుభవింపలేడు పరలోకానందము నొందలేడు. అందుచే విజ్ఞానపరిధిలో మనము సందేహములను తొలగించుకొనవలెను. విజ్ఞానము జ్ఞానేంద్రియజనితమై యుండుటచే మన విజ్ఞానము, ఇంద్రియాతీతుని భగవానుని గూర్చి ఇదమిత్థముగ ఏమియు చెప్పజాలదు. కనుక భగవానునిగూర్చి తెలిసికొనుటకు

శాస్త్రవచనమే ఆధారము. ఎందుచేతననగా అనుభవములు మాత్రమే యిందు క్రోడీకరింప బడినవి. పూర్వము చెప్పినట్లు శాస్త్రవచనములయందు విశ్వాసము కలుగుటకు మనలో కొంత పరిజ్ఞాన మవసరము.

ఆత్మదర్శనము కేవలము స్వయంకృషితో కలుగునా లేక దైవానుగ్రహమువలన సంభవించునా అను సంశయము ప్రతియొక్కరికి కలుగును. దైవానుగ్రహ మున్నట్లయిన స్వయంకృషితో పనియేమి? లేక స్వయంకృషితో సర్వము సాధించుచుండగా ఈ దైవానుగ్రహ మెందులకు? అని ప్రశ్నించిన:-ప్రపంచవిషయములలో స్వయంకృషి మిక్కిలి తోడ్పడును. కాని స్వయంకృషికూడ జ్ఞానజనితము. అందుచే దైవానుగ్రహము లేనిదే జీవుడు విజ్ఞాని కాజాలడు. కేవలము దైవానుగ్రహముపై ఆధారపడినవాడుకూడ ముక్తిని పొందజాలడు. వ్యవసాయమున పంట పండించుటకు మనము భూమి దున్ని, విత్తు చల్లవలెను. వర్షము పడుట దైవానుగ్రహము. సాగుచేయనినాడు వర్షము పడినను లాభము లేదు. శ్రీరామకృష్ణులు ఒక ఉదాహరణము చెప్పెడివారు. మలయమారుతము వీచునపుడు వృక్షము లన్నియు గంధపువృక్షము లగును. కాని జిల్లేడు మొదలగు హీనజాతివృక్షములు వివిధమైన మార్పును చెందక పూర్వమువలె నుండును. దైవానుగ్రహమనెడి మలయమారుతము వీచినపుడు దానిని గ్రహింపగల స్తోమత మనలో నుండుటకు గాను మనము సాధన చేయవలెను.

ఎంత కాల మీసాధన చేయవలెను? మనపై దైవకృప యున్నదా లేదా? అను ప్రశ్నలు మనలో ఉదయించును. నారద మహర్షి ఈ ప్రశ్న కీ విధముగ సమాధానము నొసంగిరి. 'ప్రకాశతే క్వాపి పాత్రే'. మెరుగు పెట్టిన గిన్నెయందు సూర్యుడు ప్రకాశించు చందమున సాధనతీవ్రతచే శుద్ధి నొందిన మనస్సులో దైవము ప్రకాశించును. దైవానుగ్రహము సంపాదించుటకు కాలనియమము లేదు. కొన్ని జన్మలు తీవ్రసాధన చేసినను లభింపక పోవచ్చును. కాని సాధకుడు నిరుత్సాహపడక తనసాధనలను కొనసాగింపవలెను. ఒకనాడు నారదమహర్షి తనసంచారములో ఇద్దరు యోగులను గాంచెను. వారు తీవ్రతపము నాచరించుచుండిరి. నారదమహర్షిని చూచి వా రానంద మొందిరి. వారికి దైవదర్శన మెప్పుడు కలుగునో ఆనారాయణుని అడిగి తెలిసికొనవలసినదిగా నారదమహర్షిని వారు ప్రార్థించిరి. వారి ప్రార్థన విని వారి విన్నపములను నారాయణునికి విన్నవించి తిరిగి ఈయోగులను చూచుటకు నారదుడు వచ్చెను. వారుత్సాహముతో నారదుని కెదురేగి మావిన్నపములు విన్నవించితిరా యని యడిగిరి. అందులకు నారదుడు, మొదటివానికి మూడుజన్మల తరువాత రెండవవానికి చింతచెట్టుకు గల చింతాకు లన్ని జన్మల తరువాత మోక్షము కల్గు నని నారాయణుడు చెప్పె ననెను. ఇంకను మూడుజన్మలు తపస్సుచేయవలెనా యని మొదటి యోగి దిగాలు పడిపోయెను. కాని రెండవయోగి ఆనందముతో నృత్యము చేయుట మొదలిడెను. అతని ఆనందమునకు కారణము, ఈనాడు కాకపోయినను కొన్ని జన్మలకయినను మోక్షము కలుగునను గట్టినమ్మకమే. మనలో కూడ అట్టి గట్టినమ్మక ముండవలెను.

కోడిపిట్టకు తనగ్రుడ్డుపై పెంకును ఎప్పుడు బద్దలుకొట్టవలెనో తెలియును. మన మెవిధముగ బలవంతము చేసినను కోడి గ్రుడ్డును పగుల గొట్టదు. సమయ మాసన్నమైనపుడు తనంతట తానే గ్రుడ్డుపెంకును చితుకకొట్టును. అప్పుడే

ఆరోగ్యవంతమైన కోడిపిల్ల బయటకు వచ్చును. తొందరపడి మనము బ్రద్దలుకొట్టిన అది చని పోవును. ఇదే విధముగ జీవునకు ఎప్పుడు తన కృప చూపి మోక్షమొసగవలెనో దేవునకు తెలియును. దానిగూర్చి తర్కించుట వివేక హీనము. 'న హి కళ్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి' అని గీతలో చెప్పినట్లు మంచిపనిచేయు మనకు వినాశనము నొందము.

పోతనామాత్యుడు భాగవతమున గజేంద్ర మోక్షమునందు, జీవునిసాధనను దైవానుగ్రహమును కండ్లకుకట్టినటుల సృజించెను. జీవుడు తన సాధనవలన తనఅస్తిత్వమును గ్రహించును. ఈసాధన అహంకారమును పూర్తిగా నశింప జేయును. అప్పుడే జీవుడు శరణాగతుడు కాగలడు. గజేంద్రుడు జీవి. అతడు జలక్రీడలకై దిగిన కాసారము సంసారము. అందు నివసించు మొసలి అహంకారము. సంసారమునుజొచ్చిన మానవుడు తాను తత్త్వమున పరమాత్మ యని మఱచి, క్షణికానంద మొందుచు మమకారమనెడి మొసలిచే పట్టువడి, దరిచేరలేక దేవ దేవుని శరణొందును. ఆ సమయముననే కరుణామయుడగు భగవానుడు ప్రత్యక్షమై విజ్ఞానమనెడి చక్రముచే అజ్ఞానమనెడి మొసలికంఠమును ఖండించి జీవుని రక్షించును. అంతదనుక మన ప్రయత్నము తప్పదు.

ఈవిషయమును శ్రీ తాళ్లపాక అన్నమాచార్యులు ఎంత మనోహరముగ వర్ణించిరో చూడుడు.

పెట్టిన నీ వెలుగుదు పెనుదిక్కు-
జట్టిగా శ్రీహరి నీశరణు జొచ్చితిమి
కర్మమూలమైనట్టి కాయము మోచి నేను
కర్మము విడువబోతే కడుసంగతా
మర్మ మెఱిగిన నీవే మాయలఁ గట్టుండఁ గాను
పేర్మి నే విడువబోతే విరియదాకట్టు
బంధమూలమైనట్టి ప్రపంచమందునుండి
బంధముసున్ బాసేనంటేఁ బాసునా అది
అంధకారమైనట్టి అజ్ఞానాన దోసితివి.
అంధకారమున వెలు గరిసితేఁ గలదా
నిచ్చలు సంసారపు నీరధిలోన మునిఁగి
చొచ్చి వెళ్లి చేరే నంటే చోటు కలదా
యిచ్చట శ్రీవెంకటేశ యిహమందే పరమిచ్చి
అచ్చు మోపి యేలఁగా నేనన్నియుఁ దెలిసితి.

శ్రీ వేంకటేశ భక్తుడు శ్రీ అన్నమాచార్యులే ఈవిధముగ చెప్పగ మనము ధర్మ పన్నాల నొప్పజెప్పుచు కాలమును వ్యర్థము చేయుట అవివేకము కాదా! దేవునికృప మన మీద నున్నదనుటకు మన ఈమానవజన్మయే నిదర్శనము. కనుక మనము నిరంతరకృషి చేసి ఆపరమాత్మలో ఐక్యము నొందెదముగాక.

# ధర్మసాధనము

శ్రీ ఐనపర్తి వేంకటరావుగారు

"ఉదు ముండదె మూత్రేంద్రము
ఒడిముండదె పేస్మి పొసు గడుపూ కేద్దుక్
మడువున గొక్కెర యుండదె
కడు నిల పురుషార్థ రుసు గానదె సుమతీ."

ధర్మార్థకామ మోక్షములు పురుషార్థములు. మానవుడు వానిని సంపాయించుటయే పనిగా గడపవలయును.

తనకు ధర్మమైన ధర్మమును సాధించు ధర్మమును, పరధర్మముచే ప్రేరితమైన ధర్మమును జేపట్టక న్యాయమార్గమును దప్పక తనవృత్తిచే ధనము లార్జించుచు సర్వప్రాణులయందును దయగలిగి స్వజనులకు నతిథులకు నభ్యాగతులకు యాచకులకు వికలాంగులకు సాధువులకు ననాథులకు పతితులకు శునకచండాలాదులకు పశుపక్షి మృగ కీటకములకు ధనమార్జనమును ప్రయత్నముని బంచియిచ్చుచు జీవనోపాయమును సమర్థింపవలెను. ఎవఁడైనను యిట్లు ప్రవర్తించు నతఁడు కాలుకాలున దున్నడిపొలము బలము దఱిగి యుండలి సస్యము ఫలి పని విధముగ ననుభవమునం జేసి కర్మపరత్వమున విరక్తి క్రమంబున జనించి విముక్తిని గాంచించును.

కావున ధర్మసాధనమున కుపాయమగు దేహమును దనమేలుగోరి యెల్లవిధముల భద్రముగా జూడవలెను.

తన యన్వయమును దన దార్ఢ్యమును దా నాకొన్నవేళలను పాటింపక యాహారమును దినగూడదు. అట్లు పాటింపక తినువాడు దినగూడనివానిగూడ మానక తినును. అట్టివాడొక్కొక్కవేళ మితిమీఱి తినును. ఆ నియమరహితు డవసరముగాని వేళల నుపవసించి తన దేహము, నందలిజీవుని, ఈశ్వరుని శోషిల్ల జేయును. శల్యమైన, నూనెనిదైన నుడుకుదైన గంప్పుదైన రహితమైనదైన నాదమువు లొకటి కొంచెము చెదటించునేనైన నట్టి పతను పరిమాణింపక తిని తిన్నదజీర్ణమున్న మరల దినును, పగటివేళ నిద్రించును, తఱచు స్త్రీ వ్యసనములకు లొంగుదును, పరిశ్రమలయందు దనపటిమ యొల్లని కష్టమును జేసి యాయాసం పడును. ఇట్టి విధానములచే దేహమున కున్న బిగువు సడలును. ఇట్టి యజీర్ణము దేహమున తెవులు పుట్టించును. పైత్యవికారములు రేగి దేహము నుంచి ప్రాణమును వెడలదఱుమును. శ్లేష్మము పెరిగి యవయవములయందు చైతన్యము సన్నగిలును. శ్లేష్మము దేహములోని యవకాశములను దప్పుడుగా నుండగప్పును, గుత్తుకకు నడ్డపడును, తప్పించుకొని యూర్పులను సంచరింపనీయక యవరోధమును గలిగించును, ఎగూర్పు పుట్టును. అంత, జీవుడు నిలువనోపక, యీశ్వరుడు పహింపగా దేహమునుండి వెడలిపోవును.

దేహములో నూర్పు జరించుచున్న నింద్రియములు విషయములయందు వర్తించు చాతుర్యమును బొందుచున్నవి. ఊర్పులకు శ్లేష్మ మడ్డపడుటచే నింద్రియములు దమ శక్తులను గోల్పోయి దేహము చేష్టలుడుగును.

దేహమునందూర్పు క్రమముగ దిరుగకున్న నంగములయందు వాయువ్యాప్తి సమము దప్పి క్రొవ్వు పెఱిచి నొప్పును దెవులును బుట్టించును. అంతట సంధులబిగి దప్పి చలనము లేక వాయు వెక్కడి దక్కడ పేరుకొని దేహమును గట్టెను జేసి జీవుని వెడలనడుపును.

వాయువ్యాప్తి సమముగ నున్న
కాదును, కాలుసేతులు ముడువ వశమగును, జాప వశమగును, ఊలీలలు వాయుమార్గము

లను గఫము నిరోధింపకున్న జెల్లును. వాయు మార్గములు మేలుగ లేకున్న యా లీలల మేలును లేదు. మనస్సును వాయువును గూడి యీశ్వరునివలన వాక్కు [illegible]. ఇట్లు తక్కు-చేష్టలును బంధనము లగును. కావున వాతపిత్తశ్లేష్మములు విషమములై దేహము వ్యాధిగ్రస్తము గాకయుండ జాగ్రత బూనవలయు

వాతపిత్తకఫములు దేహము నావేశించినట్లు సత్త్వము రజస్సు తమస్సు నను ప్రకృతిగుణములు జీవు నావేశించును.

వ్యాధి శారీరము మానసికము నన రెండు తెఱగులు.

వాతపిత్తకఫములు సమములై యున్నప్పుడు మనుజుడు స్వస్థత గలిగి యుండి తన వృత్తియందు బ్రయాస లేక ప్రవర్తింప గల్గును. అవి మూడుగాని యొక్కటిగాని వికృతిబొందిన నప్పుడు శరీరవ్యాధి గలుగును.

సత్త్వరజస్తమోగుణములు సమత్వమును బొందియున్నప్పుడు మన స్సైకాగ్రముగనుండి తనధర్మమును సక్రమముగ నవలంబింపగలుగును. ఆ గుణములు విషమత్వము బొంది యున్నప్పుడు మనోవ్యాధి గలుగును. అప్పుడు మనస్సున కొకనిశ్చయము లేక తగవు మాలి యుండును.

వికృతి వాతాదులయందు గలిగినప్పుడు సత్త్వాదులందును, సత్త్వాదులందు గలిగినప్పుడు వాతాదులందును గలుగును. శరీరము వ్యాధిగ్రస్తమైన మనస్సుగూడ వ్యాధిగ్రస్తమగును. మనస్సు వ్యాధిగ్రస్తమైన శరీరముగూడ వ్యాధిగ్రస్తమగును. వ్యాధి రెంటను బుట్టును గాని యొకట విడిచి యొకట బుట్టదు.

సత్త్వాదులును వాతాదులును విపరీతములైనప్పుడు ప్రయత్నమున సమత్వమును బూనవలయు. అట్లు గాక కలత జెందినయెడల దనధర్మమును దప్పజరించి చేటొందును.

కలకాలము దుఃఖ ముండదు. కలుగక, యోర్చిన నది యంతము పట్టును. సుఖముగూడ నిత్యముగ నుండదు. సుఖములు గలిగినవేళల బొంగక దుఃఖములు వాటిల్లిన వికారము నొందక యుండగ సమబుద్ధిని గోల్పోక వానిని గడపబెట్టవలయును.

సుఖదుఃఖములయందు వికృతి నొందక సమముగ నుండువాడు మనోవ్యాధి దలపునకు దిడికొని క్రుంగడు. ప్రకృతిగుణములకు వశుడగుచో నవి యసుఖములగు నానాజన్మములను గలుగజేయును. స్వవిషయములకు ప్రకృతిగుణములు గారణములు. అవి జీవునకు దేహమునందు మోహమును బుట్టించును. జీవుడు దేహమునకంటె బరుడు, కర్మములకు దాను కర్త కాడు. అయినను, మోహమున దాను దేహమాత్రుడ నని యభిమానించి ప్ర జీవుల యంతరము నెఱుగడు. ఆ యభిమానిని దమోగుణకార్యమైన మోహము బంధించి, జీవనవిధులను గారవింపక యిష్టానుసారము జీవించు సోమరిని జేయును. ఆ యపోహాలో నతం డేదో తిని నిద్ర మరుగును. అది వానికి శరీరమున దెవులు దెచ్చును, మనస్సు జెఱచును. ఒక కారణము లేనట్టియు గోఱగానట్టియు నీచవిషయము నదియే సర్వము ననెడి ప్రవృత్తియు, నధర్మమును ధర్మముగ జేపట్టు మందబుద్ధియు, నిద్రయు, భయమును, నిరుత్సాహమును, మదమును, దామసగుణము సమత దప్పి వృద్ధిజెందుటచే బుట్టును.

దేహము దా నని యభిమానింపని బుద్ధి గలిగియుండువాడు ప్రకృతిగుణకార్యములకు వికృతినొందనివాడు. జ్ఞానప్రకాశము సత్త్వగుణమువలన, కర్మలయందు ప్రవర్తించుట

రజోగుణమువలన, మోహాదులు తమోగుణము వలన రూపొందును. అవి రూపొందినపుడును, కలుగక మానినపుడు నవి వదలిపోవలయు నని కాని ప్రాప్తింపవలయు నని కాని యారాట పడక యుదాసీనముగ నుండువాడు ధీరుడు. ఎల్ల విషయములకు ప్రకృతిగుణములు కర్త లని తెలిసి యతడు త్రుంగక పొంగక సముడై యుండును.

దేహమున వ్యాధి జనించి సత్త్వాదిగుణ ములు విషమములు గాగా, స్వస్థతనుండి మన స్సును జెదరనీయని వాడగుటచే నా ధీరు డప్పుడు మనోవ్యాధికి గురి కాడు, మానసిక ముగ వికృతి లేనప్పుడు శరీరవ్యాధియు నుప శమించును.

త్రిగుణమయమైన ప్రకృతి దైవమాయ. తన హితమును గోరుకొనువాడు దైవమునే శరణుజొచ్చిన మోహము నెడి విషయాను రాగము మాని సత్త్వరజస్తమములు విషమ ములు గావు. అట్టివానికి సాత్త్వికాహారవిహా రములు ప్రియమై వాని దేహము ధర్మమునకు సాధనమే యగు. వానికి దేహాభిమానము లేదు. కనుక గర్మబంధ ముండదు. ప్రకృతి గుణములకు వశుడు గానివాడగుటచే దేహావ సానమున మరల బుట్టడు, పురుషార్థములలో బరమార్థమైన పదమును జెందును. ఇట్లు దేహము పురుషార్థసాధనము కాగలుగును.

ధర్మకర్మమును మనస్సు సంకల్పింపగా నాచరణవిధానమును వాక్కు రూపింపగా క్రియమాణమునకు దేహమే సాధనము.

## వార్తలు - విశేషాలు

### వివేకానందకాలేజి - మద్రాసు 4.

### రజతోత్సవము

శీలముపై పారమార్థికపరతపై, భారతీయ సంస్కృతిపై నాధారపడిన చక్కని విద్యను వ్యాపింపజేయవలసిన అక్కఱను గుర్తించిన మదరాసు మైలాపురస్థులైన ఉదారమహా జనులు రామకృష్ణమిషనువారి ఆధ్వర్యమున 1946 లో ప్రారంభించిన కాలేజీ వివేకానంద కాలేజి. ఇరువదియైదేండ్ల పరిసమాప్తికి లాంఛ నముగా ఆ కాలేజివారు 1971 వ సంవత్సరం సెప్టెంబరు నెలలో మూడుదినాలపాటు రజతో త్సవం జరుపుకున్నారు.

1971 వ సంవత్సరం సెప్టెంబరునెల 11-వ తేదినాడు రాష్ట్రపతి మాన్యశ్రీ వరాహగిరి వేంకటగిరిగారు మూడుదినాల రజతోత్సవ కార్యక్రమానికి ప్రారంభం చేశారు. ఉపా ధ్యాయులున్నూ, విద్యార్థులున్నూ ప్రాత విద్యా ర్థుల సహకారంతో ఈమహోత్సవానికి విస్తార మైన సన్నాహాలు చేశారు. దీపతోరణాలం కృతమైన కాలేజిఆవరణం అక్షరాలా 'విద్యా మందిరం' (టెంపుల్ ఆఫ్ లెర్నింగ్) అన దగి వెలుగొందింది.

వచ్చిన వెంటనే మాన్యశ్రీ వరాహగిరి వేంకటగిరి గారికి కళాశాలాధికారపరిషత్తువారు యథోచితములైన మర్యాదలుచేశారు. ఎన్సీసీ వారి ప్రణతు లందుకొన్న తర్వాత శ్రీ చిన్న మౌలానాసాహేబు వర్గంవారి నాదస్వరంతో పూర్ణకుంభంతోడి స్వాగతోపచారం చిత్త గించి, రాష్ట్రపతిగారు వేదికపై ఆసన మలంక రించారు. పందిరిలో దాదాపు ఐదువేలమంది సభ్యులు సమావేశ మయ్యారు. వేదికపై స్వలంకృతములైన శ్రీరామకృష్ణపరమహంస

శ్రీ వివేకానందస్వాముల పెద్ద చిత్రపటాలు ప్రతిష్ఠింపబడి యుండినవి.

రజతోత్సవప్రారంభ సమావేశం కాలేజి వారి ప్రార్థనశ్లోకాల అనుసంధానంతో ఆరంభమైంది. శ్రీ రామకృష్ణమఠాధ్యక్షులనుండి సర్వకార్యకర్తస్వాములవారినుండి విద్యారంగమున సువిఖ్యాతులైన పలువురుప్రముఖుల నుండి వచ్చిన సందేశాలు చదువబడ్డాయి. కాలేజినిర్వాహక పరిషత్కార్యదర్శియూ, విద్యార్థిసమితికార్యాధ్యక్షుడున్నూ కళాశాలాధ్యక్షులున్నూ, సదస్యులకు స్వాగతం పల్కారు. తర్వాత సభాధ్యక్షులైన శ్రీమత్కైలాసానంద స్వాములు ఆశీర్మంగళోపన్యాసం కావించి శ్రీ వివేకానందస్వామి నిర్దేశించిన మార్గంలో ఈ కాలేజి మేలొందవలె అని పెంపొందవలె అని ఆశంసించారు.

తమిళనాడు గవర్నరు మాన్యశ్రీ కె. కె. షా గారు తమ తొలిప్రసంగంలో —"భారతీయుల శాశ్వతంగా వెలుగుచుండ జేయడానికి విద్యారంగంలో ప్రవక్త శ్రీ వివేకానంద స్వామి భావించిన విధానాన్ని మనం అనుసరించడం ఎంతైనా అవసరం—అన్నారు.

భారతరాష్ట్రపతిగారి ఉపన్యాసాన్ని శ్రోతలు తదేకమనస్కులై ఆలకించారు. ఆ ఉపన్యాససారాంశం ఇది. ఉపాధ్యాయులున్నూ ప్రజలున్నూ విద్యార్థిబృందమును చేరదీయాలి, వారికి తాము తోడ్పడ గల రీతులను సాధనాలను సమాలోచించాలి. ప్రజలకు నిజమైన విద్య ఎంతముఖ్యమో నిరూపించడానికి ఆయన శ్రీ వివేకానందస్వాముల జీవితచరిత్రంలోంచి పెక్కు సందర్భాలను ఉదాహరించారు. కళాశాలా బృహత్సభాభవనానికి రాష్ట్రపతిగారు శంకుస్థాపనం చేశారు. రజతోత్సవపరిషత్కార్యదర్శి శ్రీ ఎస్. వేంకటరామనుగారి వందనోపచారంతో ప్రథమదిన కార్యక్రమం సమాప్తమైంది.

రెండవనాటి (12-9-71) సభకు మదరాసు రామకృష్ణమఠాధ్యక్షులైన శ్రీమత్తపస్యానంద స్వాములు ఆధ్యక్ష్యం వహించారు. 'రజతోత్సవోపన్యాసా'న్ని తమిళనాడు విద్యామంత్రి మాన్యశ్రీ వి. ఆర్. నెడుమ్‌శెళియనుగారు కావించారు. హాస్యచమత్కారభరితమైన వారి అనర్గళోపన్యాసంలో "రాష్ట్రధనంలో అధికభాగం విద్యకై యే వ్యయమవుతూ ఉండినప్పటికీ, విద్యారంగంలో మనం చాలా వెనుకబడి ఉన్నాం, కాబట్టి అందు మనం ఓపికతో పరిశ్రమించాలి" అని వాక్రుచ్చారు. రజతోత్సవసందర్భాన కాలేజివారు నగరవివిధకళాశాలావిద్యార్థులకు జరిపిన వక్తృత్వప్రముఖములైన పోటీలలో గెలుపొందినవారికి మంత్రిగారు బహుమతులను పంచిపెట్టారు. విద్యార్థులు ఒక గంటసేపు వినోదకార్యక్రమాలు ప్రదర్శించారు. అంతతో రెండోనాటి కార్యక్రమం ముగిసింది.

తుదిదినం మూడోదినం. (13-9-1971) ప్రొద్దున రెండువేలమంది దరిద్రనారాయణులకు సమృద్ధమైన అన్నసంతర్పణం కావింపబడింది. అందు విద్యార్థులూ, ఉపాధ్యాయులూ హాస్టలుద్యోగులూ ఆస్థతో పాల్గొన్నారు. సాయంకాలం వివేకానంద కళాశాల పూర్వవిద్యార్థిసమావేశం. ఆ కాలేజి పుట్టిననాటినుండి దాని నిర్వాహకపరిషత్తుకు అధ్యక్షులుగా ఉండిన శ్రీమత్కైలాసానందస్వాములవారు సభాధ్యక్ష్యం వహించారు. కాలేజి ప్రారంభదినాల చరిత్రను, ప్రారంభకులు పడ్డ శ్రమను స్వానుభవాలను స్వాములవారు వివరించారు. తర్వాత ఈ కళాశాలకు మాజీఅధ్యక్షులైన శ్రీ టి. ఆర్. రాఘవశాస్త్రిగారున్నూ, శ్రీ టి. ఎన్. శేషాద్రిగారున్నూ ప్రసంగించారు. పూర్వం ఈ కళా

శాలలో చదివి యిప్పుడు గొప్ప పదవులలో ఉంటుండే కొందఱు 'మమ్మును తీర్చి దిద్దిన కళాశాల ఇది. మమ్ములను మానవులనుగ రూపొందించిన విద్యను మేము మీ కళాశాలలో అధికరించాం' అని ప్రస్తుతించారు.

ఈ కళాశాల ప్రాతవిద్యార్థియు ప్రస్తుతం తమిళ దేశంలో సుప్రసిద్ధ హాస్యనటుడున్నూ 'తుగ్లక్' తమిళ పత్రికా సంపాదకుడున్నూ అగు శ్రీ 'చో' (రామస్వామి) హాస్యనాటికాదృశ్యాలను కొన్నిటిని ప్రదర్శించి సదస్యులకు వినోదం కూర్చాడు.

ఈ మహోత్సవస దర్భాన కళాశాలవారు 'కళాశాస్త్రవస్తుప్రదర్శనము' నొకదానిని ఏర్పఱచారు. అది సెప్టెంబరు 12-వ తేదినుండి నాల్గుదినాలు సాగింది. ప్రదర్శనార్థం అమర్చబడ్డ కొట్లసంఖ్య దాదాపు 60.

ఈ మహోత్సవంలో విద్యార్థులూ ఉపాధ్యాయులూ వహించిన ఉత్సాహం అద్వితీయం ప్రతిఅంశమూ చాల చక్కగాను విద్యాపాదకంగాను పొందుపఱచబడింది. కళాశాలాభివృద్ధి, స్వదేశవిదేశాలలోను ముఖ్యంగా మద్రాసులోను రామకృష్ణమిషనువారి కార్యప్రణాళికలు – ఇవి పట్టికల చిత్రాలద్వారా చక్కగా రంజకంగా ప్రదర్శింపబడ్డాయి.

## గుంటూరులో శ్రీరామకృష్ణునిగుడికి సంప్రోక్షణ

గుంటూరు నగరంపాలెంలో శ్రీరామకృష్ణ సమితివారు నిర్మించిన శ్రీరామకృష్ణపరమహంస దేవస్థానానికి 13-11-71-వ తేదినాడు బేలూరుమఠ రామకృష్ణమిషను శారదాపీఠీయులైన శ్రీమచ్ఛుద్ధసత్త్వానందస్వాములవారు సంప్రోక్షణ కార్యం నిర్వర్తించారు. నాదస్వర మంగళవాద్యంతో వేదపారాయణంతో భజన సంకీర్తనలతో శ్రీ శుద్ధసత్త్వానందస్వాములున్నూ శ్రీ నాగేశానందస్వాములున్నూ శ్రీ బోధస్వరూపానందస్వాములున్నూ శ్రీరామకృష్ణభగవానునియొక్క మాతృశ్రీశారదాదేవియొక్క శ్రీవివేకానందస్వాములయొక్క చిత్రపటములను ఊరేగింపుగా తెచ్చి గుడిలో



శ్రీ రామకృష్ణమందిరం, గుంటూరు

ప్రతిష్ఠించారు. తర్వాత షోడశోపచార పూజయు హోమము నిర్వర్తించబడ్డాయి. అత్యధిక సంఖ్యలో సమావిష్టులైన భక్తులకు ప్రసాదవినియోగం జరిగింది.

సాయంకాలం పౌరమహాసభ సమావేశమైంది. గుంటూరుకలెక్టరు శ్రీ కె. జయభారతరెడ్డిగారు అధ్యక్షపీఠం అలంకరించారు. శ్రీమచ్ఛుద్ధసత్త్వానందస్వామిగారు ఇంగ్లీషులోనూ రాజమండ్రి శ్రీమతి వివేకానందదేవిగారు తెలుగులోనూ ఉపన్యసించారు. మఱుదినం దరిద్రనారాయణసంతర్పణ, దాదాపు 1500 మంది పేదలకు భోజనం పెట్టబడింది. సాయంకాలం 5-30 గంటలకు మళ్ళీ పౌరసభ. అందు వేదాంతకేసరిపత్రికాసంపాదకులైన శ్రీ బోధస్వరూపానందస్వాములున్నూ, రాజమండ్రి రామకృష్ణమఠాధ్యక్షులైన శ్రీ నాగేశానంద

స్వాములున్నూ, శ్రీ రామకృష్ణుని గూర్చి, శ్రీరామకృష్ణోద్యమము గూర్చి ఉపన్యసించారు. 'శాస్త్రి' హరికథా కాలక్షేపంతో నాటి కార్యక్రమం సమాప్తమైంది.

గుంటూరు శ్రీరామకృష్ణసమితి 1958 లో ప్రారంభింపబడింది. అది రిజిస్టరు చేయబడిన సమితి. ప్రజలలో ఆధ్యాత్మిక ప్రబోధమును కలిగించుటకు ఈ సమితి చక్కని కృషి చేస్తుంది. సమితి కార్యక్రమాలను చక్కగా నిర్వహిస్తున్న శ్రద్ధాళువులు భక్తులు ఎంతయూ ప్రశంసార్హులు. ముఖ్యంగా సమితి కోశాధికారియైన డాక్టరు రామదాసు గారున్నూ, కార్యదర్శియగు శ్రీ గాదె అంకయ్యగారున్నూ చేసిన సేవ ప్రత్యేకంగా ఉదాహరణీయం. సమితివారు ప్రచురించిన ఒక చిన్న నివేదిక వల్ల వారి కార్యక్రమాలవివరాలు లెక్కలు ఆర్థికస్థితిగతులు విశదమవుతాయి. గుంటూరు పౌరమహాజనులు చేయగల సహకారాలకు సహాయాలకు ఈ సమితి ఎంతైనా అర్హమైంది.

## గీతా గ్రంథాలయం, మలక్పేటకాలనీ, హైదరాబాదు

గ్రంథాలయంవారి ఆధ్వర్యాన శ్రీరామాయణోపన్యాసములు కావించిన గీతావ్యాస శ్రీ శిష్టా సుబ్బారావుగారికి సన్మానం జరుపుటకై మలకపేట గవర్నమెంట్ కాలని రిక్రియేషను క్లబ్బులో 10-11-71 వ తేది నాడు సాయంకాలం 6 గంటలకు పౌరసభ సమావేశమైనది. రిటైర్డు ఐ. సి. యస్. ఆఫీసరగు శ్రీ కె. ఆర్. అనంతరామన్ గారు సభాధ్యక్ష్యం వహించారు. సంయుక్తకార్యదర్శి శ్రీ వి. సూర్యనారాయణ గారు స్వాగతం పలికారు. సమాచార పౌర సంబంధ శాఖోపసంచాలకులు శ్రీ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రిగారు రామాయణాని కున్న సార్వకాలికమగు విలువను గూర్చి ఉపన్యసించారు. శ్రీ సుబ్బారావు దంపతులకు నూతన వస్త్రములు, శ్రీ సుబ్బారావుగారికి 558 రూపాయలు పరితోషికం సమర్పించబడినవి. కార్యదర్శి శ్రీ వై. విశ్వనాథంగారి వందనసమర్పణంతో సభా కార్యక్రమం ముగిసింది.

## 10-వ శ్రీ హరేరామ నామకోటి పూజా మహోత్సవములు

తూర్పుగోదావరిజిల్లా కోరుకొండ హరేరామనగరులో శ్రీ లక్ష్మీనృసింహక్షేత్రమున హరేరామ సభవారు భక్తసమాజంవారు 20-10-71 నుండి 18-11-71 వరకు కార్తికమాసం పూర్తిగా ఈ వార్షికోత్సవాలు జరిపారు. పూజ అన్నదానం ఉపన్యాసాలు సంకీర్తనలు మున్నగు కార్యక్రమాలు అమోఘంగా నెరవేరినవి. కార్యక్రమంలో అన్వయించిన ప్రముఖవక్తలు బ్రహ్మశ్రీ కుందుర్తి వేంకటనరసయ్య పాకయాజిగారు (నామప్రయాగ, బుద్ధాం), శ్రీమాన్ సుదర్శనభట్ట అయ్యవార్లంగారు (కోరుకొండ), శ్రీమాన్ ముకున్దూరు తిట్టా లక్ష్మీనరసింహాచార్యస్వామివారు (విజయవాడ) శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారు M. A. (విశాఖపట్నం), బ్రహ్మశ్రీ వాజపేయయాజుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (రాజమండ్రి) – మొదలగువారు. సుమారు రెండువేల మంది దరిద్రనారాయణులకు, వెయ్యిమంది సేవార్థులకు అన్నసంతర్పణమూ, 50 మంది సాధువులకు వికలాంగులకు వస్త్రదానము జరుపబడినవి. సమాజవ్యవస్థాపకులైన శ్రీ కపిలవాయి సుబ్బారావుగారు అందరికీ కృతజ్ఞతాభివందనాలు సమర్పించారు.

# గ్రంథపరిచయం

## సుమాంజలి

రచయిత్రి. ప్రాప్తిస్థానమున్నూ; మేకా సుధాకరరావు, మెకాలాంటి వీధి, పిఠాపురం, తూర్పుగోదావరిజిల్లా, చిన్నసైజు పుటలు–28 వెల తెలుపబడలేదు.

పుస్తకంలో 16–వ పుటలో భక్తుని హృదంతరాళంనుండి పరమాత్మకై అప్రతిహతంగా పారేటి 'ప్రేమవాహిని' అను పంక్తి ఉంది. నిజంగా అదే ఈ గ్రంథస్వరూపానికి ప్రతిపాదకం. ఇదొక ప్రేమవాహిని 'భక్తిః శృంగారవృత్త్యా పరిణమతి మునేః' అన్నట్లు భగవద్విషయకశాంతంగా ఉత్కృష్టరూపం దాల్చిన భక్తి. ఇది పొంగులువారుతుంది. ఈవాహిని ఉత్పత్తిస్థానం భక్తునిహృదయం. హృదయప్రభవమైన వాక్యరాశి మాధుర్యం అనుభవైకవేద్యమే కాని వర్ణనలచే బోధ్యం కాదు. ఈ వాహినికి గంతవ్యం పరమాత్మ. కాబట్టి తియ్యగా ఉంటూనే రోగం నయం చేసే మందులాగ—ఇది తన తీరుతీయములచే మనలను ఓలలార్చుతూనే జన్మసఫలతను సమకూరుస్తుంది. పద్యానుబంధంతో హృద్యంగా గద్యబహుళమైన యీపుస్తకాన్ని తెప్పించుకుని బాగు ఓర్చుకోగలంతకు మీ కుతూహలాన్ని తీర్పగల యీ సీసాన్ని ఆస్వాదించండి—

పరువుపరువున బోయి పన్నీరు తోడ్తెచ్చి
భవదీయపాదము ల్పట్టి కడిగి
చల్లగా తనువంత చందనాదు లలంది
పుష్పాలతో నీకు పూజ సలిపి
ఫలములు గొనివచ్చి బలిమిని తినిపించి
వేమ దాపగ లేక యేమొ పలికి
మధురపానీయంబు అధరాని కందించి
విరజాజిసుంటీల వీచుచుండ
పచ్చకర్పూరాది పరిమళద్రవ్యాల
తాంబూలమును నోటనుంచు తలనిమురుచు
మగ్గను నను జూచి ముసిసిపోవుచు నెంతో
నవ్వేడి నిను జూచి నవ్వుచుండి
ధన్యమాయెను బ్రతుకంచు దలచుచుండ
తలపుతలుపులు తెరచుకొని తరలి పోయి
ఆశతోపాటు ననుగూడ నవని గూల్చ
ఆటగా దోచెనా నీకు, ఆర్ద్రహృదయ?

## జీవవిచారము

రచయితయు ప్రాప్తిస్థానమున్నూ ఉభయభాషాప్రవీణ, వేదాంతపారీణ – కవిశేఖర – విద్యానాథ–కవితామహేశ్వర శ్రీ మిన్నికంటి గురునాథశర్మగారు. బ్రాడీపేట 5–వ లైను, 15–వ అడ్డరోడ్డు గుంటూరు. క్రౌను సైజు పుటలు 182, వెల 3 రూపాయలు.

వేదాంతశాస్త్రసర్వస్వం "బ్రహ్మ సత్యం, జగన్మిథ్యా, జీవో బ్రహ్మైవ నాపరః" అను శ్లోకార్థంలో ఇమిడి ఉందనడం ప్రసిద్ధం కదా. జీవస్వరూపాన్నిగూర్చి వక్తవ్య జ్ఞాతవ్య విషయాలన్ని ఇందు ఇరవైశీర్షికల క్రింద సప్రమాణంగా చర్చింపబడ్డాయి. ఇందలి ఫణితిలో సంక్షేపమునకు సామగ్ర్యమునకు సారళ్యమునకు గాంభీర్యమునకు కుదిరి ఉండు పొందు స్పృహణీయమైనది. ప్రతిపాద్యవిషయంలో రచయితకున్న అధికారాన్ని ప్రత్యక్షరంలోనూ ప్రతిఫలింపజేస్తున్న ఈ గ్రంథానికి స్వాగతం.

ప్రభాకర్

---

శ్రీ వివేకానందస్వాముల 110 వ జయంతితిథిపూజ : 7-1-1972

బహిరంగోత్సవ పౌరసభ : 9-1-1972

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు　　రెండవ కూర్పు　　వెల : రూ. 4-00

నూతన ముద్రణము!　　ఇప్పుడే వెలువడినది!

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము-రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)　　ఆఱవ కూర్పు　　వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ బోధస్వరూపానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు     రెండవ కూర్పు     వెల: రూ. 4-00

నూతన ముద్రణము।     ఇప్పుడే వెలువడినది।

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము–రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)     ఆఱవ కూర్పు     వెల: రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు–4

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు–21) న ముద్రింపబడి,
శ్రీ బోధస్వరూపానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# జ్ఞానయోగము

అనువాదకులు :
కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు | రెండవ కూర్పు | వెల : రూ. 4-00

నూతన ముద్రణము। | ఇప్పుడే వెలువడినది।

# రాజయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము–రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) | ఆఱవ కూర్పు | వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు–4

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు–21) న ముద్రింపబడి,
శ్రీ బోధస్వరూపానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు — రెండవ కూర్పు — వెల : రూ. 4-00

నూతన ముద్రణము। — ఇప్పుడే వెలువడినది।

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము–రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) — ఆఱవ కూర్పు — వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు–4

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు–21) న ముద్రింపబడి,
శ్రీ బోధస్వరూపానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు | రెండవ కూర్పు | వెల : రూ. 4-00

నూతన ముద్రణము। | ఇప్పుడే వెలువడినది।

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము-రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) | ఆఱవ కూర్పు | వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ బోధస్వరూపానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# జ్ఞానయోగము

అనువాదకులు :
కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు | రెండవ కూర్పు | వెల : రూ. 4-00

నూతన ముద్రణము ! | ఇప్పుడే వెలువడినది !

# రాజయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము-రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) | ఆఱవ కూర్పు | వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు–4

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు–21) న ముద్రింపబడి,
శ్రీ బోధస్వరూపానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు        రెండవ కూర్పు        వెల: రూ. 4-00

నూతన ముద్రణము!        ఇప్పుడే వెలువడినది!

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము–రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)        ఆఱవ కూర్పు        వెల: రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు–4

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు–21) న ముద్రింపబడి,
శ్రీ బోధస్వరూపానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు　　రెండవ కూర్పు　　వెల : రూ. 4-00

నూతన ముద్రణము!　　ఇప్పుడే వెలువడినది!

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము-రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు)　　ఆఱవ కూర్పు　　వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

ంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ బోధస్వరూపానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# జ్ఞానయోగము

అనువాదకులు :

కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

అద్వైతజ్ఞానము "సిద్ధులకు, బద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, శిశువులకు, పండితులకు, పామరులకు — అందఱికిని సమానాధికారముగల సొమ్ము" కావలెనని శ్రీ వివేకానంద స్వాములే యిందు పలికియున్నారు. అందుల కనుగుణమగు విషయ విన్యాసముతో శ్రీ స్వామివారీ యుపన్యాసముల కావించియున్నారు. ఈ గ్రంథము సరళమధుర భాషయందు ఆంధ్రీకరింపబడి యున్నది.

(480+8) పుటలు | రెండవ కూర్పు | వెల : రూ. 4-00

నూతన ముద్రణము ! | ఇప్పుడే వెలువడినది !

# రాజయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు ప్రథమభాగము శ్రీ వివేకానందస్వాములవారు న్యూయార్కు పట్టణములో రాజయోగమునుగూర్చి కావించిన వివిధోపన్యాసములు. ద్వితీయభాగము-రాజయోగమునకు ప్రమాణములయిన పాతంజలయోగసూత్రముల విపుల వివరణము. పాఠకుల కిది రాజయోగదర్పణమే.

(320+8 పుటలు) | ఆఱవ కూర్పు | వెల : రూ. 2-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-21) న ముద్రింపబడి,
శ్రీ బోధస్వరూపానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.